శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు చరమ సంపుటానుబంధము




## మనవి

నేటికి తెలుగుభాషకు సర్వతోముఖ సంపూర్ణ పదజాలకోశము అనదగిన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు చరమసంపుటానుబంధ ప్రకటన భాగ్యము కు త్రిలింగ దేశము నోచినది.

వీనికి కూర్పులు చేర్పు లుండబోవనికాదు - ఉన్నంతలో దీనికి సాదృశ్య సదృశ్యము.

దీని నిర్మాణము తలపెట్టిన మహామనీషి పీఠికాపుర ప్రభువు శ్రీ రావు కుమార వేంకటమహీపతి సూర్యారావు బహద్దరువారు. వారి మహోన్నత శయమునకు భాషాభివృద్ధికి ఈ నిఘంటువు ప్రతీక.

పిఠాపురము మహారాజా శ్రీ రావు కుమార వేంకట మహీపతి సూర్యా వు బహద్దూరు K. C I., D. Litt. వారి ఔదార్యముతో 1930లో ప్రారంభించిన నిఘంటువు 1949 లో సంస్థానములు ప్రజాధనము లగువాటికి, తెలుగునాట హిత్యధురీణులైన పండిత ప్రకాండులచే వ్రాతప్రతిగా వెలయించిన భాగ్యము ంధ్రులకు దక్కినది.

ఎందరో పండితవరేణ్యుల ధీశక్తిచే ఈ నిఘంటువు ర్వ సమగ్రతతో వెలసినది. శ్రీ జయంతి రామయ్య పంతులు రి అధ్వర్యములో, 1949లో నాల్గు సంపుటములను ప్రకటించి నిఘంటువు ర్యాలయము కారణాంతరములచే ఎత్తివేయబడినది. ఆ పరిస్థితులలో డా॥ ంగు వేంకట సీతాపతిగారు 1957లో రాజావారి యనుజ్ఞాపత్రము పొంది, రాష్ట్ర భుత్వమునుండి 5000 రు॥లను, కేంద్ర ప్రభుత్వమునుండి 8000 రు॥లను సహా నముగా పొంది మద్రాసులో 5, 6, 7 సంపుటములలో ఎక్కువభాగము పూర్తి సిరి. ఈ సంపుటములను, మిగిలినవ్రాతప్రతులను ఆం॥ సా॥ పరిషత్తు కార్యదర్శి న శ్రీ దంటు భాస్కర రావు గారు కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి స్త్రిగారి ఆదేశముపై శ్రీసీతాపతిగారికి తమ స్వంత ధనము ఖర్చులుగా 5000/- ాలు యిచ్చి కాకినాడ పరిషత్తు కార్యాలయమునకు తరలించిరి. 1958 జూలై ?వ తేదీని ఆం॥ సా॥ పరిషద్వార్షిక మహాసభలలో డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ డితవరేణ్యులు యావిష్కరణ గావించిరి.

నాటినుండి 7వ సం॥పు అనుబంధ వ్రాతభాగము ముద్రణ నొందవలసి ్కరింపవలసి వచ్చినది. శ్రీ దంటు భాస్కరరావుగారి కోరికపై డా॥ దివాకర్ల టావధానిగారు, శ్రీ శశాంక (శ్రీ వోలేటి సుబ్బారావు), డా॥ పాటిబండ

[illegible] 29. 5. 86 [illegible]వరపు రామకోటి శాస్త్రిగార్ల సహాయముతో వ్రాత ప్రతి. [illegible] కాకినాడ పంపిరి

ఏడవ సం॥పు అనుబంధ ఆంధ్రసాహిత్య అకాడమీ, హైదరాబాదు వారు 5000 రూ॥లు సహాయము చేసిరి. అట్టి సహాయమునకు దోహదమొనరించిన డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతాభివందనములు. ఆ ధనముతోడను, శ్రీ దంటు భాస్కరరావుగారు రమారమి 5000 రూ॥ల తోను 62 ఫారముల వరకు ముద్రణ సాగినది. శ్రీకాకుళపట్టణము సేల్సుటాక్సు డిప్యూటీ కమీషనరు శ్రీ పి. సీతాపతిరావు I. A S గారి దోహదముతో కాకినాడ, సేల్సుటాక్సు ఆఫీసరుగారైన శ్రీ మనవాళ్ళ స్వామిగారు రమారమి 2 వేల రూపాయల వ్యయముతో సప్తమ సంపుటము సంపూర్ణముగా ముద్రింపించిరి. దానితో 1930లో మొదలు పెట్టిన శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు ముద్రణము 1972తో పూర్తియై సంపూర్ణ ప్రతి 7 సంపుటములు ఆంధ్రుల కందిచ్చు భాగ్యము చేపట్టిన ఆం॥ సా॥ పరిషత్తు ధన్యతమము.

ఏడవ సం॥పు అనుబంధ శుద్ధప్రతినితయారుచేయుటకుసహకరించిన కాకినాడ పండిత ప్రకాండులగు శ్రీ ఆకెళ్ళ శేషాద్రి, శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి శ్రీ సామవేదము శ్రీరామమూర్తి శాస్త్రిగార్లకు మే మెంతయో ఋణ పడి యున్నాము. ముఖ్యముగా నాటి పత్రికా సంపాదకులగు శ్రీ కాకరపర్తి కృష్ణ శాస్త్రిగారికి కూడ మేము ఋణ పడి యున్నాము.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు నిర్మాణము కావించిన పండితవర్యులు శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి, శ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రి, శ్రీ ప్రయాగ వేంకటరమణ శాస్త్రి, శ్రీ అకుండి వేంకటశాస్త్రి, శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రి, శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రి, శ్రీ చిలుకూరి వీరభద్ర శాస్త్రి, శ్రీ చెఱుకుపల్లి అప్పారాయ శాస్త్రి, శ్రీ సామ వేదం శ్రీరామమూర్తిశాస్త్రి, శ్రీ పన్నాల వేంకటాద్రిభట్టశర్మ, శ్రీ ఇంద్రకంటి సూర్యనారాయణ శాస్త్రిగార్లకు, ఇంకను సహకరించిన పండిత ప్రకాండులకు మా కృతజ్ఞతాభివందనములు.

నేటికి పిఠాపురము మహారాజా శ్రీ రావు వేంకటమహీపతి సూర్యారావు బహద్దూరువారి కోరిక నెరవేరి ఆంధ్రులకు ఆంధ్రభాషకు ఒక అమూల్య అలంకారము నందజేసిన ఈ నిఘంటువునకు సహకరించిన ప్రతి యొక్కరికి నమోవాకములు.

ఇట్లు,

ఆంధ్ర సాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)



# సూర్యరాయాంధ్ర నిఘంటువు

## శ

**శ.** ఒక యక్షరము

**శంక.** సం. వి. ఆ. స్త్రీ. 1. సందేహము, సంశయము. 2. అనుమానము (అపాయశంక, అరిష్ట శంక) 3. అవిశ్వాసము. 4. భయము, వెఱపు. 5. ఆశ, ప్రతీక్షణము. 6. అపోహము, భ్రాంతి, తప్పుటభిప్రాయము. మ. భుజదండంబున నొక్క భామ దొడిగెన్ భూభర్తకున్ భూరి దిగ్విజయారంభ విజృంభణార్జిత మహాకీర్తి ప్రతాప ప్రభా, వ్రజ శంకావహనూత్నవజ్రమణి రుగ్వ్యాపార దుర్వారమున్.... నైష. ౬. ౫౮.
7. వాదమధ్యమున బయలుదేఱిన యాటంకము. 8. (అగునను) నమ్మకము.

**శంకనీయము.** సం. విశే. అ. ఆ. అ. 1. సందిగ్ధము, సంశయాస్పదము. 2. అనుమానింపఁదగినది. 3. ఊహింపఁదగినది.

**శంకము.** సం. వి. అ. పుం. బండి మొదలగువానిని లాగెడి యెద్దు.

**శంకరాభరణము.** సం. వి. అ. న (శంకర+ఆభరణము) ౧. ఈశ్వరునికి నలంకారము సర్పము ౨. (సంగీ) ఒకానొక రాగము (ముప్పది రెండు వర్ణంపక రాగములలో నొకటి)

సీ. కాంభోజి కేదారగౌళ కోశవరాళి పున్నాగ సుమ్మకాంభోజి శంక, రాభరణము మేఘ రాజి తోడి వరాళినాటనామక్రియనాట.... హంస. ౧-౨౪.

గీ. శంకరాభరణమును కోశ విరాళి రంజిగుజ్జరి పంతు వరాళినాట జాళిదేశాక్షితోడివరాళి శ్రీవరాళి హెజ్జజ్జకేదార గౌళపాడి. ప్రబంధ. ౯౬.

వ. ఘూర్జరి ధన్యాసి శంకరాభరణంబులు మొదలైన రాగోపరాగంబులు. మత్స్యపు. ౫-౫౪.

**శంకరావాసము.** సం. వి. అ. పుం. 1. కైలాసము. 2. ఆరతి కర్పూరము.

**శంకరి.** సం.వి.ఈ.స్త్రీ. 1, శివునిభార్య, పార్వతి. 2. చిఱువేలువంటి యొకవిధమైన వంగదేశపు రంగు పదార్థము. 3. జమ్మిచెట్టు.

**శంకరుఁడు.** సం. విశే. (అ.ఆ, ఈ.అ.) సుఖము కలిగించువాఁడు, శుభప్రదుఁడు. వి. అ. పుం. 1. శివుఁడు. 2. శంకరాచార్యుఁడు. (అద్వైత వేదాంత మతోద్ధారకుఁడు.

**శంకలుసేయు.** మి. స. క్రి. (శంకలు+చేయు) ౧. పూర్వపక్షముచేయు; ప్రశ్నించు.

శా. పంకేజాతములన్ దిసంతులదఁచున్ బాలామణీపాదముల్, వంకల్ దీర్పు మనోజసాయకములన్ వాల్చూపు లేణాంకునిన్; శంకల్ సేయు మొగంబు జక్కవ కవన్ జక్కట్లు దిద్దుం గుచాహంకారంబు మదాళిమాలికల నూటాడించు వేణీరుచుల్. విజ.వి. ౨.౧౬.
(ఇట ఔపమ్యద్యోతకము)

**శంకాభియోగము.** సం. వి. అ. పుం. అనుమానము మీఁదఁదెచ్చిన వ్యాజ్యెము.

**శంకి.** సం. విశే. (న్, నీ, న్) (సమాసాంతమున) ౧. సందేహపడుచున్నవాఁడు. ౨. భయపడుచున్నవాఁడు. ౩. (అగునని)నమ్ముచున్నవాఁడు. ౪. అపాయముతోఁ గూడినది.

**శంకించు.** సం. అ. క్రి. ౧. అనుమానించు, సందేహించు.

శా. ....పోరఁదగ మర్దింపం దలం పేని శంకింపం బట్టో కొవారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపఁగన్. భార. ఉద్యో. ౩. ౧౦౩.

౨. జంకు, భయపడు.

వ. .... తన్మూర్తిసతండును నకులసహదేవ ద్రుపద విరాటులును దేటిమాద శంకించి మాఱుమొగంబులతో నగ్గిచి రాసమయంబున భార. ద్రోణ. ౫. ౬౩.

వ. ....ఇంచుకయుఁ దడయ శంకించి మార్క. ౧. ౧౬౭.

స. క్రి. తలఁచు, ఊహించు.

మ. ....దేవా నిన్ను మత్స్వామి నా, శరధం బ్రాప్తపునస్సముద్భవునిఁగా శంకించెదన్ జెప్పవే. హరి. పూ ౩. ౧౯౦.

**శంకితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. సందేహము నొందినది. భయపడినది. ౨. సందిగ్ధము, వితర్కితము, అనుమానముగలది; అనుమానింపఁబడినది. ౩. నిశ్చయములేనిది. ౪. భయంకరమైనది. ౫. స్థైర్యములేనిది, దుర్బలము.

**శంకితవర్ణుఁడు.** సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

**శంకితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ౧. సందేహముఁ బొందినవాఁడు. ౨. భయపడినవాఁడు. ౩. అనుమానింపఁబడినవాఁడు.

**శంకిలు (ల్లు)** సం. అ. క్రి. శంకించు. కడలెత్తి మ్రోయ వెలుచును, జడనిధు లినుఁడెండగాయ శంకిలు. భా. రా. బాల. ౧౨౬.

**శంకుకర్ణము.** సం. విశే. (అ. ఆ. అ) శంకువు వంటి చెవులుగలది. వి.అ.పుం.గర్దభము,గాడిద.

**శంకుకర్ణుఁడు.** సం.వి. అ. పుం. స్కందుని యనుచరులలో నొకఁడు.

**శంకుజీవ.** సం.వి. ఆ. స్త్రీ. నీడగడియారపుముల్లు.

**శంకుతరువు.** సం. వి. ఉ. పుం. సాలవృక్షము, మద్దిచెట్టు.

**శంకుల.** సం.వి.ఆ. స్త్రీ.౧.ఒకవిధమగుకత్తి:శస్త్రచికిత్స చేయుటకుపయోగించు వాఁడియైన రెండంచులుగల సాధన విశేషము.

౨. అడకత్తెర.

**శంకులాఖండము.** సం. వి. అ. పుం. కత్తెరతోఁ గత్తిరించిన వక్కముక్క.

**శంకువు.** సం.వి.ఉ.పుం. ఈఁటె,చిన్నయీఁటె, బాకు, ౨. స్తంభము, గాడు

మ. ....శస్త్రాయస శంకు కాండములఁ దోడ్తోఁ గొట్టుచున్ గీకగల్ శివధర్మ ౪-౯౦

౩. మేకు; గసిక. ౪. వాడియైన బాణాగ్రము, బాణాగ్రమున వెనుకకుఁ దిరిగియుండెడి కొన.

మధ్యాక్కర. మృదుగోమములు శంకునిభకర్ణముల్ మెత్తనివలుదపొదుగును,నిడుదచన్నులు.. భార. ఆది. ౭-౯౮.

౫. మొరడు,కొమ్మలు కొట్టివేసిన చెట్టుమొదలు ౬. నీడ గడియారపుముల్లు. ప్రొద్దుకట్టుటకై నీడను గొలుచుట కుపయోగించు కొయ్యచీల. ౭. పండ్రెండంగుళములు ప్రమాణము. ౮.కొలతకఱ్ఱ, కొలతబద్ద. ౯. పదిఖర్వములు, పదిలక్షలకోటులు. (దశకోటి = సంఖ్య యనివాచ.) ౧౦. ఆనయొక్క యీనె ౧౧. పుట్ట చీమల పుట్ట. ౧౨. మగగుఱి, మేఢ్రము. ౧౩. ఒకజాతి చేప. ౧౪. రాక్షసుఁడు. ౧౫. విషము. ౧౬. పాపము. ౧౭. హంస. ౧౮. విక్రమార్కుని కొలువులో నుండిన నవరత్నములనఁబడువారిలో ఒక కవి. ౧౯. శివుఁడు. ౨౦. సాలవృక్షము. ౨౧. మన్మథుఁడు. ౨౨. గంధద్రవ్య విశేషము.

**శంకుస్థాపనము.** సం. వి. అ. న. గృహనిర్మాణారంభ సమయమున భూమిలో శంకువును స్థాపించుట.

**శంఖకము.** సం. వి. అ. పుం. న. శంఖము. పుం. ౧. శిరోరోగము. ౨. కర్ణాస్థి చెవియెముక. న. శంఖముతోఁ జేసిన హస్తాభరణము, సంకులు.

**శంఖకారకుఁడు.** సం. వి. అ. పుం. శంఖములు చెక్కుట వృత్తిగాఁగల యొక సంకీర్ణజాతి వాఁడు. ఇట్లే శంఖకారుఁడు.

**శంఖక్షీరము.** సం. వి. అ. న. అసంభవ వస్తువు (ఇది గగనకుసుమము, శశవిషాణము వంటిది.)

**శంఖచరి.** సం. వి. ఈ. స్త్రీ. లలాటిక; నొసటఁ బెట్టుకొనెడి బొట్టు.

**శంఖచర్చి.** సం. వి. ఈ. స్త్రీ.=శంఖచరి.

**శంఖజము.** సం. వి. అ. పుం. (పావురపు గ్రుడ్డువలె నుండెడి) పెద్దముత్తెము.

**శంఖద్రావ (క) ము.** సం. వి. అ. పుం. శంఖములఁ గరఁగించెడి యొకానొక ద్రావకము; ఔషధ ద్రవ్యవిశేషము.

**శంఖనఖము.** సం. వి. అ. పుం. క్షుద్రశంఖము, నత్తగుల్ల; క్షుద్రజల జంతువిశేషము; నత్త.

సీ. గులకరింతయు నీరు గుట్టు శంఖనఖంబు పులు
కాని నగిమిరి బుంగ పురువు.
హంస. ౪-౧౭౬.

**శంఖప్రస్థము.** సం. వి. అ. పుం. చంద్రునిలోని కలంకము.

**శంఖభృత్తు.** సం. వి. త్. పుం. విష్ణువు.

**శంఖము.** సం. వి. అ. పుం. న. ౧. సంకువు. ౨. లలాటాస్థి, నుదుటి యెముక, ౩. చెవికి దగ్గఱగా నుండెడి యెముక; కణఁత యెముక, ౪. ఏనుఁగుదంతముల మధ్యప్రదేశము, ౫. సంఖ్యావిశేషము. నూఱు ఖర్వములు. ౬. యుద్ధసంబంధమైన వాద్యము, ౭. నఖియనెడి సుగంధద్రవ్యము. ౮. కుబేరుని నవనిధులలో నొకటి.

మ. ఒక శంఖంబునఁ బొంగునర్థపతి యుద్యోగంబు దామున్ భజింపక........బిల్హ. ౧-౩౦

**శంఖముక్త.** సం. వి. ఆ. స్త్రీ. ముత్తెపుఁజిప్ప.

**శంఖముఖము.** సం. వి. అ. పుం. మొసలి, మకరము.

**శంకలిఖితుఁడు.** సం. వి అ. పుం. న్యాయముగా బ్రవర్తించురాజు. ద్వి. వ. శంఖలిఖితులు. స్మృతికర్తలగు శంఖుఁడు, లిఖితుఁడు నను నిరువురు ఋషులు.

**శంఖి.** సం. వి. న్. పుం. ౧. సముద్రము. ౨. విష్ణువు. ౩. శంఖమూఁదువాఁడు. ౪. శంఖముల పనిచేయువాఁడు.

**శంఖిని.** సం. వి. ఈ. స్త్రీ. (శంఖిని, చిత్రిణి, హస్తిని, పద్మిని అనెడి నాలుగుజాతులలో నొక జాతి యాఁడుది)

చ. నడుముకృశంబు పిన్న జఘనంబు కుచంబులు
గట్టి వెంద్రుకల్చిన్నదుపులు గన్నులా మెఱుఁగు
నిగ్గులు కాంతకు వింతిభోజనం, బదరుఁ
బ్రియంబుఁగోపమునయంబు సమంబులు
దానఁగొండెమే, ర్పదవిను రక్తపుష్పపట
రాగిణి శంఖినిఁగా నెఱుంగుమీ.
సింహా. ౧-౨-౨౧౫.

**శంఖుఁడు.** సం. వి. అ. పుం. ౧. విష్ణునిచేఁ జంపఁబడిన యొకానొక రాక్షసుఁడు. ౨. శంఖలిఖితులను స్మృతికర్తలగు ఋషులలో మొదటి వాఁడు.

**శంఠుఁడు.** సం. వి. అ. పుం. నపుంసకుఁడు.

**శంతనువు.** సం. వి. ఉ. పుం. ఒకానొక చంద్రవంశపురాజు. ఇతఁడు గంగాసత్యవతులను బెండ్లాడి గంగయందు భీష్ముని, సత్యవతియందు చిత్రాంగద విచిత్రవీర్యులను గనెను.

**శంతాతి.** సం. విణ. ఇ. సుఖము గలిగించు వాఁడు, సుఖప్రదుఁడు.

**శంప.** సం. వి. ఆ. స్త్రీ. మెఱుపు,

శా. ఆదైత్యేంద్రకుమారుఁ గొల్చిరి మహోద్యద్రత్న హారావృతల్ పాదాబ్జక్వణదచ్ఛనూపురలు శంపాసంపదుద్యత్తనుల్.
సార. ౨-౯౭.

**శంపాకము.** సం. వి. అ. పుం. ౧. లక్క. ౨. పాకము, పరిణామము, పక్వమగుట. ౩. కేల.

**శంబపాణి.** సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు.

**శంబ(భ)ము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧. సుఖము గలది, అదృష్టవంతము. ౨. సుఖహీనము, దుర దృష్టవంతము.

వి. అ. పుం. ౧. వజ్రాయుధము.

మ. సమిదుద్ద్యోదిత హేతి భృద్దళన విస్ఫారప్రభావాప్తిమై క్షమఁ బెంపొందియుఁడగ్రి జిష్ణుయుతి నిచ్చల్ బల్ మొనల్సూపు శంబముపై ఘాటికిఁ జయ్యాసన్వోడల నీక్ష్మాభర్త ధామాగ్ని కర్యమ బింబోపధి వారతిచ్చు నహరజ్ఞావాస యాత్రావలన్. చంద్రికా. ౫-౭౪.

౨. నాఁగటి యినుపపాన్ను. ౩. నడుమునకు జుట్టుకొనెడి యినుపగొలుసు. ౪. దోఁపుగా దున్నుట; రెండవమాఱు దున్నుట.

**శంబరము.** సం. విణ. (అ. ఆ. అ.) శ్రేష్ఠమైనది. ఉత్తమము.

వి. అపుం. ౧. పర్వతము. ౨. ఒకజాతిలేడి.

ఉ. శంబరశోషణక్రియకుఁజాలిమరంతతరప్రతాపరే, శుంబధికాంగకంబులకు గాఁక ఘటించి హరిత్తురంగసే, వ్యంబుమహాబలోద్ధతము నైన శతాంగము నెక్కియున్నదా, ఘంబుగఁబద్మినీ యువతికాముఁడు కామునిఁదల్పెపొల్పుగన్
పంచతంత్రము. ౧-౨౯౫.

౩. ఒకజాతిచేఁప. ౪. యుద్ధము. ౫. చిత్రమూలము‡. ౬. లొద్దుగ‡. ౭. ఏఱుమద్ది‡. ౮. ఒక రాక్షసుఁడు.

న. ౧. నీరు. ౨. మేఘము. ౩. ధనము. ౪. వ్రతము. ౫. చిత్తరువు.

**శంబరసూదనుఁడు.** సం.వి. అ. పుం. శంబరుని సంహరించినవాఁడు. ప్రద్యుమ్నుఁడు, మన్మథుఁడు.

**శంబరారి.** సం. వి. ఇ. పుం. శంబరాసురునకు శత్రువు. ప్రద్యుమ్నుఁడు. మన్మథుఁడు. తే.గీ.... జగతికెంతటి యుపకారి శంబరారి. విజయ ౨-౨౦౩

**శంబరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. మాయ. గారడి. ౨. మాయావిని, గారడిచేయు స్త్రీ. ౩. ఎలుక చెవికూర.‡.

**శంబరుఁడు.** సం. వి. అ. పుం. ౧. ప్రద్యుమ్నునిచేఁ జంపఁబడిన యొకరాక్షసుఁడు.

సీ. పెంపయేళ్ళలోనవ త్తిగెడువక్రతలెల్ల, మయ శంబరులలోని మాయలెల్ల. నిరంకుశో. ౨-౪౩

౨. జినదేవుఁడు.

**శ(స)ంబలము.** సం. వి. అ. పుం. న. ౧. తీరము ఒడ్డు. ౨. పాథేయము, త్రోవబత్తెము. ౩. అసూయ. ఓర్వలేమి.

**శంబువు.** సం. వి. ఉ. పుం. కప్పచిప్ప, ఆలిచిప్ప

**శంబూక.** సం. వి. ఆ. స్త్రీ.=శంబువు.

**శంబూ(బు)కము.** సం. వి. అ. పుం. ౧. కప్పచిప్ప. ఆలిచిప్ప. ౨. చిన్నశంఖము. ౩. నత్త. ౪. ఏనుగు కుంభస్థలము నడిమిచోటు.

**శంబూకుఁడు.** సం. వి. అ. పుం ఒకానొక శూద్రతపస్వి.

**శంభలి (ళీ)** సం. వి. ఈ. స్త్రీ. కుట్టిని, దూతిక కుంటెనకత్తె, ఱంకులాడి.

వ. అపారప్రసారంబులు చేయు శంభళీజనంబుల చేతనుమారాకయొతింగించిన....భీమ ౨-౧౨౭.

**శంభుప్రియ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దుర్గాదేవి. ౨. ఆమలకి. ఉసిరిచెట్టు.

**శంభువల్లభము.** సం. వి. అ. న. తెల్లతామర పువ్వు.

**శంభువు(ఁడు).** సం. విశే. ఉ. శుభము నిచ్చువాఁడు. సుఖకరుఁడు. సుఖమునిచ్చువాఁడు. వి. ఉ. పుం. ౧. శివుఁడు ౨. బ్రహ్మ. ౩. ముని. ౪. ఒకజాతి సిద్ధుడు. ౫. విష్ణువు. ౬. తెల్ల జిల్లేడు. ¦

**శంయువు.** సం. విశే. ఉ. సుఖముకలది, శుభాన్వితము.

**శంవము.** సం. వి. అ. పుం. ౧. క్రమపద్ధతిని దున్నుట. ౨. వజ్రాయుధము. ౩. గోకఁటి యినుపపొన్ను.

**శంస.** సం. వి. ఆ. స్త్రీ. ౧. స్తుతి, పొగడ్త. ౨. కోరిక, ఇచ్ఛ. ౩. కథనము, చెప్పుట ౪. మాట, పలుకు. (మే.ని)

**శంసనము.** సం. వి. అ. న. ౧. స్తుతించేట, పొగడుట. ౨. చెప్పుట. కథనము. ౩. కంఠ పాఠము చేయుట.

**శంసి.** సం. విశే. (న్. సీ. న్.) (తఱచుగసమాసాంతమున) ౧. స్తుతించువాఁడు పొగడువాడు ౨. చెప్పువాఁడు, తెలుపువాఁడు ౩ భవిష్యత్తు చెప్పువాఁడు జరుగఁబోవుపనినిసూచించువాఁడు.

**శంసితము.** సం. విశే. (అ. ఆ. అ.)౧. పొగడఁబడినది, స్తుతింపబడినది, ౨. చెప్పఁబడినది, వచింపబడినది. ౩. కోరఁబడినది, ౪. నిశ్చయింపఁబడినది,౫. స్థిరపఱుపఁబడినది. ౬. నింద యారోపింపఁబడినది. ౭.నవ్వబడినది.

**శంస్త.** సం. వి. ఋ. పుం. ౧.స్తోత్రపాఠకుఁడు. ౨. మంత్రములు పఠించుద్విజుఁడు.

**శకకర్త.** సం. వి. ఋ. పుం. శకమునకు మూల పురుషుఁడు. (విక్రమార్కుఁడు,శాలివాహనుఁడు క్రీస్తు. మొ).

**శకటబిలము.** సం. వి. అ. పుం. నీరుకోడి.

**శకటము.** సం. వి. అ. పుం. న. ౧. ఒకవిధమగు యానము బండి ౨. రోహిణీ నక్షత్రము. పుం. ౧. శకటమువలె నేర్పఱుపబడిన సేన, శకట వ్యూహము. ౩. రెండువేల పలముల బరువుగల బండిబరువు. ౪. తినిశవృక్షము, నెమ్మిచెట్టు. ధాన్యము బాగుచేయుసాధనము.

**శకటాక్షము.** సం. వి. అ. పుం. బండియిరుసు.

**శకటారి.** సం.వి. ఇ. పుం.శకటాసురుని శత్రువు. కృష్ణుఁడు.

సీ. శకటారి నెమ్మొముసరి యెంచ లేదని ద్విజ
   రాజుపై నానఁబెట్టవచ్చు. రాధకా.౨-౫౬

**శకటాహ్వా.** సం. వి.ఆ. స్త్రీ.రోహిణీనక్షత్రము.

**శకటిక.** సం. వి. ఆ. స్త్రీ. చిన్నబండి.

**శకటుఁడు.** సం వి. అ. పుం. శ్రీకృష్ణునిచేఁజంపబడిన యొక్క రాక్షసుఁడు, శకటాసురుఁడు.

**శకము.** సం. వి. అ. పుం ౧. సుప్రసిద్ధుఁడగు రాజు రాజ్యారంభముతోఁ బరిగణింపఁబడు కాల విశేషము. (యుధిష్ఠిరశకము,విక్రమాదిత్యశకము, శాలివాహనశకము, మొ) క్రీస్తుశకము తర్వాత డెబ్బది యెనిమిది సంవత్సరములకు, ప్రారంభమైన శాలివాహనుని కాలము ౨. శాలివాహన శకము. (శకవర్షములు) ౩. దేశభేదము. ౪ జాతి భేదము, పౌండ్రకజాతితోపాటు చెప్పఁబడిన యొక తెగ.

**శకలము.** సం. వి. అ. పుం. న. ౧. భాగము, అంశము, ఖండము, ముక్క తునుక. న. ౧ చెట్టు పట్ట ౨. చేఁపపైపొలుసు.

**శకలి.** సం. వి. న్. పుం. చేఁప, మత్స్యము

**శకలితము.** సం. విశే. (అ.ఆ.అ.) ముక్కలుగాఁ జేయఁబడినది.

**శకాంతకుఁడు.** సం. వి. అ. పుం. శకులనశింప జేసినవాఁడు.విక్రమాదిత్యుఁడు. విక్రమార్కుఁడు

**శకాబ్దము.** సం. వి. అ. పుం. శకములలో నొక సంవత్సరము, శాలివాహన శకమునకు సంబంధించిన సంవత్సరము.

**శకారి.** సం. వి. ఇ. పుం. శకాంతకుఁడు

**శకారుఁడు.** సం. వి. అ. పుం. రాజుయొక్క యుంపుడుకత్తెకుఁ దోడఁబుట్టినవాఁడు. (మా. మృచ్ఛకటిక)

**శకుంతము.** సం. వి. అ. పుం. ౧. పక్షి ౨. నీలిరంగుగల పాలపిట్ట. 3. పక్షివిశేషము. ఒకజాతిపిట్ట. ౪. కీటవిశేషము, ఒకజాతిపురుగు.

**శకుంతల.** సం. వి. ఆ. స్త్రీ. విశ్వామిత్రునకు మేనకయందుఁబుట్టిన కూఁతురు.

**శకుంతి.** సం. వి. ఇ. పుం. పక్షి.

**శకుంతిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పక్షి ౨. ఒకజాతిపిట్ట. 3. మిడుత. శలభము.

**శకుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఒకానొకరాజు. ౨. ఒకజాతి మనుష్యుఁడు.

**శకునజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. బల్లి.

**శకునజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) శకునము (రాబోవుశుభాశుభముల సూచించు నిమిత్తములు) తెలిసినవాఁడు.

**శకునము.** సం. వి. అ. పుం. ౧. పక్షి, పిట్ట. ౨. పక్షి విశేషము, రాబందు, ఒకజాతి గ్రద్ద 3. గానవిశేషము.

న. ౧. శుభాశుభముల సూచించునట్టి నిమిత్తము.

తే.గీ....మంచిశకునంబులివిగొ వా మాటజాఁడు
కన్నెయీలోనఁ బెండ్లి గాఁగలదునీకు.
విజయ. ౨-౧౫౯.

గీ. ఎల్ల వారికి శకునంబు లెల్లఁబలికి బల్లి తా బోయి
తొట్టిలోఁబడినరీతి. రాధికా.3-౪౬.

**శకుని.** సం. వి. ఇ. పుం. ౧. పక్షి, విహగము ౨. రాబందు, ఒకజాతిగ్రద్ద. 3. దుర్యోధనుని మేనమామ. ౪. కృష్ణునిచేఁజంపబడిన యొక రాక్షసుఁడు. ౫. (జ్యోతి) పంచాంగములలో నొకటగు కరణములందలి11 భేదములలో నొకటి ఈ. స్త్రీ. ౧. ఆఁడుఁబిచ్చుక, పక్షివిశేషము. ౨. వల్లగోరువంక.

**శకునిప్రప.** సం. వి. ఆ. స్త్రీ. పక్షులు నీరు త్రాగెడి తొట్టి.

**శకునీశ్వరుఁడు.** సం.వి.అ.పుం. గరుత్మంతుఁడు

**శకులము.** సం. వి. అ. పుం. ౧. ఒకజాతిచేఁప.

**శకులా(ల్యా)దని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఒక విధమగు మందుచెట్టు కటుకరోహిణి. ౨. నీటి పిప్పిలి ǁ 3. జటామాంసి ǁ ౪. ఎఱ్ఱవానపాము.

**శకులార్భకము.** సం.వి.అ.పుం. ఒకజాతిచేఁప.

**శకులి.** సం. వి. న్. పుం. మత్స్యము. చేఁప (రూ. శకిలి)

**శకృత్కరి.** సం. వి. ఇ. పుం. దూడ, వత్సము. (శకృత్కరి. ఈ. స్త్రీ దూడయున్నది)

**శకృత్తు.** సం. వి. త్. న. పశుమలము, పేఁడ, మలము.

వ. తాడనావమానమేహన నిష్ఠీవనపాషాణశకృద్రజః ప్రక్షేపణ పూతివాత దురుక్తులంబరి భూతుండైనను. గడనంబెట్టక.
భాగ. పంచమస్కంధము ౭౦.

**శకృత్పిండ(క)ము.** సం.వి.అ.పుం. పేఁడముద్ద.

**శక్కరి.** సం.వి.ఈ. స్త్రీ. ౧.నది. ౨.ఒడ్డాణము. మొలనూలు. 3. సంకీర్ణజాతి స్త్రీ ౪. వ్రేలు, అంగుళి.

**శక్క(క్వ)రము.** సం. వి. అ. పుం. ఎద్దు. వృషభము.

**శక్తము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సమర్థము. శక్తిగలది. ౨. బలవంతము బలాఢ్యమైనది. 3. సమృద్ధము సంపదగలది. ౪. అభిభాశక్తి

గలది, అభిధామూలమున నర్థమును దెలుపునది. (పదము) ౫. తెలివిగలది.

**శక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. శరీరబలము. ౨. సామర్థ్యము. ౩ రాజకీయము లగు ప్రభు మంత్రోత్సాహశక్తులలో నొకఁడు. ౪. (తంత్ర) పీఠాధిష్ఠానదేవత.

క. తగవాళశక్తికినభిముఖి, యగుచుంబద్మాసనస్థ యైయూర్చుండెన్. కళా. 4-169.

౫. ఆయుధవిశేషము, ఒకవిధమయిన యాయుధము.

మ. లక్ష్మణశక్తిం బడవైచిరామవిభుపైశస్త్రౌఘ వర్షింపఁగన్. దశావ ౭-౧౩౪

౬. ఈఁటె కార్యము నుబుట్టించుటకు యోగ్యమైన కారణనిష్ఠమగుధర్మము.౭.అభిధా లక్షణవ్యం జనలనెడి శబ్దశక్తులలో నొకటి ౯. అభిధాశక్తి. ౧౦. గొ:. ౧౧. లక్ష్మి. ౧౨. అఁడుగుఱి ౧౩. ఖడ్గము. ౧౪. పాచిక ౧౫. ప్రతిభ.

**శక్తిగ్రహము.** సం. విశ. (అ. ఆ. అ.) (శబ్ద) శక్తినిగ్రహించునది. వి. అ. పుం. అర్థబోధక తారూపమగు (శబ్దనిష్ఠ) వృత్తినితెలిసికొనుట.

**శక్తిగ్రాహకము.** సం. విశ. (అ. ఆ. అ) అర్థమును నిశ్చయించునది, స్థిరపరచునది, (హేతువు.)

**శక్తిత్రయము.** సం. వి. అ. న. ప్రభుమంత్రోత్సాహశక్తులు.

**శక్తిధరుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) బలము గలవాఁడు. వి.అ. పుం. ౧. ఈఁటెపట్టిపోరాడు యోధుఁడు. ౨. కుమారస్వామి.(శక్తిధ్వజుఁడు)

**శక్తిపాణి.** సం. వి. ఇ. పుం.=శక్తిధరుఁడు

**శక్తిమంతుఁడు.** సం. విశ. (త్, మతీ. త్) శక్తిగలవాఁడు, బలముగలవాడు.

౨. సామర్థ్యముగలవాఁడు.

**శ(స)క్తువు.** సం వి. ఉ. పుం. న. యవ చూర్ణము, సత్తువు, పేలపిండి.

**శక్నుఁడు(వు).** సం. విశ. (ఉ.) ప్రియముగా మాటలాడువాఁడు, ఇష్టముగామాటలాడువాఁడు (శక్లుఁడు)

**శక్యప్రతీకారము.** సం. విశ. (అ. ఆ. అ) శక్యమైనప్రతిక్రియగలది. ప్రతిక్రియచేయశక్యమయినది.

**శక్యము.** సం. విశ. (అ. ఆ. అ) ౧. సాధ్యమైనది, సాధింపదగినది, చేయఁదగినది.

కం. ఎవ్వఁడికిని మోపెట్టను దివ్యనుశక్యంబుగాని దృఢకార్ముకమున్.

ఉ. వింకయె కాముశక్తినఁడివింపఁగ శక్యమె యెట్టివాఁడికిన్ భార.ఆది 7-5౮.

భార. ఆది. 7-25.

ఆ.వె. తరుణి విభ్రమంబుతెలపోయ శక్యమే, ధాతికైనవానితాతకైన. నిరంకుశ2-33

౨. నెఱవేర్పదగినది, జరుపదగినది. ౩. అభిధావృత్తిచేఁదెలుపఁబడినది. (అర్థము.)

**శక్యార్థము.** సం. వి. అ. పుం. అభిధచేఁదెలుపఁబడినయర్థమువ్యతి లక్ష్యార్థము. వ్యంగ్యార్థము.

**శక్రగోపము.** సం. వి. అ. పుం. ఇంద్రగోపము, ఆరుద్రపురుగు.

**శక్రజము.** సం వి. అ. పుం. కాకి. ఇట్లే శక్రజాతకము) మొ.

**శక్రజిత్తు.** సం. వి. త్. పుం. ఇంద్రజిత్తు, రావణుని పుత్రుఁడైన మేఘనాధుఁడు.

**శక్రద్వారము.** సం వి. అ.న.= హరిద్వారమను తీర్థక్షేత్రము.

సీ....ము, తూర్పుల్లు శతశృంగమునను ద్రోణ, మునను, శక్రద్వారమున మహాధ్వరములు, సేసిరి. భార. శాంతి 6-213.

**శక్రధను(వు)స్సు.** సం. వి. స్. న. ఇంద్రధనుస్సు.

శక్రధ్వజము. సం. వి. అ. పుం. = ఇంద్రధ్వజము.

శక్రపాదపము. సం. వి. అ. పుం. ౧. కుటజవృక్షము. ౨. దేవదారువృక్షము.

శక్రభవనము. సం. వి. అ. న. స్వర్గము. ఇంద్రుని నివాసము.

శక్రభువనము. సం. వి. అ. పుం. స్వర్గము, ఇంద్రలోకము.

శక్రభూభవ. సం. వి. ఆ. స్త్రీ. వెట్టిపుచ్చ, ఇంద్రవారుణి.

శక్రమాతృక. సం. వి. ఆ. స్త్రీ. ఇంద్రుని టెక్కెము. నిలువబెట్టెడు కఱ్ఱస్తంభము.

శక్రము. సం. వి. అ. పుం. ౧. అర్జునవృక్షము. ౨. కుటజవృక్షము. ౩. గుడ్లగూబ. ౪. జ్యేష్ఠానక్షత్రము. ౫. పదునాలుగుసంఖ్య.

శక్రమూర్ధము. సం. వి. న్. పుం. వల్మీకము. పుట్ట.

శక్రశాల. సం. వి. ఆ. స్త్రీ. యజ్ఞశాల.

శక్రసుతుఁడు. సం. వి. అ. పుం. ౧. జయంతుడు. ౨. అర్జునుడు. ౩. వాలి (ఇట్లే శక్రాత్మజుఁడు. మొ)

శక్రసృష్ట. సం. వి. ఆ. స్త్రీ. హారీతికి. కరక్కాయ.

శక్రాఖ్యము. సం. వి. అ. పుం. గుడ్లగూబ.

శక్రాశనము. సం. వి. అ. పుం. ౧. కుటజవృక్షము. ౨. భంగుతోఁ జేసిన మద్యము.

శక్రి. సం. వి. ఇ. పుం. ౧. మేఘము. ౨. వజ్రాయుధము. ౩. పర్వతము. ౪. ఏనుఁగు.

శక్రుఁడు. సం. వి. అ. పుం. ౧. ఇంద్రుడు. ౨. శివుఁడు.

శక్రోత్థానము. సం. వి. అ. పుం. భాద్రపద శుక్ల ద్వాదశినాఁ డింద్రు నుద్దేశించి చేయఁబడెడి యుత్సవము. (ఇట్లే శక్రోత్సవము.)

శక్వము. సం. వి. అ. పుం. ఏనుఁగు.

శక్వరి. సం. వి. ఈ. స్త్రీ. పదునాల్గవ ఛందము.

శచి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఇంద్రునిభార్య.

శచీపతి. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు.

శట. సం. వి. ఆ. స్త్రీ. ౧. యోగులజడ. ౨. సింగపుజూలు.

శటము. సం. విశ. (అ. ఆ. అ) ౧. పుల్లనైనది. ౨. ఒగరైనది.

శటి. సం. వి. ఇ. స్త్రీ. కచోరము. కిచ్చిలిగడ్డ.

శట్టకము. సం. వి. అ. న. నేయి, నీరు గలిపిన బియ్యపుపిండి. ఘృతజల మిశ్రితమయిన శాలిచూర్ణము.

శఠకోపము. వి. విష్ణ్వాలయమున భక్తుల తలపై నుంచెడి విష్ణుపాదములు గల పాత్రవిశేషము. శఠకోపము పెట్టు = వంచించు.

సీ. వడిసాధుజనులసర్వస్వమ్ముఁగొని శఠకోపంబుఁ బెట్టెడుకుతరముగ. (శఠగోపము అని. వా.) సిం. వార. ౨౬.

శఠకోపుఁడు. శఠగోపుఁడు. సం. వి. అ. పుం. రామానుజస్వామికి మఱియొక యవతారమున పేరు.

వ.... అతండయిటమీద ........ శఠకోపసమాఖ్య సంభవించి.... భూతలంబుఁ బావనంబు సేయంగలవాఁడు. ఆము. ౬-౬౬.

శరము.[1] సం. వి. అ. పుం. కోపము. ( ఈ యర్థ మిచ్చుటనే కానవచ్చుచున్నది)

ద్వి. కోదవులుండాఁచియీధూర్తులమీఁదనడినైచి విభుసకు శఠముఁలుట్టింప. ........ ద్వి. పరమ. ౩. ౨౦౬. పా.

శరము.² సం. వి. అ. పుం. ఉమ్మెత్తచెట్టు. న. ౧. ఇనుము. ౨. కుంకుమపువ్వు.

**శఠుడు.** సం. విశే. (అ. ఆ. అ) ౧. మోస పుచ్చువాడు, వంచకుడు.

> మహాస్రగ్ధర. ఘనుడై తిమ్మక్షితీశాగ్రణి శరశ
> మర్ద్రావ సంఘాతివాతా శవరాడాశాంత
> దంతి స్థవిరకీచుల జంజాటముల్ మాన్పి....
> మ.చ. ౧-౨౦౯

> ఆ. చతులు కాని భృత్యజనుల నియోగింప, భవుని
> పూజకొఱకు. శివధర్మ.1-209.

౨. దుష్టుడు. దుర్మార్గుడు. వి. అ. పు.

౧. మోసగాడు. ౨. శృంగారనాయకులలో నొకడు.

౩. మూర్ఖుడు. బుద్ధిలేనివాడు. ౪. మధ్యవర్తి.

౫. సోమరి, అలసుడు.

**శణము.** సం.వి.అ.న. ౧.జనుము. ౹ ౨.గంజాయి చెట్టు.

**శణసూత్రము.** సం.వి.అ.న. ౧. జనుపనార ౨. జనుపనారతో నల్లినవల. ౩. మోకు త్రాడు.

**శతకము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నూఱు సంఖ్యగలది. ౨. నూఱువస్తువులుగలది.

వి. అ.న. ౧. శతము, నూఱు. ౨. నూఱుపద్య ముల సమూహము. ఉదా॥ సూర్యశతకము.

**శతకుంభము.** సం. వి. అ. పుం. బంగారుగని గల యొకానొక పర్వతము. ౨. బంగారము.

**శతకోటి.** సం.విశే.ఇ.నూఱంచులుగలది;వి.ఇ.పుం. వజ్రాయుధము. స్త్రీ. నూఱుకోట్లు.

> గీ. ప్రబలఖలగోత్రహృతికి నీపదనఖంబె, చాలు
> శతకోటి సాధనంబేలమాకు. వసు. ౩.

**శతక్రతువు.** సం. వి. ఉ. పుం. ఇంద్రుడు.

**శతఖండము.** సం.వి. అన. బంగారము.

**శతగుణము.** సం. విశే. అ. ఆ. అ నూఱురెట్లు (ఇంగ్లీశతగుణితము)

**శతగ్రంథి.** సం. వి. ఇ. స్త్రీ. దూర్వ. గఱిక.

**శతఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆయుధవిశేషము ౨. ఆడుతేలు.౩.గళరోగవిశేషము.కుత్తుకలో బుట్టురోగవిశేషము. ౪. కరంజము. కానుగు చెట్టు.

**శతఘ్నుడు.** సం. వి. అ. పుం. శివుడు.

**శతతమము.** సం. విశే. (అ. ఈ. అ) నూఱవది.

**శతతారక.** సం.వి.ఆ.స్త్రీ. శతభిషానక్షత్రము.

**శతదల.** సం. వి. ఆ. స్త్రీ. పుష్పవృక్షవిశేషము. తెల్లగులాబీ ౹ ఇంగ్లీశతపత్రిక.

**శతద్రువు.** సం. వి. ఉ. స్త్రీ. ౧. పంజాబుదేశ మునందలి ప్రకృతము. సట్లెజ్=జ్ఞయనబడునది. ౨. గంగానది.

**శతధా.** సం. అవ్య. (తెలుగున దీనికి వ్యస్త ప్రయోగములేదు.)

౧. నూఱుమార్గముల, ౨. నూఱుభాగముల ౩. నూఱు మడుగుల ఆ. స్త్రీ. దూర్వగఱిక

**శతధారము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. నూఱు ధారలుగాబ్రవహించునది. ౨. నూఱంచులు గలది. వి. అ. న. వజ్రాయుధము.

**శతధృతి.** సం. వి. ఇ. పు. ౧. ఇంద్రుడు ౨. బ్రహ్మదేవుడు ౩. స్వర్గము.

> క. అతులరజస్ఫురితుండై, శతధృతి సదృశుడ
> దయిపుణ్యజనేంద్రుడు-మార్కండేయపు. ౨-౧౯౯

**శతపత్ర.** సం.వి.ఆ. స్త్రీ. స్త్రీ.ఆడుది(విలియమ్స్)

**శతపత్రకము.** సం. వి. అ. పు. ౧. పక్షివిశే షము, (వడ్రంగి పిట్ట) మానుగోయిల (ఇంగ్లీ శతచ్ఛదము)

**శతపత్త్రము.** సం. వి. అ. పుం. ౧. నెమలి ౨. సారసపక్షి. ౩. దార్వాఘాటము ౪. ఒక జాతి చిలుక. ౫. తామరపువ్వు.

**శతపథబ్రాహ్మణము.** సం. వి. అ. న. శుక్ల యజుర్వేదమునకు సంబంధించిన వేదభాగము.

**శతప(పా)దము.** సం. విశే. (ద్) నూఱడుగులు గలది. వి. స్త్రీ. జెఱ్ఱి.

**శతప(పా)ది.** సం. వి. ఈ. స్త్రీ. జెఱ్ఱి.

**శతపద్మము.** సం. వి. అ. న. ౧. నూఱు ఱేకులు గల పద్మము. ౨. తెల్ల తామర.

**శతపర్వ.** సం. వి. న్. స్త్రీ. శుక్రుని భార్య.

**శతపర్వము.** సం. వి. న్. పుం. ౧. వెదురు. ౨. ఒకజాతిచెఱకు.
స్త్రీ. ౧. అశ్వయుజశుక్ల పౌర్ణమాస్య. ౨. దూర్వ, గఱిక ‡ ౩. కటుక రోహిణి ‡ ౪. వసదుంప.

**శతపర్విక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దూర్వ గఱిక ‡ ౨. వసదుంప. ౩. యవసస్యము.

**శతపాదిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. జెఱ్ఱి. ౨. కారుకొల్లి ‡

**శతపుష్ప.** సం. వి. ఆ. స్త్రీ. సదాప ‡ (శ. ర)

**శతపోనకము.** సం. వి. అ. పుం. రోగవిశేషము, భగంధరము.

**శతపోనము.** సం. వి. అ. పుం. జల్లెడ.

**శతప్రాసము.** సం. వి. అ. పుం. కరవీరవృక్షము.

**శతఫలి.** సం. వి. న్. పుం. వెదురు.

**శతభిష.** సం. వి. ఆ. స్త్రీ. అశ్వినినుండి యిరువదినాల్గవ నక్షత్రము.

**శతభిషజము.** సం. వి. జ్. స్త్రీ = శతభిష.

**శతభీరువు.** సం. వి. ఉ. స్త్రీ. ఒకజాతిమల్లె ‡

**శతమఖుఁడు.** సం. వి. అ. పుం. నూఱుయజ్ఞములు చేసినవాఁడు; ఇంద్రుఁడు.

**శతమన్యువు.** సం. వి. ఉ. పుం. ౧. ఇంద్రుఁడు.

సీ. శతమన్యు శుద్ధాంత సౌధకూటమిమీఁదఁగను
పట్టు కాంచన కలశమనఁగ.
భీమ. ౨-౪౯.

గుడ్లగూబ.

**శతమయూఖుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**శతమానము.** సం. వి. అ. పుం. న. ౧. వెండి యొక్క పలప్రమాణము. పలమెత్తు వెండి. ౨. అష్టకము, తూము, పరిమాణవిశేషము. ౩. మంగళసూత్రము. ఈయర్థము ఆంధ్రలోకవ్యవహారమునఁ గలదు.

**శతము.** సం. వి. అ. న. ౧. నూఱు

గీ.... కౌరవకుమార శతము భార్యలు నూఱ్వురు.
భార. ఆశ్రమ. 2-90.

౨. అధిక సంఖ్య.

**శతముఖము.** సం. విశే (అ. ఈ. అ) ౧. నూఱు ముఖములుగలది. ౨. నూఱు మార్గములుగలది. వి. అ. న. నూఱుద్వారములు, నూఱుమార్గములు

**శతముఖి.** సం. వి. ఈ. స్త్రీ. చీపురుకట్ట.

**శతమూల.** సం. వి. ఆ. స్త్రీ. దూర్వగఱిక ‡

**శతరుద్రియము.** యజుర్వేదాంతర్గతమైన "నమక" మను వేదభాగము.

సీ. నరసింహము జపింప నరసింహము జపించు
వాదిభైరవముఁ గదిసి నడువ, శతరుద్రియ
ముఁ బూన, శతరుద్రియముఁ బూను హనుమజ్జపంబున కదిసి చేయు నిరంకుశో. ౪-౩౨.

**శతరూప.** సం. వి. ఆ. స్త్రీ. బ్రహ్మదేవుని పుత్రిక (బ్రహ్మ యఁర్ధ సంబంధమునవా మెనుభార్య గాఁ జేసికొని యామెయందు స్వాయంభువమనువును గనినట్లు చెప్పఁబడు.) (వాచ)

**శతవర్షము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. నూఱేండ్లు గలది. ౨. నూఱేండ్లు వచ్చునది, నూఱేండ్ల వఱకు నుండునది వి. అ. న. శతాబ్దము, నూఱేండ్లు

**శతవీర్య.** సం. వి. ఆ. స్త్రీ. తెల్లదూర్వ. తెల్లగఱిక ! ౨. శతావరి పిల్లితేగలు.

**శతవేధి.** సం. వి. న్ పుం. పుల్లప్రబ్బలి !

**శతశః.** సం. అవ్య. (తెలుఁగునవ్యస్తప్రయోగము గానరాదు.) ౧. నూఱువిధముల ౨. నూఱుల లెక్కను. ౩. నానాప్రకారముగా.

**శతశాఖము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. పెక్కుశాఖలు గలది. ౨. నానాప్రకారము.

**శతహ్ర (హ్రా)ద.** సం.వి.ఆ. స్త్రీ. ౧. మెఱుపు. ౨. వజ్రాయుధము.

**శతాంగము.** సం. వి. అ. పుం. ౧. రథము, తేరు

వ.... అన్యోన్యఘాతాఘట్టనల శతాంగతురంగసూతకేతు బాణాసనతనుత్రాణ శిరస్త్రంబులు ధరణిపయింద్రొరఁగిన....చిత్రభా. ౮-౫౮

౨. తినిశవృక్షము, సెమ్మిచెట్టు !

**శతాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. రాత్రి. రేయి. ౨. దుర్గాదేవి.

**శతానందము.** సం. వి. అ. పుం. విష్ణునిరథము. విశే. (అ. ఆ. అ) పెక్కండ్రకానందముగూర్చునది.

**శతానందము.** సం. వి. అ. పుం. విష్ణురథము.

**శతానందుఁడు.** సం. వి. అ. పుం. ౧. బ్రహ్మదేవుఁడు

క. ఆనర్మలీలచేత శతానందుండధిక సంభృతానందుండై........ కళా. 5-29

౨. కృష్ణుఁడు ౩. అహల్యాగౌతములపుత్త్రుఁడును జనకమహారాజ పురోహితుఁడునగు నొకఋషి.

**శతాబ్దము.** సం. వి. అ. న. నూఱేండ్లు.

**శతాబ్ది.** సం. వి. ఈ. స్త్రీ. నూఱేండ్లు.

**శతాయు (స్స) షుఁడు.** సం.విశే. స్. నూఱుసంవత్సరముల ఆయుర్దాయము కలవాఁడు. (శతాయువు)

**శతారము.** సం. వి. అ. న. వజ్రాయుధము.

**శతారుషి.** సం. వి. ఈ. స్త్రీ. కుష్ఠవ్యాధి.

**శతారుస్సు.** సం. వి. స్. న=శతారుషి.

**శతావరము.** సం. వి. అ. పుం. నూఱువాణెములదిండనము.

**శతావరి.** సం. వి.ఈ. స్త్రీ. ౧. ఓషధీవిశేషము, పిల్లితేగలు ౨. శచీదేవి.

**శతి.** సం విశే. (ప్ర. సీ.న్) ౧. నూఱుమడుఁగులు గలది. ౨. నానాప్రకారమైనది. వి.న్. పుం నూటింటికధికారి.

**శతికము.** సం. విశే. (అ. ఈ. అ) ౧. నూఱుగలది. ౨. నూటింటికి సంబంధించినది. ౩. నూటింటితో జరిగినది. ౪. నూటితోఁగొనినది. ౫. నూఱుగామాఱునది. ౬. నూఱువాణెములు లాభముగలది. (ఇట్లేశత్యము)

**శతేశుఁడు.** సం. వి. అ. పుం. ౧. నూటికధికారి ౨. నూఱుగ్రామములు పాలించువాఁడు.

**శత్రుంజయము.** సం. వి. అ. పుం. ఏనుగు ౨. గుజరాతునందలి ఒక పర్వతము.

**శత్రుంతపుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) శత్రువులను దపింపఁజేయు వాఁడు. శత్రువులఁజెంపువాఁడు.

**శత్రుఁడు (వు).** సం. వి. ఉ. పుం. పగవాఁడు.

క. బలహీనులైనచో శత్రులఁజెఱుచుట నీతి భార. ఆది. ౬-౧౧౬

శత్రుకర్షణుఁడు. సం. విశే. (అ. ఆ. అ) శత్రువులను లోఁబఱుచుకొనువాఁడు. శత్రువుల నోడించువాఁడు. (ఇట్లే శత్రుదమనుఁడు. శత్రునిబర్హణుఁడు. మొ॥)

శత్రుఘ్నుఁడు. సం. వి.అ. పు. ౧. శత్రువులఁ జంపువాఁడు. ౨. సుమిత్రాపుత్రుఁడు; లక్ష్మణునిన్ సోదరుఁడు.

శా. శత్రుఘ్నుండు వడన్ హతాశ(బఱచెన్ సైన్యంబు దైన్యంబుగన్. జైమిని 6-146

శత్రువు. సం. వి. ఉ. పుం. ౧. జయించినవాఁడు విరోధి. ౨. పగవాఁడు విరోధి. 3. తన రాజ్యము నకుఁ బ్రక్కనుండెడి రాజు. అరి. ౪. (జ్యోతి) లగ్నమున కాఱవస్థానము.

శత్వరి. సం. వి. ఈ. స్త్రీ. రాత్రి.

శదము. సం. వి. అ. పుం.

౧. ఫలమూలాది. శాకాహార విశేషములు.

౨. ఫలసాయము, ఆదాయము.

శద్రి. సం. వి. ఇ. పుం. ౧. ఏనుఁగు. ౨. మేఘము. 3. అర్జునుఁడు.

(స్త్రీ) ౧. మెఱుపు. ౨. కలకండ.

శద్రువు. సం. విశే. (ఉ) ౧. నడచునది. ౨. పడిపోవుచున్నది, క్షీణించుచున్నది.

శనము. సం. విశే. (అ ఆ అ) ౧. శాంతమైనది.

౨. మృదువైనది.

శని. సం. వి. ఇ. పుం. ౧. నవగ్రహములలో నొక గ్రహము. సూర్యపుత్రుఁడైన శనైశ్చరుఁడు.

సీ. నలుఁ బట్టె శని చేతియలఁత హరిశ్చంద్ర మహీపాల మారి కామాంకొల్వ నిరంకుశో ౪-౯౭

౨. శనివారము. 3. శివుఁడు. ౪. దురదృష్టము.

గీ. కాల శని యుండెనో జవరాలిఁబాసి యేల వచ్చితి నాబుద్ధికూలిపోను. రాధికా 3-౧౦౦

శనిజము. సం. వి. అ. న. మిరియము.

శనిప్రదోషము. సం. వి. అ. పుం. త్రయోదశి శనివారమునాటి సాయంకాలము.

శనిప్రియము. సం. వి. అ. న. ఇంద్రనీలము. రత్నవిశేషము.

శనివా(స)రము. సం. వి. అ. పుం. ఏడువారములలో నొకటి, శనిదేవతగాఁ గల దినము. స్థిర వారము.

శనివారపుజడి. మి. వి. = ఎడతెగక యుండునది; ఎడతెగక కురియు వాన.

సీ. చెవులు చిందఱవోవఁ జెలఁగు కవీంద్రుల పోరంటిమే శనివారపు జడి. కళా ౬-౨౦

శనివారోత్సవము. సం. వి,అ.పుం. = శివకేశవులకుఁ బ్రీతికరముగా శనివారమునఁ జేయు నుత్సవము.

మ. శని వారోత్సవమాచరించె మునిశిష్య వ్రాతమున్ దాను. భీమ ౨-౬౬

మ. శనివారోత్సవ వేళ గన్గొనియె. కాశీ 3-౧౭

శనిశరము. వి. ఒక జాతిదేగ.

గీ. వారణంబును జలకట్టె పై గిద్ద, చంచడము సాళువము శని శరము మించు వేస్త్రమును తిరుకాదిగ వేర వేర, నొప్పుడేగల జతగూర్చి యుండుట యును. ప్రబంధ. ౧౯౧

వ. మఱియు సాళువంబులు శని శరంబులు వారణంబులు వేసడంబులు జలకట్టెలు తిరుకు మించు మొదలగు డేగలం గరంబుల గల బెత్తంబుల హత్తించి. ఇందు ౨-౬౦

శనైశ్చరుఁడు. సం. విశే. (అ. ఆ. అ) మెల్లఁగా నడచువాఁడు వి. అ. పుం. శని.

శపథపత్రము. సం. వి. అ. న. ప్రమాణ పత్రము.

శపథము. సం. వి. అ. పుం. ౧. తిట్టుట

౨. శాపము 3. ప్రమాణము ప్రతిజ్ఞ

క. తానొక నిజము పోతెఱుంగుటొని పలికెఁ దెక్కు
శపథములు........ భో. జరా. ౬-౫౬

అగ్నిప్రమాణము. మొ. ర. ఒట్టు పెట్టుకొనుట.

శపనము. సం. వి. అ. న. ౧. శపథము.

౨. నిందించుట. దూఱుట. నింద.

శపి(యి)ంచు. సం. స. క్రి. తిట్టు. నిందించు.

వ. మా తండ్రి మమ్ముఁ దిర్యగ్యోని జాతుల
రగుఁడని శపించి తన సత్యవ్రతంబు ప
పాలింపదలంచి........ మార్క. ౧-౭౮

ఉ. నీవు నిది చేసినదేమి వృథాశపింతురే....
మను. ౪-౮౭.

వ. మనుష్య పక్ష పాతంబున నన్ను ధిక్కరించి
తిం. మనుష్యులు గండని శపియించితో
ప్రసన్నత్వంబు గైకొని. మార్క. ౧-౧౨౯

క. మునిలి శపియించె నపుడ య్యనితాజ్జేక్షణల
రాజయక్ష్మ క్రోధం బెసఁగ నశియింప....
మనుచ. ౪-౯౧ ద్వి. పరిమ. ౧-౭౪

శప్తము. సం. విశ. (అ. ఆ. అ) ౧. శపింపఁ
బడినది. ౨. ప్రమాణము. చేయఁబడినది.
3. నిందింపఁబడినది.

శఫము. సం. వి. అ. పుం. న. ౧. గొరిజ. డెక్క

౨. చెట్టువేరు.

శఫరము. సం. వి. అ. పుం. మత్స్యవిశేషము;
ఒక జాతిచేప.

శఫరుకము. సం. వి. అ. పుం. పెట్టె; పాత్ర.

శబరము. సం. వి. అ. పుం. ౧. చేయి ౨. నీరు

శబరలోధ్రము. సం. వి. అ. పుం. అడవి
లొద్దుగ చెట్టు

శబరాలయము. సం. వి. అ. పుం. కోయ
గూడెము. పక్కణము.

శబరి. సం. వి. ఈ. స్త్రీ ౧. చెంచెత. శబర స్త్రీ

౨. రామభక్తురాలయిన యొకకోయది.

శబ(వ)రుఁడు. సం. వి. అ. పుం. ౧. కొండ
వాఁడు. కిరాతుఁడు ౨. శివుఁడు 3. మీమాంసా
శాస్త్రమున గ్రంథకర్తయు వ్యాఖ్యాతయునైన
శబరాచార్యుఁడు.

శబల. సం. వి. ఆ. స్త్రీ. ౧. పలురంగులు గల
యావు. ౨. కామధేనువు.

శబలత. సం. వి. ఆ. స్త్రీ. చిత్రవర్ణత్వము.

శ్రీత్రిశిఖాలంబన తత్వాశ్లేషాత్త శబలతా
సంగత్........ భార. విరా. III-1.

శబలము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. చిత్ర
వర్ణముగలది. పలు రంగులు గలది. ౨. వేఱు
వేఱు భాగములుగా విభజింపఁ బడినది. 3. స్పష్ట
ముగా నవ్యక్తింపబడినది. వి. అ. పుం. చిత్ర
వర్ణము. న. నీరు.

శబలి. సం. వి. ఈ. స్త్రీ. = శబల.

శబలిమ. సం. వి. న్. పుం. చిత్రవర్ణత్వము.

శబ్దకోశము. సం. వి. అ. పుం. నిఘంటువు.

శబ్దగతము. సం. విశ. (అ. ఆ. అ.) శబ్దమును
పొందినది. శబ్దమందున్నది.

శబ్దగుణము. సం. విశ. (అ. ఆ. అ) శబ్దము
గుణముగాఁగలది. వి.అ.పుం. ఆకాశము,మిన్ను.

శబ్దగ్రహము. సం. వి. అ. పుం. ౧. శబ్దమును
గ్రహించుట ౨. కర్ణము చెవి.

శబ్దగ్రామము. సం. వి. అ. పుం. ధ్వని వినిపించు
నంత దూరము.

శబ్దచిత్రము. సం. వి. అ. న. పదముల కూర్పు
నందు మాత్రమే చాతుర్యము గల కావ్యము.
ఇది యధమ కావ్యముగా నెంచఁ బడినది.;
శబ్దములకూర్పునందుఁ జేయునైచిత్రి.

**శబ్దచోరుఁడు.** సం. వి. అ. పుం. పదముల నపహరించెడి కవి. ఇతరుల కావ్యములనుండి పద్యములు పదములు నపహరించు వాఁడు.

**శబ్దతన్మాత్రము.** సం. వి. అ. న. ధ్వనియొక్క సూక్ష్మ పరమాణువు. ఆకాశ కారణమయిన సూక్ష్మభూతము.

**శబ్దనము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ధ్వనిచేయునది. వి. అ. న. 1 ధ్వనిచేయుట ౨. ధ్వని ౩. బిగ్గరగాఁ బిలుచుట ఆహ్వానము. ౪. పేర్కొనుట. పేరు పెట్టి పిలుచుట.

**శబ్దనేత.** సం. వి. ఋ. పుం. పాణిని

**శబ్దపతి.** సం. వి. ఇ. పుం. నామ మాత్రమున రాజు పేరుకేరాజు.

**శబ్దపాతి.** సం. వి. న. (న్. నీ. న్.) శబ్దవేధి. ధ్వనిచేత లక్ష్యమును గొట్టునది.

**శబ్దప్రమాణము.** సం. వి. అ. న. వాగ్రూపమయిన ప్రమాణము.

**శబ్దబోధము.** సం. వి. అ. పుం. శబ్దముల వలనఁ గలిగిన జ్ఞానము.

**శబ్దబ్రహ్మము.** సం. వి. న్. న. ౧. వేదము, శ్రుతి
౨. శబ్దములందుఁ దెలియనగు బ్రహ్మస్వరూపము.
౩. స్ఫోటము, శబ్దశక్తి.
చ. వెలయఁగ శబ్దభేది యను విద్య జగంబున భోజరాజుచేఁ, గలదఁట. భోజరా ౨-౧౪౩

**శబ్దభేది.** సం. విణ. (న్. నీ. న్) శబ్దవేధి, ధ్వనిచేత లక్ష్యమును గొట్టునది. వి. న్. పుం. ౧. అర్జునుఁడు ౨. బాణవిశేషము. ౩. గుదము.

**శబ్దము.** సం. వి. అ. పుం. ౧. శ్రవణేంద్రియ గోచరమగు విషయము. ధ్వని ఆకాశగుణము (క) ప్రాణుల కంఠధ్వని (ఖ) వాద్య ధ్వని ౨. పదము అర్థబోధకము ౩. సుబంతపదము. ౪. బిరుదము. ౫. పేరు నామమాత్రము కీర్తి ౬. (న్యాయ) చతుర్విధ ప్రమాణములలోనొకటి ౭. వ్యాకరణము.

**శబ్దవిద్య.** సం. వి. ఆ. స్త్రీ. శబ్ద శాస్త్రము. వ్యాకరణము.

**శబ్దవృత్తి.** సం. వి. ఈ. స్త్రీ. అభిధ. లక్షణ. వ్యంజన. అను త్రివిధమయిన శబ్దమందున్న శక్తి.

**శబ్దవేధి.** సం. వి. న. (న్. నీ. న్) కంటికిఁ గనఁబడని లక్ష్యమును ధ్వనిని బట్టి కొట్టువాఁడు.
వి. న్. పుం. ౧. బాణవిశేషము. ౨. దశరథుఁడు. ౩. అర్జునుఁడు.

**శబ్దశక్తి.=శబ్దవృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. అభిధ, లక్షణ, వ్యంజన అను మూఁడు విధములయిన శబ్దవృత్తి.

**శబ్దశాసనము.** సం.వి.అ.న. = శబ్దశాస్త్రము.

**శబ్దశాస్త్రము.** సం. వి. అ. న. వ్యాకరణము.

**శబ్దసంగ్రహము.** సం. వి. అ. పుం. నిఘంటువు.

**శబ్దస్మృతి.** సం. వి. ఇ. స్త్రీ. భాషాశాస్త్రము. (ఫైలాలజీ)

**శబ్దాఖ్యేయము.** సం. విణ. (అ. ఆ. అ) మాటలలోఁ దెలుపఁ దగినది. వి. అ. న. మాటలతో దెలుపుట.

**శబ్దాధిష్ఠానము.** సం. వి. అ. న. శ్రవణము చెవి.

**శబ్దానుకృతి.** సం. వి. ఇ. స్త్రీ. శబ్దానుకరణము శబ్దధ్వనిచే నర్థమును స్ఫురింపఁ జేయుట.

**శబ్దానుశాసనము.** సం.వి.అ.న. శబ్దశాస్త్రము. వ్యాకరణము.

శబ్దాలంకారము. సం. వి. అ. పుం. (అలం) శబ్దముల వలనఁ జమత్కృతిని బుట్టించు నలంకారము. యమకము మొ॥ (వ్యతి) అర్థాలంకారము.

శబ్దించు. (సం.అ.క్రి. ప్రయోగము. ధ్వనించు.శర) స. క్రి. ధ్వనింపఁజేయు ప్రయోగించు.

శా. బ ధుల్ మేలన వామహస్తమునఁ జాపం బత్తి మార్వీలతా, సంధానం బొనరించి కొంచెపుఁ దగన్ శబ్దించుచున్ ధీరతా, సింధుండా హరి దాని ఖండితముగా, జేసెన్. భాగ. ౧౦. పూ. ౧౨౮౨.

శబ్దితము. సం. విణ. (అ. ఆ. అ) ౧. ధ్వని గలదిగాఁ జేయఁ బడినది. వాయింపఁ బడినది. ౨. ఉచ్చరింపఁ బడినది. 3. పిలువఁ బడినది. ౪. పేరుపెట్టఁ బడినది. ౫. వివరింపఁ బడినది. ౬. ఉద్ఘోషింపబడినది. వి. అ. న. ధ్వని; కేక.

శమథము. సం. వి. అ. పుం. మనశ్శాంతి. కామాది వికారములు లేమి.

శమథుఁడు. సం. వి. అ. పుం. ఆలోచన చెప్పువాఁడు. మంత్రి.

శమనము. సం. విణ. (అ. ఆ. అ) ౧. అణఁచునది. నశింపఁ జేయునది. వి. అ. న. ౧. వశపశపరచుకొనుట. జయించుట. ౨. మనశ్శాంతి. నెమ్మది. 3. సమాప్తి. అంతము. ౪. హింసించుట ౫. యజ్ఞమునఁ బశువులఁజంపుట. ౬. మ్రింగుట నమలుట. పుం. ఒక జాతి జింక.

శమనస్వస. సం. వి. ఋ. స్త్రీ. యమునానది.

శమని. సం. వి. ఈ. స్త్రీ. రాత్రి.

శమనీయము. సం. వి. అ. న. ఉపశాంతి కలిగించు చికిత్స.

శమనీ (ష) సదుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు. రాత్రించరుఁడు. పిశాచము.

శమనుఁడు. సం. వి. అ. పుం. యముఁడు, మృత్యుదేవత.

శమపరుఁడు. సం. విణ. (అ. ఆ. అ) మనశ్శాంతి గలవాఁడు. శాంతుఁడు.

శమము. సం. వి. అ. పుం. ౧. అంతరింద్రియ నిగ్రహము.

సీ. శమదమాధికుఁడైన సత్యాత్మనిఁ గనుఁ గొన్నము నెన్నఁడును లేని కనరుదోఁచు. నిరంకుశో. ౨-౨౫

మనోనిగ్రహము. నెమ్మది శాంతి. విశ్రాంతి తెలివి. 3. ఉపశాంతి.తగ్గుట. ౪. సంధ సఖ్యము ౫. ముక్తి. మోక్షము. ౬. కరము. చేయి. ఉపచారము.

శమలము. సం.వి.అ. న. ౧. మలము. పురీషము.

౨. అపరిశుద్ధత. మురికి. 3. పాపము. ౪. దుఃఖము. ఆపద.

శమి. సం. విణ. (న్. నీ. న్) ౧. అంతరింద్రియ నిగ్రహము గలవాఁడు. మనశ్శాంతిగలవాఁడు శాంతుఁడు.

గీ. శములకేటికి నృపనివేశములు?— దశావతార చరిత్ర. ౬-౫౦

౨. ఇంద్రియ నిగ్రహము గలవాఁడు. వి. ఈ. స్త్రీ ౧. జెమ్మిచెట్టు.

గీ. అప్పుడా వహ్నితాద్యాధారాభి ఘార,పరిమళ్లా జనవశమీ పల్లవాగ్రవాత హుతాశన జిహ్వ సముత్థమగుచు, హోమ ధూమంబు బాలపైనొయఁబోలని. శృం నై ౬-౧౦3.

కాయ శలాటువు.

శమి (యి) ంచు. సం. అ. క్రి శాంతించు.

తే. గీ. ఉరగ కులముబోయిఁ బొరిగొరి శమియించె. సింహా. ౧౧-౭౬౩

మ. మహోధ్భవ దాహంబు శమించుమీ పదజల ప్రాశంబునన్. ఉ. రా .౧-౧౪౪.

సీ. హిమవారిచే శమియించునే తాపంబు వర్ధ
శరీరస్వేద వారిఁగాక.

స. క్రి. పోఁగొట్టు. శాంతిబొందించు.

వ. తెలియక చేసిన పాపపుంజంబు నురువగు
రేణ్వ్యంబు సమయింప నేర్చువాచార్యాను
గ్రహంబు గల్గిన వెనుక తెలిసి చేసినపాపంబు
గురుండు శమింప లేఁడు. వెంకటా 3-౧౭

శమిత. సం. వి. పుం. యజ్ఞమున పశువును
జంపువాఁడు. కసాయివాఁడు.

శమితము. సం. విశ. (అ. ఆ. అ) ౧. శమింప
జేయఁ బడినది. తగ్గింపబడినది.

మ. శమితారాతి బలుండు వారలకుఁ బాంచాల
ప్రభుండిష్టుచుట్టము దానయ్యె............భార
ఆది. ౯-౮౮

౨. మాన్పఁబడినది. కుదుర్పఁబడినది. (రోగము)
3. సడలింపఁబడినది. శాంతము. ౪ నెమ్మదించు
నది. ౫. మితముగాఁజేయఁ బడినది. ౬. చంపఁ
బడినది.

శమీగర్భుఁడు. సం. వి. అ. పుం. ౧. అగ్ని
హోత్రుఁడు. అగ్ని. ౨. బ్రాహ్మణుఁడు.

శమీధాన్యము. సం. వి. అన. కాయధాన్యము
కాయలలోనుండి పుట్టు ధాన్యము. (పెసలు.
మినుములు. మొ)

శమీ (మి) రము. సం. వి.అ. పుం. చిన్నజాతి
జమ్మిచెట్టు.

శమ్మి. వి.జమ్మిచెట్టు.

వ. దీనికిఁ బడఁమట నైర్ఋతిమూల చలువు
కట్టిన రావి మ్రాను. పడమట పడమట శమ్మి
మ్రానును. పి.శా. శ. ౧-౦౨౮.

శమ్యా. సం. వి. ఆ. స్త్రీ. ౧. చేతికఱ్ఱ. ౨. దుడ్డు
కఱ్ఱ. 3. కాఁడిచీల. ౪. (సంగీ) హస్తతాళము.
చేతితోఁచేయి వేసి చఱచుట. ౬. యజ్ఞపాత్రము.

శయతుఁడు. సం. వి.శ్లే. పుం. ౧. నిద్రాళువు.
౨. చంద్రుఁడు.

శయథము. సం. విశ. (అ. ఆ. అ) నిద్రగలది.
నిద్రాళువు. మనికి పాట్లు పడునది. వి. అ. పుం.
౧. మృత్యుదేవత. ౨. కొండచిలువ. 3. అడవి
పంది. ౪. చేఁప.

శయనము. సం. వి. అ. న. ౧. నిద్రించుట.
నిద్ర. ౨. పఱుపు. పడక. 3. రతి. మైథునము.

శయనించు. సం. అ. క్రి. పరుండు.

సీ. శయనింప నొల్లను శయ్యపై నైనను వన
జాక్షిహాయురంబున నెకాని. రాధికా3-౧౧౮

వ. సహదేవుఁడు శుచియై వార్చి దర్భశయనం
బునశయనించియగ్ని సూక్తంబులంబఠించుచు
భార. సభా. ౧-౨౫౭.

గీ. ప్రీతి మంచంబుపైనుండి పీటనుండి, చెప్పు
పావలుఁదొడి. తలచీర చుట్టి, నవ్వుచును
మాటలాడుచు నడిచి నడిచి, వంగి శయనించి
నిలుచుండి వార్వఁజనడు. వి. జ్ఞా. ౧-౫3.

గీ. దిగంబరత శయనింప నీరాదఁగాదు.
మార్క. 3-౨30.

శయనీయ (క) ము. సం. వి. అ. న. పఱుపు.
సెజ్జ. శయ్య.

శయనైకాదశి. సం. వి. ఈ. స్త్రీ. విష్ణువు
శ్రాంతి పొందుటకై పరుండెడి యేకాదశి.
ఆషాఢ శుక్లైకాదశి.

శయము. సం. విశ. (అ. ఆ. ఈ; అ) సమా
సాంతమున)

ఇది కాలవాచక భిన్నమగు హలంతాదంత
సప్తమి కంటెఁ బరముగానున్నప్పుడు సమాస
మున సప్తమికి అలుక్కు వికల్పముగావచ్చును.
ఉదా: దృవదిశయము గ్రామేశయము మొll
పరుండునది.

**శయనించునది.** వి. అ. పుం. ౧. పఱుపు. శయ్య ౨. సెజ్జ.

కం. కాంతార విహారమ్మున శ్రాంతుండై గోపి కాంక శయుఁ డగునన్నన్. భాగ ౧౦-౬౦౪

ఉ. శయమ్ముల కంకణావళుల్, పదిలెఁ దొలంకెఁబో పయనవారి శయమ్ములఁ గంకణావళుల్. చంద్రికా. ౪-౧౭.

౨. నిద్ర ౩. చేయి.
శయపూజాంబుజముల్ కటిందదఁబడన్.
ఆము. ౧-౫౬

౪. పాము. కొండచిలువ. ౫. తిట్టు. శాపము. ౬. నేలనాఁ టెడు వాఁడి కొయ్య ౭. పందెము.

**శయానకము.** సం. వి. అ. పుం. ౧. ఊసర వెల్లి. ౨. కొండచిలువ. అజగరము.

**శయానము.** సం. విశ. (అ. ఆ. అ) నిద్రించు నది, పవ్వళించునది.

శా. ఆసిస్థానిఁ గేహసీమనడురే యాలించి-న్ బ్రోయు నెం తేనాగేంద్రశయానుపుణ్యకథలున్.
ఆము. ౧-౭౪

మాలిని. గపదవిహితయానాత్మధన్వీశయానా
సింహా భా. ౧. ఆ. ౨-౧౭౩

**శయాలు (ళు) వు.** సం విశ. (ఉ) నిద్రగలది, కునికిపాట్లుపడునది. వి. ఉ. పుం. ౧. కొండ చిలువ. ౨. కుక్క. ౩. నక్క.

**శయించు=శయనించు.** సం. అ. క్రి. పరుండు.

శా. ఎచ్చోనైనను నిల్చు నాఁకటికి నేమేనిం గొనున్ రాత్రియైనచోఁ నెమ్మి శయించు నగ్ని పరిచర్యం బాసి వర్తించు. భార. శాం. ౨-౨౩౩

ఉ. మహాశోభాఢ్య శయ్యాపరిం జతురప్రీతి శయించి కార్యకథనా సంసక్తిమైనున్నెడన్
హరి. పూ. ౭-౧౪౬.

ఉ. విష్ణుండు నీటన్ శయించిన నద్దేవునియాత్మఁ బుట్టి దివిష జ్యేష్ఠుండు....ఉ. రా. ౭-౨౪౧

**శయితము.** సం. విశ. (అ. ఆ. అ) ౧. నిద్రించు నది. ౨. విశ్రాంతిగొనునది. ౩. పరుండునది. వి. అ. న. నిద్దుర.

**శయువు.** సం వి. ఉ. పుం. కొండచిలువ, అజగ రము.

**శయ్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పఱుపు, పాన్పు

సీ. బోధించునొకవేళఁ బూవిల్తుశాస్త్రంబు, జదిఁ వించునొకవేళ శయ్యలోలి. రాధికా ౧-౫౯

సీ. శయ్యాతలంబున శయనించి చంద్రునిఁ బరికించి వీక్షించి భావమలర. బిల్హ ౨-౫౦

మ. నవ శబ్దార్థర సానుబంధపద విన్యాసక్రియా భావగౌరవపాకధ్వని రీతిశయ్యలఁ గవీంద్ర శ్రేణికావ్యాళిఁజెప్ప...... విక్ర ౧-౧౫
భార. ఆది ౨-౪౬

౨. మంచము, శయనాధారము. ౩. నిద్రించుట నిద్ర. ౪. (అలం) పదములకూర్పు, గుంఫనము.

**శయ్యోత్సంగము.** సం. వి. అ. పుం. పాన్పు యొక్క పార్శ్వభాగము.

**శరండము.** సం. వి. అ. పుం. ౧. పక్షి ౨. ఊసరవెల్లి. ౩. భూషణవిశేషము.

**శరండుఁడు.** సం. వి. అ. పుం. ౧. మోసగాఁడు. ధూర్తుఁడు. విషయాసక్తుఁడు.

**శరకాండము.** సం. వి. అ. పుం. ౧. రెల్లుకట్టె. రెల్లు కాఁడ ౨. బాణదండము. అంపకొయ్య.

**శరజన్ముఁడు.** సం. వి. న్. పుం. కుమారస్వామి

**శరజము.** సం. వి. అ. న. అప్పుడు తీసినవెన్న, సద్యోఘృతము. (వాచ)

**శరజుఁడు.** సం. వి. అ. పుం. = శరజన్ముఁడు. కుమారస్వామి.

**శరటము.** సం. వి. అ. పుం. ౧. ఊసరవెల్లి. ౨. కుంకుమపువ్వు.

**శరణము.** సం. వి. అ. న. ౧. రక్షణము ప్రోచుట.

చ. శరణంబు నాకగుము దానవసూదన పాక
శాసనా భార. ఆ. ౨-౪౬

౨. ఆశ్రయము. రక్షకస్థానము. ప్రాపు. ౩. గృహము. ఇల్లు ౪. గుహ. జంతునివాసము. ౫. హింసించుట. వధ. చంపుట.

**శరణముచొచ్చు.** మి. స. క్రి. (శరణము + చొచ్చు) శరణొందు, రక్షకుని గాఁగోరు.

క. శరణాగతరక్షకుఁడవు కరుణాకరుఁడవు
త్రిలోక కళ్యాణుఁడ వీశ్వరుఁడవు గావున
నిన్నే శరణము చొచ్చితిముకుంద సర్వాత్మ
హరా! హ. ఉ. ౭-౨౩౭

**శరణాగతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) శరణు పొందినవాఁడు. రక్షణమునుఁగోరి వచ్చినవాఁడు. ఇట్టే శరణాపన్నుఁడు.

**శరణార్థి.** సం. విణ. (న్. నీ. న్) శరణు కోరువాఁడు, ప్రాపు గోరువాఁడు.

చ. ఈ, యవనిపులెల్ల నాతని దయంబడిముక్తులు
వాని చేత నాహవజితులుం. దదీయ శరణా
ర్థులు........ భార. సభా ౭-౨౪.

వి. నమస్కారము. (ఈ యర్థము ఆంధ్రగ్రంథముల యందే కానవచ్చుచున్నది)

సీ. ఇదె నమస్కారమో హిమభాను నగ్నుఁడ
శరణార్థి నీకు. మత్స్యధ్వజాంక
ఇందు ౩-౭౭

మ. మా వెనువెంటన్ జనుదెందు నమ్ముఁడు
నిశాచరున్ బ్రయాణంబు రంతగ భక్తిన్
శరణార్థిఁ జేసి ........... కాశీ. ౪-౫౩

ద్వి. చక్కనజనఁ జొచ్చిశరణార్థిఁ జేయు మరలి
చూచుడు జంగమమునందఁదోఁచె. పండితా.
దీక్షా. ౬౬
(ఇట్టే శరణార్థి)

**శరణు.** సం. విణ. రక్షకము. (ఇదివర్ణము. వస్తు

గీ. చాపఖట్వాంగధర నీవె శరణు మాకు
నన్యథా శరణంబు లేదభవ భీమ. భీమ. ౪౧౧౩

వి. ౧. నమస్కారము. వందనము.

సీ. జోహారు పార్వతీ సుందరీధవనీకు శరణు
విశ్వాధార సార నీకు. సూతసంహిత
ఆ. ౨. పు. ౧౧౨

గీ. విధిగృహాక్షయ విత్తాధిపధీకి శరణు చిరకృతే
ష్యాకు పుణ్యరాశికిని బ్రణుతి....ఆము.
౬-౯౯.

౨. శరణాగతి.

చ. ఏ, నసమతిఁ బ్రమొగ్గినీకు శరణంచు భయంబున
గూయిడం గృపారవిసుఁడ వీవు చేయు దక్షి
రక్షయుగంబుల నెల్లనిల్లయై యొసఁగు భవత్స
మాశ్రయ సమిద్ధ జవాత్మత నాకు నచ్యుతా
హరి. ఉ. ౯-౧౫౪.

గీ. అతివ యీ రాజు మగధదేశాధినాథుఁడధిక
బలశాలి శరణాగతావనపుఁడు గనఁగ రక్షించు
బహుల దుర్ధర్షమహిమఁచి నిక్కము పరంపరాఖ్య
జెందిన యతండు. ఇందు. ౧-౫-౧౦౯.

మ. శరణన్న న్విడనిమ్ము నేను శఫరీ సామాన్య
బుద్ధిన్........ దశా. ౧-౧౩౫

**శరణుఁడు.** సం. వి. అ. పుం. శివభక్తుఁడు (ఈపదము శైవగ్రంథములందే కానవచ్చుచున్నది.

ద్వి. లింగసర్వేంద్రియ లీనుండు ముగ్ధసంగయ్య
నానొక్క శరణుఁడీక్షించి బస. పు. ౩-౧౦౬ పం

ద్వి. పరదైవనామ దుర్భావముతోడ నరిచేయ
వచ్చునే శరణునినను-చు. బస. పు. ౬-౭౨౪ పం.

ద్వి. పవిశేషమతి లేమ శరణుఁ డొప్పించి, పని
తయుఁ దానును వడిఁ జాఁగి మ్రొక్కె.
పండితా. పరా. ౧౬౭. పం.

**శరణువేఁడు.** (స. క్రి. శరణు + వేఁడు.) = శరణు

ఉ. వినిముదమందుడన్ శరణు వేఁడెదఁగావుము నన్మనీశ్వరా. భార.అను. 3-౨౬౨.

గీ. శరణువేఁడెద రక్షింపు సౌఖ్యమొసఁగి. దశా. 3-౪౧.

**శరణుసా (చొ) చ్చు.** అ. క్రి. స. క్రి. (శరణు+చొచ్చు.) శరణాగతినొందు రక్షకుఁడు గాఁగోరు

సీ. ఇదె నీకు శరణు సొచ్చెద కాంతుఁడవుగమ్ము రాఘవ. ౪.౭౧

సీ. శ్రీరామచంద్రుండు చేపట్టఁడాయెనాశరణుచొచ్చిన విభీషణునిదొల్లి. దశా. ౧-౧33

వ. శక యవన కాంభోజ పారద ప్లవాది దేశంబుల రాజులు ప్రాణ భయార్తులై తత్కుల గురుండైన వసిష్ఠు శరణుచొచ్చిన వి. పు. ౫-౨3౯

**శరణొందు.** శరణుచొచ్చు. స. క్రి. (శరణు+ఒందు.)

ఉ. కాంచన శైల శైలగణకం దనకల్పిత సత్కోటికనెలు దియించెన్ రణోర్వీబురమర్దనుడై నెదిర్చ నేని. భంగించును శాత్రవుండయిన గోవలమున్ శరణొందెనేని రక్షించును కామ మంత్రిను శికిన్ సరివత్తురె మంత్రులెవ్వరున్. జాహ్న వి. ౧-౮3

మ. ఇచ్చోనేభియం బయ్యె నన్మరణొందంబని యేమి........ దశా. ౧-౧3౫

**శరణోన్ముఖుఁడు.** సం. వి. ఋ. (అ. ఈ. అ) శరణమునకై యెదురుచూచువాఁడు.

**శరణ్యము.** సం. విణ. (అ.ఆ. అ) ౧. రక్షించుటకు సమర్థమైనవి. ఆశ్రయమైనది. ౨ రక్షకము రక్షించునది. 3. రక్షణమునుగోరునది,దీనదశలో నున్నది. వి. అ. న. ఆశ్రయము. రక్షకస్థానము తలదాచుకొనెడిచోటు. ౨. రక్షణము ప్రోపు. ౨. అపాయము. హాని (ఆ. వి)

**శరణ్యుఁడు.** సం. వి. అ. పుం. రక్షణసమర్థుఁడు శివుడు.

కం. భువనాధీశ్వర!,శంకరదివిజాసురవంద్యపాద దీనశరణ్యా! శివరహస్య సంధిక 3-౧౬౭

కం. జన శరణ్యులుత్తములు నిత్యసాంగత్యము నన్. భార సభా II ౧-౧౧౨

**శరణ్యువు.** సం. వి. ఉ. పుం. ౧. రక్షకుఁడు. ౨. మేఘము. 3. గాలి. వాయువు.

**శరత్కాలము.** సం వి. న. పుం. శుక్కాల.

**శరత్తు.** సం. వి. త్. స్త్రీ. ౧. ఒకానొక ఋతువు. ఆశ్వయుజకార్తికమాసములతో నేర్పడుఋతువు.

క. కాలము శరత్సమాగమ, హేలాసౌభాగ్య మహిమనేపు వహించెన్. పాండు ౪-3౭ ౨. సంవత్సరము.

పంచశరద్వయస్కుఁడవు.బాలుఁడ వింతకగానిలేవు.ఆం. భాగ. ౭-౧౫౨.

**శరత్పద్మము.** సం. వి. అ. పుం.న. తెల్లతామర, పుండరీకము.

**శరత్పర్వము.** సం.వి.న్.న. వ్రతమునిమిత్తముగాఁగల కోజాగరము నుత్సవము.

**శరదిజము.** సం. విణ. (అ.ఆ.అ) శరదృతువునఁబుట్టినది, శరదృతువునం దుండునది.

**శరదుదాశయము.** సం. వి. అ. పుం. శరత్కాలము నందలి జలాశయము.

**శరధి.** సం. వి.ఇ. పుం. ౧. తూణీరము. అమ్ముల పొది. ౨. సముద్రము.

**శరఫలము.** సం. వి. అ. న. బాణాగ్రమున వెనుకకుఁ దిరిగియుండు ములికి.

**శరభంగుఁడు.** సం. వి. అ. పుం. దండకారణ్యమున శ్రీరామునకాతిథ్య మొసఁగిన యొకానొక ముని.

**శరభము.** సం. వి. అ. పుం. ౧. ఏనుగుగున్న ౨. మృగవిశేషము. సింహముకంటె బలవత్తరమై యెనిమిది పాదములుగల జంతువు.

సీ. శరభ సింహవ్యాఘ్ర సత్త్వచయంబులనేడిశ
శల్యెట్ల యెక్కియాడి. భార ద్రోణ ౨-౨౧౦

౩. ఉష్ట్రము, ఒంటె. ౪. మంత్రవిశేషము.

ఆ. వె. వీరభద్రమెన్న వీరభద్రమె తెచ్చు. శరభ
మన్న నదియె సంగ్రహించు మనుజనాథ కదమ
మంత్రగంబులా బ్రహ్మ. రాక్షసునకు నీళ్లు
ద్రాగినట్లు. నిరంకు ౪-౮౨

**శరభువు.** సం. వి. ఋ. పుం. శరజన్ముఁడు. కార్త్తికేయుఁడు.

**శరము.** సం. వి. అ. పుం. ౧. బాణము. అమ్ము.

మ. కీరముం, గని తానిట్లనె నూనసాయక
శరాఘాతార్త చిత్తాబ్జమై. రాధికా ౨-౬౦

౨. తెల్లరెల్లు రెల్లు. ౩. మీఁగడ ౪. గాయము. పుండు. ౫. అయిదుసంఖ్య న. ౧. నీరు.

**శరయంత్ర (క) ము.** సం. వి. అ. న. తాళపత్ర గ్రంథమందలి పత్రములను గూర్చు త్రాడు.

మ. శివవిద్యామంటపాగ్రంబుపై, శరయంత్రం
బిడి యందుఁ బుస్తకముఁ బూజల్ సేయ
న్యాయంబగున్. శివధర్మ. ౨-౧౮

**శవలకము.** సం. వి. అ. న. జలము. నీరు.

**శరవణ (న) ము.** సం. వి. అ. న. రెల్లువనము. రెల్లుబలిసినయడవి.

సీ. శరవణోద్భవుం డన గుహుం డుద్భవిల్లెడె
భార. ఆది. ౬-౫౯

శా.. స్వామీ! మీరు పరాశరక్షితిసుతయుల్ వ్యాసా
గ్రజాల్ మున్ను మేధా మాధ్యంబున మూర్ఖులై
శరవణాంతంబందు మత్స్యంబులన్ వేమారు
వ్యధియించిరజ్ఞావులనెంతేఁ గూర్చి క్రీడింపఁగా
నామానీంద్రుడు చూచి నందినుల ప్రోద్య
త్కూర కృత్యంబొాగెన్.
శివరహస్య ౫-౩౦౯

**శరవన (ణ) భవుఁడు.** సం. వి. అ. పుం. కుమారస్వామి. ఇట్టి. శరవణోద్భవుండు.

**శరవాణి.** సం. వి. ఇ. పుం. ౧. బాణ శిరస్సు. బాణాగ్రము. ౨. విలుకాఁడు. ధానుష్కుఁడు. ౩. బాణములు చేయువాఁడు. ౪. పదాతి. కాలిబంటు.

**శరవ్యము.** సం. వి. అ. న. ౧. లక్ష్యము. గురి.

చ. కలదు సుమీ మనోజశరకంపితధైర్యశర
వ్యలై తలం, పులవచనంబులంగ్రియల ...
నిరంకుశో. ౧-౪౦

**శరసంధానము.** సం. వి. అ. న. వింటికి బాణము కూర్చుట.

మ. శరసంధాన బలక్షమాది వివిధైశ్వర్యంబులుం
గల్గియర్భరమందశ్వబిలప్రవేశచలనబ్రహ్మఘ్న
తిల్ మానినన్. చాటువు.

**శరాఘాతము.** సం. వి. అ. పుం. ౧. బాణపు దెబ్బ. ౨. విలువిద్య.

**శరాటి (డి) (తి)** సం. వి. ఇ. పుం. ఒకజాతి పక్షి. ఆడేలు.

**శరాభ్యాసము.** సం. వి. అ. పుం. బాణసంధానము నల వఱచువిద్య. విలువిద్య.

**శరారువు.** సం. విశే. (ఉ) ఘాతుకము, హింసించునది.

కం. చోరులు శరారులును మఱి, జారులు
గ్రూరులును మాఱిజననిందకులున్, దారాత్మ
జవశగతులు, న్నారకమున కరుగువారగుననఁ
బోలి ధరన్. ధర్మఖం. ౧-౧౮౯.

౨. వి. ఉ. పుం. దుష్టమృగము. క్రూరజంతువు.

**శరారోపము.** సం. వి. అ. పుం. విల్లు ధనుస్సు.

**శరావతి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఒకానొక పట్టణము. (ఈపట్టణమునకు రాముఁడు లవుని రాజుగాఁజేసెను.) ౨. నదీవిశేషము. ఒకానొక నది.

శరావము. సం. వి. అ. పుం. న. ౧. మూఁకుడు ౨. పళ్లెము. తాంబాళము. మట్టిపాత్ర. 3 రెండు కుడవముల పరిమాణము.

శరాశ్రయము. సం. వి. అ. పుం. తూణీరము. అమ్ములపొది.

శరాసనము. సం. వి. అ.న. విల్లు.

క. తగఁజొనిపి జాంబుజ, శరమిత్తు శరాసనమున సంధించిమనుందరవిందనయనదండము కగిముముడుగ నచ్చిపోవఁగా జేసె వెనన్. విక్ర. ౧-౧౭౫

(ఇక్లో శరాస్యము మొ)

శరిమము. సం. వి. న్. పుం. ప్రసవము, బిడ్డను గనుట, కాన్పు.

శరీరకర్త. సం. వి. ఋ. పుం. జనకుఁడు, తండ్రి

శరీరకుఁడు. సం. వి. అ. పుం. జీవుఁడు (ఇక్లో శారీరకుఁడు)

శరీరజము. సం. వి. అ. పుం. రోగము. జబ్బు. విశ (అ. ఆ. అ) దేహమునబుట్టినది.

శరీరజుఁడు. సం. వి. అ. పుం. ౧. మన్మథుఁడు. అంగజాతుఁడు. ౨. పుత్రుఁడు.

శరీరదండము. సం. వి. అ. పుం. ౧. దెబ్బలు మొ॥ గు. శిక్ష. ఒడలునొవ్వఁ జేయుశిక్ష ౨. (తపస్సంబంధు) శరీరశోషణము. శరీరము కృశింపఁజేయుట.

శరీరపతనము. సం. వి. అ. న. దేహము పడిపోవుట. చావు.

శరీరపాకము. సం. వి. అ. పుం. దేహకార్శ్యము

శరీరపాతము = శరీరపతనము. సం.వి.అ.పు..

శరీరబంధము. సం. వి. అ. పుం. ౧. దేహస్వరూపము. ౨. అవతరించుట. దేహముదాల్చుట.

శరీరబద్ధుఁడు. సం. విశ. (అ. ఆ. అ) శరీరము దాల్చినవాఁడు. రూపొందినవాఁడు.

శరీరభాక్కు. సం. విశ. జ్. దేహముదాల్చినవాఁడు. రూపొందినవాఁడు. వి. జ్. పుం. జంతువు, ప్రాణి

శరీరము. సం. వి. అ. న. మేను.దేహము.ఒడలు

క. సారెకుఁ దెలియ శరీరము. సారంబావంత లేదు........ శివపద్మ ౫-౫౨

౨. దేహబలము. 3. మృతదేహము.

శరీరయాత్ర. సం. వి. ఆ. స్త్రీ. జీవిక జీవనాధారము.

శరీరసంస్కారము. సం. వి. అ. పుం. ౧. దేహమలంకరించుట. ౨. ప్రాయశ్చిత్తాదులచే శరీరము పవిత్రముచేయుట.

శరీరసంబంధము. సం. వి. అ. పుం. వివాహమూలకమైన సంబంధము.

శరీరసాదము. సం. వి. అ. పుం. దేహము సన్నగిల్లుట.

శరీరస్థితి. సం. వి. ఇ. స్త్రీ. ౧. శరీరపోషణము. ౨. తినుట, భోజనము జేయుట.

శరీరావరణము. సం. వి. అ. న. చర్మము. విశ. (అ. ఆ. అ.) శరీరమునుగప్పునది. దేహమావరించునది.

శరీరి. సం. విశ. (న్.న్.న్) శరీరముగలవాఁడు శరీర ధారి ౨. జీవించుచున్న వాఁడు వి.న్. పుం. ౧. ప్రాణిజంతువు. ౨.మనుష్యుఁడు. 3. జీవుఁడు

శరువు. సం.వి.ఉ. పుం. ౧. బాణము, ౨.ఆయుధము. 3. వజ్రాయుధము. ౪. క్రోధము. ౫. ధనుర్విద్యాభ్యాసము. విలువిద్య నేర్చుట.

శరేష్టము. సం. వి. అ. పుం. మామిడిచెట్టు.

**శర్కర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చక్కెర. కలకండ

సీ. క్షీరశర్కరలును ఘృతములు భంగిక, వ్యంజనంబులు వివిధాన్నపానములును
భార. మౌసల ౨౯.

౨. సన్నరాయి. గులకరాయి.

ఉ. ఒక్కెడ శాతకంటము లొక్కెడఁగర్క శశర్కరావ్రజం బొక్కెడ నంధకారమయ మొక్కెడ
శివధర్మ ౪-౩౯.

3. కంకరమన్ను. ౪. ఇసుక. ౫. ముక్క. ఖండము ౬. కుండపెంకు. ౭. ఘనీభవించిన యణుసముదాయము. ఉదా. జలశర్కర. ౮. రోగభేదము మూత్రకృచ్ఛ్రరోగము.

**శర్కరకము.** సం. వి. అ. పుం. ఒక జాతి దబ్బ ‡ తియ్యనిమ్మ.

**శర్కరజ.** సం. వి. ఆ. స్త్రీ. కలకండము. పటికి బెల్లము.

**శర్కరావంతము.** సం. విశే. (త్. ఈ. త్) శర్కరిలము.

**శర్కరాసప్తమి.** సం. వి. ఇ. స్త్రీ. వైశాఖ శుక్లసప్తమి.

**శర్కరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. నది ౨. నడికట్టు. కాంచీకొ. ౩. కలము. లేఖిని.

**శర్కరిలము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. గులకరాలు గలది.

తే. గీ. దేవపూజావసరసముద్దీప్యమాన చాకు మణిరంగవల్లి కాశర్కరిలము.
నిరంకుశో. ౧-౬౨.

౨. ఇసుకతో గూడినది. (ప్రదేశము) ఇక్షు శర్కరికము.

**శర్ధంజహము.** సం. విశే. (అ. ఆ. అ) అపానవాయువును గలిగించునది. వి. అ. పుం. అనుములు.

**శర్ధనము.** సం. వి. అ. న. అపానవాయువువిడుచుట

**శర్ధము.** సం. వి. అ. పుం. అపానవాయువు విడుచుట. ౨. గుంపు. జనసముదాయము. 3. బలము. శక్తి.

**శర్మణ్యము.** సం. విశే. అ. ఆ. అ. రక్షణము నొసంగునది, ఆశ్రయమొసంగునది.

**శర్మదము.** సం. విశే. అ. ఆ. అ సుఖమునిచ్చునది

**శర్మదుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**శర్మము.** సం. విశే. (న్) సుఖవంతము. సుఖము గలది. వి. న్. పుం. బ్రాహ్మణుల నామములనకుఁ జివరఁ జేర్పఁబడు పదము. ఉదా- దేవశర్మ. విష్ణుశర్మ. న. ౧. సంతోషము. సుఖము.

మ. భుజదండంబుననొక్క భామదొడిగెన్ భూభర్తకున్...... త్రిజగల్లోచను శర్మదానకలనా ధీరంబుగేయూరమున్.
శృం నై. ౬-౧౧౮.

**శర్మరము.** సం. వి. అ. పుం. ఒక విధమైన వస్త్రము. (బట్ట) బ్రూని పసుపు ‡

**శర్మిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. వృషపర్వుఁడను రాక్షసరాజు కూఁతురు. యయాతి భార్య.

**శర్వ.** సం. వి. ఆ. స్త్రీ- ౧. రాత్రి ౨. అంగుళి వ్రేలు.

**శర్వరము.** సం. వి. అ. న. చీఁకటి.

చ. అరిగి మగంటు సచ్చిన కులాంగనయున్ శశిగ్రుంకి నట్టిశర్వరియును బోల్పఁ బట్టుగను....
భార. మౌసల. ౯౮

**శర్వరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. రాత్రి ౨. సంధ్యాకాలము. 3. పసుపు. ౪. ఆడుది.

**శర్వరుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**శర్వాణి.** సం. వి. ఈ. స్త్రీ. పార్వతీదేవి.

**శర్వుఁడు.** సం. వి. అ. పుం. ౧. శివుఁడు. ౨. విష్ణువు.

శలంగము. సం. వి. అ. పుం. లవణవిశేషము

శలంగుఁడు. సం. వి. అ. పుం. రాజు, చక్రవర్తి.

శలకము. సం.వి.అ.పుం. సాలెపురుగు. లూత

శలభము. సం. వి. అ. పుం. ౧. మిడుత.

చం. ........చిన్నిలోపలం బడి పడిఁ దూలిపచ్చు శలభంబు లెఱుంగున........ సింహా. భా. ౧౭. ౨-౧౪౦

౨. చిమ్మట. ఈలపురుగు.

శలము. సం. వి. అ. పుం. ౧. ఈఁటె. ౨. చీల 3. వస్త్రము. ఒంటె. న. ఏదుపందిముల్లు.

శలలము. సం. వి. అ. న. ఏదుపందిముల్లు.

శలలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఏదుపందిముల్లు. ౨. చిన్నయుడవిపంది.

శలాక. సం. వి. ఆ. స్త్రీ. ౧. చిన్నకఱ్ఱ. కొయ్యచీల. ౨. కన్నులఁ గాటుక పెట్టుటకుపయోగించు చిన్న కడ్డీ (అంజనశలాక)

సీ. కమ్మని పసిఁడి టంకంబులఁ గరఁగిన లాలిత నూత్నశలాకవోలె. విక్ర. ౬-౪౪.

తే. గీ. ఆమణిశలాకయుగుణమై యద్భుతంపు, రంగుగలిగియుండు. కళా. ౫-౨౪.

3. బాణము. ౪. ఈఁటె. ౫. (వైద్యుఁడు) గాయమును లోపల శోధించుట కుపయోగించు సాధనము. శస్త్రవైద్యసాధనము. ౬. గొడుగు కమ్మి. ౭. చేతి (వేళ్ళయొక్కయు కాలివ్రేళ్ళయొక్కయు మూలమునకాధారమైన) ఎముక. ౮. అంకురము. మొలక. ౯. కుంచె. చిత్తరువు వ్రాయు సాధనము. ౧౦. పలుతోముకుంచె. పలుదోము పుల్ల. ౧౧. ఏదుపందిముల్లు. ఏదుపంది. ౧౨. సాగె. ౧3. చిన్నని గీతలు గీయునపుడుపయోగించుకఱ్ఱ. ౧౪. శారిక. గోరువంక.

శలాటము. సం. వి. అ. పుం. బండెఁడుబరువు.

శలాటు. సం. = శలాటువు. బిహ్లో. ౪. ౧౫.

సీ. ఫలశలాటువితానబద్ధశాఖలమల ఘన విహంగమపాదఘట్టనముల

గీ. కోర్వఁజాలక కంపంబు నొందుచుండు పాదపంబు........ శివధర్మం. ౫-౧౭౫.

శలాటువు. సం. వి. ఉ. పుం. ౧. పచ్చికాయ ౨. ఒక విధమగు దుంప 3. బిల్వము. మారేడు చెట్టు. అపక్వఫలము.

శలాలువు. సం. వి. ఉ. పుం. ఒకవిధమగు పరిమళద్రవ్యము.

శలి. సం. వి. ఈ. స్త్రీ. చిన్నయేదుపంది.

శలుఁడు. సం. వి. అ. పుం. ౧. శృంగియను శివపరిచారకుఁడు. ౨. బ్రహ్మ 3. ఒక రాజు.

శల్క (ల) ము. సం. వి. అ. న. ౧. చేప పొలుసు. ౨. చెట్టుపట్ట. 3. ముక్క, ఖండము.

శల్కలి. సం. వి. న్. పుం. = శల్కి.

శల్కి. సం. వి. న్. పుం. చేప.

శల్మలి. సం. వి. ఈ. స్త్రీ. బూరుగుచెట్టు.

శల్యకంఠము. సం. వి. అ. పుం. ఏదుపంది.

శల్యకము. సం.వి.అ.పుం.౧.ఈఁటె ౨. ముల్లు. చేదు. 3. ఏదుపంది.

శల్యక్రియ. సం. వి. ఆ. స్త్రీ. శల్యాహరణము.

శల్యము. సం. వి. అ.పుం.న. ౧. చిన్నయీఁటె ౨. బాణము. 3. ముల్లు. ౪. గసిక. చిన్న కొయ్యచీల. న. ౧. పైనుండివచ్చి శరీరమున నిలువ యుండి మిగుల బాధ కలిగించుపదార్థము.

గీ. పాత్రమున నుండు శల్యంబులెత్తివైచి, శాస్త్రయుక్తిని గాని ఛేదనంబు సేయఁగఁదగు శాక్షేప జీవకకవులఁ దీర్పు, జనమహస్సునఁ మంగళజనులు వాయు. రాధికా ౧-౬.

శా. చింతాశల్యము డాసెనేని భుజబలోత్సాహంబు నీకొక్కనేని భార. విరా. II ౩౫౮
౨. దుఃఖకారణము. ౩. ఎముక ౪. కష్టము. ఆపద. ౫. పాపము. ౬. విషము. ౭. నింద. పుం ౧. ఏదుపంది. ౨. ముండ్లచెట్టు. ౩. బిల్వవృక్షము. ౪. మదనవృక్షము. ౫. ముండ్లుతీయుట, కంటకోద్ధరణము. ౬. వెలుగు, కంచె, ఆవరణము. ౭. ఒకజాతిచేఁప.

శల్యాలోమము. సం. వి. న్. న. ఏదుపందిముల్లు

శల్యశాస్త్రము. సం. వి. అ. న. = శల్యాహరణము.

శల్యాహరణము. సం. వి. అ. న. ముండ్లు, ములుకులు మొదలగు వానిని పైకిఁ దీయుట, శరీరమునుండి యన్యపదార్థమును దీసివేయుటకుఁ జేయుశస్త్రచికిత్స.

శల్యితము. సం. విశే. (అ. ఆ. అ) ఈఁటెతో బొడువఁ బడినది.

శల్యుఁడు. సం. వి. అ. పుం. మద్రదేశాధిపతి, నకులసహదేవుల మేనమామ.

శల్యోద్ధరణము. సం. వి. అ. న. = శల్యాహరణము.

శల్యోద్ధారము. సం. వి. అ. పుం. = శల్యాహరణము.

శల్లకము. సం. వి. అ. పుం. ఒకజాతిచెట్టు. వృక్షవిశేషము. న. చెట్టుపట్ట.

శ (స) ల్లకి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఏదుపంది. ౨. ఒకజాతి చెట్టు. దీనియాకులు కొమ్మలు వేనుఁగులకు మిక్కిలిప్రియము.

శల్లకీద్రవము. సం. వి. అ. పుం. ధూపద్రవ్యవిశేషము. సిల్హకము.

శల్లము. సం. వి. అ. పుం. కప్ప. న. చెట్టుపట్ట

శవకామ్యము. సం. వి. అ. పుం. కుక్క.

శవము. సం. వి. అ. పుం. న. పీనుఁగు. మృతకళేబరము. న. నీరు.

శవయానము. సం. వి. అ. న. పాడె, శవమును దీసికొనుపోవు నొక విధమయిన వాహనము.

శవరము. సం. = శబరము.

శవరుఁడు. సం. శబరుఁడు.

శవలము. సం. = శబలము.

శవసానము. సం. వి. అ. పుం. మార్గము. బాటదారి. న. శ్మశానము.

శవసానుఁడు. సం. వి. అ. పుం. బాటసారి, పథికుఁడు.

శవాశము. సం. విశే. (అ. ఆ. అ) శవములను దినునది.

శశధరము, సం. వి. అ. పుం. అరతికర్పూరము ఇట్లే శశలాంఛనము.

శశాంకము. మొ.

శశధరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

శశపుతకము. సం. వి. అ. న. ప్రేలిగోటితోఁ గీఱుట.

శశబి (వి) ందువు. సం. వి. ఉ. పుం. ౧. చంద్రుఁడు. ౨. విష్ణువు.

శశభృత్తుఁడు (త్తు) సం. వి. త్. పుం. చంద్రుఁడు.

శశ (క) ము. సం. వి. అ. పుం. కుందేలు.

శశము. సం. వి. అ. పుం. ౧. కుందేలు.

ఆ. వె. శరభసింహనాగ శార్దూల భల్లూక, హరిణకిటిశశాదులైన వెల్ల. చిత్రభా. ౩-౧౭౧

౨. చంద్రునికళంకము. ౩. లొద్రవృక్షము, లొద్దుగచెట్టు. ౪. బాలెంతబోళము.

శశలక్ష్మణుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు. ఇట్లే శశలాంఛనుఁడు. మొ.

**శశవిషాణము.** సం. వి. అ. న. కుందేటికొమ్ము ఇట్లే శశశృంగము.

గీ. గగనకుసుమంబు గొడ్రాలికన్నబిడ్డ, శశవిషాణంబు దుర్భిజజాతుఘనత పంచమకుచిత్వ మల్లని మంచితనము, గలదె నిన్నునెఱుఁగనియేమి కలికి కృష్ణ. రాధికా. ౪-౩౯.

అత్యంతాసంభవ వస్తువు. (చూ. గగనకుసుమము)

**శశస్థలి.** సం. వి. ఈ. స్త్రీ. గంగాయమునానదుల మధ్యదేశము.

**శశాంకమూర్తి.** సం. వి. ఇ. పుం. చంద్రుఁడు

**శశాంకమౌళి.** సం. వి. ఇ. పుం. చంద్రశేఖరుఁడు శివుఁడు.

**శశాంకలేఖ.** సం. వి. ఆ. స్త్రీ. చంద్రరేఖ, నెలవంక.

**శశాంకుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

ఉ. ఆపుడెఁ బాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి. మను. ౧-౫౧

**శశాద (న) ము.** సం. వి. అ. పుం. శ్యేనము, డేగ.

**శశి.** సం. వి. న్. పుం. ౧. చంద్రుఁడు. ౨. కర్పూరము.

**శశికాంతము.** సం. వి. అ. పుం. చంద్రకాంతమణి.

సీ. తతనితంబాభోగ ధవళాంశుకమ్ములో, యంగదట్టపుఁ గావిరంగువలన శశికాంతమణిపీఠి జాజావాలఁగ...... మను II-౨౩

న. కలువ.

**శశికోటి.** సం. వి. ఇ. స్త్రీ. నెలవంకకొన, చంద్రరేఖయగ్రము.

**శశిజుఁడు,** సం. వి. అ. పుం. బుధుఁడు. బుధగ్రహము.

**శశిని.** సం. వి. ఈ. స్త్రీ. చంద్రుని పదునారు కళలలో నొకటి.

**శశిపూలచందురులు.** మి. వి. బ. భూషణవిశేషము.

సీ. రతనాల కుప్పె సారపు జడకుచ్చులు శశిపూలచందురుల్ సరిగెలు. చెన్న. ౨-౨౦౪.

**శశిప్రభము.** సం. విణ. (అ. ఆ. అ) చంద్రుని కాంతివంటి కాంతిగలది.

వి. అ.న.౧. కుముదము. తెల్లకలువ. ౨. ముత్తెము

**శశిభూషణుఁడు,** సం. వి. అ. పుం. శివుఁడు.

**శశిభృత్తు.** సం. వి. త్. పుం. శివుఁడు.

**శశివకాళి.** సం. వి. ఇ. పుం. శివుఁడు.

**శశిరేఖ.** సం. వి. ఆ. స్త్రీ. చంద్రకళ

సీ. కరుణారసమువొంగి తొరఁగెడు చాడ్పునశశిరేఖ నమృతంబు జాలువాఱ. భార. విరా. I-౧౨

**శశిశేఖరుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**శశు (క) డు.** సం. వి. అ. పుం. కామశాస్త్రమందుఁజెప్పఁబడిన పురుషజాతులు నాల్గింటిలో ఒక జాతి పురుషుఁడు.

**శశోర్ణము.** సం. వి. అ. న. కుందేటి బొచ్చు.

**శశ్వత్.** సం. అవ్య. (తెనుఁగున సమాసపూర్వపదము గానే యుండును. ఉదా. శశ్వద్భ్రాంతి)

చం. శశ్వదుహవాస మహాఁవ్రతశీతపీడితాచల మునిసౌఖ్య హేతువిలస ద్భడబాగ్ని శిఖాశయంబులన్. భార. ఆది. ౨౨౭.

ఉ.......... శశ్వదుల్లాసముఖానుభూతిసచలస్థితి నొప్పునత ండు దాత్తుఁడై. భార. శర్గ. ౯౨.

౧. శాశ్వతముగా, ఎప్పటికిని ౨. మాటిమాటికిని

**శష్ప (స్ప) ము.** సం. వి. అ. పుం. ప్రతిభాక్షయము, తెలివినశించుట. న. లేతపచ్చిక, బాలతృణము.

**శష్కు (స్కు) లి.** సం. వి. ఈ. స్త్రీ.

౧. చక్కిలము. ఒకవిధమైన ఖాద్యము.

ఉ. శుష్కవచశ్శలాతతుల నూటిగఁజూచి మహా
కవి శ్రవ, శ్శష్కులికావిదారణము సల్పగ
జేర్చిన జాణలార........ నిరంకుశో. ౧-౯

గీ. ఇష్టమానసమయిన యా హోమఖగము,నలుని
మానస మానంద జలధియందు గర్ణశష్కులి
కలశంబుఁగౌఁగిలించి యీఁదశేయుచున్నను
భావ నిట్టులనిరె. శృం. నై. ౨-౭.

౨. బియ్యపుజావ. ౩. కర్ణరంధ్రము. ౪. కర్ణరోగము. ౫. ఒకజాతి చేఁప.

**శసనము.** సం. వి. అ. న. ౧. యజ్ఞమున జంతువును జంపుట ౨. హననము. చంపుట.

**శస్త్రకము.** సం. వి. అ. న. అంగుళిత్రాణము. అత్తెము. ప్రేళ్ళకుఁ దొడిగికొనెడి యినుము తోలు. మొ.

**శస్తము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. స్తోత్రము చేయబడినది. పొగడఁబడినది.

గీ. ఛందములఁ బాసి శబ్దార్థ సరణివదరి, యచ్చ
టచ్చట నష్టశబ్దాదిదోష శస్తమైన శివజ్ఞాన
పుస్తకంబు,నిందుమరి వేక్కఁ దెలుపుచుతెందు
గురుఁడు. శివధర్మోత్తరము. ౨-౮

౨. శుభముకలది, శుభమైనది. ౩. మంచిది. ఉత్తమమైనది. ౪. పలుమాఱు చదువఁబడినది. ౫. చంపఁబడినది. ౬. అపాయము గల్గింపబడినది వి. అ. న. ౧. క్షేమము. సుఖము ౨. శ్రేష్ఠత ౩. శరీరము. ౪. అంగుళి త్రాణము. అత్తెము శస్త్రకము అనికూడఁగలదు)

**శస్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. స్తుతి. పొగడ్త. ౨. మంత్రరూపమైన స్తోత్రము.

**శస్త్రకారుఁడు,** సం. వి. అ. పుం. ఆయుధములు చేయువాఁడు.

**శస్త్రకోశము.** సం. వి. అ. పుం. కత్తి ఒఱ.

**శస్త్రజీవి.** సం. వి. న. పుం. శస్త్రములచే జీవించు యోధుఁడు.

**శస్త్రధరుఁడు.** సం.వి.అ.పుం. ౧. యోధుఁడు. జోదు. ౨. ఆయుధధారి యైన మనుష్యుఁడు.

**శస్త్రన్యాసము.** సం.వి.అ.పుం. ఆయుధముల క్రిందఁ బడవేయుట. ఇట్లే శస్త్రపరిత్యాగము.

**శస్త్రపాణి.** సం. విణ. (ఇ) ౧. ఆయుధము చేతగలవాఁడు. ఆయుధము ధరించు వాఁడు. ౨. ఒక విధమగు అతతాయి. ధనాపహారి. వి. ఇ. పుం. ఆయుధధారియైన యోధుఁడు.

**శస్త్రప్రహారము.** సం. వి. అ. పుం. ఆయుధముచేఁ దగిలినదెబ్బ.

**శస్త్రమార్జుఁడు.** సం. వి. అ. పుం. ఆయుధములు బాగుచేయు శిల్పి.

**శస్త్ర (క) ము.** సం. వి. అ. న. ౧. ఆయుధము ౨. సాధనము. పనిముట్టు. ౩. ఉక్కు. ౪. స్తోత్రము. స్తోత్రరూప మంత్రము. ౫. ఆవృత్తి చేయుట. కంఠపాఠము చేయుట.

**శస్త్రవిద్య.** సం. వి. అ. స్త్రీ. ఆయుధవిద్య.

**శస్త్రవృత్తి.** సం. వి. ఇ. పుం. = శస్త్రజీవి.

**శస్త్రశాస్త్రము.** సం. వి.అ.న. ఆయుధవిద్య.

**శస్త్రసంపాతము.** సం. వి. అ. పుం. పెక్కుఆయుధము లాకస్మికముగాఁ బడుట.

**శస్త్రసంహతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఆయుధ సమూహము. ౨. ఆయుధశాల.

**శస్త్రహతుఁడు.** సం.విణ.(అ.ఆ.అ) ౧. ఆయుధముతోఁజంపఁబడిన వాఁడు. ౨. పక్షిమృగాలచేఁ జంపఁబడినవాఁడు.

శస్త్రహస్తుఁడు. సం. విణ. (అ. అ. అ) ఆయుధము చేతనున్నవాఁడు. వి. అ. పుం. ఆయుధము చేతఁ బూనిన మనుష్యుఁడు.

శస్త్రహతచతుర్దశి. సం. వి. ఈ. స్త్రీ. ఆశ్వయుజ కృష్ణచతుర్దశి.

శస్త్రాజీవుఁడు. సం. వి. అ. పుం. శస్త్రముచే జీవించువాఁడు, ఆయుధ జీవియైన యోధుఁడు.

శస్త్రాభ్యాసము. సం. వి. అ. పుం. శస్త్రప్రయోగము నేర్చుకొనుట. ఆయుధముల ప్రయోగము నేర్చుకొనుట.

శస్త్రాయసము. సం. వి. అ. న. ౧. ఉక్కు. ౨. ఇనుము.

శస్త్రి. సం. విణ. (న్. నీ. న్. ఆయుధములు ధరించినవాఁడు. వి. ఈ. స్త్రీ. ఛురిక. చిన్న కత్తి.

శస్త్రిక. సం. వి. అ. స్త్రీ. చిన్నకత్తి. ఛురిక.

సీ. తామిస్ర శస్త్రిఁ గుందనిసామి విరహిహృ
త్కృణదారయుతమారశస్త్రినొదుగు.
చంద్రికా. ౪-౭.

శస్త్రోద్యమము. సం. వి. అ. పుం. (కొట్టుటకు) ఆయుధ మెత్తుట.

శస్త్రోపకరణము. సం. వి. అ. న. యుద్ధసాధనము ఆయుధ సామగ్రి.

శస్త్రోపజీవి. సం. వి. న్. పుం. = శస్త్రాజీవుఁడు.

శస్యము. సం. విణ. (అ. అ. అ) ౧. శ్రేష్ఠమైనది. ఉత్తమమయినది. ౨. శ్లాఘ్యమైనది, కొనియాడఁదగినది.

క. యమనియమాద్యష్టాంగ, క్రమాభ్యసన నిర్మ
థిత వికారునిచేతః కమలామోదమయాత్మా,
సమతారాహిత్యశస్యసర్వ నమస్యా భార.
శాంతి.౨-౪౪౮

వి. అ. న. సుగుణము.

# శా

శా. ఒక యక్షరము.

శాంకరము. సం. విణ. (అ. ఈ. అ) శంకరుని సంబంధమైనది. శివసంబంధి. వి. అ. పుం. వృషభము, ఎద్దు.

శాంకరి. సం.విణ.పుం. ౧. గణపతి. ౨. కుమారస్వామి. ౩. అగ్ని. సం. వి. ఈ. స్త్రీ. పార్వతి.

శాంఖము. సం. విణ. (అ. ఈ. అ) ౧. శంఖ సంబంధమైనది. ౨. శంఖవికారమైనది. శంఖముతోఁ జేసినది. వి. అ. పుం. శంఖధ్వని.

శాంఖికుఁడు. సం. వి. అ. పుం. ౧. శంఖపు బనిచేయు జాతివాఁడు.

౨. శంఖ మూఁదు వాఁడు.

శాండిల్యము. సం. వి. అ. పుం. ౧. మారేడు చెట్టు. ౨. అగ్నిభేదము. ఒకానొక యగ్ని.

శాండిల్యుఁడు. సం. వి. అ. పుం. గోత్రప్రవర్తకుఁడును, ధర్మశాస్త్రకర్తయు నైన యొక ముని.

శాంత. సం. వి. అ. స్త్రీ. ౧. దశరథుని కూతుఁరు.

౨. ఒక జాతి జమ్మి.

శాంతనవుఁడు. సం. వి. అ. పుం. శంతను పుత్త్రుఁడు. భీష్ముఁడు,

శాంతము. సం. విణ. (అ. ఆ. అ) ౧. ఉపశమించినది, తగ్గినది. ఆఁకలి మొ॥ తీఱినది. ౨. కుదిరినది, మానినది. ౩. అణఁగినది. అంతమొందినది. ఆగిపోయినది. దీపము మొ॥ ౪. ఆటంక పఱుపఁ బడినది. ఆఁపఁబడినది. ౫. మరణించినది, మృతినొందినది. ౬. అణఁపఁ బడినది. నిశ్చలముగాఁ జేయఁబడినది. ౭. నెమ్మది గలది, కామాదివికారములక్షోభ లేనిది. ౮. మచ్చిక చేయఁ బడినది, ౯. తృప్తి గలది. ౧౦. నీడగలది. ౧౧. మెల్లనిది, మందమైనది. ౧౨. పవి

త్రమైనది. ౧౩. వినయముగలది. ౧౪. (నాటక పరిభాషయందు) (శాంతపాపమే) మొ॥ స్థలమున అమంగళపరిహారార్థ ముపయుక్తమగునది. వి. అ. పుం. ౧. శాంతి, నెమ్మది. ౨. నిర్వేదము (శమము) స్థాయిభావముగా గల రసవిశేషము.

న. ఉపశమించుట, తగ్గుట.

**శాంతాత్ముఁడు.** సం. విణ. వ. శాంతమైన మనస్సుకలవాఁడు. స్వస్థచిత్తుఁడు. ఇట్లే శాంతచేతస్కుఁడు. మొ.

**శాంతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. కామక్రోధాదుల నణఁగించుట. ౨. విషయసుఖములందు సంపూర్ణమైన విరక్తి. ౩. ఉపద్రవములను దొలఁగించుట ౪. మనస్తృప్తి. ౬. గోచారాదులచే సూచితమైన యైహికానిష్టములగు పాపములను బోఁగొట్టుకొనుటకుఁ జేయుజపహోమాదికర్మము. ౭. అఁకలిశమింపఁజేయుట ౮. దుర్గ. ౯. ఉపశమనము. తగ్గుట. (ఉదా. రోగశాంతి) ౧౦. సౌభాగ్యము. ౧౧. సుఖము. ౧౨. జ్ఞానేంద్రియ నిగ్రహము. ౧౩. ఉ. ఇందఱుఁగూడిశాంతి సలియింపరేదు...... భీమ. ౨-౧౩౧.

సీ. శాంతి బుద్ధీంద్రియసన్నివారణశాంతి, కర్మేంద్రియముల యోగ్యప్రవృత్తి. భార. అను ౪-౧౮౧. (బుద్ధీంద్రియములు = జ్ఞానేంద్రియములు; త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు) ౧౩. శాంతి పాఠము.

**శాంతించు.** సం. అ. క్రి. శమించు, తగ్గిపోవు.

గీ. తపమునకు విఘ్నకరియంచుఁదలఁగఁదన్ను డోలయు వస్త్రావధూటి పయోధరముల, వేయిరకముల, నింపెనశ్వేదబలమున నపుడ, శాంతించె నతని మహాతపంబు (శాంతించెన్ = నశించెననియుధ్వని.శ. శకుం.౧-౩౯

**శాంతికము.** సం. విణ. (అ.ఈ.అ) ౧. పాపము పోఁగొట్టునది; గోచారాదులచే సూచితమైన యాపదను బోఁగొట్టుకొనుటకుఁ జేయఁబడెడి కర్మము.

వ. శివభుజవచనప్రతీకారార్థంబు శాంతిక పౌష్టిక క్రియలు నిర్వర్తింప......భార ఆది. I ౮౩

**శాంతిగృహము.** సం. వి. అ. న. విశ్రాంతికొఱకైనయిల్లు, తెలివిగాఁ గూర్చుండుట కేర్పడిన గృహము.

**శాంతిజలము.** సం. వి. అ. న. గోచారాదులచే సూచితమైన యనర్థమును బోఁగొట్టుటకై చేయఁబడిన శాంతికర్మమునందు మంత్రములచేఁబవిత్రితమై పాపములను (అనర్థములను) దొలఁగించు నీరు. ఇట్లే శాంత్యుదకము మొ.

**శాంతిహోమము.** సం. వి. అ. పుం. అనర్థములు (ఆపదలు) తొలఁగుటకై చేయుహోమము.

**శాంబరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. మాయ, గారడి.

పీ. తత్ప్రవరదేవాసమిద్ధశిఖదీప్తి శాంబరీమహిమ చే సంగ్రహించి. మను. IV-3

సీ..... శాంబరీ చంగ భుజంగకృత్యవివేకపుంజ భూరుహవల్లి లంజతల్లి. విరంచి ౨-౪౧

ఉ....కిరీటిఁబాశుపతదివ్యశరాధ్యునిఁజేయుశాంబరీ భిల్లుఁడు కృష్ణరాయల కభీష్టశుభప్రతిపాది గావుతన్. మనుచ.

౨. గారడిచేయు స్త్రీ, మాయచేయు వాఁడుది.

**శాంబావకుఁడు.** సం. వి. అ. పుం. శంఖముల వ్యాపారము చేయుపురుషుఁడు.

**శాంబు (బూ) కము.** సం. వి. అ. పుం. ఆలిచిప్ప; కప్పచిప్ప.

**శాంభవము.** సం. విణ. అ. ఈ. అ) శంభుని (శివుని) సంబంధమైనది. వి. అ. పుం. ౧. కర్పూగము. ౨. గుగ్గిలము. (వాచ) ౩. ఒక జాతి విషము. ౪. దేవదారువృక్షము.

**శాంభవి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పార్వతి. ౨. నీలదూర్వ, నల్లగఱిక ; ౩. ముద్రావిశేషము.

శాంబరీ ఘుద్ర. ప్రాణముపోవుటకు. ద్వారమైన బ్రహ్మరంధ్రము.

శాంభవుఁడు. సం. వి. అ. పుం. ౧. శివోపాసకుఁడు, శివభక్తుఁడు. ౨. శివపుత్రుఁడు.

శాకంభరి. సం. వి. ఇ. స్త్రీ. ౧. దుర్గాదేవి. (సాముదేశమండలి) ఒక పట్టణము.

శాకచుక్రిక. సం. వి. ఆ. స్త్రీ. చింతపండు.

శాకటము. సం. విణ. (అ. ఈ. అ) ౧. శకటసంబంధి, బండి సంబంధమైనది. ౨. బండిలోఁ బోవునది. వి. అ. పుం. ౧. బండిలాగెడి యెద్దు ౨. శ్లేష్మాతకవృక్షము. న. ౧. పొలము, క్షేత్రము.

శాకటాయనుఁడు. సం. వి. అ. పుం. యాస్కపాణినులు ప్రామాణికునిగా గ్రహించిన యొకానొక శబ్దశాస్త్ర శబ్దవ్యుత్పత్తి శాస్త్రవేత్త. (శబ్దవ్యుత్పత్తి శాస్త్రమును వ్యాకరణమును తెలిసిన యొక ఋషి)

శాకటికుఁడు. సం. విణ. (అ. ఈ. అ) ౧. శకటసంబంధి, బండికి సంబంధించినవాఁడు. ౨. బండిలోఁ బోవువాఁడు.

శాకటీనము. సం. వి. అ. పుం. బండిబరువు. (బండెడుబరువు)

శాకతరువు. సం. వి. ఉ. పుం. టేకుచెట్టు.

శాకపణము. సం. వి. అ. పుం. ౧. పిడికెఁడు పరిమాణము. ౨. పిడికెఁడు కూరాకు.

శాకపత్రము. సం.వి.అ.పుం, శిగ్రువు. మునగ †

శాకము. సం. వి. అ. పుం. న. ౧. కూర. ఆకుకూర, తోటకూర. మొ.

ద్వి. ఒసపరి చిగురాకు టొగరు శాకముల రసరాటలి సరాగ ప్రసాదమొసఁగఁగోయిల జవరాలు క్రొవ్విఁ కీతి వాయెత్తి యా కీరవాణి యొద్చుటయు. పరమ. 3. ప్రుట ౧-33

౨. కూరగా నుపయోగించు కాయ, దుంప, పండు మొ. పుం. ౧. బలము, శక్తి. ౨. టేకుచెట్టు. 3. శిరీషవృక్షము, ౪. దిరిసెన చెట్టు.

సీ. శాకవృక్షమునీడఁ జలుప్రక్రీడ. శృం. నై. ౫-౪౫.

౫. శకము కాలభేదము. (శాలివాహనుని కాలము) ౬. ఆఱవద్వీపము.

శాకయోగ్యము. సం. వి. అ. పుం. కొత్తిమిరి, కుస్తుంబరి.

శాకలము. సం. విణ. (అ. ఈ. అ) శకలమునకు (ముక్కకు) సంబంధించినది. వి. అ. పుం. ఋగ్వేదములోని యొకభాగము.

శాకలశాఖ. సం. వి. ఆ. స్త్రీ. శాకలులు పరంపరగాఁ బఠించు ఋగ్వేదభాగము.

శాకలికము. సం. విణ. (అ. ఈ. అ. శకల (ముక్క) సంబంధమైనది.

శాకలులు. సం. వి. అ. పుం. బ. శకలముని ప్రోక్తమయిన కల్పాది గ్రంథములను వంశపారంపర్యముగఁ బఠించువారు.

శాకశాకటము. సం. వి. అ. న. కూరలదొడ్డి, కూరదినుసులు పైరుపెట్టుపొలము. ఇట్లే శాకశాకినము.

శాకాంగము. సం. వి. అ. న. మిరియము.

శాకామ్లభేదనము. సం. వి. అ. న. ఎఱ్ఱగోఁగు కూర † (చుక్రము. † వాచు)

శాకామ్లము. సం. వి. అ. న. మారేడుపండు.

శాకాహారుఁడు. సం.విణ.(అ. ఆ. అ) కూరలు మాత్రము తినువాఁడు వ్యతి. మాంసాహారుఁడు

శా. శాకాహారులు కందమూలురు శిలోంఛవ్రతక్రముల్ తాపసీ. కాశీ.

శా. శాకాహారుఁడు నిర్జితేంద్రియుఁడు పాషాణాగ్రకల్పుండునై. హర. ౨-౩.

**శాకినము.** సం. వి. అ. న. పొలము, క్షేత్రము చూ. శాకశాకినము.

**శాకిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కూరలు పైరు పెట్టుపొలము.

సీ. శాకినీమూలకచ్ఛత్రశాకసారణీ ధాన్యాకమేఘ
వాదములలోఁద భీమ. ౨-౫౬.

౨. (యక్షిణి యని చెప్పఁబడు) దుర్గాపరిచారిక. 3. దుర్గాదేవి.

**శాకుంతలము.** సం. వి. అ. న. కాళిదాసవిరచితమైన యభిజ్ఞాన శాకుంతల మనెడినాటకము.

**శాకుంతలేయుఁడు.** సం. వి. అ. పుం. శకుంతలాపుత్త్రుఁను, భరతుఁడు. ఇట్లే శాకుంతలుఁడు.

**శాకునుఁడు.** సం. విశ. (అ. ఈ. అ) ౧. ఇతరులను బాధపెట్టెడివాఁడు, పరతాపకుఁడు.

**శాకునము.** సం. విశ. (అ. ఈ. అ) ౧. పక్షుల సంబంధమైనది. ౨. శకునసంబంధమైనది. 3. రాఁబోవు శుభాశుభములను సూచించునది.

**శాకునికము.** సం. వి. అ. న. శకునముల ఫలములను దెలుపుట.

**శాకునికుఁడు.** సం. వి. అ. పుం. ౧. పక్షులను వేఁటాడు వాఁడు. పిట్టలను బట్టుకొనెడివాఁడు. ౨. శకున శాస్త్రపండితుఁడు.

కం. అని నియమంబున హితశాకునిక స్వరశాస్త్ర
వేదులోపదయుతుఁడై. సింహాసన
ధా. ౧. ఆ. ౨-౧౦౫

**శాకునేయము.** సం. వి. అ. పుం. చిన్నగుడ్లగూబ.

**శాకులికుఁడు.** సం. వి. అ. పుం. చేఁపలఁబట్టువాఁడు.

**శాక్కరము.** సం. వి. అ. పుం. వృషభము, ఎద్దు.

**శాక్తము.** సం. విశ. (అ. ఈ. అ) ౧. శక్తి-(బలము) సంబంధమైనది.

౨. శక్తి-(దుర్గాదేవి) సంబంధమైనది.

**శాక్తికుఁడు.** సం. వి. అ. పుం. ౧. శక్తి (దుర్గ)ని పూజకుఁడు, శక్త్యుపాసకుఁడు. ౨. ఈఁటెపట్టి పోరాడు యోధుఁడు.

**శాక్తీకుఁడు.** సం. వి. అ. పుం. ఈఁటె పట్టి పోరాడు యోధుఁడు.

**శాక్తుఁడు.** సం. వి. అ. పుం. శక్తి (దేవత) నిఁబూజించు వాఁడు, దుర్గాదేవతోపాసకుఁడు.

**శాక్తేయుఁడు.** సం. వి. అ. పుం. ౧. శక్త్యుపాసకుఁడు, శాక్తుఁడు. ౨. పరాశరుఁడు, శక్తిపుత్త్రుఁడు. రూపాం. శాక్త్యుఁడు.

**శాక్యము.** సం. వి. అ. పుం. బుద్ధునివంశము.

**శాక్యముని.** సం. వి. ఇ. పుం. బుద్ధుఁడు.

**శాక్యసింహుఁడు.** సం. వి. అ. పుం. బుద్ధుఁడు.

**శాక్యుఁడు.** సం. వి. అ. పుం. బుద్ధుఁడు.

**శాక్రి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. శక్రునిభార్య, శచి. ౨. దుర్గ.

**శాక్వరము.** సం. వి. అ. పుం. వృషభము. ఎద్దు.

**శాఖ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. (చెట్టు) కొమ్మ. ౨. బాహువు. 3. భాగము. ౪. గ్రంథములో నొకభాగము. ౫. తెగ, జాతి, సమానధర్మమునసుసరించు జనబృందము. ౬. పరంపరగాఁ గొందఱిచే ననుసరింపఁబడిన వేదభాగము. (శాఖలశాఖ ఆశ్వలాయనశాఖ)

క. శాఖ దిగవిడచి శాంబర, శాఖ స్వర్తించె నేని
సద్విజుఁడైనన్ శాఖారణ్యుఁడు వాఁడే.
శాఖను బాహ్యుఁడనియం(డ్రు)సన్మనులెల్లన్.
విజ్ఞా. కాం. ౧-౭.

**శాఖలువాఱు.** మి.అ.క్రి. (శాఖలు + పాఱు) కొమ్మలుసాగు, వ్యాపించు; విస్తరిల్లు.

చ.......సంజనిత తతూహాలాంతరము శాఖలు
వాలఁగవచ్చుచున్న యమ్మునికులసార్వభౌ
ముని ముముక్షువరేణ్యు మహానుభావునిన్.
విప్ర. 3-౫.

శాఖాచంక్రమణము. సం. వి. అ. న. ఒక కొమ్మనుండి మఱియొక కొమ్మపైకి దుముకుట; కావలసిన విషయమును వదలి యితర విషయములను గూర్చి సంభాషించుట.

శాఖానగరము. సం. వి. అ. న. ఉపనగరము. పట్టణములోఁ జేరియున్న పేఁట.

సీ.................
............ వజ్రపురము.

గీ. ప్రాంతమునను శాఖా నగరములయందు విరివి
చూపట్టమేళంబువిడిసివిడిసి. ప్రభాకర౪-౯౨

ఇట్లే శాఖాపురము నెు.

శాఖాపిత్తము. సం.వి.అ.పుం. రోగవిశేషము. కాళ్ళు చేతులు మున్నగు శరీరభాగములు మండుట.

శాఖామృగము. సం. వి. అ. పుం. ౧. క్రోఁతి ౨. ఉడుత.

శాఖారండుఁడు. సం. వి. అ. పుం. స్వశాఖా ద్రోహి. వంశపరంపరాగతమైన తన వేద శాఖను విడిచి యితర శాఖయందుఁ జెప్పబడిన కర్మముల నాచరించువాఁడు.

శాఖారథ్య. సం. వి. ఆ. స్త్రీ. పెద్దబాటకు సంబంధించిన యొక చిన్న బాట, ఉపరథ్య.

శాఖాలము. సం. వి. అ. పుం. వానీరము, నీరుప్రబ్బలి ?

శాఖాశిఫ. సం. వి. ఆ. స్త్రీ. ౧. మఱ్ఱి మొదలగు చెట్ల యూడ. ౨. ఊడలవంటి యవయవములు గల తిప్పతీఁగ నెు. తీఁగ.

శాఖి. సం.విణ. (న.స్త్రీ.న) ౧. శాఖలు గలది.
వి. న. పుం. ౧. వృక్షము, చెట్టు.

గీ. శాఖఁగదవయ్యయర్థార్థికల్పశాఖి.
ధ్యాం. సై. ౧-౧౦౯.

౨. వేదము. 3. వేదసంబంధమైన యొక శాఖ ననుసరించు ద్విజుఁడు. ౪. మ్లేచ్ఛభేదము, ఒక జాతి మ్లేచ్ఛుఁడు.

శాఖుఁడు. సం. వి. అ. పుం. ౧. కుమారస్వామి యనుచరులలో నొకఁడు. ౨. రాహువు.

శాఖోపశాఖలు. సం.వి.ఆ.స్త్రీ.బ. కొమ్మలు రెమ్మలు, అసంఖ్యాతములు, పెక్కులు.

వ. లక్షోపలక్షలు కోటానకోట్లు తండోప తండంబులు పుంఖానుపుంఖంబులు శాఖోప శాఖలు నేల యీని నటుల. ప్రబంధ. ౬-౭౭.

శాట (క) ము. సం. వి. అ. పుం. న. ౧. బట్ట వస్త్రము. ౨. పావడము, పరికిణి.

శాటి. సం. వి. ఈ. స్త్రీ = శాటము.

చ. తలుకు దుకూలశాటిఁ గటిఁ దాల్చి పటీర మలంది........ మనుచ. ౫-౮౩.

గీ. చండ మార్తాండ కిరణంపు శాటి మాట
వాల్మీకి. ౨.

శాట్యాయనము. సం. వి. అ. న. ఒకహోమ కర్మమునఁగలిగిన వైగుణ్యమును జక్కఁజేయుటకు విహితమైన హోమము. ప్రాయశ్చిత్తార్థహోమము.

శాఠ్యము. సం.వి.అ-న. ౧. కపటము, మోసము. చెడ్డతనము. ౨. ఛలోక్తి.

శాణము. సం. విణ. (అ. ఈ. అ) జనపనార సంబంధమైనది, జనప నారతో చేసినది.

వి. అ. పుం. ఒరగల్లు, గీటురాయి. ౨. అస్త్రాదులు పదును పెట్టురాయి. 3. రంపము. ౪. నాలుగు మాషముల పరిమాణము. న. ౧. ముతుక బట్ట. ౨. గోనెపట్ట.

శాణాజీవుఁడు. సం. వి. అ. పుం. ఆయుధములకు పదును పెట్టు పనివలన జీవించువాఁడు.

**శాణి.** సం. వి. ఇ. పుం. ఒకానొక తూకము. (దీని నారతో ముదుకబట్టలు నేయుదురు)

ఈ. స్త్రీ. ౧. ఒరగల్లు. గీటురాయి. ౨. అస్త్రములు పదును పెట్టెడి రాయి, కత్తులు నూరెడి రాయి ౩. జంపము. ౪. నారబట్ట, ౫. చినిగినబట్ట. ౬. చిన్న తెర; చిన్న గుడారము. ౭. అభినయవిశేషము.

**శాణితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. పదను పెట్టఁబడినది. ౨. నూరఁబడినది.

**శాణీరము.** సం. వి. అ. న. శోణానదీ తీరము.

**శాతకుం(కౌం)భము.** సం.వి.అ.న. ౧. బంగారము.

ఉ. భ్రాజిత శాతకుంభగృహపంక్తులఁ బుష్పిత వల్లి వేల్లితోర్వీజవనావృతిన్.
భార. ఆది. ౮-౧౭

౨. ఉమ్మెత్తచెట్టు. ౩. గన్నేరుచెట్టు.

**శాతనము.** సం. వి. అ. న. ౧. పదను పెట్టుట. వాఁడిచేయుట. ౨. భేదించుట, నశింపజేయుట ౩. పడగొట్టుట. ౪. క్షీణింపజేయుట. ౫. గిల్లుట ౬. వాడుట, మ్లానమగుట.

**శాతపత్త్రకము.** సం. వి. అ. పుం. వెన్నెల, చంద్రాతపము.

**శాతపత్త్రకి.** సం.వి.ఈ. స్త్రీ. చంద్రిక, వెన్నెల

**శాతభీరువు.** సం. వి. ఉ. పుం. మల్లికాభేదము, ఒక జాతిమల్లె

**శాతమన్యవము.** సం. విశే. (అ. ఆ. అ) ఇంద్ర సంబంధమైనది.

వ. మఱియు నప్పట్టణంబు పెట్టనంబునంగను పట్టు వజ్రవైడూర్య కురువిందమరకత పద్మరాగ శాతమన్యవ శిలాజాల ప్రవాళపుష్యరాగముక్తావితానప్రముఖచిరత్నరత్నఖచిత.
శివధర్మ ౩-౭౫

**శాతమానము.** సం. విశే. (అ. ఈ. అ) నూటిచేఁ గొనఁబడినది. శతక్రీతము.

**శాతము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. పదను పెట్టఁబడినది. వాడియైనది.

క. శాతాసి చాపధరుఁడవు, ఖ్యాతవిక్రమ యాప్త బంధుఁ డరుదెంచి బల, వ్రాతముల పైకి తేకి
జైమిని. ౬-౧౪౯.

౨. సన్నగిల్లినది ౩. దుర్బలమైనది. ౪. అందమైనది. సుందరమైనది. ౫. ఖండింపఁబడినది. నఱకఁబడినది. ౬. సుఖముగలది. వి. అ. పుం. ౧. ఉమ్మెత్తచెట్టు. ౨. న. సంతోషము, సుఖము.

**శాతోదరి.** సం. వి. ఈ. స్త్రీ. సన్నని నడుము గల స్త్రీ.

మ. సమపీనస్తని స్వస్తివాస్తివిచికిత్సాహేతు శాతోదరన్.
శృం నై. ౨-౨౧.

**శాత్రవము.** సం. విశే. (అ. ఈ. అ) ౧. శత్రువునకు సంబంధించినది. ౨. శత్రుత్వము గలది.

వి. అ. న. ౧. శత్రుసంఘము. ౨. శత్రుత్వము, పగ, విరోధము.

చం. బాంధవ శాత్రవాకలితభావభవా ! ....
భార. విరా. ౧-౩౩౩

క. మైత్రీసౌఖ్యముఁ బోలునె శాత్రవమెమ్మెయిఁ దలంప శత్రుశ్రీకిం బాత్రమవై యింపుగఁ దన్మిత్రుఁడవగు మిదియ మేలు మీ యిద్దఱకున్
భార. ఉద్యో. ౧-౧౩౮.

**శాత్రవీయము.** సం. విశే. (అ. ఈ. అ) ౧ శత్రువుసంబంధమైనది. ౨. శత్రుత్వము గలది.

**శాత్రవుఁడు.** సం.వి.అ.పుం. శత్రువు, పగవాఁడు

చం. తనయుఁడు గాఁడు శాత్రవుఁడు జూన ధర్మజు వీఁడు........
భార. ౨-౧౫౬

**శాదము.** సం. వి. అ. పుం. ౧. లేఁతగడ్డి ౨. కర్దమము, బురద.

ఆ. వె. ఉద్ధరింపఁజాలి సద్ధర్మగతిఁజాపు, శాద
మగ్నులైన సౌరభేయి. ధర్మఖం. ౧-౧౪౯.

గీ. అలరుఁదేనియ శానిచిమొలక గట్టి, శర్కరా
బీజములు సుధాశాదభూమి భావజుఁడు విత్త
మొలచిన పైరుపెంపె, రదవిలాసంబు పూఁ
బోఁడి పెదవిపదవి. పాండు. ౩-౧౯౧.

**శాద్వలము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. పచ్చిక
గలది. ౨. లేఁతగడ్డితో నిండినది. ౩. ఆకుపచ్చ
నిది.

వి. అ. పుం. న. ౧. పచ్చికబయలు.

సీ. వనకుంజమధ్యశాద్వలచరన్మృగపంక్తిదావ
పావకభీతిఁ దల్లడిల్ల. మను. ౩-౧౧.

**శానము.** సం. వి. అ. పుం. ౧. ఒరగల్లు.
గీటుఱాయి. ౨. సానఱాయి అస్త్రములు
పదును పెట్టెడిఱాయి.

**శాపటి (ఠి) కము.** సం. వి. అ. పుం. నెమిలి.

**శాపనివృత్తి.** సం.వి.ఇ.స్త్రీ.శాపముతొలఁగుట.

**శాపము.** సం. వి. అ. పుం. ౧. శపించుట,
ఆక్రోశము, తిట్టు. ౨. ఒట్టు, శపథము. ౩. నింద,
దూఱు ౪. బహిష్కారము, వెలివెట్టుట.

**శాపాస్త్రుఁడు.** సం. వి. అ. పుం. శాపము ఆయు
ధముగాఁగలవాఁడు. ముని, ఋషి. ఇట్లే శాపా
యుధుఁడు మొ॥

**శాపించే.** సం. స. క్రి. శపించే, తిట్టు, చెడుగు
గాక యని పలుకు.

క. కోపంబున జలములు గొని, శాపంబీఁదలఁచి
యున్నసమయంబునవా, భూపాలుని వారించెను,
శాపింపకయుండ నతని పతికాంతిమతిన్. బ్రహ్మో
బ్రహ్మో ౨-౧౪.

ద్వి. ఇటువెయ్యిన్నోయంగ నీకయుండినను గట
కటా శాపించెఁగాక యత్తపని, శాద విట్టక
విఱ్ఱుగాఁబనుల్పుచ్చుచా. బస. పు. ౯-౫౪౯ పం

**శాపితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. శపింప
బడినది, తిట్టఁబడినది. ౨. ఒట్టుపెట్టఁబడినది.
౩. శపథము చేయఁబడినది.

**శాపోత్సర్గము.** సం.వి.అ. పుం. శాపమిచ్చుట

**శాఫరికుఁడు.** సం.వి.అ.పుం.చేఁపలఁబట్టువాఁడు.

**శాబ (క) ము.** సం. వి. అ. పుం. పశుపక్ష్యాదు
లపిల్ల. ఉదా॥ మృగశాబకము, పక్షిశాబకము. మొ॥

సీ. చన్నుమానిన యట్టి శాబకశ్రేణిపై. భాగ.
౧౦-౫౭౭.

**శాబరభేదా (క్ష) ఖ్యము.** సం. వి. అ. న.
తామ్రము, రాగి.

**శాబ (వ) రము.** సం.విణ.(అ.ఈ.అ)౧. అడవి
జాతులవారి సంబంధమైనది, శబరసంబంధమైనది
మోసైనది. ౨. నీచమైనది. అల్పమైనది.

వి. అ. పుం. అపరాధము, తప్పు. ౨. పాపము,
దుష్టత్వము. ౩. లొద్దుగుచెట్టు. ౪. శబరస్వామి
రచించిన మీమాంసాభాష్యము.

**శాబరి.** సం. వి. ఈ. స్త్రీ. అడవి జాతులవారు
మాటాడెడి ప్రాకృతభాష, అపభ్రంశము.

**శాబాసు.** వి. షేబాసునకప భ్రంశ రూపము)
ప్రశంసార్థకము.

శా. మ, ఝ్జారే లీనము బాఁగురే స్ఫురితమున్
శాబాసు భళంచు.........చంద్ర. ౧-౧౭౭.

**శాబ్దబోధము.** సం. వి. అ. పుం. పదార్థస్మృతి
ద్వారమున శబ్దజన్యమగు అన్వయజ్ఞానము.

**శాబ్దము.** సం. విణ.(అ. ఈ. అ)౧. శబ్దసంబంధ
మైనది, శబ్దమునుండి పుట్టినది. ౨. ధ్వనిసం
బంధమైనది, ధ్వని ననుసరించి యుండునది.
౩. వాఙ్మాత్రమైనది, నోటితోఁజెప్పినది. ౪. ధ్వని
గలది, మ్రోగునది.

**శాబ్ది.** సం. వి. ఈ. స్త్రీ. సరస్వతి. వాగ్దేవత.

**శాబ్దికము.** సం. విణ. (అ. ఈ. అ) శబ్ద సంబంధమైనది, వాగ్రూపమైనది. ౨. ధ్వని సంబంధమైనది. ౩. ధ్వనిచేయునది.

**శాబ్దికుఁడు.** సం.వి.అ. పుం. వైయాకరణుఁడు, శబ్దశాస్త్రవేత్త. ఇక్షే శాబ్దుఁడు.

**శామనము.** సం. వి. అ. న. ౧. చంపుట. ౨. మనశ్శాంతి, నెమ్మది. ౩. సమాప్తి, ముగింపు

**శామని.** సం. వి. ఈ. స్త్రీ. దక్షిణదిక్కు.

**శామిత్రము.** సం. వి. అ. న. ౧. శమితయొక్క కర్మము. యజ్ఞమునఁ బశువును వధించుట ౨. యజ్ఞార్థము పశువును యూపస్తంభమునకుఁ గట్టుట. ౩. యజ్ఞము ౪. యజ్ఞపాత్రము (అ.ని)

**శామిలి.** సం. వి. ఈ. స్త్రీ. స్రుక్కు, హోమము చేయుట కుపయోగించు గరిఁటెవంటి పాత్రము.

**శామీనము.** సం. వి. అ. న. భస్మము, బూది, శామిలి.

**శామీని.** సం. వి. ఈ. స్త్రీ. స్రుక్కు, యజ్ఞ పాత్ర విశేషము.

**శామీలము.** సం. వి. అ. న. భస్మము, బూది.

**శామీలి.** సం. వి. ఈ. స్త్రీ. జపమాల, అక్ష సూత్రము.

**శాయము.** సం. వి. అ. పుం. పరుండుట, శయనించుట.

**శాయి.** వి. (హిం. స్యా. హి) సిరా, మషీరసము.

తే. రసికుఁడైవట్టి కాలంపు రక్తసాను తనరు బ్రహ్మాండమను పెద్దదవతిలోన శాయి నిండారఁబోసిన చందమునను గాఢతిమిరంపు గుంపు సొంపారఁబర్వె. హంస. ౧-౧౪౧.

సం. విణ. (న్. నీ, న్) పరుండువాఁడు, శయనించువాఁడు.

మాలిని. ఉరగశయన శాయీ యోగ్యవిఖ్యాత పాయీ. సింహ. భా.౧. అ. ౨-౧౭౩.

చ:. దుష్టహతమూర్తికిన్ జలధశాయికిఁబాయక శయ్యయైశయయ్యహిపతి భార. ఆది ౧-౧౦౫.

**శాయిక.** సం. వి. ఆ. స్త్రీ. విశ్రాంతి; నిద్ర.

**శారద.** సం.వి.ఆ. స్త్రీ. ౧.ఒకజాతివీణ. ౨.సరస్వతి లోకైక కుటుంబిని శారద యాశశిబింబాస్య నాళినక్షత లిడియెన్. శృం. నై. ౫-౧౭. ౩. దుర్గ. ౪. సుగంధ. [illegible] ౫. బ్రాహ్మి [illegible]

**శారదము.** సం. విణ. అ. ఈ. అ. శరదృతు సంబంధి, శరత్కాలమందైనది.

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహార పంక్తులం జారుతరంబు లయ్యె. భార. అర. ౪-౧౪౨.

౨. ప్రతిసంవత్సరమున నుండునది. ౩. క్రొత్తది, నవీనము. ౪. చిన్నది. ౫. లేఁతది. ౬. వినయము గలది, లజ్జగలది. ౭. పిఱికిది, ధైర్యములేనిది.

వి. అ. పుం. ౧. సంవత్సరము. ౨. శరత్కాలమునందుఁబుట్టుజబ్బు. ౩. శరత్కాలపుటెండ ౪. ఒక దినుసు సీమచిక్కుడు. ౫. వకులవృక్షము, పొగడచెట్టు. ౬. ఎఱ్ఱు. ౭. పచ్చిపెసరు [illegible] న. ౧. ధాన్యము, వ. ౨. తెల్లతామర.

**శారది.** సం. వి. ఈ. స్త్రీ. కార్తికశుక్లపూర్ణిమ ౨. ఏడాకులయరఁటి [illegible] సప్తపర్ణము. ౩. నీరు పిప్పలి [illegible]

**శారదికము.** సం. వి. అ. పుం. ౧. శరత్కాలమునఁబుట్టురోగము. ౨. శరత్కాలపుటెండ. న. ప్రతి సంవత్సరమునఁబెట్టవలసిన శ్రాద్ధము. ఆబ్దికము.

**శారదీయము.** సం.విణ. (అ.ఆ.అ) శరత్కాలమందుండునది, శరత్కాలభవము.

**శారము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. పొడలు గలది. చిత్రవర్ణముగలది. ౨. ఆకుపచ్చని రంగు గలది.

వి. అ. పుం. ౧. విచిత్రవర్ణము. ౨. పసుపు పచ్చనిరంగు. ౩. గాలి, వాయువు. ౪. సోగటాల పాళిలోని గడులలో నడపెడిసారె, జూదపుసారె, ౫. ఉపద్రవము, హాని, కీడు.

**శారి.** సం.వి.ఈ.స్త్రీ.౧.ఒకజాతిపక్షి.గోరువంక.

రగడ......జాలగుతేఁటుల ఝుంకారంబులు, బిల్హ. ౨-౨౯.

౨. దర్భగడ్డి ।

**శారిక.** సం. వి. అ. స్త్రీ. ౧. ఒక జాతిపక్షి, గోరువంక.

తే. గీ. సారికా కీర పరభృత చంచరీక, కలిత కలకల నినదసంకలిత.... బిల్హ. ౨-౪౩.

౨. ఫిడేలు సారంగి మొదలగు సంగీతసాధనములు వాయించెడివింటివంటియొక్క పనిముట్టు,కమాను. ౩. జూదపుసారె,సోగటాల పాళిలో గడులలో నడపెడు కాయ.

**శారి.** సం. వి. ఇ. పుం. ౧. సారె. చదరంగపు బొమ్మ (లేక) కాయ. ౨. గుండ్రని చిన్న బంతి. ౩. ఒకజాతిపాచిక. స్త్రీ .౧. సారెకయనెడి పక్షి. ౨. మోసము, వంచన ౩. ఏనుఁగుల మీఁద జారవేసెడి జూలు గుడ్డ.

**శారిపట్టము.** సం. వి. అ. పుం. నెత్తపలక, సోగటాల పాళికై గడులుగీచి రంగువేసిన గుడ్డ.

**శారిఫల(క)ము.** సం. వి. అ. పుం. న. నెత్త పలక; జూదము, సోగటాలు, చదరంగము ఆడుటకుపయోగించు గడులు గీచినబల్ల.

**శారీరకము.** సం. విణ. (అ. ఈ. అ) ౧. శరీర సంబంధమైనది. ౨. శరీరము ధరించినది.

వి. అ. న. ౧. శరీరము ధరించిన బ్రహ్మము (జీవాత్మ) ౨. బ్రహ్మవిచారము, బ్రహ్మసూత్రములకు శంకరాచార్యులు రచించిన భాష్యము.

**శారీరకసూత్రము.** సం. వి. అ. న. వ్యాస విరచితమయిన వేదాంత సూత్రము; బ్రహ్మ సూత్రము.

**శారీరకీయము.** సం. విణ. (అ. ఆ. అ) శరీర సంబంధి.

**శారీరము.** సం. విణ. (అ.ఈ.అ) శరీరసంబంధి. ౨. శరీరముధరించినది. మూర్తీభవించినది.

వి. అ. పుం. కంఠస్వరము. ౨. వృషభము. ౩. ఓషధీవిశేషము, ఒకానొక వనమూలిక. ౪. మలము; పురీషము.

**శారీరికము.** సం. విణ. (అ. ఈ. అ) శరీర సంబంధి.

**శారీరుఁడు.** సం. వి. అ. పుం. జీవాత్మ, ప్రతి దేహమునందు నుండెడి జీవుఁడు.

**శారుకము.** సం. విణ. (అ. ఈ. అ) క్రూరము; కీడుగలిగించునది.

**శార్కర(రి)కము.** సం. విణ. (అ. ఆ. అ) గులకరాళ్లుగలది. (నేల)

**శార్కరము.** సం. విణ. (అ. ఈ. అ) ౧. పంచదారతోఁ జేసినది. ౨. గులకరాలుగలది.

వి. అ. పుం. ౧. గులకరాతినేల. ౨. పాలనురుగు. మీఁగడ ౪. బెల్లపుసీమ.

**శార్కరీయము.** సం.విణ.(అ.ఆ.అ)=శార్కరకము.

**శార్ఙ్గధన్వుఁడు.** సం. వి. న్. పుం. విష్ణువు.

**శార్ఙ్గధరుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**శార్ఙ్గపాణి.** సం. వి. ఇ. పుం. విష్ణువు, శార్ఙ్గము చేతఁగలవాఁడు.

**శార్ఙ్గము.** సం.విణ.(అ.ఈ.అ) ౧.కొమ్ముతోఁ జేయఁబడినది. ౨. విల్లుధరించినది.

వి. అ. పుం. న. ౧. విల్లు. ౨. విష్ణుని విల్లు. ౩. అల్లము.

కం. ఆతేఁడు సద్యోయావనుఁడై తోడన యొక
స్వభావుఁడను సిద్ధుని చే, నూతనమొక మణియు
సముద్ద్యోతిత శార్ఙ్గము మెఱుఁగుఁ దూపులుఁ
బడసెన్. కళా. ౫-౨౩

శా. అందఱన్, జేష్టల్ దక్కఁగ శార్ఙ్గముక్త
విశిఖశ్రేణి న్యాసం జేసినన్. చిత్రభా ౭-౧౨౩

**శార్ఙ్గి.** సం వి, న్. పుం. ౧. ధన్వి, విలుకాఁడు. ౨. విష్ణువు. ౩. శివుఁడు.

**శార్దూలము.** సం. వి. అ. పుం. ౧. పెద్దపులి. ౨. చిఱుతపులి, ఒక జాతి చిఱుతపులి, ౩. శరభ మృగము.

విణ. అ. పుం. శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠము. ఉదా. రాజశార్దూలము.

**శార్దూలవిక్రీడితము.** సం. వి. అ.న ౧. పులియాట. ౨. (ఛంద) ఒకానొక వృత్తము. వృత్తభేదము.

**శార్వరము.** సం.విణ. (అ. ఈ. అ) ౧. రాత్రి సంబంధమైనది. ౨. మోసముచేయునది. ౩. ఘాతుకము, చంపునది.

వి. అ. న. కటికచీకటి, గాంఢాంధకారము.

**శార్వరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. రాత్రి. వి.న్. పుం. ప్రభవాది సంవత్సరములలో నొకటి.

**శాల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సాల, చావడి.

గీ. అచటి హోమశాలకేఁగి మానంబున........
సింహా. భా. ౧. ఆ. ౨౮౩.

౨. ఇల్లు. గృహము ౩. వృక్షస్కంధశాఖ. పెద్దకొమ్మ. ౪. వృక్షస్కంధశాఖ, చెట్టుబోదె ౫. గుఱ్ఱము, ఆవు మున్నగు వానికై యేర్పఱచిన చావడి. ఇది యీ యర్థమున షష్ఠీ సమాసాంతమున వికల్పముగా నపుంసక మగును. ఉదా॥ గోశాల, గోశాలము, అశ్వశాల, అశ్వశాలము, మొ॥

**శాలము.** సం.వి.అ.పుం.౧.సర్జతరువు; ౨. చెట్టు.

ఉ. ప్రతీప వసుధాధిపు శాల విశాల దక్షిణో
త్తుంగమునందు మగ్ధవశంబున నుండెఁ
గరంబు లీలతోన్ భార. ఆది. ౪-౧౩౫.
౩. ఆవరణము ౪. ఒకవిధమైన చేప.

**శాలవము.** సం. వి. అ. పుం. లోధ్రవృక్షము, లొద్దుగ చెట్టు.

**శాలాకి.** సం. వి. న్. పుం. ౧. ఈఁటెయాయుధము గాఁగల యోధుఁడు. ౨. శస్త్రవైద్యుఁడు ౩. మంగలి.

**శాలాకుఁడు.** సం.వి.అ. పుం. పాణిని మహర్షి; వ్యాకరణ శాస్త్రకర్త.

**శాలాజిరము.** సం. వి. అ. పుం. న. బోలుగానుండు మట్టిపాత్రము.

**శాలాతురీయుఁడు.** సం. వి. అ. పుం. పాణిని మహర్షి; శలాతురగ్రామమునఁబుట్టినవాఁడు. ఇట్టే శాలోత్తరీయుఁడు.

**శాలామృగము.** సం. వి. అ. పుం. నక్క, సృగాలము.

**శాలారము.** సం. వి. అ. న. ౧. నిచ్చెన. ౨. పక్షిపంజరము. ౩. ఏనుఁగు పాదము.

**శాలావృకము.** సం. వి. అ. పుం. ౧. కుక్క. ౨. తోడేలు. ౩. జింక. ౪. పిల్లి. ౫. నక్క. ౬. క్రోఁతి.

**శాలి.** సం. విణ. (న్. నీ, న్) (తఱచు సమాసాంతమున) ౧. సంపన్నమైనది; ప్రకాశించునది.
మాలి. సకలభువన రక్షాశాలి శుంభద్విహారా!
భార. స్వర్గ. ౯౭.
ఉ. ఆవసుధాధినాథుని మహాధృతిశాలి జయించు
తెంపునన్ భావజుఁ డప్పు డున్మదన బాణము
తియ్యనివింటఁ గూర్చుచో.. శృం. నై. ౧-౮౧
౨. గృహసంబంధమైనది; ఇంటియందలిది.

**శాలి.** సం. వి. ఇ. పుం. ౧. వరి-మైరు; సస్యవిశేషము.

గీ....విమల శాల్యోదనంబుపై వెల్లిమాపు నాజ్య
ధారా ప్రవాహ సాహస్రములకు. శృం. నై. ౬-౧౨౪

౨. పునుగుపిల్లి.

శాలికము. సం. వి. అ. పుం. ౧. పన్ను, సుంకము ౨. శిల్పులుండు గ్రామము.

శాలికుఁడు. సం. వి. అ. పుం. సాలె, తంతువాయుఁడు.

శాలిగోపి. సం. వి. ఈ. స్త్రీ. వరిపొలము కాచు స్త్రీ.

శాలిచూర్ణము. సం. వి. అ. పుం. న. వరిపిండి.

శాలిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. గృహిణి, గృహయజమానురాలు. ౨. (ఛంద) ఒకానొక వృత్తము.

శాలిపిష్టము. సం. వి. అ. న. స్ఫటికశిల. ౨. వరిపిండి.

శాలిభవనము. సం. వి. అ. న. వరిపొలము.

శాలివాహనుఁడు. సం. వి. అ. పుం. విక్రమార్కుని సంహరించి శకప్రవర్తకుఁడై రాజ్యమేలిన యొకానొక చక్రవర్తి. (క్రీస్తుశకము తర్వాత డెబ్బది యెనిమిది వత్సరములకు శాలివాహన శక మారంభమైనది)

శాలిహోత్రము. సం. వి. అ. పుం. గుఱ్ఱము.

న. శాలిహోత్రుఁడను మునిచే రచింపఁబడిన అశ్వశాస్త్రవిశేషము.

సీ. శాలిహోత్రం బెంత చదివిన నశ్వశిక్షాకుశలత్వంబు గలుగుబెట్లు.
శివయోగ. ఉ. ౧-౧౭ పా.

శాలిహోత్రి. సం. వి. న్. పుం. గుఱ్ఱము.

శాలిహోత్రుఁడు. సం. వి. అ. పుం. అశ్వశాస్త్రప్రవర్తకుఁడైన యొకరాజు; పశుశాస్త్రగ్రంథకర్త.

శాలీనత. సం. వి. ఆ. స్త్రీ. సిగ్గరితనము సిగ్గు.

గీ. వీనిఁ గులశీలశాలి శాలీనతానతంబు నానన
చంద్రబింబంబు నెత్తి బాలవీక్షింపు మేల
కోత్పలపలాశ, మాలికలఁ బోలులలిత దృగ్గాలకముల. శృం. నై. ౫-౪౪

శాలీనత్వము. సం. వి. అ. న = శాలీనత.

శాలీనుఁడు. సం. విశే. (అ. ఆ. అ) ౧. సిగ్గుగలవాఁడు, సిగ్గరి; దిట్టతనములేనివాఁడు. ౨. పోలినవాఁడు, సమానుఁడు. వి. అ. పుం. గృహస్థు.

శాలుఁడు. సం. వి. అ. పుం. శాలివాహనుఁడు.

శాలు (లూ) కము. సం. వి. అ. న. ౧. తామర కలువ మొదలగు వానిదుంప. ౨. జాజికాయ. పుం. కప్ప.

శాలు (లూ) రము. సం. వి. అ. పుం. కప్ప.

శాలువు. సం. వి. ఉ. పుం. ౧. కప్ప. ౨. పరిమళద్రవ్య విశేషము.
3. ఒకవిధమైన యొగరు పదార్థము. న. కలువ, తామర మొదలగు వాని దుంప.

శాలేయము. సం. వి. అ. న. ౧. వసమసి. ౨. సదాపచెట్టు.

శాల్మలము. సం. వి. అ. పుం. ౧. బూరుగుచెట్టు. ౨. ఒకానొక ద్వీపము, సప్తద్వీపములలో నొకటి. 3. బూరుగుచెట్టు చిగురు.

శాల్మలి. సం. వి. న్. పుం. గరుత్మంతుఁడు. ఈ. స్త్రీ. ౧. బూరుగుచెట్టు.

వ........తానురాజనందన నునిచివచ్చిన శాల్మలీ
పాదపంబుఁగనుంగొని. షోడశకు. చ. ౩-౧౦౨

౨. నరకభేదము. 3. పాతాళమందలి యొకనది.

శాల్మలికము. సం. వి. అ. న. ముల్లుమోదుగు

శాల్మలిని. సం. వి. ఈ. స్త్రీ. బూరుగుచెట్టు.

శాల్మలీవేష్ట (క) ము. సం. వి. అ. పుం. బూరుగు జిగురు.

శాల్యోదనము. సం.వి.అ.పుం.న.వరియన్నము.

శావము. సం.విశ. (అ. ఈ. అ) ౧. శవసంబంధమైనది; జ్ఞాతియొక్క మరణము వలనఁ గలిగినది. ౨. కపిలవర్ణముగలది.

వి.అ.పుం. ౧. పిల్ల జంతువు, వత్సము. ౨. కపిలవర్ణము. శాబము.

శాశ్వతము. సం. విశ. (అ. ఈ. అ) ఎప్పటికి నుండునది, నశ్వరముకానిది.

క. విశ్వామిత్రుఁడుతపమతి, శశ్వతముగఁజేయుచెలఁగి యును, శ్వైశ్వరుఁడు.... సింహా ౧౧-౧౧౭.

ఉ.........శాశ్వతమైన కాలమిది, సర్వము వేదబమందురట్టి. భాగ. ౧౧-౧.౭౭.

౨. వి. అ. పుం. స్వర్గము.

శాశ్వతి. సం. వి. ఈ. స్త్రీ. భూమి.

శాశ్వతికము. సం. విశ ( అ. ఈ. అ ) ఎప్పటికినుండునది. నశ్వరముకానిది. శాశ్వతము.

గీ. జ్ఞాన విజ్ఞానదృష్టి శాశ్వతికత్వ్వదయ్యెనేనియు విడువరా దాశ్రమముల.... భార శాంతి. ౬-౨౭౭.

శాశ్వతుఁడు. సం. వి. అ. పుం. ౧. శివుఁడు. ౨. వ్యాసుడు.౩. సూర్యుఁడు.

శాష్కులుఁడు. మత్స్యములను తినువాఁడు.

శాసకుఁడు. సం.వి.అ.పుం. ౧.పాలించువాఁడు, ఏలిక ౨. దండించువాఁడు.

శాసనము. సం. వి. అ. న. ౧. శిక్షించుట, బోధించుట, ౨. పరిపాలనము, ఏలుబడి.

సీ....నిశ శా . నోల్లంఘన జిష్ణుత్వకామిలాలకు రంగచయభిలి లంజిబిల్లి.నిరంకుశో. ౨-౪౧

౩. ఆజ్ఞ. ౪. వ్రాతమూలమైన యాజ్ఞ. ౪. విధివిహితవాక్యము. ౬. (భూమి. మొ) దానముచేయునపుడు రాజు వ్రాసి యిచ్చిన పత్రము. ౭. వ్రాతమూలమైన యొప్పందము; ఒప్పుదలకాగితము. ౮. ఇంద్రియనిగ్రహము. ౯. ప్రామాణికగ్రంథము. (సమాసాంతమున స్మరశాసనుఁడు మన్మథుని సంహరించువాఁడను నర్థమునిచ్చును.)

శాసనహరుఁడు. సం. వి. అ. పుం. రాయబారి.

శాసనహారి. సం. విన్. పుం. శాసనహరుఁడు.

శాసనీయము. సం. విశ. (అ. ఆ. ) ౧. పరిపాలింపఁదగినది.

. ౨. శిక్షింపదగినది.

శాసమాడ. వి. ఒకవిధమగు వాదెము. ద.శా. ౪-౭౯౭.

శాసించు. సం. స. క్రి ౧. దండించు, శిక్షించు.

గీ. బహుకమగు గర్వముఁ గార్యభఁగియుం కార్యపరణేయు నెలుఁగక కార్యవృత్తిఁ గాని తెరువున నడచు నన్నెని గురుని నైన శాసింపఁగా దగు నంత్రు బుధులు.

మ... ఎవ్వఁడేమునఁగు గంగాంభః ప్రవాహంబు నన్ జనుఁ దాతించును బుండరీకనయనా శాసించుఁడా పౌషుముల్. కాశీ. ౫-౪౫.

(త్రోలఁగించుకొని అని భావము) ౨.ఆజ్ఞాపించు.

వ. అని బహువిధముల దుస్సహుని శాసించి ద్రుహిణుండంత క్షిసుండయ్యె నంత.మార్క. ౪-౮౭.

శాసిత. సం. వి. ఋ. పుం. ౧. ఏలిక, పరిపాలించువాఁడు. ౨. దండించువాఁడు. శిక్షించువాఁడు.

శాసితము. సం. విశ, (అ. ఆ. అ) ౧. పరిపాలింపఁబడినది. ౨. శిక్షింపఁబడినది.

**శాస్త.** సం. వి. ఋ. పుం. ౧. బోధకుడు. ఉపాధ్యాయుడు. ౨. పాలకుడు, ఏలిక, రాజు. ౩. తండ్రి. ౪. బుద్ధుడు; జినుడు సం. విణ. (ఋ. త్రి. ఒక) శాసించువాడు. (శాసితకు వైదికరూపము)

సీ. శాస్తయొక్కండు తచ్చాసనంబునను యోక్కరియుండు నొక్కండగునుడలింపు. భార. ఆశ్వ ౨-౫౩.

శ్లో. మునీంద్రః శ్రీఘనః శాస్తా మునిః శాక్యముని స్తుయః అమర. స్వర్గ. ౧౪ శ్లో. లఘవో లఘవశ్చేతి శ్వేధాంతి స్థానవదంతి శాస్తారః ఆంధ్రశబ్ద చింతామణి సంజ్ఞా. ౨౨.

**శాస్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఆజ్ఞ.

చ. విను మ...... మహీ యకుంతితె శాస్తికి నేలు మంతెయున్. భార. శల్య ౭-౧౩౧
౨. శిక్ష; ప్రతీకారము.

మ ...సాయం జెక్కిడి యమ్మాలగూప్రము శ్రీకున్ శాస్తిగావింపకేండిన వాబాణ మమో ఘమంచు.... దశా ౭-౫౦౭. ౩. రాజ దండము. ౪. అప్పనవరించుట; శిక్షించుట. ౫. పాలనము, ఏలుబడి.

**శాస్త్రకృత్తు.** సం. వి. త్. పుం. = శాస్త్ర కారుడు.

**శాస్త్రగండుడు.** సం. వి. అ. పుం. శాస్త్ర ములయందల్పజ్ఞానముగల వాడు.

**శాస్త్రచక్షుస్సు.** సం. వి.స్. న. వ్యాకరణము ఇతర శాస్త్రము బోధపడుచుకొనుట కిది నేత్రము వంటిది)

**శాస్త్రజ్ఞుడు.** సం.విణ. (అ.ఆ.అ) ౧. శాస్త్ర ములు తెలిసినవాడు. ౨. కేవల శాస్త్రజ్ఞానము గలవాడు. (అనుభవములేని శాస్త్రజ్ఞానము గలవాడు.

**శాస్త్రతత్త్వము.** సం. వి. అ. న. శాస్త్రముల యందు బోధింపబడిన సత్యము.

**శాస్త్రదృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. శాస్త్రవిహిత ములయిన యంశములు బరిశీలించుట. (వ్యతి) లోకదృష్టి.

**శాస్త్రప్రసంగము.** సం.వి.అ.పుం. ౧. శాస్త్ర విషయములపైవాదము. ౨. వేదవిషయములపై వాదము.

**శాస్త్రము.** సం. వి. అ. న. ఆజ్ఞ. ౨. వేద విహిత వాక్యము. ౩. వేదము. నియమగ్రంథము ఒక విషయమున జ్ఞానము గలిగించు గ్రంథము. (వేదాంత శాస్త్రము.తర్కశాస్త్రము.అలంకార శాస్త్రము మొ.)

ద్వి. శివరహస్యాది ప్రసిద్ధశాస్త్రములు,శివునిచేఁ బలికిన చెలువ శిష్యులము.బసవపు ౩. P. ౧౩౭.

చం. విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థ ధర్మ శాస్త్రముల తెలంగెఱింగితి. భార. ఆది. ౧-౧౧.

౫. జ్ఞానము, తెలివి. ౬. గ్రంథము.

**శాస్త్రనిపుణుడు.** సం. వి. ణ్. పుం. శాస్త్రము నెఱింగినవాడు.

**శాస్త్రవిధానము.** సం వి. అ. న. వేదమునఁ జెప్పబడిన పద్ధతి, వేదము విధించిన పద్ధతి.

**శాస్త్రవిధి.** సం. వి. ఇ. పుం= శాస్త్రవిధానము

**శాస్త్రవిప్రతిషేధము.** సం. వి. అ. పుం.

౧. శాస్త్ర వాక్యములకుఁబరస్పరవిరోధము. ౨. వేద విధులకు విరుద్ధముగాఁబ్రవర్తించుట.

**శాస్త్రవిరుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ). శాస్త్రములకు వ్యతిరేకమైనది; అశాస్త్రీయమైనది.

**శాస్త్రవేది.** సం. విణ. (న్. నీ. న్) శాస్త్రము నెఱింగిన(ది) వాడు.

గీ. శాస్త్రవేదిచే నున్న విమంబుకంటె నింపా. భా. ౧. ఆ. ౩-౧౧.

**శాస్త్రశిల్పి.** సం. వి. న్. పుం. కాశ్మీరదేశము.

**శాస్త్రసిద్ధము.** సం.విణ.(అ.ఆ.అ) శాస్త్రముచే స్థాపింపఁబడినది, శాస్త్రముచేస్థిరపఱుపఁబడినది.

**శాస్త్రాతిక్రమము.** సం. వి. అ. పుం. శాస్త్రమునతిక్రమించుట; శ్రుతిస్మృతులయందుఁజెప్పిన దానినతిక్రమించుట.

**శాస్త్రి.** సం. విణ. (న్. ఈ. న్) ౧. శాస్త్రము బాగుగాఁజదివినవాఁడు. వి. న్. పుం. గొప్ప పండితుఁడు. ౨. శాస్త్రము బోధించు గురువు.

**శాస్త్రీయము.** సం. విణ. (అ.ఆ. అ) ౧. వేద విహితమైనది. ౨. శాస్త్రమందుఁజెప్పఁబడినది.

**శాస్త్రోక్తము.** సం.విణ.(అ.ఆ.అ) = శాస్త్రీయము.

**శాస్యము.** సం. విణ. (అ.ఆ.అ) ౧. బోధింపఁదగినది, ఉపదేశింపఁదగినది. ౨. పాలింపఁదగినది. ౩. శిక్షింపఁదగినది.

**శాహి.** హిం.వి. రాజు, ప్రభువు.

## శి

**శి.** సం. వి. ఇ. పుం. ౧ శుభము. సౌభాగ్యము. ౨. శాంతి, నెమ్మది. ౩. శివుఁడు.

**శింఘాణము.** సం. వి. అ. పుం. ౧. నురుగు, ఫేనము. ౨. కఫము, శ్లేష్మము. న. ౧. నాసామలము, చీమిడి. ౨. ఇనుపచిట్టెము. ౩. కాచపాత్రము, గాజుగిన్నె.

**శింఘితము.** సం. విణ.(అ.ఆ. అ) మూర్కొనఁబడినది, అఘ్రాణింపఁబడ్డది.

**శింజ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నగల చప్పుడు; ఘూమణధ్వని, శింజితము. ౨. వింటినారి, శింజిని.

**శింజము.** సం. వి. అ. పుం. నగలచప్పుడు. ఘూమణధ్వని. శింజితము.

**శింజానము.** సం. విణ. (అ. ఆ. అ) మ్రోగుచున్నది. ధ్వనించుచున్నది, శింజయను ధ్వని గలది. (శ. ర)

**శింజాయితము.** సం. విణ. (అ.ఆ.అ) ధ్వనించుచున్నది.

శింజాయిత మంజీర వ్యంజిత నీలాంశు భృంగ మను పదకంజం బంజక యిడగా    సింహా.

**శింజితము.** సం. విణ. (అ. ఆ. అ) ధ్వనిచేయునది. మ్రోగునది. వి. అ. న ఘూమణధ్వని. నగలచప్పుడు.

**శింజిని.** ౧. వింటినారి.

సీ. కటుదంత సంఘర్ష కిటకిటస్వనముతో శింజినీనినదంబు చెవుడు పఱుప. దశావ. ౬-౧౧౭

౨. అందె, నూపురము.

**శిం (సిం) బ.** సం. వి. ఆ. స్త్రీ. మినుము. పెసరు. మున్నగు కాయధాన్యముల కాయ.

**శింబము.** సం. వి. అ. పుం. తగిరసచెట్టు ‡

**శింబి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పెసరు. మినుము. మొదలగు కాయధాన్యముల కాయ ౨. ఒకానొక వనమూలిక ‡

**శింబిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పెసరు. మినుము. మొ. గు కాయధాన్యములకాయ ౨. ఒకజాతి సీమచిక్కుడు ‡

**శింశుప.** సం. వి. ఆ. స్త్రీ. వృక్షవిశేషము. ఒకానొకచెట్టు.

**శింశుమారము.** సం. వి. అ. పుం. ౧. మొసలి ౨. నీరుకోఁతి. ఒక జ్యోతిర్మండలము. (శింశుమార చక్రము)

**శికస్తు.** విణ. (హిం. శికస్త్.) శిథిలమైనది.

మ. కృశమై మేనులు దుస్సిపాటెడు ఫిరంగీ గుండ్లచే దస్సి ఖోజా శికస్తయ్యె.... రంగా. ౩-౧౨౩.

**శిక్కువు.** సం. విణ. సోమరి. అలసుఁడు.

**శిక్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. త్రాళ్ళతో నల్లిన చిక్కము. ౨. కావడిమట్టు. ఉట్టి.

**శిక్యము.** సం. వి. అ. న = శిక్య.

శా. స్వల్పాకారుల శిక్షధారులఁగు మారాధీను
లన్ ధీమలన్. భాగ. ౧౦-౪౭౬.

**శిక్యితము.** సం. విణ. (అ. ఆ. అ) కావడి యుట్టిలో నుంచఁబడినది.

**శిక్ష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దండనము.

గీ. వాకల దటంచు నెన్నేని వదరుచుండ. శిక్షఁ జేయకయుంట యుపేక్ష గాదె. వాల్మీ.... ౩-౨౩.

౨. అభ్యాసము. జ్ఞాన సంపాదనము. ౩. ఒక పనిచేయ సమర్థుఁడు గావలయుననెడి కోరిక. ౪. నేర్పుట, బోధనము.

వ. నీవునధర్మ ప్రవృత్తుండవై ధర్మశిక్ష సేయుచు గౌరవులకాపద యాపాదించుచున్న వాఁడవు భార సభా. ౨-౪౪.

కం. చింతిత కామప్రదాన శిక్షాక్షమము-శృంగై. ౬-౯౩.

౫. వేదాంగములలోనొకటి.వర్ణోచ్చారణ పద్ధతి తెలుపు గ్రంథము.౬. వినయము.౭. శాస్త్రము.

**శిక్షకుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఉపాధ్యాయుఁడు, గురువు. ౨. విద్వాంసుఁడు, పండితుఁడు.

ఆ. అశ్వశిక్షకుండనై మత్స్యభూవిభుఁగొలుచు వాఁడ....భార, విరాట. ౧-౯౪.

౩. అదుపులో నుంచువాఁడు. పాలించువాడు. శాసించువాడు.

**శిక్షణము.** సం. వి. అ. న. ౧. నేమవుకొనుట. జ్ఞాన సంపాదనము. ౨. చదువు చెప్పుట. బోధించుట.

**శిక్షాకరుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఉపాధ్యాయుఁడు, బోధకుఁడు. ౨. వ్యాసుఁడు.

**శిక్షించు.** సం. స. క్రి. దండించు.

కం.... బెగడించినఁనన్ శిక్షించెదరని చెప్పిన.... భాగ. ౧౦-౪౨౧.

౨. బోధించు; బోధచేయు.

కం. శిక్షించితి మన్యములగు పక్షంబులు మాని నీతిపారగుఁ డయ్యెన్. ౭-౧౬౧.

వ. తొల్లి సముద్ర తీరంబుననుండి యొక్క వృద్ధహంస ధర్మాధర్మంబులు చెప్పుచు ధర్మమార్గంబున వర్తిల్లుచుండుఁడని పక్షుల నెల్ల శిక్షించుచుఁ బ్రాణిహింస సేయక తపోవృత్తి నున్న......భార. సభా. ౨-౪౪.

వ. ఇట్టినిజధర్మంబు నీవు తప్పితేని నిన్ను నెవ్వరు శిక్షింతురు. మార్క. ౫-౧౧౯.

**శిక్షితము.** సం. విణ. (అ. ఆ. అ) నియమింపఁబడినది; నేర్పఁబడినది; అదుపులోనుంచబడినది.

ఉ. శిక్షిత చిత్తులార! శుభసిద్ధులు వొందు.... భార. స్వర్గ. ౯౧

**శిక్షితాక్షరుఁడు.** సం. వి. అ. పుం. నేర్పఁబడిన యక్షరములు గలవాఁడు ౧. గురువు. ఉపాధ్యాయుఁడు. ౨. విద్యార్థి.శిష్యుఁడు.

**శిక్షితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. చదువు కొనినవాఁడు.అభ్యసించినవాఁడు.౨. బోధింపఁబడినవాఁడు. నేర్పఁబడినవాఁడు. ౩. మంచి పద్ధతులలోఁబెట్టఁబడినవాఁడు. ౪. నేర్పరి. ప్రవీణుఁడు. ౫. అణకువగలవాఁడు.

**శిఖ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. శిరోమధ్యమున నున్న కేశగుచ్ఛము,జుట్టు. ౨. సిగ, కొప్పు. ౩.కురాయి ౪. కొండకొన, పర్వతశిఖరము. ౫. భార. వాడియైనయంచు.౬.బట్టకొంగు,వస్త్రాంచలము. ౭. జ్వాల. మంట.

తే. గీ. పెక్కునములేఁది వెడలుట పేర్చుదావ శిఖలుఁగడచుట దారుణాశీవిషముల బారి దప్పుట........ భార. ద్రోణ. ౩-౧౭౬.

౮. కిరణము. ౯. నెమిలిజుట్టు. ౧౦. కొమ్మ. ఊడ. ౧౧. మన్మథతాపము. ౧౨. చివరిభాగము మొన.

సీ. కదియవాపాశిఖాగ్రముఁ దగ్గని మోపి. శృంగా. నై. ౫-౯

**శిఖండకము.** సం. వి. అ. పుం. ౧. పిల్లజుట్టు, కూఁకటి.

వ .... తరుణతరతరలసమీరకుమారతాండవిత శిఖండకలతాతరుషండమండితోద్యాన పరిసరంబులయందు.... నార. ౨-౭౯.

౨. బాలురకుఁగర్ణపార్శ్వముల నందు కాకి ఱెక్కలవలెనుండు కేశగుచ్ఛము, కాకపక్షము. ౩. సిగ. ౪. నెమలిపింఛము.

**శిఖండము.** సం. వి. అ. పుం. ౧. చూడ, జుట్టు.

గీ. శ్రీకరాంగదకౌస్తుభశిఖిశిఖండ, మంజుమంజీర కర్ణికామణికిరీటకటకపటహార చాకచక్యముల్ వానిఁగృష్ణదేవునిఁగని వ్విశీరమనిరి.
రాధికా. ౪-౩౦.

౨. నెమలిపింఛము, కొప్పు, సిగ.

**శిఖండి.** సం. వి. న్. పుం. ౧. ధృష్టద్యుమ్నుని యన్న స్త్రీయై పుట్టి కొంతకాలమునకు పుంస్త్వము నొందినవాఁడు, ద్రుపదరాజుకొడుకు.

సీ. ఒక శిఖండికి చాల నొడ్డికరై బ్రహ్మచర్య వ్రతునిఁ జంపఁ జనకయున్న, గీ. మెచ్చ వచ్చును విచ్చు హెచ్చుగాఁగ. కృష్ణ. ౧-౪౭.

౨. నెమలి. ౩. కోడి. ౪. బాణము. ౫. నెమలి పింఛము. ౬. ఒకజాతిమల్లె. ౭. విష్ణువు. ౮. రెండు తలలపాము.

విణ. (న్. నీ. న్) ౧. సిగ గలది, జుట్టుగలది. ౨. నియమములేనిది, ఏర్పాటుగా లేనిది. (ఈ. విణ. అర్థములు సంస్కృతమునలేవు.)

క. గీసిన వెదురుసలాకల జేసిన యిరుసల శిఖండి నిడుమంచమునందు. క్రీడా. ౭౦ ఇచ్చట శిఖండి=శిఖండివలె రెండువైపులందును ఒక విధముగా నుండి తలయంచికడ, కాళ్ళకడ యను నియతిలేనిది (మంచము) అని భావము ౩. మాటనిలుకడ లేనివాఁడు, నీచుఁడు.

శా. రెండా వాల్కలు సంప్రదాయకునకున్ లెక్కింపఁగా నొక్కటే. గండామొండి శిఖండిబండలకు లెక్కల్ లేనివాల్కల్ గదా చాటుపద్యమణిమంజరి.౧. భా॥కృష్ణ.౧-౪౭

**శిఖండికము.** సం.వి.అ.పుం. కోడి, కుక్కుటము.

**శిఖండిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడునెమలి.

౨. ఒకజాతిమల్లె.

**శిఖర.** సం. వి. ఆ. స్త్రీ. మూర్వ ¦ చాఁగ.

**శిఖరము.** సం. వి. అ. న. ౧. పర్వతశిఖరము. కొండకొన. ౨. చెట్టుకొన, వృక్షాగ్రము. ౩. కొన, అగ్రము. ౪. కత్తిమొన ౫. సిగ. ౬. కక్ష, బాహుమూలము. ౭. గగుర్పాటు, రోమాంచము. ౮. అరేబియాదేశపుమల్లె మొగ్గ. ౯. కెంపు, పద్మరాగము.

**శిఖరవాసిని.** సం. వి. ఈ. స్త్రీ. దుర్గాదేవి.

**శిఖరి.** సం. విణ. (న్.నీ.న్) శిఖరముగలది.

వి. న్. పుం. ౧. పర్వతము.

తే. గీ. వసుమతికి వాఖిఘాతమై వఱలునట్టి భర్మశిఖరికి నుత్తరభాగమందు..విప్లా.౧-౨౦

౨. పర్వతదుర్గము. కొండమీఁది కోట. ౩. చెట్టు. ౪. తీతువపిట్ట. ౫. ఉత్తరేము ¦

**శిఖరిణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఉత్తమస్త్రీ. ౨. పాగిచినపెరుగు, మెంతిపెరుగు. ౩. రోమావళి. ౪. ఒకజాతిద్రాక్ష. ౫. మూర్వ. చాఁగ ¦ ౬. అరేబియాదేశపుమల్లి ¦ ౭. (ఛంద) ఒకానొక వృత్తము.

**శిఖాకందము.** సం.వి. అ. న. వెల్లుల్లి.

**శిఖాతరువు.** సం. వి. ఉ. పుం. దీపస్తంభము.

**శిఖాధరము.** సం. విణ. (అ. ఆ. అ) శిఖను ధరించునది, సిగగలది. వి. అ. పుం. ౧. నెమలి.

**శిఖామణి.** సం. వి. ఇ. పుం. చూడామణి సిగపై ధరించెడిమణి, శిరోరత్నము.

చ......ధూర్తశిఖామణి వైశవి గౌరి యల్లగా నలఘుమ్మృదూక్తి వేడుశివుఁడాయతసౌఖ్యము మాకునిచ్చుతన్. (శ్రేష్ఠుఁడు) చంద్రికా. ౧-౫

**శిఖాలువు.** సం. వి. ఉ. పుం. నెమిలిచెట్టు.

**శిఖావంతము.** సం. విణ. (త్. వతీ. త్) ౧. సిగ గలది. జుట్టుగలది. ౨. జ్వాలగలది. సెగగలది.

వి. త్. పుం. ౧. దీపము ౨. అగ్ని 3. కేతువు చుక్క.

**శిఖాలము.** సం. విణ. (అ. అ. అ) సిగగలది. జుట్టుగలది. .వి. అ. పుం. నెమిలి.

**శిఖావళము.** సం. వి. అ. పుం. నెమిలి, మయూరము.

ఉ......చంద్రజూటుకుల పాలిక రాజదుణోజ పాలికం, గాలికఁ బాదసేవకశిఖావళకాళికఁ బ్రస్తుతించెదన్. విరంకుశో. ౧-౧.

**శిఖావృద్ధి.** సం. వి. ఈ. స్త్రీ. దినదినము పెరిగెడి యన్యాయపు వడ్డీ.

**శిఖి.** సం. విణ (న్. నీ, న్) ౧. అగ్రముకలది. ౨. శిఖకలవాఁడు. తురాయి గలవాఁడు. 3. గర్వము గలవాఁడు.

విన్. పుం. ౧. నెమిలి. ౨. అగ్ని.

ఆ. వె. అనుభవింపఁదనికి యట మతివిషయముల్ విడుచుననితలంచు వెడఁగుఁదలఁపు లఖిలశిఖిశిఖాళి యందు దింధనాద్యముల్ గమియవైచి యార్పగడగుచట్లు. కు. సం. ౬.

3. కోడిపుంజు. ౪. బాణము ౫. చెట్టు. ౬. దీపము. ౭. ఎద్దు. ౮. గుఱ్ఱము. ౯. పర్వతము. ౧౦. బ్రాహ్మణుఁడు. ౧౧. యోగి, జటిలుఁడు ౧౨. కేతువు. ౧3. మూడుసంఖ్య. ౧౪. చిత్రమూలము. ౧౫. మెంతి.

**శిఖికంఠము.** సం. వి. అన. మైలుతుత్తము. ఇక్లే శిఖిగ్రీవము.

**శిఖిముఖ.** సం. వి. న్. పుం. చెకుముకిరాయి.

**శిఖివాహనుఁడు.** సం. వి. అ. పుం. నెమిలి వాహనముగాఁ గలవాఁడు, కుమారస్వామి.

**శిగ్రుజము.** సం. వి. అ. న మునగవిత్తు.

**శిగ్రువు.** సం. వి. ఉ. పుం. మునగ కూర.

**శితద్రువు.** సం. వి. ఉ. స్త్రీ = శతద్రువు

**శితము.** సం. విణ. (అ.ఆ.అ) ౧. వాఁడియైనది. ౨. బక్కయైనది.

**శితశూకము.** సం. వి. అ. పుం. యవధాన్యము.

**శితసారకము.** సం. వి. అ. పుం. తుమ్మిక

**శితి.** సం. విణ. ఇ. ౧. తెల్లనిది. ౨. నల్లనిది.

**శితికంఠము.** సం. వి. అ. పుం. కూకుటుగద్దగి.

**శితికంఠుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, కఱకంఠుఁడు.

**శిథిలము.** సం. విణ. (అ.ఆ. అ) సంధులువదలినది. శ్లథము.

సీ....ఆకటదలరి నీయందకములు శిథిలంబులై నవి భార. అశ్వ. ౪-౨3౭.

**శిథిలి.** సం. వి. ఈ స్త్రీ. చేకొణుజు.

**శిపివిష్టుఁడు.** సం. వి. అ. పుం. ౧. ౧. విష్ణువు. ౨. శివుఁడు. 3. బట్టతలవాఁడు ౪. కుష్ఠరోగము గలవాఁడు.

**శిప్ర.** సం. వి. ఆ. స్త్రీ. ఒక నదిపేరు.

**శిఫ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఊడ. పడుగొమ్మ. 3. తామరదుంప. ౪. మాంసి ౫. ఏఱు.

**శిఫారసు.** వి(హిం.శిఫార్స్) వాక్సాహాయ్యము.

సీ. సొగసుగా దొరయొద్దఁదగిట్టు కూర్పుండి అంకులాంధ్రకు శిఫారసులు చేసి. తెంజ.శ.౫౯

**శిబి.** సం. వి. ఇ. పుం. ౧. హింసించెడి పశువు.

౨. ఒక చక్రవర్తి.

**శిబిక.** సం. వి. ఆ. స్త్రీ. పల్లకి, యాప్యయానము

**శిబిరము.** సం. వి. అ. న. దండు విడిసినచోటు; వేలము.

మ. అరదం బిమ్మెయి నెక్కియుబ్బి శిబిరం బాప్రొద్ద నిశ్శేషతం బొరయం జేయు కుతూహలంబు........ భార. సౌప్తి. I ౧౬౨.

**శిర.** సం. వి, ఆ. స్త్రీ. ౧. నరము, ౨. ఈనె.

**శిరము.** సం. వి. స్. న. ౧. తల.

గీ. అట్టి దగ చేసి జన్నపు టిట్టి శిరము, గాము చెడకుండ దివి ద్రేలఁగట్టెఁ గాన.
భీమ. ౨-౧౭౦.

**శిరసంటు.** మి. అ. క్రి. (శిరసు+అంటు) తల యంటు, తలకుఁ జమురు మర్దనచేయు.

సీ. చిట్టాముదమ్మున శిర సంటి నునుమేన వాన నూనియనించి నలుఁగు పెట్టి. ఇంకు. ౨-౧౫

**శిరసావహించు.** సం. స. క్రి. (దీనికి సంస్కృత మునఁ బ్రయోగము లేదు. ౧. తలతో ధరించు. నెత్తిమీఁదఁ బెట్టుకొను.

సీ. అఖిల వేదాతీతుఁడైన శ్రీమన్మహాదేవుఁడు నిను శిరసా వహింప. వరాహ. ౭-౨౬.

చ. అని మణి ముద్రికా మణి క్రియచ్చె మెసంగ నొసంగ భక్తిఁ గైకొని శిరసావహించి కమఁ గోనలపంచి. పమిర. ౩-౮౨.

గీ....చంద్రుఁడుదయించె నప్పాల సంద్రమునను, వాని శిరసా వహించె భవాని విభుఁడు.
దశా. ౨. ౨-౮౨.

౨. (వినయముతో) అంగీకరించు, ఒప్పుకొను. ఉదా. పెద్దల మాట శిరసా వహింపవలెను.

**శిరసు (స్సు).** సం. వి. స్. న. శిరము, తల.

కం....శిరసుండగ మోకాలను పేసలు పెట్టుట....
ఉ. హరి.

కం.... మరు, త్సరిదా కల్పిత మనోజ్ఞ చరణ శిర స్సుందర మూర్తికి .... భార. విరా. ౧-౩౭.

**శిరస్కము.** సం. వి. అ. న. ౧. శిరస్త్రాణము, యుద్ధమునందు యోధులు శిరమునందు ధరించు ఇనుప కవచము. ౨. కిరీటము.

**శిరస్తా.** వి. (హిం. శిరస్తా) న్యాయ స్థానముల యందు లెక్కలు మొదలగువానికి జవాబుదారు డుగా నుండు ముఖ్యోద్యోగి.

సీ. తల ద్రిప్పుచును శిరస్తా చెప్పు వెంటనే తలలు మొగిడ్చి వకీలు చెప్పు....వేణు. శ. ౧౬.

**శిరస్త్రము.** సం. వి. అ. న. శిరస్సును గాపాడు నది, బొమిడికము. చూ. శిరస్కము.

శా. .... తూణీరంబులున్ సజ్యకో, దండంబున్ ధరియించి కంకట శిరస్త్రచ్ఛన్నుఁడై చారు దే, హ్లుం డేతెంచె.... చిత్రభారతము ౭-౬౦.

వ....అన్యోన్య బాణ ఘట్టనల శతాంగ తురంగ సూత కేతు బాణాసన తను త్రాణ శిరస్త్రాణంబులు ధరణి పయిం దొరఁగిన.
చిత్రభా. ౮-౫౮.

**శిరస్త్రాణము.** సం. వి. అ. న. శిరస్త్రము.

వ....సుత్తుమురైన తనుత్రాణశిరస్త్రాణంబులు....
చిత్రభా. ౮-౮౬.

**శిరోధర.** సం. వి. ఆ. స్త్రీ. గ్రీవ. మెడ.

**శిరోధి.** సం. వి. ఇ. స్త్రీ. శిరోధర.

**శిరోమణి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. శిరస్సునందలి మణి, తలమానికము, ౨. శ్రేష్ఠమైనది.

౧. చ....శిరోమణు లంద మందగా, మురువగు

పంచభోగయుత భోగుల నీఁగను శ్రీ గాసం
గుచున్. రాధికా. ౨-౩౬.

శిరోమర్మము. సం. వి. న్. పుం. పంది, సూక
రము.

శిరోమాలి. సం. వి. న్. పుం. కపాలమాల ధరిం
చిన వాఁడు, శివుఁడు.

శిరోరుహము. సం. వి. అ. న. శిరోజము, తల
వెంట్రుక.

శిరోవల్లి. సం. వి. ఈ. స్త్రీ. నెమిలి జుట్టు.

శిరోవృత్తము. సం. వి. అ. న. తలపాగ, ఉష్ణీ
షము.

శిరోవేష్టము. సం. వి. అ. పుం. ఉష్ణీషము, తల
పాగ.

శిరోవ్యథ. సం. వి. ఆ. స్త్రీ. తలనొప్పి.

తే. గీ. సంధ్య యన్న శిరోవ్యథ సంభవించు.
నిరంకుశో. ౨-౨౫.

శిరోస్థి. సం. వి. ఇ. న. కపాలము, పుఱ్ఱె.

శిల. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఱాయి.

సీ... ....కొమ్ములఁ గోరాడి చిమ్ముచో నెగసిన
ఘనగండశిలలు మేఘములు దాఁక.
భోజరా. ౬-౩౧౫.

౨. తిరుగలి, ౩. ద్వారము క్రింది త్రొక్కుడుఁ
గమ్మి, కడప, బురద కమ్మి, ౪. స్తంభాగ్రము,
స్తంభముకొన, ౫. నాడి,రక్తనాళము, ౬. మణి
శిల, ౭. కర్పూరము.

శిలము. సం. వి. అ. పుం. న. పొలములో సస్యము
తీసికొనిపోయిన తర్వాత జీవనార్థము వెన్ను లేరు
కొనువృత్తి. చూ. ఉంఛము.

శిలాకుట్టకము. సం. వి. అ. పుం. ఱాతిపనివాని
యులి.

శిలాకుసుమము. సం. వి. అ. న. ఱాతి పువ్వు;
ఒకవిధమగు సంభార ద్రవ్యము.

శిలాక్షరము. సం. వి. అ. న. ౧.ఱాతిపైచెక్కిన
యక్షరము, ౨.ఱాతిపై చెక్కిన యక్షరములవలె
స్థిరమైన మాట. మొ॥

క. చెలిమి శిలాక్షరమెప్పుడు నలుకజలాక్షరము
సుజను లగు వారలకున్ జెలిమి జలాక్షర
మెప్పుడు నలుక శిలాక్షరము కుజనులగువార
లకున్. కేయూర. ౩-౭౯.

ఉ. ఆడినమాటలెల్లను శిలాక్షరముల్ శివభక్తి
నెమ్మదిన్ వీడఁడు. .... శివధ. ౧-౬౯.

శిలాజతువు. సం. వి. ఉ. న. ౧. మట్టితైలము,
(ఆ.ని.) ౨. జేగురుఱాయి, ౩. పర్వతమునందుఁ
బుట్టెడు నొక విధమగు నుపధాతువు. (వాచ)

శిలాజము. సం. విశే. (అ. ఆ. అ.) ఱాతిలోఁ
బుట్టినది, గనిలోఁ బుట్టినది. న. ౧. శిలాజిత్తు,
(గంధద్రవ్య భేద మని వాచస్పత్యము) ౨. మట్టి
తైలము, ౩. ఇనుము, ౪. గనిలోఁబుట్టినవస్తువు,
ఖనిజ పదార్థము.

శిలాజిత్తు. సం. వి. త్. స్త్రీ. శిలాజతువు.

శిలాటకము. సం. వి. అ. పుం. ౧. రంధ్రము,
౨. సెలుగు, కంచె, ఆవరణ, ౩. మేడమీఁది.
గది.

శిలాత్మజము. సం. వి. అ. న. ఇనుము.

శిలాత్మిక. సం. వి. ఆ. స్త్రీ. మూస, మూష.

శిలాదద్రువు. సం. వి. ఉ. పుం. శైలేయ మను
గంధ ద్రవ్యము.

శిలాధాతువు. సం. వి. ఉ. పుం. ౧.సుద్దఱాయి,
తెల్లఱాయి, ౨. జేగురుఱాయి.

శిలాపట్ట(క)ము. సం. వి. అ. న. సన్నికల్లు,
నూరెడుఱాయి.

శిలాపాకి. సం. వి. ఈ. స్త్రీ. నుసిగింజ.

శిలాపుత్రకము. సం. వి. అ. పుం. నూఱుట కుప యోగించు ఱాతిగుండు, పొత్రము, గుండ్రాయి.

శిలాపుష్పము. సం. వి. అ. న. ఱాతిపువ్వు, గంధద్రవ్యవిశేషము; ఓషధివిశేషము.

శిలాభవము. సం. వి. అ. న. ఱాతిపువ్వు.

శిలాభేదము. సం. వి. అ. పుం. ఱాయి పగులఁ గొట్టెడియులి.

శిలారంభ. సం. వి. ఆ. స్త్రీ. కాకదళి, అడవి యరటి [illegible]

శిలాశనము. సం. వి. అ. పుం. ఒకవిధమగు ధూపద్రవ్యము.

శిలావల్క. సం. వి. ఆ. స్త్రీ. ఱాయివలె గట్టి దగు పట్టగల యొకజాతివృక్షము.

శిలావల్కలము. సం. వి. అ. పుం. న= శిలా వల్క.

శిలావ్యాధి. సం. విశే. పుం. శిలాజంతువు. శైలేయము.

శిలాసారము. సం. వి. అ. న. ఇనుము.

వ........ అపహసిత శిలాసారోదారంబును గదక పట్టి కామండితంబును నైన గదాదండంబు....
భార. శల్య. II ౯౫.

శిలాహ్వము. సం. వి. అ. న. ౧. మణిశిల ౨. శిలాజిత్తు.

శిలి. సం. విశే. పుం. భూర్జపత్రవృక్షము. స్త్రీ. ౧. శిరపత్రొక్కుడు. గమ్మి. ౨. ఒక జాతిపాము. (ఎఱ్ఱ) ౩. స్తంభాగ్రము. ౪. అస్త్రము, ఆయుధము ౫. బాణము. ౬. అఁడుకప్ప.

శిలీంధ్రకము. సం. వి. అ. న. కుక్కగొడుగు.

శిలీంధ్రము. సం. వి. అ. పుం. ౧. ఒకజాతిచేఁప ౨. వృక్షవిశేషము, జెలతాడి. న. ౧. కుక్క గొడుగు, పుట్టగొడుగు. ౨. అరటిపువ్వు. ౩. తెల్ల తెగడ [illegible]

శిలీంధ్రి. సస. వి. ఈ. స్త్రీ. ౧. మన్ను, బంక మన్ను. ౨. చిన్న వానపాము, చిన్నమొప్పి. ౩. అఁడుకప్ప.

శిలీముఖము. సం. వి. అ. పుం. ౧. తుమ్మెద. ౨. బాణము.

ఉ. ఏసరవిస్ విరించినొకయేటున........ రాజ హృదయాగ్రము గాడఁగనేసెనంతయుంగా సిల తేఁటి యెక్కగుతి గట్టిన పుష్పశిలీ ముఖంబులన్. శృం. నై. ౧-౭౪.

గీ. అగ్నిశిఖులయ్యె వినుంప నగ్నిశిఖులు భువిశిలీ ముఖములు శిలీముఖములయ్యె. రాఘ. కా.
౭-౧౧౭.

౩. యుద్ధము.

శిలీముఖుఁడు. సం. వి. అ. పుం. అవివేకి, తెలివి తక్కువవాఁడు.

శిలేయము. సం. విశే. (అ.ఆ.అ) శిలామయము, ఱాలతో నిండినది.
వి. అ. న= శైలేయము.

శిలోచ్చయము. సం. వి. అ. పుం. పర్వతము, కొండ.

మ. మృదురీతిం బ్రతివాసరంబు గమికక్రీడా ధూత వానాదీరద కాంతారపురీశిలోచ్చయుఁడనై
శృం. నై. ౭-౭౦.

శిలోద్భవము. సం. వి. అ. న. శైలేయము, గంధ ద్రవ్యవిశేషము. ఇట్లే శిలోద్భవము మొ॥

శిల్పకారి. స. వి. న్. పుం= శిల్పకారుఁడు.

శిల్పకారుఁడు. సం. వి. అ. పుం. చిత్తరువులు మొదలగు చేతిపనులు చేయువాఁడు; శిల్పి.

శిల్పము. సం.వి.అ.న.౧.కళ.(చిత్రలేఖనము మొ॥ కళలఱువదినాలుగు) ౨. మూర్తిమందిరాదినిర్మా

ణము. ౩. మృద్దారు శిలాదులచే నిర్మింపఁబడిన మూర్తిమందిరాదికము.

చం....ధాత్రికపూర్వముగా నొనర్చి చెప్పెరఁగొని దిమ్మసీదయిన శిల్పకళాకు కలశ్వమేర్పడన్ భార. ౧-౫

క. ఓ విశ్వకర్మ! కుశలమె! నీ వెగదా జగతి సకల నిర్మాణంబుల్ గావించునట్టి శిల్పకళా వేదివి మనవివిధములలివి యంగన్. శివరహస్య సంభవ. ౩-౧౮౩.

౨. పనిపాటు.

ఆ. వివిధశిల్పములఁ బ్రవీణుఁడై మఱియును వలయు పనులు వెంట మెఱుగ నేర్చె. భార. విరా. ౧-౧౦౭
౩. సంస్కారము. విధివిహితమగు క్రియ. నైపుణ్యము.

మ....అమలోదాత్తమనీష నేనుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడన్.........
ని. గా. ౧

చేయుము నీవాంధ్ర భాషశిల్పము మెఱయన్
కేయూ ౧-౧౧

మ. కలహంసీశ్రేణికిఁ బిరాకపాణి కుహావాకాటిల్య శిల్పంబునన్. హంసవి.
నేర్పు. ౫. హోమమునకై నేయిగ్రహించు పరికరము, స్రువము. ౬. ఆకారము, రూపము. ౭. సృష్టి. ౮. చుఱుకుఁదనము.

**శిల్పవిద్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. యంత్రములు నడిపించెడి శాస్త్రము. ౨. చేతిపని, శిల్పము.

**శిల్పశాస్త్రము.** సం. వి. అ. న. ౧. చేతిపనులను గూర్చిగాని, యంత్రములు నడుపుటను గూర్చి గాని రచించిన గ్రంథము. ౨. వాస్తువిషయక జ్ఞానమును గల్గించు శాస్త్రము. (వాచ)

**శిల్పి.** సం. విణ. (న్. నీ. న్) శిల్పవిద్యాసంబంధమైనది. యంత్రసంబంధమైనది. వి. న్. పుం ౧. శిల్పము నేర్చినవాఁడు. యంత్రవిద్య నేర్చిన వాఁడు.

ఉ. అనఘ మాలిజూచి మదినద్భుతమంది సుపర్వ శిల్పికిన్ మానితభాసమానబహుమానశతంబు లొసఁగి వీడ్కొలెన్. శివరహస్య.
౩-౧౮౬

వడ్రంగి, సాలె, మంగలి, చాకలి, ముచ్చి జాతుల లోనివాఁడు.

**శిల్పికము.** సం. విణ. (అ. ఆ. అ) యంత్రసంబంధమైనది. చేతిపనికి సంబంధించినది.
వి. అ. న. చేతిపనియంత్రములు నడిపెడివని

**శివ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పార్వతి ౨. సౌభాగ్యవతి యగు స్త్రీ. ౩. ముక్తి, మోక్షము. ౪. నక్క.

శా. ఆమగోర్యధమఁ దు ద్విజిల్లుడును గ్రవ్యాదారవంబున్ శివా నాదంబున్.......భార ఆది.
V ౧౦౬.

౫. కరక ¡ ౬. ఉమ్మె ¡ ౭. ఉసిరిక ¡ ౮. నేలయుసిరిక ¡ ౯. మూర్వ, గఱిక ¡ ౧౦. పసుపు ¡ ౧౧. గోరోచనము.

**శివకము.** సం. వి. అ. పుం. ౧. పశువులను గట్టెడు గాడు. ౨. పశువులు దేహమును రాచి కొనెడి గుంజ, రాపిడిగుంజ.

**శివ(ం)కరము.** సం. విణ. (అ. ఈ. అ) శుభప్రదమైనది, శుభమునిచ్చునది.

కం. శివకరము దపము మేధానవ సకల జనంబులకును........ భార శాంతి. V-౬౯.

**శివతాతి.** సం. విణ. (ఇ) శుభాంతమైనది. ౧. శుభంకరమైనది. వి. ఇ. పుం. శుభము, మంగళము.

**శివదూతి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. దుర్గాదేవి. ౨. ఒకానొక యోగిని.

**శివద్రుమము.** సం. వి. అ. పుం. మారేడు చెట్టు.

**శివద్విష్ట.** సం. వి. ఆ. స్త్రీ. కేతకి ¡ మొగలి ¡

**శివధాతువు.** సం. వి. అ. పుం. ౧. పాదరసము ౨. పాలరాయి.

**శివనాభము.** సం. వి. అ. పుం. ఒకవిధమగు సాలగ్రామము.

**శివపదము.** సం. వి. అ. న. కైలాసము.

క. శివశాస్త్రంబెవ్వఁడు వినుశివశాస్త్రంబెవఁడు
నోడువు శివపదమున వాఁడువనించు....
శివధర్మ. ౧-౨౦౦

**శివపాడు.** మి. వి. శ్మశానము.

ద్వి........నల్లడల చీకట్లు గ్రమ్ముచును, అమహీ
పతి యేలునట్టి పట్టణము సీమయునవ్వేళ
శివపాడువైవ ద్వి. పరమ ౨. ౧౧౫.

(శివపాడువైచు=చెఱుచు అనిభావము)

**శివపురము.** సం. వి. అ. న. కాశీపురము.

**శివపురాణము.** సం. వి. అ. న. పదు నెనిమిది మహా పురాణములలో నొకటి.

**శివపురి.** సం. వి. ఈ. స్త్రీ. కాశీపురము.

**శివప్రియ.** సం. వి. ఆ. స్త్రీ. దుర్గాదేవి.

**శివప్రియము.** సం. వి. అ. పుం. ౧. స్ఫటికము, ౨. అగిసెచెట్టు, ౩. ఉమ్మెత్త.
౪. రుద్రాక్షము.

**శివబీజము.** సం. వి. అ. న. పాదరసము.

**శివమల్లకము.** సం. వి. అ. పుం. అర్జునము, తెల్ల మద్ది.

**శివము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. శుభకరము, శుభము నిచ్చునది, ౨. సుఖకరము, సౌఖ్యము నిచ్చునది.

కం....శివనామంబే, శివమొసఁగు మంత్రరాజము
శివధర్మ. ౧-౧౩౯.

వి. అ. పుం. ౧. మోక్షము, ౨. వేదము, 3. దేవత, వేల్పు, ౪. పశువులనుకట్టు కొయ్య, ౫. పాదరసము, ౬. గుగ్గిలము, ఒక విధ మగు ధూప ద్రవ్యము, ౭. నల్ల యుమ్మెత్త, ౮. తియ్య మామిడి, ౯. (జ్యోతి), విష్కంభాది యోగములలో నొకటి, ౧౦. మాఁగు దోస.

న. ౧. శుభము, ౨. సుఖము, 3. జలము, ౪. సముద్రపుటుప్పు, ౫. దాతియుప్పు, సైంధవ లవణము, ౬. అద్వైతపరబ్రహ్మము.

సీ.......అవ్యక్త మనఁగ బ్రహ్మంబునా నుత్తర
మనఁగ శివంబన వినుతి కెక్కు. భార. శాం.
V-౩౪౫.

౭. పరిశుద్ధమైన వెలిగారము.

**శివయోగి.** వి. శివభక్తుఁ డగు తపస్వి.

౧౩. పప్పనకు ౧. శివయోగులుపమ్రదకువ(ర్లు)
దంచెడు అణ్ణాని యొక్కత్తె పిట్టము దునుకు వస్తు
దంచెడు అన్ను వంద్రు యిదలుంగా ముప్పనకు
శిలాశాసనము పెట్టి— ద. శా. ౪-౧౨-౧౮.

వ. అమ్మా! శివుఁడే శివయోగి యను భేదంబు
గలదె. హర. ౨-౧౨౨.

**శివరాత్రి.** సం. వి. ఇ. స్త్రీ. మాఘ కృష్ణపక్ష చతుర్దశి, నిద్రాహారములు మాని జాగర ముండు రాత్రి.

గీ. మానినికి నీవు ప్రక్కగా లేని యప్డు, రాతి
రెల్లను మటి శివరాత్రి యగుచు.
రాధికా. ౧-౧౩౮.

**శివరాయల వరాలు.** వి. బ. శివరాయ ముద్ర గల వరహాలు.

సీ. అఖిలసీమాయూలమైన మర్గమ్ములం చేతికైదని.
జేల్ శివరాయల వరాల నెల కట్టడల పటా
ణీల్ గరీబు. రా. లి. ౫-౧౭.

**శివలింగము.** సం.వి. అ.వి. ౧. రాయి మన్ను గు వానితో నిర్మింపఁబడిన లింగరూప మగు శివుని యర్చా విగ్రహము.

౨. శివలింగమును బూజించుట కేర్పఱుపఁబడిన యాలయము.

**శివవల్లభ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. శతపత్రి, తెల్ల గులాబి, ౨. పార్వతి.

**శివవల్లభము.** సం. వి. అ. న. మామిడిచెట్టు.

**శివశేఖరము.** సం. వి. అ. పుం. ౧. చెందమామ, చంద్రుఁడు ౨. ఉమ్మెత్తచెట్టు ౩. అగిసెపువ్వు (వాచ)

**శివసత్తి.** మి. వి. ౧. ఈశ్వరశక్తి, పార్వతి ౨. గ్రామదేవత, అమ్మవారు ౩. అమ్మవారు వహించిన (పూనిన) మనిసి.

గీ. మగనికంటె సెరుసు వగలాఁడి శివసత్తి బలు
గయాలి పొరుగు పాలి జాలి మంచులాఁడి
చెడుగుమానిసి బూతంబు పినిఁడి బిచ్చగాండ్ల
వెన్ను గుదియ. చెన్న. ౨-౨౪.

**శివాత్మకము.** సం. వి. అ. న. ఊటి యుప్పు, సైంధవ లవణము.

**శివాదేశకుఁడు.** (అ, శకు. అ) ౧. శుభవర్తమానముఁ దెచ్చిన వాఁడు ౨. భావి శుభమును జెప్పు వాఁడు.

**శివాని.** సం. వి. ఈ. స్త్రీ. శివునిభార్య, పార్వతి

**శివాప్రియము.** సం. వి. అ. పుం. మేఁక.

**శివాఫల.** సం.వి.ఆ.స్త్రీ. శమీవృక్షము, జమ్మి.

**శివారాతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పార్వతీ పరమేశ్వరులను ద్వేషించువాఁడు, పాషండుఁడు ౨. కుక్క.

**శివాలయము.** సం. వి. అ. పుం. ౧. శివునినివాసము ౨. ఎల్లిఁగులని.

న. ౧. శివునిగుడి ౨. శ్మశానము.

**శివాలువు.** సం. వి. ఉ. పుం. నక్క.

**శివి.** సం.వి. ఇ.పుం. ౧. ఘాతుక జంతువు, క్రూరమృగము ౨. భూర్జపత్త్రిము.

**శివుఁడు.** సం.వి.అ.పుం. ఈశ్వరుఁడు. ముక్కంటి

**శివేతరము.** సం. విశే. (అ.ఆ.అ) అమంగళము, శుభములేనిది.

**శివేష్ట.** సం. వి. ఆ. స్త్రీ. దూర్వ, గఱిక.

**శిశిరకరుఁడు.** సం.వి. అ.పుం. చల్లని కిరణములు గల వాఁడు, చంద్రుఁడు. ఇట్లే శిశిర కిరణుఁడు మొ॥

**శిశిరము.** సం. విశే. (అ. ఆ. అ) చల్లనిది.

వ. ఆ....అనిలాలోలకల్లోల మాలాస్ఫాలన సము
చ్ఛల జ్జల కణాసార శిశిర శిశిరం బగు చున్న
గంగాపులినంబున. భార. ఆది. IV-౧౪౨.

ఉ. మే యాదఁక నిద్ర వోయె శిశిరానిలముల్
పయివీచుచుండఁగన్. భార. ఆది. V-౧౭౦

వి. అ. పుం. న. ౧. మంచు, హిమము ౨. శిశిర ఋతువు (మాఘ ఫాల్గుణ మాసములు) ౩. చల్లఁదనము.

**శిశిరవిధి.** సం. వి. ఇ. పుం. శైత్యోపచారము.

క....రసిక కిసలయ పాణుల్, బిస కిసల కుసుమ
విసరము వెస మసలక తెచ్చి శిశిర విధు
లాలసులై. విజయ. ౩-౩౭.

**శిశిరాత్యయము.** సం.వి.అ.పుం. శిశిర ఋతువు యొక్క తుద, వసంతఋతు ప్రారంభము. ఇట్లే శిశిరాపగమము.

**శిశిరోపచారము.** సం. వి. అ. పుం.

తే. గీ. చెలికి శిశిరోపచారముల్ సేయఁ జేయ,
నంతకంతకు మదనాగ్ని యధికమైనఁ, జెలులు
మదిలోన వెంవెయుఁ జిన్నవోయి, రాజునకు
విన్నవించిరి రమణి తెఱఁగు. విక్రమా. ౭-౬౪

**శిశుకము.** సం. వి. అ. పుం. ౧. బిడ్డ, పిల్ల ౨. పశు పక్ష్యాదుల పిల్ల ౩. వృక్షము, చెట్టు ౪. మొసలి ౫. మొసలి వలె నుండెడి చేఁప.

**శిశుక్రందీయము.** సం. వి. అ. పుం. శిశువుల వ్యాధి నిదానములను వాని చికిత్సలను దెలుపు గ్రంథము.

**శిశుగంధ.** సం. వి. ఆ. స్త్రీ. ముద్ద మల్లె, ఒక జాతి మల్లె.

**శిశుచాంద్రాయణము.** సం. వి. అ. న. చిన్న చాంద్రాయణవ్రతము.

(ప్రొద్దుట నాలుగు ముద్దలు, రాత్రి నాలుగు ముద్దలు మాత్రము అన్నము తినుచు చేయు వ్రతవిశేషము)

**శిశునాగము.** సం. వి. అ. పుం. పిల్ల యేనుఁగు, ఏనుఁగు గున్న.

**శిశుపాలుఁడు.** సం. వి. అ. పుం. దమఘోషుని పుత్రుఁడైన చేదిదేశపు రాజు.

ఉ. పాలిత దుర్నయుండు శిశుపాలుఁడు బాలుఁడు .... భార. సభా. ౨-౨౨.

**శిశుమారము.** సం. వి. అ. పుం. ౧. మకరము, మొసలి, ౨. ఆకాశమునందలి తారాచక్ర భేదము (వాచ) శింశుమారచక్రము.

**శిశుమారశిరస్సు.** సం. వి. స. న. ఈశాన్య దిక్కు.

**శిశువాహ(క)ము.** సం. వి. అ. పుం. అడవి మేఁక.

**శిశువాహ్య(క)ము.** సం. వి. అ. పుం. శిశువాహకము.

**శిశువు.** సం. వి. ఉ. పుం. ౧. బిడ్డ, ౨. పశు పక్ష్యాదుల పిల్ల, ౩. ఎనిమిది యేండ్లకుఁ దక్కువ యీడుగల పిల్లవాఁడు, ౪. విద్యార్థి.

**శిశ్నము.** సం. వి. అ. న. మగ గుఱి, మేఢ్రము.

**శిశ్విదానుఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) ౧. ధర్మనిష్ఠ గలవాఁడు, ౨. పాపాత్ముఁడు, దుష్టుఁడు.

**శిష్టత్వము.** సం. వి. అ. న. సదాచార సంపత్తి, మంచినడవడి, సుజనత్వము.

శా. శిష్టత్వంబున వేదశాస్త్రపఠన శ్రీచేత నాఖ్యాతకుం, దృష్టింపంగ నశక్యుఁ డైన ధరణీదేవోత్తమున్.... విరాట. ౧-౫౯.

**శిష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిగిలినది, ౨. ఆజ్ఞాపింపఁ బడినది, ౩. శిక్షితము, మంచి మార్గ మలవఱుపఁ బడినది, ౪. మంచి గుణము గలది, ౫. గౌరవార్హము.

గీ. యాగశాలను గట్టినయట్టియెడల, నవల విప్రాని లంబుల కభిముఖముగ, మునుగు వెట్టక, చేముక్కు మూసికొనక, మలము విడుచుట శిష్ట ధర్మంబు గాదు. విష్ణు. కాం. ౧-౩౫.

౬. నాగరకత గలది, సభ్య మైనది, ౭. ముఖ్య మైనది.

**శిష్టాచారము.** సం. వి. అ. పుం. ౧. శిష్టుల యాచారము, శిష్టులు నడచిన మార్గము, ౨. మంచి పద్ధతి.

**శిష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పరిపాలన, ౨. ఆజ్ఞ, ఉత్తరువు, ౩. శిక్ష, శాస్తి.

**శిష్టుఁడు.** సం. వి. అ. పుం. ౧. ప్రసిద్ధ పురుషుఁడు, ప్రఖ్యాతపురుషుఁడు, ౨. పండితుఁడు, విద్వాంసుఁడు, ౩. మంత్రి, ఆలోచన చెప్పు వాఁడు, ౪. సదాచార సంపన్నుఁడు, మంచి నడవడిగల మనుష్యుఁడు.

ఆ. ...నిఖిల భూప్రజా పాలనఁ జేయుచుండె శిష్ట సేవ్య మగుచు. భార. ఆది. ౩-౧౫.

విశే. ౧. శాంతుఁడు, ౨. వేదమందు విశ్వాసముగలవాఁడు, ౩. ధీరుఁడు, ౪. నీరోగుఁడు.

వసంత తిలకము. వీరావతార సుకవిస్తుత నిత్య ధర్మ ప్రారంభ శిష్టజన పాలన సక్త .... .... భార. ఆది. ౨-౨౪౦.

**శిష్యపుత్రుఁడు.** సం. వి. అ. పుం. ౧. కుమారుఁడుగా నెంచఁబడిన శిష్యుఁడు, ౨. శిష్యునికుమారుఁడు.

**శిష్యశిష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. శిష్యుని తప్పు దిద్దుట, శిష్యశిక్ష, ౨. శిష్యుని మంచిమార్గమునఁ బెట్టుట.

**శిష్యుఁడు.** సం. వి. అ. పుం. అంతేవాసి, చదువు నేర్చుకొనువాఁడు, విద్యార్థి.

ఆ.వె. అనఘ నిన్ను శిష్యుఁడును ధార్మికుండు స
త్య వ్రతుండునని మహాదరమున, నడిగె నీవు
ధర్మ హానికి నోర్చిన, గురుఁడు నిశ్చయించె
గొడుకు చావు. భార. ద్రోణ. ౫-౩౫౧.

శిహ్లా(క)ము, సం. వి. అ. పుం. చిల్లుమడ్డి, గంధ ద్రవ్య విశేషము.

శీ, సం. వి. ఈ. స్త్రీ. (దీనికి వ్యస్తప్రయోగ ముండదు) సమాసమున శ్లేషాములయం దుపయోగింపఁబడవచ్చును) ౧. నిద్ర, ౨. శాంతి, నెమ్మది.

శీకరము, సం. వి. అ. పుం. ౧. తుంపర.

సీ.......కఃకరశీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబుకణములు....భార. ఆది. IV-౭౩.

౨. నీటి బిందువు.

ఉ. శీకర బృంద మెంతయు నశిత మరీచి మరీచి జాల మై, ప్రకృతి ధాళధళ్యమయి తేజరిలన్ కళా. ౮-౨౦౦.

౩. వాయువు.

౪. ౧. సరలవృక్షము ౨. సరలవృక్షముయొక్క బంక.

శీకరి, సం. విశే. (న్. ఈ. న్.) ౧. తుంపరలు గలది, ౨. జలబిందువులను గురియునది.

శీఘ్రకారి, సం. విశే. (న్. ఈ. న్.) త్వరగాఁ జేయువాఁడు, త్వరగాఁబని చేయువాఁడు, చురుకైనవాఁడు.

శీఘ్రకోపి, సం. విశే. (న్. ఈ. న్.) త్వరగాఁ గోపము వచ్చువాఁడు, ముంగోపి.

శీఘ్రచేతనము. సం. వి. అ. పుం. ౧. కుక్క, ౨. తెల్ల జిల్లేడు.

శీఘ్రబుద్ధి. సం.విశే.(ఇ) సూక్ష్మబుద్ధిగలవాఁడు, చురుకుఁదనముగలవాఁడు.

అ....పూర్ణ ఘటికాంత నాదంబు చెవులు సోఁకి నంత శీఘ్ర గతిని. సింహా.భా. ౧.అ.౨-౬౦

శీఘ్రము. సం. విశే. (అ. ఆ. అ.) వేగముగలది, వడి గలది.

వి. అ. పుం. ౧. ఆలస్యము లేమి, అవిలంబము.

ఉ. ఆ వన వీధిలోఁ గల మృగావళిఁ బక్షుల సంహరించి .... శీఘ్రము పాళియ మెత్తి .... శ్రీకాళహస్తి. ౩-౫౭.

శీఘ్రలంఘనము. సం.విశే. (అ.ఆ.అ.) వడిగాఁ బోవునది.

వి. అ. న. వడిగా దుముకుట.

శీఘ్రవేధి. సం. విశే. (న్. ఈ. న్.) వడిగాఁ గొట్టువాఁడు, మంచి విలుకాఁడు.

శీఘ్రి, సం. విశే. (న్. ఈ. న్.) ౧. వడి గలవాఁడు, చురుకైన వాఁడు, వేగముగా మాటలాడు వాఁడు, ౨. ఉచ్చారణమునఁ దొందర గలవాఁడు.

శీఘ్రియము, సం. వి. అ. పుం. పిల్లుల పోరాటము.

శీఘ్రియుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) వడి గల వాఁడు, వేగవంతుఁడు.

వి. అ. పుం. ౧. విష్ణువు, ౨. శివుఁడు.

శీఘ్రీయము. సం. విశే. (అ. ఆ. అ.) వడిగలది, వేగవంతము.

శీఘ్ర్యము. సం. వి. అ. న. వడి, వేగము.

శీత, సం. వి. ఆ. స్త్రీ. ౧. నాగటి చాలు.

౨. అ. న. చల్లదనము.

అ. పుం. ౧. ప్రబ్బ, ౨. తిరిగి.‡ అ. పుం. చలికాలము.

శీతకము. సం. విశే. (అ. ఆ. అ.) శీతము.

వి.అ.పుం. ౧. చల్లని వస్తువు, ౨. చలి కాలము, ౩. తేలు.

శీతకరము. సం. వి. అ.పుం. కర్పూరము, హారతి కర్పూరము.

**శీతకరుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**శీతకుంభము.** సం. వి. అ. పుం. కరవీర భేదము, పరిమళము గల గన్నేరు.

**శీతకుఁడు.** సం. వి. అ. పుం. ౧. సోమరిపోతు, విలంబము చేయు మనుష్యుఁడు, ౨. కాముకుఁడు, విచారము లేని మనుష్యుఁడు.

**శీతక్షారము.** సం. వి. అ. పుం. వెలిగారము.

**శీతగంధము.** సం. వి. అ. పుం. తెల్లమంచిగంధము.

**శీతచంపకము.** సం. వి. అ. పుం. ౧. దీపము, ౨. అద్దము.

**శీతపుష్పము.** సం. వి. అ. పుం. శిరీషము, దిరిసెనచెట్టు.

**శీతప్రభము.** సం. వి. అ. పుం. కర్పూరము.

**శీతభానువు.** సం. వి. ఉ. పుం. ౧. చంద్రుఁడు,

ఉ....భానుఁడు శీతభానుఁడున్, గాఁడిన మేఘ కాళిమవికారము దూరముసేయ నెంతయున్ వాడిమి చూపె శారద దినంబులు నిర్మల మూర్తి కాకృతిన్. పాండు. ౪-౪౩.

౨. కర్పూరము.

**శీతభీరువు.** సం. వి. ఉ. పుం. ఒక రకము మల్లె.

**శీతమరీచి.** సం. వి. ఇ. పుం. ౧. చంద్రుడు, ౨. కర్పూరము.

**శీతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చల్లనిది, శీతలము, ౨. ఉత్సాహములేనిది, సోమరితనము గలది.

వి. అ. పుం. ౧. నీరుచెట్టు, ౨ ఒకజాతి ప్రబ్బ, ౩. చలికాలము, ౪. కర్పూరము.

న. ౧. చల్లదనము, చలి.

సీ.... శీతాతపంబులు వాతగతము. భార. ఆది. V-౬౦.

౨. నీరు, ౩. దాల్చిన చెక్క, లవంగ పట్ట.

**శీతమూల(క)ము.** సం. వి. అ. న. వట్టి వేరు, ఉశీరము.

**శీతరమ్యము.** సం. వి. అ. పుం. దీపము.

**శీతరు(శ్మి)చుఁడు.** సం. వి. చ. పుం. చంద్రుఁడు

**శీతల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. రోగ విశేషము, స్ఫోటకము, ౨. స్ఫోటకమున కధిష్ఠాన దేవత యైన యమ్మవారు.

**శీతలకము.** సం. వి. అ. న. తెల్ల కలువ.

**శీతలచ్ఛదము.** సం. వి. అ. పుం. చంపకము, సంపఁగిచెట్టు.

**శీతలజలము.** సం. వి. అ. న. ౧. ఉత్పలము, కలువ, ౨. చల్లని నీరు.

**శీతలము.** సం. వి. అ. న. శైత్యోపచారము.

ప్రతిక్షేత్రాలు....నిత్య నైవేద్య దీపారాధనలు, పానకం మొదలైన శీతలాలు, తిరువాళ్ళ మహోత్సవాలు చేయిస్తిమి. ద.శా. ౪-౩౦౯.

విశే. (అ. ఆ. అ.) ౧. చల్లనిది.

సీ....కరి కర శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు కణముల చల్లని గాడ్పున పడి .... భార. ఆది. V-౫౩.

౨. సహింపఁదగినది.

వి. అ. పుం. ౧. కర్పూర భేదము, ౨. కర్పూర తైలము, ౩. చంపకము, సంపంగి చెట్టు, ౪. (సూర్యుడు మేషరాశియందుండునపుడా చరింపఁబడెడి) వ్రత విశేషము.

న. ౧. చల్లదనము, ౨. చలికాలము, ఒక విధమగు సుగంధ ద్రవ్యము, ౪. మంచి గంధము, ౫. ముత్తెము, ౬. పుష్పకాసీసము, ౭. పద్మము, తామర, ౮. వీరణము, అవురుగడ్డి.

**శీతలషష్ఠి.** సం. వి. ఈ. స్త్రీ. మాఘ శుక్ల షష్ఠీ తిథి.

**శీతలి.** సం. వి. ఈ. స్త్రీ. శీతల.

**శీతలిక.** సం. వి. ఆ. స్త్రీ. సోమిదము, శణపర్ణి, శైత్యమున నుపచరించు నొక లత.

చ ... శీ, తలికలు, చిక్కని మూలములుఁ దామర తూఁడులుఁ జెంపు విరులు.... చెలువగు శీతల క్రియలు సేయుద మింకిద సేయ నేఁటికిన్.
కు. సం. ౫-౬౧౬.

**శీతలుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**శీతవల్కము.** సం. వి. అ. పుం. ఉదుంబరము, మేడిచెట్టు. ఇట్లే శీతవీర్యకము.

**శీతశివము.** సం. వి. అ. పుం. ౧. జమ్మిచెట్టు. న. ౧. సైంధవ లవణము, ౨. వెలిగారము.

**శీతశూకము.** సం. వి. అ. పుం. యవ, సస్యవిశేషము.

**శీతసహము.** సం. వి. అ. పుం. పీలు వృక్షము, గోలుగు చెట్టు.

**శీతాంశువు.** సం. వి. ఉ. పుం. ౧. చంద్రుఁడు.

శా.... శీతాంశు స్ఫూర్తులు సంశ్రితావలికి సీయాకార రేఖల్.   నిరంకుశో. ౪-౧౧౭.

౨. కర్పూరము.

**శీతాదము.** సం. వి. అ. పుం. పంటి కుదుళ్ళ జబ్బు.

**శీతాద్రి.** సం. వి. ఇ. పుం. హిమాలయపర్వతము, చలిమల.

**శీతాలువు.** సం. విశే. (ఉ) శీతబాధ పడుచున్న వాఁడు.

**శీతాశ్మము.** సం. వి. న్. పుం. చంద్రకాంతపు రాయి.

**శీ(సీ)త్కారము.** సం. వి. అ. పుం. ౧. ఆకస్మికమగు సంతోషమును (లేక) దుఃఖమును తెలుపు ధ్వని, ౨. రతికాలమున స్త్రీలుచేయు స్త్రీధ్వని విశేషము.

**శీధుగంధము.** సం. వి. అ. పుం. వకుళము, పొగడ చెట్టు.

**శీధుపుఁడు.** సం. వి. అ. పుం. మద్యము (కల్లు) త్రాగు మనుష్యుఁడు.

**శీధువు.** సం. వి. ఉ. పుం. న. ౧. మద్యము.

క. యా, దవులు మనోజ్ఞము లగు శీ, ధువులును మాంసములు వేడ్కతో నింటింటన్.
(సమకట్టికొనుచు) భార. మౌసల. ౨౦.
(చెఱకు రసముతోఁ జేసిన) కల్లు, ౨. ద్రాక్ష సారాయి.

**శీనము.** సం. విశే. (అ. ఆ. అ.) ఘనీభవించినది, పేరుకొన్నది.

వి. అ. పుం. కొండచిలువ.

**శీనుఁడు.** సం. వి. అ. పుం. మూర్ఖుఁడు.

**శీభ్యము.** సం. వి. అ. పుం. వృషభము, ఎద్దు.

**శీరము.** సం. వి. అ. పుం. అజగరము, కొండచిలువ.

**శీర్ణపర్ణము.** సం. వి. అ. న. పడిలిన యాకు. ఇట్లే శీర్ణపత్రము.

పుం. వేఁపచెట్టు.

**శీర్ణపాదుఁడు.** సం. వి. అ. పుం. ౧. యముఁడు. ౨. శనైశ్చరుఁడు. (ఒక గ్రహము)

**శీర్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వాడినది, ౨. ఎండినది, శుష్కించినది, ౩. బద్దలుచేయఁబడినది, చీల్పఁబడినది. ౪. సన్నగిల్లినది, ౫. చిన్నది, అల్పమైనది.

వి. అ. న. పరిమళ ద్రవ్య విశేషము.

**శీర్ణవృంతము.** సం. వి. అ. న. ఖర్బూజాపండు. (ఒకజాతి ఫలవృక్షమని వాచ)

**శీర్షకము.** సం. వి. అ. పుం. రాహు గ్రహము, రాహువు.

న. ౧. తల, ౨. కపాలము, పుఱ్ఱె, ౩. ఇనుప కుళ్ళాయి, శిరస్త్రాణము. ౪. తలపాగ, ౫. న్యాయ సభవారి తీర్పు, న్యాయసభవా రేర్పఱచిన శిక్ష.

**శీర్షచ్ఛేద్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తల నఱకఁ దగిన వాఁడు, శిర చ్ఛేదమున కర్హుఁడు.

**శీర్షణ్యము.** సం. వి. అ. పుం. నిర్మలమును, వంకర గానిదియు నగు కేశము.

న. ౧. శిరస్త్రాణము, ఇనుపకుళ్ళాయి, ౨. తల పాగ, ఉష్ణీషము.

**శీర్షము.** సం. వి. అ. న. ౧. తల, శిరస్సు, ౨. కృష్ణాగరువు.

**శీర్షకోశము.** సం.వి. అ. పుం. తలనొప్పి.

**శీర్షోదయము.** సం. వి. అ. పుం. ౧. (జ్యోతి) మిథు-, సింహ, కన్యా, తులా, వృశ్చిక, కుంభ, మీనములకుఁ బేరు, ౨. తల్లిగర్భమునుండి శిశువు తల వెలికి వచ్చుట.

**శీలఖండనము.** సం. వి. అ. న. సత్ప్రవర్తనము నతిక్రమించుట.

**శీలనము.** సం. వి. అ. న. ౧. అభ్యాసము, అల వఱచుకొనుట, మరలమరలఁ జేయుట, ౨. ప్రవర్తనము, నడవడి, ౩. గౌరవించుట, ౪. ధరించుట, ౫. అతిశయించుట, మీఱుట.

**శీలము.** సం. వి. అ. పుం. ౧. కొండచిలువ, అజగరము.

న. ౧. స్వభావము.

క. ఒలసి మనోవాక్కాయంబుల ద్రోహాభావ మఖిలభూతముల యెడం గలిమియును శీల మది మే, లొలయించును దాన నుల్ల మూన్పుము పుత్రా. భార. శాంతి. ౩.౧౮౭.

మ. అభిజాతుండవు ధర్మశీలుఁడవు....భార.ఆది. ౯.౫౨.

సీ. శ్రుతము నాచారంబు నతిశయవంతంబు లెఱ నహంకార మెక్కింతయేని, లేదు శీలము కడు లెస్స వేషము నిర్వికారంబు.
భార. శాం. ౫౯.౩౨

౨. ప్రవర్తనము, నడవడి. ౩. సత్ప్రవర్తనము, మంచి నడవడి, ౪. మంచిగుణము, ౫. రాగ ద్వేషములను విడుచుట, ౬. సౌందర్యము, చక్కఁదనము, ౭. అభ్యాసము, అలవాటు.

**శీలవంచన.** సం. వి. ఆ. స్త్రీ. సత్ప్రవర్తనము తప్పుట.

**శీలవృత్తము.** సం. విణ. (అ. ఆ. అ.) మంచి నడవడి గలది, సత్ప్రవర్తనము గలది.

వి. అ. న. మంచి నడవడి.

**శీలవృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. సుగుణము, సత్ప్రవర్తనము.

**శీలించు.** సం.స.క్రి. ౧. అభ్యసించు, పరిశీలించు.

మ ... అయ్యర్థ మౌచిత్యముల్ గలయం జైన నెఱుంగ లెంతయును సూక్ష్మార్థంబు శీలించుటన్. హరి. పూ. ౯.౧౭౮.

క. శీలింప వలయు మది శబ్దాలంకారంబు లైన యమకాది విచిత్రాక్షిత బంధ భేదములో లిన యెడ కొన్ని వాని నొనరింతుఁ దగన్. కావ్యా. ౬.౨

౨. సంస్మరించు, తలంచు.

క. ఆ లోనఁ జండితో నుద్దాలకుఁ డిట్లనియె సమ్మదంబున విపరీ తాలాప నరణి మనమున శీలింపక తుష్టిగా భుజించిన కతన్.
జై. భా. ౪.౯౯.

**శీలితము.** సం. విణ. (అ. ఆ. అ.) అభ్యసింపఁ బడినది, అలవఱచుకొనఁ బడినది, ౨. ధరింపఁ బడినది, ౩. దర్శింపఁ బడినది, చూడఁ బడినది, ౪. పేర్పుగలది, ౫. సంపన్నమైనది, కలిగియున్నది, ౬. ఆచరింపఁ బడినది.

వి. అ. న. ౧. అభ్యాసము,అలవాటు, ౨. నడవడి, ప్రవర్తనము.

**శీవము.** సం. వి. ఁడ. పుం. కొండచిలువ.

## శు

శుంగ. సం.వి.ఆ. స్త్రీ. ౧. లేఁతమొలకపైపొర; వరి మొదలగువాని ముల్లు.

శుంగము. సం. వి. అ. పుం. ౧. మఱ్ఱిచెట్టు. ౨. మారేడుచెట్టు. ౩. వరి మొదలగువానిముల్లు.

శుంగి. సం.వి న్.పుం. ౧. మఱ్ఱిచెట్టు. ౨. జువ్విచెట్టు.

శుంఠ (ఁడు) సం.విణ. (అ.ఆ.అ) మూఢుఁడు.

శుంఠకాయ. మి. వి. (శుంఠ+కాయ) శుంఠ, మూఢుఁడు. ద్వి. పరమ. ౫-౩౬౧ పా.

శుంఠి. సం.వి.ఇ.ఈ. స్త్రీ. సొంటి,మహౌషధము.

శుండ. సం.వి.ఆ. స్త్రీ. ౧. ఏనుఁగు తొండము.

సీ. నేపంచభయద శుండాదండ నిర్యాంతవమథు
వ్రల్ పైఁజల్లు వారి గాఁగ. మను. ౧-౧౪

౨. మద్యము. కల్లు. ౩. కల్లంగడి. ౪. తామర తీఁగ. ౫. వేశ్య. ౬. కుట్టిని, తార్పుకత్తె. ౭. నీటి యేనుఁగు.

శుండకము. సం. వి. అ. పుం. యుద్ధమున సైనికుల కుద్రేకమును గల్గించుటకు వాయించు వాద్యవిశేషము.

శుండికుఁడు. సం. వి. అ. పుం. సారాయి కాచువాఁడు; సారాయి అమ్మువాఁడు.

శుండము. సం. వి.అ.పుం. ౧. మదపుటేనుఁగు గండస్థలమునుండి కాఱెడి మదజలము. ౨. ఏనుఁగు తొండము.

శుండాపానము. సం.వి.అ.న. ౧. మద్యపానము. ౨. మద్యపానశాల, కల్లంగడి.

శుండారము. సం.వి.అ.పుం. ఏనుఁగుతొండము.

శుండారుఁడు. సం. వి. అ. పుం=శుండకుఁడు.

శుండాలము. సం. వి. అ. పుం. ఏనుఁగు.

వ......శుండాల సుభట ఘోటకంబుల యంగం
బులఁ గ్రమ్మఱెంచు రుధిరంబదియడంచిన....
భార. ద్రోణ. ౫-౫౭.

శుండి. సం. వి. న్. పుం. ౧. శుండారుఁడు ౨. ఏనుఁగు.

శుండిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. అంగుడి కొండనాలుక ౨. గవుదలవాపు,దవుడక్రిందిభాగ ముబ్బుట

శుండిమూషిక. సం. వి. ఆ. స్త్రీ. చుంచెలుక గంధమూషి.

శుంభుఁడు. సం. వి. అ. పుం.దుర్గచేఁ జంపఁబడిన యొక రాక్షసుఁడు.

శుకతరువు. సం. వి. ఉ. పుం. శిరీషము, దిరిసెన చెట్టు. ఇట్లే శుకద్రుమము మొ॥

శుకనాస. సం. వి. అ. పుం. శుకనాసము, చిలుక ముక్కు. అగిసె ! ఆం. భా. ౨-౬౬.

శుకపుచ్ఛము. సం. వి. అ. పుం. ౧. గంధకము ౨. చిలుకతోఁక.

శుకపుష్పము. సం.వి. అ. పుం. శిరీషము. దిరిసెన చెట్టు !

శుకప్రియ. సం. వి. ఆ. స్త్రీ. నేరేడు, జంబూవృక్షము. ఒకజాతి చెట్టు !

శుకప్రియము. సం. వి. అ.పుం. ౧. దిరిసెనచెట్టు ౨. నేరేడుచెట్టు. !

శుకము. సం. వి. అ. పుం. ౧. చిలుక.

....కదళీకోకిలనికాయ శుకప్రజకాతికా సము
త్కర బిసలీ లసద్ఘనివిధానములుత్తర దిగ్
వర్తనన్. చంద్రికా. ౪-౬.

౨. శిరీషము, దిరిసెనచెట్టు ! ౩. గ్రంథిపర్ణము. గ్రంథవనము ! న. ౧. వస్త్రము. ౨. వస్త్రాంచ

లము, కొంగు ౩. శిరస్త్రాణము, ఇనుపకుళ్ళాయి. ౪. ఉష్ణీషము, తలపాగ.

**శుకవల్లభము.** సం.వి.అ.పుం. దానిమ్మ చెట్టు ¡

**శుకవాహుఁడు.** సం. వి.అ.పుం. మన్మథుఁడు.

**శుకాదనము.** సం. వి. అ. పుం. దానిమ్మ ¡

**శుకి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుచిలుక.

**శుకుఁడు.** సం.వి. అ. పుం. వ్యాసపుత్రుఁడు,శుక మహర్షి.

**శుక్.** సం. వి. చ్. స్త్రీ. శోకము, వగపు.

**శుక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పవిత్రమైనది. ౨. పుల్లనిది. ౩. కఠినమైనది. ౪. కలిసికొన్నది. ౫. నిర్జనము, జనశూన్యమైనది.

వి. అ. న. ౧. మాంసము. ౨. పుల్లనిగంజి, కాంజికము. ౩. పుల్లనిద్రవ్యము.

**శుక్తకము.** సం. వి. అ. న. పులిత్రేఁపు.

**శుక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ముత్తెపుఁజిప్ప.

౨. శంఖము. ౩. నత్తగుల్ల. ౪. పుర్రె పెంకు. ౫. గుఱ్ఱపుసుడి. ౬. గ్రంథద్రవ్య విశేషము. ౭. రెండక్షరములయెత్తు. ౮. మూలవ్యాధి ౯. ఒక విధమగు నేత్రరోగము.

**శుక్తిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ముత్తెపుఁజిప్ప. ౨. పులిచింత ¡

**శుక్తికాస్పర్శము.** సం. వి. అ. పుం. మౌక్తిక మణిదోషము, ముత్యమునందలి దోషము.

ఆ. మౌక్తికంబునఁదుమ మత్స్యాక్షియనునది గాన వచ్చు మీనుకన్నుబోలె జిప్పరజము కదలక జిక్కిన శుక్తికా స్పర్శమండ్రు రత్నశాస్త్ర విదులు. రత్నపరీక్ష. ౫౦.

**శుక్తిజము.** సం. వి. అ. న. ముత్తెము. ఇట్లే శుక్తిబీజము. మొ॥

**శుక్తిపేశి.** సం. వి. ఈ. స్త్రీ. ముత్తెపుఁజిప్ప.

**శుక్తిమంతము.** సం.వి.త్.పుం. కులపర్వతము. ఏడింటిలో నొకటి.

**శుక్తిమతి.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకనది.

**శుక్తిస్పర్శము.** సం. వి. అ. పుం. ముత్తెము మీఁది నల్లనిమచ్చ.

**శుక్రకరము.** సం.విణ. (అ. ఈ. అ) వీర్యవృద్ధి కలిగించునది.

వి. అ. పుం. మజ్జ. ఎముకలనడుమ నుండెడి క్రొవ్వు.

**శుక్రభు(క్కు)జము.** సం. వి. జ్. స్త్రీ. ఆఁడునెమిలి, మయూరి

**శుక్రభువు.** సం. వి. ఊ. పుం. మజ్జ, ఎముకల నడుమనుండెడి క్రొవ్వు.

**శుక్రము.** సం. వి. అ. పుం. ౧. జ్యేష్ఠమాసము. ౨. అగ్ని ౩. చిత్రమూలము ¡ ౪. విష్కంభాది యోగములలో నొకటి ౫. నేత్రరోగవిశేషము.

న. ౧. పురుషుని వీర్యము. ౨. సారము, నిగ్గు.

**శుక్రలము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. శుక్ర సంబంధి. ౨. శుక్రుఁడధిదేవతగాఁగలది. ౩. వీర్య వృద్ధికరమైనది.

**శుక్రలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) వీర్యవృద్ధి గలవాఁడు.

**శుక్రవా(స)రము.** సం. వి. అ. పుం. భృగువారము, ఏడువారములలో నొకటి.

**శుక్రశిష్యుఁడు.** సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

**శుక్రిము.** సం.విణ. (అ.ఆ.అ) = శుక్రలము.

**శుక్రుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఒక గ్రహము. ౨. రాక్షసులగురువు.

**శుక్ల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సరస్వతి. ౨. కలకండ. 3. తెల్లని శరీరకాంతి గల స్త్రీ. ౪. కాకోలి. కారుకొల్లి.

**శుక్లకంఠకము.** సం. వి. అ. పుం. నీరుకోడి.

**శుక్లకర్మ్ముఁడు.** సం. విణ. (న్) పరిశుద్ధమైన నడవడి గలవాఁడు, సత్ప్రవర్తన గలవాఁడు.

**శుక్లకుష్ఠము.** సం. వి. అ. న. తెల్లకుష్ఠము. శ్విత్రము.

**శుక్లధాతువు.** సం. వి. ఉ. పుం. సుద్ద.

**శుక్లపక్షము.** సం. వి. అ. పుం. ౧. నెలలో వెన్నెల క్రమముగా హెచ్చుగు పక్షము. ౨. కొంగ.

**శుక్లమండలము.** సం. వి. అ. న. కంటి తెల్లగ్రుడ్డు.

**శుక్ల(క)ము.** సం. విణ. (అ. ఆ. అ) తెల్లనిది.

వి. అ. పుం. ౧. తెలుపు, ధవళవర్ణము. ౨. శుక్లపక్షము.

**శుక్లము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. తెల్లనిది. ధవళము.

క. జీవుఁడు శుక్లచ్ఛాయా, భావితుఁడైన పురుషు
విష్ణుభావించుటకుం దా వెరవటయగు....భార.
శాంతి. ౫-౪౨౧.

వి. అ. పుం. ౧. తెలుపు. ౨. శుక్లపక్షము. 3. విష్కంభాదియోగములలో నొకటి ౪. ప్రభవాది సంవత్సరములలో నొకటి.

**శుక్ల.** న. ౧. వెండి. ౨. కంటి తెల్లగ్రుడ్డునందలి జబ్బు. 3. వెన్న, నవనీతము. ౪. పులిగంజి. ౫. పురుషునివీర్యము.

గీ. తనకు శుక్లపాత్రంబైన దానిదెచ్చి. భార.
ఆది. V-౧౯౫.

**శుక్లవాయసము.** సం. వి. అ. పుం. ౧. కొంగ ౨. తెల్లకాకి.

**శుక్లవృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పవిత్రమైన జీవన పద్ధతి, ౨. బ్రాహ్మణుల వలన బ్రాహ్మణుఁడు సంపాదించు జీవనాధార ద్రవ్యము.

**శుక్లాపాంగము.** సం. వి. అ. పుం. నెమిలి, మయూరము.

**శుక్లామ్లము.** సం. వి. అ. న. అమ్లశాకము, చింతపండు.

**శుక్లార్మము.** సం. వి. న్. న. నేత్రరోగ విశేషము.

**శుక్లిమము.** సం. వి. న్. తెలుపు, ధవళవర్ణము.

**శుక్లోపల.** సం. వి. ఆ. స్త్రీ. కలకండ, పటికబెల్లము

**శుక్షి.** సం. వి. ఇ. పుం. ౧. వాయువు, గాలి, ౨. ప్రకాశము, కాంతి.

(ఆ. సి.) 3. అగ్ని. (ఆ. ని.)

**శుచ.** సం. వి. ఆ. స్త్రీ. చింత, వగపు, శోకము.

**శుచి.** సం. విణ. (ఇ) ౧. పరిశుద్ధమైనది.

వ....ఎదుర నొక్క జలాశయంబుగని శుచిప్రదే
శంబునఁ దన చేతి కుండలంబులు పెట్టి ....
భార. ఆది. ౯-౦౦౧.

గీ. కలశమాపూర్ణముగ లోనమలమునిండ, బయలు
గడిగి శుచిగానిధరిగి....శివ ధర్మ. ౫-౨౯

౨. తెల్లనిది.

వ ...కంసుని వలని వెఱపున శుచిస్మితయై యుల్ల
నియె. భాగ. ౧౦-౧౨౫.

ఉ....దాని మనోహరాకృతియు దాని శుచిస్మిత
వక్త్రకాంతియున్. భార. ఆది. IV-౧౮౨.

3. ప్రకాశమానము, ప్రకాశించునది, ౪. పుణ్యమైనది, పవిత్రమైనది. కళంకములేనిది, మలినము కానిది, ౫. పవిత్రముగాఁ జేయఁబడినది, శుద్ధి చేయఁబడినది, ౬. నీతిగలవాఁడు, సత్యవంతుఁడు ౭. నమ్మఁదగినవాఁడు, విశ్వసనీయుఁడు.

వి. ఇ. పుం. ౧. తెలుపు, ౨. పవిత్రత, శుద్ధి,

౩. నిష్కపటత, కాపట్యములేమి, మంచితనము ౪. బ్రహ్మచర్యము, ౫. బ్రాహ్మణుఁడు, ౬. జ్యేష్ఠ మాసము, ౭. ఆషాఢ మాసము, ౮. గ్రీష్మ ఋతువు, ౯. నమ్మఁదగిన మిత్రుఁడు, ౧౦. సూర్యుఁడు, ౧౧. చంద్రుఁడు, ౧౨. అగ్ని, ౧౩. శృంగారరసము, ౧౪. శుక్రగ్రహము, ౧౫. చిత్రమూలము†, ౧౬. నిర్దోషియని విడిచి పెట్టుట, ౧౭. శిశువుయొక్క యన్నప్రాశనకాలమునఁ జేసెడి హోమము, ౧౮. శివుఁడు, ౧౯. జిల్లేడుచెట్టు†, ౨౦. ఉపధా శుద్ధుఁడైన మంత్రి (శ.ర) ౨౧. సత్యము, సౌశీల్యము.

**శుచిద్రుమము.** సం. వి. అ. పుం. రావి చెట్టు.

**శుచిప్రణి.** సం. విణ. ఈ. పెదవులతో నీరుపీల్చు వాఁడు.

**శుచిమణి.** సం. వి. ఇ. పుం. స్ఫటికము.

**శుచిరోచి(స్సు)ష్కుఁడు.** సం. వి. స్. పుం. చంద్రుఁడు.

**శుచిశ్రవుఁడు.** సం. వి. స్. పుం. విష్ణువు.

గీ.... శుచులు నా చెవుల కింపు లగుట మునులు
శుచిశ్రవుఁ డంద్రు నన్ను. భార. శాంతి.
౬-౪౩౬.

**శుటీరుఁడు.** సం. వి. అ. పుం. శూరుఁడు.

**శుట్రీర్యము.** సం.వి.న. పరాక్రమము, శౌర్యము.

**శుత్యము.** సం.వి.అ.న. సొంటి, మహౌషధము.

**శుద్ధకోటి.** సం. వి. ఇ. స్త్రీ. (గణిత) సమ భుజములు గల త్రిభుజము నందలి యొక భుజము.

**శుద్ధచైతన్యము.** సం. వి. అ. న. మాయాసంబంధము లేని చైతన్యము.

**శుద్ధజంఘము.** సం. వి. అ. పుం. గార్దభము, గాడిద.

**శుద్ధము.** ౦. విణ. (అ. ఆ. అ) ౧. శుభ్రమైనది, స్వచ్ఛమైనది, ౨. పవిత్రమైనది, ౩. తెల్లనిది, ప్రకాశమానమైనది, ౪. మచ్చలేనిది, కళంకము లేనిది, ౫. నిష్కపటమైనది, అమాయకమైనది, ౬. సత్యమైనది, నిజమైనది, ౭. యోగ్యమైనది, ౮. సరియైనది, తప్పులేనిది, ౯. విడుదల చేయఁ బడినది, ౧౦. కేవలమైనది, తన్మాత్రము.

గీ. శుద్ధ సాత్త్వికగుణసాంద్ర శుక మునీంద్ర.
శ్రీరాధామా. ౧-౫౪.

౧౧. మిశ్రము కానిది, సాంకర్యము లేనిది, కలగలుపు లేనిది.

చం.... .... భూ సురులకు నిచ్చె దక్షిణలు
శుద్ధ సువర్ణ గవాశ్వ హస్తులన్. భార. ఆది.
IV-౧౦౯.

౧౨. సాటి లేనిది, ౧౩. నియోగింపఁ బడినది, ఆజ్ఞాపింపఁబడినది, ౧౪. వాఁడిగాఁ జేయఁబడినది, పదును పెట్టఁబడినది, ౧౫. అనునాసికము కానిది.

వి.అ.న. ౧. పవిత్ర వస్తువు, పరిశుద్ధ పదార్థము, ౨. పరిశుద్ధాత్మము, ౩. సైంధవలవణము(వాచ) లాలి యుప్పు, ౪. మిరియము.

**శుద్ధవంశ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) పవిత్ర వంశమునఁ బుట్టిన వాఁడు.

**శుద్ధవసంత(ము).** సం. వి. అ. పుం. ముప్పది రెండు నపుంసక రాగములలో నొకటి.

గీ. చెంచుమల్హారి దేశాక్షి శ్రీవరాళి (వ)సంత
సామంత శుద్ధవసంత గుజ్జరియును పౌసగు
ముప్పదిరెండు నపుంసకములు. హంస
౧-౧౨౪.

సీ. రామక్రియయు మేశరామక్రియ వసంత
సామంత శుద్ధవసంత మధ్యమాదులు.
ప్రబంధ. ౯౬.

**శుద్ధాంత.** సం. వి. ఆ. స్త్రీ. రాజ్ఞి, రాణి.

**శుద్ధాంతచారి.** సం. వి. న్. పుం. అంతఃపుర పరిచారకుఁడు, కంచుకి.

**శుద్ధాంతపాలకుఁడు.** సం. వి. అ. పుం. అంతఃపురపుఁ గావలివాఁడు, ఇట్లే శుద్ధాంతరక్షకుఁడును.

**శుద్ధాంతము.** సం.వి.అ.పుం. ౧. అంతఃపురము, అంతిపురము.

మ. .... వేసారిదిం జాతురు వీర రుద్ర గజరా ట్శుద్ధాంత ముగ్ధాంగనల్. మను. I-౩౭.

౨. రాజభార్య, రాణి.

గీ. అరుగుఁ గేళీ కులాయ శుద్ధాంతములకు. శృం. నై. ౨-౫.

ఉ. సంతస మంది యే నపుడు శాప జలంబులు పాఱఁ జల్లి వే, దాంతి వచో మహోపనిష దర్థ మయిన్ శుభ రూప వృద్ధ సీ, మంతినిఁ గాశికా నగర మధ్యనివాసిని విశ్వనాథ శు, ద్ధాంతము డాయఁ బోయితిఁ బ్రియంబును భక్తియునుం దలిర్పఁగన్. భీమే. ౨-౧౮౧.

**శుద్ధాత్ముఁడు.** సం.విశ (న్)పరిశుద్ధమైనమనస్సు గలవాఁడు, మంచిమనసు గలవాఁడు.

వి. న్. పుం. ౧. పరమాత్మ, పరబ్రహ్మము, ౨. శివుఁడు.

**శుద్ధాపహ్నుతి.** సం.వి. ఇ. స్త్రీ. అర్థా లంకార విశేషము, ఒకవిధమైన యర్థాలంకారము.

**శుద్ధి.** సం.వి. ఇ. స్త్రీ. ౧. పరిశుభ్రత, స్వచ్ఛత.

మ....సౌమిత్రిని దండించి బ్రస్తుతులఁ జేర్కొంచున్ వచశ్శుద్ధికిన్. మను. ౬-౭.

౨. ప్రకాశము, కాంతి, ౩. పవిత్రత, పూత మగుట.

క. తన మనములోన నంతట, ననుమానము తీఱ శుద్ధి యగు నందాకన్ మనుశౌచము చేయుట తగు .... విజ్ఞా. కాం. ౬-౪౦.

౪. దోషముపోఁగొట్టుకొనుట.

గీ. అజ్ఞులకుఁ బాపశుద్ధ్యర్థమైనయట్టి, తీర్థము.... శివధర్మ. ౨-౧౨౨.

౫. ప్రాయశ్చిత్త సంస్కారము, సంప్రోక్షణము మొ॥గు సంస్కారము. ౬. చెల్లించుట, సొమ్మిచ్చివేయుట ౭. ప్రతిక్రియ. ౮. నిర్దోషియని విడుదల చేయుట ౯. పరియగుట, హెచ్చుతగ్గులులేమి ౧౦. దిద్దుట, సవరించుట ౧౧. తీసివేయుట, ౧౨. దుర్గ.

**శుద్ధికరము.** సం. విశ. (అ. ఈ. అ) శుద్ధిని చేయునది.

**శుద్ధోదనసుతుఁడు.** సం. వి. అ. పుం. బుద్ధదేవుఁడు.

**శుద్ధోదనుఁడు.** సం. వి. అ. పుం. బుద్ధదేవుని తండ్రి (రూ) శుద్ధోదనుఁడు.

**శునకము.** సం.వి.అ.పుం. ౧. కుక్క. ౨. చిన్న కుక్క, కుక్కపిల్ల.

**శునకుఁడు.** సం. వి. అ. పుం. భృగువంశస్థుఁడగు నొకఋషి.

**శునశ్శేపుఁ (ఫుఁ) డు.** సం. వి. అ. పుం. అజీగర్తుని కుమారుఁడగు నొకముని.

**శు (సు) నాశీ (సీ) రము.** సం. వి. అ. పుం. గుడ్లగూబ.

**శు (సు) నాశీ (సీ) రుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఇంద్రుఁడు.

ఉ....సునాశీరమణి ప్రభాపటలచిత్రితకూటము చిత్రకూటమున్ సింహా. భా. ౧. ఆ ౨-౭౨.

సీ. అనునాశీర. సహంకారగరిమకు ననిమషాచలము మీఁదినెలవుసాక్షి. హర. ౭.

**శుని.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుకుక్క.

**శునీరము.** సం.వి.అ.పుం. ఆఁడుకుక్కల గుంపు.

**శున్యము.** సం. విశ. (అ.ఆ.అ) శూన్యము, ఏమియు లేనిది.

వి. అ. న. ౧. ఆఁడుకుక్కలగుంపు, శునీ సమూహము. ౨. సున్న, బిందువు.

**శుభ.** సం. వి.ఆ. స్త్రీ. ౧. ప్రకాశము, కాంతి ౨. సౌందర్యము, అందము. ౩. ఇచ్ఛ, కోరిక.

౪. గోరోచనము. ౫. జమ్మిచెట్టు. ౬. దేవసభ, సుధర్మ. ౭. తెల్లగతికి ౹ ౮. వెదురుబియ్యము. ౯. ప్రియంగులత.

**శుభంభావుకము.** సం. విశే. (అ. ఆ. అ) అలంకరింపఁబడినది, ప్రకాశమానము.

**శుభంయువు (డు)** సం.విశే.ఉ.అదృష్టవంతుఁడు శుభాన్వితుఁడు.

**శుభకృత్తు.** సం. వి. త్. పుం.సంవత్సరములలో నొకటి.

**శుభగంధకము.** సం. వి. అ. న. గోపరసము, బాలెంతబోళము.

విశే. (అ. ఆ. అ) మంచివాసనగలది.

**శుభ(భ్ర)దంతి.** సం.వి.ఈ. స్త్రీ. ౧. మంచి దంతములు గల స్త్రీ. ౨. వాయవ్య మూలనుండు దిగ్గజము భార్య.

**శుభదము.** సం .వి. అ. పుం. అశ్వత్థవృక్షము, రావిచెట్టు.

విశే. (అ. ఆ. అ) శుభమునిచ్చునది, మేలుకలిగించునది.

చ......అయ్యదియే శుభదంబు కుంభజా! శివధర్మ. ౬-౧౨౩.

**శుభము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. ప్రకాశించునది. ౨. చక్కనిది. సుందరమైనది. ౩. శుభప్రదమైనది, శుభము గలిగించునది.

శా. రా జీవాక్షుండుకృతార్థుఁజేయు శుభదృష్టిం / గృష్ణరాయాధిపున్. మను. ౧-౧.
, మంచిది, యోగ్యమైనది.

కం .......శుభదక్షిణ సామంత్ర తంత్ర దాక్షిణ్యా మునన్. భార. ఆది. II-౧౮౮.

వి. అ. న, ౧. క్షేమము, మంగళము,

శా....వినిపింప నీకు శుభమా గా కంచుఁ దర్పోద్ధతిన్. దశా. ౭.౧౦౦.

ఉ....తెల్పఁగదవే తెఱు వెద్ది శుభంబు నీకగున్. మను. ౨-౩౯.

౨. అలంకారము,నగ. ౩. నీరు. ౪. పరిమళము గల యొకజాతి కఱ్ఱ. పుం. విష్కంభాది యోగములలో నొకటి.

**శుభవార్త.** సం.వి.ఆ. స్త్రీ. మంచి వర్తమానము.

**శుభశంసి.** సం. విశే. (న్. నీ. న్.) రాఁబోవు శుభమును జెప్పెడివాఁడు.

**శుభస్రవి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. యజ్ఞశాల. ౨. మంగళప్రదమైన తావు.

**శుభాంగి.** సం.వి.ఈ. స్త్రీ. ౧. అందకత్తె,చక్కని స్త్రీ. ౨. మన్మథుని భార్య, రతి. ౩. కుబేరుని భార్య.

**శుభాంగుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) అందగాఁడు, సుందరుఁడు.

ఉ. ఓక్కొక యింత లేని వికచోత్పల లోచన చిత్తవీథిఁ జల్పార్పఁగ నిలిచిరదశుభాంగుఁడు చేచఁగా చె సంచు. పారిజా. ౧.

**శుభాచారుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మంచి నడవడి గలవాఁడు, సద్వర్తన గలవాఁడు.

**శుభావహము.** సం. విశే. (అ. ఆ. అ.) శుభము గలిగించునది, మంచి గలిగించునది.

క. .... భావ వికార విమార శుభావహ నానా ప్రకార హాఁహారవాధా. భార. ఉద్యో. ౨-౧.

**శుభోదర్కము.** సం. విశే. (అ. ఆ. అ) సుఖప్రదమైన యంతము గలది. శుభమైన యుత్తరకాలము గలది.

**శుభ్రకరము.** సం. వి. అ. పుం. కర్పూరము.

**శుభ్రకరుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**శుభ్రము.** సం. విశే.(అ. ఆ. అ.) ౧. ప్రకాశించునది. ౨. తెల్లనిది.

వి. అ. పుం. ౧. శ్వేత వర్ణము, తెలుపు. ౨. మంచి గంధము.

న. ౧. వెండి. ౨. అభ్రకము. ౩. సైంధవ లవణము. ౪. కాసీసము, అన్నభేది.

శుభ్రాంశువు. సం.వి.ఉ.పుం. ౧. చంద్రుఁడు, కర్పూరము.

శుభ్రి. సం. వి. ఇ. పుం. బ్రహ్మదేవుఁడు.

శురాంగన. సం. వి. అ. స్త్రీ. దేవ వేశ్యలలో నొకతె (వా)

శుల్కఖండనము. సం.వి. అ.న. ప్రభువున కీయవలసిన పన్ను నపహరించుట.

శుల్కగ్రాహకుఁడు. సం.విశే.(అ.ఆ.అ.) పన్ను వసూలు చేయు వాఁడు.

శుల్కగ్రాహి. సం. వి. న్. పుం. శుల్కగ్రాహకుఁడు.

శుల్కదుఁడు. సం.వి.అ.పుం. ౧. శుల్కమిచ్చెడి వాఁడు, పన్ను చెల్లించు నతఁడు, అరిగాఁపు. ౨. ప్రధానము చేయఁబడిన పెండ్లికొడుకు.

శుల్కము. సం.వి.అ.పుం.న. ౧. సుంకము,పన్ను (సంతపన్ను, దారిపన్ను మొ.) ౨. లబ్ధి, ఆదాయము. ౩. కట్టుబడి సొమ్ము. ౪. కన్యాశుల్కము.

వ... ఏనును గురుకార్యంబున మీ శుల్కార్థంబుగా.... భార. ఆది. IV-౨౨౪.

తే. గీ. వచ్చి కృతికన్యకా సముద్వాహమునకు,
శుల్కముగ వాయుగాగోగ్య మ్ముప్రసిద్ధ లిస్తు
నని యల్లుఁ దగుటకు నిచ్చగించె ....
నిరంకుశో. ౧-౧౯.

తన్నుకొఱకై కన్య తల్లిదండ్రుల కిచ్చిన సొమ్ము. ౫. పెండ్లికూఁతున కిచ్చిన యరణము, స్త్రీధనము. ౬. లంచె కిచ్చెడి సొమ్ము. ౭. పందెపు సొమ్ము. (వాచ).

శుల్కశాల. సం. వి. ఆ. స్త్రీ. పన్ను వసూలు చేసెడి చోటు, గాటి పాక, ఘట్టకుటి.

శుల్కస్థానము. సం. వి. అ. న. శుల్కశాల.

శుల్బ(ల్వ)ము. సం. వి. అ. న. ౧. తామ్రము, రాగి, ౨. రజ్జువు, త్రాడు. ౩. జలసమీప ప్రదేశము. ౪. యజ్ఞము. ౫. ఆచారము, పెద్ద లేర్పఱిచిన పద్ధతి, చట్టము.

శుల్లము. సం. వి. అ. న. ౧. రజ్జువు, త్రాడు. ౨. తామ్రము, రాగి.

శుల్వజము. సం. వి. అ. న. ఇత్తడి.ఇట్లే శుల్వాజము, శుల్బీజము.

శుల్వారి. సం. వి. ఇ. పుం. గంధకము.

శుశువు. సం. వి. ఊ. స్త్రీ. తల్లి, మాత.

శుశ్రూష(ణ). సం. వి. ఆ. స్త్రీ. ౧. వినవిచ్ఛ, వినవలయు ననెడి కోరిక. ౨. సేవ, కొలువు. ౩. విధేయత. ౪. గౌరవము. ౫. చెప్పుట.

శుశ్రూషకుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) సేవించు వాఁడు, కొలుచు వాఁడు.

వ....నీవు ధర్మ సూక్ష్మత్వ దర్శి వేను శశ్రూష కుండ నన్నను శాసింపు మనవుడుఁ గపిలుండు ప్రీతుండై యతని కిట్లనియె. భార. శాంతి. ౫-౩౨౫.

వి. అ. పుం. సేవకుఁడు, పరిచారకుఁడు.

శుశ్రూషణము. సం. వి. అ. న. శుశ్రూష.

శుశ్రూషువు. సం. విశే. (ఉ) ౧. వినఁ గోరు వాఁడు, విన నిచ్చగించు వాఁడు. ౨. సేవింపఁ గోరు వాఁడు, కొలువ నిచ్చగించు వాఁడు. ౩. విధేయుఁడు.

శుషము. సం. వి. అ. పుం. ౧. ఎండుట,శోషించుట. ౨. బిలము. ౩. రంధ్రము. ౪. గర్తము, గోయి.

**శుషి.** సం. వి. ఈ. స్త్రీ. శుషము.

ఇ. స్త్రీ. ౧. శోషించుట, ఎండుట. ౨. బిలము., రంధ్రము.

**శుషిర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నది. ౨. నళిని యను గంధ ద్రవ్యము.

**శుషిరము.** సం. విణ. (అ. ఆ. అ.) రంధ్రములు గలది, బెజ్జములు గలది.

వి. అ. పుం. ౧. అగ్ని. ౨. ఎలుక.

న. ౧. రంధ్రము, బిలము. ౨. ఆకాశము. ౩. పిల్లంగ్రోవి మొ.గు వాద్యము.

**శుషిలము.** సం. వి. అ. పుం. గాలి, వాయువు.

**శుష్కము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎండినది.

గీ. అగ్ని శుష్కంబు లార్ద్రంబులైనయట్టి యింధనంబుల వడి దహించు కరణి. శివ ధర్మ. ౨-౧౦౯.

౨. కాల్చినది. ౩. శుష్కించినది, సన్నగిల్లినది. ౪. వాడిపోయినది. ౫. తెచ్చిపెట్టికొనినది, నిజముగాలేనిది. ౬. శూన్యమైనది, ఏమియు లేనిది. ౭. నిరుపయోగమైనది, వ్యర్థమైనది.
శుష్క ప్రియములు శూన్య హస్తములు. (సామెత.)
౮. ఆధారము లేనిది, కారణము లేనిది.
సీ. ఐతిహాసికమాళి యనిపించు నొకవేళ నొకవేళ శుష్క తార్కికత నెఱపు. నిరం. ౪-౭౪.
౯. నొప్పించునది, కఠోరమైనది.

**శుష్కలము.** సం. వి. అ. పుం. న. ౧. ఎండిన మాంసము. ౨. మాంసము.

**శుష్కవ్రణము.** సం. వి. అ. న. ౧. మానిన పుండు. ౨. కాయ గాచిన పుండు, కిణ రూప మగు వ్రణము.

**శుష్కాంగి.** సం. వి. ఈ. స్త్రీ. ఉడుము, గోధిక.

**శుష్కాంగుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) సన్నగిల్లిన యవయవములు గలవాఁడు.

**శుష్కాగ్రము.** సం. వి. అ. న. పొంటి.

**శుష్కించు.** సం. అ. క్రి. ఇంకు, ఎండు.

**శుష్కీభవించు.** సం. అ. క్రి. శుష్కించు, ఎండు.

సీ. పొందది నంభోనిధుల్ శుష్కీభవించిన.......
హంశ్చ. ౧-౧౬౬.

**శుష్ణుఁడు.** సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. అగ్ని.

**శుష్మము.** సం. వి. అ. పుం. ౧. అగ్ని. ౨. అగ్ని జ్వాల. ౩. వాయువు. ౪. పక్షి.
న. ౧. బలము. ౨. తేజస్సు, వెలుఁగు.
న్. పుం. ౧. అగ్ని. ౨. చిత్రమూలము ¡
న. ౧. బలము. ౨. వెలుఁగు, ప్రకాశము.

**శుష్ముఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

## శూ

**శూక.** సం. వి. ఆ. స్త్రీ. కపికచ్ఛువు, దూలగొండి ¡

**శూకకము.** సం. వి. అ. పుం. ౧. ఒక విధమగు ధాన్యము. ౨. సౌకుమార్యము, మృదుత్వము.

**శూకకీట(క)ము.** సం. వి. అ. పుం. ౧. తేలు, వృశ్చికము, నల్లతేలు. ౨. (జ్యోతి) వృశ్చిక రాశి. (మేషాది రాశులలో నెనిమిదవది) ౩. కంబళిఁగ. ౪. గొంగళిపురుగు వై. ని.

**శూకధాన్యము.** సం. వి. అ. న. యవలు మున్నగు ముల్లుగల ధాన్యము.

**శూకపిండి.** సం. వి. ఇ. పుం. ఈ. స్త్రీ. కపికచ్ఛువు, దూలగొండి చెట్టు ¡ ఇట్లే శూకశింబి.

**శూకము.** సం. వి. అ. పుం. న. ౧. వరిమున్నగువాని ముల్లు. ౨. ఏనుపంది ముల్లు. ౩. అగ్రము, వాఁడిగల కొన. ౪. సుకుమారత, మృదుత్వము.

౫. మఱికి నీటం బుట్టునట్టి యొక జాతి విషజంతువు. ౬. విష జంతువుల ముల్లు. ౭. కనికరము, జాలి, దయ. (శ.ర)

శూకలము. సం. వి. అ. పుం. మొండి గుఱ్ఱము, మచ్చికకు సాధ్యము కాని చెడ్డ గుఱ్ఱము, శిక్షింపఁబడని దుష్టాశ్వము.

వ. అట్లు నిశ్వాసంబు నిగుడ నొడలుపొంగఁ బటు కశా ఘాతంబులం గెరలు శూకలాశ్వంబు చందంబునం గెరలి ...భార. శల్య. II-౯౫.

సీ. పెనుఁగు శూకలముల బిరుదుకళంబులఁ జలము దింపక తీర్పఁజాలుట యును. భార. విరా. ౧-౯౫.

శూకవంతము. సం. విణ. (త్. వ. తీ. త్.) ముల్లు గలది.

శూకశింబ(బిక). సం. వి. ఆ. స్త్రీ. శూకపిండి.

శూతి. సం. వి. ఇ. స్త్రీ. పెరుఁగుట, వృద్ధి యగుట.

శూద్ర. సం. వి. ఆ. స్త్రీ. శూద్రజాతి స్త్రీ.

శూద్రకుఁడు. సం. వి. అ. పుం. మృచ్ఛకటిక నాటకము రచించిన యొకానొక రాజు.

శూద్రప్రియము. సం. వి. అ. పుం. పలాండువు, ఉల్లి.

శూద్రప్రేష్యుఁడు. సం. వి. అ. పుం. శూద్రసేవకుఁడు, శూద్రుని కంటె నగ్రవర్ణము వాఁడై శూద్రుని గొలుచు వాఁడు.

శూద్రాగ్త. సం. వి. ఆ. స్త్రీ. ప్రేంకణము !

శూద్రావేదనము. సం. వి. అ. న. శూద్ర జాతి స్త్రీని పెండ్లాడుట.

శూద్రాహ్నికము. సం. వి. అ. న. శూద్రుఁడు చేయఁదగిన నిత్య కృత్యములు.

శూద్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. శూద్రుని భార్య. ౨. శూద్రజాతి స్త్రీ.

ఉ. శూద్రియు శూద్ర భార్య యగు శూద్రియు వైశ్యయు వైశ్య భార్యలు.... విష్ణు. కాం. ౧-౯౩.

శూద్రుఁడు. సం. వి. అ. పుం. నాల్గవ జాతివాఁడు, విరాట్పురుషుని పదముల వలనఁ బుట్టుటచే పాదజుఁ డనఁబడు వాఁడు.

ఆ. ధర్ముఁ డొంద శూద్రయోనియందు మాండవ్యుచే శప్తుఁడై యదేల సంభవించె. భార. ఆది. IV-౨-౬౦.

క...... వింటే, శూద్రుని వచనంబు సద్విజావిదీవన.... భోజరా. ౪-౬౫.

శూన. సం. వి. ఆ. స్త్రీ. ౧. అంగుడి, కొండనాలుక. ౨. జంతువులను వధించు చావడి. ౩. సూన, వధస్థానము. (పంచ సూనము, ౧. చుల్లి (పొయ్యి). ౨. పేషణి, సన్నెకల్లు. ౩. ఉపస్కరము, చీపుర. ౪. కండని, రోలు. ౫. ఉదకుంభము, నీళ్ళ కడవ అనునవి.)

శూనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వాఁచినది, ఉబ్బినది. ౨. పెరిఁగినది, వృద్ధిపొందినది.

శూనారము. సం. వి. అ. పుం. ౧. కుక్క పాలు, పాముగ్రుడ్డు.

శూన్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. బోలు వెదురు. ౨. వంధ్య, గొడ్రాలు. ౩. నాగ తాళి, బొమ్మజెముఁడు. ౪. మల్లె తీఁగ.

శూన్యపదవి. సం. వి. ఈ. స్త్రీ. జీవాత్మమార్గము.

శూన్యమధ్యము. సం. వి. అ. పుం. కిక్కస. !

శూన్యమనస్కుఁడు. సం. విణ. (అ. ఆ. అ.). మనస్సు లేని వాఁడు, పరధ్యానముగా నుండు మనస్సు గలవాఁడు. ఇట్టే శూన్యహృదయుఁడు ను.

శూన్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వట్టిది, రిక్తము, ఏమియు లేనిది. ౨. పరధ్యానముగా నున్నది. ౩. ఉనికి లేనిది, లేనిది, సత్తారహితము. ౪. పాడుపడినది. నిరనము.

ఆ. శూన్యవిపినమున విధైన్యస్వతంత్రసంచారి
యై వసించుఁ గౌరవేంద్ర. భార.
ఆశ్రమ. ౨-౫౭.

౫. వివాదగ్రస్తమైనది. ౬. రహితము.

గీ. హిమ ధరాధర కన్యకాధీశచరణముఁగుంచిర
ధ్యానమజ్ఞానశూన్యుడైన బ్రాహ్మణునిజన్మ
మరయ నిష్ఫలము సూవె. శివధర్మ. ౩-౪౪.

౭. ఉపేక్ష చేయఁదగినది. ౮. నిష్కపటమైనది, అమాయకము. ౯. నిరర్థకము, అర్థము లేనిది. ౧౦. అసంపూర్ణము, ఊనము. ౧౧. దిగంబరము దిసమొలదైనది.

వి. అ. న. ౧. శూన్యప్రదేశము, ఏమియు లేని చోటు. ౨. ఆకాశము, అవకాశము. ౩ సున్న, బిందువు. ౪. అభావము, లేకపోవుట, సత్తారాహిత్యము.

శూన్యముఖుఁడు. సం.విణ.(అ.ఈ.అ.) ౧. వెలవెలఁబోయిన ముఖము గలవాఁడు. ౨. తిలకము లేని (వట్టి) మొగము వాఁడు. ఇక్లే శూన్య పద నుఁకు.

శూన్యవాదము. సం. వి. అ. పుం. శూన్యమే సర్వకారణ మనెడి సిద్ధాంతము, బౌద్ధమత సిద్ధాంత విశేషము. (దేనికిని అస్తిత్వము లేదని యుండలి సారము)

శూన్యవాది. సం. వి. న్. పుం. ౧. నాస్తికుఁడు. ౨. శూన్యమే సర్వకారణ మను బౌద్ధుఁడు.

శూరంమన్యుఁడు. సం. వి. అ. పుం. తన్ను శూరునిగా నెంచుకొనెడి వాఁడు.

శూరమాని. సం. వి, న్. పుం. ఆత్మ స్తుతి చేసికొనెడి వాఁడు.

శూరము. సం. వి. అ. పుం. ౧. సింహము. ౨. అడవిపంది. ౩. సాలవృక్షము. ౪. జిల్లేడుచెట్టు ౫. చిత్రమూలము. ‡ ౬. గజనిమ్మ.‡

శూరసేనము. సం. వి. అ. పుం. మథురా పుర ప్రాంత దేశము.

శూరసేనుఁడు. సం. వి. అ. పుం. ౧. శూరసేన దేశ నివాసి. ౨. శూరసేన దేశాధిపతి.

శూరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ధైర్యముగల వాఁడు, బలము గలవాఁడు, పరాక్రమము గల వాఁడు.

చ. ఇటు దగునయ్య శూరులకు నెల్లను బోకద
యిట్లు కాదె......భార. ద్రోణ. ౨-౨౫౭.

వి. అ. పుం. ౧. వీరుఁడు, యోద్ధ, పరాక్రమి. ౨. సూర్యుఁడు. ౩. కృష్ణుని తాత యగు నొక యాదవుఁడు.

శూర్పకర్ణము. సం. వి. పుం. ఏనుఁగు (చేటల వంటి చెవులు గలది)

శూర్పకర్ణుఁడు. సం.వి.అ.పుం. గణపతి,. పుం. విఘ్నేశ్వరుఁడు.

శూర్పణఖ. సం. వి. ఆ. స్త్రీ. చేటలవంటి గోళ్లు గలది, రావణాసురుని చెల్లెలగు నొక రాక్షసి.

శూర్పము. సం. వి. అ. పుం. ౧. చేట. పుం. రెండు ద్రోణముల ప్రమాణము.

సూర్పవాతము. సం. వి. అ. పుం. చేటతోఁ జెరుగుటవలనఁగలిగిన గాలి, చేటగాలి.

తే. గీ. సామరదివృక్ష....శూర్పవాతఘట్టనలఁ
బాఱు పెనుపొల్లు కట్టువోలె ఆము. ౪-౧౩.

శూర్పశ్రుతి. సం.వి. ఇ.పుం.= శూర్పకర్ణము.

శూర్పి. సం. వి. ఈ. స్త్రీ. ౧. చిన్నచేట. ౨. శూర్పణఖ. ౩. పిల్లలయాటవస్తువు.

శూ (సూ) ర్మము. సం. వి. అ. పుం. ౧. ఇనుప విగ్రహము. ఇనుముతోఁ జేసినప్రతిమ. ౨. పట్టెడ, కమసాలి దాగలి.

శూర్మి (సూ) ర్మి. సం.వి.ఇ.పుం.ఇ.ఈ.స్త్రీ= శూర్మము. రూపాం.

శూర్మిక. సం. వి. ఆ. స్త్రీ.

**శూల.** సం.వి.ఆ. స్త్రీ. ౧. కొఱతవేసెడి కొయ్య, కొఱ్ఱు. ౨. వేశ్య.

**శూలకము.** సం. వి. అ. పుం. మొండిగుఱ్ఱము, మచ్చికచేయరానిగుఱ్ఱము, దుష్టాశ్వము.

**శూలగ్రంథి.** సం.వి.ఇ.స్త్రీ. దూర్వావిశేషము ఒకజాతి గఱిక.

**శూలఘ్నము.** సం. విశే. (అ. ఈ. అ) శూల రోగము పోఁగొట్టునది. వి. అ. పుం. ఒక జాతి వృక్షము.

**శూలద్వి(ట్టు)షము.** సం. వి. ష. పుం. హింగువు, ఇంగువ.

**శూలధన్వుఁడు.** సం. వి. న. పుం. శివుఁడు.

**శూలధరుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు..

**శూలధారి.** సం. వి. న. పుం. శివుఁడు.

**శూలనాశనము.** సం. వి. అ. న. సౌవర్చ లవణము. (వాచ)

**శూలపాణి.** సం. వి. ఇ. పుం. శివుఁడు.

**శూలము.** అ. పుం. న. ౧. ఈఁటె.

క. శూలమున నురము వ్రచ్చినఁ గూలె గతాసుఁ
డయి దైత్యకుంజరుఁ డంతన్.
మార్కం. ౬-౨౧౪.

౨. శివుని త్రిశూలము. ౩. మాంసము గాల్చెడి యినుపకాడ. ౪. అపరాధులఁ గొఱతవేసెడి కొయ్య. ౫. ఓర్వరాని బాధ. ౬. కడుపునొప్పి. శిశ్నునొప్పి. వాతరోగము. ౭. చావు, మృత్యువు. ౯. టెక్కెము, జెండా. ౧౦. అమ్ముట ౧౧. అమ్మఁదగిన వస్తువు.

సీ....గుట్టు సూలయనఁగ నొప్పట్టు శూల అం. భా. ౨-౧౨౭.

పుం. (జ్యోతి) విష్కంభాదియోగములలో నొకటి.

**శూలశత్రువు.** సం. వి. ఉ. పుం. ఆముదపుఁ జెట్టు.

**శూలాకృతము.** సం. వి. అ. న. శూలమున గాల్చినమాంసము.

**శూలి.** సం. విశే. (న.నీ. న) ౧. శూల మాయుధముగా గలవాఁడు. ౨. శూలరోగి.

వి. న. పుం. ౧. ఈటెవాఁడు. ౨. కుందేలు. ౩. శివుఁడు.

**శూలికము.** సం.విశే. (అ.ఆ.అ)౧.బల్లెముగలది. ౨. శూలమునఁ గాల్పబడినది.

వి. అ. పుం. కుందేలు. న. శూలమునఁ గాల్చిన మాంసము.

**శూల్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఇనుప కాడతోఁ గాల్పఁబడినది. ౨. కొఱత వేయఁదగినది.

వి. అ.న. శూలముతోఁ గాల్చిన మాంసము.

## శృ

**శృంఖల.** సం.వి.ఆ.. స్త్రీ ౧.సంకెల,ఇనుపగొలుసు

ఉ. కాలిక లోహశృంఖలలఁ గల్మషకర్ములఁ
బట్టి గట్టిగాఁ గీలుకొలిగించికట్టి..శివధర్మ ౪-౬౭

౨. గొలుసు ౩. ఏనుఁగుకాలిగొలుసు. ౪. మొలనూలు. స్త్రీలనడికట్టు. ౫. కొలతగొలుసు. ౬. వరుస. పరంపర.

**శృంఖలకము.** సం. వి. అ. పుం. ౧. గొలుసు. ౨. ఒంటె; ఉష్ట్రము. ౩. పారిపోకుండఁగా గాలికిఁగొయ్యగొలుసు కట్టిన యొంటె.

**శృంఖలయమకము.** సం. వి. అ. న. యమకాలంకారభేదము, ఒకానొక శబ్దాలంకారము.

**శృంఖలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పురుషుల నడికట్టు. వృక్షవిశేషము.

**శృంఖలితము.** సం. విణ. (అ. ఆ. అ) (శృంఖలము గలదిగాఁ జేయఁబడినది) గొలుసుకట్టఁబడినది, సంకెలవేయఁబడినది.

**శృంగకము.** సం. వి. అ. న. ౧. కొమ్ము. ౨. బాల చంద్రుని కొన. ౩. కొనగల వస్తువు.

శా. పూవుంబూపుల జోక పుచ్చుకొనియెన్ భూపాల లీలావతీభ్రూవల్లీనిభశృంగకం బగు లసత్పుంద్రేక్షుకోదండమున్. భీమ. ౨-౩౭.

౪. చిమ్మనగొట్టము.

**శృంగజము.** సం. వి. (అ. ఆ. అ) కొమ్ముతోఁ జేయఁబడినది.

వి. అ. పుం. బాణము. న. గంధద్రవ్యవిశేషము; అగరుచందనము (వాచ)

**శృంగజాహము.** సం. వి. అ. పుం. శృంగమూలము, కొమ్ముకుదురు.

**శృంగప్రహారి.** సం. విణ. ఈ. ణీ. ఈ. కొమ్ములతోఁ బొడుచునది.

**శృంగబేరము.** సం. వి. అ. న. (మా) శృంగవేరము.

గీ. రాజనలతోడ శృంగబేరములతోడఁ జెఱుకడఁపుఁబెండలముతోడ శేమతోడ నొప్పు నాలుగు పొలములం దుపవనములు భువన సారము పీఠికాపురవరమున. భీమ. ౨-౫౬.

**శృంగము.** సం. వి. అ. న. ౧. కొమ్ము, విషాణము.

సీ.... .... శృంగ చతుష్టయాంచితమస్తకద్వయం బున గిత్తకోటీరములు వెలుంగ ....
చిత్రభా. ౪-౬౩.

౨. పర్వతాగ్రము. కొండకొన.

ఉ. శృంగములేని నీలగిరి చెల్వున గ్రీడి కిరీటహీనుఁడయ్యుం గనుపట్టె... భార. కర్ణ. ౩-౨౭

౩. ఇంటిపైకప్పు.

గీ. తుంగసౌధ శృంగ సంగతాంబర మాచు ....
సింహా. భా. ౧. అ. ౨-౧౧౩.

౪. ఎత్తు. ఔన్నత్యము. ౫. ప్రభుత్వము. ౬. ప్రాధాన్యము, గొప్పఁదనము ౭. చంద్రుని మొన, నెలవంకకొమ్ము. ౮. కొన, అగ్రము. ౯. (ఊదుట కుపయోగపడెడి) కొమ్ము, కొమ్ముబూరా. ౧౦. చిమ్మనగొట్టము. ౧౧. కామోద్రేకము. ౧౨. గురుతు. ౧౩. పద్మము. ౧౪. నీటియూట. ౧౫. కోఱ, దంష్ట్ర.

ఆ. ఒక్క శృంగమునను యుర్వియెత్తితి వనహావతారలీల యతిశయిల్ల. భార. శాంతి. ౬-౪౩౭

పుం. జీవక మను గంధద్రవ్యవిశేషము. (శ. ర)

**శృంగనాదము.** సం. వి. అ. పుం. పొదకుప్పి కొమ్ముతోఁ జేయబడిన యోగుల సుషిరవాద్యవిశేషము. (శ. ర.) సింగినాదము.

తే.గీ. భూరిమధుపానమునఁ జొక్కు పువ్వురేణు పటలిభూతిఁ దాల్చి నేర్పరితనమున ఘుంకృతులు శృంగనాదంబు జాడగాఁగఁ దుమ్మెదలు పింఛమించె సిద్ధులవిధమున. చిత్రభా. ౨-౧౧౭.

**శృంగమోహి.** సం. వి. ఈ. పుం. చంపకము సంపెఁగచెట్టు.

**శృంగవంతము.** సం. విణ. త్. వతీ. త్) కొన గలది. అగ్రముగలది.

పుం. ౧. కొండ ౨. కురువీరమునకు హద్దుగా నుండెడి యొకపర్వతము.

**శృంగవేరము.** సం. వి. అ. న. ౧. మిర్జాపురమునకు సమీపమున గంగాతీరమున నుండెడి యొకపట్టణము. ౨. ఆర్ద్రకము, అల్లము.

**శృంగాటకము.** సం. వి. అ. పుం. ౧. మూఁడు కొనలుగల కొండ, మూఁడు శిఖరములుగల పర్వతము. న. ౧. నాలుగు బాటలు కలసిన చోటు. నాలుగు వీధుల మొగ.

వ. లోకలోచనోత్సవంబుగా శృంగాటకప్రదేశంబుల యౌవనవిలాససుందరు లగు రాజనందులు
గాదము. ౪-౨౩.

౨. భక్ష్యవిశేషము. ౩. ద్వారము.

**శృంగాటము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొక పర్వతము. ౨. వృక్షవిశేషము. ౩. చతుష్పథము నాలుగు వీధుల మొగ.

**శృంగాగకము.** సం. వి. అ. పుం. కామము, వలపు. న. సింధూరము. విణ. కొమ్ములుంగలది.

**శృంగారచేష్ట.** సం.వి.ఆ. స్త్రీ. కాముకచర్య. శృంగారాభినయము.

**శృంగారభూషణము.** సం. వి. అ. న. సింధూరము.

**శృంగారము.** సం. వి. అ. పుం. ౧. కావ్యము లందలి నవరసములలో మొదటిది. శృంగార రసము. (ఇది సంభోగశృంగారము. విప్రలంభ శృంగార మని రెండువిధములు గలది)

౨. కామము. వలపు. ౩. శృంగారవేషము. సొగసైన వేషము. ౪. రతి. సురతము.

వ. ఇవ్విధంబున మృగనేత్రాచితశృంగారంబు నంగీకరించి....చిత్రభా. ౩-౧౭౭.

౫. ఏనుఁగుశరీరముపై సింధూరముతోఁ జేయు నలంకారము. ౬. అలంకారము. ౭. చిహ్నము. గుఱుతు. న. ౧. లవంగము. ౨. సింధూరము. ౩. అల్లము. ౪. గందవొడి. ౫. కాలాగరువు.

**శృంగారయోని.** సం. వి. ఇ. పుం. మన్మథుఁడు

**శృంగారవేశ (ష)ము.** సం. వి. అ. పుం. సింగారించుకొనుట, అలంకరించుకొనుట. ౨. శృంగారవిలాసమునకుఁ దగినవేషము.

**శృంగారి.** సం. విణ. (న్.ఈ.న్) ౧. కాముకుఁడు. వలపుగలవాఁడు. విటుఁడు. ౨. మంచివేషము గలవాఁడు. ౩. శృంగారసంబంధమైనది. ౪. సిందూరముతో రంగువేయబడినది.

వి. న్. పుం. కామోద్రేకము గల నాయకుఁడు. ౨. మాణిక్యము, కెంపు. ౩. ఏనుఁగు. ౪. అలంకారము. సింగారము. ౫. పోఁకచెట్టు. ౬. తాంబూలము.

**శృంగారించు.** సం. స. క్రి. అలంకరించు.

శా....మణివిభూషారాశి నందంబుగా, శృంగారించిరి సంభ్రమంబున సుకేశిన్ మిత్రకేశిన్ సఖుల్. వరాహ. ౪-౪౬.

ద్వి. పురముశృంగారింపఁ బురవీధులందు కస్తూరి నలికించి కమ్మపూవిరులు. ద్వి. భా. ఉద్యో. ౧-౨౪ పా.

**శృంగి.** సం.వి.ఇ.పుం. నగలకుపయోగించు బంగారము, స్త్రీ, ఒక జాతి యాఁదుచేప.

ఈ. స్త్రీ. ౧. నగలకుపయోగించు బంగారము. ౨. మందునకుపయోగించు వేరు. ౩. ఒకదినుసు విషము. ౪. ఒకజాతి యాఁదు చేఁప.

**శృంగి.** సం. విణ. (న్. ఈ. న్.) ౧. కొమ్ముగలది ౨. శిఖరము గలది.

వి.న్.పుం.౧. పర్వతము. ౨. ఏనుఁగు.౩. కొట్టు. ౪. మేషము, గొఱ్ఱె. ౫. శివుఁడు. ౬. శివుని పరిచారకులలోనొకఁడు. ౭. ఒకజాతి వృక్షము. ౮. ఒకానొక ముని.

**శృంగికము.** సం. వి. అ. న. ఒక దినుసు విషము.

**శృంగిణము.** సం. వి. అ. పుం. మేషము, గొఱ్ఱె

**శృంగిణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆవు. ౨. ఒక జాతిమల్లె. ౩. మానేరు తీఁగె.

**శృంగీకనకము.** సం. వి. అ. న. నగలకై యుపయోగపడెడి బంగారము.

**శృంగోచ్ఛ్రయము.** సం. వి. అ. పుం. ఎత్తైన కొండ పైభాగము, పర్వతాగ్రము.

**శృణి.** సం. వి. ఇ. స్త్రీ. సృణి, అంకుశము.

**శృతము.** సం.విణ. (అ. ఆ. అ.) ౧. వండఁబడినది. ౨. కాఁచఁబడినది. (నీరుమొ.)

**శృదరము.** సం. వి. అ. పుం. పాము.

శృద్ధము. సం.విణ. (అ.ఆ.అ.) ౧. శరీరమునుండి విడువఁబడినది.(గాలి మొ.) (అపానవాయువు) ౨. తిరుపఁ బడినది.

శృధువు. సం.వి.ఉ.పుం. ౧. బుద్ధి. ౨. అపానవాయువు. ౩. గుదము, గుదస్థానము.

## శే

శేకువు. సం. వి. ఉ. పుం. ఒక రకమైన గడ్డి.

శేఖరము. సం. వి. అ. పుం. ౧. తలపై ధరించు పూల దండ.

చ. ధరణి సురాత్మజుండు గుణధన్యుఁడు వీఁడని
పెద్ద లెన్న నా, దరణముతో నుతింప నము
దంచితకీర్తిసమృద్ధి నంత శే, ఖరమగు పెల్ల
నంశధనకల్మషవృత్తికిఁ దెచ్చెఁ జూడు
మా, పురుషుల భాగ్యమున్ జిగురుఁ బోల ల
చిత్తము పెట్టుమాటునో. నిరంకుశో. ౨-౧౫

౨. కిరీటము. ౩. కొండ కొన, పర్వతాగ్రము ౪. (సమాసాంతమున) స్వజాతి శ్రేష్ఠ వస్తువు.

క. నీ వడిగిన ప్రశ్నంబులు... శైవాగమ శేఖర
ములం శంభుక్రియలున్. శివధర్మోత్తరము.
౧-౧౩౪.

౫. ఒక జాతి ధ్రువగీతి, సంగీతమునఁ బల్లవి. ౬. లవంగము.

శేఖరించు. సం. అ. క్రి. అగ్రిగణ్యత వహించు.

వ. కమలరేఖలు సంగంబులతోడ సకలజనసంసే
వ్యతన్ ప్రాభవంబుఁ గొందిన కరణి భద్ర
చామరరేఖలు శామినార్థప్రదానంబు సేయ
శేఖరించుకొన్న తీరున— పార్వ. ౪-౧౩౦.
వా. పంచ. ౧-౨౨౨.

శేఖరితము. సం.విణ. (అ.ఆ.అ.) శేఖరముగాఁ జేసికొనఁబడినది.

సీ. ....మృగపాదఘట్టన మృదలమా జేసుదుసూళి
శేఖరితసింధూర మనఁగ. సింహా. భా. ౧ ఆ.
౨-౭౬.

శేపము. సం. వి. అ. పుం. ౧. మేఢ్రము, మగగుఱి. ౨. వృషణము, అండకోశము. ౩. తోఁక.

శేపస్సు(ము). సం.వి.స్.న. శేఫము, మగగుఱి.

శేఫము. సం. వి. అ. న. శేపము.

శేఫస్సు(ము). సం. వి. స్. న. శేపము.

శేఫాలి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. నల్లవావిలి.‡

శేఫాలిక. సం. వి. ఆ. స్త్రీ. శేఫాలి.

శేముషి. సం. వి. ఈ. స్త్రీ. బుద్ధి, ప్రజ్ఞ.

శే(సే)వధి. సం. వి. ఇ. పుం. ౧. మహా కోశగృహము, గొప్ప బొక్కసము, నిధి.

సీ. దేవకీవసుదేవశేవధినందనం,దిరరసాలా
వాసపరభృతంబు ... పాండు. ౩-౧౭౭.

౨. మహాపద్మము మొదలగు కుబేరుని నిధులలో నొకటి.

శేవము. సం. వి. అ. పుం. ౧. మేఢ్రము, మగగుఱి. ౨. పాము. ౩. ఎత్తు, ఔన్నత్యము. ౪. సుఖము. ౫. సంపద, ఐశ్వర్యము.

న. ౧. మేఢ్రము. ౨. సుఖము.

శేలువు. సం. వి. ఉ. పుం. శ్లేష్మాతకము, విరిగి‡ (శ.ర.)

శేవలము. సం. వి. అ. న. ౧. నీటిపై బయలుదేఱు నాఁచువంటిపాఁచి. ౨. ఒకజాతిమోవని.

శేవలిని. సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

శేవాలము. సం. వి. అ. న. శేవలము.

శేష. సం. వి. ఆ. స్త్రీ. ౧. దేవాలయమునఁ బవిత్రపదార్థముగా భక్తులకీయఁబడెడి దేవతాప్రసాదము, అనుగ్రహించి యిచ్చిన పువ్వులు,

సీ. పసిఁడి గిన్నియలు చేపట్టి పుణ్యస్త్రీలు శిర
మున మాక్తికశేష లిడఁగ. సింహా. భా. ౧ ఆ. ౨-౬౦.

"రతిభర్తిశేషా మివ భర్తు రాజ్ఞామ్" సం. కు. స. ౩-౨౨.

"ప్రసాదాన్న నిర్మాల్యదానే శేషేతి
కీర్తితా" విశ్వ.

"మాల్యాక్షతాది దానే స్త్రీ శేషా——"
(నానార్థ శేషర)

౨. ఉచ్ఛిష్టము, విశేషము, అక్షత్వము.

ఆ. సన్నుఁగన్న యా విధాత కంటెను దాన శేష
గాంచె నఖిల సృష్టిలోన. కు. సం. ౧-౭౪.

"విశేషము" అను నర్థమున "ము" ముపర్ణకము లోపించిన శేషశబ్దము అని కు. సం. వ్యాఖ్య. ఇది యపూర్వ ప్రయోగము.

శేషకాలము. సం. వి. అ. పుం. ౧. మిగిలిన కాలము. ౨. మరణకాలము.

శేషజాతి. సం. వి. ఇ. స్త్రీ. (లీలా.గ) భాగహారము లేఁగా మిగిలిన భిన్నమును పూర్ణాంకమున లయము చేయుట.

శేషభోజనము. సం. వి. అ. న. ఉచ్ఛిష్టము భుజించుట, మిగిలినయన్నము తినుట.

శేషము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. శేషించినది, మిగిలినది. వి. అ. పుం. న. ౧. మిగులు.

క. ఆసిన లభ్యాంగములు బిగియఁ కును వేల్పు లకును పెట్టిన శేషం బతిశుద్ధమట్టియన్నము సతతిము గుడుచుట గృహస్థసద్ధర్మ మిలన్. విజ్ఞా. కా. ౧-౭౦.

(క) మిగిలిన పదార్థము. (ఋణశేషము మొ.)
(గ) మిగిలిన యంశము. (వాక్యవిశేషము మొ.)
(చ) వ్యయము కాఁగా మిగిలిన పదార్థము. ౨. అధ్యాహారము, తెచ్చి పెట్టుకొనవలసిన పదము. ౩. విడువల, రప్పించుకొనుట.

పుం. ౧. పర్యవసానము, ఫలితము. ౨. సమాప్తి ముగింపు. ౩. చావు, అంతము. ౪. ఏనుఁగు.

న. ౧. అన్నశేషము, తినఁగామిగిలిన యన్నము, ఉచ్ఛిష్టము. ౨. నిర్మాల్యము, ధరించి తీసివేసిన పూలమాల.

శేషరాత్రి. సం. వి. ఇ. స్త్రీ. అపరరాత్రి, కడపటి జాము.

శేషశయనుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.

శేషశాయి. సం. వి. న్. పుం. విష్ణువు.

శేషాక్షతలు. (శేష+అక్షతలు) సం. వి. అ. పుం. బ. ప్రసన్నతతో నొసఁగు నక్షతలు, సేసఁబ్రాలు.

సీ. సిద్ధాంగనలు చల్లు శేషాక్షతల తోన మెలు పారు కమ్మఁదెమ్మెరలు వీచె——కు. సం. ౧౨-౯౭౦.

మ—— సురపుష్పవృష్టి గుయన్ శేషాక్ష తౌఘంబుతో. కు.సం. ౧౧-౧౭౦.

శేషావస్థ. సం. వి. ఆ. స్త్రీ. ముదిమి, వార్ధకము.

శేషాహి. సం. వి. ఇ. పుం. ఆదిశేషుఁడు.

సీ. శ్రీకూర్మమునయందు శేషాహిపర్యంకమునం దంబు ప్రేమ్మ చెంగల్వ దండ. భీమ. ౨-౫౧.

శేషి. సం. వి. న్. పుం. సర్వజగద్రక్షకుఁడయిన నారాయణమూర్తి.

శేషించు. సం. అ. క్రి. మిగులు.

గీ. సాయకంబులు మూఁటి ముజ్జగము గెలువఁ బాలుపెట్టి శేషించిన బాణయుగళి మదనుఁడే తత్ప్రగల్భో పదమునందు, గౌరవం బొప్పఁ బట్టంబు గట్టఁబోలు. నైష. ౩-౧౬౨.

వ. ఇంతియు నుపసంహృతంబై నందు విశేషించి యుండునది యెయ్యది — మార్క. ౪-౬.

శేషుఁడు. సం. వి. అ. పుం. ౧. వేయిపడగలు గల సర్పరాజు. ౨. బలరాముఁడు. ౩. లక్ష్మణుఁడు.

# శై

శైక్ష్యము. సం. విణ. (అ. ఈ. అ) శిక్ష్యమున దీనికొనిపోఁబడినది, కావడిమట్టునఁగొనిపోఁబడినది.

శైక్షికుఁడు. సం. వి. అ. పుం. శిక్షయందుఁ (వేదాంగమునందుఁ) బలీనుఁడు.

శైక్షుఁడు. సం. వి. అ. పుం. శిక్షాధ్యయనము చేయు విద్యార్థి, శిక్షచదువువిద్యార్థి. ౨. శిక్ష యందుఁబ్రవీణుఁడైనవాఁడు. ౩. ఆరంభకుఁడు.

శైఖరికము. సం. వి. అ. పుం. అపామార్గము, ఉత్తరేనుచెట్టు. ఇట్లే శైఖరేయము.

శైఖ్యము. సం. విశే. (అ. ఆ. అ) శిఖగలది, శిఖరముగలది.

శైఘ్ర్యము. సం. వి. అ. న. వడి, వేగము. త్వర.

శైత్యము. సం. వి. అ. న. చలి, చల్లఁదనము.

గీ. తమ తమకు నొద్దికైన సాధనము లొసఁగి సారెఁజేసిరి శైత్యోపచారవిధులు.

రాధికా. ౩-౭౮.

శైథిల్యము. సం. వి. అ. న. ౧. బిగువులేమి. శాసననిర్బంధములేమి. ౨. మాంద్యము. మెల్లన. ౪. దౌర్బల్యము. పిఱికితనము.

శైనేయుఁడు. సం. వి. అ. పుం. సాత్యకి, శ్రీకృష్ణుని పిన్నతండ్రి కొడుకు.

శైన్యుఁడు. సం. వి. అ. పుం. శైన్యులు. బ. శినివంశస్థులు.

శై (వ్య) బ్యము. సం. వి. అ. పుం. ౧. కృష్ణుని నాలుగుగుఱ్ఱములలో నొకదాని పేరు. ౨. గుఱ్ఱము.

శై (వ్యా) బ్యుఁడు. సం. వి. అ. పుం. కురు పాండవయుద్ధమునఁ బాండవపక్షమున యుద్ధము చేసిన యొకానొకరాజు.

శైలకము. సం. వి. అ. న. శైలేయ మను గంధ ద్రవ్యము.

శైలగంధము. సం. వి. అ. పుం. ఒకవిధమగు చందనము.

శైలజ. సం. వి. ఆ. స్త్రీ. ౧. హైమవతి. పార్వతి. ౨. గజపిప్పలి !

శైలజము. సం. వి. అ. న. శైలేయ మను గంధ ద్రవ్యము.

శైలతనయ. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

శైలధన్వుఁడు. సం. వి. న్. పుం. ఈశ్వరుఁడు.

శైలధరుఁడు. సం. వి. అ. పుం. శ్రీకృష్ణుఁడు.

శైలపతి. సం. వి. ఇ. పుం. హిమాలయము.

శైలపత్త్రము. సం. వి. అ. పుం. బిల్వము. మారేడుచెట్టు.

శైలబీ (పీ) జము. సం. వి. అ. న. నల్లజీడిచెట్టు.

శైలభిత్తి. సం. వి. ఇ. స్త్రీ. రాలు చెక్కెడి యులి, టంకము.

శైలము. సం. విశే. (అ. ఆ. అ.) శిలామయము. వి. అ. పుం. ౧. పర్వతము, ౨. నీటికడ్డముగా వేయుకట్ట. ౩. పాషాణము. పెద్దఱాయి. న. ౧. వెలి గారము. ౨. శిలాజతువు. శైలేయమను గంధ ద్రవ్యము. ఒకదినుసు కాటుక.

శైలరాజము. సం. వి. అ. పుం. హిమాలయము.

శైలశిబిరము. సం. వి. అ. న. సముద్రము.

శైలసారము. సం. విశే. (అ. ఆ. అ.) పర్వతము వలెఁ గదలనిది, పాషాణమువలె గట్టిది.

శైలసుత. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

శైలాటము. సం. వి. అ. పుం. ౧. సింహము. ౨. స్ఫటికము. ౩. తెల్లనిగాజు. శ్వేతవర్ణకాచము.

శైలాటుఁడు. సం. వి. అ. పుం. కొండవాఁడు. కిరాతుఁడు, బోయ ౨. దేవలుఁడు. పూజారి.

శైలాది. సం. వి. ఇ. పుం. నందికేశ్వరుఁడు. శివుని ముఖ్యపరిచారకుఁడు.

శైలాలి. సం. వి. న్. పుం. నటుఁడు, నర్తకుఁడు.

శైలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. వ్యాకరణసూత్రముల సంక్షిప్తవివరణము. ౨. అర్థముచెప్పెడి పద్ధతి, మొదటసామాన్యముగా నర్థముచెప్పి పిమ్మట దానిని విస్తరించి వివరించుట 3. నడవడి, ప్రవర్తనము. ౪. రచనారీతి.

శైలికుఁడు. సం. వి. అ. పుం. కొండవాఁడు, బోయ, కిరాతుఁడు.

శైలిక్యుఁడు. సం. వి. అ. పుం. ధూర్తుఁడు, మోసగాఁడు.

శైలూషము. సం. వి. అ. పుం. బిల్వము మారేడు ।

శైలూషి(కి). సం. వి. ఈ. స్త్రీ. ౧. నర్తకి. నటి.

అ....పసుల విధము కాక యీశైలూషిఁగా వనంగ రాదు కంకభట్టు. భార. విరా. ౨-౧౫౨.

శైలూషుఁడు. సం. వి. అ. పుం. ౧. నర్తకుఁడు నటుఁడు, ఆటకాఁడు.

వ....మాఱి శైలూషుండ కాడు కితవుండునుం గావున భార. విరా. ౨-౧౫3.

౨. గాయకుఁడు. సంగీతపు మేళమునకు నాయకుఁడు. 3. తాలధారకుఁడు. సంగీతపుమేళమునఁ దాళమువేయువాఁడు. ౪. ధూర్తుఁడు మోసగాఁడు. ఇట్లే శైలూషికుఁడు.

శైలేంద్రస్థము. సం. వి. అ. పుం. భుజపత్త్రి వృక్షము.

శైలేయము. సం. విశే. (అ. ఈ. అ) ౧. పర్వతమందున్నది, శైలభవము. ౨. దానినుండి పుట్టినది. 3. పర్వతమువలె నున్నది, శిలామయము.

........ఏలే శైలేయస్తని యేలే బాలేందునిటల యేలాఁతినఁటే. విజయ. ౨-౯3.

వి. అ. పుం. ౧. సింహము. ౨. తేఁటి, భ్రమరము. న. ౧. శిలాజిత్తు. ౨. పరిమళము గల ధూపద్రవ్యము. 3. దాతియుప్పు. సైంధవలవణము.

శైలేయి. సం. వి. ఈ. స్త్రీ. పార్వతి.

శైల్యము. సం. విశే. (అ. ఆ. అ) శైలి. స్త్రీ. రూ. శిలామయము, దాతిది. వి. అ. న. కాఠిన్యము, గట్టితనము.

శైవము. సం. విశే. (అ. ఈ. అ.) శివసంబంధమైనది. వి. అ. పుం. ౧. శైవమతము (శివుఁడే పరమాత్మయనెడి మతము) ౨. ఉమ్మెత్తచెట్టు । న. శివప్రభావము తెలుపుపురాణము, పదునెనిమిది పురాణములలో నొకటి.

శైవ(వా)లము. సం. వి. అ. పుం. ౧. నీటిపాఁచి, నాఁచు.

చ. కమరెనశేషలోకసదకైరవపంక్తులు శైవలంబులన్. భార. ఆది. ౧-౨౬౬.

వ. శైవాలవల్లికిం దల్లియై చెలువారునూగారును. పాంచు. 3-౧౭౯.

న. పద్మకాష్ఠము, సువాసనగలయొక జాతిచెట్టు.

శైవ (వా) లిని. సం. వి. ఈ. స్త్రీ. నది. ఏఱు.

శైవుఁడు. సం. వి. అ. పుం. ౧. శివభక్తుఁడు, శైవమతస్థుఁడు.

శైశవము. సం. వి. అ. న. ౧. శిశుత్వము. పసితనము.

తే. గీ....ఎన్నఁడోకో వియద్దింగ మీఁది, వాంఛ పుట్టించె శైశవావస్థయందె. భోజరా. 3-౨౨

౨. బాల్యము, పదునాఱుసంవత్సరములలోపు వయసు.

శైశిరము. సం. విశే. (అ. ఈ. అ.) శిశిరఋతు సంబంధి, శీతకాలము సంబంధమైనది.

వి. అ. పుం. నల్లని చాతకపక్షి.

శైష్యోపాధ్యాయిక. సం. వి. ఆ. స్త్రీ. శిష్యోపాధ్యాయుల తనము. విద్య చెప్పుట, చదివించుట.

## శో

**శోకచర్య.** సం. వి. ఆ. స్త్రీ. శోకమున మునుఁగుట, శోకాధీనుఁ డగుట.

**శోకనాశము.** సం. వి. అ. పుం. ౧. అశోక వృక్షము. ౨. దుఃఖనాశము.

**శోకము.** సం. వి. అ. పుం. చింత, దుఃఖము, వగపు, బాధ, గొప్పదుఃఖము.

ద్వి. తమతమ వారలు తమబంధుజనులు,తమలుట జూచి శోకము నొందువారు. రం. రా. సుం

తే. గీ. పుత్రశోకాపహంబును బుణ్యతమము, నైనయాఖ్యానము....భార.ద్రోణ. ౨-౨౧౪.

**శోకలా (సుఁ) కుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) దుఃఖమునకు లోఁబడినవాఁడు.

**శోకవరాళి.** మి. లి. ముప్పదిరెండు నపుసంక రాగములలో నొకటి.,

సీ. ... జికేగారిగౌళ శోకవరాళి పున్నాగ గుమ్మ కాంభోజి....హంస. ౫-౧౨౮.

గీ....శంకరాభరణమును శోకవరాళి మేఘరంజి ప్రబంధ. ౯౬.

**శోకవికలుఁడు.** సం.విశే.(అ.ఆ.అ) శోకముచేఁ గలఁతనొందినవాఁడు. ఇట్లే శోకవిహ్వలుఁడు, శోకాభిభూతుఁడు, శోకావిష్టుఁడు.

**శోకస్థానము.** సం. వి. అ. న. శోకకారణము, దుఃఖహేతువు.

**శోకాపనోదము.** సం. వి. అ. పుం. శోకము పోఁగొట్టుట.

**శోకారి.** సం. వి. ఇ. పుం. కదంబము. కడిమి i

**శోకి.** సం. విశే. (న్.ఈ. న్) శోకముగలవాఁడు.

**శోకించు.** సం. అ. క్రి. దుఃఖించు.

క. మతి నొక్కించుకయును లే నుతునకుఁ గోడలికిఁ జేసి శోకించెదనే కృతకృత్యత్వంబున వి్రశుతులగు నయ్యిరువురును నశోచ్యులు మనకున్. మార్క. ౩-౨౪

శా....మహాశూరుం డాతఁడుతద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్....భాగ.... ౭-౩౮.

**శోచకము.** సం. విశే. (అ.ఆ. అ) శోకించునది, వగచునది, బాధపడునది.

**శోచనము.** సం. వి. అ. న. శోకము. వగపు.

**శోచనీయము.** సం. విశే. (అ. ఆ. అ.) శోకింపదగినది, వగవఁదగినది, దుఃఖపడదగినది.

**శోచిష్కేశుఁడు.** సం. వి. అ. పుం. అగ్నిదేవుఁడు.

**శోచిస్సు.** సం. వి. స్. న. ౧. వెలుఁగు, ప్రకాశము, కాంతి. ౨. జ్వాల.

**శోచ్యము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. శోకింపదగినది, వగవఁదగినది.౨.దుష్టము. ౩.నీచమైనది. అధమము

**శో (శౌ) టీర్యము.** సం. వి. అ. న. పరాక్రమము, శౌర్యము.

**శోఠము.** సం. వి. అ. పుం. పావురము. (వాచ)

**శోఠుఁడు.** సం.విశే.(అ.ఆ.అ.)౧.మూర్ఖుఁడు, తెలివి మాలినవాఁడు. ౨. నీచుఁడు.అల్పుఁడు. దుష్టుఁడు చెడ్డవాఁడు.౪.సోమరి.వి. అ. పుం. ౧. మూర్ఖుఁడు.౨. సోమరి, తిండిపోతు. ౩. నీచమనుష్యుఁడు. ౪. ధూర్తుఁడు.

**శోణపుష్పకము.** సం.వి.అ. పుం. కోవిదారము. ఎఱ్ఱకాంచనము i

**శోణము.** సం. విశే. (అ, ఆ, ఈ, అ) ఎఱ్ఱనిది. రక్తవర్ణము గలది.

క. తరుణప్రవాళ శోణో, దరతలమై శంఖచక్ర
ధరమై వరపుష్కరపుష్కలమై హరికర,
పరసీరుహ మనఁగ గలశజలనిధి చెలగున్.
పాండు. ౩-౧౮౭.

౨. కొంచెమెఱ్ఱనిది. ౩. పసుపుపచ్చనిది.
వి. అ. పుం. ౧. ఎఱుపు. రక్తవర్ణము. ౨. అగ్ని ౩. ఒకజాతి ఎఱ్ఱచెఱకు. ౪. కొంచెమెఱ్ఱనిగుఱ్ఱము ౫. శోణానదము. ౬. అంగారకగ్రహము. ౭. ఒకానొక సముద్రము. ఎఱ్ఱసముద్రము. న. ౧. రక్తము, నెత్తురు. సిందూరము.

**శోణరత్నము.** సం. వి. అ. న. కెంపు, పద్మరాగము.

**శోణాంబువు.** సం. వి. ఉ. పుం. ప్రళయకాలమునం దుద్భవించు మేఘవిశేషము.

**శోణాశ్మము.** సం. వి. న్. పుం. ౧. పద్మరాగము. కెంపు. ౨. ఎఱ్ఱసిలాయి.

**శోణితపారణ.** సం. వి. ఆ. స్త్రీ. రక్తపుకూడు, రక్తాహారము.

**శోణితపుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) రక్తము త్రావువాఁడు.

**శోణితపురము.** సం. వి. అ. న. బాణాసురుని పట్టణము.

**శోణితము.** సం. విశే. (అ. ఆ. అ) ఎఱ్ఱనిది.
వి. అ. న. ౧. నెత్తురు, రక్తము. ౨. కుంకుమపువ్వు.

**శోణితాహ్వయము.** సం. వి. అ. న. కుంకుమపువ్వు.

**శోణిమము.** సం. వి. న్. పుం. ఎఱుపు, రక్తవర్ణము.

**శోణితోపలము.** సం. వి. అ. పుం. కెంపు, పద్మరాగము. ఇట్లే శోణోపలము.

**శోధఘ్నము.** సం. విశే. (అ. ఈ. అ.) వాఁపును పోఁగొట్టునది.
వి. అ. పుం. భల్లాతకి, నల్లజీడి చెట్టు.

**శోధజిత్తు.** సం. విశే. (త్) = శోధఘ్నము.
వి. త్. పుం. భల్లాతకి, నల్లజీడి చెట్టు.

**శోధజిహ్వము.** సం. వి. అ. పుం. ఘూర్ణవ గజ్జెరు

**శోధము.** సం. వి. అ. పుం. వాఁపు, ఉబ్బు.

**శోధరోగము.** సం. వి. అ. పుం. రోగవిశేషము. జలోదరము.

**శోధహృత్తు.** సం. విశే. (త్) వాఁపును పోఁగొట్టునది.
వి. త్. పుం. నల్లజీడిచెట్టు.

**శోధకము.** సం. విశే. (అ. ధ. కా. అ) ౧. పవిత్రము చేయునది. ౨. వివేచనకారి ౩. దిద్దునది. సరిచేయునది.
వి. అ. పుం. వ్యవకలనము. తీసివేఁత. న. ౧. ఒకరకపు మన్ను.

**శోధకుఁడు.** సం. వి. అ. పుం. ౧. పవిత్రము చేయు మనుష్యుఁడు. ౨. శుద్ధము చేయువాఁడు.

**శోధనకుఁడు.** సం. వి. అ. పుం. నేరము చేసిన వానిని శిక్షించు రాజకీయాధికారి. (చూ. మృచ్ఛకటికము)

**శోధనము.** సం. విశే. (అ. ఈ. అ) ౧. పవిత్రము చేయునది. ౨. శుద్ధము చేయునది. మొ. వి.
వి. అ. న. ౧. శుద్ధముచేయుట. ౨. పుండు మొదలగు వానిఁగడుగుట. ౩. తప్పుదిద్దుట. ౪. పరిశీలనము.

ఆ. ఆత్మశోధనంబు లవి ముఖ్యములు కాని
బాహ్యశోధనములు పనికిరావు. శివధర్మ.
౫-౪౯.

౫. (ఋణము. మొ) తీర్చుట. ౬. ప్రాయశ్చిత్తము, దోషపరిహారము చేసికొనుట. ౭ (లోహ

ములు శుద్ధిచేయుట ౯. శాస్త్రి, శిక్ష. ౯. (గణిత) తీసివేత. ౧౦. అన్నభేది. ౧౧. మలము. పురీషము. ౧౨. విరేచనము. పుం. నిమ్మ i

**శోధని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. చీపురుకట్ట సమ్మార్జని. ౨. తమలపాకుల తీగె. ౩. నీలి i

**శోధము.** సం.వి.అ.పుం. ౧. పవిత్రముచేయుట. శుభ్రపరచుట. ౩. దిద్దుట, సరిచేయుట. ౪. (ఋణము మొ) తీర్చుట ౫. ప్రతిక్రియ, మాఱుసేఁత.

**శోధించు.** సం. స. క్రి. ౧. వెదకు. పరీక్షించు.

శా. శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోబాధ చేయేటికిన్. భార. ౨-౧౯౩.

క. నానావిహారశైలోద్యానసభాతీర్థదేవతాగృహమృగయాస్థానమున కరుగునెపమును, మానుగ శోధింపవలయు మానవపతికిన్. భార. ఆది. ౭-౧౦౯.

క. బహువర్షసహస్రంబులు బ్రహ్మహిణుంచుమహాదియు నన్యథోభువన బాల్ బహుళక్రియ శోధించి దహనస్తంభంబు తుదయుఁ దమ్మాలఁబున్. శివరా. ౧-౧౦౯.

గీ........గూఢచారులు దేవ యీకుక్షివేసి కడుపు శోధింపు సకలంబు గానవచ్చు. వరాహ. ౫-౭౩.

౨. శుద్ధిచేయు.

వ. యజనస్థానంబును సమ్మార్జనలేపనాదుల శోధించి ...శివరా. ౧-౧౯౧

**శోధితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. శుభ్రము చేయఁబడినది. ౨. పవిత్రము చేయఁబడినది. శుద్ధి చేయఁబడినది. ౩. వస్త్రగాలితముఁజేయబడినది. ౪. దిద్దఁబడినది. ౫. తీర్పఁబడినది. (ఋణము) ౬. ప్రతిక్రియచేయఁబడినది. శాస్తి చేయఁబడినది. ౭. నిరపరాధయనివిడువఁబడినది.

**శోధ్యము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. పవిత్రము చేయఁదగినది.శుద్ధిచేయఁబడినది. ౨. శుభ్రపఱుపఁదగినది. శుద్ధి చేయబడినది. ౩. తీర్పఁదగినది. (ఋణము మొ) ౪. ప్రతిక్రియ చేయఁదగినది.

**శోధ్యుఁడు.** సం. వి. అ. పుం. తనపై నారోపింపఁబడినదోషము పరిహరించుకొనఁదగిన పురుషుఁడు, ముద్దాయి.అభియుక్తుఁడు.

గీ. క్రొత్తకుండలోనఁ గ్రూరసర్పమునిడి, యుర్విలిముగఁజేసి యందులోన నిమ్మపండు వేసి నెమ్మితోఁ దివియంగ, శోధ్యుడైనవాఁడు శుద్ధుడయ్యె- విజ్ఞా. కాం. ౩-౧౨౧.

**శోఫజిత్తు.** సం. వి. త. పుం. నల్లజీడిచెట్టు. భల్లాతకి i

**శోఫము.** సం. వి. అ. పుం. వాఁపు. ఉబ్బు.

**శోఫహృత్తు.** సం. వి. త. పుం. = శోఫజిత్తు.

**శోభ.** సం.వి.ఆ. స్త్రీ. ౧. ప్రకాశము. వెలుఁగు. దీప్తి.

శా....దిశాస్తోమంబు శోభాదరిద్రాణం బయ్యె నశోకమండనములు నిద్రాణంబు లయ్యెంగడున్. మను. ౩-౧౨.

౨. చక్కఁదనము,సౌందర్యము. స్వాభావిక సౌందర్యము సొగసైన వర్ణనము, ౩. అలంకారము. ౪. పసుపు. ౫. గోరోచనము.

**శోభకృత్తు.** సం. వి. త. పుం. ప్రభవాదిసంవత్సరములలో నొకటి.

**శోభన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పసుపు. ౨. సౌందర్యవతి యగు స్త్రీ. సుగుణములు గల స్త్రీ. ౩. గోరోచనము.

**శోభనకము.** సం. వి. అ. పుం. శోభాంజనము, మునగచెట్టు.

**శోభనము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. ప్రకాశించునది, ౨. సుందరమైనది. ౩. శుభప్రదమైనది. ౪. బాగుగా నలంకరింపఁబడినది. ౫. సుగుణములు గలది.

వి. అ. పుం. ౧. గ్రహము(సూర్యాది). ౨. శుభ ఫలములు కలుగుటకై చేసెడిహోమము. ౩. విష్కంభాది యోగములలో నొకటి.

వి. అ. న. ౧. స్త్రీలు వివాహాదులందు పాడు నొకవిధమగు పాట.

క. ఆ లలనామణి కాగ, యయ్యాలి యొకానొక్క
వేళ నక్కజలీలన్, వ్యాలున్ శోభనములు
ధవళాలున్ మొదలైనపాటలం దగ చేర్చెన్.
శుక. ౧-౪౩౪.

(శ. ర. ఈప్రయోగము చే "సోబానలు" అని పఠించి "సోబాన" అను వేఱుపదముగా నిచ్చెను) ౨. పుంస్సంధానము. గర్భాధానము.

గీ. అపుడు సుముహూర్తమునను గర్భాదిమునులు
శోభనముఁ జేసి రానిత్యశోభనులకు. రాధికా.
౧-౧౦౦.

(ఈ రెండు పదములును తెలుఁగునందే కలవు) ౩. సౌందర్యము. ౪. పద్మము. ౫. శుభము, శుభ కర్మము.

సీ. కట్టెదుటను బ్రాహ్మికలశద్వయంబును, శోభన
స్ఫూర్తమై సొంపుమీఱఁగని... కళా. ౫-౦౫

క. లాభంబు ధర్మముఖ్యము, గాభిరపడి మార్గశుద్ధి
గనుఁగొని కైకోల్గా భూసురుల నిహపర,
శోభనములు నేఁడె చెప్పు శ్రుతివాక్యంబుల్.
భార. శాంతి. ౨-౪౧౦.

**శోభాంజనము.** సం. వి. అ. పుం. మునగ, శిగ్రువు i

**శోభి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. శోభించునది.

మాలిని. సురప వృషచూడా శోభిరత్నాంశువీచి
స్ఫురణ శుభగపాదాంభోజ సంచార కేళి ....
భార. విరా. II-౩-౬౫.

(ప్రకాశించునది).

౨. సుందరము, మనోజ్ఞమైనది.

**శోభించు.** సం. అ. క్రి. శోభిల్లు, ప్రకాశించు. (శ. ర.)

**శోభితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అలంకరింపఁబడినది, సొగసుగాఁ జేయఁబడినది. ౨. సుందరమైనది, మనోహరమైనది.

**శోభిల్లు(లు).** సం. అ. క్రి. ప్రకాశించు.

మ. సుమహోవర్ణచతుష్కపుష్పవితతిన్ శోభిల్లి ...
భార. ఆది. ౧-౬౫.

ఉ....అది దీప్తతరంబగు నొడ్డనంబు శోభిల్లుచు
వైరిదృష్టులకు భీకరమైచనుఁ గ్రొంచనామకం
బెల్లి ఘటింపు. భార. భీష్మ. ౨-౨౦.

ఉ.......ఏ శుభశ్లోకుని మానసాబ్జమున శోభిలెడి
దారకహంస మట్టి వాల్మీకిమహర్షి శేఖరు
నమేయగుణాకరు నాశ్రయించెదన్.
ఉ. రా. ౧-౯.

ప్రకాశితమగు, బయల్పడు, ప్రకటమగు.

శా....మాగధు లెల్లన్ సామంబు దానంబు నం,
భేదంబున్ బనిలేమ దండవిధశోభిల్లన్ బ్రయో
గించి.... భాగ. ౧౦ పూ. ౧౫౩౦.

వ. ఒకవంక కుడ్యనిభంబైనయాధంబు శోభిల్లును....
శివరహస్య. షష్ఠ. ౩-౧౪౫.

గీ....కాంతిపూరంబు శోభిల్లు శాంతమూర్తి.
భార. విరా. I-౧౨.

**శోషణము.** సం. విణ. (అ. ఈ. ఆ.) ౧. ఎండించునది, శోషిల్లఁ జేయునది. ౨. వడలించునది, వాడించునది.

వి. అ. పుం. మన్మథుని బాణములలో నొకటి.

సీ....శుష్కపవాన సంశోషణములు....శివధర్మ
౫-౧౨౬.

న. ౧. ఎండించుట, శోషిల్లఁజేయుట. ౨. పీల్చుట, లయముచేయుట. ౩. తఱిగిపోవుట, వ్యయమగుట ౪. వడలుట. ౫. సొంటె.

**శోషము.** సం. వి. అ. పుం. ౧. ఎండుట, ఇగిరిపోవుట, కంఠశోషము. ౨. వడలుట, వాడుట. (ఉదా. శరీరశోషము) ౩. శ్వాసకోశసంబంధమైన క్షయరోగము, క్షయరోగము.

**శోషసంభవము.** సం. వి. అ. న. పిప్పలి వేరు.

**శోషి.** సం. విణ. (న్. ఁ్. న్.) వదలించునది, వాడఁజేయునది.

**శోషించు.** సం. అ. క్రి. శుష్కించు, క్షీణించు.

సీ. రమియించుచును గామరాగాధికాసక్తిఁ జేసి
శోషించి విచిత్రవీర్యుఁ డమరపురికేఁగిన....
భార. ఆది. ౪-౨౧౬.

మ. సురభిత్సైన్యము సైన్యముం బొరయుచున్
శోషించి సైన్యంబులో హరిమోద్రిలన్ నిలువంగలేక పఱచెన్ హాహా నినాదంబులన్.
భాగ. ౧౦-౧౯౩.

వ....తద్విశిఖంబు లసంఖ్యాకంబులయి నిశాటుల శరీరంబులు శోషింపం జేయుచు....ఉ. రా. ౨-౬౧.

౨. (కై శోషిల్లు) శుష్కింపఁజేయు, క్షీణింపఁజేయు.

మ. మానమాత్సర్య మూలము వాఁ జాలిన వారి పల్కులకు నైనద్ధ్యంబు గావించు సజ్జలు భూశాఖన కాష్ఠంబున్ సఖులనై శోషింతు రత్యంతమున్. భార.ఆది. ౮-౩౧.

**శోషితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎండినది, శోషిల్లినది. ౨. వసలినది, వాడినది. ౩. తఱిగినది, క్షీణించినది.

**శోషిలు(ల్లు).** సం. అ. క్రి. అణఁగు, శోషించు. (శోషిలు = వెతఁజేయు అని భా.)

సీ. హాటకశోరముల గోహటి శోషిలవి మర్వార గర్వాటోప వీరభటులు. ౨.భా. ౬-౧౫౪.

"శౌ"

**శౌండి.** సం. వి.న్. పుం. శౌండికుఁడు.
ఈ. స్త్రీ. పిప్పలి.

**శౌండికి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. సారాయి మొదలగునవి కాఁచి యమ్మెడి స్త్రీ. ౨. ఒక సంకీర్ణ జాతి స్త్రీ.

**శౌండికుఁడు.** సం. వి. అ. పుం. ౧. సారాయి మొదలగువానిఁ గాఁచియమ్మెడివాఁడు. ౨. ఒక సంకీర్ణజాతి పురుషుఁడు.

**శౌండికేయుఁడు.** సం.వి. అ.పుం. రాక్షసుఁడు.

**శౌండిని.** సం. వి. ఈ. స్త్రీ. శౌండికి.

**శౌండీరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గర్వించువాఁడు. ౨. ఉన్నతస్థితికి వచ్చినవాఁడు.

**శౌండుఁడు.** సం.విణ. (అ.ఈ.అ.) ౧. మద్యమందాసక్తి గలవాఁడు. ౨. మద్యపానాదికముచే మత్తెక్కినవాఁడు. ౩. గర్వముచే నొడలెఱుంగనివాఁడు. ౪. (సప్తమీతత్పురుషమున) దక్షుఁడు, నిపుణుఁడు.

శా....గిరిరాట్కన్యాంఘ్రిపూజాక్రియా,శౌండ
శ్రీధరకామినక్షిపురరక్షాదక్షిణ ప్రేక్షణా.
శివధర్మ. ౪-౧౧౫.

(ఉదా. దానశౌండుఁడు, అక్షశౌండుఁడు)

**శౌకము.** సం. వి. అ. న. శుకసమూహము, చిలుకలగుంపు.

**శౌక్తము.** సం .విణ. (అ. ఈ. అ.) పుల్లనిది.

**శౌక్తికము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. శుక్తిసంబంధి, ముత్తెము సంబంధమైనది.

ఉ. సాగరసారవారిరుహ శౌక్తికమౌక్తికవిద్రుమ
ద్రుమైలాగురుచందనంబులు.... భార. సభా II-౧౧౦.

౨. పుల్లనిది.

**శౌక్తికేయము.** సం. వి. అ. న. ముత్తెము.

**శౌక్తేయము.** సం. వి. అ. న. ముత్తెము.

**శౌక్రము.** సం. విణ. (అ.ఈ.అ.) శుక్రసంబంధమైనది, రేతస్సంబంధి.

**శౌక్లికేయము.** సం. వి. అ. పుం. విషభేదము, ఒకవిధమైన విషము.

శౌక్ల్యము. సం. వి. అ. న. శుక్లత్వము, తెలుపు భావత్వము.

శౌచకర్మము. సం. వి. న్. న. శుద్ధిని గలిగించు హోమాది క్రియ, శుద్ధి సంస్కారము.

శౌచకల్పము. సం. వి. అ. పుం. శౌచకర్మము.

శౌచకూపము. సం. వి. అ. పుం. మఱుఁగుదొడ్డి.

శౌచము. సం. వి. అ. న. ౧. పాటిశుద్ధ్యము, పవిత్రత, నైర్మల్యము.

వ. సకలకర్మంబులయందు భావశౌచంబె శౌచంబు; బాహ్యశౌచంబు శౌచంబుగా దని ప్రమాణంబు లున్నవి. శివధర్మ. ౫-౭౬.

౨. పవిత్రముచేయుట. ౩. ముడికి పోఁగొట్టుట ౪. ఆరోగ్యత,మంచితనము

శౌచాచారము. సం.వి.అ.పుం. శౌచకర్మము.

శౌచికుఁడు. సం. వి. అ. పుం. శుద్ధిచేయువాఁడు, శుభ్రము చేయువాఁడు.

శౌచేయుఁడు. సం.వి.అ.పుం. చాకలి, రజకుఁడు.

శౌటీరుఁడు. సం. వి. అ. పుం. ౧. గర్వి,గర్వము కలవాఁడు.

వి. అ. పుం. ౧. శూరుఁడు. ౨. గర్వము గల మనుష్యుఁడు. ౩. సన్న్యాసి, యతి. ౪. వడు మంత్రిపుత్రిక గలవాఁడు.

శౌటీర్యము. సం. వి. అ.న. ౧. గర్వము, దురభిమానము. ౨. పరాక్రమము, శౌర్యము.

శౌద్ధోదని. సం.వి.ఇ.పుం.శుద్ధోదనుని పుత్త్రుఁడు, బుద్ధుఁడు.

శౌద్రము. సం.విశే.(అ.ఈ.అ.) శూద్రసంబంధి, శూద్రజాతి సంబంధ మైనది.

శౌద్రుఁడు. సం. వి. అ. పుం. ద్వాదశవిధ పుత్త్రులలో నొకఁడు. ద్విజాతులలోఁ బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులలో) నొకనికి శూద్రాంగనయందుఁ బుట్టిన పుత్త్రుఁడు.

శౌనకుఁడు. సం. వి. అ. పుం. ఋగ్వేద ప్రాతిశాఖ్య మొదలగునవి రచించిన యొక ఋషి.

శౌనము. సం. వి. అ. న. పశుహింసాశాలలో నుంచిన మాంసము.

శౌనికము. సం. వి. అ. పుం. వేఁట, మృగయ.

శౌనికుఁడు. సం. వి. అ. పుం. ౧.మాంసవిక్రేత, కటికవాఁడు. ౨. పక్షులఁ బట్టువాఁడు, వేఁటకాఁడు.

శౌభము. సం. వి. అ. పుం. పోఁకచెట్టు, క్రముకము

౨. హరిశ్చంద్రుని పట్టణము.

శౌభాంజనము. సం.వి. అ.పుం. శోభాంజనము.

శౌభికుఁడు. సం. వి. అ. పుం. ౧. గారడివాఁడు, ఇంద్రజాలికుఁడు. ౨. వేఁటకాఁడు.

శౌభుఁడు. సం. వి. అ. పుం. వేలుపు, దేవుఁడు

శౌరసేని. సం. వి. ఈ. స్త్రీ. శూరసేనదేశమున వాడఁబడుభాష, ప్రాకృతభాషలలో నొకటి.

శౌరి. సం. వి. ఇ. పుం. ౧. కృష్ణుఁడు, విష్ణువు.

గీ.....గాధ తినలోని వంతఁ దెలియఁ,జేసి శౌరి. నద్యాపదేశముగను. గాధికా. ౧-౧౪౧.

౨. బలరాముఁడు. ౩. శనైశ్చరుఁడు.

శౌర్పము. సం.విశే. (అ.ఈ.అ.) శూర్పసంబంధి, శూర్పముతోఁ గొలువఁబడినది.

శౌర్యము. సం. వి. అ. న. ౧. పరాక్రమము.

ఉ....చూచెద నద్ధతద్విమ, త్సంతతికంత ఖండన విచక్షణవక్షిణ హాహుశౌర్యమున్. కళా. ౪-౧౯౦

౨. బలము, శరీరదార్ఢ్యము. 3. నాట్యకళయందలి వీరవిక్రమము.

**శౌల్కికుఁడు.** సం. వి. అ. పుం. సుంకము వసూలు చేసెడియుద్యోగి.

**శౌల్కుఁడు.** సం. వి. అ. పుం. శౌల్కికుఁడు.

**శౌల్బి(ల్వి)కుఁడు.** సం. వి. అ. పుం. రాగి పని వాఁడు, కంచరి.

**శౌవనము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. శునక సంబంధి, కుక్కసంబంధమైనది. ౨. కుక్క యొక్క స్వభావము గలది.

వి. అ. న. ౧. కుక్క స్వభావము. ౨. కుక్క సంతతి. ఇట్లే శౌవము.

**శౌవస్తికము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. రేపటికి సంబంధించినది, మఱునాఁటిది, రేపటివఱకు నుండునది. ౨. ఒక దినము మాత్రము నుండునది, నశ్వరమైనది.

**శౌవాపదము.** సం. విణ. (అ. ఈ. అ) ౧. శ్వాపద సంబంధి, అడవిజంతువులవలనఁ గలిగినది. ౨. ఘాతుకము. క్రూరమైనది.

**శౌష్కలము.** సం. వి. అ. న. ఎండిన మాంసము యొక్క మూల్యము.

**శౌష్కలుఁడు.** సం. వి. అ. పుం. ౧. శుష్కమాంసవిక్రేత, ఎండినమాంస మమ్మువాఁడు. ౨. ఎండుమాంసమును దినువాఁడు, శుష్కమాంస భక్షకుఁడు.

**శ్చోతనము.** సం. వి. అ. న. శ్చోతము.

**శ్చోతము.** సం. వి. అ. పుం. స్రవించుట, కారుట.

**శ్చ్యోతనము.** సం. వి. అ. న. శ్చోతము.

**శ్చ్యోతము.** సం. వి. అ. పుం. శ్చోతము.

**శ్మశాననివాసి.** సం. వి. న. పుం. ౧. పిశాచము, దయ్యము. ౨. శివుఁడు. ఇట్లే శ్మశానవర్తి, శ్మశానవాసి.

**శ్మశానము.** సం. వి. అ. న. శవములను గాల్చెడి, పూడ్చెడి తావు, వల్లకాఁడు, మసనము.

ఆ. ఆ శ్మశానగమను లంతిమ మట్టంబు, లగ్నిఁ గాలిచి మరలు నఖిలమైన జ్ఞాతిజనము.... భార. శాంతి. ౬-౨౩౫.

**శ్మశానవేశ్మము.** సం. వి. న. పుం. పిశాచము, దయ్యము.

**శ్మశానవేశ్ముఁడు.** సం. వి. న. పుం. శివుఁడు.

**శ్మశానవైరాగ్యము.** సం. వి. అ. న. శ్మశానము చూచుటవలనఁ దాత్కాలికముగఁ గలిగిన విరక్తి, స్థిరముగాని వైరాగ్యము.

**శ్మశానశూలము.** సం. వి. అ. పుం. న. శ్మశానమునందలి కొఱత వేసెడి కొయ్య.

**శ్మశానాలయము.** సం. వి. అ. పుం. శ్మశానస్థలము.

**శ్మశ్రుముఖి.** సం. వి. ఈ. స్త్రీ. గడ్డము, మీసములు గల స్త్రీ.

**శ్మశ్రులుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) గడ్డము, మీసము గలవాఁడు.

**శ్మశ్రువర్ధకుఁడు.** సం. వి. అ. పుం. మంగలి.

**శ్మశ్రువు.** సం. వి. ఉ. న. పురుషుల ముఖమునందుండు రోమముల సమూహము. మీసము, గడ్డము.

వ.... శుక్లాంబరాభరణ మాల్యానులేపన యజ్ఞోపవీతపలితకేశశ్మశ్రుశోభితదేహుండును....
భార. ఆది. VI-౯.

**శ్మీలితము.** సం. వి. అ. న. తటాలునఁ గను ఱెప్ప వేయుట, ఱెప్పపాటు.

**శ్యానము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. పోయినది. ౨. పేరుకొనినది, గట్టిపడినది. 3. జిగురై

నది, ఖంకోగా నున్నది. ౪. ఎండినది, ఇఁకినది. ౫. అన. పొగ.

**శ్యామ.** సం. విశే. అ. స్త్రీ. ౧. రాత్రి.

ఉ. రాజకాచవిభుఁడు రమ్యకళాస్ఫూర్తిఁ బరఁగు దేవమాంబఁ బరిణయించె గుముద బాంధవుండు కువలయానందుఁడై, శ్యామఁ బరిణయించు చందమునను. శివధర్మ. ౧-౪౩.

౨. యౌవన మధ్యస్థురాలగు స్త్రీ, పడుచుది. ౩. నీడ, ఛాయ. ౪. బిడ్డలను గనని స్త్రీ. ౫. నల్లని స్త్రీ. ౬. పార్వతి. ౭. యమునానది. ౮. ఆవు. ౯. పసుపు. ౧౦. నల్ల పిచ్చుక. ౧౧. నీలి. [...] ౧౨. ప్రేంకణము. [...] ౧౩. నల్లతులసి. [...] ౧౪. మామెన. [...] ౧౫. బావంచి. [...]

**శ్యామకంఠము.** సం. వి. అ. పుం. నీలకంఠము. నెమిలి.

**శ్యామకంఠుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, నీలకంఠుఁడు.

**శ్యామకర్ణము.** సం. వి. అ. పుం. అశ్వమేధ యాగమునకుఁ దగిన గుఱ్ఱము.

**శ్యామపత్రము.** సం. వి. అ. పుం. తాపింఛము, తమాలవృక్షము.

**శ్యామము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. నల్లనిది, నీలవర్ణము గలది. ౨. గోధూమవర్ణము గలది. ౩. నీడ గలది. ౪. ఆకుపచ్చని నల్లని కలసినది. ౫. అ. పుం. ౧. నలుపు, నీలవర్ణము. ౨. ఆకుపచ్చ. ౩. మేఘము. ౪. కోకిలము. ౫. యమునా నదీ తీరమునఁ బ్రయాగక్షేత్రమున నున్న వట వృక్షము. ౬. తుమ్మెద. [...]

న. ౧. సైంధవలవణము. ౨. మిరియము.

**శ్యామ (మా) ల.** సం. వి. అ. స్త్రీ. దుర్గ.

**శ్యామలము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. నల్లనిది, నీలవర్ణము గలది.

మత్త. శ్యామలావయవం చరాచరసద్గురుం. ధర్మఖం ౧-౧౭౪

౪. శ్యామలకాలాగురునవ, ధూమ మెదకు సుఖ మెనర్పు. పాండు ౪-౧౨

౫. అ. పుం. ౧. నలుపు, నీలవర్ణము. ౨. మిరి యము. ౩. పెద్ద తుమ్మెద. ౪. వటవృక్షము. (రావి [...] అని శ.ర.)

**శ్యామలిక.** సం. వి. అ. స్త్రీ. నీలి [...]

**శ్యామలిమము.** సం. వి. న్. పుం. నలుపు. నీల వర్ణము.

**శ్యామశబలములు.** సం.వి.అ.పుం.బ. యముని వెంటనుండెడి నాలుగుకన్నులుగల జంటకావలి కుక్కలు.

**శ్యామసుందరుఁడు.** సం.వి.అ.పుం. కృష్ణుఁడు.

**శ్యామాంగము.** సం. విణ. (అ. ఈ. ఆ. అ.) నల్లని యవయవములు గలది.

వి. అ. పుం. బుధగ్రహము.

**శ్యామా (కు) కము.** సం. వి. అ. పుం. సస్య విశేషము, చామ [...]. బ. ఒక దినుసు ధాన్య విశే షము, చామలు.

**శ్యామిక.** సం. వి. అ. స్త్రీ. ౧. నలుపు, కృష్ణ వర్ణము. ౨. లోహముల మాలిన్యము, లోహాంతర సంసర్గాది దోషము.

**శ్యామితము.** సం. విణ. (అ. ఆ. అ.) నల్లగాఁ జేయఁబడినది.

**శ్యాలకి.** సం. వి. ఈ. స్త్రీ. భార్యసోదరి, మఱఁదలు, భార్య తోఁబుట్టినది. ఇట్లే శ్యాలి.

**శ్యాలకుఁడు.** సం. వి. అ. పుం. ౧. భార్య తోఁ బుట్టిన వాఁడు. ౨. దుష్టుఁడైన శ్యాలుఁడు.

**శ్యాలిక.** సం. వి. అ. స్త్రీ. శ్యాలకి.

**శ్యాలుఁడు.** సం.వి. అ. పుం. భార్య తోఁబుట్టిన వాఁడు.

**శ్యావతైలము.** సం. వి. అ. పుం. మామిడిచెట్టు.

**శ్యావము.** సం. విణ. (అ.ఆ.ఈ.అ.) ౧. నలుపు పసుపు కలిసిన వన్నె గలది, కోఁతి వన్నెగలది, కపిశము. ౨. నలుపు, పసుపు కలిసిన వన్నె, కోఁతి వన్నె, కపిశవర్ణము.

**శ్యేతము.** సం. విణ. (అ. తీ. నీ. అ.) తెల్లనిది, శ్వేతవర్ణము గలది.

వి. అ. పుం. తెలుపు, శ్వేతవర్ణము.

**శ్యేనంపాత.** సం.వి.ఆ. స్త్రీ. వేఁట, మృగయ.

**శ్యేనచిత్తుఁడు.** సం. వి. త్. పుం. డేగతో వేఁటాడువాఁడు, డేగను పెంచి వేఁటమప్పవాఁడు.

**శ్యేనజీవి.** సం. వి. న్. పుం. శ్యేనచిత్తుఁడు.

**శ్యేనము.** సం. విణ. (అ. ఈ. అ.) తెల్లనిది. వి. అ. పుం. ౧. తెలుపు, శ్వేతవర్ణము. ౨. డేగ. ౩. తీవ్రత, ఉగ్రత్వము.

**శ్యేనావపాతము.** సం. వి. అ. పుం. డేగ లిటా లుసఁ దన్నికొనిపోవుట.

**శ్యేని.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుడేగ.

**శ్యో(శ్యా)నాకము.** సం.వి.అ.పుం. దుండిగము, ఒకానొక చెట్టు.

**శ్రంథనము.** సం.వి.అ.న. ౧. కూర్చుట, గ్రథనము. ౨. వదులుచేయుట. ౩. చంపుట, నశింపచేయుట.

**శ్రంథము.** సం. వి. అ. పుం. ౧. సడలించుట, వదులుచేయుట, నిర్బంధమునుండి తొలగించుట. ౨. వదులు, బిగువులేమి. ౩. కూర్చుట, కూర్పు, గ్రథనము.

**శ్రంథితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. సడలింపఁబడినది, నిర్బంధమునుండి తొలగింపఁ బడినది. ౨. గ్రథితము, కూర్పఁబడినది. ౩. గాయపఱుపఁబడినది. ౪. జయింపఁబడినది. ౫. సంతోషపఱుపఁబడినది.

**శ్రంథుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**శ్రథనము.** సం.వి.అ.న. ౧. వధము, చంపుట. ౨. సడలించుట, వదులు చేయుట, విడుచుట. ౩. యత్నము, పూనిక. ౪. కూర్చుట, కట్టుట. ౫. అధికసంతోషము.

**శ్రద్ధధానుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) విశ్వాసము గలవాఁడు, నమ్మిక మున్నవాఁడు.

ఆ. వె. కాన మేలు శ్రద్ధధానుఁ డగుట.
భార. శాంతి. ౫-౨౫౧.

**శ్రద్ధ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నమ్మకము, విశ్వాసము, ౨, ఆస్తిక్యబుద్ధి, శ్రుతిస్మృత్యుక్తములైన ధర్మకార్యములందలి ప్రత్యయము.

సీ.... శ్రద్ధా ప్రథమములు సకలధర్మంబులు
శ్రద్ధయ మధ్యాంతసంస్థితంబు.
శివధర్మోత్తరము ౧-౧౪౨

౩. మనఃప్రసాదము, మనస్సు కలతనొందకుండుట, శాంతి.

క..... శ్రద్ధయనం, జనునది జీవాత్మనుప్రసన్నత సువిన్మా.
భార. శాంతి. ౫-౨౪౫

౪. చనవు, పరిచయము, ౫. ఆదరము, ౬. తీవ్రేచ్ఛ, ఆసక్తి. ౭. గర్భిణియొక్క కోరిక.

**శ్రద్ధము.** సం. విణ. (అ.ఆ.అ.) నమ్మినది. విశ్వసించినది.

**శ్రద్ధాలు (ళు) వు.** సం. విణ. (ఉ) ౧. నమ్మువాఁడు, విశ్వసించువాఁడు. ౨. కోరువాఁడు. వి. ఉ. స్త్రీ. ఏవేని వస్తువులను గోరుగర్భవతి, వేవిళ్లుగలది.

**శ్రపణ.** సం. వి. ఆ. స్త్రీ. ఉడికించుట, వండుట.

**శ్రపణము.** సం. వి. అ. న. = శ్రపణ.

**శ్రపిత.** సం. వి. ఆ. స్త్రీ. అన్నము వార్చిన గంజి.

**శ్రపితము.** సం. విణ. (అ.ఆ.అ) ౧. ఉడికింపఁబడినది. ౨. వండఁబడినది. వి. అ. న. వండిన మాంసము, పక్వమాంసము.

**శ్రమజలము.** సం. వి. అ. న. చెమ్మట, స్వేదము

**శ్రమణ.** సం. వి. అ. స్త్రీ. ౧. సన్యాసిని, యోగిని. ౨. భర్తురాలు. 3. మనోజ్ఞురాలు, ఇంపైన స్త్రీ. ౪. నీచజాతి స్త్రీ. ౫. చిఱుచేరు‡ ౬. జటామాంసి.

**శ్రమణి.** సం. వి. ఈ. స్త్రీ. = శ్రమణ.

**శ్రమణుఁడు.** సం. విణ. (అ. ఆ. ఈ. అ) ౧. కష్టపడువాఁడు. ౨. నీచకృత్యములవలన జీవించువాఁడు.

వి. అ. పుం. ౧. సన్యాసి, భిక్షువు. ౨. బౌద్ధసన్యాసి. 3. బుద్ధదేవుఁడు. ౪. బిచ్చగాఁడు, యాచకుఁడు.

**శ్రమము.** సం. వి. అ. పుం. ౧. పాటు, కష్టము. కష్టపడుట. ౨. ఆయాసము, అలసట.

గీ.... గూర్చుండెఁ దక్షిణదిగ్విధప్రదేశమండపంబున నధ్వశ్రమంబు కలన. కళా. ౭-౧౭౪

చం....శ్రమమున సోలుచుండియు బరాక్రమ సంపద సొంపుమీఱ. భార. కర్ణ. III. ౩౦౫

3. దుఃఖము, బాధ, ౪. పాపపరిహారార్థము పడు కాయక్లేశము, తపస్సు. ౫. (దేహదార్ఢ్యము నకై చేసెడు) వ్యాయామము. ౬, యోధులు చేయు శస్త్రాభ్యాసము.

**శ్రమస్థానము.** సం. వి. అ. న. శరీరవ్యాయామస్థలము, సాముచేయు చోటు.

**శ్రమాంబువు.** సం. వి. ఉ. న. చెమట, స్వేదము.

**శ్రమి.** సం. విణ. (న్. ఈ. న్) ౧. కష్టపడువాఁడు, శ్రమ నొందువాఁడు. ౨. కార్యసాధనమునకై యత్నించువాఁడు. 3. ఆయాస పడువాఁడు.

**శ్రయణము.** సం. వి. అ. న = శ్రయము.

**శ్రయము.** సం. వి. అ. పుం, ఆశ్రయము, రక్షకస్థానము.

**శ్రవణగోచరము.** సం. విణ. (అ. ఆ. అ.) శ్రవణేంద్రియమునఁ దెలియవచ్చునది. వి. అ. పుం. వినఁబడునంత దూరము, కూఁతవేటు దూరము.

**శ్రవణపథము.** సం. వి. అ. పుం. ౧. శ్రోత్రేంద్రియ మార్గము, చెవికి వినఁబడునంత దూరము, కూఁతవేటు దూరము.

**శ్రవణపాలి (ళి).** సం. వి. ఇ. ఈ. స్త్రీ. చెవి మొన.

**శ్రవణపాశము.** సం. వి. అ. పుం. చక్కనిచెవి.

**శ్రవణము.** సం. వి. అ. పుం. న. ౧. చెవి, శబ్దమును గ్రహించెడి యింద్రియము.

చం..... .... ....శ్రవణవిదారణం బయిన శబ్దము దానిది యేమియొక్కొ. భార, సభా. I. ౧౨

సీ.... శ్రవణమండలములు చంద్రుఁ గల్పిన నెమ్మొగమునకు నీరాజనము లొసంగ. రఘు. రామా. ౧-౨౦

౨. శ్రవణనక్షత్రము. 3. (గణిత) విషమ కర్ణము, త్రిభుజమునందలి సమకోణమునకు కెదురుగానుండు భుజము. న ౧. వినుట. ౨. చదువు, విద్య. 3 కీర్తి ౪. వేదము, శ్రుతి. ౫. సంపద, ఐశ్వర్యము.

**శ్రవణ సుభగము.** సం. విణ. (అ. ఆ. అ) చెవికింపైనది.

**శ్రవణానందము.** సం. వి. అ. పుం. వీనులవిందు.

శా..... మాఁజాల నటంను నేఁడు శ్రవణానందంబుగాఁ బల్కుటన్. మను. III-౧౦౭

**శ్రవణోదగము.** సం. వి. అ. న. కర్ణరంధ్రము, చెవిగూబ.

**శ్రవము.** సం. వి. అ. పుం. ౧. వినుట ౨. చెవి, శ్రోత్రేంద్రియము. 3. విషమకర్ణము. ౪. కీర్తి ప్రసిద్ధి.

**శ్రవస్యము.** సం. వి. అ. న. కీర్తి, ప్రసిద్ధి.

**శ్రవస్సు.** సం. వి. స్. న = శ్రవము. ౧. చెవి, శ్రోత్రేంద్రియము.

శా..... .... .... విప్రవే
పాప్లోదాకృతికృత్యవంచితబలిన్ జష్టు శ్రవ
స్తల్పు.... సింహా.భా.౧.ఆ.౨-౧౭౧

౨. శ్రీ. 3. సంపద, ధనము ౪. మంత్రిము ౫. ప్రశంసింపఁదగిన కృత్యము, మంచిపని.

**శ్రవాయ్యము.** సం. వి. అ. పుం. యజ్ఞపశువు.

**శ్రవిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ధనిష్ఠానక్షత్రము. ౨. శ్రవణనక్షత్రము.

**శ్రవిష్ఠాజుఁడు.** సం. వి. అ. పుం. బుధుఁడు, బుధగ్రహము.

**శ్రాంతత.** సం. వి. ఆ. స్త్రీ. అలసట, అలపు.

ఉ. ఇంతకు మున్నె పెల్లె పదియేడుదినంబుల సంగరం బతిశ్రాంతతఁ గుంది రింద్రుఁగల సైనికులు... భార.శల్య. I-౫౦

**శ్రాంత సంవాహనము.** సం. వి. అ. న. అలసినవాని శ్రమము దీర్చుట.

**శ్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఆయాసము, అలసట, శ్రమము.

సీ. అధ్వనీనశ్రాంతిహరణార్థమై తరు, వాటికావళి పథావళి ఘటింప. ధర్మఖం.I-౧౪౩

**శ్రాంతుఁడు.** సం. విశే. (అ.ఆ.అ) ౧. అలసినవాఁడు, ఆయాసపడినవాఁడు.

**శ్రాంత.** స్త్రీ.

కం..... అచ్చర గర్భశ్రాంతయగుటను గనుఁగొని.... మను. III-౧౨౪

**శ్రాంతము.** న.

కం. శ్రాంతంబయ్యెను వాహన, సంతానంబెల్ల.... భార.భీష్మ. II-3౪౧

౨. మనశ్శాంతిగలవాఁడు. వి.అ.పుం. సన్న్యాసి యతి.

**శ్రాణ.** సం. వి. ఆ. స్త్రీ. వరియన్నపు గంజి.

**శ్రాణము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వక్వమైనది. ఉడికినది. ౨. చెమ్మగలది, తడిది. వి. అ. న. ఉడికిన మాంసము మొ॥

**శ్రాద్ధదినము.** సం. వి. అ. పుం. న. చచ్చిపోయిన బంధువు నుద్దేశించి ప్రతిసంవత్సరమునను శ్రాద్ధము పెట్టెడి దినము, ఆబ్దికము, తద్దినము.

**శ్రాద్ధదుఁడు.** సం. వి. అ. పుం. శ్రాద్ధము పెట్టువాఁడు.

**శ్రాద్ధదేవుఁడు:** సం. వి. అ. పుం. ౧. శ్రాద్ధాధిష్ఠాన దేవత ౨. యముఁడు.

**శ్రాద్ధము.** సం. విశే. (అ. ఆ. అ) విశ్వాసము గలది. నమ్మికగలది. వి. అ. న. ౧. ఉత్తర క్రియ. చచ్చిపోయిన బంధువుల నుద్దేశించి చేయఁబడు కర్మవిశేషము.

గీ. అగ్నిహోత్రంబు బలికర మతిథిపూజ
శ్రాద్ధమును దానవిధియు నశక్త రక్ష
సర్వభూతానుకంపయు సంయమీంద్ర!
తర్పణంబును గృహికి నుత్తమవ్రతంబు.

నూత.అ. ౨. ౧౭౧

(అది నిత్యము, నైమిత్తికము, కామ్యము అని త్రివిధము) ౨. శ్రాద్ధకాలమున నిచ్చినదానము.

**శ్రాద్ధికము.** సం. విశే. (అ.ఈ.అ) శ్రాద్ధసంబంధి. వి. అ. న. శ్రాద్ధమం దిచ్చినదానము.

**శ్రాద్ధికుఁడు.** సం. వి. అ. పుం. శ్రాద్ధమందలి దానము పుచ్చుకొనువాఁడు.

**శ్రాద్ధీయము.** సం. విశే. (అ. ఆ. అ) శ్రాద్ధసంబంధి.

**శ్రామము.** సం. వి. అ. పుం. ౧. మాసము, నెల ౨. సమయము, వేళ. 3. తాత్కాలికోపయోగమునకై నిర్మించిన కుటీరము.

**శ్రాయము.** సం. వి. అ. పుం. శరణము; రక్షణస్థానము, ఆశ్రయము.

**శ్రావకము.** సం. వి. అ. పుం, ౧. బౌద్ధసన్న్యాసుల బృందము ౨. కాకి.

**శ్రావకుఁడు.** సం. వి. అ. పుం. వినెడివాఁడు, శ్రోత. ౨. శిష్యుఁడు. 3. బౌద్ధసన్న్యాసి, బౌద్ధభక్తుఁడు.

మత్తకోకిల. శ్రావకాధరణాంత విన్ రసజాధరీ
ఫల దిగ్విరా మావహంబుగ మత్తకోకిలయం
ద్రు దీనిఁ గవీశ్వరుల్. కవిజన. పుట ౨౬.

౪. తన మతమును విడిచి యన్యమతము నవలంబించిన వాఁడు.

**శ్రావణము.** సం. విణ. (అ. ఈ. అ) శ్రవణసంబంధి, చెవికి సంబంధించినది. ౨. శ్రవణనక్షత్రమునఁ బుట్టినది.

వి. అ. పుం. ౧. శ్రావణ మాసము. న. ౧. వినిపించుట. ౨. వినుటవలనఁ గలిగిన జ్ఞానము, శ్రుతి పాండిత్యము;

**శ్రావణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. శ్రావణ శుక్ల పూర్ణిమ ౨. శ్రావణ శుక్లపౌర్ణమాసి నాటి నూతన యజ్ఞోపవీతధారణరూపమైన సంస్కార విశేషము.

**శ్రావణికము.** సం. విణ. (అ. ఈ. అ) శ్రావణ మాసమునకు సంబంధించినది. వి. అ. పుం. శ్రావణమాసము.

**శ్రావణుఁడు.** సం. వి. అ. పుం. ౧. భిన్నమతావలంబి. ౨. వంచకుడు, మోసగాఁడు. 3. దశరథునిచే బొరపాటున బాణముతోఁ గొట్టఁబడి చనిపోయిన వైశ్యబుషి.

**శ్రావము.** సం. వి. అ. పుం; ౧. వినుట ౨. స్రావము, కారుట.

**శ్రావస్తి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. గంగాతీరమునందలి యొకానొక పట్టణము.

**శ్రావితము.** సం. విణ. (అ. ఆ. అ) వినిపింపఁబడినది, తెలుపఁబడినది.

**శ్రావ్యము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. వినఁదగినది. (దృశ్యము కానిది) ౨. వినఁబడునట్టిది. 3. విన నింపైనది.

శా. శ్రావ్యంబై చెలఁగన్ గభీరమధురజ్యా
నాద ముద్రామహీరవ్యాపార నిరూఢతం బ్రతి
శరారంభంబు మర్దించుచున్.
భార. విరా. V-౧3౨

**శ్రాహి.** వి. (ఈ పదము శాసనవాఙ్మయమునందే కానవచ్చుచున్నది) వర్తమానసంవత్సరము.

1 .... .... .... .... .... .... .... ....
2 సకచక్రవర్తి శ్రీ రాజాధిరాజ దేవర విజయ రాజ్య
3 సంవత్స(ర)ంబులు 3౧ గు శ్రాహి శ్రీమద్దాక్షారామమున
4 శ్రీ భీమేశ్వర మహాదేవరకు............ద. శా. ౧౧౦౦.
10 శ్రీ రాజరాజ చోడదేవర విజయరాజ్య సంవత్సరగు శ్రాహి దిన ౧ (౯) ఉత్తరాయణ(ం) సంక్రాంతి శుద్ధ ౫ బుధవారము
.... .... .... .... .... ....వ.శా. ౧౧౨౨
దా.శా. ౧౧౦౮. ద.శా. ౧౧౫౨.

**శ్ర్యాహ్వాము.** సం. వి. అ. న. పద్మము. తామరపువ్వు.

**శ్రితము.** సం. విణ. (అ.ఆ.అ) ౧. ఆశ్రయించినది, దరిచేరినది, పొందినది.

కం........శ్రితపదసాలంకృష్ణు జిష్ణున్ విష్ణున్.
భాగ. ౧౦-౧౦౯

౨. అనుకొనినది. 3. కూడినది. ౪. రక్షితము, రక్షింపఁబడినది. ౫. సేవితము, సేవింపఁబడినది. గౌరవింపబడినది. ౬. సహాయము తోడయినది. ౭. వ్యాపించినది, క్రమ్మినది, ౮. కలిగియున్నది ఇమిడ్చికొని యుండునది. ౯. గుంపుగానున్నది, సంఘముగా నున్నది. ౧౦ సంపన్నమైనది, సహితమైనది.

**శ్రితి.** సం. వి. ఇ. స్త్రీ. ఆశ్రయించుట, దరిఁజేరుట, సాహాయ్యము కోరుట.

**శ్రీయంమన్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తన్ను లక్ష్మీసంపన్నునిగాఁదలఁచుకొనువాఁడు, తాను గొప్పవాఁ డనుకొనెడివాఁడు. ౨. గర్వి, గర్వము గలవాఁడు.

**శ్రీ.** సం.వి. ఈ. స్త్రీ. ౧. శ్రీకారము. ౨. లక్ష్మి.

సీ. శ్రీలు దారాట నాశ్రితపద్మకర్ణికాకృతిఁ
జెవు లక్కమల కర్ణికల మెఱయ....
ఆము. ౪-౧౬౩.

**శ్రీ.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ధనము, సంపద, సమృద్ధి.

కం .... ననిశితబాణోద్దామప్రసారవిభవశ్రీ
మాద్రుర కమ్మతఁబు నేసెం గడిమిన్.
భార. విరా. V-౩౬

కం .... సమస్తభూములు విజయశ్రీమహిమను
సాధించె.... భార. సభా. ౨-౧౦౫

౨. రాజ్యలక్ష్మి, రాజ్యసంపత్తు.

ఉ.... ఉన్నతశ్రీగుణయుక్తిమైఁ బరగు....
సభా. ౨-౧౦౦

కం.... పాండవేయుల శ్రీ యిమ్మెయిఁ గొనిన
నిన్నుఁ జేయనగు నొకో.
భార. సభా. ౨-౧౯౫

౩. ఉన్నతస్థితి, గొప్ప హోదా.

తే.గీ.... కానఁ బాండవశ్రీ యుపేక్ష్యంబుగాదు
సభా. ౨-౧౪౫

౪. చక్కఁదనము, శోభ, కాంతి.

ఆ. వె.... సిద్ధకన్య యొక్క శ్రీ సమృద్ధి సర్వ
లక్షణప్రశస్తాంగి యిది.
భార. ఆది. ౭-౭౨

౫. ఛాయ, రంగు. ౬. లక్ష్మీదేవి.

ఉ. శ్రీ సతికిం బ్రియం బెసగ జేర్చిన యుయ్యెల
లీల.... పాం. I-1

౭. గొప్పఁదనము, ఉత్తమత్వము. ౮. అలంకారము. ౯. బుద్ధి. ౧౦. దివ్యశక్తి, అమానుష శక్తి. ౧౧. ధర్మార్థకామము లను త్రివర్గము. ౧౨. సరళవృక్షము. ౧౩. మారేడుచెట్టు. ౧౪. లవంగము. ౧౫. చంద్రుని పంద్రెండవ కళ. ౧౬. సరస్వతి. ౧౭. వాక్కు, మాట. ౧౯. కీర్తి, ప్రసిద్ధి. పుం. శ్రీరాగము, సంగీతమునఁ బ్రధానమగు నాఱు రాగములలో నొకటి. ౨౦. సాలె పురుగు.

మ. ....శ్రీ కాళహస్తీశ్వరా.

౨౧. కీర్తి. ౨౨. విషము.

కం. శ్రీకంఠ చాప ఖండన పాకారి ప్రముఖ
వినుత.... భాగ. I

౨౩. ఉపకరణము.

(శ్రీకృష్ణుఁడు, శ్రీరాముఁడు మొదలగు దేవతా నామములకును; శ్రీ వాల్మీకి, శ్రీ జయదేవుఁడు మొదలగు మహాత్ముల నామములకును; శ్రీ రామాయణము, శ్రీ భాగవతము మొదలగు గొప్ప గ్రంథముల నామములకును; వాని గౌరవము తెలుపుటకు నాపదములకు ముందుగా నుపయోగింపఁబడెడి పదము. మఱియు పత్రిక (ఉత్తరము) ల మొదటను; గ్రంథారంభమునను; శుభసూచకముగా నుపయోగింపఁబడెడి పదము.)

**శ్రీకంఠసఖుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**శ్రీకంఠుఁడు.** సం. వి. అ. పుం. ౧. శివుఁడు.

మ. శివలోకంబున కేఁగియుండు నపర శ్రీకంఠుఁ
డై పాండుగన్. శివధర్మ. ౩-౨౫

౨. భవభూతి అను నాటకకవి.

**శ్రీకరణము.** సం. వి. అ. న. లేఖిని, కలము.

**శ్రీకరము.** సం. విణ. (అ.ఈ.అ.) ఐశ్వర్యమును గలిగించునది.

వి. అ. పుం. పద్మము.

**శ్రీకరుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**శ్రీకాంతుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**శ్రీకారము.** సం.వి. అ. పుం. జాబు మున్నగునవి వ్రాయునపుడు మొట్టమొదట శుభారంభముగా వ్రాసెడి శ్రీ యను పదము.

**శ్రీకారి.** సం. వి. ఇ. పుం. ఒకజాతి లేడి.

**శ్రీఖండము.** సం. వి. అ. పుం. న. ౧. మంచి గంధము.

శా....శ్రీఖండ, కర్పూర క్షోదవిపాండు నిర్మల యశఃపూర్ణ క్షమామండలా.
శృం. నై. ౧-౧౧౧

కం. శ్రీఖండ శీతనగ మధ్యాఖండ క్షోణి మండలాఖండల.... మను. II-౧

చందనము.

**శ్రీగదితము.** సం. వి. అ. న. చిన్న నాటకము, ఒకవిధమైన యుపరూపకము.

**శ్రీగర్భము.** సం. వి. అ. పుం ఖడ్గము, కరవాలము.

**శ్రీగర్భుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**శ్రీగ్రహము.** సం. వి. అ. పుం. పక్షులు నీరు త్రాగెడి తొట్టె.

**శ్రీఘనము.** సం. వి. అ. న. ౧. పుల్ల పెరుగు, మీఁగడ పెరుఁగు.

**శ్రీఘనుఁడు.** సం. వి. అ.పుం. ౧. బుద్ధదేవుఁడు. ౨. ఒకానొక బౌద్ధసన్యాసి.

**శ్రీచక్రము.** సం. వి. అ. న. ౧. భూగోళము. ౨. ఇంద్రరథము యొక్క చక్రము. ౩. యంత్రభేదము, త్రిపురసుందరి పూజకంగమైన యొకానొక యంత్రము.

**శ్రీచూర్ణము.** సం. వి. అ. న. తిరుచూర్ణము.

**శ్రీతాలము.** సం. వి. అ. పుం. ఒక జాతి తాటి చెట్టు.

**శ్రీదుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**శ్రీధరుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు. ఇట్లే శ్రీదయితుఁడు మొ.

గీ. బలిమి కలుముల జాలములు బలియుఁ జోరవ చేసి చూచెద ననుచు నా శ్రీధరుండు.
రాధికా. ౪-౧౩

**శ్రీనగరము.** సం. వి. అ. న. ఒకానొక పట్టణము.

**శ్రీనివాసుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

గీ. సాదరము నొనర్చు శైత్యోపచారవిధుల శ్రీనివాసుండు మెల్లన సేద దేఱె.
రాధికా. ౩-౧౬౮

ఇట్లే శ్రీనికేతనుఁడు, శ్రీనివాసుఁడు.

**శ్రీపంచమి.** సం. వి. ఈ. స్త్రీ. మాఘశుక్ల పంచమీ తిథి.

**శ్రీపతి.** సం. వి. ఇ. పుం. ౧. విష్ణువు. ౨. రాజు, చక్రవర్తి.

**శ్రీపథము.** సం. వి. అ. పుం.రాజమార్గము, పెద్దబాట.

**శ్రీపర్ణము.** సం. వి. అ. న. పద్మము, తామర.

**శ్రీపర్ణి(ణీ).** సం. వి. ఈ. అ. స్త్రీ. ౧. శాల్మలి బూరుగు. ౨. గుమ్ముడు. ౩. టేకు.

**శ్రీపర్వతము.** సం. వి. అ. పుం. శ్రీశైల మను ప్రసిద్ధిఁ జెందిన దక్షిణాపథమునందలి యొకపవిత్రమైన పర్వతము.

**శ్రీపిష్టము.** సం. వి. అ. పుం. కర్పూర తైలము.

**శ్రీపుత్రము.** సం. వి. అ. పుం. ఉచ్చైఃశ్రవము, ఇంద్రుని గుఱ్ఱము.

**శ్రీపుత్రుఁడు.** సం.వి. అ. పుం. ౧. మన్మథుఁడు. ౨. చంద్రుఁడు.

**శ్రీపుష్పము.** సం. వి. అ. న. లవంగము, ఒకానొక సుగంధ ద్రవ్యము. (పద్మకాష్ఠము)

**శ్రీఫల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నీలి చెట్టు. ౨. ఉసిరిక చెట్టు.

**శ్రీఫలము.** సం.వి.అ.పుం. బిల్వము, మారేడు చెట్టు.

> శా. సారంగార్జునపాటలీవకుళపున్నాగామ్లభల్లాతమందారాశోకకదంబపూగకదళీ దాడిమ్యావటాశ్వత్థఖర్జూరశ్రీఫలనారికేళ బదరీమదామ్రముఖ్యావనీజారామంబులు .... శివధర్మోత్తరము. ౨-౪౭

న. మారేడుపండు.

**శ్రీఫలి.** సం. వి. ఈ. స్త్రీ. శ్రీఫల.

**శ్రీమంతము.** సం. విశ. (త్.తీ.త్.) ౧. మంగళాకరము. ౨. సంపద గలది. ౩. శుభప్రదము.

> శా. శ్రీమంతంబు శిరోగ్రధామసుషమా సింధూరతి ద్యోతిమా, సీమంతంబు....
> గోమంతంబున కేఁగి యబ్బలుఁ దమంగుండో డతో నిల్చెన్. దశావ. ౭-౩౦

సం.వి.త్.పుం. ౧. తిలకవృక్షము. ౨. అశ్వత్థవృక్షము, రావిచెట్టు.

**శ్రీమంతుఁడు.** సం. విశ. (త్.మతీ.త్.) ౧.ధనవంతుఁడు, కలవాఁడు. ౨. సుఖవంతుఁడు, అభివృద్ధి నొందువాఁడు. ౩. సుందరుఁడు, చక్కనివాఁడు. ౪. కీర్తిగల వాఁడు, ప్రసిద్ధి కెక్కినవాఁడు, పేరు పొందిన వాఁడు. (గౌరవము గల జనులయొక్కయు, వస్తువులయొక్కయు ముందు గౌరవ సూచకముగా నుపయుక్తమగు పదము). వి. త్. పుం. ౧. విష్ణువు. ౨. కుబేరుఁడు. ౩. శివుఁడు.

**శ్రీమస్తకము.** సం. వి. అ. పుం. వెల్లుల్లి, పలాండువు.

**శ్రీముఖము.** సం.వి. అ. పుం. ఒక సంవత్సరము. అ. న. గురువు మొదలగు పెద్దలు వ్రాసి పంపెడు పత్రిక.

**శ్రీముద్ర.** సం. వి. ఆ. స్త్రీ. వైష్ణవులు నొసట ధరించెడి చిహ్నము, తిరుమణి తిరుచూర్ణములు.

**శ్రీమూర్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. విష్ణుని ప్రతిమ, లక్ష్మీప్రతిమ. ౨. విగ్రహము, ప్రతిమ.

**శ్రీరంగము.** సం. వి. అ. పుం. దక్షిణ దేశమందలి యొక విష్ణుక్షేత్రము.

> వ.... శ్రీరంగంబునకు రంగేశు సేవింప....
> ఆము. ౬-౯౦

**శ్రీరం(గములు)గాలు.** వి. బ. ధాన్యవిశేషము.

> సీ. గొబ్బికాయలు బంగుస్తులు పాలమీఁగడలు శ్రీరంగాలు కామదాస్లు ....
> హంస. ౪-౧౭౭

> వ. కృష్ణ నీలాలు ముద్దుఁగ్రాలు కస్తూరి పట్టెలు చెన్నంగులు శ్రీరంగాలు చింతపూలు గోరాజనాలు. ప్రబంధ. ౧౧౨

**శ్రీరసము.** సం.వి.అ.పుం. ౧. కర్పూర తైలము. ౨. ధూపద్రవ్యవిశేషము.

**శ్రీరాగము.** సం. వి. అ. పుం. ఎనుబది పురుష రాగములలో నొకటి.

> సీ. భైరవి మాళవి బంగాళ హిందోళ రామంజరియు శ్రీరాగగౌళభూపాల లెన్మిది పురుష రాగంబులు .... హంస. ౫-౧౨౩

> సీ. భైరవశ్రీరాగబంగాళహిందోళమాళవులును రాగమంజరియును. ప్రబంధ. ౯-౫

**శ్రీరామతోపులు.** మి. లి. బ. వస్త్రభేదము.

> వ. తోఁపులును శ్రీరామతోఁపులును జీబులును సుగిపట్టంబులును. ద్వా. ౩-౨౦౬

**శ్రీలుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. ధనవంతుఁడు. ౨. అదృష్టవంతుఁడు. ౩. సౌందర్యవంతుఁడు, చక్కనివాఁడు. ౪. కీర్తిగలవాఁడు, ప్రసిద్ధుఁడు.

**శ్రీవత్సకి.** సం. వి. న. పుం. రొమ్మున సుడి గల గుఱ్ఱము.

**శ్రీవత్సము.** సం. వి. అ. పుం. ౧. విష్ణుని వక్షఃస్థలమునం దున్న రోమముల సుడి.

సీ.... శ్రీవత్సలాంఛనాంచితవిహార. భాగ. ౧౦-౧౧౨

౨. కన్నగానిచే త్రవ్వఁబడిన కన్నము.

**శ్రీవత్సలాంఛనుఁడు.** సం.వి. అ.పుం. విష్ణువు. ఇట్లే శ్రీవత్సాంకుఁడు.

**శ్రీవత్సుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**శ్రీవరాళి.** ఔ. లి. (సంగీత) ముప్పదిరెండు నపుంసక రాగములలో నొకటి.

గీ. చెంచుమలహరి దేశాక్షి శ్రీవరాళి మాళవియు .... హంస. ౫-౧౭౪

గీ... నాట గౌళి దేశాక్షి తోడి వరాళి శ్రీవరాళి హిజ్జిజ్జి కేదారగౌళ. ప్రబంధ. ౯౬.

**శ్రీవరుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు. ఇట్లే. శ్రీవల్లభుఁడు.

**శ్రీవర్ధనుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**శ్రీవాసము.** సం. వి. అ. పుం. ౧. కర్పూరతైలము, సరళవృక్షద్రవము (అనివాచ) ౨. పద్మము.

**శ్రీవృక్ష(క)ము.** సం.వి.అ.పుం.౧. బిల్వము, మారేడు ‡

వ. రోమయంబులను సదాశివప్రీతికరముగ బిల్వమహీరుహం బుదయించె అయ్యనేకహము పద్మవాసినికి నివాసంబయ్యెంగావున శ్రీవృక్షం బనం బరఁగె. శివధర్మ.౧-౨౦౪. ౨. అశ్వత్థము, రావిచెట్టు. 3. గుఱ్ఱము ఱొమ్మున నుండు నొకవిధమైనసుడి.

**శ్రీవృక్షకి.** సం. వి. న్. పుం. శ్రీవృక్షమను సుడిగల గుఱ్ఱము.

**శ్రీవేష్టము.** సం. వి. అ. పుం. ౧. కర్పూరతైలము (సరళవృక్షద్రవమని (వాచ) ౨. ధూపద్రవ్య విశేషము.

**శ్రీశైలము.** సం. వి. అ. పుం. శ్రీపర్వతము.

క....జనిరెయును శ్రీశైలమ్మునకును భృగుపాత లంపటమతియై. కళా. ౪-౧౯౪.

**శ్రీసంజ్ఞము.** సం. వి. అ. న. లవంగము, దేవకుసుమము.

**శ్రీసూక్తము.** సం. వి. అ. న. (లక్ష్మీస్తోత్రరూపమైన) వేదమందలి మంత్రములు (సూక్తము)

**శ్రీహస్తిని.** సం. వి. ఈ. స్త్రీ. ప్రొద్దుతిరుగుడు పువ్వు చెట్టు, గురుగు భూమురుడి ‡

## శ్రు

**శ్రుతకీర్తి.** సం. విశ. ఇ. ౧. కీర్తిగలవాఁడు, ప్రసిద్ధుఁడు. ఇ. పుం. ౧. ప్రసిద్ధపురుషుఁడు. ౨. ఒకానొక దేవఋషి. స్త్రీ. ౧. శత్రుఘ్నుని భార్యపేరు.

**శ్రుతదేవి.** సం. వి. ఈ. స్త్రీ. సరస్వతి, వాగ్దేవత.

**శ్రుతధరుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) వినినది జ్ఞప్తియం దుంచువాఁడు, ధారణాశక్తిగలవాఁడు.

**శ్రుతపఱచు.** మి. స. క్రి. శ్రుతపడు ప్రేరణరూపము. వినిపించు, చెప్పు.

సీ. చుట్టపక్కాలకు శుభపత్రికలు వ్రాసి, పంపమాకు శ్రుతపఱచ రమ్మ. రాధికా.౧-౩౦.

**శ్రుతము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. వినఁబడినది. ౨. తెలుపఁబడినది. వినిపింపఁబడినది.

3. నేర్పఁబడినది, తెలిసికొనఁబడినది.

క. శతతాళదఘ్నమగుగ, య్యతుల గ్రావంబుఁ జూచి యఖిల గ్రామా, గతులైన మానవులు తమ, శ్రుతసాధనవిధులచేతఁ జూర్ణము సేయన్. నిరంకుశో. ౪.౭౭.

౪. ప్రసిద్ధమైనది, ౫. పిలువఁబడినది.

వి. అ. న. ౧. శ్రుతిగోచరవస్తువు, వినఁబడు వస్తువు. ౨. వేదము. 3. శాస్త్రము. ౪. వేద శాస్త్రజ్ఞానము.

**శ్రుతవంతుఁడు.** సం. విశే. (త. తీ. త్) ౧. వేదములందు సంపూర్ణజ్ఞానముగలవాఁడు. ౨. జ్ఞానముగలవాఁడు, విద్యావంతుఁడు.

**శ్రుతశ్రవుఁడు.** సం. వి. స. పుం. శిశుపాలుని తండ్రి.

**శ్రుతార్థము.** సం. వి. అ. పుం. వినఁబడిన విషయము, తెలిసిన యంశము.

**శ్రుతి.** సం. వి. ఇ.ఈ. స్త్రీ. ౧. చెవి, శ్రవణము.

సీ. శ్రుతులేల భవమదంచితగానసవసుధార్ద్ర
శీకోత్కరులమల్ వినకయున్న. చంద్రిక. ౪-౧౦

౨. కింవదంతి, అనుకొనెడి మాట 3. ధ్వని. ౪. వేదము.

శబ్దశాస్త్రములందు సకలతత్త్వములందు, శ్రుత్యం తములయందు శ్రుతులయందు. భీష్మ. ౧-౬౭.

క. శ్రుతు లభ్యసించి తేతుల, క్రతువులు సేసితి కు
లంబు రక్షించితి నీ, వితరులక్రియ మృత్యుభయా
న్వితుఁడవు గాఁదగునె మేదినీశ్వర యింకన్. భార. ద్రోణ. ౨-౭౯.

౫. వేదమంత్రము ౬. వేదజ్ఞానము. ౭. (సంగీత) శ్రుతి.

సీ. అవతింప కుసుమంబు నంసున్న యొలదేఁటి
రతికేంచి దంచిత శ్రుతుల నీన. మను. I-౫.

౮. శ్రవణనక్షత్రము. ౯. (గణిత) విషమ కర్ణము, రేఖావిశేషము. ౧౦. సూక్తి, సుద్ది. (శ. ర.)

**శ్రుతికటము.** సం. వి. అ. పుం. ౧. పాము. ౨. వ్రతము, తపస్సు. 3. ప్రాయశ్చిత్తము.

**శ్రుతికటువు.** సం. విశే. ఉ. వినుటకుఁ బరుష మైనది.

వి. ఉ. పుం. పరుషధ్వని. (కావ్యదోషములలో నొకటి. (పరుషము)

**శ్రుతిచోదన.** సం. వి. అ. స్త్రీ. వేదమందలి విధివాక్యము.

**శ్రుతిచోదనము.** సం. వి. అ. న. = శ్రుతిచోదన.

**శ్రుతిజీవిక.** సం. వి. అ. స్త్రీ. స్మృతి, ధర్మ శాస్త్రము.

**శ్రుతిద్వైధము.** సం. వి. అ. న. వేదవాక్యముల పరస్పరభేదము.

**శ్రుతినిదర్శనము.** సం.వి.అ.న. వేదప్రమాణము.

**శ్రుతిపథము.** సం. వి. అ. పుం. శ్రోత్రమార్గము, కర్ణపథము.

**శ్రుతిప్రసాదనము.** సం. విశే. (అ. ఆ. అ.) శ్రావ్యమైనది, చెవి కింపైనది.

**శ్రుతిమండలము.** సం. వి. అ. న. కర్ణపుటము, చెవి. పైకిఁగనఁబడెడి చెవి.

**శ్రుతిమూలకము.** అవిశే. (అ.ఆ. అ.) వేదప్రమాణము గలది.

**శ్రుతిమూలము.** సం.వి.అ.న. ౧. కర్ణమూలము, చెవిగూబ. ౨. వేదప్రమాణము.

**శ్రుతివర్జితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చెవిటివాఁడు, బధిరుఁడు, ౨. వేదజ్ఞాన శూన్యుఁడు, వేదమెఱుఁగనివాఁడు.

**శ్రుతివిప్రతిపన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వేదప్రామాణ్య మంగీకరింపనిది. ౨. వేద విరుద్ధమైనది.

**శ్రుతివిషయము.** సం.వి.అ. పుం. ౧. శ్రోత్రేంద్రియమునకు గోచరమైన యర్థము; ధ్వని, శబ్దము, ౨. శ్రోత్రపథము. 3. వేదసంబంధమైన యంశము. ౪. వేదవిధి, వేదచోదన.

**శ్రుతివేధము.** సం. వి. అ. పుం. శాస్త్రోక్త విధానమున చెవులుకుట్టుట, కర్ణవేధమను సంస్కారవిశేషము.

**శ్రుతిసుఖము.** సం. విణ. (అ. ఆ. అ) శ్రావ్యమైనది, చెవి కింపైనది. ఇట్లే శ్రుతిమనోహరము. మొ॥

**శ్రుత్యంతము.** సం.వి. అ. పుం. న. ఉపనిషత్తు.

**శ్రుత్యనుప్రాసము.** సం. వి. అ. పుం. శబ్దాలంకారవిశేషము.

**శ్రు (స్రు) వ.** సం. వి. ఆ. స్త్రీ. = శ్రువము

**శ్రువము.** సం. వి. అ. పుం. ౧. యజ్ఞము. ౨. యజ్ఞసాధనము, స్రువము, నేయి తీసికొనుట కుపయోగించు గరిటివలె నుండెడి సాధనము.

**శ్రువావృక్షము.** సం. వి. అ. పుం. వికంకతము పుల్లవెలఁగచెట్టు i

## శ్రే

**శ్రేఢి.** సం. వి. ఈ. స్త్రీ. (గణిత) ఒక సంఖ్య మొదలు మరియొక సంఖ్యవఱకునైన సంఖ్యలు. వానిసంకలితములు, వర్గములు, ఘనములు; ఆసంఖ్యలలోని విషమాంకములు, సమాంకములు, క్రమముగ వృద్ధినొందిన సంఖ్యలు ఇట్లు ఏదో యొక క్రమము ననుసరించిన సంఖ్యాశ్రేణి.

**శ్రేఢీఫలము.** సం. వి. అ. న. శ్రేఢులను సంకలనము చేయగా వచ్చిన మొత్తము.

**శ్రేణి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. పంక్తి, వరుస, పరంపర.

శా. శ్రేణుల్ గట్టి నభోంతరాళమున బాఱన్
పక్షులు....మను ౩-౧౨.

౨. సమూహము, గుంపు, మంద.

శా. అంగవ్రాతములో జికిత్సకుఁడు దుష్టాంగంబు
ఖండించి శేషాంగ శ్రేణికి రక్ష సేయుక్రియ....
భాగ. ౨-౧౭౭.

సీ.... విద్యాధరశ్రేణి విహరించు పథమెక్కి
కరువలి రేఁగెడు కక్ష్య సొచ్చి. శృం. నై.
౭-౩౭.

౩. వణిజులు, శిల్పులు మొదలగు వారి సంఘము వర్తకుల సమాజము, శిల్పి సమాజము. మొ॥ నీరు తోడెడి తొట్టి.

**శ్రేణిక.** సం. వి. ఆ. స్త్రీ. శిబిరము, గుడారము.

**శ్రేణి(ణీ)బంధము.** బంధము.సం.విణ.(అ.ఆ.అ.) పంక్తిగా నేర్పడినది.వరుసగానున్నది.వి.అ.పుం. పంక్తిగా నేర్పడుట.

**శ్రేఢి.** సం.వి. ఈ. స్త్రీ. ౧. విభిన్నవస్తుపరంపర వేఱువేఱగు వస్తువుల వరుస. ౨. (గణిత)= శ్రేఢ. ౩. ఫలితము, పర్యవసానము.

**శ్రేయఃపరిశ్రమము.** సం.వి. అ. పుం. మోక్షము నకై యత్నము.

**శ్రేయ (స్సు) ము.** సం. విణ. స్. ౧. వరము. మంచిది. ౨. శ్రేష్ఠము, ఉత్తమము. ౩. మిక్కిలి సుఖముగలది. ౪. ప్రేయతరము, మిక్కిలి నిష్టమైనది. వి. స్. న. ధర్మము. ౨. క్షేమము. ౩. శుభము.

మ....శ్రేయంబెటు లబ్బు? మర్గతియు గర్వంగాక యెంతేనియున్. శివరహస్య సం. ౩-౧౬౭.

౪. శుభసమయము. ౫. మోక్షము. ౬. ఆనందము ౭. భాగ్యము.

**శ్రేయసి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. హరీతకి, ఉసిరిక i ౨. పిప్పలి i

**శ్రేయస్కరము.** సం.విణ.(అ.ఈ.అ.)౧.సుఖము గలిగించునది. శ్రేయస్సు గలిగించునది. ౨. శుభప్రదము. శుభము గలిగించునది.

శా. ఏవాక్యం బిల రోగదోషరహితం బేవాక్యమత్యంతధర్మావాలంబునునై విశంగ ఘన పుణ్యం బొప్పఁ జేకూరుచుం, డావాక్యంబు విరూపమైనను సముద్యత్ప్రీతి శ్రేయస్కరం, బైవేద్యం బగుచుండు నెప్పుడు మునీంద్రా యెల్లలోకంబులన్. శివధర్మోత్తరము.
౧-౧౯౧.

**శ్రేయస్సు.** సం. వి. స్. న. శ్రేయము.

శా. ఆయుష్యం బితిహాసవస్తుసముదాయం బైహికాముష్మికశ్రేయఃప్రాప్తినిమిత్త ముత్తమకథాసేవ్యంబు.... భార. ఆది. 3-౧౧.

శ్రేయోర్థి. సం. విశే. న్.(ర్థిన్. న్) క్షేమాభిలాషి, మంచికోరువాఁడు ౨. సుఖముకోరువాఁడు.

శ్రేష్ఠము. సం విశే. (అ. ఆ. అ.) ౧. అత్యంత ప్రశస్తము, ఉత్తమము.

వ.... శివయోగికి మహాయోగంబ శ్రేష్ఠంబు.... శివధర్మ. ౨-౧౧౪.

౨. మిక్కిలి సుఖవంతము. 3. ప్రియతమము, మిక్కిలి నిష్టమైనది. ౪. జ్యేష్ఠము, కాలముచేఁ బెద్దది.

వి. అ. న. ఆవుపాలు, గోక్షీరము.

శ్రేష్ఠామ్లము. సం. వి. అ. న. చింతపండు, తింత్రిణీఫలము.

శ్రేష్ఠాశ్రమము. సం. వి. అ. పుం. మేలైన ఆశ్రమము, గార్హస్థ్యము,

శ్రేష్ఠాశ్రముఁడు. సం. వి. అ. పుం. గృహస్థు.

శ్రేష్ఠి. సం. వి. న్. పుం. ౧. ౧. వర్తకులలో శ్రేష్ఠుఁడు, గొప్పవర్తకుఁడు. ౨. శిల్పులలోఁ పెద్దవాఁడు, శిల్పిశ్రేష్ఠుఁడు.

శ్రేష్ఠుఁడు. సం. వి. అ. పుం. ౧. కుబేరుఁడు. ౨. రాజు. 3. విప్రుఁడు. ౪. విష్ణువు.

## శ్రై

శ్రైష్ఠ్యము. సం. వి. అ. న. శ్రేష్ఠత్వము. ఉత్తమత.

## శ్రో

శ్రోణ. సం.వి. ఆ. స్త్రీ. ౧. గంజి. ౨. శ్రవణ నక్షత్రము.

శ్రోణము. సం. విశే. (అ. ఆ. అ.) కుంటిది, పంగువు.

వి. అ. పు. రోగవిశేషము.

శ్రోణి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. కటిప్రదేశము, మొల, పిఱుఁదు.

శా. ఏణీలోచనఁ బూర్ణచంద్రవదన న్మైమప్రభాంగిన్, ఘనశ్రోణీమండలఁ బీనబంధురకుచన్.... మార్కం. పు. ౨-౨౦౪.

ఉ. క్షోణితలంబునన్ నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకతశ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి........భాగ. పీఠిక. ౬.

౨. బాట, మార్గము.

శ్రోణిఫలకము. సం. వి. అ. న. ౧. విశాలమగు కటిప్రదేశము. ౨. కటిపార్శ్వప్రదేశము.

శ్రోణిబింబము. సం. వి. అ. న. ౧. గుండ్రని పిఱుఁదు. నడికట్టు.

శ్రోణిసూత్రము. సం. వి. అ. న. ౧. మొలనూలు, మొలత్రాడు. పట్టాకత్తితోఁగూర్చిన నడికట్టు.

శ్రోత. సం. వి. ఋ. పుం. ౧. వినెడివాఁడు.

క. శ్రోతకుఁ దనకుం బ్రియమగు, నీతియునొప్పునట్టిమెయి సమీరితమైనం జాతగువాక్యం బది నృపనూతీ పెదపలుకు బాలికుల వొప్పరయన్. భార. శాంతి. ౬-౧౯౦.

౨. శిష్యుఁడు.

శ్రోతవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) వినదగినది. విన నింపైనది.

శ్రోతస్సు. సం. వి. స్.న. ౧. చెవి. ౨. జ్ఞానేంద్రియము.

శ్రోత్రపేయము. సం. విశే. (అ. ఆ. అ.) చెవితోఁ ద్రాగఁదగినది., ఆసక్తితో వినఁదగినది.

**శ్రోత్రము.** సం. వి. అ. న. ౧. చెవి. ౨. శబ్దమును గ్రహించు నింద్రియము. 3. వేదమందలి ప్రావీణ్యము. (విల్యమ్సు)

**శ్రోత్రసుఖము,** సం.విణ. (అ. ఆ. అ.) శ్రావ్యమైనది; చెవి కింపైనది.

**శ్రోత్రియము.** సం. వి. అ. న. స్వల్పముగా నిచ్చుపన్ను. (ఈ యర్థమున నిది శాసనవాఙ్మయమునను, వ్యవహారమునను గానఁబడుచున్నది.) రథసప్తమి పుణ్యకాలమందు కృష్ణాగర్భమందును సహిరణ్యోదకదానధారాపూర్వకంగాను శ్రోత్రియం సుంకం తిలారికం అంది....యిస్తిమి. ౧౪౭౬ గు. జి. నెకనక్కల్లు శాసనము.

**శ్రోత్రియుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వేదములు బాగుగాఁ జదివిన వాఁడు. వి. అ. పుం. ౧. వేదము చదువుకొనిన బ్రాహ్మణుఁడు.

సీ.... శ్రోత్రియాగ్రియవృత్తిఁ జూపించు నొకవేళ నొకవేళఁ గడుజ్యోతిషికతఁ దనరు.నిరంకుశో ౪-౭౪.

## శ్రౌ

**శ్రౌతము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. శ్రోత్రేంద్రియమునకు సంబంధించినది, చెవిసంబంధమైనది. ౨. వేదసంబంధమైనది, వేదవిహితమైనది.

గీ. జ్ఞాన మాధ్యాత్మికంబైన శ్రౌతమైన, లౌకికంబైన నేరిచే వాశలించె, మున్నగా వారికిని భక్తి మ్రొక్కవలయు ....
సూతి. ఆ. ౨ పు. ౧౧౪

3. యజ్ఞసంబంధమైనది.

వి. అ. న. ౧. వేదవిహితమైన సంస్కారము (కర్మము). ౨. వేదోక్తాచారము.

శా.... శ్రౌత నిర్దిష్టాచారధురంధరత్వమున ....
నిరంకుశో. ౧-౫౯

మాలి.... శ్రౌతశాఖాగ్రవర్తీ !
బాల. విరా. ౧-౩౩౫.

3. నిత్యాగ్నిహోత్రపాలనము.

పుం. త్రేత; గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని అను మూఁడగ్నులు.

**శ్రౌతసూత్రము.** సం. వి. అ. న. శ్రుతుల నాధారముగాఁ జేసికొని ఆశ్వలాయన సాంఖ్యాయన కాత్యాయనాదులచే రచింపఁబడిన యజ్ఞ విధులు కల్పసూత్రములు.

**శ్రౌతి.** సం.వి. ఈ. స్త్రీ. ఇత్యాదిశబ్దప్రయోగము గల పూర్ణోపమాలంకార భేదము.

తే. గీ. అందు నుభయాఖ్య మగుఁబూర్ణ యాద్రి శ్రౌతి, యనఁగ రఘురామసన్నిభుఁ డనెడి చోట, వార్థి కందర్పుఁడును బోలె నలరుచుండు నధిపుఁ డనుచోట శ్రౌతిరైయ యతిశయిల్లు.
సరస. ౫-౯

**శ్రౌతి.** సం. వి. న్. పుం. శ్రౌతసూత్రము నెఱిఁగిన వాఁడు.

**శ్రౌత్రము.** సం. వి. అ. న. ౧. శ్రోత్రేంద్రియము, చెవి. ౨. వేదమందలి ప్రావీణ్యము.

## శ్ల

**శ్లక్ష్ణకము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. నున్ననిది, మెత్తనిది. ౨. సుందరము, ఇంపైనది.

వి. అ. న. పోఁకచెక్క, క్రముకము.

**శ్లక్ష్ణము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. మెత్తనిది, మృదువైనది, పరుషము కానిది (మాట మొ.). ౨. నున్ననిది. 3. సన్ననిది, సూక్ష్మమైనది. ౪. సుందరమైనది, మనోహరమైనది. ౫. నిష్కపటమైనది, మాయ లేనిది.

వి. అ. పుం. పోఁకచెట్టు.

**శ్లథము.** సం.విణ. (అ. ఆ. అ) ౧. కట్టఁబడనిది. ౨. వదులైనది, పట్టు విడినది, శిథిలము, పట్టు లేనిది. 3. వీడినది.ముడి విడినది (జాటు).

జాఁడును, గో, పాంగవ్రశియఁ గరుణవడయ రక్షితేశ్వరుచేన్. భాగ. సం. ౧౦. ౩౮౯.

ద్వి. మునికుమారకులార! ముదమున మీరు, చని లోహితాస్యుని సంగడిఁ గూడి. హరిశ్చ. ఉత్త. ౧౭౮౦.

చ. సాతులు పదాఱువేవురును సంగడిగా వదనాంబుజంబునన్. గృతకనివాస మన్నపవ. వా. ౫-౭౪.

ద్వి. బాడిక నీకిచ్చి పతిభక్తి సేయు, జాడ లన్నియు నీమసంగడి నేర్చి, నీవు వంకలుదీర్చ నీపంపుపనులు, గావింపుచుండెదగాక వేగిరపడ. హరిశ్చ. ఉత్త. ౧౧౯౦.

శి. ఇంగిలికము మణిశిలయున్, రంగుగ వైడూర్యరత్నరాజియుఁ దనలోం గట్టిశృంగవ గిముల, సంగడి శోభిల్లు యక్షసాన్ద్రపురంబుల్. వర హ. ౧౦-౧౪౮.

౨. కూడిక, సాహచర్యము.

ఉ. గంటసు నేగి నీసుతునిఁ గంటిమి నెమ్మది నున్నవాఁడు మా. సంగడి వచ్చివచ్చి యొక చక్కటికిం బయుటంబు చేసెనో యంగన నేల సెల్లటను వాఁడును వచ్చుఁ దలంకకుండు ముంచుగిరి మచ్చ, జెప్పవిఁడుబాక్కులు వీనుల కిన్నఁ దబ్బునో. భోజరా. ౬-౩౦౬.

౩. వలపు; అనురాగము.

ఉ. ముద్దుంగుఁడు మాకకుంతలయు సంగడి నుండుటగాఁ దలంపఁగన్. పి. శకుం. ౪-౯౧.

౪. పార్శ్వము; ప్రక్క; సరస.

ద్వి. శృంగారములు సేసి చెలువలు నడువ సంగడిఁ గొలిచి రాజన్యులు నడువ. రం. రా. బాలకాం. ౭౫. పు. ౨౦. పం.

చ. పసుచును నేమము స్నగుఁడు భావమునం దలిముక్తసీమసంగడిఁ బ్రవహించు శ్రీగగన గంగఁ దలంచి త్యజించుఁ బాపముల్. కాశీ. ౫-౪౦.

శీ. సంగడిఁ బిఱుంద ముందటు, నింగియు నేలయును నిండి నిష్ఠురభంగిన్ బుంగవశేతను సుభటుల భంగురవీరప్రతాపభయదస్ఫురణన్. కాశీ. ౭-౮౧.

ద్వి. ఏ సిగ్గులేఁతయు నెసఁగక వానిఁ, గొలిచి సంగడిఁజనుగో సంగిబంట్లఁ గలసి. హరిశ్చ. ఉత్త. ౧౫౭౧.

గీ. తనకు సురరాజనిజరాజధానివైభవములు చూపుచు సంగడి వచ్చునపుడు,దను నతఁడు మించి చన నోడఁ దాను నతని మించి చన నోడఁ బాను లీక్షించి రలరు. కకు. ౩-౩౦.

౫. చేరువ, సామీప్యము; సాంగత్యము.

ద్వి. అంత నాఁటనవరేణ్యుండు, తనుజాతయున్న చందము విలోకించి కడుఁగూర్మి వాదల సంగడి సెజ్జ మీఁద నిడుకొని. ద్విపరమ. ౩-౭౪౮. పం.

ద్వి. పొంగెడుపొంగెప్పు పొంగుచునుండ, సంగడిఁ బసులు నివ్వలి మేయుచుండ. అ. మ. కే. ౬-౭౧౧౧ పం.

సీ. చెలుఁ సంగడిమున్నఁ జిత్తంబు చలియించఁ గాకంబుఁ బొడఁగన్నఁ గడఁగు నాస. కళా. సి. ౬. ౫౬.

సీ. సంగడికాస్త్రము లద్దివెసాఁక బ్బల పెంపునఁ గలయుణో వెలలు సెలఁగ. చంద్రి. ౩-౧౨౭.

గీ. రాహుకేతువు లనియెడి రాత్రిచరులు.

వ. తమయెదిపంక్తి నున్న చక్రవాకుల సంగడి న్మెఱఁగి కూర్చుండి. హరి. ౯-౧౨౪.

౬. వెనుక; పశ్చాద్భాగము; అనంతరకాలము.

ఉ. రామునితోఁ దగ మైత్రిసేసె నా, రంగది నేంద్రపుత్రునకు రామవిభుండు మహాసహాయుండై, సంగడి వచ్చినాఁ డితఁడు సంగర కర్కశుఁడన్ బలాఢ్యుఁడున్. భా. రా. కిష్కిం. ౨౦౫.

వ. ఇది సిద్ధంబు దానిసంగడిన యున్మత్రప్రహస్యకథ వెలయుటకు నియంచే. కళా. ౫-౬౪.

౭. సంఘాతము; మొత్తము.

౪. ఇంపైనమాట; పరస్పరవిరోధములేనిమాట, యుక్తియుక్తమయినమాట.

**సంగతసంధి.** సం. వి. ఇ. పుం. స్నేహమైన పిమ్మట చేయబడినసంధి.

**సంగతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సహవాసము, కూడిక.

కం. అంగన సంగతి, గురుపుత్రులయింగిలి, మధు మాంససేవ... కడుపునకు నిషిద్ధములు మహిన్.

విజ్ఞా. కాం ౧-౬౫.

ఉ. సంగ్రామము సేయుచుండుమను రాజులు దొల్లియు పెంతవీపాళో భూమి మునీంద్ర సంగతి నుబుద్ధము నీకుజగంబు వాకు నీభూమి తెలంగ సెప్పను. భార. భీష్మ. ౧-౧౫. రసభంగము సంగతిలోన మెస్తురే. ఉ. హ. ౧-౭౨.

౨. లాగు, విధము. రీతి.

తే. శిబిసంగతి మాంధాతనయమునను యయాతి కరణి దిలీపునియట్లు రంతిరీతి వావచ్ఛ్రవాళ పరీతిభూతి, ధాత్రిఁ బాలించునవిభుండు దద్విభుండు. హంస. ౧-౪౨.

చ. సరములరీతి గ్రొన్నెలలరీతి బిడంబులభాతిఁ బద్మకేసరములధంగిఁ దారకలసంగతిఁదాను పుమాడ్కిఁ బున్నమంజరులవిధంబు౯ మణుల చాఱ్పునఁ జెక్కులం గంధతైలపాకనిచిత మల్ విచిత్రములు కమ్మనిపైఁదపుఁబిండికం టలున్. జై. భా. ౭-౧౯౯.

సీ. కటకట్లు గ్రుచ్చునంగతి నయ్యెరేపుర కుసుమగా గొరకల గ్రుచ్చి గ్రుచ్చి. కళ. ౭-౧౬౯.

ద్వి. అంగనజాతిసుందరై లింగమూర్తి, భృంగీశ్వరుఁడు చూచుసంగతిఁ జూచు. పండితా. దీక్షా. ౬౦. పుట.

సీ. పయ్యెదఁ దివసీక పట్టు నింతకుమున్న సిగ్గు సేంగతి దిగ్గవాడె. కవి. ౪-౧౭౭.

౩. సంపర్కము, సంసర్గము.

ద్వి. దొంగలచీరలకొంగుల మన్న.వంగ కాయలు ప్రాణలింగంబు లయ్యె,సంగతిదొంగలు సద్భక్తులైరి. పండితా. పురాతన. ౧౦౪.

౪. ఔచిత్యము, తగియుండుట.

తే.సంగతియె యోయి యుగమంత రింగణాపు... ఆము. ౪-౬౦.

చ. మనము నొందు నందు మనముగ్రములన్ సహోవఁ జెప్పన్,నరపగు లాతనిం నిజువ సాగుడు రాగతి సారెఁ బిల్చు నచ్చనవుర కీసవాది గాని సంగతిగానివి క్రొత్తచేయుఁ జెప్ప ... ఆము. ౪-౨౬౫.

౫. మైత్రునము, మాటలు, దర్శనము. ౬. ఆక స్మికమైన సంధివను ప్రాపికముగాఁ బుట్టించుట. ౭. జ్ఞానము ౮(తర్కము) విశేషజ్ఞానమునకై ప్రశ్నించుట. (అనంతరాభిధాన ప్రయోజకమైన జిజ్ఞాసను గలిగించుజ్ఞానముయొక్క విషయము)

**సంగమనము.** సం. వి. అ. న. సంగమము.

క. భోజాంధకసంగమనవిగాజితి మగనిబలంబు.... భార. మౌసల ౫౩.

**సంగమనుఁడు.** సం. వి. అ. పుం. యముఁడు.

**సంగమము.** సం. వి. అ. పుం. ౧. కూడిక, కలియుట, ఏకీభావము. ౨. సాంగత్యము, సహవాసము. ౩. స్పర్శము,తాఁకుడు. ౪. మైథునము రతి, పొందు. ౫. నదులు కలియుచోటు.

వ. ఇవ్విధంబునఁ బరిభ్రమించుచు నొక్కనాఁడు గంగాసరయూసంగమప్రాంతవనంబు చేరి వర్తించుచుండ .... కళా. ౭-౧౧౭.

౬. సంధానము, పొందుపఱచుట. ౭. యుద్ధము. ౮. (సూర్యాదిగ్రహముల) సంయోగము, ఏక రాశియందుండుట.

**సంగము.** సం. వి. అ. పుం. ౧. కలయిక, చేరిక ౨. నదులకూడిక,నదీసంగమము. ౩.సంస్పర్శము, సంబంధము. ౪. సాంగత్యము, మైత్రి ౫. కోరిక ఆసక్తి.

**సంఘటి (యి) ంచు.[1]** సం. అ. క్రి. ౧. సమకూడు.

ఉ. నన్నయభట్టు తిక్కకవివాగులు చూపిన త్రోవ పావనం బెన్నఁ బరశరాత్మజమునీం ద్రుని వాఙ్మయ మాదిదేవుఁడొ, వెన్నునివృత్తి మీవు కవ వేసుకతో విను వాయకుండ వి, శ్లైన్ని యు సంఘటించె మదభీప్సితసిద్ధికి రాజ పుంగవా! -హరి. పూర్వ. ౧-౪౦.

౨. వీణాదివాద్యములను వాయించు.

**సంఘటిల్లు (లు).** సం. అ. క్రి. సమకూడు, కలుగు.

ఆ. అమరకన్య వలన నవ్యయానందంబు, సంఘ టిల్లఁ జూచె సంయమీంద్ర! భార. శాం. ౫-౨౩౩.

క. ఈ, పురుషులు గూడి సృష్టికి వెరవమలది సంఘటిలదు వేర్పడికనిన్. భార. శాం. ౫-౬౧.

**సంఘట్ట.** సం. వి. ఆ. స్త్రీ. పెద్దతీఁగె.

**సంఘట్టన.** సం. వి. ఆ. స్త్రీ. రాపిడి, ఒరయిక ౨. కూర్పు, రచన ౩. అంటుకొనుట, తగిలి యుండుట. ౪. కూడిక, కలయిక ౫. మల్లు రొండొరులను దాఁకుట. ౬. తాఁకుట. ౭. కా ముకుల యాలింగనము, కౌఁగిలింత.

**సంఘట్టనము.** సం. వి. అ. న. = సంఘట్టన.

**సంఘట్టము.** సం. వి. అ. పుం. ౧. రాపిడి, ఒరయిక = ఒకదాని కొకటి రాసుకొనుట. సంకులసమరము, దొమ్మి. ౪. కలయిక ౫. కయ్యము. ౬. (నవరుల) స్పర్ధ. ౭. కౌఁగిలింత.

**సంఘతలము.** సం. వి. అ. పుం. చాఁచినవ్రేళ్లు. కలిగి యుండునట్లు కొటిలోఁ గూడియుండుచేతులజంట.

**సంఘము.** సం. వి. అ. పుం. సజాతీయజంతు సమూహము. ౨. సమూహము; గుంపు.

మ .... విజృంభించెద, మ్మృగసంఘంబులు వచ్చి యడ్డపడిన ద్వార్వారదర్పోద్ధతిన్. భార. ద్రోణ. ౫-౩౩౮

౩. సన్నిహితసంబంధము, కలయిక (అ. వి.) ౪. సమాజము.

**సంఘర్షము.** సం. వి. అ. పుం. ౧. రాపిడి, ఒరయిక.

సీ. కటుదంతసంఘర్ష కిటకిట స్వనములో కిటకిట నీనినదంబు నెవ్వడుపజుప. దశా. ౬౧౧౭.

౨. విసరుట; పిండిచేయుట ౩. ఒకదానినొకటి తాఁకుట. ౪. పోటి, స్పర్ధ ౫. అసూయ, ఓర్వ లేమి. ౬. జారుట, మెల్లఁగాఁ బ్రవహించుట.

**సంఘవృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. కూడిక, సంయోగము

**సంఘాటిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. జత, ద్వయి, జోడు. ౨. కుంటెనకత్తె, దూతిక. ౩. ముక్కు. ౪. వాసన.

**సంఘాణకము.** సం. వి. అ. పుం. న. నాసా మలము, చీమిడి.

**సంఘాతకఠినము.** సం. విశే. (అ. అ. అ) ఘన పదార్థమువలె గట్టిది.

**సంఘాతము.** సం. వి. అ. పుం. ౧. దృఢసం యోగము ౨. సహస్థితి, సహవాసము. ౩. గుంపు, సమూహము.

లే. గీ. ప్రకటకటకఁబు పాదవిభ్రాజితంబు, నైన యగసంఘ మని చూచి యచలభావ, హైన్యమున నాగసంఘాతమంత్రము సుకవు, లవటిమదసంచరముల నేమని నుతుంతు. నిరంకుశో. ౧-౫౩.

౪. చంపుట. ౫. కఫము, శ్లేష్మము. ౫. సమా సము చేర్చుట. ౬. రకభేదము ౭. (నాటకము లందలి) ఒకవిధమైనగదకగమనభేదము ౦ . శ్లోక సముదాయము.

**సంఘాతశిల.** సం. వి. ఆ. స్త్రీ. నల్లరాయి. పాషాణము.

**సంఘీభవించు.** సం. అ. క్రి. గుంపుగూడు, ప్రోఁగుపడు.

వ. నారాయణస్థానంబు సొచ్చియచోట్ల సంఘీ భవించిన విశంచినను లగుసంయములం గమ లాక్షీసమేతుండై సేవించి. కవ. ౧-౧౯.ను

**సంచరము.** సం. వి. అ. పుం. గ్రహములు రాశి చక్రమున నొకరాశినుండి మఱొకరాశికిఁబోవుట. ౨. మార్గము; దారి. ౩. సందు, సన్ననిత్రోవ, కొండలనడిమిసందు; కనుమ. ౪. ద్వారము. ౫. శరీరము. ౬. చంపుట. ౭. వృద్ధిపొందుట. ౮. ఆనకట్ట.

**సంచరించు.** సం.అ.క్రి.తిరుగు; సంచారముచేయు
ఉ. నీ, వీపయి వాహనోత్తమము నెక్కి కుమారవరేణ్యు నిచ్చలున్, నీవని సంచరింపు ధరణీ ధరణీసురరక్షణార్థమై. మార్క. ౧. ౩-౬.

**సంచలనము.** సం.వి. అ. న. కదలిక; క్షోభము, వణఁకు, కలవరపాటు.

**సంచలపఱుచు.** సం. క్రి. (సంచలపడు ధా. ప్రే) చలింపఁజేయు.
క. తరుణులచూపులు మాటలు, నరగకలు నగవు బిగువుకౌఁగిటి పొందుల్ పరికింపనేల తిన్నం స్మరణమె చాలదె మనంబు సంచలపఱుపన్. ప్రబోధ. చం. ౧-౫౪.

**సంచలము.** సం. విశ. (అ. ఆ. అ) చలించునది; కదలునది,కంపించునది.(సంచలత్వ,సంచలత్వభావము, చలనము.
మ. కలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సంచలితం బొందె వసుంధరావలయ మాశాచక్రమల్లాడె .... భార.విరా. ౪-౨౭.

**సంచలించు.** అ. క్రి. కంపించు; కలవరపడు.
ఆ. అనేఁడు రాజసమున నచ్చకు దిగ్గన, నేది పోయె సంచలించె నలుఁడు. భార. ఉద్యో. ౩-౨౭౩.
చ. తనమది కాము బాణములతాఁకున నంతయు సంచలింపఁగా. మార్క. ౬-౫౯.
చ. ... ఉండ వాన్పదమయి సంచలించె నిపాతవికంపితపంకజాస్యపిన్. భార. ఆది. ౪.

**సంచాయ్యము.** సం. వి. అ. పుం. ఒకానొక యజ్ఞము పేరు.

**సంచారకుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) సంచరింపఁజేయువాఁడు; నడపించువాఁడు. వి. అ. పుం. ౧. దారిచూపువాఁడు. ౨. పురికొల్పువాఁడు. ౩. ఉపన్యాసకుఁడు.

**సంచారణము.** సం. వి. అ. న. సంచరింపఁ జేయుట; నడపుట. ౨. పురికొల్పుట. ౩. దారిచూపుట.

**సంచారము.** సం. వి. అ. పుం. ౧. గమనము,
ఉ. చేసిను లగ్నవేళ యతిశీఘ్రమురమ్యని విన్నవింపఁ బుద్ధిగ నంతనంతఁ బనూరగురుకుంతలగాడచోళగాంధారముఖావనీశులు విదర్భనరేంద్రునిరాజ్యముఁ బాదసంచారమునన్ శకటాంకముం గ్రహపాలికి భక్తిఁ గ్రమ్మరై. శృం. నై. ౬-౫౧

తిరుగుట;పయనముచేయుట. ౨. ఒకచోటునుండి మఱియొకచోటికి మారుట. ౩. దారి, మార్గము. ౪. కష్టప్రయాణము. ౫. కష్టము, ఆపత్తు. ౬. పురికొల్పుట, ప్రోత్సాహపఱుచుట. ౭. సాహాయ్యముచేయుట. ౮. త్రోవ చూపుట. ౯. రోగ మొకనియందుండి మఱియొకని కంటుట. ౧౦. పాముపడగ మీఁది మణి. ౧౧. సూర్యుఁ డొకరాశినుండి మఱియొకరాశియందుఁ బ్రవేశించుట.

**సంచారి.¹** సం. విశ. (న్. ణీ. న్) ౧. చలించునది, కదలునది. ౨. తిరుగునది. ౩. సంచరించునది.
మ. హృదయబ్రహ్మరథం బతిప్రియనమం బెక్కింపుఁ జేతోమునిస్వనవాహ్యానికి నత్తమానసనభస్సంచారిఁ గావింపు హృద్విదిత క్షీరసముద్రఖేలనమున న్లెలింగు నుత్కృష్టవస్తువులం బ్రాజ్ఞుల దిక్కుయజ్ఞ నమరేశు న్నోము శ్రీవాసునిన్.పంచతంత్రము.౧-౧౧

౪. మారునది, స్థైర్యములేనిది. ౫. ప్రయాణము చేయఁ గష్టమైనది; దుర్గమమైనది. ౬. స్థిరము కానిది, క్షణభంగురమైనది. (భావము)౭.రోగ బాధను మోయునది. ౮. వంశపరంపరగా వచ్చినది. (రోగము) ౯. అంటుకొనునది (రోగము) ౧౦. పురికొల్పునది.

**సంచారి.²** వి. వా. పుం. ౧. గాలి; ౨. ధూపము, ౩. ప్రధానరసమును బలపఱుచు భావవిశేషము సంచారిభావము, (చూ. వ్యభిచారి)

**సంచారించు.** సం. అ. క్రి. నడచివచ్చు, బయలుదేఱు; సంచారముచేయు. ఇటునటు తిరుగు.

వ. విరించిప్రముఖనిఖిలదేవతావితానజయజయాలాపంబు లాదరించి సంచారించి సంచారించి సంచారాసనంబు నెక్కి మూర్కొంటిందలంప. వరాహ. ౧౧-౧౦౫.

**సంచారిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దూతి.

వ. ఇట్లు వగలనొగులు నమ్ముగువలఁ దగవుల మాటల సంచారికాముఖంబున నూరార్చి.... రాధామా. ౪-౧౯.

౨. కుంటెనకత్తె. ౩. నీతి, జోడు. ౪. వాసన, గంధము.

**సంచారితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. సంచారము చేయఁబడినది. నడపఁబడినది. ౨. పురికొల్పఁబడినది. ౩. తీసికొనిపోఁబడినది.

**సంచాలి.** సం. వి. ఈ. స్త్రీ. గుంజ, గురువెంద i

**సంచి.** వి. ౧. గోనెభేదము (చూ. సంచీ శ. ర)

క. మరుగోనె యాగగోనెకి, జనుసంకెము సంచి లిప్తసలకర...తెద్దెదంబులగు. ఆం.ప.చర.౧౬.

౨. అసిమి, అల్పగోనె.

గీ. నాగపట్టియ కకపాల నోలెసంచి కలికికాటుక గీర్పొట్టి పలుగుపేరు, జాతి గాఁదాల్చి నెఱిమిండతండ మగుచు. హర. ౫-౪౧.

**సంచింతనము.** సం. వి. అ. క. ఆలోచన; యోజించుట.

**సంచింతితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. ఆలోచింపఁబడినది. ౨. ఉద్దేశింపఁబడినది. ౩. స్థిరపఱుపబడినది.

**సంచిక.** వి. ౧. చేర్చి కట్టిన కొన్నితాటాకులు, కాగితములు. ౨. వివిధరచనలతోఁ గూడిన సంకలనగ్రంథము.

**సంచికట్టు.**[1] వి. ౧. ఒకేవిషయమునకు సంబంధించిన వివిధవస్తువులతోఁ గూడినసంచి, (౨. వైద్యుఁడు. సంచి కట్టుకొని యదేపనిగాఁ బ్రవర్తించువాఁడు (శ. ర)

**సంచికట్టు.**[2] అ. క్రి. ప్రయాణమునకు సిద్ధమగు. (వ్యవ)

**సంచితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. ప్రోఁగు చేయఁబడినది;

సీ. సిద్ధరామేశ్వర శ్రీమహాదేవశాశ్వతకృపాసంచితైశ్వర్యపదము. శివధర్మ. ౧-౧౫.

౨. నిలువచేయఁబడినది, కూడఁబెట్టఁబడినది.

క. జలసంబున నర్థము సంచితముగఁ గావించి.... భార. శాంతి. ౧-౭౭.

౩. లెక్కింపఁబడినది. ౪. కూడుకొన్నది; సంపన్నమైనది. ౫. ఆటంకపఱుపఁబడినది. ౬. సాంద్రమైనది, దట్టమైనది. (ఆదవి)

**సంచితి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రోగు, రాశి.

**సంచిమొదలు,** వి. మూలధనము. పెట్టుబడిసొమ్ము

సీ. చలిగాప్పుకోమటిచాలు సజాతియమునకుఁ దావులసంచి మొదలగుసంగు. కువల. ౩-౯౫

సీ. అచటి మేటికిరాటు లలకాపతిసైరములు సంచి మొదలిచ్చి మనుప వత్తురు. మనుచ. ౧-౫౦

తే. బలయు రత్నాకరములు సంపాలుగఁ జేసి, పొదివి నిగ్గులెల్లఁ గొని సంచిమొదలు చేసి, చేరమానెడుపాటి యుదారలక్ష్మి, బచ్చులప్పరి నున్నారు పెచ్చుపెరిగి. పాండురంగ. ౧-౧౧౧

శా. ఏయూరం దనయంగముల్ నెఱయు నేయే చేరు లెంతైన నా, త్మీయత్రైకఘనంబు సంచి

**సంజనించు.** సం. అ. క్రి. జనించు, కలుగు, పుట్టు
చ. అనినఁ గృపారసంబు హృదయాంబుజహం
బున సంజనింప న, య్యినకులరత్న మిట్లను.
హరిశ్చం. ౧-౨౧౮

**సంజయుఁడు.** సం. వి. అ. పుం. ధృతరాష్ట్రుని యాంతరంగికభృత్యుఁడు. (ఇతఁడు వ్యాసమహర్షి వరము చేయ యుద్ధసమాచారములన్నింటిని గ్రహించి జాత్యంధుఁడయిన ధృతరాష్ట్రునకుఁ దెల్పుచుండువాఁడు. కురుపాండవులకు సంధి చేయుటకై యితఁడు నడపిన రాయబార మవ్యర్థమైనది.)

**సంజల్పము.** సం. వి. అ. పుం. 1. సంభాషణము, సల్లాపము. 2. అసందర్భసంభాషణము. 3. గోల, కలకలము.

**సంజెవడు.** అ. క్రి. సంధ్యాకాల మగు.
కం. నడురేయి సంజెవడునప్పుడు వేగుజామునఁ
జొచ్చి పోటునకుఁ బ్రల్ గడఁగుదురు.
భా. రా. యు. ౧౦౯౫

**సంజవనము.** సం. వి. అ. న. 1. పరస్పరాభిముఖముగానుండు; 2. నాలుగిండ్ల నడిమి ప్రదేశము.

**సంజవలుచు** (సంజ+పలుచు). అ. క్రి. ఎఱ్ఱఁబలుచు.
సీ. ఔఁదలఁ జదలేటి తేఁదరఁగలు పొలుపొందగు
చందమామ నయ్యాలపొంకపుఁ, దొడవుల తెల్ల
ఁ జెన్నొదవుమానికముల చాయ దిక్కుల
నెఱసంజ వలుప. (ఇది శివస్వరూపవర్ణనము)
హరి. ఉ. ౬-౩౮

**సంజాతము.** సం. విణ. (అ.ఆ.అ.) 1. పుట్టినది,
సీ. నిర్ణిద్రదారిద్ర్యనిరుపాధియుతశిష్ట, సంజాత
హృద్భల్లి లంజెతల్లి. నిరంకు. ౨-౪౧
తే. గీ. .... శైత్యమాంద్యకసౌరభ్యసహితమైన,
మలయపర్వత సంజాతమారుతంబు.
విక్ర. ౧-౯౭
వెడఁగినది. 2. కడచిపోయినది. (కాలము)

**సంజీవనము.** సం. వి. అ. న. 1. కలసి బ్రదుకుట. 2. మరల జీవింపఁజేయుట, బ్రదికించుట. 3. నరకభేదము, ఇరువదియొక్క నరకములలో నొకటి. 4. చతుశ్శాలగృహము.

**సంజీవని.** సం. వి. ఈ. స్త్రీ. 1. చచ్చినవానిని మరల బ్రదికించెడి యొకానొక యోషధి.
సీ. .... సకలజీవోత్తమసంజీవనియనంగ, బ్రకట
నిద్రాముద్రఁ బాయఁజేసి. విక్ర. ౧-౯౭
2. బ్రదికించుట. 3. ఆహారము. 4. రఘువంశ కుమారసంభవ మేఘసందేశాది కావ్యములకు మల్లినాథకృత మగు వ్యాఖ్య పేరు.

**సంజీవనౌషధి.** సం. వి. ఇ. స్త్రీ. పునర్జీవము నొసంగునట్టి యోషధి।

**సంజీవప్రభుఁడు.** సం. వి. హనుమంతుఁడు.
క. శుభకరుఁ డగుసంజీవ, ప్రభుని చరిత్ర మంట
తెప్పబంధము సీతావిభుచే ఁ బడుట గలదే
యుభయగతుల్ దీరఁగాక యుండఁగ కృపను
లన్. సవిర. ౧-౨౯

**సంజీవరాయుఁడు.** వి. హనుమంతుఁడు.
మ. బ్రహ్మకైన నశింపనీయన్ దాని సంజీవరాయని
చారిత్రము. సవిర. ౨-౧౩౫.

**సంజుఁడు.** సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨. శివుఁడు.

**సంజోక.** వి. (సం. సంయోగః) ౧. సవరణ, పరికరము.
గీ. అవఘంపుము పయిభూషణాంబరాదులవిధం
బున దాఁచి తా దేవదేవితాను వైష్ణవురాలి
వంతెంబుఁ బగాని చాలఁ దగినట్టి సంజోక సవ
దరించి విప్ర. ౩-౨.
తే.... .... అంతలోఁ బాదరసము, సోకగలనేజ
నిండుసంజోకఁజేసి, యెదుట నటుదెచ్చి
నిల్పెసాహిణి యొకండు. శుక. ౧-౧౬౧.
౨. బంధనము, కట్టు, (జీను) కట్టుట.

**సండీనము.** సం.వి.అ. న. పక్షుల గతివిశేషము.

**సంఘుఁడు.** సం. వి. అ. పుం. = షండుఁడు.

**సంత.** వి. ౧. అపవాదము. (సం. సంస్థా క. తు. సంతె. చ. చంతై)

చ. ఎసగును .... స్వోసపడిసంతె .... అపవాదమా. అం. ప. గుణ. ౯౨.

౨.(సం; సంస్థా, సంథా) (క. చంతై.తు.సంతె) నిర్ణయింపఁబడిన దినమునం దుండెడి యంగడి వసుస; ౨. కొనువారియొక్కయు నమ్మువారియొక్కయుఁ గూటమి.

వ. కొంకణకసన్నికృష్టవిప్రకృష్టభూముల నుండు గ్రామంబులనుండి బేహారులు నానారూప వస్తుకలాపంబు లక్కయూరికిం దెచ్చి సంకేతస్థలమ్మున నమ్ముటయు సంతెయనంబడు. న. యా. పు. ౧౩.

సీ. చెప్పనిపని సేఁతచేఁగాద నని పోవ,సంతకుఁ బొమ్మన్నఁ జింతసేయు. శుక. ౨-౨౧౯.

ఉ. సంతె నెన్నఁడో, నవ్వఁగ మమ్ము గొన్నగడసాని సముంగవయుం దలంచితే. ఉ. హ. ౧-౭౨.

వ. ఊరూరిసంతసంతకుం దిరుగఁ పెద్దలింటింట సంతరించిన పలుకువాటుగోడిగల. ఆము ౪-౩౫.

3. వేదపాఠము.

వ్య. వేదము సంతచెప్పుకొనువాఁడు.

౪. చెంత, పార్శ్వము.

ఆ. పంతగాఁడు యోగి సంతతిపై నిలుచుతడయయు లేక సంతసమున సంతసింపఁచేయు సంతతి క్రూరమ్మ,సంతరాకు మిఁక నసంతె సీవు. రసిక. ౬-౬౬.

సామీప్యము.

ద్వి. అంతకాంతకు భక్తులన్యశైవముల,సంతయు నొల్లరు సహజంబు వినుము. బస. పురా. ౧౯౭. పు. ౭౮౧ పం.

౬. సమీపప్రదేశము.

ద్వి. సంతల నిలిచి దూమకులు చెలంగ. బస. పురా. ౧౯౨ పు ౫-౪౪ పం.

**సంతశిక,** సం.వి.ఆ. స్త్రీ. పట్టుకాఱు; లోహకారులపనిముట్టు.

**సంతక్షణము.** సం.వి.అ.న. ఎత్తిపొడుపుమాట.

**సంతతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. వ్యాపింపఁజేయఁబడినది, విస్తరింపఁజేయఁబడినది. ౨. ఎడతెగనిది, అవిచ్ఛిన్నమైనది.

ఉ. తచ్చసురవిలాసినీగణము సంతతసేవ యొనర్చ నీమనోహితముగ నింక నేనుఁగ నెంతటిదాన ఉ. హ. ౧-౭౭.

3. శాశ్వతమైనది, ఎల్లకాల ముండునది. 4. అనేకమైనది; సమృద్ధమైనది. క్రి. విణ. ఎల్లప్పుడు.

ఉ. భంగముతోడ నున్నవనుఁ బంపు విరాటుని మీఁదభూమికిం జెంగట—వాదయిన శీఘ్రపుటూర్పులు సంతతంబు వానిం గను గానిసేయుచు తనిం జెలుపం దలఁచియుండు ....
భార. విరా. 3-౧౧౯.

**సంతతి.** సం.వి.ఇ. స్త్రీ. ౧. వంశము, గోత్రము.

౨. సంతానము, అపత్యము.

.... కామినీ, సంతతిలేని లేఁత నని .... నార. ౨-౧౧౬.

.... చూపం బనిలేదు వానిసుతసంతతికిన్. పీఠా. కాం. 3-౦౬.

3. విస్తరించుట, విస్తృతి, వివవి. ౪. శ్రేణి, వరుస, సమూహము.

౫. వ్యాప్తి, వ్యాపించుట ౬. రాశి, ప్రోఁగు. ౭. ఎడతెగకుండుట, అవిచ్ఛిన్నత.

**సంతన (ము).** వి. (సం. సంధానమ్) ౧. అమర్చుట. ౨. కూర్పు, తాపుట.

మ. నెలటొసంతననిగ్గు లుప్పతిలు తిన్నెల్ మూలఁటొపెద్దటాకుల నిద్దంపు జగాహజారమున చంద్రా. ౨-౩౭.

వ. కెంపు గాయోడుబిల్లల సంతన దొంతర చుట్టి బలవంతుల వింతలు సంతరింప. ఇంమ. ౨-౪౪

3. కూడిక, మేళనము.

సీ. తమ్మిమానికపుసంతనపట్టియల చేతఁ జొక్క
పుము త్రైపురాబనముల. ప్రబం. ౧-౫౬౬

సీ. శృంగారభవనమాజిగ సంతనవునను మ్రాని
పల్కులగొప్పమందసంబు. ఉత్తరహరశ్చం. ౨-౧౩౦.

సీ. కనువిచ్చి మాచె నాకటికల్వ యేకుదొంతర
వసంతముల సంతనము విూఱు. అహల్యా సం. ౧-౩౪.

**సంతనకట్టు.**[1] అ. క్రి. (సంతన + కట్టు) ౧. సంఘీభవించు, ఏకమగు.

సీ. సంతనకట్టి యుత్సాహసమేతులై యంతయు
లేనిరథాశ్వములను భార. ఆది. ౨-౨౧.

ఉ. అంతట నీరతి మిక్కిలిగ దాఁగతనంబున
దొమ్మిచేసి దుర్గాంతపరాక్రమోన్నతులు దా
నవసైన్యముల వేయు వెజ్జుధన్వంతరిచేతి దుగ్ధ
మయవార్ధిసుధారసపూర్ణకుంభమున్, సం
తనకట్టి పుచ్చుకొని చయ్యన నేగిరి నిశ్శంక
తన్. భీమ. ౪-౯౬.

౨. ఆయత్తపడు.

ఉ. ఇంతకుమున్న వాఁడు ననియెం గనుదమ్ము
గఁ బోవకుండ ...రయంబునం బటు
రథావలి యొప్పఁగ నేగుఁడు ఉగ్రులై, సంతన
కట్టుఁ దస్త్రములు శస్త్రములుం దొడుగుండు
భార. ఆం. ౬-౨౦౦.

క. అంతఃకరణంబున నటు, చింతిలి యుండునుఁ
బ్రపంచసృష్టికిని బ్రహ్మోదంతమ్ము లేక
దుర్వ్యథ సంతనకట్టఁగ విధాత చాలండ
య్యెన్. శివరాత్రి. ౧-౫౭.

**సంతనకట్టు.**[2] స. క్రి. ౧. ధరించు, పూను. (సంతన+కట్టు) ౨. ఆయత్తపఱచు, సిద్ధముచేయు

ఉ. అంతకుమున్న సిద్ధగరావనినాగుని దంత
నాఘుఁ డత్యంతబలాభిరాముఁడు మహారథ
నాముఁడు సర్వసైన్యముల్ సంతనకట్టె.
విక్ర. ౪-౭౬.

**సంతనచే(సే)యు.** స. క్రి. (సం. సంధానము చేయు) అతుకు, తాపించు.

సీ. తలఁపు దాగ నెలసంతన చేసికట్టి పెన్ జగతిపై
ముత్యాలచవికె రొదుట. యయా. ౪-౭౪.

**సంతపడు.** (√ సంతన) అ. క్రి. వశమగు, అనుకూలపడు.

**సంతపనము.** సం. వి. అ. న. ౧. వేఁడిచేయుట; కాల్చుట. ౨. మిక్కిలి బాధపెట్టుట.

**సంతపఱుచు.** స. క్రి. (√ సంతపడు) వశముచేయు, అనుకూలపఱచు.

సీ. మ్రుచ్చు పెక్కుటిఁబట్టి ముకుఁద్రాడు కుట్టించి
గంతగోనెకు దాని సంతపఱిచి (శ. ర. పా)
నా. పంచ. ౫-౧౩.

**సంతపాక.** వి. అంగడి పెట్టుటకు వేయఁబడిన పాక.

**సంతపాకతొత్తు.** √ సంత. వి. గుడిసెకేటుఁగత్తె.

ఆ. వె. కుక్క యేమెఱుఁగును గుడిలింగసంగంబుఁ
దిక్కుయొడిసిపట్టి పీఁకుఁగాక, సంతపాక
తొత్తు సన్యాసి నెఱుఁగునా, విశ్వదాభిరామ
వినుర వేమ. వేమ. ౨-౩౩.

**సంతపించు.** సం. అ. క్రి. పరితపించు; దుఃఖపడు.

వ. ...మయొదయుఁడు తెమ్మ మిగులఁ గూడి
యుండమికి దుర్దమస్థలసంస్థిత లగుట జార
క్రీడకుఁ బొసఁగమికిఁ గంతుశరసంతతసం
తాపంబునకు సంతపించుచు. హంస. ౫-౨౮౯

**సంతపెట్టు.** స. క్రి. (√ సంత) పొందుపఱచు, ఒద్దికపఱచు.

చ. అని పలుకంగ వానభికులప్పుడె జంగి
యినింటు పెట్టి నీయును మొసఁగన్ కుమార
కుని నిమ్మని వారల సంతపెట్టెన్. పంచ. ౧.

**సంతపేట.** √ సంత. వి. సంతజరుగు నగర భాగము.

తే. గీ. అధ్యులై గోత్రశాలల నధివసించి, పటుల
గేహ్యానముల చక్కటులఁ దీర్చి, వారలును
గల్గి శంబరవైర సంత పేట యన నొప్పు.
నవేశవాటమునను. ౩ జ. ౩-౬౯

**సంతప్తము.** సం. విణ. (అ.ఆ. అ) ౧. తపింపఁజేయఁబడినది, కాల్పఁబడినది. ౨. మిక్కిలి బాధపెట్టఁబడినది; బాధపడినది. ౩. కాలినది దగ్ధమైనది. ౪. అగ్నిదగ్ధమై శుద్ధమైనది (బంగారు. మొ.) ౫. అలసినది.

**సంతప్తవక్షుఁడు.** సం. విణ. (ప్) శ్వాసము తగ్గినవాఁడు.

**సంతఁబెట్టు.** స.క్రి.(√సంత) విడుచు;త్యజించు.

వ. తదవసరంబున సుర లసురవిసరశరనికాయ నిర్జరితకాయులై విఱిగి పందెంబుల సంతఁబెట్టు బిరుదులు వదలి కడిమి విడిచి వానిపెనఁ బాపి మానంబు మాని గుట్టు గట్టిపెట్టి ప్రాణ పరాయణత్వంబునం. వరాహ. ౧౧-౬౫.

తే. గీ. సర్వసంగంబు మిక్కిలిసంతఁబెట్టి తప సియై యున్నతను జంప దగ్గఱిల్ల,నీదురాచార వర్తనఁ డెల్లవారి, హతులఁ గావించెడివిధ మెంతియునకుఁ జొక్క. శివ. ౪-౪౨.

**సంతమకము.** సం. వి. అ. పుం. ఊపిరిపీల్చుట మున్నగువానియందు గలుగునొప్పి, ఊపిరికట్టు.

**సంతమము.** సం. వి. స్. న. ౧. దట్టమగు చీఁకటి, గాఢాంధకారము. ౨. మహామోహము.

**సంతమసము.** సం. వి. అ. న. = సంతమము.

**సంతము.** సం. వి. అ. పుం. తెఱచి దగ్గఱగాఁ జేర్చినయఱచేతులదోయి.

**సంతరణము.** సం. వి. అ. న ౧. నదిమొదలగు వానిని దాఁటుట. ౨. గెలుచుట, జయించుట.

**సంతరించు.** స. క్రి. ౧. గడించు; సంపాదించు.

మ. పరవిన్ దానము భోగమున్ మఱి వినాశం బన్నయిమ్మూఁడునై, ఖలులన్ మర్త్యులు సంతరించు ధనసంఘాతం బపేతం బగున్, ధరణీ వాద్యమునైన దండవిధముల్ దప్పన్.... మల్లభూ. నీతిశ. ౩౪.

తే. గీ. జార నీవు గడించిన వసుచయాకొసంక కూడిన మఱి నేను సంతరించుసొమ్ము మీఁదట నీకియ. శుక. ౩-॰॰.

వ.... ఊరూరిసంతసంతకును దిరుగఁ బెద్ద లింటింట సంతరించిన....కొదమపెట్టువగుంపు.... ఆము. ౪-౩౫.

వ.... అమృతంబు సంతరించినంగాని గాత్రంబు యథేష్టభోగంబులకుం బాత్రంబు గాదు. దశా. ౨-౧౪౧.

సీ.... సంతరించిన యట్టిసకలపదార్థముల్, తగు లీల నింటిలో దాఁచుటకును. దశా. ౩-౩౪

చ. కరువలివాఁడు మేనులును గొనులుఁ గీల్ జవలుం దొడల్ నడల్,తఱులుఁ గురుల్ మరుల్ కొలుపఁ దా నిపు డెక్కడ సంతరించెనో, శరశరమై దుకై దువ్వులజంత.... చం. పూరా. ౨-౯౯.

చ. ధనమణివస్తువాహవనితాజనతామును బల్మి సంతరించిన యవి యందు ధర్మములు సేయక యుండిననేమి యంచు న,య్యనిమిషు లందఱున్ బిగసు రంచు మహాపద నొందనున్నవి, న్ననుజాఁదవన్నఁ గగ్గ నిరయంబు రయంబున రమ్ము పొండికిన్. ఉ. రా. ౩-౪౮.

౨. సంగ్రహించు, దొంగిలు, అపహరించు.

తే. గీ. ఇంతబంగారుగిన్నియ సంతరించు;వాఁడు దీనికిఁ జోడైనపైడిపళ్లె, రంబు చిటుపొటి గిన్నెలు చెంబు సంతరించకుండునొకో యమ్మ యెంచుకొమ్మ. వైజ. ౪-౨౫.

౩. కలిగించు; పుట్టించు.

సీ. సన్నుతసత్కవీశ్వరగాయకచకోరసమితి కానందంబు సంతరించి వి. పు. ౧-౩౯.

వ. లేటిపింఛునకు జలభ్రాంతి సంతరించుచెంత మావుల చుఱుకునఁ బెండిపడి క్రాఁగు. చంద్రాంగ. ౨-౭౪.

వ. దుర్గాధిపతు లేమేమ యని వీమ వీచోత్తు లచ్చుమ్ములగుకౌముదీగుచ్ఛమ్ముల సంతరింప. మను. ౫-౮౧

4. తాల్చు, ధరించు.

క. గగనలక్ష్మి లతాతన్వికబరిమీఁద,సంతరించిన ముత్యాలజల్లి వోలె. కాశీ. ౪-౧౭౬

సీ. కేలుఁదామరయందుఁ గేదారవలయంబు,జడ కుచ్చుమీఁదఁ బచ్చకపువందసంతరించి. హర.

తే. మగువ దేవరదివ్యనామము జపించు, నెమ్మన మ్మున నిత్యవ్రతమ్ము గాఁగ, నచ్చముక్తాఫలౌ కావళిచ్చలమునఁ, జన్నుఁగవ నక్షసూత్రంబు సంతరించి. శృం. నై. ౭-౬౩

సీ. పయ్యెదమాలుగాఁ బాలుటాకు లమర్చి, చాదుకఁ దిలకంబు సంతరించి. హర. ౫-౩౭

సీ. లీల రుద్రాక్షమాలిక దక్షిణశ్రవశ్యస్కలీ శిఖయందు సంతరించి. కాశీ. ౨-౬౪

చ. అనవుడు మందహాసగించి యానపద్మమునం దలిర్పఁ జయ్యన నీలాపిపుత్రిక గారాంబురుహంబున సంతరించి. విక్ర. ౨-౨౩౨

5. చక్కఁబెట్టు, సవరించు, సరిపఱుచు.

చ. తెఱవగ వన్నెపెట్టి రమణీమణి పయ్యెద సంతరింపఁగా మఱచి. విక్ర. ౪-౨౦౪

వ. తదనంతరంబ యంతరంగంబు కొంత సంతరించికొని యతఁడు నారాయణున కిట్లనియె. ఉ. హరి. ౪-౭౦

6. రచించు, నిర్మించు.

సీ. సంతరించితి నిందునవ్యసంబునయందు, హర్ష నైషధ కావ్య మాంధ్రభాష. కాశీ.ఖం.౧-౭

7. నెఱపు, చేయు, నడపు.

సీ.స్వర్గాల లాచెట్లశాఖలచాటున,సంతరించును కిసరింతలాట. చెన్నబ. ౫-౩౭౭

వ. ప్రకృతికాంతక్రంత సురకాంతలం గూడు కొని సంతరింప.... అను. ౬-౧౩౦

8. సిద్ధముచేయు, సంగ్రహించు.

తే. నిత్యనైమిత్తికము లైననియమవిధులు, దీప్ర పిండప్రదానవిధిని సదర్భ, మావగోభూమయ వమార్జ్యమగుతిలాది, సముచిత ద్రవ్యములు చాల సంతరించి. వరాహ. ౨-౭౭

9. అలఁదు, పూయు.

సీ. కస్తూరి పునుఁగును గంధసారంబును సంపంగి నూనెయు సంతరించి. హర. ౪-౭౭

10. పూను, వహించు.

వ. విశ్వవిశ్వంభరాక్రీడనంబు దనకు విదిర్చన పరమశ్శాంతి యంతరంగంబున సంతరించి నిఖిలప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె భీమ. ౧-౩౧

11. చేరఁదీయు, దరిచేర్చు.

క. పలుఁగూఁత లఱచువానిం, గలుద్రావెడు వానిఁ జెవులుగఱచెడువానిం, బోలఁగులఁ దెచ్చెడువానిం దొలఁగింపక సంతరింపుదురు రాజన్యుల్. వేం. పంచతం. ౧-౪౪౭

12. పోషించు.

సీ. .... సంబరంబు లొనంగి సంతరింపఁగ లేమి, విడిచిపోవఁదొడంగె విబుధబలము. దశ. ౨-౫౧

13. ఆదరించు (క. సంతోయిను=శాంతపఱచు, తు. సంతెరిసు=ఓదార్చు, ఆదరించు)

వ. అంత నసంఘుందు .... మూర్ఛిల్లి .... తన్నుం దాన సవరించుకొని....రతివశేషోపాయంబుల సంతరించి యూఱడం బలికిన .... కుమా. సం. ౫-౫౭౦

14. చక్కఁగా దాఁటు.

సంతరించుకొను. స. క్రి. √సంతరించు. సరి పఱచుకొను, చక్కఁబఱచుకొను

వ. అని కోపించి నెఱయం దలంచి తపోధంగ భీతిం దన్నుదానసంతరించుకొనుచున్న యగజం గని .... కుమా. సం. ౭-౭౭౭

సంతర్జనము. సం. వి. అ. న. బెదరించుట, భయపెట్టుట,

**సంతర్పణ.** సం. వి. అ. న. తృప్తి. (రూ. సంతర్పణము).

శా. సారాస్వాదనఁ బ్రాణపంచకము తృప్తం బౌని సంతర్పణ మ్మారంభించెనని ప్రమించి. ఆము. ౬-౭౫

2. ఆమెత.

వ్య. బ్రాహ్మణసంతర్పణ జరిగినది

**సంతర్పణము.** సం. వి. అ. న. 1. తృప్తిపఱుచుట, తనివి కలిగించుట.

వ.... మహాదేవికి సంతర్పణముసేయుట మద్కర్మం బనగాను. కా. ౪-౧౦౩

వ....తొల్లి లోకోపకారార్థంబు దేవతాసంతర్పణంబు లొసఁగు .... శివధర్మ. ౧-౭౦౪

2. ఉల్లాసపఱుచుట, సంతోషపెట్టుట. 3. సంతోషముగలిగించువస్తువు, ఉల్లాసకరమైనపదార్థము

4. ద్రాక్షాఖర్జూరాదులు చేర్చి చేయు పంచదారతోఁగూడిన పేలపిండితోఁ జేసెడిభక్ష్యవిశేషము

**సంతసపడు.** అ. క్రి. 1. సంతోషించు. (సంతసము+పడు)

క. మతిఁ బాండుకుమారులపం,చత విని దుర్యోధనుండు సంతసపడియెన్.

భార. ఆది. ౬-౧౫౦

క. జనకజకుశలముఁ దెలియం,జనుఁ దని సంపాతి తెలుప సంతసపడి యా,తని గారవించి యంగద, హనుమన్ముఖు లచటుగదలి యటు చని రెంకటన్. చంపూరా. ౬-౫౭

మ. సుధిం,మను సౌఖ్యన్ దమయుదను సంతసపడున్ సుజ్ఞాని సైతంబు. మల్లభూ. శృంగారశత. ౪౧.

క. వసుదాయిని యైన వసుధ,నొసఁగి సతేనిఁ దన్ను తన్నె యొసఁగె నను మ సంతసపడుభూతము లన్నియు. భార. అను. ౭-౩౬౩.

**సంతసము.** వి. సంతోషము, ఆనందము. (సంతోషః. క. సంతస.)

గీ. చనుదు సంతోషము మనంగ సంతస మనంగ నలరు సంతోషము. ఆం. ప. గుణ. ౨.

చ. చేసిన నెవ్వనైన మెచ్చనిపని యేను జేయుదునని సంతస మందుము కోర్కి దీర్చెదన్. ఉ. హరి. ౨-౩౯.

తే. అంతిపురమున సుచితకృత్యములు దీర్చి, చంద్రశాలాస్థితుండై కౌఁకరము, సంతసంబున వచ్చి యాసంయమింద్రు నడుగులకు నెఱగుదురు నతఁ డావరిముఁ. పాం. ౨-౨౨.

కం. రాణింపఁ బల్కి తనపని, జానైనను; గోలుము సంతసపుఁదతి ఆము. ౪-౭౬౯.

ఉ.... చేలుసేయు కవ్వానిగ్రహంతరంబుః ధవాద్వళగోగిజనంబు పావన,స్నానవిధాన్న పానముల సంతసమందుమఁ బోవు నిచ్చలున్.

మను. ౧-౬౩.

౨. తృప్తి.

చ. నిను పగఁబాలు గోలువడి దానిన యివ్వడు గోకులీకికిన్, సముచితవృత్తి నిచ్చి తమసాముని సంతస మందియున్కి యుత్తము.

భార. ఉద్యో. ౧-౧౯.

**సంతసించు.** అ. క్రి. √ సంతసము, సంతోషించు, ఆనందించు. (రూ. సంతసిల్లు)

సీ. కృష్ణపక్షవిభావరీవేళలఁ జకోరసమితి చంద్రికలందు సంతసింప. ఉ. రా. ౧-౫౪.

**సంతసిల్లు (లు).** అ. క్రి. √ సంతసము ౧. సంతోషించు.

ఆ. ఏను జహ్నుకన్య నింద్రదసమాన నీ,సన్నుణావళులకు సంతసిల్లి భానుతేజ నీకు భార్యగా వచ్చితి. భార. ఆది. ౪-౧౩౬.

గీ. సర్వభూతానుకంపకు సంతసిల్ల. హర. ౧-౩.

చం. కంజదళాక్షుఁడు సంతసిల్లె పే,ర్వడియొను వజ్రబాధవధభారవహులం డిపు డంచు నాక్మలోకన్. ప్రభా. ౨-౨౩.

పంచచామరము. పులస్త్యమౌని సంతసిల్లి భూతకేంద్రుతో న నున్ ఉ. రా. ౩-౭౬౩.

**సంతుష్టి.** సం. వి. ఇ. స్త్రీ. సంపూర్ణతృప్తి, పూర్తిగా తనివి నొందుట.

తే. గీ. .... .... నయనసంతుష్టి గాఁగ, నరుగు దెంచుచున్న వాఁ డర్థవీథి,నీతఁ డెవ్వాఁడు
నిరంకు. ౪-౧౦

సంతొసము.సంతెసము, సంతోసము, ఆనందము.

చ. అనుకుల నిమ్మెయిం బ్రముదితాస్యులఁ జేసి పయోజనూతి సం,తొసముఁ, నాకలోకపతిఁ దోకొని పోవు నెడం దదీయవ,క్త్రసరసిజంబు లజ్జయనురాత్రి గడుం జెడియున్కి కిన్ గృపా రసపరుఁడై హితార్థమధురస్ఫుటసత్యము పూక్తి నిట్లనున్.
నిర్వ. ౩-౧౪.

**సంతుష్టుఁడు.** సం. విశ. (పు. ఆ. అ) మిక్కిలి తృప్తి నొందినవాఁడు.

**సంతోషణము.** సం.వి.అ.న. సంతోషపెట్టుట.

**సంతోషము.** సం. వి. అ. పుం. ౧. తృప్తి. తనివి. ౨. ఆనందము, ప్రమోదము.

ఆ. వె.... పసులవయ్యె మెఱుఁగుఁ బసఁపుల సంతోష, మేల నాకు నికిఁ బాల నేఁడు.
భార. విరా. ౪-౬౦.

౩. ధైర్యము.

**సంతోషించు.** సం. అ. క్రి. హర్షించు, ముద మందు.

వ. ఇట్లు చరాచరప్రపంచమునకుఁ బ్రాణంబైన సోముండు సంభవించిన సంతోషించి మను కైటభారాతియు నీరాకరమథనక్రీడ చాలించి వైకుంఠంబునకుం జనియె. వరాహ. ౭-౬౩.

**సంతోసము.** వి. సంతోషము, ఆనందము. (సం. సంతోషః)

గీ. తనను సంతోస మన సంతెస మనంగ నలరు సంతోషము.
ఆం. ప. గుణ. ౨.

క. ఆ సమయంబునఁ బుష్పోలు, గోపి నృపార్థి జాఁడు దండ గొలఁసొత్తులుగా, వేసరక కట్టి కడుసం,తోసము నివ్వటిలఁ బొదివి తోలఁ గఁగఁ బెట్టెన్.
భోజరా. ౫-౨౦౭.

మ. మత్స్యహత్రోతఁ బ్రొద్దునఁ జేఁ బిల్వఁగఁ బంచి కన్నకల సంతోసంబునన్ దెల్పినన్.
ఉ. రా. ౧-౨౪.

సంతోసిల్లు. అ. క్రి. (√ సంతోసము) సంతసిల్లు, సంతోషించు, ఆనందించు.

క. నీపైనిక లెంతయు సం,తోసిల్లుచు వాస్తవపు దుఃఖితులై కుం,తీసుతుల వారు దీనదశాసంగతులైరి బాష్పజలములు దొరఁగన్.
భార. ద్రోణ ౨-౧౩౧.

సంత్యక్తము. సం విశ. (అ. ఆ. అ) ౧. పూర్ణముగా విడువఁబడినది. ౨. దొంగిలింపఁబడినది, అపహరింపఁబడినది. (విద్యమ్ము)

సంత్యజనము. సం. వి. అ. న. పూర్ణముగా విడుచుట; సన్న్యసించుట.

సంత్రాణము. సం. వి. అ. న. సరక్షణము.

సీ. విబుధసంత్రాణ ప్రవీణుఁడై నిఖిలైక,మతిఁ గాంచునే మానవతిధపుండు. చంద్రి కా. ౧-౨.

సంత్రాసము. సం.వి.అ.పుం. భయము, వెఱపు.

సందంశ (క) ము. సం.వి.అ. పుం. పట్టుకారు, అక్షరము ఉచ్చరించినప్పుడు దంతములనునొక్కుట, నరక భేదము. సందడి.

సందంశిక. సం. వి. ఆ. స్త్రీ. చిన్న పట్టుకారు; శ్రావణము.

వి. ఒత్తిడి, రాయిడి, సమ్మర్దము. (త. సందడి)

సీ. రాజుల సందడి రాలినతొడవులు ముడిసి రాలినపాడిముగ్గు గాఁగ. భార.విరా.౩-౭౪.

ఉ. చీటికిమాటి కేకపథసీమ మెలంగఁగఁ బాటిగామి శృంగాటకవీథి కేగఁ బతి కాంతల సందడి కుల్కి. శృం. నై ౩-౬౩.

సీ. కరులసందడి కొప్పు ఘనసేన దుర్దమలీలతో నడవఁ బాంచాలవిభుఁడు. భార. భీష్మ. ౧-౧౧౨

తే. అట్లొలంది పనియొ, జనకుం జూచెదుతేడుక
సందడింప. భాగ. ౪. స్క. ౩౪.

చ. అని ముని పల్కిన విని జనాధిపుడు మాన్యుఁడు
సందడింప నెమ్మనము చలింపఁగా నకట!
మన్మనకృతం బిటులుండ నేమినే,యనగు?
మార్క. ౫-౧౮౬

చ. పలపలం దొల్తనోల్త నొకపాటిగ మాటికి
తేటవాలుగా జలకణముల్, నిగుప్పుచు వె
సన్ జడిపైఁజడి సందడింపఁగా, జలధరపంక్తి
దార్కొనుచుం బందకరుం గనక దప్పైపై,
వెలసి మహాంబుధారల దివిన్, భువి నేకము
చేసె నర్తెటిన్. ఇందు. ౩-౧౦౪.

తే. గీ. సరగ నేతెంచి యూర్పులు సందడింప,
రాజుముందర నిలిచె సంభోజవదన.
కాళ ౧-౪౭.

తే. గీ. వగల వీడెను గాను బలిసెఁ గోర్కులు
మది సందడించె. దశకు ౧-౧౮౬.

సీ. కనుచూపులను మన్మథుని మోహనాస్త్రంబు
లందుం గాటుకమన్న సందడింప.
విప్ర. ౨-౧౯౬.

గీ. అమరలోకంబు నిష్టింప సముపం బొంగి సంగ
తోత్సాహ మెదలోన సందడింప, నడగు
పెంపున నరుగునయ్యజ్ఞమునకు, విర్జగులు
హర్ష మున నిట్లనిరి కదఁగి. హరి. ౭-౧౫౩.

ఉ. కపోలమండలీదానమిళద్వి రేఫనినదంబుల
ఘీంకృతి సందడింపఁ బెల్లేనుఁగుమీఁద డీకొలిఁ
యింద్రుఁడు దుపేంద్రుని దాఁకె మన్గతిన్.
పారి. ౫-౧౮.

చ. కదైమర విరోధిఁ గాంచి యెదనించిఁ కో
పము సందడింపఁగన్. జై. భా. ౨-౧౮౬.

శా. నెక్కొల్లపై దెబ్బ కొట్టించెన్ గూర్కులు
సందడించె నడ చండించెన్ మృదామోద
ముల్, గాంచన్ వాతెఱ మోసరించెఁ ద్రివ
ళుల్ నానాఁటికిం బోటికిన్. విజ. ౨-౩౬.

శా. చిత్తేజోమయ మొక్కమూర్తిఁ గని భాషింపంగ
మాహించుచోఁ జిత్తానందము సంద
డింప నమఁ బిల్చెన్ శాంతివాక్యంబులన్.
వరాహ. ౯-౧౩౫.

౨. గుమిగూడు, మూఁగు.

ద్వి. రాసినవహేమరజములు దొఱఁగ, సంద
డించుచు మహాసంరంభ మెసఁగ, బృందావ
కాంతోఁ బెర్చి యిట్లనిరి.
రం. రా. యు. కాం. ౨౮౭ పు ౧౮ పం.

వ. కొండగోఁటియ ముఱుగుఁడు బొండులకు సం
దడించు కంఠగర్ఘ్రావకుల మొల్లంబుల ము
నుంగుపడు పల్లంబులును. మను. ౪-౩౭.

చ. గరుడుఁడు రాజహంసమును గంధగజంబును
మేఁకపోతు కాసరము నసుంధు న్రకుల
చంద్రుఁడు నిట్టియు గుఱ్ఱ మెద్దు ని, లెట్టల
విమానముల్ మొదలిచావడిముందర సంద
డింప శ్రీహరివిన్న వాంవాధులు నిజావసరాశ
వసించి యుండగన్. కాశీ. ౪-౧౫.

౩. కార్కొను, చుట్టుకొను, పెనఁగొను.

వ. అగ్రభావంబున వడనువారును నై సందడించు
వైకుంఠనివాసులతో ముప్పదియాఱుకోట్ల
దేవతలతో. ఉ. రా. ౮-౨౯౪.

వ. కని తేటీయమహామహిమకు నంతరంగంబులఁ
గౌతూహలామృతానందంబులు సందడింప
నందఱుం దమలో నిట్లనిరి. నృసింహ. ౩-౪.

మ.... మది నీర్ష్యాక్రోధముల్ సందడింప.
ఆము. ౫-౭౪.

సీ. కమనీయభూషణగణమణి ద్యుతులును కాంతా
యుధద్యుతుల్ సందడింప.
భా. రా. బాల. ౬౮౭.

క. అనుచుం బుణ్యశ్రీరథివం,దనములు నెమ్మన
మునం దుదంచి,సమ్మోదనితాంతభక్తి సం
తత, వినయంబులు సందడింప వేడుకఁ జేసెన్
రాఘు. ౩-౬౨.

శా. వీక్షించెన్ దరహాక్షియు స్మరమున స్నేహేద్దా
ప్రమోదక్షమదాక్షిణ్యంబులు సందడింప
నిలిచెం దత్సన్నిధానంబునన్. హర. ౪-౩౫.

౪. గోలపెట్టు.

ద్వి. కంసుహదరోద యొగ్గగామేయంను, సంద
డింపుచు నున్నజనుల వీక్షించి. పండితా.
మహిమా. ౨౫ ౧.

ద్వి. మాయలు వన్నక మాదిగకొయ్య, జాఘ్రము
చూపు మెచ్చోట తన్నితివో, యని సంద
డించు నయ్యాధమపారులను గని నూరసానమ్మ
గారు కోపించి. పండితా. దీక్ష. ౪౫.

౫. సాంద్రమగు.

సీ. దైన్యపిశాచభూతప్రేతధాకినీసంతానములc
తోడ సందడించు. వి. పు. ౨-౪౮.

౬. రోదనీయు, ప్రేమ.

ద్వి. చాలి చాకని యేల సందడించెదవు.
ఉప. రా. ౨. పు. ౨౮ పం.

సీ. ఒకతె కప్రపుకలాచికc దేంట్లు సందడింపcగ
మిట్టిపడి కేలు బయలు పట్టు. వసు ౪-౭౫.

గీ. పదcతి యీాలనెకూన పుష్పిణి యటన్నc గేల
నిపు దంటcదగునె నీవేల యిప్పు, తలరు
కొమ్మ రcముగలజేట చెలిసె, సంస్పృశc నితి
ద్విరాజి సందడింప. ఇందు. ౩-౩౮.

౭. విజృంభించు.

ద్వి. ఇలవేయు ననసేల యీాగురుద్రోహి చెల
దున్మిసైనక గళ్కు మేమనుగా సందడింపcగ
గురుస్వామి తచ్ఛివ్య, బృందంబు భావించి ...
పండి. పురా. ౧౧౦.

౮. సంభ్రమమునొందు, తత్తరపడు.

గీ. ఇంకుమతి యేమిదెల్పుదు నంతc గొంద,
రింకుపదనలగో భీతి గ్రంముకొనcగ, సంద
డింపుచు శైత్యోపచారవిధులు సరగ నొక
రింపc దలిపొంద నవరేణ్య. ఇందు. ౨-౧౭౧

తే. గీ. అధికతరకోపభీషణవ్యాఘ్రుc జూచి,
బెగడి నలుదిక్కులకుc బోవుమృగము పోలి,
సందడింపుచు వచ్చు నాసరతిc జూచి, ధారు
ణీదేవతనయుండు తల్లడిల్లి. నిరంకు. ౨-౧౨౧

౯. వ్యాపించు.

సీ. చారు సహస్రమస్తక విధూవణమణిచ్ఛాయలు
దిక్కులు సందడింప. విప్ర ౩-౧౦౦.

౧౦. ప్రకాశించు.

సీ. ధాతు మించిన మంచితమ్మంటరాగంబు శ్రవణ
భాగంబుల సందడింపబ్రముదాస్పదంబైన పట్టు
రెంటెము కటీరస్థలిc గరము విభ్రమము మాప.
వరాహ. ౧౧-౮.

సందడించు.² స. క్రి. ౧. కలవరపెట్టు.

ఉ. అంగన నిన్నుc గన్గొనియంత ననంగుcడు
సందడించెడున్. భాగ. ౫స్కం. ౧౯. ౨౮.

౨. పెచ్చరించు.

గీ. ముదితమానస లగుచు నమ్ముదితలెల్ల విదిత
మగువేడ్క దనర వేవేగ నపుడు, పెండ్లిపా
టలు దనరంగc బ్రియ మెసంగ, నొంపారుల
సందడింపుచు సుచితలీల. ఇందు. ౫-౭౨.

సందడికయ్యము. = సంకుల యుద్ధము. వి. దొమ్మియుద్ధము.

వ. పెక్కులు పెక్కులుసుం దcపడి యెదనెనం
గలయన్ బెరయం గ్రమంబున సందడి
కయ్యcబు నూలుకొనిన యుగ్రంపునం దమకించి
యుభయసైనికు లన్యోన్యులగతిం గవియ.
భార. భీష్మ. ౧-౨౬౭.

వ. ఇవ్విధcబున నుభయబలంబులుం దలపడి సం
దడికయ్యంబునం గదిసి. ఉ. హరి. ౩-౨౭.

సందడిగొను. = సందడించు. అ. క్రి. (√సం దడి) ౧. మించు; అతిశయించు.

క. దండమునc గొలువుకెక్కులు, సందడిగొన
నేcగుదెంచి సంయమివరులన్, బృందారకులు
న్నిల్చి, క్రమముగ జగదీశు మందిరద్వారము
నన్. నృసిం. ౧-౭౮.

౨. మూcగు, క్రమ్ము.

చ. పదువదగండ్లు పెల్లుగనుపట్టు మిణుంగురుc
బుర్వు లంచు సందడిగొను నింద్రగోపములు.
విక్ర. ౩-౬౨.

సందడిజేగడము. = సందడికయ్యము. వి. సంకులయుద్ధము.

క. ఆసందడి జేగదంబున, వాసురపతి మఱేది యనుచు నరయక తనపై, డాసిన నీనుఁ గత్తిన్, వేసెందుము రెండుగాఁగ విమ్మజ్జి వ్వాతె. ఉ. రా. ౩-౩౦౪.

సందడిపడు. = సందడించు. అ. క్రి. కలఁతపడు, క్షోభపడు.

ఉ. అంబుజసంభవుండును బలాంతకుఁడన్ మొదలైన దేవసంఘంబులు వచ్చి వాకొలుపుఁ గాంచఁగఁగో మెకర్లోకస్థ నిత్యంబును వాకిటఁగవియి వంతధనల్ ప్రహరింపఁగాఁ గినీ,టంబులు ముల్ల సందడిపడన్ నరవాసవు లిక లక్ష్యమే. రామా. ౭-౧౬౭.

౨. గుమిగూడు.

క. క్రిందటిపాతాళమునను గ్రీడించుచు నా, వం దను నొంచుచునందును సందడిపడి నాగ కులము చకురతో డన్. భాగ. ౫-౨-౧౨౦

3. ధ్వనించు, రొదసేయు.

సందడిలు(ల్లు). అ. క్రి. అతిశయించు, మించు.

ఎ. గీ. సందడిలు వేడుక బలుమారందవాహ, ములు తెదాహరిభూరిసముజ్జ్వలప్రవాళము లభీష్టఫలముల నోలి నొసఁగు, నావసంతలు రతిరాజువీని సెసఁగ. చమత్కా. ౧-౪౭

సీ. నాట్యక్రియాసముత్పన్నతమృదంగధ్వనుల్ సౌధాగ్రగృహముల సందడిల్ల.
మత్స్యపు. ౧-౧౧౨

2. ప్రకాశించు.

సీ. కోరకంబులు నిండుకొని, సందడిలుట్టి తార కంబులతోఁ దఁ ద్రస్తరింప.
చిత్రభార. ౨-౯౯

3. పెనఁగొను.

ఉ. మోదము సందియంబు దన మోమున సంద డిలంగ. దశకు. ౯-౪౧

4. మూఁగు, క్రమ్ము.

తే. విమవశంబు ప్రోళ మాయమ్మ యనుచు, సతికిఁ గేల్మోడ్చువారు నై సందడిలిరి.
రాఘ. ౨-౭౦

క. ముందటఁ బిలుసం గ్రేవల, డెందముసం గరము సందడిల వల దా య, స్పందకుభావహములు గో, బృందము లని మాకుఁ బుట్టుఁ బ్రియ మెల్లపుకున్. కాశీ. ౨-౨౪

సందడీఁడు. విశే. (√ సందడి) వ్యాపకుఁడు.

ద్వి. ఆలపోగిహృదియంబు నరపెద ననుచు, దలపోసి తెపని డెందపుసందడీఁడు.
పరమ. ౪౪ పు. ౧౨ పం.

సందడికాఁడు. దే. విశే. సామాన్యుఁడు. (శ.ర) అప్రధానుఁడు.

సీ. ఉపసర్జనాఖ్యుఁడై యొప్పును సందడికాండ్రు నాఁ జెల్లర వాండ్రు నాఁగ. ఆం. భా. 3-౧౬

సందరము. వి. = సంద్రము. (సం. సముద్ర, ప్రా. సముద్ద. తె. సముద్దిరమ్)

క. అందంద యుద్భవించెను, సందరమున నిండి రానుసంజాతములై, మందారకల్పతరుహా, చందనసంతానపారిజాతాదు లగున్.
హర. ౬-౮౧

క. సందరమున నురువలరె ను, కుందునిఁ బెండ్లికిని బిలుచుకొలు తెగనుభూ, బృందారకుఁ గొని యా, సందంబున నప్పయోధ నన్నె ననంగన్. (శ.ర) రుక్మి. ౪ అ.

సందర్భము. సం. వి. అ. పుం. 1. కూర్పుట, గ్రుచ్చుట, రచన, సేయుట. 2. ప్రోఁగుచేయుట రాశీకరణము. 3. (కథయొక్క) పొందిక, పర స్పర సంబంధము. 4. అన్వయము. 5. ప్రబం ధము, కృతి. (త్రి. ని.) 6. ఉక్తి విశేషము.

క. ఈసందర్భము వీరలు, సేసినయది, మేము వీరి శిష్యులము. నిర్వచనో. ౧౦-౧౨౪

క. సందర్భము నవరసనిష్యంది యగుచుఁ గవుల చెవుల జవులు దవుల నిం, పొందినఁ దగుఁగా కూరక, యం దమకులగూర్పు కవిత యందం బగునే. రఘురామా. ౧-౧౬

వ. అనంతరంబ యారాజు రాజకీరాభిలాష గర్భంబు లైన సముచితాలాపసందర్భంబు లుపన్యసించిన నయోన్యాగిసీరత్నంబు. విక్రమా. ౭-౧౫

వ. స్థావరజంగమంబులకు సర్వంబులకు గర్భసందర్భ నిర్భరావిర్భావదుఃఖంబులు సమానంబులు. శివధర్మ. ౫-౭౮

7. సముదయము. (శ.ర)

**సందర్భశుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందిగయున్నది. 2. ఉచితమైనది. 3. సుసంబద్ధమైనది.

**సందర్భశుద్ధి.** సం.వి.ఇ. స్త్రీ. 1. కావ్య రచనా వైశద్యము. 2. వస్తువిన్యాసము నందలి యౌచిత్యము.

**సందర్భించు.** సం. స. క్రి. కూర్చు, రచించు.

వ. మహాప్రబంధంబు సందర్భింపం బూనియున్న సమయంబున. చం. రా. ౧-౧౬

**సందర్శనము.** సం. వి. అ. న. 1. చూచుట.

తే. గీ. .... ద్వారవతి కేగి యతనిసందర్శనంబు వడసి కానుక గాఁ బెట్టెఁ బాహ్వేంద్రు.

2. నిదానించిచూచుట. 3. పరిస్ఫురవిలోకనము 4. దృష్టి, చూపు, కనఁబఱుచుట. 5. ఆలోచనము. 6. విశదపఱుచుట. 7. కలియుట.

**సందర్శించు.** సం. స. క్రి. చూచు.

మ. ఆ, విపులావాగనివాసనాకముల సంవీక్షించి వై భ్రాత్రౌప్రపురంబుల్ గని దేవి విన్నిచట సందర్శింప నేతెంచితిన్. వరాహ. ౧౧-౩౬

**సందష్టము.** సం. విణ. (అ. ఆ. అ) 1. కఱవఁబడినది, కొఱుకఁబడినది. 2. దగ్గఱగాఁ నొక్కఁబడినది. 3. కాఱు మొ॥ వానితో నొక్కఁబడినది. వి. అ. న. ఉచ్చారణమునందలి యొక దోషము.

**సందానము.** సం. వి. అ. న. 1. త్రాడు. 2. గొలుసు, శృంఖల. 3. ఖండనము, నఱుకుట. సం. వి. అ. పుం. ఏనుఁగు గండస్థలము నందలి మదము కాఱెడి స్థలము. (విల్సన్) (ఏనుఁగు మోఁకాలి దిగువ భాగము అని వాచ)

**సందానితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రాటితోఁ గట్టఁబడినది, బంధింపఁబడినది.

వ. చంద్రికాసంకాశకౌశేయకశిపుహంససందానితవితానోపశోభితంబును .... భీమ. ౪-౧౨౭

2. గొలుసుతోఁ గట్టఁబడినది.

**సందానిని.** సం. వి. ఈ. స్త్రీ. గోష్ఠము, పశుల పాక.

సీ. కామధుక్సందానినీమధ్యదేశంబు రఘుపతి దేవతావిహారమునకు. (అడ్డ) పాండు.౩-౧౮౭

**సందావము.** సం. వి. అ. పు . 1. పాఱిపోవుట 2. తిరుగమించుట.

**సందాహము.** సం. వి. అ. పుం. పూర్ణముగాఁ గాలుట, దగ్ధమగుట.

**సంది.** వి. (సం. సంధి) 1. సందు, మధ్యమి, రెండువస్తువుల నడిమిభాగము.

మ. పురికొల్పెట్టు నిశాకరుండు సారెకును నీభోగాంధకు బ్రాడిక, త్రైరగాయంబుల గంధ్లముంగ దలసందిం గొమ్మకొమ్మ నిరంతరమున్ సావన నీవెలెత్తి చనఁడె. శు.హం. ౩-౯౪

క. పదగులు వెంటనె బ్రిడుఁతి నడిఁగాఁ బద వైవఁగాఁ గ వాటము సందిఁ, బడి యుక్కతె జడజక్కం గడు విభు నెవ నాటు మదఁ ఖద్గ ముఁబోలెన్. రాజవాహన. ౫-౭౫

మ. ........ వఁ, తెలఁ దాపించిం కెంపుటింటికల సందిం బొంది రావ్రగా, కెఁ జెన్నా.... వశా. ౪-౪౯

సీ. అచ్చెల్ల నెవిసంది నమసంపెం పుష్పచాయల జేవ్యాదిసారథంబు. ఉ. రా. ౪-౧౫౪

2. దండచేయి, బుజమునకు మోచేతికి నడిమిభాగము. సందిలి, ప్రగండము.

చం. పెదపెదఁ జంకఁజిక్కు మునఁ బ్రేలెడు చల్దియు
సందిగోహళ్ళం, గడియయు గ్రూరదృష్టి గల
కన్నులు. శేం. పంచవిం. ౨-౭
అ. భా. ౨-౧౩౭

సీ. ఒకకేల ధనిశధన్త్రికలో డిపెత్తఁబు సందిఁ
గట్టినతరుణేంమధరుఁడు. కాశీ. ౧-౩౦

తే. .... గుదుగాక లిద్దసంది, నూతసంహిత లిఖి
కించి వారఁదొడఁగిరి. ఆము. ౪-౪౬

తే. గీ. చట్టుపువ్వులనిగలు కన్నాఃబొట్లు, సంది
తాయెతులునుఁ జెంపగండిములును, గిలిగి
సవయన్కులగుకోఁడెకాంద్రఁగూడి,ఓటులు
విహరింపు రబ్బిట వేశ్యవాటి. వైజ. ౨-౪౫

వ. సోలుబొంమలును, వ్రాలుసందులును, విడియు
గోళ్లును, మిడియుఁ బ్రేళ్లును, నలియుకన్నులును
నలియు వెన్నులును. చంద్రాంగ. ౬-౯౩

మ. .... సం, దుల దండల్ సవరించి కన్నుఁగవ
కాంతుల్ కాటుకందీర్చి వం, దులతాయె
త్తులు గట్టినన్ కబరపుగ్రుల్ గూడియాడం
బునన్. కాశీ. ౩-౩౭

3. సంధి. (వ్యాక)

తే. గీ. సంధులు దెలి, యక కవితాకవితల రాజ
హంసకవులఁ గదిసి కావుకా వనెడికాకవులు
కవులె. ప్రబం. ౧-౧౬

4. సంధివిగ్రహాదిషడ్గుణములలో మొదటిది.
ఆం. భా. ౨-౧౭౯

5. జావమాడుట కుపయోగించుకొను ముద్రా
విశేషము.

సీ. మేటిజూదరి యన వాటమైతివుటమై వాను
చుందుకు కేనహస్తకములు దృష్టి యేమరక
సందియు జాగరంబును దిగయును గరయు
వాఁదేటపడిన, యప్పులలోనె యప్పనఁ
గైకొని మాటలాడినయట్లు వేటుగలఁగ.
ద్వా. ౧౦-౭౭

6. మంచేము, ఖట్వా.

సందికడియ(డె)ము. వి. సందిలి + కడియము)
సందిట వేసికొనుకడియము.

సీ. కావడియుట్లు చిక్కము సందికడియంబు
నూకలతోఁప పాగాకుతిత్తి. హంస. ౨-౩౫

సందికడెము. వి. (సంది + కడెము) దండకడి
యము, ఛందిట వేసికొనుకడియము.

చ. మిసమిస లీనుమేను మెఱమించులకొంచెపుటం
చుఁగమ్మలుం .... బగుముద్దమోముసమకొన్న
మెఱుంగులకట్లసందెయుం, గనుఁగవఁ గల్గు.
శుక. ౩-౧౦౫

సంది(క్రం)తుజగడములు. వి. సందులలోను
గొందులలోను జరగడిచిలిపికయ్యములు.

వ. ఈమహోత్సవంబులలో నిట్టిగలిబిలి సేయు
దురే మేటిబంట్లకు సంది(క్రం)తిజగడంబులు
గలవే యని తోడ్కొని చని. ద్వా. ౭-౨౭

సందిగ్ధబుద్ధి. (మతి) సం. విశే. (ఇ) సంశయా
త్ముఁడు, నమ్మకము లేనివాఁడు.

సందిగ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కఁ
గాఁబూయఁబడినది. 2. నిశ్చయములేనిది, సందే
హముగలది. 3. తప్పుగా గ్రహింపఁబడినది.
4. సందేహింపఁబడినది. 5. స్పష్టముగా లేనిది.
(వాక్యము) 6. అపాయకరమైనది. 7. విషము
పూసినది. (విల్పనాన్న) వి.అ. న. 1. సందేహము,
నిశ్చయములేమి. 2. పూయుట, రాచుట.

సందిగ్ధార్థము. సం. విశే. (అ. ఆ. అ.) సందేహా
స్పదమైన యర్థముగలది. వి. అ. పుం. ౧. సందే
హాస్పదమైనఅర్థము. ౨. వివాదాస్పదవిషయము.

సందిటిదండ. వి. ఆభరణ విశేషము.

సీ. ముత్యాలపేరులు మొలనూళ్ళు దోగిలి సందిటి
దండలు సరపణులును. ధశాళి. ౩-౩౭
(కొన్నిప్రతులలో సందులదండలు అనియున్నది)

సందితము. సం. విశే. (అ. ఆ. అ.) బంధింపఁ
బడినది, కట్టఁబడినది.

సందిదండ. వి. బాహుపురి, కేయూరము. సంది
టఁగట్టుకొనెడు భూషణము. (సందిలి + దండ)

సీ.... బాహుపురీతాయితు లనంగ, దండకడెము
సందిదండనఁ గేయూర మమరునను.
ఆం. ప. పరి.౧౨

సీ.... సందిదండ, లంగుళీయకములు హారకంకణ
ములు. దశకు. ౩-౮౮

మ. స్తనవిన్యాస్తికి సందిదండలధరోల్ సాహో
నివాదం బిడక్. మను. ౫-౭౪

సీ. అందంపుమైచాయ సందిదండలచాయ నదిరి
సంపఁగిమొగ్గలయొప్పుగుప్ప.
రాజవాహన. ౩-౧౨౯

సీ. సందిదండగఁ బెట్టుసవతీవబలుచుట్ట సికజుట్టు
తలమురళ్ళవెకలిజుట్టు. చంద్రాంగ. ౨-౩౭

తే. గీ. మొలనూలఁ గీగయుఁ బెద్దముక్కఱయు
బెట్టి, వంతతాయెతులును సందిదంత లునిచి,
కేల గాజులు గాదపగాలు దొడిగి ప్రేమఁ
గనసి యద్దానిఁ బంపుచేసి. వైజ. ౪-౩౦

తే. గీ. సందిదండలు నొడ్డాణ మంద మైన, ముద్రి
కలు హంసకంబులు ప్రోయగజై.
హంస. ౨-౧౯౦

సీ. గరుడపచ్చలకీలుకడియఁబు లర్పించు నందుకు
నీయాస పెంపదేని, తలుకుఁగెంపులసందిదం
డలు చెల్లించు. హంస. ౨-౩౮

వ. నిగనిగలారఁగలయందంబు సందిదండల నిగు
డుకుఁ జెలికారంబు నెఱప. కళా. ౬-౨౨౪

ఉత్సాహయుక్తగీతి : -

అందమైనకేలుగొప్పలందుఁ బూలు తేని
యల్, చిందరీక యుంచి నిగ్గు చెంగలించు
జారువా, సందిదండలుం గరాలు సన్నబన్న
సరులు హో, స్నంచెలున్. ప్రబం. ౧-౨౮౩

సందియపడు. అ. క్రి. సంశయించు.

క. దరహాసముతో మద్రేశ్వరుఁ డాలెంగనము
సేసి సందియపడక క్రీవగుమని పనుపవాతడు
కిరిపురికిం జనియె. భార. ఉద్యో. ౧-౧౦౩

సందియము. వి. (సం. సందేహము) సంశయము

సీ....సందియ మనుమాన మన సంశయంబు.
ఆం. ప. గుణ. ౭౭

సీ. కర్ణార్జునులయందు ఘనుఁడెవ్వఁ డనునొక్క
యనుజనంబులసందియంబు మాన్ప.
భార. విరా. ౪-౨౦౫

ఎ. గీ. సాగుచు నసాగుసహవాసమునఁ బాప,
సంప్రయోగ మగుట సందియంబె.
భార. ఆది. ౧-౫

ఆ. ఈ యుపాయములఁ భజించువాఁడు మోక్ష
లక్ష్మికిఁ బతి యగు నొకింత సందియంబు
వలదు. భార. అశ్వ. ౧-౨౨౭

క. ఇందేమియునుం గలదే, సందియ మస్మజ్జయంబు
సత్యము నీవీ, పాం దొందనిపలుకులు పలుకం
దగునే యోడి యకట కక్కుఱితిమెయిన్.
హ. ఉ. ౩-౨౩౯

క. అనినఁ బరదేశిఁ గృహపతి, కనియున్ సంది
యము తెలియ నడుగుట తెప్పా. మను. ౧-౮౪

సే. తెలియ నానతియిమ్ము సందియము దీఱ.
పాం. ౧-౩౬

తే. అతివముష్టిప్రతిగ్రహస్థావలగ్న, సందియము
లేదు వలరాజుచాపయష్టి. శృం. నై. ౩-౧౬౩

చ. కలుగుట సందియంబగుట సందియఁబయిన
కానలు. విక్ర. ౧-౬౮

సీ. పెన్నెఱులు దేంట్లగుట సందియము గలదె....
ఆము. ౨-౩౦

ఆ. వె. నస్త్రశస్త్రిఁ ద్రోణాచార్యుఁ జంపినా-
నెవ్వరొక్క వాని కివ్విధంబు బలిమిగలుగఁ
జేసి దలుకమై ననుచు సందియము పడఁగనేల
తెలియ వినుము. భార. ద్రోణ. ౫-౩౪౮

సీ........కర్ణార్జునులయందు ఘనుఁ డెవ్వఁ డను
నొక్క, యనుజనంబుల సందియంబు
మాన్ప .... భార. విరా. ౪-౨౦౫

విశే. (తె. సందియమ్) సందిగ్ధము; సందేహము
కలది.

సీ. అనుపమం బగుభారతాఖ్యానమున సంది,య
ముతైన యర్థంబు లర్థి మిమ్ము, నడుగ నే తెం
చితి ననిన. మార్క. ౧-౧౦౬

**సంధిలి.** వి. సంది, ప్రగండము, దండ.

గీ.... సంది సందిలనఁగఁ బ్రగండంబు చను.
ఆం. ప. సర. ౮౧

తే. గీ. యోగివర్యుని సందిటియొప్పులకును,రణిత
కేయూరమణులు గారణముగాఁగఁ, దలఁపు
దుసగాని రమ కుపధానమైన, కొవ్వవిసు
లొత్తుకొలుఁగరు కొంతిరైన. దశా.3-౧౪౮

సీ. గుసువెంవపూవపే కొరయు సందిలిఁగట్టి.
నీలా. ౧-౮౧

ఉ. సందిలిపట్టి యాడు మజ నాట్యములాడుచు
ముద్దులన్ మహా, నంద మొనర్చె బాలకుఁడిం
బును జుట్టుపుఁబూవుఁబోండ్లకున్.
కళా. ౬-౨౦౦

2. రెండుచంతల నడిమిభాగము.

గి. సింహనాదంబు చేసిన సేవదేటి కరలి శరచా
పములు గదాఖడ్గములును గొన్ని సందిటఁ
దసలావుకొలఁదిఁ బట్టి. ఉ. హరి. 3-౫౬

కం. తెలివా సందిట సంచెను. సెజ్జెం బ్రమక లాయ
తములు నీలము లవి యే, తెలుఁగున ముడిచిన
నీకున్, గొలుఁతిగలదె యువిదు ట్టిగొను నీ
శుభునిన్. ప్రభా. ౪-౧౩౩

ఉ. కాళియభేదిఁ జూచుతమకంబున మజ్జనమాడి
యాడి నే,లాలిక యొత్తు గంధలిలాద్రికిచం
బులు చన్నుదోయిపై వ్రాలిన సందిటంబొదివి
రాజపథంబున కేగుదెంచ గో,పాలకమూర్తి
గాన శిఖిబర్హము కానకజెచ్చెనో యనన్.
పారి. 3-౧3

**సందిపీరులు.** బ.వ.వి. పామరులుగొల్చు దేవతా
విశేషములు.

సీ. పుట్టలమ్మయటన్నఁ బో యొంకశేఁడను, సంది
వీరులటన్న జాము గొణఁగు. శుక. 3-౪౯

**సందిష్టము.** సం. విణ. (అ.అ.అ.) ౧. సూచింపఁ
బడినది. ౨. నిర్ణయింపఁబడినది. 3. తెలియఁజే
యఁబడినది, మాత ముఖమునఁ దెలుపఁబడినది,
చెప్పఁబడినది. ౪. ఒప్పుకొనఁబడినది, సమ్మతిం
పఁబడినది. వి. అ. న. వార్త, సమాచారము.

**సందిష్టుఁడు.** సం. వి. అ. పుం. వార్తాహరుఁడు,
సమాచారముతెచ్చుబంటు, దూత.

**సందిహానుఁడు.** సం. విణ. (అ. అ. అ.) సందే
హము గలవాఁడు, సందేహించు వాఁడు.

**సందీపనము.** సం. విణ. (అ.ఈ.అ.) ౧. జ్వలిం
పఁజేయునది,ఉద్రేకముగలిగించునది. ౨.కోపము
పుట్టించునది.

**సందీపనము.** వి.అ.పుం. మన్మథుని యైదు బాణ
ములలో నొకటి. వి. అ. న. ఉద్దీపనము
చేయుట.

**సందీపించు.** సం. అ. క్రి. ౧. ప్రకాశమగు.

మ. అపుఁడాకేమి నిజంబు నేలపడఁగా నచ్చోన
గంధాక్షతాది విశేషంబు శాంతిపాఠముసు
సందీపంచ విశ్వేశ్వరున్ శివు నుద్దేశము
జేసి .... భీమ. ౨-౧3౫

౨. ఉద్దీపించు, అతిశయించు.

మ. అలగ్రీష్మర్తువుఁన్ .... .... దెస్నెలదారా
గృహముల్ ప్రసూనములు సందీపింపఁజేయు
న్మరున్, లలితోత్సేకవికారమున్.
మల్లి. శృం. ౨-౮౭

**సందీపితము.** సం. విణ. జ్వలింపఁజేయఁబడినది,
అతిశయింపఁజేయఁబడినది.

క. అతఁడు డాపొలఁతి దప్పుయును సం, దీపితజఠ
రాగ్ని యైనతెలుఁగును గనుచున్.
భార. అశ్వ. ౨.౨౫

**సందీప్తము.** సం. విణ. (అ. అ. అ.) ౧. జ్వలిం-
పఁజేయునది, మండింపఁబడినది.

శా.... సూతులల సందీప్తైక బాణాహతిన్,కొల్లం-
జేసి .... భార. ద్రోణ. ౪-33

౨. ప్రకాశింపఁజేయఁబడినది.

మాలిని. అకృతకమహాగోక్తివ్యాప్తసంప్రీప్తసారా
భార. స్వర్గా. ౯౭

ఉ. సందగుగబ్బిగుబ్బలను జాదెడుతన్నయవాంబు
పూరిమల్ మందరమేరుశైలముల మాటికిఁ
బాలుపుురంబులంగ యనన్. రాధికా. ౪-౯౯

౩. ఉద్రేకింపఁ జేయఁబడినది. ౪. ప్రోత్సాహ
పఱుపఁబడినది, పురికొల్పఁబడినది.

**సందు.** స. క్రి. (త. చంది. క. సందిసు.) కూర్చు,
సంధించు.

ఉ. ప్రక్కలు వంచు వంచి మునిపండ్లను రాచును
రాచి రాచి లొమ్మక్కలఁజేయుఁ జేసి తెఁ
యల్లనఁ గాళులసందు సంది లోచక్కికి
నొక్కు, నొక్కి యురుచంబడ గుమ్మడిపూట
గట్టి పీ, పెక్కు మవాళిచేసి చలి యిక్కడ
నక్కడఁ బెట్టు వేఁకువన్. క్రీడా. ౪౫

**సందు.** వి. (సం. సంధి; క. సందు; త. చందు)
౧. ఎడము

తే. అమృతజంబాలమున సందు లడికి యదికి,
వేయుపక్షములమల నొక్కవిధము వానిఁ, జెప్ప
విధి చందుగనిఁగా నొనర్చెనేని, లలనా! నీ
మోము సరిసకళంకుఁ డితఁడు.
శృం. నై. ౮-౧౮౯

మ. చెలువ గ్గొందరు హేమకుంభములతోఁ జేసే
నొసంగిన్ వినిర్మలదోర్యూలరుచుల్ వెలిం
బొలయుఁదోరం బైచన్నోయి సం దొలయన్
పారి. ౨-౧౧

౨. సెపము.

ద్వి.... తొడిఁబడనిదియె సందుగ వారిమీఁద పడి
వైవఁ జూచురు చపలమానసులు.
ద్వి. పరమ. ౩-౨౧౪ పు.

తే. గీ. అఖిలమోహిని యైన యయ్యలరుబోడి
శైశవము వీడుకొన్నది సందుగాఁగ ననదిసం
బును రాజనందములమీఁద వేఁటలాడుచు
నున్నాఁడు విషమశరుఁడు. శృం. నై. ౩-౨౬

౩. ఇంటిప్రక్క నిడుకుగా నుండుచోటు.

చ. జలకము లాడఁగోరి బురుసాపనిచీర సడల్చి
సందులో, పలికి జవంగ నీదునుఁబల్కు
వినంబడఁ దల్పుఁ దీయఁగా వెలువడి వచ్చి
తిన్. హంస. ౨-౬౪

౪. గొంది, ఇఱుకు వీధి.

సీ.... బలిమాలి వేఁడినఁ బదముల వ్రాలిన సందు
లఁజొచ్చిన శరణ మనిన.... దశా. ౬-౧౩౫

౫. నడిమిభాగము, రెండువస్తువుల నడిమిభాగము

చ. జలజదళస్థతోయములసందులఁ గ్రిందుగఁ
దోఁచు మించినీ, దలు గనుపట్టె నత్తఱిఁ
దటాకములన్. ఆ. ౪-౧౫౧

సీ. అలికనేత్రము కీర్తి యారజ్యమానమై
కొప్పులసందుల నిప్పుచుమిసె. హర. ౭-౭౯

౬. (అవయవముల) సంధిబంధము, కీలు.

ద్వి. ఇంకఁ జెప్పులతోన యిట్లొంటివేని, శంకింప
కిప్పుడ సందుసందునకు నఱకుదు ననవుడు
బసవ. పు. ౬-౨౨ పం.

తే. వాయు వంగఁబులందు దుర్వ్యాప్తిఁ గదిసి,
నొప్పు దేహమునఁ బుట్టించుఁ గొప్పుపెలుచు,
సందు సడలించుఁ గ్రమమున నొందుఁబరఁగి.
భార. అశ్వ. ౧-౧౭౬

౭. తెలిసి, మధ్యకాలము.

వ. దేవవ్రతుండు వాని చేయనొల్లనిసందున తా
సవ్యసాచి యతనివిల్లు దునిమి.
భార. భీష్మ. ౩-౨౯౫

చ. కినుక మఱింబునం గదిసి క్రీడి పితామహువిల్లు
క్రక్కుమ్రిడిం, దునిమి నితాంతగాఢరయదోర్విభ
వంబున నొండువిల్లు గై, కొనియెనుసందున
న్నని చెఁ గ్రూరశరంబు లురఁబునందు.
భార. విరా. ౫-౧౭౬

మ. బలభిత్సూనుఁడు విస్మయాత్ముఁ డగుచున్
బ్రాయంబు నీకెంతనిర్మలచారిత్ర యనం
దపోధనుఁడు సుత్రామాత్మజుం జూచి లెక్క
లెఱుంగన్ మృతుడైననోమకుల మార్కండే
యులం జేర్కొనన్, నలువల్ వింశతిసంఖ్య
లే లెఱుఁగ నంతం బొంది రీసందునన్.
జై. భార. ౮-౧౪౨

పెక్కడు సందుకట్టునన్, ప్రాజిత సర్పదంబు
నకు బాధ యొనర్చుచుజారచోరసం, పూజి
తమై తమంబు గదుఁ బొంగె నధర్మము తోడి
జోడుమై. నృసింహ పు. ౩-౮౧

**సందుకా.** వి. (హిం. సందూక్) చిన్నపెట్టె.

**సందుకొను.** స. క్రి. (√సందు) ౧. దక్కించు
కొను, వశపఱచుకొను.

క. శ్రీగజగామినిఁ గామిని, నేగతి నే సందు
గొందు నిఁక నని విధుఁడున్, వేఁగుచు నురుఁ
డిలువెల్లిన, చో గాఢముచేయు నవ్వేఁ జూచిన
ప్రొమిక్కన్. వరాహ. ౭-౨౦

ద్వి. తోయజాలయసయిదోడు దా నమచు,
దోయజాక్షు పొందుట సందుకొనిరె.
ద్వి. పరమ. ౫-౪౪౨ పు.

౨. గ్రహించు, కూడ్చుకొను.

వ. తపని చిగురాకుఁదమ్ము ప్రదక్షిణంబులుసేయు
భ్రమరాళికిఁ దర్పనోరఁబీజాక్షమాలిక యని
పోలికల సందుకొనుచు పందంద లతాకుంద
బృందంబులకు మారంభాగు నిందిందిరావళి
యిందిరానందనుం డిందీవరగంధులపై నైచు
వాటుబల్లెం బని చాటుచు.
రాజవాహన. ౩-౧౧౪

**సందుకొ(గొ)ను.** అ. క్రి. (√సందు) ౧. అవ
కాశము చేసికొను.

వ. కరులకొమ్మునం జిక్కి ప్రేలుతురంగంబు
లును సందుకొని వొచ్చిన సుభటులు.
భార. కర్ణ. ౧-౧౮౬

క. ధవళుఁడ వీకేశా యని, కవుఁగిటఁ గదియించి
పెనగుగలబంధుఁడ వౌ, దువు సేఁటికైన
వచ్చితి వవసర మిపుడైనఁ గలిగెనా యని
పలుకన్.

తే. వాఁడమాటలు విని మదవతి మదీయవచన
మేజాణయో వినివచ్చియిట్లు సందుకొన్నాఁడు
కార్యంబు దక్కనయ్యెఁ, గాంక్షయొనఁ
గూర్ప ధవళుఁడేకలఁ డటంచు.
శుక. ౨-౫౧౪

చ.... ముద్దియ యేగతి నట్లు రంభరూ, పుసు ధరి
యింప నేర్చితివి పొందుగ నెమ్మెయి సందు
కొంటి వాయనఘుని నట్లు గూడఁగఁ జిరాళి
మశం బిది. కళా. ౪-౩

౨. వ్యాపించు.

తే. గీ. శంఖభుంభుంనినాదముల్ సందుకొనిరె.
ఉ. రా. ౮-౧౬౫

**సందుగము.** సం. వి. అ. న. సంధ్యంగములు.

తే. గీ. సకలసందుగములకుఁ దేజంబు గలుగ,
మధుమదారంభ మణకువ మఱలఁ ద్రోవఁ,
దీకువయు నారజంబునుఁ దేటపడఁగఁ, బుర
మునకు వచ్చె నొక కాపుపూవుఁబోడి.
( ♦ సంధ్యంగములకు అని పాఠాంతరము)
క్రీడా. ౧-౧౩౪

**సందుగొట్టు.** అ. క్రి. (సందు+కొట్టు) బిడ్డలకు
సందుదోషము తగులు. (శ. ర.)

**సందుదవులు=సందుగొట్టు.** (శ. ర.)

**సందువడు.** అ. క్రి. (సందు+పడు) (√సందు)
చిల్లిపడు.

సీ. మొనయించి కులుగాడెములలోన వేసిన,
జమునిదూతకు వెన్ను సందువడదె.
కకు. ౧-౧౨౯

**సందువెట్టు.** అ. క్రి. సందు అనుమల్లబంధవిశేష
మును ప్రయోగించు.

వ. అరక్షోవైరి వాఁకటిచేలంబు వట్టి యెత్తి
యెత్తి నడుమరాగెయిడి సందువెట్టి నవ్వించి
నవ్యాసోధికాలు కాలిలో నిడి వేధించి నిరో
ధించిన.
భాగ. ౧౦ స్కం. పూర్వ. ౧౩౪౫

**సందుష్టము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. దోషము
గలిగింపఁబడినది, చెఱుపఁబడినది. ౨. దుష్టము,
చెడినది.

**సందుసీసము.** వి. మల్లబంధ విశేషము.

వ. కక్కొక్కొక్కస సందు సీసంబును స్వనింపాంబును వాదియగుముప్పదిరెండువిన్నాణంబుల వాలెంబు పరీక్షించి. హంస. ౧-౨౦౭

వ. కొక్కొస, కుమ్మరింపు, బోడింపు, సమసీసంబు సందుసీసంబు గొంతుమారుసు. మల్లుపురా. ౩-౭౯

వ. సందుసీసంబును కొంతుమారుసు సమసీసమ్మును చేకందసంబును కర్లవంబును. ప్రబం. ౧-౩౭

**సందుసుడి.** విణ. అవకాశమునుబట్టి వంచించునట్టి.

చం. సందుసుడిమాయలంగా మగవారి కృత్యములే. మను. ౩-౭౨
( ఇది మాయలు అనుదానికి ముందే కనఁబడుచున్నది )

**సందూషణము.** సం. వి. అ. న. చెఱచుట, దోషముగలిగించుట, మలినము చేయుట, దోషారోపణము చేయుట, తప్పుపట్టుట, నిందించుట.

**సందూషితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెఱుపఁబడినది, దోషముగలదిగాఁ జేయఁబడినది. ౨. హెచ్చినది, పెఁగినది (రోగము మొ.) ౩. నిందింపఁబడినది. ౪. అతిక్రమింపఁబడినది. ౫. దుర్వినియోగము చేయఁబడినది.

**సందె.** వి. (సం. సంధ్యా) (క. సందె, సంజె) ౧. సంధ్యాకాలము, సంజ.

ఆ.వె. అనిన నట్టిదేవుఁ డంగజాతకు లొంగి, సందెలందు దివములందు విరక్, జేయివత్సరములు వెలఁదితో రమియించి, యర్థదేహ మొసఁగఁడా యటన్న. దశా. ౩-౬౨

తే.గీ. సందెఁ దలయఁటుకొనట వస్త్రంబు లేక, మజ్జనముచేఁత విడియాకు మట్టగించి తాల్చుటయు విరుగేలను దల పుణుకుట భర్తగల భామినుల కశుభప్రదములఁ. పి. కమం. ౪-౩౯

చ. జగమున సందెవేళయనుసైగ్రుని రాకకుఁ

తపపల్లవరాజిఁ జేప్పి బాగుగఁ బరిపక్వమైన ఫలగుచ్ఛము నిచ్చగ రాల్పుచై ఖచన్, లోగ పగదాయయయ్యపరతోయనిమగ్నుసుంకుమచ్చవిన్. ఉత్తర హరివం. ౩-౧౧౨

౨. సంధ్యావందనము.

ఆ.వె. సందెవార్చ లేమి జపముసేయ లేమి, వేదశాస్త్రములను వెలయ లేమి, పడఁతి గనిన వాఁడు బాడుగాఁ గాఁడయా విశ్వదాభిరామ వినుర వేమ. వేమ. ౨భా. ౪౩౧

తే. గడియలోఁ దెల్లవారె భాస్కరుఁడుగ్రుంకె, జాగు లేలంచు సందెపై సందెవార్చు. కుక. ౨-౪౫౭

**సందెచీఁకటి.** వి. సంధ్యాకాలమందగు చీఁకటి.

క. ఇటువంటయ్యరి కారా, చిటుకు మఁగ యందు సందెచీఁకటి జేరన్, ఘుటచేటీవిటులై యిక్కటకంబునఁ దిరుగువారు కంఁదరాక్షీ. వైజ. ౨-౧౭

**సందెజాము.** వి. (√సందె) రాత్రి మొదటి యామము.

గీ. అనిన నట్లకాక యని నల్లియును జీర, పేను చేరకయ్యెఁ బ్రీతి నుండెఁ దేనుకన్ను మొఱఁగి ప్రియపతి ధూమిఖుఁ గదిసి సందెజాము కఱచె నల్లి. వా. పంచ. ౧-౩౭౧

సీ. బాములఁబడి సందెజాములోయిందాఁక వర వుడుపనులు సర్వంబువీచ్చి. హరివం. ౫-౫౫

**సందెమల్లియ.** వి. ఒక తీఁగె, రుద్రాక్షి. ‡

**సందేశకము.** సం. వి. అ. న. వార్త, సమాచారము.

**సందేశము.** సం. వి. అ. పుం. ౧. సమాచారము, వార్త. ౨. వాచికము, చెప్పిపంపిన సమాచారము. ౩. ఆజ్ఞ, నియోగము.

**సందేశవాక్కు.** సం. వి. చ. స్త్రీ. చెప్పి పంపిన

**సందేశహరుఁడు.** సం. వి. అ. పుం ౧. వార్తాహరుఁడు, సందేశముతీసికొనిపోవువాఁడు, దూత ౨. రాయబారి. (ఇట్లే సందేశహారకుఁడు)

**సందేశహారకుఁడు.** సం. వి. అ. పుం. చూ. సందేశహరుఁడు.

**సందేశార్థము.** సం. వి. అ. పుం. దూతముఖమునఁ జెప్పి పంపినసమాచారవిషయము.

**సందేహము.** సం. వి. అ. పుం. ౧. సంశయము, నిశ్చయములేనిది. ౨. అపాయము, ఆపద. (విలియమ్సు) ౩. (అలం) అర్థాలంకార విశేషము. సందేహాలంకారము (మమ్మటాదులు దీనిని సందేహమని పేర్కొనిరి) ౪. దేహమందలి పాంచభౌతికాంశముల సమూహము.

> సీ. అల్పాక్షరం బయ్యు నధికార్థము నొసంగు, సారతరంబు మోక్షప్రదంబు సందేహరహితమాజ్ఞానిశ్చితము దృఢం, బర్థసిద్ధిదము శివాత్మకంబు .... శివధర్మోత్తరము. ౧-౧౪౪

**సందేహదోల.** సం. వి. ఆ. స్త్రీ. సంశయ మనుఉయ్యాల, సంశయపరిస్థితి.

**సందేహి.** సం. విశే. (న్. నీ. న్.) ౧. సందేహము గలవాఁడు. ౨. నమ్మకము లేనివాఁడు.

**సందేహించు.** సం. అ. క్రి. సంశయించు, సంకోచించు, వెనుదీయు.

> శా. ధేనుగ్రాసము మాన్ప దోసమని సందేహించి నన్ సస్య మెం, తే నష్టంబగు నైనఁ లేమి మఱియు న్విత్తంగ యామంబులోఁ నానన్నన్ మునుచెల్లఁ మిక్కిలియు నేఁ డాఁకొందురు. వరాహ. ౧౦-౩౯

**సందోహము.** సం. వి. అ. పుం. ౧. పాలు పిదుకుట. ౨. సమూహము, మొత్తము.

> మహాస్రగ్ధర. ఎకరాలన్ మందువాసాహిణములఁ గలభద్రేభసందోహవాహప్రకరంబున్ గొంచు... మనుచ. ౧-౪౦

**సంద్రము.** వి. (సం. సముద్రః) = సముద్రము. జలనిధి. (రూ. సందరము)

> సీ. సాగర మంబురాశి సంద్రము కడలి. ఆం. ప. అచర. ౩౭

> ఉ. సంద్రము దుగ్ధబిందువులుసల్లెడు నుత్తరతీరభూస్థలిం జంద్రవగంబు. భా. రా. యుద్ధ. ౧౦౯-౨

> ఉ. చందురుఁ గాంచి సంద్ర మతిసాంద్రసమృద్ధి వహించెఁగాక. శివం. ౨-౨౦

> శా. ఓ వాచంయమిచంద్ర సంద్రములు నేఁ డొందైనవేళన్ హయగ్రీవుం డెక్కడ నుండె. దశా. ౧-౨౨౭

> క. గానములసంద్రమ యిత్తెఱఁ, గుననఁ జాలుపుతేర్ల నేఁడుగొద యొదవనిపెం, పున నడరొందుచు నొకనాఁ, డనమితివలెక్కు నల్ల మిగుల నొత్తంగన్. అ. రా. అయోధ్యా. ౩

> తే. చంద్రగుప్తుండు పూర్ణిమాచంద్రుఁ గనిన, సంద్రమునుబోలె నానందసాంద్రుఁ డగుచు. విక్ర. ౧-౧౭౧

**సంద్రావము.** సం. వి. అ. పుం. పాఱిపోవుట, తిరోగమనము.

**సంద్రుఁడు.** వి. సముద్రుఁడు.

> క. మనవాఁడై సంద్రుఁడు చెప్పినమాటలు వింటి రింకఁ బిఱుతీకములన్, గొనివచ్చి కట్టకట్టుఁడు ఘనవలయుం గడలిదాఁటి సరగున మనకున్. యయా. ౩-౩౩

**సంధ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కూడిక, సహస్థితి. ౨. సన్నిహిత సంబంధము. ౩. స్థితి, అవస్థ. ౪. వాగ్దానము, ప్రతిజ్ఞ, ఒడంబడిక.

> కం. సంధారఘుపతికి వృషస్కంధున కైదంయ గీనకర్ణునకు సమిద్ధ్మాంధారకు .... పాండు.

౫. హద్దు, మితి. ౬. స్థైర్యము, చాంచల్యము లేమి. ౭. మునిచీఁకటి, సంధ్యాకాలము. ౮. (మద్యమును) బట్టీనుండి దింపుట, సంధానము. ౯. ఒకస్థితిలో స్థిరముగా నుండుట.

**సంధాత.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) సంధానము చేయువాఁడు.

**సంధానకరణి.** సం. వి. ఈ. స్త్రీ. విఱిగిన యవయవముల నతికించు ఓషధీవిశేషము.

**సంధానము.** సం. వి. అ. న. ౧. కూడుట, కూర్చుట.

సీ.... నూనవితానసంధానవిధానతఁ జేటికవాప నల్ చేర్చుకిరి. ధర్మ. ౪౦. ౧-౧౯౨

౨. అతుకుట. ౩. మందులు మున్నగువానిని కలుపుట. ౪. చెడినదానిని బాగుచేయుట. ౫. బాణమును వింటినారియందు కూర్చుట. ౬. మైత్రి. ౭. సంధిబంధము, కీలు. ౮. శ్రద్ధ. ౯. కార్యనిర్వహణము. ౧౦. పోషించుట. ౧౧. మద్యమును బట్టీపట్టుట. ౧౨. ఒకవిధమైన మద్యము. ౧౩. దప్పిని హెచ్చుచేయు రుచ్యపదార్థము. ౧౪. ఊరుగాయలు పెట్టుట. ౧౫. మందుల యుపయోగమువలన చర్మము నతుకునట్లుచేయుట ౧౬. పుల్లగంజి. ౧౭. కంచు. ౧౮. సంధి, పొత్తు.

క. అది యట్టిద సంధానము, దుది నెమ్మియిఁ గల్గునెట్లు దుర్యోధనుఁడు, న్మమఁడు ధృతరాష్ట్రభూవిభు, హృదయంబు తెలుగు గొంత యెఱుఁగుదు మెకదా! భార. ఉద్యో. ౧-౩౩౯

**సంధాని.**[1] సం. విణ. (న్. సీ. న్.) ౧. కట్టువాఁడు, బంధించు త్రాఁడు. ౨. సంధానమున (నారిలో బాణము కూర్చుటయందు) నేర్పుగలవాఁడు. ౩. మద్యమును బట్టీనుండి దింపువాఁడు, మద్యముచేయువాఁడు.

**సంధాని.**[2] సం. వి. ఈ. స్త్రీ. ౧. మద్యములు బట్టీనుండి దింపుట. ౨. కుప్యశాల, కంచరిపని చేయుస్థలము. ౩. మద్యములుచేయుట.

**సంధానితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అతుకఁబడినది, కూర్పఁబడినది. ౨. కట్టఁబడినది, బంధింపఁబడినది.

**సంధానిని.** సం. వి. ఈ. స్త్రీ. గోష్ఠము, పసులపాల.

**సంధాయకుఁడు.** సం. విణ. సంధానము చేయువాఁడు, కూర్చువాఁడు, కలిగించువాఁడు.

**సంధాయి.** సం. విణ. (న్. సీ. న్.) కూర్చువాఁడు (విల్లమ్ములనువలె)

**సంధారణ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అడ్డుపెట్టుట, ఆటంకపఱుచుట. ౨. చక్కఁగ జ్ఞప్తియందుంచుకొనుట. ౩. ఓర్చుట, సహించుట. ౪. చిత్తము నీశ్వరునందేకాగ్రముచేయుట. (విల్యమ్సు) ౫. విన్యాసము, భంగిమ.

**సంధారణము.** సం. వి. అ. న. చూ. సంధారణ.

**సంధి.** సం. వి. ఇ. పుం. ౧. కలయిక, కూడిక. ౨. ఒడంబడిక, సమ్మతి. ౩. పొందు, రాజుల కొండొరులతోడి పొత్తు, మైత్రి, రాజ్యతంత్రమున షడ్గుణములలో నొకటి.

ఉ. సంధికి నేఁగి కార్యము ప్రసంగకకృష్ణుఁడు రాకయున్. భార. ఉద్యో. ౪-౧౬౫

౪. అవయవ సంధి, కీలు. ౫. (బట్ట) ముడత. ౬. రంధ్రము. ౭. సొరంగము, దొంగలు త్రవ్విన కన్నము. ౮. విభజనము, విభాగము. ౯. (వ్యాక) అక్షరసంయోగము. ౧౦. వ్యవధానము, విరామము.

సీ. ఉన్మత్తులనఁ బునరుక్తులు గావించి పాలీల గతి వడి సంధు లతికి. శివధర్మ. ౧-౧౨

౧౧. శ్లిష్టసమయము. ౧౨. ఉచితసమయము. ౧౩. యుగసంధి, కృతాది యుగములలో నొక దానికిని మఱియొకదానికిని నడిమి కాలము.

క. ఏపారి తొల్లి త్రేతా, ద్వాపరములసంధి నొక్కవలపు ధాత్రీలాపంబుఁ జేసె జనముల పాపంబున వత్సరములు పండ్రెండు దడపా. భార. శాంతి. ౩-౨౭౯.

౧౪. నాటకవిభాగము, (ముఖాది) ముఖము, ప్రతిముఖము, గర్భము, అవమర్శము, నిర్వహణము అని యివి పంచవిధము. ౧౫. భగము, ఆఁడుగుఱి. ౧౬. మద్యముచేయుట. ౧౭. జ్వరతీవ్రత.

**సంధించు.** సం. స. క్రి. ౧. కూర్చు, చేర్చు.

మ. అతులంబై యనవద్యమై కువలయామోదార్థప్రమోదప్రదాత్మ్మతి సంధించి కరంబు రాజిలు సుచంద్రప్రాజ్యతేజోవ్రజం బతిచేలం బగుచున్ వెలుంగఁగ .... చంద్రికా. ౪-౨౨

శ. మనంబు సుస్థిరంబు గావించి గుణత్రయవికృతుల డంచి యాత్మునిసాత్మయందు సంధించి తన్మయుండై యోగి నిర్వాణంబుం బొందు. మార్క. 3-348

-మ. నీకిం జెప్పఁడు శంఖచక్రయుగమున్ జేదోయి సంధింపఁడు .... భాగ. ౮-౯౬

౨. సంధిచేయు, పొందుపఱుచు

మ. సుతుఁడాలై వినయంబు నీకొనక యేచోపంబ దగం జెప్ప కార్యధృతరాష్ట్రుం డవనీతిఁ జేసి వను సంధింపంగరా దంచు శోకఁ దెరం బాఱను. భార. ఉద్యో. 3-౨౫

3. కలిగించు, ఆపాదించు.

మ. ఏకచక్రపురతాభూరవేత్రస్థలం మానంగల వాఁడ బక్షిగుదుపై సంధించె సర్వోత్తమున్. భార. శాం. 3-3౨౫

౪. కలసికొను.

మ. ఇది సంధింపఁగ నేరయంచు వసురాజేం ద్రుండు.... వసు. 3-౪౫

సంధిక. సం. వి. అ. స్త్రీ. మద్యముచేయుట, సంధానము.

సంధికము. సం.వి.అ.పుం. ఒకవిధమైన జ్వరము.

సంధిచోరుఁడు. సం. వి. అ. పుం. కన్నగాఁడు, కన్నపుదొంగ.

సంధిచ్ఛేదము. సం.వి.అ.పుం.కన్నముద్రవ్వుట.

సంధిజము. సం.వి.అ.న. మద్యము, సారాయము

సంధిజీవకుఁడు. సం. వి. అ.పుం. ౧. అధర్మజీవనము గలవాఁడు. ౨. కుంటెనకాఁడు.

సంధితము. సం. విశే. (అ. ఆ. అ) ౧.కూర్పఁ బడినది, ఏకముచేయఁబడినది. ౨. నిలుపఁజేయఁ బడినది. (శూలమంగాయి మొ.) 3. బిగింపఁబడినది. ౪. సమకూర్పఁబడినది. వి. అ. న. ౧. ఊఁరుగాయ. ౨. మద్యము.

సంధిత్సు. సం. వి. అ. స్త్రీ. సంధింపనిచ్ఛ.

సంధిత్సువు. సం. విశే. ఉ. సంధింప నిచ్ఛగలవాఁడు.

సంధిదూషణము. సం. వి. అ. న. సంధినిబంధనముల నతిక్రమించుట.

సంధిని. సం.వి.ఈ.స్త్రీ. ౧. పదయావు, కట్టిన యావు. ౨. అకాలమునఁగూడఁ బితుకనిచ్చెడి యావు.

సంధిబంధనము. సం. వి. అ. న. స్నాయుబంధనము, స్నాయువును నెముకలను గలిపెడి త్రాడు వంటి నరము.

సంధిబంధము. సం. వి. అ. పుం. ౧. రాజులు సంధికై నియమము లేర్పఱుచుకొనుట. ౨. స్నాయువును నెముకలను గలిపెడి త్రాడు వంటి నరము. 3 వృక్షవిశేషము. ౪. సిమెంటు, సున్నము.

సంధిభంగము. సం. వి. అ. పుం. కీలుతప్పుట, బెణఁకు.

సంధిముక్తి. సం. వి. ఇ. స్త్రీ. సంధిభంగము.

సంధిమోక్షము. సం.వి.అ.పుం. సంధిభంగము చేయుట.

సంధిరంధ్రక. సం. వి. అ. స్త్రీ. గోడయందలి కన్నము.

సంధిల. సం.వి.అ.స్త్రీ. ౧. గోడయందలికన్నము దొంగత్రవ్వినకన్నము. ౨. నది. 3. మద్యము. ౪. గాయకస్పందముయొక్క జంత్రివాద్యముల ధ్వని.

సంధిల్లు. అ. క్రి. ౧. సమకూడు, కలుగు.

ఉ.... విగతముఖులఁ జేసితి గాదె బెంపు సంధిల్లఁగ నాకుఁ బ్రాణములు దేహములుం బెరిగా న్మనీశ్వరా. మార్క. ౧-౯౨

సీ. అఖిలభూమండలశ్లాఘ్య మైనసకల రాజ్యమహిమ లవ్వానమాన్రపొందె నవనిధులెల్ల రాజసోద్రిక్తుడై మించి పూర్వ జన్మమై రాజబంధంబు సంధిలంగ. వి. పు. ౬-3౭౦

చ. హరిహయదేశికాభుఁ దగునమ్మహిదైవత మాళియందు బం, గరువునకున్ మృగీమద సుగంధము సంధిలుభాతి నంబుజో, దరచర ణారవిందసతతస్మృతిలోలుపమైనబుద్ధియున్ బరిణతి గాంచె .... పాండు. ౨-౮

౨. ముట్టుకొను, స్పృశించు.

ద్వి. చాటుఁజీరలమాట సంధిల్లి రేని పోటుమాం దఱ వినుపోటులమాట.

బస. పురా. ౮౨ పు. ౯ పం.

ద్వి. పరిగొని వచ్చుచోఁ బురవీధి భవులు, శరు ణులవస్త్రముల్ సంధిల్లి రేని నోదఁజాఁబోడు రుఁజాఁడో యని.

బస. పు. ౧౦౦ పు. ౧౬, ౧౭ పం.

ద్వి. వింతవాఁ డొకఁడు మున్ వినమిఁగాఁ జేసి సంతకుఁ బోవుచో సంధిల్లినంతఁ బొడిచి మీఁదికిఁ జిమ్మె. ౧౦౦ పు. ౩౫ పం.

ద్వి. ముట్టినఁ జీరలు మాఱుగునే చెపుమ.

౧౦౦ పు. ౪౨ పం.

సంధివిగ్రహకుఁడు. సం.వి.అ.పుం. విదేశవ్యవహారముల మంత్రి.

సంధివిగ్రహములు. సం.వి.అ.పుం. శాంతి సమరములు.

సంధివిగ్రహాధికారము. సం.వి. అ.పుం. ఇతర రాజులతో సంధివిగ్రహములు జరిపెడియుద్యోగము, సంధివిగ్రహముల జరుపు మంత్రి యధికారము, విదేశ వ్యవహారమంత్రిత్వ పదవి.

సంధివిగ్రహాధికారి. సం. వి. న్. పుం. ఇతర రాజులతో సంధివిగ్రహములు జరుపు మంత్రి, విదేశ వ్యవహారముల కార్యాలయాధికారి.

సంధివిగ్రహి, సం. వి. న్. పుం. యుద్ధమంత్రి.

దక్షిణాయనసంక్రాంతిం త్రికలింగేశ్వరుని సన్ధివిగ్రహికేచనఅఖండవరి ౯ దివియ.

ద. కా. ౪-౧౩౬౩

సంధివిచక్షణుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) సంధిబంధనముల కూర్పుటయందు నేర్పరి.

సంధివిదుఁడు. సం. వి. ద్. పుం. సంధిసంప్రతింపులు చేయువాఁడు.

సంధివిపర్యయములు. సం.వి.అ.పుం. ద్వివచనము. సంధివిగ్రహములు.

సంధివేళ. సం.వి.ఆ.స్త్రీ. ౧. సంధ్యాకాలము. ౨. సంధికాలము. (రెండు వేళల కలుపు సమయము)

సంధికాలము. సం.వి.అ.న. అకీర్ణకాలి. (అమవాసము)

సంధిసంభవము. సం.వి.అ.పుం. సంయుక్తాచ్చు (ఏ ఓ)

సంధిహారకుఁడు. సం.వి.అ.పుం. కన్నగాఁడు, కన్నపుదొంగ.

సంధుక్షణము. సం. వి. అ. న. ౧. ప్రజ్వలింపఁజేయుట, మండించుట. ౨. ఉద్రేకింపఁజేయుట, ఉద్దీపింపఁజేయుట.

సంధుక్షితము. సం.విశే. (అ.ఆ.అ.) ౧. ప్రజ్వలింపఁజేయఁబడినది, మండింపఁబడినది. ౨. ఉద్రేకింపఁజేయఁబడినది.

సంధేయము. సం.విశే. (అ.ఆ అ.) ౧. కలుపఁదగినది, ఏకముచేయఁబడినది. ౨. పొందుకూర్పఁదగినది, అతుకఁదగినది. ౩. సఖ్యముచేయఁదగినది. ౪. గురిపెట్టఁదగినది. ౫. సమరసపఱుప వలసినది.

సంధ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. కూడిక. ౨. అవయవసంధి. ౩. సంధ్యారాగము, సంజె ౪. ప్రభాతము, వేకువ. ౫. సాయంకాలము. సందెచీఁకటివేళ. ౬. రెండుయుగములకు మధ్యకాలము. ౭. సంధ్యాకాలమున బ్రాహ్మణాదులచే నుపాసింపఁబడు దేవత. ౮. బ్రాహ్మణాదుల త్రికాలసంధ్యావందనము.

తే. గీ. కాని సంధ్యాదిసత్క్రియల్ చక్కఁదీర్చి

గయాపా. ౧-౩౪

౯. వ్యాఖ్యానము, ఒప్పగల. ౧౦. మేర, హద్దు. ౧౧. తలఁపు, ధ్యానము. ౧౨. ఒకవిధమగు పువ్వు. ౧౩. ఒకానొకనది. ౧౪. బ్రహ్మభార్య ౧౫. పూర్వాహ్ణ మధ్యాహ్న పరాహ్ణము లనెడి దివాభాగములలో నొకటి.

సంధ్యాంశము. సం. వి. అ. పుం. కృతాదియుగముల చరమ కాలము.

సంధ్యాంశువు. సం. వి. ఉ. పుం. సంధ్యారాగము, సంజకెంజాయ.

సంధ్యాకాలము. సం. వి. అ. పుం. మునిచీఁకటివేళ, సంజవేళ.

సంధ్యాత్రయము. సం. వి. అ. న. మూఁడు సంజవేళలు, పూర్వాహ్ణమధ్యాహ్నపరాహ్ణములు.

సంధ్యానాటి. సం. వి. న్. పుం. శివుఁడు.

సంధ్యాపయోదము. సం. వి. అ. పుం. సంధ్యాకాల వార్షిక మేఘము.

సంధ్యాపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. సంజమల్లెపూవు, జాజిచెట్టు.

సంధ్యాబలుఁడు, సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

సంధ్యాభ్రము. సం. వి. అ. పుం. సంధ్యాకాలపు మేఘము.

సంధ్యామంగళము. సం. వి. అ. న. సంధ్యాకాలమున చేయఁదగిన మంగళవిధి.

సంధ్యామంగళదీపిక. సం. వి. ఆ. స్త్రీ. శుభప్రదమైన సాయంకాలపు దీపము.

సంధ్యారాగము. సం. వి. అ. పుం. ౧. సిందూరము. ౨. సంజె కెంజాయ.

సంధ్యారాముఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మదేవుఁడు.

సంధ్యావందనము. సం. వి. అ. న. సంధ్యాకాలమున నాచరింపఁదగిన [illegible]

సంధ్యాసమయము. సం. వి. అ. పుం. ౧. సాయంకాలము. ౨. ప్రతి యుగములలో నొక భాగము.

సంధ్యోపాసన. సం. వి. ఆ. స్త్రీ. సంధ్యవార్చుట; సంధ్యావందనము.

సంప. సం. వి. ఆ. స్త్రీ. మెఱుపు.

సంపంగి. = సంపఁగి, సంపంగె, సంపంగియు, సంపఁగియు, సంపెఁగ.

సంపెంగ. వి. (సం. చమ్పకః క. సంపగె, సంపిగె) (త. చంపంకి) చంపకము.

సీ.... సంపంగి సంపెఁగ యనఁజంపకాహ్వయ మగును బొగడ. ఆం. భా. ౨-౪౩.

క.... బంగరు సంపగి సంపంగనఁ, ధరఁజాంపేయాహ్వయములు. ఆం. ప. అచర. ౭౧.

ద్వి. పారిజాతములు సంపంగులు తులసి, గోరంటలును గేదెకులు నశోకములు.
ద్వి. పరమ. ౪-౬౫౪.

సీ. సంపఁగి నామధసంప్రయోగము చూపి మొక్కలకు వెమ్మెడపిందు మూర్ఛవుస్తు.
కవి. ౩-౧౧౦.

సీ. సంపంగిముఖకాంతిఁబంపద నలరించి కరము చూతమ్ముపైఁ గరము చాచి. ఇందు. ౩-౫౧

మ. అలమాకందము కుండ్ల దాపఁడిను నియ్యాంట్లొక్కచో వేయఁగాఁబలె సంపంగిఁ ద్రవ్యటం బిడపలెన్. విప్ర. ౨-౬౯.

తే.... గగన, మంతలఁ గికి సంపంగివందనోలె....
ఆము. ౨-౫.

౨. ధాన్య విశేషము యొక్క పేరు.

సంపంగికావులు. వి. బ. ఒకదినుసు వస్త్రములు

సీ. సంపగికావులుఁ జందురుకావులు వెలిపట్టు జీబులు వేటుచాళ్ళు. ప్రబం ౧-౨౮౨.
హంస ౫-౩౫౫.

**సంపంగిదండ.** వి. సంపంగిపూవులతో గ్రుచ్చిన దండ.

తే. కనకకర్ణికాధారాళకాంతు లడర, దావుల తికలు బిరుదుసంపంగిదండ, లిరుఁగడల గ్రేల వైచికరణిఁ బరఁగఁ, గంబువిజయము పచరించుఁ గంబుగళము. ప్రభా. ౨-౮౮.

**సంపంగిపూవడ్లు.** బ. (√ సంపంగి) ధాన్యవిశేషము, సంపంగిపూలవలె పచ్చగా నుండు వడ్లు.

సీ. సంపంగిపూవడ్లు జాజిరాజనములు గంబూరరాజనా ల్కన్నెసరులు. హంస. ౪-౧౨౮.

**సంపంగె (గియ)** = సంపఁగి. వి. (సం. చంపకః) ౧. చంపకము †

సీ. సంపంగె ముఖనాగసంపద నలరింప విమలశోకమునకై యవరనీదు. విక్ర. ౧-౧౩౩.

సీ. సంపంగె పాదరింటి పేక్కు గోరఁట గాంచి యుసురంగ మగిడి వోరూరునవియు. పారి. ౩-౫౧.

**సంపఁగి.** వి = సంపంగి ౧. చంపకము.

సీ. సిగఁ జుట్టుకొన్న సంపంగి మొగ్గ తాయొతు చేరు చేరువ తేఁటి బారు దగదు మ. రఘు. ౮-౧౪.

౨. సంపంగిపువ్వువలె సుందర మగుటచే ముక్కు కియ్యఁబడిన బిరుదు.

చ. పులియఁడు బూచిగాఁ దమరపోతుల రా జనుమంతిగాఁడు చెంగలువవీవంగిధైరవుఁడు గత్తెర సంపఁగివెండిగుండు మల్లాలగుది. మను. ౪-౩౨.

**సంపఁగిదండ.** వి. (సం. చంపక) సంపెంగపూదండ.

సీ. తరుణి క్రొవ్వెద తుమ్మెదల దాఁటుదాఁట సంపఁగిదండచెరిజెఁ గోమలి మొకర్తు. వసు. ౫-౧౧౬.

సంపఁగిబంతి.

సీ.... సంపఁగిబంతికొనల జోపాప లగుచు. ఉ. హరి. ౧-౧౫౧.

**సంపఁగె.** వి. సంపెంగచెట్టు.

సీ. పన్నజాజులు మరపొన్నలు గలిగొట్లు మల్లెలుం సంపఁగెల్ మొల్ల విరులు. ఉ. రా. ౩-౨౦౧.

**సంపగి.** వి. (సం. చంపకః) = సంపఁగి; సంపంగి;.

క.... బంగరు సంపగి సంపంగన్యధరఁ జాంపేయాహ్వయములు. ఆం. ప. అవర. ౮౧.

**సంపతిలు (ల్లు)** అ. క్రి. (సం. సంపత్) సమృద్ధమగు.

క. సొంపుఁ దివ్వెమ్మెయిఁ జెండిలి, సంపతిలన్ సత్యధర్మజనపతిచంద్రుం డంపఁగ నా ఖంచక ఫురి కింపలరఁ గుమారుఁ డరిగె నింతియుఁ దానున్. విక్ర. ౭-౮౧.

**సంపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సంపద ౨. సమృద్ధి. ౩. జయము. ౪. సిద్ధి. ౫. సమగ్రత. ౬. అనుకూలస్థితి

**సంపత్తు.** సం. వి. ద్. స్త్రీ. ౧. ఐశ్వర్యము. ౨. గుణోత్కర్షము. ౩. సమృద్ధి. ౪. అదృష్టము. ౫. సౌఖ్యము. ౬. జయము. ౭. అభీష్టసిద్ధి. ౮. సమగ్రత. ౯. శోభము. ౧౦. లాభము. ౧౧. అలంకరణము. ౧౨. మంచిపద్ధతి. ౧౩. ముత్యాలహారము. ౧౪. బలము.

**సంపద.** సం. వి. ద్. స్త్రీ. సంపత్తు (రూపాం).

ఉ.... పెంపెసలారెడు బాహుసంపదన్. భార. విరా. ౪-౯౬.

ఉ. నీకేఁ గలుగంగ సంపదల కేలవిచారము పద్మగంధి. ఉ. హరి. ౧-౬౪.

తే. గీ. సంపద లబ్బెనేని. శేబరము కాద బిడ్డలు లేని బ్రతుకు. ఉ. హరి. ౧-౬౬.

**సంపద్వరుఁడు.** సం. వి. అ. పుం. రాజు.

**సంపద్వసువు.** సం. వి. ఉ. పుం. సూర్యుని ప్రధాన కిరణముల పేరు.

**సంపద్వినిమయము.** సం. వి. అ. పుం. సంపదల నిచ్చి పుచ్చుకొనుట.

**సంపన్నము.**[1] సం. విణ. అ. సంపదతోఁ గూడినది. ౨. సమృద్ధ మైనది. ౩. సాధింపఁబడినది ౪. పూర్తి చేయబడినది. ౫. సమగ్రమైనది.

క..... రధికుఁ డీతఁడు శశ్వత్కౌప్రోద్దీప్తుఁడు మాదనఁజాప కళావేది దర్పసంపన్నుండున్. భార. ద్రోణ. ౩-౧౪౦.

౬. పరిపక్వమైనది. ౭. సాధ్యమైనది, ఒప్పుమైనది. ౮. కూడినది. ౯. అదృష్టముగలది. ౧౦. సుఖవంతమైనది. ౧౧. నిష్ఠాపితమైనది. వి. అ. న. ౧. సంపద ౨. రుచ్య మైనభక్ష్యము.

**సంపరాయము.** సం.వి. అ. పుం. ౧. యుద్ధము, సంఘర్షణము. ౨. ఆపద, మరదృష్టము. ౩. భావిభవిష్యత్ స్థితి ౪. మరణము, వ్యాధి.

**సంపరాయ (యి) కము.** సం. వి. అ. న. యుద్ధము.

**సంపరాయుఁడు.** సం.వి. అ. పుం. కుమారుఁడు

**సంపరిగ్రహము.** సం.వి.అ. పుం. ౧. దయతో స్వీకరించుట ౨. ఉన్నతి.

**సంపరేతుఁడు.** సం. విణ. అ. మృతుఁడు.

**సంపర్కము.** సం. వి. అ. పుం. √ సంపృచ్. ౧. కలయిక, ౨. స్పర్శ ౩. సంఘము. ౪. సాహచర్యము. ౫. రతి. ౬. కూడికమొత్తము.

**సంపాకము.** సం. వి. అ. పుం. ౧. పరిపక్వమగుట; ౨. రేల (ఆరగ్వధము) i

**సంపాకుఁడు.** సం. విణ. అ. ౧. చక్కఁగాఁ దర్కించువాఁడు; ౨. జిత్తులమారి. ౩. విషయలంపటుఁడు. ౪. అల్పుఁడు.

**సంపాటము.**[1] సం. వి. అ. పుం. ౧. సదుమ ఖండించుట ౨. కదురు.

**సంపాటము.**[2] ఉభ. వి. చెక్కడపుపనియందు ఒమ్మచ్చును, అందుచెక్కిడి రత్నములను లక్కయుఁ గూడఁ జేర్చి తూఁచెడితూనిక. (శ. ర)

**సంపాతము.** సం.వి.అ. పుం. ౧. ఒక్కనిపాటు ౨. కలసిపడుట. ౩. సమ్మర్దము ౪. ఎదుర్కొనుట. ౫. దిగుట. ౬. వ్రాలుట. ౭. చలనము. గమనము. ౮. పక్షిగమనవిశేషము.

ఉ.... రంగత్పక్షసంపాత సంవృతసంపాతిఖగోక్తమార్గమున. దశావ ౭-౯౩.

౯. నివేదనశేషము. ౧౦. సంపుట. ౧౧. రేయింబవళ్లు సమపరిమాణమునై యుండు కాలము; సూర్యుఁడు భూమధ్యరేఖను దాఁటుకాలము. (వసంతశరత్కాలములందు వచ్చును) ౧౨. రెండురేఖ లొండొంటిని ఖండించుకొనుచోటు.

**సంపాతపాటవము.** సం. వి. అ. న. ఎగురుటయందలి కౌశలము.

**సంపాతి(తుఁడు).** సం. వి. ఇ. పుం. గరుఁడుని కుమారుఁడు: జటాయువు అన్న.

**సంపాతి.** సం. విణ. (న్) ౧. కలిసి ఎగురువాఁడు ౨. కలిసిపడువాఁడు.

**సంపాతుఁడు.** సం. వి. అ.పుం. (రూ.సంపాతి) గరుడునికుమారుఁడు; జటాయువు అన్న.

**సంపాదకుఁడు.** సం. విణ. అ. ౧. నెఱవేర్చువాఁడు; ౨. గడించువాడు.

**సంపాదనము.** సం. వి. అ. న. ౧. గడించుట సంపాదించుట ౨. పొందుట ౩. నెఱవేర్చుట ౪. కుదురపఱచుట. ౫. సిద్ధముచేయుట ౬. కలిగించుట.

స్ర. కని రంతంత న్నభోమార్గమున ఘనతమస్కాండసందేహసంపాదనలీలాజాగరూకాతను వికటతనూధామనూమాయితంబున్ శృ. నై. ౭-౩౮.

**సంపాదము.** వి. పూర్తిచేయుట. ౨. నెఱవేర్చుట. ౩. పొందుట.

**సంపాదించు.** సం.స.క్రి. ౧. సంపాదిల్లఁజేయు; కలిగించు.

క. తాను తాత్మజుఁడై సంపాదించువాఁ డవధి
కాహ్లాదము భార. శాం. ౬-౫౨౨

౨. ఆర్జించు; గడించు.

తు. పతి యాయాసనహిష్ణుఁడై కడఁగి సంపా
దించుపుణ్యంబులలో, సతిశుశ్రూషచేఁ గైకొను
న్మతియు ఁదా సాఁబాలు ధర్మస్థితిన్.
మార్కం ౨-౧౩౭.

౩. సిద్ధముచేయు.

మ. అతిథిభక్తిన్ గృహిణీలలామము పదవ్యా
సంగచంగాత్మయై, ప్రతివారంబును భక్ష్య
భోజ్యములు సంపాదించి వడ్డింపఁగా నతి
థుల్ భోజన మాచరించి సుఖులై యాశీర్వ
దింపంగ నాచనురాస్యాన్వయవార్ధిచంద్రము
నకున్ సంతోష మెంతో యగున్.
నిరంకుశో. ౧-౬౦.

**సంపాదించుకొను.** స.క్రి. కలిగించుకొను, పూను, వహించు.

క. ఆదివరాహము వెసఁగిన యాదంష్ట్రల వెతికి
తననిజాస్యంబున సంపాదించుకొని నటించు
మహాదర్పముతోడ నొకగణాధిపుఁడు శివా.
శివతత్త్వ. 332. ప.

**సంపాదితము.** సం. విణ. అ. ఆ.అ. సంపాదింపఁబడినది.

**సంపాదిల్లు.** సం. అ. క్రి. సంభవించు, కలుగు.

క. అదిని సంయోగవియోగాదిద్వంద్వములు దేహి
యగువానికి సంపాదిల్లక తక్కవు పూర్వో
దయకర్మమున వెట్టియోగికి నైనన్.
భార. ఆది. ౬-౨౮౯.

**సంపాసారి.** వి. కోమటి, వైశ్యుఁడు.

ద్వి. కోటికిఁ బడగెత్తి కోరువస్తువులు, పాటించి
యొసఁగుసంపాసారులార.
హరిశ్చ. ఉత్త. 3౭౨.

**సంపాలించుట.** వి. కంసాలి కావించు క్రియ (పెల్లూరుమండలము. వా.)

**సంపిండితము.** సం. విణ. అ. ఆ.అ ౧. ముద్దగాఁ జేయఁబడినది. ౨. సంగ్రహింపఁబడినది.

**సంపీడ.** సం. వి. ఆ. స్త్రీ. బాధ.

**సంపీతి.** సం. వి. ఇ. స్త్రీ. కలసిత్రాగుట.

**సంపీడనము.** సం.వి.అ.న.౧. గట్టిగానొక్కుట, రెండువస్తువులను దగ్గఱగా నొక్కుట. ౨. దండించుట. ౩. బాధించుట ౪. ఉద్రేకింపఁజేయుట. ౫. ముందుకు నడుపుట.

**సంపీడము.** సం. వి. అ. పుం. = సంపీడనము.

**సంపు.** స. క్రి. రూ. చంపు.

క....సారంగాహితమున్ సంపెఁగ నపూర్వ మేపు
నఁ బొదలన్ (సంపెన్ సంపెఁగన్ అని
భేదములు) హ. న. ౨. ఆ.

౨. సమృద్ధి

క. సొంపున నిమ్మెయిఁ బెండిలి,సం పలరిన
సత్యధర్మజనపతిచంద్రుం డంపఁగ నావంచక
పురి, కింపలరఁ గుమారుఁ డరిగె వింతియుఁ
దానున్. విక్ర. ౩. ఆ. (శ. ర)

**సంపుట (టి) క.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పెట్టె ౨. ఒకవిధమైనమువ్వటి. ౩. కాగితపుసంచి (కవరు)

**సంపుటము.** సం. వి. అ. పుం. ౧. భరణి ౨. తొఱ్ఱ, రంధ్రము. ౩. అర్ధచంద్రాకారముగానున్న భిక్షాపాత్ర ౪. అర్ధగోళము. ౫. నిలువ ౬. ముకుళనము. ౭. కురవకపుష్పము. (ఎఱ్ఱగోరంటపూవు) ౮. గ్రంథము. ౯. పొక్కుటఁ జేయుచుండునము.

సీ. చిత్రజాగృహమున నుత్తరస్ఫుటితంబు, పొ
క్కుట సంపుటంబును శిరోధిననుపదం బూ
రుల సన్నిహితంబున కొప్పుదళచుంబనములు
దత్తత్ స్థలములఁ.... హంస. ౫-౧౨౭

**సంపుటించు.** సం. స. క్రి. ౧. ముకుళించు.

సీ. జయజయధ్వని దేవసంయమీశ్వరకోటి సం
పుటించెఁ గరాంబుజంబు నొసల. ధీ. ౪ ఆ.
(శ. ర.)

**సంపుటీకరణము.** సం. వి. అ. న. కప్పుట, మూఁతఁబెట్టుట.

**సంపుష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సమృద్ధి.

సీ. అతివుండు ప్రపన్నుఁ డయిన నెల్లరకును
బుష్కలాభ్యుదయసంపుష్టి బొదము.
నూతనసంహిత. అ. ౨. పు. ౧౧౧.

౨. ఎక్కువ బలుపు.

**సంపూజనము.** సం. విణ. ౧. స్తుతించునట్టిది. గౌరవించునట్టిది. వి. అ. న. ౧. గౌరవించుట. బహూకరించుట.

**సంపూర్ణకాముఁడు.** సం. వి. అ. పుం. ౧. నిండినకోర్కెలు గలవాఁడు. ౨. కోర్కెలతో నిండినవాఁడు.

**సంపూర్ణకాలీనము.** సం. విణ. అ. అ. సకాలమున సంభవించునది.

**సంపూర్ణము.**[1] సం. విణ. అఆఅ. నిండినది, సమగ్రము.

తే.గీ. బాల్యసంపూర్ణభావంబుపాయఁ బాయఁ,
దరుణయౌవనలక్ష్మి నర్తనము నూఁపె....
విరంతునా. ౨-౯.

**సంపూర్ణము.**[2] సం.వి.అ. పుం. స్వరగ్రామము లన్నియు నుపయోగింపఁబడు సంగీతవిశేషము.

**సంపూర్ణము.**[3] సం. వి. అ. న. ఆకాశము.

**సంపూర్ణమూర్ఛ.** సం. వి. ఆ. స్త్రీ. యుద్ధక్రియావిశేషము.

**సంపూర్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సంసిద్ధి ౨. ముగింపు.

**సంపృక్తము.** సం.విణ.అఆఅ ౧. సంయుక్తము ౨. మిశ్రితము. ౩. సంబంధించినది. ౪. స్పృశించినది. ౫. సనిహితసంబంధము కలది.

**సంపెంగ.** వి. చంపకము. రూ. సంపెఁగ.

వ. కరంబు సొంపారుసంపెంగలును.
శృం. నై. ౧-౯౫.

గీ. ఓరుగంటిపురంబులో నోరగ్రంతపెద్దయెలుఁ
గున నమ్మె సంపెంగనూనె. క్రీడా. ౧౧౧

గీ. పెలుచఁ దమదాయ యైన సంపెంగవిరిని....
యయా. ౪-౩౭

గీ. భోగబాహ్య మయ్యెఁ బూచినసంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె.
మను. ౧-౫౨

సీ. కొంత గుమ్మడు రేఁగు గోరమి సంపగి
కొండసంపెంగ మాఁరేడు సరకదేవ.
హంస. ౪-౧౧.

మ. సొఁదిం బేర్చినతీఁగమల్లియలు ఖర్జూరంబు
లం బుష్ప మంజరులు వ్రామిడిగుత్తులం
గుసుమముల్ సంపెంగలం బచ్చగన్నెరుల్
....చేలరుదార న్నగుఁబువ్వుఁదోఁటల ....
ఆము. ౧-౬౬.

౨. ధాన్యవిశేషముయొక్క పేరు.

**సంపెంగనూనె.** వి. సంపెఁగపూలరసముతోఁ దయారయినూనె.

గీ. ఓరుగంటిపురంబులో నోరగ్రంత, బెద్ద
యెలుఁగున నమ్మె సంపెంగనూనె.
క్రీడా. ౧౧౧.

గీ. వొక్కటంపు, టగరుసంపెఁగనూనెలు ....
హంస. ౫-౩౫౨.

**సంపెఁగ.** వి. చంపకము.

ఉ.... హిం,సారతి నీయదర్పకుని సంపెఁగ
ముల్కులఁబోలె మించఁగన్. మను. ౫-౭౪

**సంపెగనూనె.** వి. = సంపెంగనూనె.

ఉ. సంపెగనూనె యంటె నొకచంద్రనిభానన
కంపనైకతిన్. పారి. ౨-౯.

**సంపెఁగబంతి.** వి. √ (సంపెఁగ) సంపంగి పూఁతోఁ గట్టినబంతి.

ఉ. చన్నులు కుంభికుంభములు సంపెఁగబంతులు జక్రవాకముల్. విక్ర. ౩-౪౯

**సంపెట.** వి. సమ్మెట, ౧. ఇనుముసాగఁగొట్టెడి సాధనవిశేషము అయోఘనము (క. చమ్మట్టిగె త. చమ్మట్టి)

సీ. చటులంబులైన సంపెటలతాఁకులఁబోలి వణులతలంబులఁ జఱచి చఱచి.
భార యుద్ధ. ౧౧౭౭.

సీ. విటులగుండెలలోన విదళించు చిగురాకు సంపెటవ్రేటెందుసమసె నేఁడు.వీర.౨-౧౧౬.

ఉ. దాఁకటిమీఁదఁ బెట్టి బెడిదంబుగ సంపెట వేయ ... రత్న. ౯ర.
౨. చబుకు; కశ.

చ. గొనకొని మొత్తె సంపెటలఁ గొంకక నిర్దయ వృత్తిఁజేసి.... హరిశ్చ ౨-౧౪౧.

శా. ఏమేమీ మిము భూవరాధముఁడు దా నెంతే నహంకారియై భీమస్ఫూర్తిఁ గశాభిఘాతము లచే బిట్కాల్కా నొప్పించెనే.
హరిశ్చ. ౨౧౪౨.

**సంపేషణము.** సం. వి. అ. న. ౧. విసరుట. ౨. దంపుట ౩. రుబ్బుట.

**సంప్రకాశించు.** సం. అ. క్రి. ౧. ప్రజ్వరిల్లు ౨. ప్రకటమగు; బయల్పడు.

గీ. సంప్రకాశించువిరహాగ్ని సాక్షిగాఁగ, బాణకన్యానిరుద్ధుల పరిణయంబు, వర్ధిగావించె మకరమీనాధిపతులు,యదను దెలిసినననింటి యాప్తకుండు. అనిరుద్ధ ౩-౭౬.
ప్రచురితమగు. ౪. వెల్లడియగు.

**సంప్రక్షాళనము.** సం. వి. అ. న. స్నానము చేయుట.

**సంప్రజ్ఞాతము.** సం.వి.అ. పుం. సవికల్పసమాధి (వ్యతి. అసంప్రజ్ఞాతము)

**సంప్రణీతము.** సం. విశే. (అఆఅ) రచింపఁబడినది ౨. ఒకచోఁ జేర్పఁబడినది.

**సంప్రణేత.** సం. వి. ఋ. పుం. ౧. న్యాయాధికారి ౨. పాలకుఁడు. ౩. నాయకుఁడు. ౪. సేనాని. ౫. పోషకుఁడు.

**సంప్రతాపనము.**[1] సం. విశే. ౧. దహించునది వేఁడిచేయునది. ౨. బాధించునది.

**సంప్రతాపనము.**[2] సం. వి. అ. న. ఒకనరకము

**సంప్రతి.**[1] ౧. లెక్కలుసరిచూచు పెద్దకరణము వాఁడు, లెక్కవ్రాయువాఁడు, గణకుఁడు.
తే. సంప్రతులఁ బిల్చి యున్నిలక్షలకుఁ గలదు. రాజ్య మెన్నన్ని గలవు దుర్గస్థలములు బొక్కసంబునఁ గలధనభూషణాది, వస్తువులు నశ్వ వేదండవర్గ మెంత. కృష్ణ. ౨-౬౭.

**సంప్రతి.**[2] విశే. ఈడు, సమానము.

చ. వెలఁతి మొగంబు చందురుని మెచ్చునకంబులు కుందనంపుబిందెల కగు సంప్రతుల్ తరుణదెందుకన్నులు చిత్తరంపుఁగ,వ్వల పారు గింద్రనీలపుసళాకలవంగదమారుతీవ....
చమత్కా. ౨-౪౨.

**సంప్రతి.** సం. అవ్య. ౧. ఇప్పుడు ౨. వెంటనే. ౩. సరిగా.

**సంప్రదించు.** స. క్రి. ౧. సరిచూచు.

సీ. చరణద్వయీభూరిసౌభాగ్యసంపదఁ బరిభవింతురు హేమపద్మవనము, ఘననితంబస్థలీ గౌరవాఢ్యస్థితి సంప్రతింతురు నదీసైకతముల గంభీరతర నాభిగర్తవిభ్రమముల ప్రకటింతురు జలావర్తశోభ. భీమ. ౧-౯౧.

౨. లెక్కమొదలైన సరిచూచు౩.సలహాఅడుగు.

**సంప్రతిపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. వచ్చుట, ౨. సన్నిధి ౩.లాభము. ౪.పొందుట. ౫. ఒడంబడిక ౬. అంగీకరించుట ౭. ఎదుర్కొనుట ౮. పైఁబడుట. ౯. సంభవించుట ౧౦. సహకారము ౧౧. చేయుట. ౧౨. సమయోచితబుద్ధి

సంప్రతిపన్నము. సం. విణ. అఆ. ౧. సమీపించినది. ౨. అంగీకరింపఁబడినది.౩.చేయఁబడినది.

సంప్రతిపాదకము. సం. విణ. ఇచ్చుట.

సంప్రతిభాసము. సం. వి. అ. పుం. సమన్వయజ్ఞానము.

సంప్రతిరోధకము. సం. వి. అ. న. పుం. ప్రతిబంధకము, నిర్బంధము, చెఱ.

సంప్రతిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. ఉన్నతస్థితి, పట్టుదల.

సంప్రతిష్ఠించు. సం. స. క్రి. చక్కఁగానిలుపు.

గీ. చెప్పనేటికి సకలసంసిద్ధిఁ గోరి, దక్షిణాంభోనిధానంబుకటమునందు సంప్రతిష్ఠింపుఁడీశాను జంద్రమౌళి, విశ్వలోకాధనాధనోవిబుధులార. భీమ. ౩-౯౯.

సంప్రతీక్ష. సం. వి. ఆ. స్త్రీ. ఎదురుచూచుట. ఆకాంక్ష.

సంప్రతీతము. సం.విణ.(అఆఅ)౧.తిరిగియియ్యఁబడినది. ౨. విశ్వసించినది. ౩. అంగీకరింపఁబడినది. నిరూపింపఁబడినది. ౪. సుప్రసిద్ధమైనది.

సంప్రతీతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. పరిజ్ఞానము ౨. సమ్మతి. ౩. ప్రసిద్ధి.

సంప్రత్యయము. సం. వి. అ. పుం. ౧. ఉద్దేశము. స్థిరవిశ్వాసము.

సంప్రత్తి. సం.వి.ఇ.స్త్రీ. పూర్తిగానొప్పగించు.

సంప్రదానము. సం. వి. అ. న. ౧. చక్కఁనియీవి, ౨. ఒకానొకకారకము (చతుర్థి) ౩.కన్యాదానము.

సంప్రదానీనము. సం. వి. అ. న. ౧. దానము. ౨. కానుక.

సంప్రదాయనిగమము. సం. వి. అ. పుం. ఆచారక్షయము.

సంప్రదాయప్రద్యోతకుఁడు. సం.వి.అ. పుం. వేదసంప్రదాయప్రకాశకుఁడు.

సంప్రదాయము. సం.వి.అ.పుం.౧. ఆచారము.

గీ. పరమయోగివరేణ్యు నిర్భరసమాధి, సౌఖ్యసంపద నిరపాయసంప్రదాయ,సిద్ధిఁ దిలకించుచోట నశేషభవనవివిధధర్మంబు లావిర్భవించుచోట. పాండు. ౩-౧౫౮.

ద్వి. తరుణి! మీగురుసంప్రదాయంబువారు ధరణి నేతావునఁ దపము సేయుదురు? బసవపు. ౩. -౧౩౭.

౨. పరంపరాగత జ్ఞానము. ౩. ప్రత్యేకమతబోధన విధానము. ౪. రూఢమైనవ్యవహారము. ౫. సంప్రదానము. ౬. గురుపారంపర్యము.

సంప్రధానము. సం. వి. అ. న. ౧. నిజము తెలిసికొనుట, ౨. పరిశీలనము.

సంప్రధారణ. సం. వి. ఆ. స్త్రీ. ౧ ఔచిత్యానౌచిత్యనిర్ణయము, ౨. సమాలోచనము.

సంప్రధారణము. సం. వి. అ. న. వ్యవహారనిశ్చయమునకుఁ దోడ్పడులిఖితసాక్ష్యాదులు.

సంప్రపదము. సం. వి. అ. పుం. న. ౧. మునిప్రేళ్ళపైనిలుచుట, త్రిమ్మరుట.

సంప్రపన్నము. సం.విణ.(అ. ఆ. అ) ౧. నిశ్చయమునకు వచ్చినది. ౨. కూడినది.

సంప్రభవము. సం. వి. అ. పుం. ౧. ఉదయించుట. ౨. ప్రత్యక్షమగుట.

సంప్రభిన్నము. సం. విణ. ౧. బద్దలైనది, ౨. మదావస్థలోనున్నది.

**సంప్రమాపణము.** సం. వి. అ. న. చంపుట.

**సంప్రమార్గము.** సం. వి. అ. పుం. పరిశుభ్రము చేయుట.

**సంప్రముగ్ధము.** సం. వి. అ. న. ౧. అలజడి ౨. కలఁత.

**సంప్రమోదము.** సం. వి. అ. పుం. అధికసంతోషము.

ఆ. సంప్రమోద మంచు సాత్యవతేయుని,ఁ గని ప్రదక్షిణంబెగాఁగ వచ్చి యరుగ నుత్సహించె నారణేయుఁడు.... భార. శాంతి. ౬-౩౨౩.

**సంప్రమోషము.** సం.వి.అ. పుం. ౧. నష్టము. ౨. వినాశము.

**సంప్రమోహము.** సం. వి. అ. పుం. ౧. సంక్షోభము. ౨ కలవరపాటు.

**సంప్రయాణము.** సం. వి.అ.న. విడిచి వెళ్ళుట.

**సంప్రయుక్తము.** సం. విశే. (అ. అ. అ) ౧. పూన్పఁబడినది; కట్టఁబడినది. ౨. కలుపఁబడినది. ౩. సాంగత్యముకలిగినది.

**సంప్రయుక్తకము.** సం.విశే. (అ ఈ అ) సహకరించునది.

**సంప్రయోగము.** సం. వి. అ. పుం. ౧. కలయిక ౨. నాటకప్రదర్శనము ౩. సాంగత్యము. ౪. కట్టుట ౫. పరస్పరబంధము ౬. పరిపాటి ౭. మైథునము. ౮. ఇంద్రజాలము. ౯. సహకారము. ౧౦. చిల్లంగిపెట్టుట.

**సంప్రయోగి.**[1] సం. విశే.(న్.నీ.న్) ౧. కలుపునట్టిది. ౨. కామవ్యసనము కలది.

**సంప్రయోగి.**[2] సం. వి. న్. పుం. ౧. కలుపువాఁడు ౨. మాంత్రికుఁడు ౩. స్వేచ్ఛావర్తనుఁడు ౪. పోకిరి.

**సంప్రయోగించు.** సం. స. క్రి. ౧. (బాణము) ప్రయోగించు ౨. ఏయు ౩. పఱపు.

వ. కాండప్రకాండములు సంప్రయోగించి రథరథ్యకేతుసూతచ్ఛత్రాతపత్రంబుల మర్మఘాతంబు లొప్పించుచు. అని. ౪-౫౫.

౪. చిల్లంగిపెట్టు.

**సంప్రవదనము.** సం. వి. అ. న. ౧. (పరస్పర) సంభాషణము, ౨. సంవాదము.

**సంప్రవర్తనము.** సం. వి. అ. న. చక్కనినడక చక్కఁగానుండుట, చక్కఁగాజరుగుట.

**సంప్రవర్తిల్లు.** సం.అ. క్రి. వర్తించు, చక్కఁగా నడచుకొను.

వ.... ...ఆ ద్విజాతికగ్రుండు సమ్యగంగీకృత సామ్రాజ్యుం డయి జనసంపూజ్యుం డగు చరితంబున సంప్రవర్తిల్లుచుండె.
భార. అను. ౫-౪౪౯.

**సంప్రవృష్టము.** సం. వి. అ. న. సంపూర్ణవర్షపాతము.

**సంప్రశ్నము.** సం. వి. అ. పుం. ౧. కుశలమడుగుట. ౨. అడుగుట. ౩. ఆశ్రయము; శరణు (వేద)

**సంప్రశ్రయము.** సం. వి. అ. పుం. వినయము. అడఁకువ.

**సంప్రసాదము.** సం. వి. అ. పుం. ౧. వేడికోలు. ౨. అనుగ్రహింపఁజేసికొనుట. ౩. అనుగ్రహము. ౪. ప్రశాంతి. ౫. విశ్వాసము.

**సంప్రసాధనము.** సం. వి. అ. న. ౧. భూషణము, అలంకరణము. ౨. సుష్ఠుగా నిర్వహించుట లేక ఆచరించుట.

**సంప్రసారణము.** సం. వి. అ. న. ౧. య వ ర ల లు, ఇ ఉ అర్ అల్ లుగాఁ బరిణమించు వ్యాకరణ సంప్రదాయము. ౨. చక్కఁగా వ్యాపింపఁజేయుట.

**సంప్రసారుఁడు.** సం. వి. అ. పుం. కార్యములు చక్కఁగా నిర్వహించువాఁడు.

**సంప్రసిద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. విజయము. ౨. అభ్యుదయము.

సంప్రస్థానము. సం. వి. అ.న. ౧. వీడిపోవుట. ౨. పురోగమనము.

సంప్రహారము. సం. వి. అ. పుం. ౧. పరస్పర తాడనము. ౨. మార్కొనుట, యుద్ధము, సంఘర్షణ. ౩. గమనము, చలనము.

సంప్రహాసము. సం. వి. అ. పుం. పరిహాసము, హేళన.

సంప్రాణించు. సం.అ.క్రి. ప్రాణములతోఁగూడు, బ్రదికియుండు.

సీ.... తరువులు దనిగాడ్పు తపనరుచులు, గాంచి సంప్రాణించి క్రమ్మఱఁ గొమ్మల గదలించి నర్తనక్రమ మొనర్చు. హరి.పూ. ౪-౧౭౬

సంప్రాపించు. సం.అ.క్రి. ౧. చేరు. ౨. పొందు ౩. సంపాదించు. ౪. కలుగు.

క. పాపాత్ముల దండింపని, క్ష్మాపతి కాపాపమునను మద్భాగము సం, ప్రాపించుఁ గాన ధరలోఁ, బాపము లేకుండ నరసి ప్రజఁ బ్రోవఁదగున్. ఉ. రా. ౭-౫౦౨

౫. కలసికొను. ౬. తారసిల్లు. ౭. కలహించు.

సంప్రాప్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చక్కఁగాఁ జేరఁబడినది. ౨. చక్కఁగాఁ బొందఁబడినది.

క. అనఘా తపోవనమునన, జననంబును మరణదశయు సంప్రాప్తము లయ్యెనయేని వాఁడు ముక్తుఁడై, మనంబు బహుశామవిశ్రుతిమగ్నంబైనన్. భార. శాంతి. ౬-౫౩౮

గీ. బ్రహ్మ బ్రహ్మపదైకసంప్రాప్తి దగుట. సూతసంహిత. అ. ౨ పు. ౧౧౦

౩. సకాలమునఁ జేరినది. ౪. ఉత్పన్నమైనది.

సంప్రాప్తి. సం.వి.ఇ.స్త్రీ. ౧. లబ్ధి. ౨. ఆర్జన. ౩. సంపాదన.

సంప్రాప్తించు. అ. క్రి. లభించు, కలుగు.

మ.... ఎటు సంప్రాప్తించె సౌభాగ్య మీసతికంచున్.... ఉ. రా. ౨-౩౧౨

సంప్రార్థన. సం. వి. ఆ. స్త్రీ.=సంప్రార్థనము. (అ.ని.) వేడుకోలు.

సంప్రార్థించు. సం. స. క్రి. వేఁడు, వేఁడుకొను.

క. చని సంప్రార్థించి యతనిఁ, గొని రుద్రునిఁ గాంచి. భార. శాంతి. ౩-౧౧౩

శా. స్వారాజప్రముఖామరప్రవరులన్ వర్జించి లజ్జాపరీ, హారంబుం బొనరించె రాజులను సంప్రార్థించి తా దేవన, త్కారంబై యికనిన్వాంఛిచవివేకప్రాప్తిఁ దద్దేవతా, హీనోపాపయశఃప్రమార్జన మొనర్చెన్ భైమి మేలెంతయున్. నైష. ౬-౩౮

సంప్రార్థ్యము. సం. విణ. (అ.ఆ.అ.)

మ. పదియేనింటఁ బెనంగుబాల జనసంప్రార్థ్యంబులై బెంపుసన్ దుదిముట్టన్ రచియించుటొప్పు బుధసంతోషంబు నిండారఁగన్. భార. విరా. ౧

సంప్రియము. సం. వి. అ. న. తృప్తి.

సంప్రీతి. సం.వి.ఇ.స్త్రీ. ౧. ప్రేమానుబంధము. ౨. అనురాగము. ౩. స్నేహపూర్వకమైన అంగీకారము. ౪. ఆహ్లాదము, ఆనందము.

శా.... సంప్రీతిం బొందితి వేఁడు మిప్పుడు మనోభీష్టంబుల న్నావుకున్. షోడశ.కు. ౪-౧౫౪

సంప్రేక్షణము. సం.వి.అ.న. ౧. పరిశీలించుట. ౨. చూచుట. ౩. ఆలోచించుట. ౪. పరిశోధించుట.

సంప్రేషణము. సం.వి.అ.న. ౧. ద్వాదశాహ శ్రాద్ధము. ౨. పంపుట. ౩. వార్తను పంపుట.

సంప్రైషము. సం. వి. అ. పుం. ౧. పంపివేయుట. ౨. ఆజ్ఞ, శాసనము, నిర్దేశము. ౩. నియోగము.

సంప్రోక్షణము. సం. స. క్రి. ౧. నీరు చల్లుట. ౨. అభిషేకించుట. ౩. శుద్ధిచేయుట.

**సంప్రోక్షించు.** సం. స. క్రి. ౧. చల్లు, నీళ్లు చిలుకు. ౨. శుద్ధిచేయు.

వ....కూల్ప్రోక్షం బైనశవంబు నొక్కెడఁ బుచ్చి ఖడ్గంబుని కెందుఁ ప్రయ్యలుగాఁ జీరి కొరిమఁ దట సమర్పించి సలిలంబున సంప్రోక్షించి ఖడ్గంబుఁ దొలఁగఁ బెట్టి చేతులు మొగిడ్చి. హరి. ఉ. ౫. ౨-౩౭

**సంప్లవము.** సం. వి. అ. పుం. ౧. మునుఁగుట. ౨. వరద. ౩. శిథిలమగుట. ౪. ధ్వంసము.

సీ. శివయోగి కెలమి నిచ్చినదాన మాభూతి సంప్లవస్థాయిశశ్వత్ఫలంబు. శివధర్మ. ౩-౩

౫. క్రమరహితమైన కూర్పు. ౬. గుంపు. ౭. జడివాన. ౮. సంక్షోభము. ౯. ముగింపు.

**సంప్లుతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. వెనుకనుండి యేపుఁగుపై నెగురుట. ౨. చక్కఁగా నెగురుట

**సంఫాలము.** సం. వి. అ. పుం. పొట్టేలు.

**సంఫుల్లము.** సం. విశే. చక్కఁగా వికసించినది.

**సంఫేటము.** సం. వి. అ. పుం. ౧. కోపముతో కూడిన పోరాటము. ౨. క్రుద్ధుల పరస్పరసంఘర్షణము వర్ణింపఁబడు సన్నివేశము.

**సంబంధము[1].** సం. విశే. (అ.ఆ.అ.) ౧. సమర్థమైనది. ౨. తగినది. ౩. సరియైనది.

గీ. వీరు వారును సంబంధవిషయులంచు, లగుట సరిగాని హాసి. భార. ఉద్యో. ౪-౧౭౦

**సంబంధము[2].** సం. వి. అ. పుం. ౧. కలయిక. ౨. చుట్టరికము.
౩. వివాహసంబంధము.

శా. సంబంధం బిటు గూడఁ జే రమణికిన్ ష్మాభర్తకున్ క్షేత్రపర్వంబై యుండె స్వయంవరంబు. శృం. నై. ౬-౭౭

౪. షష్ఠీవిభక్తి సూచించు సంబంధము. ౫. నవవిధ సంబంధములు ( ౧. పితాపుత్రసంబంధము. ౨. రక్ష్యరక్షకసంబంధము. ౩. శేషిశేషసంబంధము. ౪. భర్తృభార్యాసంబంధము. ౫. జ్ఞాతృజ్ఞేయ సంబంధము. ౬. స్వస్వామి సంబంధము. ౭. శరీరిశరీర సంబంధము. ౮. ఆధారాధేయసంబంధము. ౯. భోక్తృభోగ్య సంబంధము. (
౬. స్నేహము. ౭. ఔచిత్యము. ౮. జయము. ౯. వైభవము. ౧౦. సంకలనము. ౧౧. సంపుటము.

**సంబంధకము.[1]** సం. విశే. (అఆఅ) ౧. సంబంధించినది. ౨. తగినది.

**సంబంధకము.[2]** సం. వి. అ. న. ౧. కలయిక ౨. ఒకవిధమైనసంధి.

**సంబంధకుఁడు.** సం. వి. అ. పుం. ౧. మిత్రము. ౨. రక్తసంబంధి ౩. వివాహముద్వారా ఏర్పడిన చుట్టము.

**సంబంధి.[1]** సం. విశే. (న్ సన్) ౧. సంబంధము కలది. ౨. అనుబంధించినది. ౩. ఒకదానితో చేరియున్నది. ౪. సహజమైనది. ౫. సద్గుణములు కలది.

**సంబంధి.[2]** సం. వి. న్. పుం. ౧. వియ్యంకుఁడు.

వ.... పాంచాలవిభుండు సంబంధితో వలయు మాట లాడందగువారలఁ బనిచి రావించి. భార. ఉద్యో. ౪-౩౯౧.

౨. చుట్టము. బంధువు.

మ. శరతల్పంబున నున్న శాంతనువు సాక్షాత్తప్పరుండై యుధిష్ఠిరుతో నర్జునుఁ డిట్లనున్ హరిఁ బ్రశంసింపంగ రాకే మునీ, శ్వరులన్ ద్వారక కేను బోయితిఁ గదా సంబంధులం జూడ నాఁ దరుదా దేవునియందుఁ గంటి నొక కృత్యం బెవ్వరుం జేయరున్. ఉ.హరి. ౨-౩

**సంబంధించు.** సం. అ. క్రి. ౧. కూడు, కలియు.

వ. విష్ణాణంపు గొల్పుటెలుంగులును వేల్పుగాణలు పాడుఁ లక్ష్మీనారాయణుల కల్యాణంపుఁబాటలనుదీటుకొనుతిన్న నిరవంబులు నలసి బలసికొన కోలాహలము లిమ్ముగ సందడుల నెడగలుఁగ నడియు వేత్రహస్తుల సాహో నినాదంబు సంబంధించి పెంపొలయ. మను. చ. ౫-౭౧

౨. బంధించు; నిరోధించు.

ద్వి. ప్రాణునపాను సంబంధించి యాత్రికోణ
కుండలి మేలుకొల్పి యందుండి, పశ్చిమవాడి
కాపథమును గోరి, నిశ్చంచలతఁ ద్రివేణీసం
గమంబు. ప్రభులింగ. ౨ ఆ. ౮౦ పు ౨౩పం

**సంబంధుఁడు.** సం. వి. అ. పుం. చుట్టము, దగ్గఱి చుట్టము.

**సంబడ (ళ) ము.** వి. (సం. శంబలమ్, ప్రా. సంబలి త. చంపళం. క. సంబళ. మ. చంబళమ్) ౧. వేతనము, బత్తెము.

తే. భూవరుం డోకపయనంబు పొమ్మటన్న,
మంచిదని వచ్చితిని సమ్మతించి నేను, సంబ
ళము కంబళముకత్తి చక్తి చల్లదంబు వేడం
బుఁగట్టి తెమ్మంబుజాక్షి. హంస. ౧-౨౨౬

తే. అడుగడుగు కెఱఁగుచుఁ గాఁక కదుపుకూటి,
బంటుగములకు రవళిసంబళము లొసఁగ,
నిందుమురువున నోకతై దండఁబూని, పతి
కడకు వచ్చి నిలిచె వారతివధూటి.
చంద్రాంగ. ౩-౫౩.

సీ.... సంబళంబు లొసంగి సంతరింపఁగ లేమి
విడిచి పోవఁదొణంగె విబుధబలము.
దశా. ౨-౫౧.

ద్వి. కూర్మిఁ గూర్చుండక కొలుచువారలకుఁ
బేర్మి సంబలము విప్పింపక జనుల మనవులు
వినక. నల. ౧-౧౦౦౬.

తే. అడవిదుంపరి కాని సంబడము లొసఁగఁ,
గానుకీసంబు చేత పెక్కడను లేక, మసువఁ
గోల్పోయి కడునిడుమలఁ గలంగు వలఁతి
దొరఁ గొల్వఁగఁదగు పెంగలులు గలరె.
అ. రా. సుందర. ౧౫౮

౨. పాథేయము, దారిబత్తెము.

వ. అయస్థిపేటికయు లోహండియుఁ దండులం
బులు గంబళంబులుం దగిన సంబడంబును వ
హించి యొక్కరుండును దరువుతోడునం
బెక్కుదేశంబులు గడచి. కాశీ. ౫-౬౨.

క. అనతిఁ శ్రీభండారాన సంబడము తవడు
ప్రాయండలమున్. ఆము. ౭-౯౫.

సీ. తీర్థంబులకు నేఁగుదీనమానవులకు వేమైనసం
బళం బిచ్చినతఁడు వనజహితపుత్ర నీపురం
బునకు రాఁడు. సుక్యాం. ౨-౭౭.

ఉ. తపమునకుం గుశాసనము దానపువిత్తు ఫలించు
పాదు నిక్కపుసుఖసిద్ధిఁ గోరి వెదకందగు
వాకర మజ్జజాదివిష్టపములకెల్ల సంబళ మొం
గాదు పాలెము మర్త్యము. కవి. ౬-౩౭,

గీ. కాశికాక్షేత్రమున కేగుఘనుల కితఁడు, సం
బళంబులఁ బాదరక్షలు నొసంగు. ధర్మబు
ద్ధిని భద్రరుద్రాక్షమణులు, దానమిచ్చిన వీన
మందారుఁడతఁడు. సానందో. ౧.అ.

క. పదతుక లిచ్చుటఁ గలరని. తడవుచే రాకున్న
విడుతుఁ దనువు నికేశా! గీ. అనుచుఁ గం
దర్పసంక్రీడ నాత్మనాథు నుల్ల మలరంగ
పేర్పుల నోలలార్చి, చలిదియును సంబడంబును
జాల నొసఁగి, ప్రొద్దుగ్రుంకెడునంతన పుచ్చె
నతని. పంచ. నా. ౩-౨౨౩.

క. ఏలిన యీకేరళనర,పాలుఁడు నా కాన
తిచ్చెఁ బయనము చాలన్, గాలవిలంబన
మోమహిళాలిలం దెమ్మ సంబళముఁ గంబళ
మున్. వెం. పంచతం. ౩-౨౩౨

తే. పోయి వచ్చెద నీపదాంబురుహచింత,
నాకుఁదగు సంబళము గాఁగ నలిననాథ.
జై. భా. ౧-౧౩౩.

౩. ఆయుధవిశేషము.

వ. కేత్రికోణంబుల నగ్నికణంబులు రాల నీక్షించి
యురలు పెదలంగ నడిదంబులు పెతికి జళి
పించియు సంబళంబులు ద్రిప్పియు.
మైరా. ౩-౨

**సంబరము.**[1] వి. (సం. సంభ్రమః) ౧. తొందరపాటు

ద్వి. హరుఁడు దాబడి వెట్టునది తథ్యమేని, వంచి
నీకుతుఁడును బ్రతికెడుగాక సంబరపడ నేల
చర్చింప నేల వండితా. మహిమ. ౨౯౧.

తే. గొప్పహుంకరముం జేసుప్రాణికూర్పసంభ్ర దంబు పగదంబు జగదంబు సంబరంబులెసఁగ నగు డాల్లగలుగు నవ్వనుమతీశు పాశిమి త్రించి గజరాజు భయముమించి. కృష్ణ. 3-౭౫.

3. సంతోషము.

వ. పాండుడిండీరఖండమండలంబులు సంబరం బులు పొదలింప సమసియు నక్కాలంకు మహి తాబ్జకామినీజాలప్రాజేసంబు గావున నశి మిథునమీనకుళీరమకరాదిసంయుతంబై.

౪. వేడుక.

వ. ఏగుఁ బెండ్లి శృంగారరసంబు సంబరాలదిను మున దిక్కులు బిక్కటిల్ల....
ప్రబం. ౧-౭౫౫.

**సంబరము.**[2] సం. వి. అ. పుం. ౧. అనకట్ట ౨. వంతెన 3. ఒకజాతిలేఁడి.

**సంబరము.**[3] సం, వి. అ. న. ౧. విగ్రహము. ౨. నీరు 3. బౌద్ధుల మతాచారవిశేషము.

**సంబరి.**[1] అవ్య. చూడు:- సంబళి,

**సంబరి.**[2] సం. ఈ. స్త్రీ. ఎలుకజీడి i

**సంబరేను.** వి. చర్మకము. చర్మకవ i

వ.... చర్మకం, బలరును సంబరే నసఁగ.
ఆం. శ. అవర. ౯౭.

**సంబలము.**[1] సం. వి. అ. పుం. పాథేయము, దారిబత్తెము.

**సంబలము.**[2] సం. వి. అ. న. జలము.

**సంబళికాఁడు** వి. ( √ సంబళము) జీతకాఁడు

**సంబళము.** వి. కూలి.

క. సంబళమ్మునవ వేశనమై. ఆం. ప. నర. ౧౧౭.

గీ. అంటుపడి వచ్చెనావు మ మ్మంట కేఁగి, కొని మాసంబళములు తత్ప్రభుని కొసఁగు మంటు పడదేదటంచు మి మ్మంటి యిభుడు బాస శెల్లను కేసెద భానురాంగి. రాథికా. ౪-౧౧.

**సంబళి.** అవ్య. తొలఁగుము. రూ. సంబళీ.

తే. మొగముపైఁ జిమ్మచీఁకటి ముడివడంగ మాటిమాటికి మీసాలు దీటుకొనుచుఁ, జనిరొ సంబళి సంబళి యనుచుఁ బంకి, జాపక్తులు పుంగవుఁడు వచ్చునంగడికిని.
హంకళ్ళం. ౪-౭౧౫.

ఉ.... కొమరుమూలత గన్నుల నవ్వుదేరఁగా సంబళి సంబళీ యనుకుసందళికిం దలమంచుఁ బల్కుచున్. శివరాత్రి. 3-౪౦.

క. ఇలఁ గొలఁదట్టుచున్ సం, బళి సంబళి యనుచు గ్రంమువడుజనములకు స్డొలఁగుచు నొదుగును సాధూ, తపతికడ కరుగుచుంచి తా నిట్లనియెన్ మార్క. ౧-౭౭౫.

**సంబళించు.** అ. క్రి. (రూ. సంబడించు) (గు. సంబళియు) చాలు, సమర్థమగు.

వ. విష్ణుని మాయవలన నెందును గాన్కాని నిలువ సంబళింపక శతసహస్రసంఖ్యల యేండ్లు చరియించియుం గుక్షిలోఁ గడపలఁ గానఁడయ్యె నతని నివ్విధంబున.
హరి. ఉ. ౯-౯౫.

క. అకటా యని చింతింపుచు, వికచకుచల్ నిలువ సంబళింపక శుకముం, బికమున్ మల యానిలశాబకమున్ మదిఁ దలఁచి వినయ పాటవ మమరన్. వేం. పంచతం. ౪-౧౭౭.

**సంబళించుకొను.** అ. క్రి. తేలుకొను.

వ. పగతుండు గన్నుదిరిగి పెస్తుగ్రక్కుచు గ్రక్కున నొత్తిగి యంతలోనన సంబళించు కొని మొగసి బొంకు బొంకని గూర్చుచుండ గడంగిన నద్దెస యోధులతని కడ్డంబు వచ్చిరి.
హరి. ఉ. ౭-౫౭.

**సంబళిక.** (సం. సంపుటకః క. సంబళికి వి. అద పము, వక్కలాకులతిత్తి, తాంబూలము.

ఉ. వాదులగెల్చువాలు చెలువంబుగ దాల్చిన పూలు వొప్పఁగా సాదొరయొద్ద సంబళిక లందుచునుండు నతండుధీరతన్.
హంస ౧-౨౧౭

**సంబళికె.** వి. సంబళిక.

సీ. సైన్యనాయకమాన్యసచివపురోహితబంధు
వర్గముల సంబళికెలకును.ఉ.హరిశ్చ.౧-౬౫.

**సంబవులు.**[1] వి. బ. ౧. పావకోళ్ళు.

వ. అనంతరంబ ! కుంభభవపులినసంభవులు సం
బవులు దొడిగికొని కదలి. భీష్మ. 3.

౨. పాదరక్షలు.

సీ. శశిఁ దెస్తుమే నీకు సంబవు విడియుండ, ధన
నాథు దెస్తుమా దానుఁ జేసి. కుమా. ౬-౧౭.

ఉ. కాయజవైరిభక్తులకుఁ గాయము చర్మము
నొల్చి సంబవుల్ సేయఁగఁజాలు. చెన్నబస

**సంబవులు.**[2] వి. బ. ధాన్యవిశేషము.
సీ.సాలుఁక లుంగులాజనములు సంబవు లనె సర
దాన్లిమోహనపుసకులు.హంస ౪.౧౨౭.
సంభావులు (ముద్రి) సంభవులు (వ్రా)

**సంబాకృతము.** సం. విణ. (రూ.శంబాకృతము)
రెండుచాళ్లు దున్నినది.

**సంబాగవు.** వి. ఏఱుదాఁటెడు సాధనము.

**సంబాధకము.** సం. విణ. ౧. ఒంకొంటి నొర
యునది. ౨ గుమిగూడునది.

**సంబాధన** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒఱయుట
౨. కొంచుట.

**సంబాధనము.** సం.వి.అ.న. ౧. అడ్డుపెట్టుట.
౨. అడుముట. 3. అడ్డు. ౪. శూలాగ్రము.

**సంబాధము.** సం. వి. అ. పుం. ౧. ఇఱుకు.
౨. ఒరపిడి. 3. ఆటంకము. ౪. అపాయము.
౫. నరకమార్గము. ౬. భయము. ౭. అదుగుటి.
విణ. ౧. ఇఱుకైనది. ౨. జనులచే నిండినది.

వ. వీథులు సంబాధంబులు గావున హేయం
బులై యున్నయవి, నీ. యా. పు. ౯

**సంబాగము.** వి. (సం.సంభారః) ఉప్పు,కారము
మొ॥నవి, వేళవారము, ఉపస్కరణ ద్రవ్యము.

సీ. సంబారములతోడి శాకపాకములతోఁ బెక్క
మైన పెసరపప్పుతోడ.... భీమ. ౧-౬౦

సీ. కలయుసంబారాలు వడియాలు బలియించి,
దళమైనక్రొవ్వుతోఁ దాలఁబోసి.
హర. ౨-౧౨౧

సీ...వడిఁ బెట్టిరోఁ జెఱకదము సాఁబా లూన్పఁ
జెలఁగు సంబా రంపుఁ జింతపండు.
అము. ౨-౯౭

గీ. సకలసంబారములతోడఁ జంద్రఖండ,పాండు
రంబైన దక్షతోడ బ్రాహ్మణులకు, భోజనం
బిడు ద్వాదశిపుణ్యవేళ,సద్గుణాలంబ నంబుకి
శంకరాంబ. జాహ్నవి. ౧-౯౫

ఉ. కూరలు సన్నబియ్యమును గుడ్డులఁకోళ్ళును
జింతపండు సం, బారము లుప్పు నెయ్యి
లుపుఁబప్పు మొదల్గాని తెచ్చి.
శుక. 3-౧౫

**సంబారు.** వి. ఉపస్కరము.
సంబారన వేశవారము ....
ఆం. ప. పరి. ౫౨

**సంబాళించు.** స. క్రి. (త. సమాళి, క. సంబా
ళిసు, హిం. సంభాల్నా.) అదకించు.

శా. ఒయ్యారమ్ములతోడి యుక్కులికి నేత్రో
త్ఫుల్లవిమ్ముల్లలెల్, వెయ్యారమ్ముల కమ్మ
వింటిదొరకున్ వెచ్చించు బొమ్మంచులం,
బయ్యాదుందలమంచుబింబములసంబాళించుఁ
గొమ్మావిడా, లియ్యాఁదుందలమిన్న చన్నుఁ
గవతో నీడా గిరీడావరుల్.
పాంచాలీ, ౨-3౯

**సంబుఁడు.** వి. (సం. శమ్భుః) శివుఁడు.

ద్వి.నంబియు గింబియు నంబికి కూర్చు సంబుండు
గింబుండు సకలభక్తులకు వెలియుఁజాండోయని
జేయించ ఘంట.
బస.పురా. ౧౦౫ పు. ౨ వం.

**సంబుద్ధి.** సం.వి. ఇ. స్త్రీ. ౧. పరిపూర్ణజ్ఞానము.
౨. పూర్ణచైతన్యము. 3. పిలుచుట. ౪. సంబో
ధన ప్రథమావిభక్త్యేకవచనము. ౫. గుణవాచ
కము.

**సంబెట.** వి. ౧. సమ్మెట.

సీ....సంబెట సమ్మెట యనఁగను శంబళంబు.
ఆం. వ. పరి. ౯౩

వ. లోకమాతచేతిలవణిపెట్లచేఁ జెల్లాచెదరగు పసిఁడిచిప్పలశోభతోన గులగులలైన శరీరంబులతోడ సోలుకీలాలఫుఋసంబెట నడిచిన వెదలుమిడుంగుఋలతోడి యినుపకటచుట్టంబులైరి.
వరాహ. ౧౧-౧౦౫

౨. చబుకు.

ద్వి. అవనీశతివయుంచు నట్లకా కనుచు, జవనాశ్వములమీఁద సంబెట వైచి, అరయ మాలునఁ బట్టెఁటుండఁ నరుని, అరదంబుఁ దోలఁ దయ్యెక భీష్మమీఁద.
విరాటపర్వము ౪ అ. ౪౩ పు.

**సంబెరము.** వి. ౧. సానుభూతి.

చం. వే, ర్పువరతితోడ సంబెరము బాష్పవిధంబునఁ బొర్చె భూజముల్. కు. సం. ౫-౭౩

౨. జలాంజలి.

గీ. సంబెరం బిచ్చె రతిదేవి శంబరారికి.
హర. ౩-౯౨

**సంబెరమిచ్చు.** అ. క్రి. (√ సంబెరము) ౧. సానుభూతి చూపు. ౨. జలాంజలి యిచ్చు.

తే. గీ. సంబెరం బిచ్చె రతిదేవి శంబరారి కమలిన....
హర. ౩-౯౨

**సంబెల.** వి. వక్కలాకుల తిత్తి.

గీ. బాలుబొజ్జయు నునుదబ్బసంబెలయును కత్తి గొడుగును జక్కఁదాల్చి కుశుకయున.
హర. ౪-౧౨

ద్వి. మెదమీఁదికంతియు నీఁచఁబోయిన పిఱుఁదుసు బుత్తదోవతియు దాయు చంక నిడిన దర్భ సంబెలయు వసజాధ.
౩-౨౦౪ పుట పం. ౨౩

**సంబెళ.** వి. ౧. సంపుటము.

సీ....సంబె, ళ యన సంపుట మగు....
ఆం. వ. పరి. ౮౫

ఉ. వీరలు గంగలోఁ బులిన వేములమీఁద బ్రుసీనివిష్టులై, నోరు వృథా మెదల్పుచుఁ గనుఁగవ మోడ్చిద నక్షమాలికల్, సారెకుం ద్రిప్పుచుం గుళలు సంబెళలోపలిదేవపూజలున్, దారును దాంభికుల్ జనధనంబు హరింపఁజెద రద్భుతంబుగన్. ప్రబోధచం. ౨-౮

౨. వక్కలాకుల తిత్తి, అడపము.

సీ. ఒడ్డె భాత్రీశానుఁడుపదవృత్తింబిన, బింబారుణోష్ఠి సంబెళ వహించు. భీమ. ౧-౩౪

సీ...., సంబెళ విదళించి తాంబూలదళపూగనివహంబు దాలంగ నించు నుబ్బు....
ఆము. ౬-౭౧

౩. దర్భలు మొ॥ వానితో నల్లినసజ్జ.
(చూ. దబ్బసంబెల)

**సంబోధనము.** సం. వి. అ. న. ౧. పిలుపు, ఆహ్వానము. ౨. వివరణము, ౩. సంబుద్ధి.

**సంబోధము.** సం. వి. అ. పుం. ౧. తెలియఁజెప్పుట, బోధించుట. ౨. సమ్యగ్జ్ఞానము. ౩. పంపుట. ౪. నాశము.

**సంబోధించు.** సం. స. క్రి. ౧. చక్కఁగా బోధించు, తెలియఁజెప్పు.

వ. అని సముచితముగా సంబోధించిన గురుని సంభాషితంబుల నిర్దోషితుం డయి.
భార. ఉద్యో. ౧-౧౯౧

౨. హెచ్చరించు, మేలుకొలుపు.

వ. అనుచు మందమందసంభాషణంబుల సంబోధించుపాంచాలి పాణిస్పర్శంబున.
భార. విరా. ౧-౧౬౪

౩. పిలుచు, ఆహ్వానించు.

**సంభ్రమము.** వి. (రూ. సంబరము) తొట్రుపాటు, వేగిరపాటు.

మ. అనయంబున్ మది సంభ్రమున్ వగపు శోకం
 తంతటన్ గ్రమ్మఁగన్. యయా. ౩

**సంభక్తము.** సం. విణ. ౧. విభజింపఁబడినది, పంచుకొనఁబడినది. ౨. తత్పరమైనది. ౩. సమ్మతమైనది.

**సంభక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పంచుకొనుట ౨. పొందియుండుట. ౩. పంచుట. ౪. గౌరవించు.

**సంభగ్నము.** సం. విణ. చెదరఁగొట్టఁబడినది.

**సంభగ్నుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సంభజి(యి)ంచు.** సం. స. క్రి. సేవించు, కొలుచు.

గీ. కూర్మి రంభోరువుం దాను కుంభభవుఁడు,
 కుంభినీనరదుహితృవక్షోజశాత, కుంభకుంభ
 వ్యయాపరిరంభణార్తు, శంభు శ్రీమల్లికా
 ర్జును సంభజించె. కాశీ. ౩-౫౪

గీ. ప్రతిదినంబును బ్రాతరారంభవేళ, భక్తి సం
 భజియింతు రీపద్మబంధు. కాశీ. ౩-౧౭౪

**సంభరము.** సం. వి. అ. పుం. ౧. అధికమైన బరువు. ౨. ప్రేగు.

క. హయశరమును వరుశరమును పరి నిరుపక్క
 యలు దాఁకి జవమతి శరసంభరమునఁ దిఁగె
 వరాహము. భార. అరణ్య. ౧-౩౦౬

**సంభరించు.** సం. స. క్రి. వహించు, పూను, మోచు.

గీ. బ్రహ్మచర్యభిక్షాశనపరత గలిగి, జటిత
 యుండె ముండితయుండె సంభరించి.
 భార. అను. ౫-౨౬౯

గీ.... వీరభద్రన్పపతి, సర్వసర్వంసహాచక్రసర్వ
 చక్రభరము, పృథుభుజాపీఠమునసంభరించుట.
 భీమ. ౧-౩౬

**సంభరితము.** సం. విణ. నిండినది, నింపఁబడినది.

**సంభరువు.** సం. వి. ఊ. స్త్రీ. పావకోర్వు.

**సంభలి.** సం. వి. ఇ. స్త్రీ. (సం. శంబలి) కుంటెన కత్తె.

**సంభవము.** సం. వి. అ. పుం. ౧. పుట్టుక. ౨. హేతువు. ౩. కూడిక. ౪. ఆధేయ మాధారమును మించకుండుట. ౫. మూలకారణము. ౬. సాధ్యత. ౭. సామరస్యము. ౮. యోగ్యత. ౯. అనుకూల్యము. ౧౦. సామర్థ్యము. ౧౧. సమానతను దెలుపు నొకప్రమాణము. ౧౨. కావ్యగుణవిశేషము. ౧౩. సంభోగము. ౧౪. సంపద. ౧౫. జ్ఞానము.

**సంభవించు.** సం. అ. క్రి. కలుగు, పుట్టు, సంభవిల్లు.

ఆ. శాశ్వతకీర్తియు, సంభవించుఁ గలుగు సద్గతి
 యును. భార. శాం. ౨-౪౦౭

వ. జాతిస్మరణజ్ఞానంబు శిష్యులకుం బరమజ్ఞాన
 దానంబుఁ జేసిన ఫలంబున నా కీభవంబున
 సంభవించె. మార్కం. ౨-౩౧

**సంభవిల్లు(లు).** సం. అ. క్రి. సంభవించు, కలుగు, పుట్టు.

సీ. తనదుశక్తిత్రయంబున సమస్తప్రపంచంబుల
 కభివృద్ధి సంభవిల్లెన్. కాశీ. ౧-౨౭

తే. గీ. చలువమంచులశైత్యంబు సంభవిలక,
 యినుఁడు గుడిచిన నీరయ్యె నింతి మేను.
 పి. శకుం. ౩-౪౪

**సంభవ్యము.** సం. వి. అ. పుం. వెలగకాయ.

**సంభాగము.** సం. వి అ. పుం. ౧. చక్కఁగా భరించుట. ౨. వేకరించుట. ౩. చక్కఁగా ధరించుట. ౪. సమూహము.

సీ....హరణార్థసంభారవాహికాకృతియును.
 శృం. నై. ౭-౨౪

౫. సామగ్రి. ౬. సర్వపూర్ణత్వము. ౭. సంపద. ౮. సమృద్ధి. ౯. అంశము, భాగము.

**సంభావన.** సం. వి. అ. స్త్రీ. ౧. భావించుట, ఊహించుట. ౨. సమ్మానము. ౩. తలఁపు ౪. ప్రసిద్ధి ౫. సాధ్యత ౬. అర్హత. ౭. సామర్థ్యము ౮. సందేహము. ౯. అనురాగము; ప్రేమ ౧౦. అలంకారవిశేషము. ౧౧. పొందుట. ౧౨. పేరు.

**సంభావనము.** సం. వి. అ. న. సంభావన.

> వ....మత్పురంబునకుం దోడ్కొనిపోయి మదీయంబు లగు సకలసంపద్విభవంబులుం జూపి వివిధసంభావనంబు లొనరించి. షోడశ. కు. ౭-౫౮.

**సంభావించు.** సం. స. క్రి. ౧. సమ్మానించు, ౨. గౌరవించు.

> క. విను ధర్మమునకు బ్రాహ్మణజనము జననదేశ మగుట జనపతి, భక్తిం గొనియాడి యనూయావ్యజ్ఞుఁడై తగు విప్రకోటిసంభావింపన్. భార. శాం. ౨-౪౦౨.

> వ....నన్ను రావించి యుచితప్రియసత్కారంబు లొనర్చి సంభావించి యిట్లనిరి. మార్కం. పీఠి. ౧౩.

> క. దేవత లచ్చెరువడి యద్దేవుని నయ్యురువురను గనించి రజాఁడు సంభావించె ధర్మమును నవనీవర ! యప్పరమవిభుఁడు నిరుపమలీలన్ భార. శాం. ౪-౧౭.౧

౨. తలఁచు, ఊహించు.

> శా. అంభోజానన భూమిపాలకునిచే వాశిష్ఠ యయ్యున్ మదిన్, సంభావింప నతిం దద్భక్యుఁ డగుటన్. శైవ. ౩-౧౧౪.

౩. కొనియాడు, స్తుతించు.

> వ. మహానుభావా భవదీయభావనశ్రవణంబుఁ జిత్తంబు కలంకఁదేఱె నని సంభావించు. భార. ఉద్యో. ౧-౨౧౪.

౪. ఆదరించు.

> వ. నూఱ్వురందు వసిష్ఠమహామునిని నతిగౌరవంబు సంభావించి. భార. ఆది. ౭-౮౫.

> క. రావించి తగవుమై సంభావింపవ కొరవాఁడ పాండవు లలుకం, బోవిడువక. భార. ఉద్యో. ౨-౨౦౬.

> క. వావుడు నల్లనగుచు నద్దేవుఁడు గరుణించి మునుల దేవతలను సంభావింప. భార. శాం. ౫-౪౪౨.

౫. మన్నించు, క్షమించు.

> క. గోవింద సంభ్రమము సంభావింపుము మాకు నిదియ పరమనసంబు. భార. ఉద్యో. ౩-౨౩౧

౬. ఓదార్చు.

> క. ఎల్లింటి చేఁటిలోనన, తల్లీ వెదకించి తెచ్చి భవగుప్తుని నీ పుల్లము వగవవల దని, చల్లని మాటలఁ దనూజ సంభావించెన్. విక్రమా. ౭-౧౨౨.

**సంభావితము.** సం. విణ. అఅఅ. ౧. చక్కఁగాఁ దలఁపఁబడినది. ౨. ఊహింపఁబడినది. ౪. యోగ్యమైనది. ౫. అర్హమైనది. ౬. ఉత్పాదింపఁబడినది. ౭. సృష్టి పబుపఁబడినది. సం. వి. అ. న. ఊహ.

**సంభావ్యము.** సం. విణ. అ. అ. ఆ సంభవింపఁ దగినది.

**సంభాష.** సం. వి. అ. స్త్రీ. ౧. సల్లాపము.

> క. భూతంబుల దర్శింపమి, భూతాన్స్వర్శనము భూతిములయెడ సంభాషాతరలతి నొందమియు, రతెఱుపు విమోక్షసుఖగత్వత వడయన్. భార. శాంతి ౬-౩౧౪.

౨. అభివందనము ౩. పలుకరింపు. ౪. ఒడంబడిక. ౫. సంకేతపదము ౬. యుద్ధవాదము.

**సంభాషణము.** సం. వి. అ. న. సంభాష.

**సంభాషము.** సం. వి. అ. పుం. సల్లాపము.

**సంభాషించు.** సం. అ. క్రి. మాటలాడు.

> వ. తాపసోత్తముఁన యంత కాలంబునకు సుముఖుండవై నాతోడ సంభాషించుటకంటె వరంబులు గలవె. వరాహ. ౭-౯౦.

**సంభాషితము.** సం. విణ. ౧. చెప్పఁబడినది. ౨. పలుకరింపఁబడినది. సం. వి. అ. న. సంభాషణము.

**సంభిన్నప్రలాపము.** సం.వి. అ. పుం. వ్యర్థాలాపము.

**సంభిన్నము.** సం. విణ. అఆఅ. ౧. పూర్తిగా బ్రద్దలైనది. ౨. చెదిరినది. ౩. విఱిగినది. ౪. కలఁగఁబెట్టఁబడినది. ౫. బాగుగా వికసించినది. ౬. బిగువైనది. ౭. కలసినది. ౮. ఎదురుతిరిగినది.

**సంభిన్నవృత్తుఁడు.** సం.విణ.అ.ఆ.అ ౧. సత్ప్రవర్తనము విడిచినవాఁడు.

**సంభుక్తము.** సం. విణ. అఆఅ. ౧. తినఁబడినది ౨. బాగుగాఅనుభవింపఁబడినది. ౩. ఉపయోగింపఁబడినది.

**సంభూతము.** సం. విణ. ౧. పుట్టినది. ౨. కలసినది. ౩. కూడినది. ౪. చాలినది.

**సంభూతి.** సం. వి.ఇ. స్త్రీ. ౧. పుట్టుక. ౨.కలయిక. ౩. అర్హత. ౪. శక్తి. ౫. జ్ఞానము. ౬. అతిలోకప్రభావము. ౭. అంశము లేక అవతారము.

**సంభూషించు.** సం. స. క్రి. ౧. అలంకరించు. ౨. పొగడు.

శా. జంభారాతిక్రియఁ జేరి యాత్మపురి నిచ్చల్ తల్లిదండ్రుల్ ప్రజల్ సంభూషింప సమస్త రాజ్యపదవీసౌఖ్యంబుఁ జెందెం దగన్. రా. వి. ౫-౧౧౧.

**సంభృతము.** సం. విణ. ౧. చక్కఁగా భరింపఁబడినది.౨.చక్కఁగా ధరింపఁబడినది. ౩. సిద్ధము చేయఁబడినది. ౪. చేకూర్చఁబడినది. ౫. ఉంచఁబడినది. ౬. సంపూర్ణమైనది. ౭. పొందఁబడినది

క. అనర్మశీలచేత శ,తానందుండధికసంభృతానందుం డై.... కళా. ౫-౨౯.

మాలిని. సకృపకృతవిలాసా సంభృతానందభావా భార. స్వర్గా. ౯౭.

౮. పోషింపఁబడినది. ౯. గౌరవింపఁబడినది. ౧౦. బిగ్గఱయైనది.

**సంభృతశ్రుతుఁడు.** సం.విణ. అఆఅ ౧. పండితుఁడు. ౨. ప్రతిభావంతుఁడు.

**సంభృతస్నేహుఁడు.** సం.విణ.మైత్రీపరిపూర్ణుఁడు

**సంభృతి.** సం.వి. ఇ. స్త్రీ. ౧. చక్కఁగా భరించుట ౨. చక్కఁగా ధరించుట ౩. సేకరించుట. ౪. పోషణము. ౫. నిండుతనము.

**సంభేదము.** సం. వి. అ. పుం. ౧. చక్కఁగా భేదించుట. ౨. కలయిక. ౩. నదీసంగమము. ౪. వికసించుట ౫. కూడిక. ౬. సమానత్వము. ౭. ఎదురుతిరుగుట.

**సంభోగము.** సం. వి. అ. పుం. ౧. అనుభవము ౨. సురతము. ౩. మంచిసుఖము ౪. శృంగారభేదము.

**సంభోగవేశ్మము.** సం. వి. న్. న. ఉంపుడుకత్తెగృహము.

**సంభోగి.** సం. విణ. న్. విషయలోలుఁడు.

**సంభోగించు.** సం.అ. క్రి. ౧. కలయు. రమించు

శా....లోచలిని గానా నీవు నీపట్టితో, సంభోగించిన యవ్వడే తెలియు నీచందంబు దైత్యేశ్వరా! ఉ. రా. ౪. ౭౦౭.

౨. అనుభవించు.

**సంభోజకుఁడు.** సం.వి.అ.పుం. భుజించువాఁడు.

**సంభోజనము.** సం. వి. అ. న. విందు,కలసి భుజించుట.

**సంభోజని.** సం. వి. ఇ. స్త్రీ. కలసి భుజించుట, సంఘభోజనము, విందులోనిచ్చుదక్షిణ.

**సంభోజము.** సం. వి. అ. పుం. ఆహారము.

**సంభ్రమము.** సం.వి.అ. పుం. ౧. గుండ్రముగా తిరుగుట. ౨. వేగిరపాటు.

చ. ఉదకముఁ గ్రోల గ్రేలెడుపయోదము పౌరుషశాలి సంభ్రమాభ్యుదయగళద్రమాకలి పొలిక నొప్ప.... కళా ౪-౨౦౫.

౩. కలఁత. ౨. భయము ౫. భ్రాంతి. ౬. గౌరవము.

మ. హిమశైలేంద్రుడు పల్కె మామకమనోభీష్టంబు చేకూర మీకు మదీయాత్మజ నిచ్చి సంభ్రమము దళ్కొత్తన్ వివాహం బొనర్తు ముదం బొప్పఁ బ్రతిగ్రహింపదగు....
శివరహస్య. సంభవ. ౩-౧౭౧.

౭. అజ్ఞానము. ౮. సంక్షోభము.

**సంభ్రమించు.** సం. అ. క్రి. తత్తరించు, వేగిరపడు.

మ. జనులెల్లం గడుసంభ్రమింపఁగ నజస్రంబై, భుజాస్ఫాలనధ్వని. భార. ఆది. ౬-౨౮.

ఆ. చావ గదిసినంత చరమధాతువు జాఱి, నది గ్రహించి ఘటమునందు డించి వరుణుచెంత మెలఁగ వరుణుండు కామించి కడియ సకియ పలికె. ఉ. రా. ౬-౩౮౨.

**సంభ్రాంతము.** సం. విణ. (అ. ఆ. అ) మది తిరిగినది. ౨. సంక్షోభమునొందినది ౩. కలఁత నొందినది.

**సంభ్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. కలఁత ౨. సంక్షోభము.

**సంమంత్రణము.** సం. వి. అ. న. ఆలోచించుట

**సంమృష్టము.** సం. విణ. ౧. బాగుగా శుద్ధము చేయఁబడినది. ౨. తుడువఁబడినది. ౩. వడగట్టఁబడినది.

**సంయంత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ) నిరోధించువాఁడు. అడ్డగించువాడు.

**సంయంత్రితము.** సం. విణ. ఆపఁబడినది.

**సంయతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. అడ్డగింపఁబడినది. ౨. అణఁపఁబడినది. ౩. బద్ధము, కట్టఁబడినది. ౪. చెఱఁబెట్టఁబడినది. ౫. సిద్ధమైనది. ౬. ఏర్పఱుపఁబడినది.

**సంయతుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఇంద్రియముల నిగ్రహించినవాఁడు; సన్యాసి. ౨. శివుఁడు.

**సంయతవాక్కు.** సం. విణ. చ. ౧. వాఙ్నిగ్రహము కలవాఁడు. ౨. నిశ్శబ్దముగా నుండువాఁడు, మౌని.

**సంయతాంజలి.** సం. విణ. (ఇ) కూర్పఁబడిన దోసిలికలవాఁడు. అంజలి పట్టినవాఁడు.

**సంయతాక్షుఁడు.** సం. విణ. (అ. ఈ. అ) మూసికొనఁబడిన కన్నులుగలవాఁడు.

**సంయతాత్ముఁడు.** సం. విణ. (న్) ఆత్మనిగ్రహము కలవాఁడు.

**సంయతాహారుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) నియమితమైన యాహారము గలవాఁడు, మితముగాఁ దినువాఁడు.

**సంయతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. తపస్సు, ౨. ఆత్మనిగ్రహము.

**సంయతోపస్కరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సిద్ధముచేసికొనఁబడిన గృహోపకరణములు గలవాఁడు, ౨. ఇంటిసామాగ్రి భద్రపఱుచుకొనినవాఁడు.

**సంయత్తము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సిద్ధమైనది. ౨. కావలిలోనున్నది. ౩. రక్షితమైనది. ౪. జాగరూకమై యున్నది.

**సంయత్తు.** సం. వి. త్. స్త్రీ. యుద్ధము, పోరు

**సంయత్వరుఁడు.** సం. విణ. (అఆఅ) మౌని. మాటలాడనివాఁడు.

**సంయద్వరుఁడు.** సం. వి. అ. పుం. రాజు. నియంతృశ్రేష్ఠుఁడు.

**సంయమనము.** సం. వి. అ. న. ౧. నిరోధము, అడ్డగింపు. ౨. లోపలికి గ్రహించుట ౩. బంధనము, కట్టుట. ౪. చెఱలో నుంచుట ౫. ఇంద్రియనిగ్రహము ౬. నియమవిశేషము. ౭. చతుశ్శాలము, మండువాలోఁగిలి.

**సంయమని.** సం.వి. ఈ. స్త్రీ. యమునిపట్టణము

**సంయమనుఁడు.** సం. వి. అ. పుం. ౧. నిరో ధించువాఁడు ౨. శాసకుఁడు ౩. రాజు.

**సంయమము.** సం. వి. అ. పుం. ౧. (చిత్త) నిరోధము; నిగ్రహము; వశపఱుచుకొనుట ౨. ధ్యానధారణసమాధు లనెడి యోగసంబంధ మైన తుదిమూఁడవస్థలు ౩. నియమవిశేషము; హింసాదులనుండి విరమించుట. ౪. తపోఽభ్యాసము ౫. సుఖదుఃఖాద్యనుభవము ౬. వ్రతాంగముగాఁ బూర్వదినమునఁ జేయఁదగిన నియమము. ౭. ప్రయత్నము.

**సంయమి.** సం. విశే. (న్. నీ. న్) ౧ (చిత్తము) నిగ్రహించినవాఁడు, ౨. నిరోధించినవాఁడు; ౩. వశపఱుచుకొనినవాఁడు ౪. కామాది వికారముల నణఁచినవాఁడు.

**సంయమి.** సం.వి.న్.పుం.౧.యతి ౨. సన్న్యాసి

ఉ. భ్రాజితవృత్తిమైఁ బరగుభారతసంహిత సంయమీంద్రులారా! జయనామకం బనుచు రాజితభంగి జగత్త్రయంబునన్ బూజితకీర్తియై వెలయు. భార. స్వర్గా. ౧౫

ద్వి. సంయమివరుఁడు వాచంయముం డగుచు.
పరమ. ౩. పుట ౧౩౫

**సంయమితము.**[1] సం. విశే. (అ. ఆ. అ) ౧. నిరోధింపఁబడినది; నిగ్రహింపఁబడినది. ౨. కట్టబడినది. ౩. ఆఁపబడినది;నిలుపఁబడినది. ౪. సంఘముగాఁ జేరినది.

**సంయమితము.**[2] సం.వి. అ. న. నిగ్రహించుట.

**సంయము.** సం. వి. అ. పుం. అస్థిపంజరము.

**సంయాత్ర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సముద్రయానము ౨. కలిసి పయనించుట.

**సంయానము.**[1] సం. వి. అ. పుం. పోఁతపోసెడి యచ్చు.

**సంయానము.**[2] సం. వి. అ. న. ౧. అనుసరణము; వెంబడించుట ౨. ప్రయాణము; యాత్ర ౩. శవమును దీసికొనిపోవుట ౪. బండి;శకటము

**సంయామము.** సం. వి. అ. పుం. సంయమము.

**సంయావము.** సం. వి. అ. పుం. ౧. నేయి మొదలగువానితోఁ బక్వముచేసిన గోధుమభక్ష్యవిశేషము; సారెసత్తులు. (శ. ర.) (ఘృతక్షీరగుడగోధూమపాకజము అనివాచ.)

**సంయుక్తము.** సం.విశే.(అ.ఆ.అ)౧.చక్కఁగాఁ గూడినది; ఏకమైనది ౨. మిశ్రమైనది;కలసినది. ౩. అనుసరింపఁబడినది; వెంబడింపఁబడినది; ౪. సంపన్నము; కలిగియున్నది.

సీ. శివభక్తిసంయుక్తచిత్తులకును....శివధర్మ ౨-౩౪

**సంయుగము.** సం. వి. అ. పుం. ౧. కలయిక, ఐక్యము. ౨. యుద్ధము;పోరు. ౩. సన్నిహితత్వము

**సంయుగగోష్పదము.** సం. వి. అ. న. అల్పకలహము. (గోష్పదమునందలియుద్ధము)

**సంయుగమూర్ధము.** సం.వి.న్.పుం.అనిమొన. రణాగ్రము.

**సంయుజ.** సం. వి. ఆ. కలయిక, సంబంధము.

**సంయుజుఁడు.** సం. విశే. జ్. ౧. సంబంధము కలవాఁడు ౨. సద్గుణసమేతుఁడు.

మత్తకోకిల:
స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును
నిష్టుఁడున్ భూతలేశుఁడు సంయుజుండును
బూజనీయులు....సభా ౨-౪.

**సంయుతము.** సం.విశే. (అ. ఆ. అ) ౧. కూడినది; కలసినది.

ద్వి. సంయమివరుఁడు వాచంయముం డగుచు,
సంయుతవిద్యానసక్తుఁడై యుండె.
పరమ. ౩ పుట. ౧౩౫.

౨. సంపన్నము; కూడియున్నది; కలిగియున్నది.
వ. ప్రతీప్తాక్షతగంధసంయుతంబును....
శివధర్మ. ౨-౩౭.

**సంయుతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. గ్రహముల కూటము ౨. రెండుసంఖ్యల మొత్తము.

**సంయోగము.** సం. వి. అ. పుం. ౧. కూడిక, కలయిక ౨. సమానప్రయోజనముగల యిరువురు రాజులమైత్రి. ౩. (తర్క) ఇరువదినాల్గు గుణములలో నొకటి ౪. (వ్యాక) నడుమ నచ్చులేని హల్లులు, సంయుక్తాక్షరము. ౫. రెండుగ్రహముల కూటమి. ౬. మైథునము ౭. వైవాహిక సంబంధము ౮. మొత్తము.

**సంయోగవిరుద్ధము** సం వి. అ. న. ఇతరవస్తుసంయోగమున విరుద్ధగుణము గలిగెడువస్తువు; వేఱువస్తువు గలుపుటచే నపాయకరమగునాహారపదార్థము.

**సంయోగి.** సం. విణ. న్ ౧. కలుపఁబడినది. ౨. ఏకముచేయఁబడినది. ౩. కలయునది. వివాహితుఁడు.

**సంయోజనము.** సం.వి.అ. న. ౧. చక్కఁగా గూర్చుట, కలుపుట.

శా. చేసెం గావలయున్ విరించి నిఖిల స్త్రీపుంస
సంయోజనాభ్యాసప్రౌఢి ప్రకాశమొందఁ
గదు వియ్యం బైనసంసర్గము
శృం. నై. ౬-౭౫.

౨. రతిపొందు. ౩. కలయిక.

**సంయోజించు.** సం. స. క్రి. చక్కఁగాఁగూర్చు

వ.... ఎయ్యది యకారాదివర్ణంబు లేకత్వంబు
నొందునట్లుగా సంయోజింప నాస్పద యను
సంజ్ఞఁగూడి మంత్రత్వంబు నొందు.
కాశీ ౬-౨౫౦.

**సంయోజితము.** సం. విణ. (అ. ఆ. అ) మఱియొకదానితోఁ గూర్పఁబడినది.

**సంయోధము,** సం. వి. అ. పుం. యుద్ధము.

**సంరంభము.** సం. వి. అ. పుం. ౧. ఆరంభము ౨. సంక్షోభము. ౩. కోపము ౪. గర్వము ౫. ఉద్రేకము

వ.... నీతెలుం గంతయు వెలుంగునంతవాఁ
డేఁదం బమంద కౌతుకసంరంభంబున సంక్ర
మించుచున్నయది. కళా ౫-౧౧.

౬. ద్వేషము. ౭. శత్రుత్వము వహించుట ౮. అతిశయము ౯. తీవ్రస్థితి.

**సంరంభరసము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. మిగుల రేఁగినది. ౨. మిక్కిలికోపముగలది.

**సంరంభవేగము.** సం. వి. అ. పుం. కోపాతిశయము; కోపతీవ్రత.

**సంరంభి.** సం. విణ. (న్. నీ. న్) ౧. క్షుబ్ధము; కలఁతనొందినది ౨. రేఁగినది; ఉద్రేకించినది ౩. కోపముగలది, గర్వముగలది.

**సంరంభించు.** సం. అ. క్రి. ౧. తొందరపడు ౨. తహతహనొందు.

శా. రక్షస్సంఘముమీఁద నిర్జరులు సంరంభించి
యుద్ధార్థులై....ఏఁగుదెంచిన....
భాగ. ౭-౨౨౩.

**సంరక్తము.** సం. విణ. (అ.ఆ.అ) ౧. మిక్కిలి యెఱ్ఱనిది.

సీ. ప్రకటతాంబూలరాగసంరక్తమైన ప్రాక్
శశాంకబింబాధరంబువోలె. భీమ. ౨-౪౦.

౨. కామాదివికారముగలది. ౩. కోపముచే నెఱ్ఱనైనది. ౪. మోహించినది; వలచినది. ౫. మనోహరమైనది; చక్కనిది.

**సంరక్షణము.** సం. వి. అ. న. ౧. రక్షించుట కాపాడుట ౨. వశము; అధీనత.

**సంరక్ష(ము)** సం. వి. ఆ. స్త్రీ (అ. పుం.) రక్షించుట; కాపాడుట.

**సంరక్షించు.** సం. స. క్రి. కాపాడు.

క. జనని యయి తాను కనియెన్, జనకుండై తాను పిదప సంరక్షించెన్, దనయుల ననచ రకులనిధి,ననఁగాఁ జను బుత్త్రవిరజాఁ దర్క కులేంద్రా! ఉ. రా. ౫-౧౬౭.

**సంరబ్ధము.** సం. విశ. (అ. ఆ. అ) ౧. రేఁగి నది; ఉద్రేకించినది. ౨. చేర్పఁబడినది. ౩. వాఁచినది; ఉబ్బినది. ౪. వ్యాకులమైనది; కలఁత నొందినది. ౫. దగ్గఱఁగా గలసినది.

**సంరాధనము.** సం.వి.అ. న. ౧. ఆరాధించుట; పూజచే సంతోషపెట్టుట. ౨. సాధించుట; నెఱవేర్చుట ౩. చక్కఁగాఁజింతచేయుట, నిరంతరధ్యానము.

**సంరాద్ధి.** అం.వి.ఇ. స్త్రీ. ౧. సిద్ధి ౨.జయము.

**సంరావణము.** సం. వి. అ. న = సంరావము;

**సంరావము.** సం. వి. అ. పుం. ౧. అఱపు. గోల; కలకలము. ౨. ధ్వని, చప్పుడు.

**సంరిహాణము.** సం.వి.అ. న. ప్రేమతో నాకుట (గోవువత్సమును వలె)

**సంరుగ్ణము.** సం. విశ. (అ. ఆ. అ) ఖండఖండము లైనది.

**సంరుజనము.** సం. వి. అ. న. బాధ, నొప్పి

**సంరుద్ధము.** సం. విశ. (అ. ఆ. అ) ౧. అడ్డగిట్టబడినది, నిరోధింపఁబడినది. ౨. ముట్టడింపఁబడినది. ౪. కప్పఁబడినది, ఆచ్ఛాదింపబడినది. ౫. నిరాకరింపఁబడినది. ౬. నిర్బంధింపఁబడినది

**సంరూఢము.** సం.విశ.(అ.ఆ.అ)౧.చక్కఁగాఁ మొలిచినది. ౨. మొలచినది; అంకురించినది. ౩. వేర్పుపాతినది; స్థిరపడినది. ౪. మానినది. (వ్రణము) ౫. ధైర్యముకలది.

ఉ. హారిసంఘంబులు గొల్చిరా సరసవాతాపత్యసంరూఢుఁడై—వరాద ౭-౧౨౩

**సంరోధనము.** సం. వి. అ. న. నిరోధము అడ్డగింత.

**సంరోధము.** సం. వి. అ. పుం. ౧. పూర్తిగా నడ్డగించుట, నిరోధము. ౨. ముట్టడి ౩. బంధము; కట్టు. ౪. ముందుకు నెట్టుట,త్రోయుట (మే.ని)

**సంరోధించు.** సం. స. క్రి. అడ్డగట్టు,నిరోధించు.

శా. గోపాలస్వవిరూపుఁ డైనకతనన్ గ్రోవ్యగ్రలంపై మరిన్ రూపింపంబోర కేమ నిన్నునిట సంరోధించి బాధించితిన్. హం. పూ. ౭-౧౯౯.

శా.... ఇట్టిఘనులన్ జిత్రాంబు నేఁ డిట్లు సం, రోధించ న్యాయము నైరన్యా మగధేంద్రుండంచు........ భాగ. ౧౦. పూ. ౧౫౫౮.

**సంరోషితము.** సం. విశ. పూయఁబడినది, వ్యాపిత మైనది.

**సంరోహణము.** సం. వి. అ. న. ౧. పెరుగుట, నాటుట ౨. పైనిపెరుగుట ౩ ఉపశమించుట.

**సంలక్షణము.** సం. వి. అ. న. ౧. గుణనిరూపణము, భేదనిరూపణము. ౩. గుర్తింపు.

**సంలక్షించి.** సం. స. క్రి. చక్కఁగాచూచు కేజిచూచు.

శా.అప్రస్తావ్యశ్వనిఁ గాంగిలించుకొని సందార్థీశుఁడాంచెరియు........ సల్లాపోత్సాహముతోడ నిల్లనియె సంలక్షించి మోదంబునన్. భాగ. ౧౦. పూ. ౧౪౩౮.

౨. పరీక్షించు. ౩. రుజువుచేయు ౪. నిర్ణయించు ౫. విను ౬. తెలిసికొను, గ్రహించు. ౭. గుణనిరూపణముచేయు, భేదనిరూపణముచేయు.

**సంలక్షితము.** సం. విశ. ౧. చూడఁబడినది. ౨. పరీక్షింపఁబడినది. ౩. గ్రహింపఁబడినది, ౪. నిరూపింపఁబడినది.

**సంలక్ష్యము.** సం.విశ.గుర్తింపఁదగినది.౨.చూడఁదగినది. ౩. గ్రహింపఁదగినది. ౪. నిరూపింపఁదగినది.

**సంలగ్నము.** సం. విశ. (అ. ఆ. అ) ౧. కలసికొన్నది.; తగులుకొనినది. ౨. తాఁకినది, అంటుకొన్నది.ద్వంద్వయుద్ధమునకు దఁకేసినది.

**సంలపనము.** సం. వి. అ. న. ౧. మాటలాడుట సంభాషించుట. ౨. పిలుచుట ౩. సంబోధించుట.

**సంలపించు.**[1] సం. వి. అ. క్రి. మాటలాడు; సంభాషించు.

**సంలపించు.**[2] సం. వి. స. క్రి. పిలుచు, సంబోధించు.

**సంలయనము.** సం. వి. అ. న. ౧. అంటుకొనుట. తగులుకొనుట ౨. కరఁగుట. రూపరహిత మగుట ౩. శయనము, నిద్ర.

**సంలయము.** సం. వి. అ. పుం. ౧. నిద్దుర ౨. కరఁగుట. ౩. ప్రళయము, కల్పాంతము. ౪. గూడు.

**సంలాపకము.** సం. వి. అ. న. ఒక ఉపరూపక భేదము.

**సంలాపము.** సం. వి. అ. పుం. ౧. పరస్పర సంభాషణము. ౨. చనవుతో నొండొరులు మాటలాడుకొనుట. ౩. రహస్యసంభాషణము. ౪. (నాటకమున) ప్రశ్నోత్తరరూప సంభాషణము.

**సంలాలితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. చక్కఁగా బుజ్జగింపఁబడినది.

**సంలిఖించు.** సం. స. క్రి. ౧. గీయు, గీచు, ౨. వ్రాయు, చెక్కు ౩. (వీణాదులపై) మీటు

**సంలీఢము.** సం. విణ. (అ. ఆ. అ) ఆస్వాదింపబడినది. ౨. నాకఁబడినది. ౩. అనుభవింపఁబడినది.

**సంలీనకర్ణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) జాలు చెవులవాఁడు.

**సంలీనమానసుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. క్రుంగిన మనస్సు గలవాడు. ౨. అలసచిత్తుఁడు.

**సంలీనము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. అంటుకొన్నది, తగులుకొన్నది. ౨. కలసినది, కూడినది. ౩. దాఁగినది, అణఁగియున్నది. ౪. క్రుంగదీయఁబడినది. ౫. ముడుఁచుకొన్నది.

**సంలులితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. కలఁకబెట్టఁబడినది, రేచఁబడినది. ౨. చిందరవందరయైనది.; ౩. చేరిక యైనది.

**సంలేఖనము.** సం. వి. అ. న. ౧. గీయుట, గీచుట. ౨. వ్రాయుట, చెక్కుట. ౩. (వీణాదులపై) మీటుట.

**సంలేపనము.** సం. వి. అ. న. పూఁయుట, అలుకుట, మలికి చేయుట.

**సంలేపము.** సం. వి. అ. పుం. బురద, మలికి.

**సంలోడనము.** సం. వి. అ. న. ౧. చెదరగొట్టుట. కలవరపెట్టుట, కలతపెట్టుట.

**సంవత్సరభ్రమి.** సం. విణ. (ఇ) ఒక యేడాదిలోఁ దిరిగివచ్చెడివాఁడు, (సూర్యుఁడు)

**సంవత్సరము.** సం. వి. అ. పుం. ౧. ఏఁడాది.

క.... జపవిధి సలిపెం బూర్ణ ముగ నెంచుసంవత్సరముల్. కా. ౪-౨౦౯.
ప్రభవ మున్నగునవియేఁడు (ఇవి యరువది) ౨. విక్రమాదిత్యశకవత్సరము. ౩. జ్యోతిశ్శాస్త్రోక్తమగు పంచవత్సరాత్మకయుగములో మొదటివత్సరము.

**సంవత్సరముఖి.** సం. వి. ఈ. స్త్రీ. జ్యేష్ఠశుద్ధదశమి.

**సంవదన.** సం. వి. ఆ. స్త్రీ సంవదనము.

**సంవదనము.** సం. వి. అ. న. ౧. పరస్పరసంభాషణము, ఒండొరులు మాటలాడుకొనుట. ౨. సందేశము. ౩. సమాచారము తెలుపుట. ౪. పరీక్ష, పరిశీలనము. ౫. మంత్రతంత్రములతో వశపఱుచుకొనుట ౬. రక్ష, తాయెతు.

**సంవదించు.**[1] సం. స. క్రి. ౧. ప్రయోగించు, వాయించు ౨. ప్రకటించు. ౩. పోలియుండు.

**సంవదించు.**[2] సం. అ. క్రి. ౧. సమ్మతించు ౨. సమాలోచించు. ౩. సంభాషించు. ౪. సంప్రదించు. ౫. సరిపడు, సపోలు.

వ. సరసబిసికిసలాశంబుమీఁదఁ జరణనఖాగ్రగంహఁ బుఁలిఖియించి చూపినం జూచినచిత్రితరూపంబుతో రూపంబు సంఘటించుటం జేసి యీతిండు నిషధరా జని యెఱింగియు. నైష. ౪-౬.

సంవననము. సం. వి. అ. న. ౧. మంత్రతంత్రములచేత, ఓషధులచేతను వశపఱుచుకొనుట ౨. రక్ష, తాయెతు ౩. ప్రేమము, వలపు. ౪. సంపాదించుట.

సంవరణము. సం. వి. అ. న. ౧. కప్పుట, ఆవరించుట. ౨. దాఁచుట, మఱుఁగుపఱుచుట ౩. మాఱువేషము. ౪. నెపము. ౫. రహస్యము ౬. వరించుట, ఎన్నుకొనుట, ౭. తెరవేయుట

సంవరము.[1] సం. వి. అ. పుం. ౧. కప్పు. ౨. గ్రహణశక్తి ౩. ఇమిడిక, అణఁగియుండుట. ౪. సేతువు, ఆనకట్ట. ౫. ఒకజాతి జింక.

సంవరము.[2] సం. వి. అ. న. ౧. దాఁగుట ౨. ఇంద్రియనిగ్రహము. ౩. క్షమ, ఓరిమి. ౪. నీరు ౫. బౌద్ధు లవలంబించు నియమవిశేషము.

సంవరుఁడు. సం. వి. అ. పుం. శంబరుఁడు అను దాని రూపాంతరము.

సంవర్గణము. సం. వి. అ. న. ౧. ఆకర్షణము ౨. వశీకరణము.

సంవర్జనము. సం. వి. అ. న. ౧. ఆత్మార్థమై వినియోగించుట. ౨. ఉపయోగించుకొనుట, మ్రింగుట.

సంవర్తకము[1], సం. వి. అ. పుం. ౧. ఒక విధమగు మేఘము. ౨. ప్రళయకాలాగ్ని.

సంవర్తకము.[2] సం. వి. అ. న. బలరాముని నాఁగలి.

సంవర్తి. సం. వి. న్. పుం. బలరాముఁడు.

సంవర్తకుఁడు. సం.వి. అ. పుం. సంవర్తకి; బలరాముఁడు.

సంవర్తము. సం. వి. అ. పుం. ౧. మరలుట తిరుగుట, అభిముఖమగుట, ౨. నాశము, లయము. ౩. ప్రళయము. యుగాంతము. ౪. మేఘము ఒకజాతి జలపూర్ణమైన మేఘము. ౫. ప్రళయకాలమున బయలుదేఱు నేడుమేఘములలో నొకటి ౭. ఏఁడాది ౮. సమూహము, గుంపు ౯. సంకోచము.

సంవర్తి. సం.వి.ఇ. స్త్రీ. ౧. తామర మున్నగుపూవులయందు కేసరములను చుట్టియుండు రేక. ౨. దీపము మున్నగువాని శిఖ. ౩. క్రొత్తరేకు (వావ)

సంవర్తిక. సం. వి. అ. స్త్రీ. సంవర్తి.

సంవర్తితము. సం.విశే.(అ. ఆ. అ) ౧. చుట్టబడినది. ౨.కప్పఁబడినది.౩. క్రొత్తనైసర్వశము.

సంవర్ధకము. సం. విశే. (అ. స్త్రీ.కా. అ) ౧. పెంపొందించునది; వృద్ధిపొందించునది. ౨. అభినందించునది, ౩. ఆదరించునది. ౪. స్వాగతముచేయునది.

సంవర్ధనము. సం. వి. అ. న. ౧. పెంచుట, పోషించుట. ౨.వింతువృద్ధి,ఎక్కువ పెరుగుదల.

సంవర్ధితము. సం. విశే. (అ. ఆ. అ) ౧. పెంపఁబడినది, పోషింపఁబడినది. ౨. వృద్ధిచేయఁబడినది.

క. శ్రీరాజరాజ కేశవ,స్మారమణ కృపాకటాక్ష సంవర్ధితలక్ష్మీరక్షితబుధలోక యుదారగుణాధార సింగనామాత్యమణీ శృం.నై. ౧-౧.

సంవలనము. సం. వి. అ. న. ౧. కలయిక, కూడిక. ౨. మిశ్రమగుట.

సంవలితము. సం. విశే. (అ. ఆ. అ) ౧. కలిసినది, మిశ్రమైనది. ౨. చెందుపఁబడినది. ౩. సంబంధించినది. ౪. పగిలినది, చీలినది. ౫. ఆవరింపఁబడినది. ౬. సంపన్నము, కలిగియున్నది.

సంవల్గితము.[1] సం.విశే. (అ. ఆ. అ) ౧. వ్యాపించినది. ౨. అతిక్రమించినది.

**సంవల్గితము.**[2] సం. వి. అ. న. ధ్వని.

**సంవసథము.** సం. వి. అ. పుం. గ్రామము, ఊరు.

> క. వేలూరనుగొప్పసంవసథంబు మఱువాఁటి
> యహంబున ఘటికాదశకంబునకుఁ బ్రవే
> శించితి. సీ. యా. పు. ౯.

**సంవసించు.** సం. అ. క్రి. ౧. నివసించు.

> సీ. సంవసింతు మహాశ్మశానభూములఁ గాన
> నేనుండుట మహాశ్మశాన మయ్యె.
> కాశీ. ౫-౧౦.

౨. కాలముగడపు.

**సంవహనము.** సం. వి. అ. న. ౧. త్రోవచూపుట. ౨. ప్రకటించుట. ౩. నడిపించుట.

**సంవహము.** సం. వి. అ. పుం. సప్తమారుతములలో మూఁడవది.

**సంవాదము.** సం. వి. అ. పుం. ౧. పరస్పర సంభాషణము. ౨. చర్చ. ౩. సమాచారము లోకులు తెలుపుకొనుట ౪. వార్త, సమాచారము ౫. సమ్మతి, అంగీకారము. ఒప్పుదల ౬. పోలిక, సామ్యము. ౭. కలసికొనుట ౮. అభియోగము.

**సంవాది.** సం. విశే. (న్. సీ. న్) ౧. సంభాషించువాఁడు, మాటలాడువాఁడు. ౨. పోలినది, సమముగానున్నది.

**సంవాదించు.** సం. అ. క్రి. సంవాదముచేయు.

> వ. ఇట్లు తమలో సంవాదించి యయ్యన్నదమ్ములు మువ్వురు పిశునులై పిన్నాతని నొంటిఁ జేసి పెద్దవారిద్దఱు నొద్దికలై కలిసియుండిరి.
> భోజరా. ౬-౧౪౮.

**సంవారము.** సం. వి. అ. పుం. ౧. కప్పుట, దాఁచుట. ౨. (వ్యాక) వర్ణోచ్చారణమునందలి ప్రయత్నవిశేషము. (కంఠబిలమును సంకోచింపఁజేయుట) ౩. తక్కువగుట, న్యూనమగుట ౪. రక్షించుట. ౫. ఏర్పఱుచుట ౬. ఆటంకము.

**సంవాసనము.** సం. వి. అ. న. వసతినిచ్చుట.

> ఉ. వ్యాసమునీంద్రు సారకరుణాతిశయంబున భారతార్థ ముద్భాసితమైనయట్టి మతిభాగ్య నకున్ సతతాగమార్థసంవాసన మావహిల్లి....
> భార. స్వర్గా. ౧-౨.

**సంవాసము.** సం. వి. అ. పుం. ౧. కలిసినివసించుట. ౨. సహవాసము.

> గీ. వైరమత్సరస్నేహసంవాసకార్యగర్వశోకాదులైన హృద్వృత్తివికారములఁ దొరఁగి.
> భార. స్వర్గ. ౫౨.

౩. ఇల్లు ౪. సమసు సమావేశమగుట కేల్పడిన బయలు ౫. స్త్రీపురుషసంయోగము.

**సంవాసితము.** (సం. విశే. అ. ఆ. అ) ౧. సువాసనగలదిగాఁ జేయఁబడినది. ౨. దుర్గంధముగలదిగాఁ జేయఁబడినది.

**సంవాహకుఁడు,** సం. వి. అ. పుం. ౧. ఒడలుపట్టువాఁడు ౨. చక్కఁగా మోసికొనిపోవువాఁడు.

**సంవాహన.** సం. వి. అ. స్త్రీ. ౧. తీసికొనిపోవుట మోసికొనిపోవుట. ౨. ఒడలుపట్టుట, అంగమర్దనము. ౩. ముందుకుద్రోయుట.

**సంవాహనము.** సం. వి. అ. న. సంవాహన.

**సంవాహము.** సం. వి. అ. పుం. ౧. తీసికొనిపోవుట, మోసికొనిపోవుట. ౨. దండిగా నొక్కుట ౩. ఒడలుపట్టుట ౪. విపణిస్థలము. ౫. వినోదప్రదేశము.

**సంవాహుఁడు.** సం. వి. అ. పుం. సంవాహకుఁడు.

**సంవిగ్నము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. క్షోభపడినది, కలతఁ నొందినది, వికలమైనది. ౨. భయపడినది. బెదరినది. ౩. అటునిటుకదలునది.

**సంవిజ్ఞాతము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. అందఱకును దెలిసినది. ౨. సాధారణముగా నంగీకరింపఁబడినది.

**సంవిజ్ఞానము.** సం. వి. అ. న. ౧. అంగీకారము ౨. సంపూర్ణావబోధము ౩. జ్ఞానము.

**సంవిత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. జ్ఞానము, ఎఱుక సుఖదుఃఖాద్యనుభవము. ౨. బుద్ధి, అవబోధము. ౩. స్మరణము, జ్ఞప్తి ౪. అంగీకారము, ఒప్పుదల ౫. భావసామరస్యము, మనస్సమాధానము.

**సంవిత్తు.** సం. వి. త్. స్త్రీ. ౧. జ్ఞానము ౨. స్మృతి ౩. సమ్మతి, అంగీకారము, ఒప్పుదల. ౪. ఆచారము. ౫. యుద్ధము ౬. యుద్ధసంకేతము. ౭. కావలివాని సంకేతము. ౮. నామధేయము; పేరు. ౯. గుర్తు, చిహ్నము. ౧౦. సంతోషము. ౧౧. (సుఖదుఃఖాదులయందు) పాల్గొనుట, సానుభూతి ౧౨. సమాధి, ఏకాగ్రత ౧౩. సంభాషణము. ౧౪. ధంగు. ౧౫. వార్త. ౧౬. ప్రణాళిక, పన్నకము. ౧౭. ప్రతిజ్ఞ.

**సంవిద.** సం. వి. ఆ. స్త్రీ. ఒడంబడిక, సమ్మతి.

**సంవిదానము.** సం. విశే. (అ. ఆ. అ) సంభాషించునది.

**సంవిదితము.**[1] సం. విశే. (అ. ఆ. అ) ౧. చక్కఁగాఁ దెలిసికొనఁబడినది, ౨. గుర్తుపట్టఁబడినది. ౩. ప్రసిద్ధమైనది. ౪. పరిశోధన చేయఁబడినది, పరిశీలింపఁబడినది. ౫. ఒప్పుకొనఁబడినది, అంగీకరింపఁబడినది. ౬. ఉపదేశింపఁబడినది, బోధింపఁబడినది.

**సంవిదితము.**[2] సం. వి. అ. న. ఒప్పుదల, సమ్మతి.

**సంవిధ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఏర్పాటు. ౨. జీవిక, జీవనపద్ధతి, జీవనాధారము.

**సంవిధానకము.** సం. వి. అ. న. ౧. నాటకమున కథావిషయములను క్రమముగాఁ గూర్చుట. ౨. వింతపని, అద్భుతకృత్యము.

**సంవిధానము.** సం. వి. అ. న. ౧. ఏర్పాటు, ౨. జరుపుట, ఆచరణము. ౩. పద్ధతి ౪. క్రియ, పని ౫. కథావిషయములను క్రమముగా చేర్చుట. ౬. నిర్వహణము.

**సంవిధి.** సం. వి. ఇ. పుం. ౧. ఏర్పాటు, ౨. కూర్పు

**సంవిభక్తము.** సం. విశే. (అ. ఆ. అ) వేఱు చేయఁబడినది, విభజింపఁబడినది.

**సంవిభాగము.** సం. వి. అ. పుం. ౧. విభజనము ౨. పంచుట. ౨. భాగము, పాలు, వాటా ౩. దానము.

**సంవిభాగించు.** సం. స. క్రి. పంచు, విభజించు.

సీ. పోష్యుల నెయ్యెడఁ బ్రోవక యుండుట
విప్రుల నతిథుల వృథయ పుచ్చు .... ఆ. జనుఁడె
నిజధనంబు సంవిభాగించి యీ, వలయు
సాధురక్ష వలయుఁ జేయ.

భార. అరణ్య. ౧-౩౦

**సంవిభాగి.** సం. విశే. (న్. నీ. న్) ౧. భాగస్వామి. ౨. పాల్గొనువాఁడు.

**సంవిష్టుడు.** సం. విశే. (అ. ఆ. అ) ౧. నిద్రించినవాఁడు. లోనఁబ్రవేశించినవాఁడు. ౩. కలిసి కూర్చుండినవాఁడు. ౪. దుస్తులు ధరించినవాఁడు.

**సంవీక్షణము.** సం. వి. అ. న. ౧. అన్నివైపులఁ జూచుట. ౨. వెదకుట. ౩. తత్పరతతోఁ జూచుట.

**సంవీక్షించు.** సం. స. క్రి. చూచు.

కు.... ఆ, విపులానాగనివాసలోకముల సంవీక్షించి వైభ్రాజపురంబుల్ గని దేవి
నిన్నచట సంవీక్షింప శోధించితిన్.

వరాహ. ౧౧-౩౬

మ. ఇది నాగజాని జహ్నుకన్య యిది సంవీక్షింపు
మహాశోభిత, ప్రమదిన్ మతి విహాయసమున్

రుక్మాం. ౫-౧౩

**సంవీతము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. వస్త్రము ధరించునది ౨. కప్పఁబడినది. ౩. అలంకరింపఁబడినది. ౪. పరివేష్టింపఁబడినది, చుట్టుకొనఁబడినది.

**సంవృక్తము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. భక్షింపఁబడినది. ౨. నాశనముచేయఁబడినది.

**సంవృతము.**[1] సం. విశే. (అ. ఆ. అ) ౧. కప్పఁబడినది. ౨. దాఁచఁబడినది. ౩. రహస్యమైనది, గూఢమైనది. ౪. విరమించినది. ౫. మూయఁబడినది. ౬. ప్రభువు స్వాధీనముచేసికొన్నది. శిక్షచేయఁబడినది. ౭. చుట్టుకొనఁబడినది, ఆవరింపఁబడినది. ౮. నిండినది. ౯. అనుసరింపఁబడినది.

**సంవృతము.**[2] సం. వి. అ. న. ౧. నిర్జనప్రదేశము, ఏకాంతస్థలము. ౨. (వ్యాక) వర్ణోచ్చారణమందలి ప్రయత్నవిశేషము(సంవారప్రయత్నము).

**సంవృతమంత్రుఁడు.** సం. విశే. అ. తన ఆలోచనలను, లేక ఉద్దేశములను గూఢముగా నుంచువాఁడు.

**సంవృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. కప్పుట, ఆచ్ఛాదించుట. ౨. దాఁగుట. ౩. రహస్యమైనయుద్దేశము.

**సంవృత్తము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. కలిగినది, సంభవించినది. ౨. నెఱవేఱినది, సఫలమైనది. ౩. ప్రయోగము చేయఁబడినది. ౪. కడచినది. గతించినది. ౫. కప్పఁబడినది. ౬. అమర్పఁబడినది.

**సంవృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సంభవించుట, జరుగుట. ౨. నెఱవేరుట

**సంవృత్తుఁడు.** సం. వి. అ. పుం. వరుణుఁడు.

**సంవృద్ధము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. పెరిగినది, వృద్ధిపొందినది. ౨. ఎత్తైనది. ౩. పెంపొందినది. ౪. వికసించినది.

**సంవృద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సమగ్రమైన పెరుగుదల. ౨. శక్తి, బలము.

**సంవేగము.** సం.వి.అ. పుం. ౧. భయహర్షాదులచేఁ గలిగిన త్వర, సంభ్రమము. ౨. తీవ్రవేగము, మిక్కిలివడి. ౪. మిక్కుటమగు బాధ.

**సంవేదన.** సం. వి. అ. స్త్రీ. ౧. సంవేదము, ౨. అనుభవము.

**సంవేదనము.** సం. వి. అ. న. సంవేదన.

**సంవేదము.** సం.వి.అ.పుం. ౧. జ్ఞానము, ఎఱుక. ౨. సుఖదుఃఖాద్యనుభవము.

**సంవేశనము.** సం.వి.అ.న. ౧. రతి, సురతము. ౨. నిద్రిం(కు)గుట. ౩. ఆసనము.

సీ. నగరసంవేశనానందకళయు. శృం.నై.౭-౫౪

**సంవేశము.** సం.వి.అ. పుం. ౧. నిద్ర, ౨. ఆసనము, పీఠము. ౩. రతి, సురతము, రతిబంధవిశేషము. ౪. స్వప్నము ౫. నిద్రించుగది.

**సంవేశించు.** సం. అ. క్రి. నిద్రించు.

శా.... "చాల్, చాలుం బొమ్మని యల్కమూలుమొగమై చంద్రాస్య నిద్రించ నా, వ్యాకీన్ శాంతిమహార్ణనం బడఁగ సంవేశించె నమ్మానియున్. అహల్యాసం. ౩-౬౮.

**సంవేశిని.** సం. వి. ఈ. స్త్రీ. మొగసాల.

**సంవేల్లితము.** సం.విశే.(అ. ఆ. అ) ౧. సంవ(ర్తి)తము. ౨. బాగుగాఁ గదలింపఁబడినది.

**సంవ్యవహారము.** సం. వి. అ. పుం. ౧. విహితకృత్యము, పని, ౨. వాణిజ్యము, బేహారము.

**సంవ్యానము.** సం.వి.అ. న. ౧. కప్పు, ఆచ్ఛాదనము. ౨. వస్త్రము, బట్ట. ఉత్తరీయము, పైబట్ట.

**సంవ్యూహము** సం. వి. అ. పుం. ౧. కూడిక ౨. ఏర్పాటు.

**సంశప్తకుఁడు.** సం. వి. అ. పుం. ౧. యుద్ధమునుండి వెనుకకు మరలనని ప్రతిజ్ఞచేసినట్టియు, విరోధులను యుద్ధమునుండి పాఱిపోకుండఁ జేసినట్టియు యోధుఁడు. ప్రతిజ్ఞచేసి యుద్ధమునుండి మరలనియోధుఁడు అనివాచ౨. ఎన్నుకొనఁబడిన శూరుఁడు. ౩. సహయోధుఁడు, కూడి యుద్ధము చేయుయోధుఁడు, ౪. ఒకని జంపెద నని ప్రతిజ్ఞ చేసి కుట్రపన్నునతఁడు.

**సంశబ్దనము.**[1] సం. వి. అ. న. ౧. ధ్వనిచేయుట ౨. స్తుతించుట, పొగడుట ౩. పిలుచుట ౪. ఉదాహరించుట.

**సంశబ్దనము.**[2] సం. వి. అ. పుం. సంశబ్దనము.

**సంశమనము.** సం. వి. అ. న. ౧. ఉపశమింపఁజేయుట ౨. శమనకరమైనమందు.

**సంశమము.** సం. వి. అ. పుం. సౌఖ్యము.

**సంశయము.** సం. వి. అ. పుం. ౧. సందేహము, నిశ్చయములేమి.

ఉ. అవనుధాధనాథుని.... మంచెఁ దా ద్రిలో
కివి యోగ్యంబు లగుకీర్తిభరంబులు సంశయాంబునన్. శ్రీ. నై. ౧-౭౧.

౨. (న్యాయ) ఇరుతెఁగులయిన యయథార్థజ్ఞానములలో నొకటి, ఒక్కధర్మియందు విరుద్ధధర్మద్వయ మంటుటచేఁ గలిగిననిశ్చయాభాసము ౩. అనుమానము, ఊహ. ౪. అపాయము. ౫. సంగ్రామ్య.

**సంశయచ్ఛేది.** సం. విణ. న. సందేహము. తొలఁగించునది.

**సంశయాక్షేపము.** సం. వి. అ. పుం. ఒక అలంకారము.

**సంశయాత్ముఁడు.** సం. విణ. న్. (పుం. లిం) అనుమానించుహృదయము కలవాఁడు.( స్త్రీ. లిం. సంశయాత్మ) న. లిం. సంశయాత్మము.

**సంశయానుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) సంశయించువాఁడు.

**సంశయాపన్నుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సందేహమును బొందినవాఁడు ౨. అనుమానపడినవాఁడు.

**సంశయాళు (లు) వు.** సం. విణ. ఉ. సంశయించువాఁడు, సంశయానుఁడు.

**సంశయించు.** సం. అ. క్రి. సందేహించు.

ఆ. శిశువు మంట పెద్దసేయుచుఁ దెలియుచు,
ఘాడునట్లపోలె నఖిలభూతిసృష్టిఁ దానచేయుఁ
దెలియు నప్పరమాత్మ యిది నిజంబు సంశ
యింపవలదు. వరాహ. ౨-౧౯.

ఉ. ఒక్కటి సంశయించదగనొల్లక యొక్కటి
గూడఁబోక యెదొక్కటియైనఁ గోఁ.
ప్రబోధచం. ౫-౧౧౨.

**సంశయిత.** సం. విణ. (ఋ. త్రి. ఋ) సందేహపడువాఁడు, సంశయించువాఁడు.

**సంశయితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. అనిశ్చితమైనది. ౨. సందేహింపఁబడినది. ౩. సందేహాస్పదమైనది. ౪. అపాయముగలది, అపాయముఁ పొందినది.

**సంశరణము.** సం. వి. అ. న. ౧. యుద్ధారంభము ౨. శరణము పొందుట.

**సంశితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. వాడియైనది, వాఁడిపెట్టఁబడినది. ౨. నిశ్చయింపఁబడినది, ౩. పనియందు నేర్పుగలది.

**సంశితవ్రతుఁడు.** సం. విణ.(అ. ఆ. అ) ప్రతిన నెఱవేర్చినవాఁడు.

**సంశితాత్ముఁడు.** సం. విణ. న్. (అ. పుం) ౧. నియమితమనస్కుఁడు, ౨. సన్మార్గమునందేకాగ్రమైన మనస్సుగలవాఁడు. (స్త్రీ. లిం. సంశితాత్మ. న. లిం. సంశితాత్మము)

**సంశీతి.** సం.వి.ఇ. స్త్రీ.౧.సందేహము,సంశయము

**సంశీలనము.** సం.వి.అ.న.సక్రమమైన అభ్యాసము.

**సంశుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. పరిశుభ్రమైనది, శుద్ధమైనది, నిష్కల్మషమైనది. ౨. మెఱుఁగు పెట్టఁబడినది. ౩. ప్రాయశ్చిత్తముచేఁ బరిహారము కలుగఁజేయఁబడినది. ౪. ఋణమునుండిగాని, దోషమునుండిగాని విముక్తిఁ బొందినది. ౫. పరిశీలింపఁబడినది. ౬. పరీక్షింపఁబడినది.

**సంశుద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పాత్రములు మున్నగువానిని శుద్ధిచేయుట.

గీ. పాత్రసంశుద్ధి కార్యంబు ప్రస్తరించి యూరకుండిన .... భీమ ౨-౧౩౫.

౨. దేహాదులను శుభ్రపఱుచుట.

గీ.... స్నాన మాచరింప సంశుద్ధి యగు.
విజ్ఞా. కాం. ౧-౫౬.

౩. తప్పుదిద్దుట. ౪. (అప్పు) పూర్తిగాఁ దీర్చివేయుట. ౫. పరిశుద్ధి, నైర్మల్యము.

సంశోధనము. సం. వి. అ. న. ౧. పాత్రాదులను శుద్ధిచేయుట. ౨. దేహము మున్నగువానిని శుద్ధిపఱుచుట. ౩. అప్పుతీర్చివేయుట.

సంశోధించు. సం. స. క్రి. పరిశీలించు, విచార మొనర్చు.

సీ. కరవల్లిఁ జెంతించుఁ గరము సంశోధించుఁ
బ్రాణోపనిషదభిప్రాయ మరయు.
కాశీ. ౨-౧౫౧.

సంశూనము. సం. విణ. (అ. ఆ. అ) ఉబ్బినది, వాచినది, క్రొవ్వినది.

సంశోభిల్లు. సం. అ. క్రి. ప్రకాశించు; ఒప్పు.

శా. జంగన్నంసిపరంబున న్ననియ స్త్రంబు న్మహా
హారిమున్ సంకష్టిక్రమ బాహుదర్పముబు
సంశోభిల్లఁ జేసెన్.... హర. ౭-౧౭౪.

మ.... మహా, సురయోషాన్వితమై యానము
సంశోభిల్లఁ బూర్ణిమ మనుష్యిరకాంతిన్ బలి
చామరధ్వజచయూదీప్తస్థితిన్ ముందటన్.
భాగ. ౮-౩౩౦.

సంశ్చుత్తు. సం. వి. త. స్త్రీ. ౧. యుక్తి. ౨. ఇంద్రజాలము ౩. భ్రాంతి. (పుం.) గారడివాఁడు.

సంశ్యానము. సం. విణ. (అ. ఆ. అ) ౧. ముడుఁచుకొనినది, సంకుచితము. ౨. పేరుకొనినది, గడ్డకట్టినది. ౩. చల్లనిది. ౪. ఎండినది, శుష్కించినది.

సంశ్రయణము. సం. వి. అ. న. ఆసక్తి.

సంశ్రయము. సం. వి. అ. పుం. ౧. ఆశ్రయము, అండ, ఉనికిపట్టు. ౨. ఆశ్రయించుట, రక్షణము నపేక్షించుట. ౩. శరణము, రక్షణస్థానము. ౪. ఆసక్తి. ౫. అంశము.

సంశ్రయించు. సం. స. క్రి. ఆశ్రయించు, సేవించు.

తే. మహత్తత్త్వకలితు సంశ్రయించు మహాత్మ
ప్రసక్తిఁ గోరి.... భార. శాం. ౪-౨౭౬.

గీ. సర్వసంసారరూపిని సంశ్రయింతు, సకలసి
ద్ధిమేశ్వరేశ్వరు నభిలషింతు. భీమ. ౩-౨౦౪.

సంశ్రవణము. సం. వి. అ. న. ౧. చక్కఁగా వినుట. ౨. చెవి.

సంశ్రవము.[1] సం. వి. అ. పుం. బాగుగ వినుట, శ్రద్ధతో వినుట ౨. ఒడంబడిక, అంగీకారము, వాగ్దానము.

సంశ్రవము.[2] సం. వి. అ. న. ప్రఖ్యాతి.

సంశ్రితుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. ఆశ్రయించినవాఁడు, అండచేరినవాఁడు. ౨. రక్షింపఁబడినవాఁడు. ౩. కలసినవాఁడు. ౪. ఆశ్రయించినవాఁడు వి. అ. పుం. ఆశ్రితుఁడు; సేవకుఁడు.

సంశ్రుతము. సం. విణ. (అ. ఆ. అ) ౧. అంగీకరింపఁబడినది, ఒప్పుకొనఁబడినది. ౨. బాగుగా వినఁబడినది.

సంశ్లాఘించు. సం. స. క్రి. ప్రశంసించు, మెచ్చు.

మ.... ఏ,జను లెక్కతథ సర్వకాలముల సంశ్లా
ఘింతు రవ్యాజతన్.

క. వెలయాల్లాగోఁ జేసిన కలుషము దొలఁగంగ
వరము గణియింపుఁడు.... వరాహ. ౧౨-౩౯.

సంశ్లిష్టము.[1] సం. విణ. (అ. ఆ. అ) ౧. చక్కఁగాఁ గలిసికొన్నది. ౨. కౌఁగిలింపఁబడినది. ౩. చేర్పఁబడినది, తగిలింపఁబడినది. ౪. సంపన్నమైనది, కలిగియున్నది. ౫. సంబద్ధమైనది, చక్కఁగాఁ గట్టఁబడినది, సంబంధించినది.

సంశ్లిష్టము.[2] సం. వి. అ. న. ఒక విధమైన మండపము.

సంశ్లేషము.[1] సం. వి. అ. పుం. రాశి, సమూహ

**సంశ్లేషణ.** సం. వి. అ. స్త్రీ. ౧. దగ్గఱఁగా చదుపుట. ౨. కలిపికట్టుసాధనము. ౩. బంధము, కట్టు.

**సంశ్లేషణము.** సం. వి. అ. న. సంశ్లేషణ.

**సంశ్లేషము.** సం. వి. అ. పుం. ౧. కౌఁగిలింత, ఆలింగనము.

మ. ...వరా గోర్త్ర ప్రియోపనాయకభుజాసంశ్లేషలీలాసుఖవ్యవసాయుఁడు సమాజసంకటము సం ప్రార్థించి కైకొంచు.... శృం. నై. ౬-౬౪

౨. కలయిక, సంబంధము. ౩. (వ్యాక) మీఁది హల్లులోఁ గూడికొనుట.

**సంశ్లేషించు.** సం. స. క్రి. కౌఁగిలించు.

మ. కృతకృత్యుండవు నీప్రతాపవహ్నిమ్మూర్తిఁ గీర్తింపఁగాఁ జతురాస్యుండును నోపఁ డగ్రజనతాసాధ్యక్రియల్ నీవుచేసితి గానన్ బ్రతిగాన నైన నిను సంశ్లేషింపుఁ బాటింపుమా, ప్రతికారంబుగ నంచుఁ గౌఁగిటను సంభావించె వాయ్వర్భకున్. సమీర. ౩-౧౩౧.

**సంశ్లోకించు.** సం. స. క్రి. కీర్తించు, పొగడు.

శా. నీలోదంద్రుఁడను నీకుమారవరుఁడన్ నీబాధుఁడన్ నీవు సంశ్లోకింపన్ సతులంబు బెడల్ మిగుల సమ్మోదింప రాత్రించరుల్ శోకింపఁ ద్రవవీయగర్భముఁ దేజోమూర్తి గన్గొంటి దన్, నాకున్ జేసుక పుట్టి నీసుతుఁడనై వర్తించి వర్తింపఁగాన్. భాగవ. ౮-౪౦౬

**సంసక్తము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. మిళితమైనది, కలసియున్నది. ౨. లగ్నమైనది, తగులుకొన్నది. ౩. అవ్యవహితమైనది, దగ్గఱగానున్నది. ౪. అంతటను వ్యాపించినది. ౫. ఏకాగ్రమైనది ౬. సంపన్నము, కలిగియున్నది. ౭. కట్టఁబడినది. ౮. లౌకికసుఖాసక్తమైనది.

**సంసక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. కలసియుండుట, అంటిపెట్టికొన్నస్నేహము, మైత్రి. ౨. సామీప్యము ౩. పరిచయము, సేవ. ౪. బంధించుట, కూర్చుట. ౫. ఆసక్తి, తత్పరత.

సీ.... శారీరసౌఖ్యసంసక్తి వదలి...
భార. శాంతి. ౧-౭౫.

**సంసత్తు.** సం. వి. త్. స్త్రీ. ౧. సభ ౨. న్యాయసభ. ౩. కొలువుకూటము. ౪. సమూహము.

**సంసదనము.** సం. వి. అ. న. క్రుంగఁబడుట.

**సంసరణము.** సం. వి. అ. న. ౧. ముందుకుఁ బోవుట. ౨. బాట. ౩. ప్రపంచము; ప్రాపంచిక జీవితము, జననమరణప్రవాహరూపసంసారము. ౪. నిరాటంకముగా సేనలు వెడలుట. ౫. యుద్ధారంభము. ౬. రాజమార్గము, ఘంటాపథము. ౭. పురద్వారసమీపమున మార్గస్థులు విశ్రమించు స్థలము. ౮. సంగతి, కూడుట (వాచ.) ౯. గమను.

**సంసరించు.** సం. అ. క్రి. సంసారమునఁ బ్రవర్తించు, జననమరణప్రవాహము నొందు.

వ. విశేషంబుల నెల్ల శీఘ్రంబ దప్పింపక తగు ణంబు గా సంసరింపం జేయుచు లీలాప్రవృత్తుం డయ్యె నీశ్వరుండు. కవిక. ౫-౧౪౧.

వ.... సనందనాదులును బ్రాగ్విభిర్వ్యాకల్పంబుల సంసరించుట భావనాబద్ధులై.... ఆము. ౩-౭౯.

**సంసర్గము.** సం. వి. అ. పుం. ౧. కలుపుట, మిశ్రముచేయుట. ౨. సహవాసము.

శా. చే పింగావలియున్ విరించి నిఖిలస్త్రీపుంస సంయోగవాగ్జ్ఞానప్రౌఢి ప్రకాశ మొందఁ గడు లియ్యం బైనసంసర్గము—
శృం. నై. ౬-౭౫.

౩. స్పర్శము. ౪. పరిచయము. ౫. సురతము, పొందు. ౬. సహస్థితి. ౭. సన్నిహిత సంబంధము కలిగియుండుట. ౮. రోగకారణమైనత్రిదోషములలో రెండింటికి కలయిక. ౯. గ్రహముఁ గూడిక.

**సంసర్గదోషము.** సం. వి. అ. పుం. దుష్టుల సహవాసమువలనఁ గలుగుకీడు.

**సంసర్గవిద్య.** సం. వి. ఆ. స్త్రీ. సాంఘికశాస్త్రము.

**సంసర్గి.**[1] సం. విశే. (న్. నీ. న్) ౧. సంసర్గము కలవాఁడు, సహవాసి, సహవాసము గలవాఁడు. ౨. సంబంధముగలవాఁడు. ౩. పరిచయము గల వాఁడు. చేరువుగలవాఁడు, వి. న్. పుం. సహ వాసి, సహచరుఁడు తోడివాఁడు.

**సంసర్గి.**[2] సం. వి. ఈ. స్త్రీ. (వైద్య) సంశోధ వాసి, సహచరుఁడుఁము, శుద్ధిచేయుట.

**సంసర్జనము.** సం.వి.అ.న. ౧. మిశ్రముచేయుట; కలుపుట. ౨. విడిచిపెట్టుట, వదలుట. ౩. పైకిఁ ద్రోసివేయుట. ౪. ఆక్షేపించుట.

**సంసర్పణము.** సం. వి. అ. న. ౧. ప్రాఁకుట ౨. అకస్మికముగాఁ పైకివచ్చుట.

**సంసర్పము.** సం. వి. అ. పుం. ౧. ప్రాఁకుట. ౨. క్షయమాసముతోఁ గూడినసంవత్సరమున వచ్చునధికమాసము.

**సంసర్పి.** సం. విశే. (న్. నీ. న్) ప్రాఁకునది.

**సంసాదము.** సం. వి. అ. పుం. సభ.

**సంసారగురువు.** సం. వి. ఉ. పుం. ౧. మన్మథుఁడు. ౨. లోకాచార్యుడు, లోకగురువు.

**సంసారచక్రము.** సం. వి. అ. న. జననమరణ ముల పరంపర.

**సంసారమార్గము.** సం.వి. అ. పుం. ౧. లోక వ్యవహారపుపద్ధతి. ౨. యోనిద్వారము.

**సంసారము.** సం. వి. అ. పుం. ౧. పద్ధతి, మార్గము ౨. ప్రపంచజీవయాత్ర. ౩. జననమరణ ప్రవాహము. ౪. ప్రపంచసంబంధమైన భ్రాంతి, ప్రాపంచికవ్యామోహము ౫. గార్హస్థ్యము, ౬. కాపురము. (ఈ యర్థము తెలుఁగు గ్రంథము లందే కలదు) శుక. ౧-౭౭౪.

**సంసారమోక్షణము.** సం. వి. అ. న. జన్మ పరంపరనుండి విడుదల, ముక్తి.

**సంసారమోక్షము.** సం. వి. అ. పుం. సంసార మోక్షణము.

**సంసారి.**[1] సం. విశే. (న్. నీ. న్) ౧. ప్రపంచ సంబంధమైనది.

**సంసారి.**[2] సం.వి.న్.పుం. ౧. ప్రాణి, జంతువు. ౨. జీవాత్మ. ౩. గృహస్థు.

**సంసిద్ధము.** సం.విశే. (అ.ఆ.అ) ౧. పూర్తిగా నెఱవేఱినది. ౨. స్వభావసిద్ధము. ౩. నేర్పు గలది. ౪. అమోదింపఁబడినది.

గీ. ఆదిమం బైన బ్రహ్మచర్యాశ్రమంబు పేర
సంసిద్ధ మెఱిఁగించు విన్నఁడు తెలియ.
సూత. అ ౨. పు ౧౧౨.

**సంసిద్ధి.** సం.వి.ఇ. స్త్రీ. ౧. సంపూర్తి; పూర్తిగా నెఱవేఱుట. ౨. ముక్తి, మోక్షము. ౩. స్వభావము, నైసర్గికస్థితి, స్థితి. ౪. సులభముగాఁ కోపము వచ్చెడి స్త్రీ, మత్తురాలు. ౫. ఫలితము. ౬. తుది నిర్ణయము.

**సంసిద్ధుఁడు** సం. వి. అ. పుం. ౧. ముక్తిపొందిన వాఁడు ౨. సిద్ధపడిన వాఁడు.

**సంసూచనము.** సం.వి.అ. న. ౧. స్పష్టముగాఁ జూపించుట, రుజువుచేయుట. ౨. తెలియఁజేయుట. ౩. సూచించుట, సూక్ష్మముగాఁ దెలుపుట. దూషించుట, దూఱుట.

**సంసూచించు.** సం. స. క్రి. జాడగాఁ దెలియఁజేయు.

మ. అట ము న్నెక్కుడు శైలశైలములు సహ్యాగ్ర
రోహణం బాచరించుటకై పెన్పొలికత్తియల్
దగు నప్పం సంసూచించినన్ గాంత యుత్కట
సంతోషముఁబొందు. కాశీ. ౪-౨౨౩.

**సంసృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రవాహము, ౨. లోకయాత్ర, ప్రపంచజీవనము. ౩. జనన మరణప్రవాహము, సంసారము.

**సంసృష్టత.** (గ్రామ.) అ. న సం. వి. అ. స్త్రీ. ౧. సంబంధము, కలయిక. ౨. జ్ఞాతులు విభక్తులైన తర్వాత మరల మైత్రితో గలసి యుండుట

**సంసృష్టము.** సం.విశే. (అ.ఆ.అ) ౧. మిశ్రమము, కలసినది, ౨. కూర్పఁబడినది. ౩. చుట్టుకొనినది. ౪. సృజింపఁబడినది. ౫. శుంఠిలేపము చేసినది.

౧౫. పవిత్రముచేయుట. ౧౬. ఉపనయనము. ౧౭. వేదోక్తకర్మము. ౧౮. అపరకర్మము, ఉత్తరక్రియ. ౧౯. పాపపట్టుదాఁగు.

**సంస్కృతము.**[1] సం. విశే. (అ. అ. అ) ౧. సంస్కరింపఁబడినది, చక్కఁజేయఁబడినది, మెఱుగుపెట్టఁబడినది, శ్రద్ధతో చేర్పఁబడినది. 3. వండఁబడినది, సిద్ధము చేయఁబడినది. ౪. పవిత్రప్రయోజనమునకు సమర్పింపఁబడినది. ౫. శుద్ధిచేయఁబడినది. ౬. అలంకరింపఁబడినది. ౭. ఉత్తమమైనది.

**సంస్కృతము.**[2] సం.వి.అ. పుం. ౧. వ్యాకరణశుద్ధపదము, సాధుపదము.

**సంస్కృతము.**[3] సం. వి. అ. న. ౧. శుద్ధమైన భాష, గీర్వాణభాష.

సీ. అలవిద్య యనవద్యమై యొప్పు నావిద్య సం
స్కృతప్రాకృతసరణి నైన, దేశభాషలనైన
దేశికుం డుపదేశ మొసఁగంగఁ దగు శివ్యవిస
రము లెస్స.... శివధర్మోత్తరము. ౨-౬.

౨. శిష్టాచారము, సదాచారము 3. హోమద్రవ్యము, హవిస్సు.

**సంస్కృతి.** సం. వి. ఇ. స్త్రీ. సంస్కారము.

ఉ. కావున వేగ మగ్నియును గాష్ఠములున్ సమ
కూర్చి సద్విజశ్రీ విలసిల్లఁ గృష్ణునిశరీరము
సంస్కృతిఁ గూర్చి క్రమ్మఱం బోవుట బుద్ధి
యంచు.... భార. మౌసల. ౧౩౧.

౨. నాగరికత.

**సంస్కృతుఁడు.**[1] సం. విశే. (అ.అ.అ) గృహస్థధర్మమునఁ బ్రవేశించినవాఁడు, పెండ్లాడినవాఁడు

**సంస్కృతుఁడు.**[2] సం. వి. అ. పుం. ఉపనయనాదిసంస్కారములచే సంస్కరింపఁబడిన ద్విజుఁడు. ౨. విద్వాంసుఁడు, పండితుఁడు.

**సంస్క్రియ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పవిత్రముచేయుకర్మ ౨. పవిత్రముచేయుట. 3. ఉత్తరక్రియ, శ్రాద్ధకర్మ.

**సంస్తంభనము.** సం. వి. అ. న. ౧. రోగనిరోధనక్రియ. ౨. ఆఁపుట; నిలుపుట.

**సంస్తంభము.** సం. వి. అ. పుం. ౧. ప్రాపు, ఆశ్రయము, ఆధారము ౨. స్థిరపఱుచుట, బలపఱుచుట. 3. ఆఁపుట, నిలుపుట. ౪. మ్రాన్పడుట, కొయ్యబాఱుట ౫. మొండితనము.

**సంస్తంభించు.** సం. స. క్రి. మ్రాన్పడఁజేయు, కదలకుండనిలుపు.

ఈగరళాగ్నిఁ గంధరా, ఘట్టమునందు నిల్పుము
(౬౫) వ. అనుటయు (౬౯) శా. శంభుం
డంచితకృపాళుఁడై కాని యగ్న్యాస్యక్ష్వేళార్చులు
సంస్తంభించి నిర్ణిద్రకంఠగోళమున.... కాల
మున్. (౭౦) భీమ. ౪. ౬౫-౭౦.

**సంస్తబ్ధము.** సం. విశే. (అ. అ. అ) ౧. నిలుపఁబడినది. ౨. స్థిరపఱుపఁబడినది. 3. ధీరమైనది. ౪. నిశ్చలమైనది. ౫. కొయ్యబాఱినది. ౬. బలపఱుపఁబడినది.

**సంస్తరము.** సం. వి. అ. పుం. ౧. శయ్య, చిగురుటాకులపెజ్జ. ౨. యాగము. 3. వ్యాప్తి, ప్రచారము.

**సంస్తవము.** సం. వి. అ. పుం. ౧. స్తోత్రము, పొగడ్త ౨. పరిచయము 3. అనుకూల్యము. ౪. సామరస్యము.

**సంస్తవప్రీతి.** సం. వి. ఇ. స్త్రీ. పరిచయమువల్లఁ గలిగిన ప్రేమ.

**సంస్తారము.** సం. వి. అ. పుం. ౧. పఱచుట, విస్తరింపఁజేయుట ౨. శయ్య, పఱపు.

**సంస్తావనుఁడు.**[1] సం.విశే. (అ.అ. అ) ౧. బాగుగా స్తోత్రముచేయువాఁడు, వాగ్ధాటిగలవాఁడు

**సంస్తావనుఁడు.**[2] సం. వి. అ. పుం. ౧. ఉద్గాతృ, సామగానముచేయువాఁడు. ౨. ఋత్విజుఁడు.

**సంస్థాపించు.** సం. స. క్రి. ప్రతిష్ఠించు (దేవతాదులను). స్థాపించు (మాట మొ.) నిలఁబెట్టు, స్థిరపఱుచు.

క. అన్యాగమయుఁ డైనసోముఁడు, సమయంబున నేమహేశు సంస్థాపించెన్, విమలసుధాజ్యోతిర్లింగము సోమేశ్వరుని గరళకంఠు భజింతున్.
భీమ. ౩-౧౪౯.

మ. స్వమతిప్రౌఢి దృఢానుమానముల సంస్థాపించు నెవ్వేళ నెృద్ధి మతం బప్పుడు....
ప్రభా. ౪-౬౨.

**సంస్థాపితము.** సం.విణ. (అ.ఆ.అ) ౧. ప్రోఁగు చేయఁబడినది. ౨. స్థాపింపఁబడినది. ౩. నిరోధింపఁబడినది, నిగ్రహింపఁబడినది, నిలఁబెట్టఁబడినది.

**సంస్థితము.**[1] సం.విణ. (అ. ఆ. అ) ౧. చక్కఁగానున్నది.

సీ. శ్రద్ధాప్రథమములు సకలధర్మంబులు శ్రద్ధయ మధ్యాంతసంస్థితంబు.
శివధర్మోత్తరము. ౧-౧౪౨.

౨. కలసియున్నది, కూడనున్నది. ౩. దగ్గఱగానున్నది, సామీప్యమున నున్నది. ౪. పోలియున్నది. ౫. ప్రోఁగుచేయఁబడినది. ౬. స్థిరపడినది. ౭. ఒకదానిలో నుంచఁబడినది. ౮. స్థిరమైనది. ౯. ముగిసినది, పూర్తియైనది. ౧౦. చచ్చినది.

**సంస్థితము.**[2] సం. వి. అ. న. స్థితి, రూపము, ఆకారము.

**సంస్థితి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. కూడనుండుట, కలసియుండుట, సహస్థితి. ౨. సామీప్యము ౩. నివాసము. ఉనికిపట్టు. ౪. రాశి, ప్రోఁగు. ౫. ఎడఁతెగకుండనుండుట, అవిచ్ఛిత్తి, విరామము. లేకయుండుట. ౬. స్థితి,ఉనికి,జీవనస్థితి. ౭. ఆటంకము, అడ్డంకి. ౮. చావు. ౯. ప్రళయము, ప్రపంచనాశము. ౧౦. సమానస్థితియందుండుట. ౧౧. అదక్షించుట.

**సంస్థుఁడు.** సం. వి. అ. పుం. ౧. నివాసి, కాపురముండువాఁడు ౨. పొరుగువాఁడు. ౩. చారుఁడు, గూఢచారుఁడు.

**సంస్పృశ్య (ర్శ)** సం.వి.ఆ. (ఈ). స్త్రీ. కోరింద (శ. ర.)

**సంస్పర్శ (న) ము.** సం. వి. అ. పుం. ౧. తాఁకుట, తగులుట.

ద్వి. భక్తుల పాదసంస్పర్శనంబునను వ్యక్తిగా నిర్మలత్వంబుఁ బొందుమనః.
బసవపు. ౩ P ౧౪౦.

౨. సంబంధము, సాంకర్యము. ౩. స్పర్శజ్ఞానము.

**సంస్పర్శించు.** = సంస్పృశించు. సం. స. క్రి. తాఁకు.

వ....ఐరావణకుంభికుంభాస్ఫాలనకర్కశం బగు కరంబున వాస్తోష్పతి తన్ను సంస్పర్శించి గారవించిన మన్మథుండు.... హర. ౩-౫౩.

**సంస్పృశించు.** = స్పృశించు సం. స. క్రి. ౧. తాఁకు.

చ.... ఇదేమి ఖగేంద్ర యంచు శ్రీ, హరి దన హస్తపద్మమున నాతనిమస్తము సంస్పృశించి యాకురి హరించి. ఉ. రా. ౨-౭౮.

౨. చల్లు. ౩. తాకించు ౪. పుక్కిలించు ౫. సందర్శించు.

**సంస్పృష్టము.** సం.విణ. (అ.ఆ.అ) ౧. చక్కఁగా స్పృశింపఁబడినది. ౨. మిశ్రముకలసినది. ౩. కలుషితమైనది.

**సంస్ఫాలము.** సం.వి.అ.పుం. ౧. గొఱ్ఱెపోతు; పొట్టేలు. ౨. మేఘము.

**సంస్ఫుటము.** సం.విణ.(అ.ఆ.అ) వికసించినది.

**సంస్ఫేటము.** సం. వి. అ. పుం. యుద్ధము.

**సంస్ఫోటము.** సం. వి. అ. పుం. యుద్ధము.

**సంస్ఫోటి.** సం. వి. ఇ. పుం. యుద్ధము.

**సంస్మరణము.** సం. వి. అ. న. చక్కఁగా జ్ఞప్తికిఁదెచ్చుకొనుట.

వ. తనపూర్వజన్మవర్తనంబును దజ్జన్మనిమిత్తంబైనతత్పూర్వవర్తనంబును సంస్మరణసంబంధపరంపరావశంబున సమస్తంబును గరతలామలకంబుగా సాకలించి.... కళా. ౫-౧౦.

**సంస్మరించు.** సం. స. క్రి. తలఁచు.

సీ. సంభ్రమోద్భ్రమముల విశ్వాసపాత్రంబుల,
సౌవిదల్లుల నర్థి సంస్మరించు.... కాశీ ౨-౧౪.

**సంస్మారణము.** సం. వి. అ. న. లెక్కించుట (పశువులు మొ.)

**సంస్మృతి.** సం. వి. ఇ. స్త్రీ. సంస్మరణము.

**సంస్ర (స్రా) వము.** సం. వి. అ. పుం. ౧. స్రవించుట, కారుట. ౨. ప్రవాహము. ౩. బలివిశేషము. ౪. బలిశేషము.

**సంహతజానువు.** సం. విశే. (ఉ) దగ్గఱగా నున్న మోకాళ్లు గలవాఁడు, ముడిగాళ్లవాఁడు.

**సంహతభ్రువు.** సం. విశే. (ఉ) ఒండొంటిం గలిసిన కనుబొమలుగలవాఁడు, ముడిపడిన కనుబొమలు గలవాఁడు.

**సంహతము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. దృఢమైన కీళ్లుగలది. ౨. కొట్టఁబడినది. ౩. మూయఁబడినది. ౪. చేర్పఁబడినది. ౫. దగ్గఱగాఁగూడియున్నది, కలిసియున్నది, కలిసినది. ౬. ఐకమత్యము గలది ౭. దట్టమైనది. ౮. గుంపుగా నున్నది, ప్రోఁగుపడినది.

**సంహతలము.** సం. వి. అ. పుం. మ్రొక్కుటకు వ్రేళ్లు చేర్చి కూర్చినచేదోయి. (శ. ర) (సంఘతలము)

**సంహతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. దృఢసంబంధము ౨. కూడిక, ఏకీభావము. ౩. దట్టమగుట, సాంద్రత. ౪. స్థౌల్యము, లావు. ౫. అనుకూల్యము. ౬. సమూహము, ప్రోఁగు.

సీ.... ప్రద్యుమ్ను నక్షుద్ర, భల్లసంహతి మూర్ఛ
పాలు చేసె. చిత్రభా. ౭-౧౨౨

౭. బలము ౮. శరీరము. ౯. మిక్కిలి హింసించుట, చంపుట. ౧౦. గట్టిపడుట, వాచుట. ౧౧. కట్టుట, అతుకుట.

**సంహననము.** సం. వి. అ. న. ౧. దట్టముగా నుండుట, సాంద్రత. ౨. శరీరము. ౩. బలము. ౪. అవయవములురాపిడి. ౫. చంపుట. హననము. ౬. సముదాయము, మొత్తము ౭. సంబంధము.

**సంహననీయము.** సం. విశే. (అ. ఆ. అ) సాంద్రమైనది, ఘనమైనది.

**సంహరణము.** సం. వి. అ. న. ౧. ప్రోఁగుచేయుట ౨. పట్టుకొనుట ౩. ముడుఁచుకొనుట, సంకుచితమగుట. ౪. ఆఁపుట, నిలుపుట. ౫. నశింపఁజేయుట, సంహరించుట ౬. వెనుదీయుట; మానుకొనుట.

**సంహరించు.** సం. స. క్రి. ౧. చంపు.

వ.... ధరణి ధరియించి హిరణ్యాక్షు సంహరించి.... మార్క. ౧-౧౧౬.

౨. దగ్గఱకుఁ దెచ్చు ౩. క్లుప్తముచేయు, సంకుచితముచేయు. ౪. నిగ్రహించు, నిరోధించు.

ఉ. కోపము సంహరింపు మునికుంజర.... భీమ ౨-౧౦౬.

౫. ముగించు. ౬. పట్టుకొను, గ్రహించు. ౭. పెద్దత్రోవపట్టించు, అవనీతిపఱచు.

**సంహర్త.** సం. విశే. (ఋ. స్త్రీ. ఋ) నశింపఁజేయువాఁడు.

**సంహర్షణము.** సం. వి. అ. న. ౧. అనుకరణము. ౨. స్పర్ధ. ౩. ఆనందము.

**సంహర్షము.** సం. వి. అ. పుం. ౧. రోమాంచము, గగుర్పాటు. ౨. ఆనందము, సంతోషము ౩. స్పర్ధ, అనుకరణము. ౪. వాయువు. ౫. రాపిడి, సంఘర్షణము, ఒరయిక. ౬. కామోద్రేకము.

**సంహాతము.** సం. వి. అ. పుం. సంఘాతము, నరక భేదము, ఇరువదియొక నరకములలో నొకటి.

**సంహారకము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సంహరించునది, నశింపఁజేయునది. ౨. ముణుఁచునది ౩. ముగించునది.

**సంహారకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) సంహర్త.

**సంహారము.** సం. వి. అ. పుం. ౧. ప్రోఁగు చేయుట ౨. సంకోచము, ముడుఁచుకొనుట. ౩. అస్త్రముల నుపసంహరించుట. ౪. ఆఁపుట. ౫. నాశము, ప్రళయము. ౬. ముగింపు, సమాప్తి.

గీ. అనఘ! విష్ణువిహారంబు లైన విమల,వివిధ
నిక్షేపసంహారవృత్తులందు భ్రమణ మొందెడి
జీవుని బహుళకర్మ,ములవశంబునఁ జాతని
బొందుచుండు. భార. శాంతి. ౫-౪౧౩.

శా. ఆవీరుండును పాదచారియయి బ్రహ్మాండంబు
గంపింప గ్రోధావష్టంభమునన్ మహత్తనయు
సంహారంబు గావింపఁగా—
చిత్రభారతము. ౭-౧౦౪

౭. గుంపు,సమూహము. ౮. ఉచ్చారణదోషము, పలుకుబడిలోనితప్పు ౯. అస్త్రముల నుపసంహరించుమంత్రము. ౧౦. నేర్పు, నైపుణ్యము. ౧౧. నరకమునందలి యొక భాగము.

**సంహరించు.** సం. స. క్రి. వధించు.

క. సంహృతశివ నీతిక్తికి, నంహోమతి వక్రులైన
నప్పుడ 'తేశీఘ్రం హంతవ్యా' యనుటను,
సంహరించుటయ పథము జనకులకైనన్.
శివతత్త్వ. ౨౭౯.

**సంహిత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కూడిక, ఏకీభావము. ౨. సంకలము, కూర్పుట. ౩. క్రమపద్ధతి నేర్పఱుపఁబడినపద్యసమూహము. ౪. ధర్మశాస్త్ర సంగ్రహము,స్మృతి (ఉదా. మనుసంహిత) ౫. మంత్రరూపమయిన (ఛందోబద్ధమైన) వేదభాగము.

చ. పరమపదాప్తిహేతు వగుభారతసంహితశౌన
కాదిభూసురవరు లింపుగ నంగరఁగుచోఁ బ్రవచిం
చెన.... భార. స్వర్గా. ౯౪.

వ. అకుంఠితకంఠకుహరాంతర్గళ ద్విసర్గశబ్దసంహితా
పదక్రమాది నానావిధావధానపరంపరాధ్యంక
గంగాప్రవాహవ్యూహ....
శివధర్మ. ౧-౨౩.

౬. (వ్యాక) వర్ణముల యతిశయితసన్నిధి. అక్షరములను మిక్కిలి దగ్గఱగా నుచ్చరించుట. ౭. పరమాత్మ ౮. వేదతుల్యమైన గ్రంథము.

**సంహితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సంధింపఁబడినది. కూర్పఁబడినది. ౨. అనుకూలమైనది. సరిపడినది. ౩. సంబంధించినది. ౪. ప్రోఁగు చేయఁబడినది. ౫. సంధానము చేయఁబడినది, అమర్పఁబడినది. ౬. కలుగునట్లు చేయఁబడినది. ౭. స్థిరపఱుపఁబడినది. ౮. సంకలితము.

**సంహూతి.** సం. వి. ఇ. స్త్రీ. పెక్కండ్రు పిలిచిన పిలుపు.

**సంహృతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. దగ్గఱగాఁ జేర్పఁబడినది. ౨. సంకోచింపఁజేయఁబడినది. ౩. వెనుకకుఁదీయఁబడినది. ౪. ఉపసంహరింపఁబడినది.

క. సంహృతనిర్మోకమహాహిబలి విగతక్లమంబై
కుఱుఁ దనిరెదు నగుచుఁ గాకుత్స్థునితో.
జైమిని ౬-౧౭౦.

౪. సంఘముగాఁజేర్పఁబడినది. ౫. బలాత్కారముగాఁబట్టుకొనఁబడినది. ౭. నశింపఁజేయఁబడినది, చంపఁబడినది.

**సంహృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సంకోచము, ముడుఁచుకొనుట. ౨. సంహారము, చంపుట. ౩. పట్టుకొనుట,బలాత్కారముగాఁబట్టుకొనుట. ౪. అడ్డగించుట ౫. సమూహము, గుంపు.

**సంహృష్టము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ఆనందించినది. ౨. నిక్కపొడుచుకొనునది. ౩. పోటీపడినది.

**సంహ్రీణుఁడు.** (సం. విణ. (అ. ఆ. అ) ౧. సిగ్గుపడినవాఁడు, హీనపఱుపఁబడినవాఁడు.

**సకంటకము.**[1] సం.విణ.(అ.ఆ. అ) ౧. ముండ్లు గలది, కంటకసహితము. ౨. బాధకలిగించునది, అపాయకరమైనది.

**సకంటకము.**[2] సం.వి.అ.పుం. శైవలము,నాచు

**సకంప (న) ము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. కంపముతోఁగూడినది;వణఁకుగలది. ౨.వణఁకునది.
ఉ. ఘనగర్జల్ సకలింత లార్చితజలాకల్ తెల్లజల్లుల్ సకంపనశఁపాలతికన్....
వరాహ. ౧౦-౯౩.

**సకటము.** సం. విణ. (అ.ఆ.అ) ౧. దుష్టమైనది. ౨. నీచమైనది.

**సకటుఁడు.**సం.విణ(అ.ఆ.అ)దుష్టుఁడు,చెడ్డవాఁడు

**సకరము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. చేతులు కలది. ౨. పన్నులుధరించునది. 3. తుండము కలది. ౪. కిరణములతో నిండినది.

**సకరుణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. దయతోఁగూడినవాఁడు. ౨. కోపలుఁడు.

**సకర్ణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. చెవులుగలవాఁడు. ౨. వినువాఁడు.

**సకర్తృకము.** సం.విణ.(అ. ఆ. అ) కర్తకలది.

**సకర్మకము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ఏకార్యముసైనను చేయునది.౨. (వ్యాక) కర్మకలది.

**సకలము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. భాగముతోఁగూడినది. ౨.సమస్తము, సంపూర్ణమైనది.
ఆ. వె. అర్థసిద్ధికంటెనరయనెక్కుడు ధర్మసిద్ధి దానసకలసిద్ధులును బ్రకటస్థితఁగీఁజేరు.
భార. శాంతి. ౨-౪౦౮.

3. అన్నికళలతోఁగూడినది,(చంద్రబింబమువలె)
క. అని సకల బ్రహ్మపార్థనంబు వేసి....
భార. విరా. ౧-౨.

౪. మృదుమృదు మందమమైన ధ్వనితోఁగూడినది

**సకలము.** సం. వి. అ. న. అంతయు, సర్వము.

**సకలవర్ణము.** సం. విణ. (అ. ఆ. అ) క. ల. యనెడి యక్షరములు గలది (పదము)

**సకలహము.** సం. విణ. అ. ఆ. అ) కలహము గలది. కలహశీలము.

**సకలా (లా) తు** వి. (తురు.సకలాత్,సకలాతు) సింధూరపు రంగుబట్ట.

౨. ఉనినిబట్ట, కంబళి.

సీ. కటిసీమనెఱ్ఱడాల్ కాసెలపైమందు సకలాతు మునుఁగు దస్తాలమర్చి. రంగా. 3-3౪.

3. సాలువు. ౪. జరీ వ్రాఁతపని.

గీ. పసిఁడి సకలాతు ప్రాఁబచ్చ పసులగింప, పెండరంబులు మొదలైన బియము లలర.
సానందో. 3-౪౩.

**సకల్పము.** సం. విణ. (అ. ఆ. అ) వేదవిహిత కర్మలతోఁగూడినది.

**సకల్పుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సకాకోలము.** సం.వి. అ. పుం. ఇరువదియొక్క నరకములలో నొకటి.

**సకామము.** సం.విణ.(అ.ఆ.అ) ౧. ప్రేమతోఁగూడినది. ౨. భోగములం దాసక్తిగలది.

**సకాముఁడు.** సం. వి. అ. పుం. తాలచేతిన కోరికలుగలవాఁడు, తృప్తుఁడు.

**సకారము.** సం. విణ. చులుకైనది, శక్తిమంతమైనది.

**సకాలము.** సం. విణ. (అ. ఆ. అ) యుక్తకాలమందైనది.

**సకాసము.** సం. విణ (అ. ఆ. అ) ౧. కనఁబడునది. దృశ్యమైనది. ౨. దగ్గఱమున్నది. సం. వి. అ. పుం. ౧. సామీప్యము.

క. శ్రీరుచిర కాశికరణ్డము, హారమణిమణిసమిద్ధకృత
విద్ధసతో, నీరాభిషేకజలధా, రారమ్యాస
కాశసిద్ధరామ మహేశా! శివధర్మ. ౪-౧.

వ. ఏను గానవంబునకుం జని మునిజనసకాశం
బున సుఖినై యుండెద....
భార. శాంతి. ౧-౪౩.

౨. ఒద్ద.

**సకి.** (సం. సఖి.) వి. చెలికత్తె, ఆడుది.

**సకిన.** వి. ౧. కృత్రిమపక్షి.

చం. చికిలిపసిండి వ్రాఁతనును చెంద్రికవన్నియ
మేలుకట్టునన్, జకచక పవ్వఁగ్రొవ్విరులు చం
పకముల్ సవితేంట్లు మూతిముట్టకవక్కఁపుఁ
గెంపుమొగడల్ గని రాఁ దలిముత్తియంపు
బల్, సకినల కూఁకలన్ గిలగిల న్నగు
మోహనశయ్య నున్నెడన్. (శ. ర.)
వసు. ౬-౩౪.

౨. కిచుకిచుమను ధ్వని.

గీ. ఈఁగ వ్రాలిన నందంద యొలుఁగు
లొసఁగు నట్టి సకినలమంచము లాదిగాగ.
(శ.ర.) స్వా. మను. ౬.

౩. కిచుబిళ్ల.

సీ........ వెలవు లేర్పడుచున్న మొలకచన్నుల
చెన్ను బంగారు సకినలభంగి మెఱయ.
విక్రమా. ౭-౮౯.

౪. బొమ్మ.

తే. గీ. సంజ పెదచల్లు చెంగావి సాలువులను,
నుత్తగజగామినులతడి యొత్తి రపుడు, చాలఁ
జూపట్టె నా పూర్ణచంద్రవదన, జాజుచేసిన
జాలువా సకినవోలె (శ. ర.) భాను. ౪. అ

**సకినంపుఁబులుగు.** వి. సకినము చెప్పెడి పక్షి విశేషము (చూ పైడికంటి)

**సకినము.** (సం. శకునము) ౧. శుభసూచక నిమిత్తము. ౨. శుభాశుభసూచక వాక్యము.

**సకినలమంచము.** వి. కిచుకిచు మని మ్రోగెడు మంచము; రవమంచము.

**సకియ.** (సం. సఖి.) చెలికత్తియ.

కం. సకియఁ గను మొలఁగి మధుకర, చికురవిలా
రామ వాఁటిఁ జేరఁ బ్రసూనాశా, అకఘాటీకుక
ఘోటీవిశరాటీకసము ముదము నిశ్వరపణుపన్
వసు. ౩-౧౧౨.

సీ. సకియ నీ కిట్లెద సరివచ్చె ననిశదా మించి
కాళియు, మర్దించు టెల్ల. రాధికా. ౪-౫౪.
౨. ఆడుది.

కం. సకియ మగవాడి కొలు కొన్నిక గాఁ బగతురి
నదంచి వినుఁ డెలిగోఁ దిక్కక యుండునా
ట్లొనర్చితి.... అచ్చ యు. కాం.

**సకిలించు.** అ. క్రి. హేషించు, (గుఱ్ఱము) ధ్వని చేయు.

**సకిలింత.** వి. గుఱ్ఱము చేయుధ్వని, హేష.

**సకుఁడు.** వి. (సం. సఖ) చెలికాఁడు, మిత్రుఁడు

**సకుక్షి.** సం. విణ. (ఇ) సగర్భుడు; తోఁబుట్టువు

**సకు (లము) లి.** సం. వి. అ. పుం. ఒకవిధమగు చేప.

**సకులుఁడు.**1 సం. విణ. (అ. ఆ. అ) ౧. గొప్ప కుటుంబమునకు సంబంధించినవాఁడు, గొప్ప కుటుంబమునఁ బుట్టినవాఁడు. ౨. ఏకకుటుంబమునకు సంబంధించినవాఁడు. ౩. కుటుంబముతో గూడ నున్నవాఁడు, కుటుంబసహితుఁడు. సం. వి. అ. పుం. జ్ఞాతి, దాయాదుఁడు.

**సకుల్యము.** సం. విణ. అ. ఆ. అ) సజాతీయము సదృశము.

**సకుల్యుఁడు.** సం. వి. అ. పుం. ౧. సమాన కుటుంబము వారిలో నొకఁడు, ఏకకుటుంబము లోనివాఁడు. ౨. దూరస్థజ్ఞాతి, నాల్గవతరము మొదలు తొమ్మిదవతరమువరకు నుండెడి జ్ఞాతి ౩. దూరబంధువు.

**సకృత్తు.** అవ్య. (సకృత్ అనెడి యవ్యయమునకు సమాసపూర్వపదముగాఁ బ్రయోగ ముండ దన్నను. వ్యస్తముగాఁ గూడ వ్యవహారమున వాడుక కలదు.) ౧. ఒకమాఱు, ఏకవారము.

ఎ. గీ .... సంవత్సరాభ్యంతరంబునను దగఁగ, సకృదుపస్పర్శనము చేసి శాశ్వతమూర్తియై జనించు.... భార. అను ౨-౬౬.

౨. మొదటిపర్యాయము, ముందుగా. ౩. తత్క్షణము, వెంటనే. ౪. సర్వదా ౫. కూడ, కలసి.

**సకృత్ప్రజము.** సం. వి. అ. పుం. కాకి.

**సకృత్ప్రసూత(తిక).** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒక బిడ్డను గనినస్త్రీ. ఒకమాఱు ప్రసవించినది. ౨. తొలిచూలి యీనినయావు.

**సకృత్ఫల.** సం.వి.ఆ. స్త్రీ. కదళి, అరఁటిచెట్టు.

**సకృదాకృతము.** సం. వి. అ. న. ఒక్కపర్యాయము చెల్లించినది. (వడ్డి)

**సకృద్గతి.** సం. వి. ఇ. స్త్రీ. ఎప్పుడో ఒకప్పుడే జరుగునది, మిక్కిలియఱుదుగా జరుగుట.

**సకృద్గర్భ.** సం.వి.ఆ. స్త్రీ. ౧. కేసరము, కంచరగాడిద. ౨. ఒకమాఱు గర్భముదాల్చినస్త్రీ.

**సకృత్స్నాయి.** సం. వి. న. పుం. అరుదుగా స్నానము చేయువాఁడు.

**సకృద్విభాతము.** సం. విశే. (అ.ఆ.అ) ఒక్కపర్యాయము మాత్రమే గోచరించినది.

**సకృపణము.** సం. విశే. (అ. ఆ. అ) దీనము, ఖిన్నము.

**సకైతవుఁడు.** సం. వి. అ. పుం. మోసగాఁడు.

**సక్తత.** సం. వి. ఆ. స్త్రీ. సంసారమునఁ దిగులు పడి యున్నస్థితి,

క. నీముక్తత బొంకని దీనిని, సక్తతగా నీవు గనుట సాలదె తెలుపన్.
భార. శాంతి. ౬-౨౧౧.

ముక్తత.

**సక్తము.** సం. విశే. ౧. అంటుకొనునది.

మ. మూర్ఛలఁ బొందక వెనవెత్తె మేఘయుగళీ సక్తోల్లసద్దైరికాతలవై హాయసకేళిమోయన....
భార. అను. ౧-౨౩౫.

౨. ఆసక్తిగలది, ప్రేమించినది. ౩. తగులుకొన్నది, లగ్నమైనది, స్థిరమైనది. ౪. సంబంధించినది. ౫. శ్రద్ధగలది. ౬. అర్దగింపఁబడినది.

**సక్తమూత్రుఁడు.** సం. వి. అ. పుం. కష్టముగా మూత్రము విడుచువాఁడు.

**సక్తవైరుఁడు.** సం. వి. అ. పుం. ౧. కలహశీలుఁడు. ౨. స్థిరమైన విరోధము కలవాఁడు.

**సక్తి.** సం.వి.ఇ.స్త్రీ. ౧. సంబంధము, ౨. కూడిక, కలయిక. ౩. ఆసక్తి. ౪. అనుబంధము.

**సక్తుకము.** సం.వి.అ. పుం. ౧. సక్తువు ౨. ఒకవిధమైన విషము.

**సక్తుఫల (లి).** సం.వి.ఆ. స్త్రీ. శమి, జమ్మి.

**సక్తులము.** సం.విశే. (అ. ఆ. అ) పేలపిండితో నిండినది.

**సక్తువు.** సం. వి. ఉ. పుం. వేఁచి విసరిన యవధాన్యపుపిండి, పేలపిండి. కం. పాపాలి సక్తు విచ్చెద, నీపురుషునిఁ దృప్తుఁ జేయు మీ వనిత....
భార. అశ్వ. ౪-౨౨౫.

**సక్థి.** సం. వి. ఇ. న. ౧. తొడ, ఊరువు (ఇది యీయర్థమున బహువ్రీహిసమాసోత్తరపదమగునప్పుడును, ఉత్తరపూర్వమృగశబ్దములకును ఉపమానవాచకమునకును బరమైనప్పుడు అకారాంత మగును. ఉదా. మృగసక్థము ఫలకసక్థము) ౨. శకటావయవవిశేషము. ౩. తొడయెముక. ౪. అస్థి, ఎముక.

**సక్రియము.** సం.విశే. (అ. ఆ. అ) చంచలమైనది, చలించునది.

**సక్షణము.** సం. విణ. (అ. ఆ. అ) విశ్రాంతిగా నుండుట.

**సఖ.** సం. వి. ఇ. పుం. (ఇది తత్పురుషసమాస మం దుత్తరపద మైనపు డకారాంత మగును. ఉదా. కృష్ణసఖుఁడు మొ.) మిత్రుఁడు, చెలికాఁడు

చం. కోలఁదిమోఱుంగకిట్టిపలుకుల్ వలుకంగనుఁ గారువాకనన్ బలఁగుఁదనంబునంబలుకఁబా డియెనీసఖి నంచు.... భార. ఆది. ౫-౨౦౩.

సహాయుఁడు. ప్రియుఁడు.

**సఖి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ౧. చెలికత్తె.

క. వనిత సఖుర్గోలువఁ గేళివనమున కరిగెన్. రాధికా. ౨-౭౮

సీ. అంగజజ్వరతాప మాఱమ సఖిముఖపూర్ణ చంద్రోదయంబున నె కాని. రాధికా. ౩-౧౨౬

౨. ప్రియురాలు. ౩. బందుగురాలు.

కం. తను నూరార్చఁగ సఖి నొరకొనమికి వెనుఁ బడుచుఁ గీచకుం డాసతితోన్. భార. విరా. ౨-౬౦.

**సఖుఁడు.** సం. వి. అ. పుం. చెలికాఁడు, మిత్రుఁడు. సహాయుఁడు, ప్రియుఁడు.

సీ. నా మోహనాంగుని నా నీలవర్ణుని నా విటో త్తంసుని నామసఖుని. రాధికా. ౨-౭౨.

**సఖ్యము.** సం. వి. అ. న. ౧. చెలిమి, స్నేహము

వ. అని పలికి సఖ్యంబు చేసి చనియె. భార. శాంతి. ౨-౩౮౩.

వ. సీతోడ బద్ధసఖ్యంబుఁ జేసెద. భార. ఆది. ౭-౫౫.

కం. సౌహార్ద్యమ్ముఁ దుఁ గలిగిన నా పురుషునితోడ సఖ్యమగుఁ ట్లుగ ... భార. విరా. ౧-౭౯.

౨. సమానధర్మము, సామ్యము, పోలిక.

**సఖ్యుఁడు.** సం. వి. అ. పుం. మిత్త్రుఁడు, చెలికాఁడు.

**సగంధుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సువాసన కలవాఁడు. ౨. గర్వము కలవాఁడు. ౩. చుట్టరికము కలవాఁడు. సం. వి. అ. పుం. బంధువు, జ్ఞాతి.

**సగటు.** వి. (సం. శకటమ్. చ ఠ. కడమ్. క-షకడా. మహా. ఛకడా) చదరంగమునందలి శకటము (బండి)

సీ. ద్యూతశకటంబు సగటనఁ దోఁచు నధిప. ఆం. భా. ౪-౧౦౨.

గీ. మంచిది సగటుపై నిడె మంత్రి కావలున్న దీ చదరంగ మిట్లుండ నిమ్ము. కువల. ౪-౧౦౮.

౨. సరాసరి, సామాన్యము.

సీ. సగటు నాఁగిను సరాసరి యనంగ సామాన్య మొసఁగు. ఆ. భా. ౩-౨౫.

**సగణుఁడు.** సం. విణ. (అ. ఆ అ) సేనలఁతోఁ గూడినవాఁడు, ప్రమథగణములతోఁ గూడిన వాఁడు.

కం. ద్రోణుఁడకాముసగణస్థాణునకై నను వశంచె.

సం. వి. అ. పుం. శివుఁడు, (ప్రమథగణములతోఁ గూడినవాఁడు)

**సగతు.** వి. ౧. గుజ్జుపుపల్లమువీఁద కెంపులు చిగుళ్లును పచ్చలు ఆకులును రవలు పూవులు నుగా సంతరించి యేర్పఱిచిన బంగారుతీఁగె మోడి పని.

సీ. ఉదిరి బంగరుత్రాఁతి హవనిపూపని చౌక్క సగతుల హొంబట్టుమొగలిపల్లము. చంద్రా. ౫. ౨-౯౯.

వ. అవిరళ కిసలయవిలసితలతావితానంబులు మర కత కురువింద నిచయంబులఁగు సగతులపగిదిఁ జూపట్టు ౬-౨౨౪.

౨. రికాబుల కాధారమైన త్రాడు. (ఈశబ్దము బహువచనాంతముగనే ప్రయోగములందుఁ గానవచ్చుచున్నది.

మ. ఘనగర్జల్ పకిలింత ల్రౌకబలాకల్ తెల్ల జల్లుల్ సకం, ఘనశంపాలతికల్ పసిండిసగతుల్ మాహేంద్రచాపంబు నొం,హాఃరత్నంబుల వాగ్రాడు వదగం ద్రాస్యస్రవద్ఫేనమై తనరం దజ్జలదంబు రైరఁ డెగయున్ ధారావిహారంబులన్. వరాహ. ౧౦-౯౩.

చ. సగతులం పట్టి వెంటఁ బడిచారకు లేగి హాయంబు మించిపో, జగతి ఖురాగ్రము ల్పదమి జాడ రయంబుంగల వాజివేగముం దగి లెద నంచు వెజ్జను సదాగతి కొట్టుకఁ బోవు నబ్బటు ల్పగలిటి కంతుగొంట్రు తుత్రిటిఁబా లును నిచ్చిన తప్పురాశ్యమున్.

బహు. ౧-౮౧.

సగపాలు. వి. (సగము + పాలు — (వృత్తియందు ముపర్ణ కలోపము)

౧. అర్ధభాగము, అఱపాలు.

చ. అ, ద్దనుజాలఁ ద్రుంచి మీకుఁ బ్రమదం బొన రించెదఁ దేజమున్ బలంబును సగపాలు వెట్టి నను బొందఁగఁ జేయుఁడు మీర లందఱున్.

భార. కర్ణ. ౧-౨౭౭.

సీ. ఈ నీరజాతాక్షి మేనిలో సగపాలు గణుతింప మగపాలుగాఁగ నున్నది.

హంస. ౩-౨౫.

వ. తపోవిశేషంబునం బర్వతాత్మజ నీదేహం బున సగపాలు గొనియె.

భీమ. ౫-౫౭

దీనికి సగఁబాలు అనురూపముగూడఁ గానం బడియెడి.

ఉ. చందనగంధి యెన్నమర చందురులో సగఁ బాలు బాలముద్దుం జలిమాపు లంగజానితూపు లలోపల మేల్తరంబులు.

వి.జ. ౧-౧౪౯.

చ. తమ సగఁబాలు గోలుపడి దానిన యిప్పుడు గోరువీరికిన్, సముచితవృత్తి నిచ్చి తమపా మున పంతస మంది యున్కి యుక్తము.

భార. ఉద్యో. ౧-౧౯.

సగమాటదేవర. వి. అర్ధనారీశ్వరుఁడు ద్వి. సగమాటదేవర చెప్పఁచి చూత జగదంతతోట్ల కీశ్వరుఁ డెట్టులయ్యె

పండి.వాద. ౬౦౫.

సగము. = సవము, సాము. వి. (సం. సామి) అర్ధభాగము, అఱ.

ఉ.... అ, ఖండలుఁ డున్నగద్దియ సగంబున నుండెడు మహానుభావుఁ డీతం డొకమర్త్యుఁ డే యనుదాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁ డొకో.

భార. విరా. ౧-౮౫.

ద్వి. చక్కఁదనంబున రెండుసగముల గూర్చి యొక్కంటి తనతోంటి మూర్తిగా జేసె.

పండిత. వాద. ౨౭౦.

ద్వి. సగము కౌసల్యకు సగములోఁ బుచ్చి, సగము సుమిత్ర కాసగములో సగము.

రం. రా. బాలకాం. ౧౮-౨౨.

ఉ. కా, దేనిఁ దపంబులోని సగ మిచ్చెద మాను తపోభిమానమున్.

హంస. ౪-౭౫.

గీ. సగము గొఱికినయాకును సఖుని పిలువ, సగ మొసఁగు నుత్తరము.

మను. ౩-౬౬.

వ. మృగాంకమండలంబు సగము కబళించిన రాహుగ్రహభూమికల చందంబున నందంద తిరుగు బొల్లి మోరభల్లూకంబులును.

పారి. ౨-౮౭.

గీ. మర్త్యలోకంబు వారి ప్రమాణసంఖ్యఁ బొందుసూనుండు గడపెను వర్జియింట స గము నిద్రయును సగము జాగరంబు గా విభావరి వేఁగుబోకాలువేలు.

హర. ౭-౧౩౯ఁ

క. తన మేని రెండుసగములు వనితాపురుషులుగఁ జేసి స్వాయంభువుఁడన్, మనువును శత రూపాహ్వాయ మనుపత్నియుఁగా నొనర్చె మహిమోజ్జ్వలుఁడై.

హరి. పూర్వ. ౧-౫౫.

గీ. భవరేంద్రుఁ దరిగియరిగి మింట గ్రహరాజ తనసగ మింటవెలుఁగు, మంథగిరిఁ గాంచి పలికె సమ్మనుజపతికి.

మను. ౫-౪౬.

శా.... నవస్వర్ణక్రీడాకేళిచే, వాదిన్ గాధిరమా జుచే సగము సేయంబడ్డ మిన్నేలు ప్రాసాద స్వచ్ఛముకూలకైతవమునం జాలంగ నొప్పం బున్.

శృం. నై. ౨-౪౧.

సగమగు. అ. క్రి. కృశించు. (సగము + అగు)

క. మృగవల్లభ యాకటిచే, సగ మైతివి నీకుఁ గైకసముగా నన్నుం దగద కనంగొన నీపా లగుఁగథనకుఁ డారగింపు మాచే నీకన్.

కేం. పంచతం. ౧-౫౨౮.

సీ. గీ. సగముసాత్త్వికోదయనవానుభావములు సగముజాలిల్లియమ్మ. వి. అర్ధచంద్రబాణము

ద్వి. పెనువిండ్లు సగముజాలిల్లి యమ్ములును, ఘనము లౌకశ్త్రులు కడిఁది తిత్తులును.
అ. మ. క. ౫. అ ౨౨౨. పు. ౧. పం.

**సగరుఁడు.**[1] సం. విణ. (అ. ఆ. అ) విషముతోఁ గూడినవాఁడు.

**సగరుఁడు**[2] సం. వి. అ. పుం. సూర్యవంశపు రాజులలో నొకఁడు, సగరచక్రవర్తి.

**సగరేయి.** వి. (సగము+రేయి) అర్థరాత్రము, నడురేయి (గ్రా)

**సగర్భుఁ (ర్భ్య)డు.** సం.వి.అ.పుం. ౧.సోదరుఁడు, తోఁబుట్టువు, ౨. సదృశుఁడు.

**సగిన.** వి. రూ. సకిన.

**సగిలించు.** అ. క్రి. రూ. సకిలించు.

**సగిలింత.** వి. రూ. సకిలింత.

**సగుటు.** వి. సరాసరి.

**సగుణము.** సం.విణ.(అ.ఆ.అ) ౧.గుణములతోఁ గూడినది. ౨. మంచిగుణములు గలది. ౩. ప్రపంచ సంబంధమైనది. ౪. నారితోఁ గూడినది. (విల్లు) ౫. ఓజఃప్రసాదాదికావ్యగుణములు గలది. (కావ్యము)

**సగోత్రుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సమాన గోత్రము గలవాఁడు ౨. ఏక కుటుంబములోని వాఁడు. సం. వి. అ. పుం. ౧. జ్ఞాతి, దాయాదుఁడు. ౨. దూరజ్ఞాతి.

**సగోష్ఠి.** సం. వి. ఈ. స్త్రీ. సాహచర్యము.

**సగౌరవము.** సం. విణ. (అ. ఆ. అ) గౌరవముతో గూడినది.

**సగ్గా౽.** వి. (సం. సృగాః) నక్క.

క. సగ్గాలియుఁ బుణ్యస్త్రీ సంభావనము దనకుఁ జెంచినతనం జేసి వివేకజ్ఞానవిహానమ్మున నల్లసిల్లి కానవభూమిన్. వి. పు. ౪-౩౪౧.

**సగ్గిసముగ్గిపలు.** వి. బ. ఉక్కుగడువు, ఉక్కిరిబిక్కిరియగు.

ఉ. సిగ్గునకుం గకావికలు చిత్తసమున్నతి పేరువార్తకున్ గగ్గులకాడుశంకలకుఁ గన్కలి యెగ్గుకుఁబట్టు దల్కకున్ సగ్గిసముగ్గిల్ నిలుపుసైరణకున్ గనలీని యొత్తికో ళ్లగ్గయాచకుం బతికి నయ్యొ యనేకవహ ప్రసంగముల్. (శ. ర.) (గ్రా) కవిక ౪. అ.

**సగ్గు.**[1] ప్రసగ్గు, అ.క్రి.౧. తగ్గు,అడఁగు, క్రుంగు

ఉ. వెగ్గలమైన శంకరునివీర్యముఁ దాలిచి యాపథంబునన్ బ్రొగ్గుచు సగ్గుచుం బనుసు మూర్గుచు నేలముఁ దూలఁబోవు నున్.
సమీర. ౨-౨౦.

౨. మూర్ఛను.

ద్వి. బెగ్గలింపుచు నిట్లు బీభత్సుచేత సగ్గుచునుస్సైనకల సైన్యములు. విరాటపర్వ. ౪-౩౦.

**సగ్గుబియ్యము.** వి. ఒకవిధమైనకృత్రిమధాన్యము.

**సగ్గు.**[2] దగ్గు.వి.గమనవేగాదులందగు వేగము,శీఘ్రము.

మత్తకోకిల. గట్టుకూఁతురునెన్నెలల్....అద్రికన్నియఁ జేరఁగా. సంగసంబునఁ బోయి రయ్యెడ సగ్గునన్ వటుకేషితోన్. వీర. ౨-౨౫౪.

**సగ్గడ.** వి. ౧. చెంబు. (క. సగ్గొ)

ద్వి. ఒలుపుగా మంగళ నొనరించి యట్టి, చిలుక వల్లియతాల్లుచే సగ్గడలును, రాణింపఁ జిత్రచామరముల హాసీర,పాణియు నా చక్రపాణియుఁ గూడి. అ. మ. క. ౧౫. ౫౦పు. ౨౨. పం.

౨. త్రాగుటకై నీరుపోయు తోలుపాత్ర.
ద్వి. వలనొప్పఁ దెప్పించి వాఁడు నిర్భయను జలములు గ్రోలెడిసగ్గడ నించి, యున్నంత నీరున ట్టొదవ విప్రుఁడు.
నవనాథ ౨. ఆ. ౧౯౧పు. ౫. పం.

**సగ్ధి.** సం. వి. ఇ. స్త్రీ. సహభోజనము, బంతి కుడుపు.

**సచకితము.** సం. విణ. (అ.ఆ.అ) అ (న) ఉలికి పడినది, భయపడినది. ౨. పిఱికిపడినది.

**సచనము.** సం. వి. అ. న. ౧. గౌరవించుట, సత్కరించుట ౨. ఉపచరించుట ౩. తోడ్పడుట

**సచి.**[1] సం. వి. ఇ. పుం. మిత్రుఁడు. మైత్రి.

**సచి.**[2] సం. వి. ఇ. (ఈ) స్త్రీ. ఇంద్రునిభార్య. (చూ. శచి)

**సచిత్రము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. బొమ్మలచే నలంకరింపఁబడినది. ౨. రంగులుపూయఁబడినది.

**సచిల్లకుఁడు.** సం. విణ. (అ.ఆ.అ) క్లిన్ననేత్రుఁడు, స్వభావముచేఁగాని వ్యాధిచేఁగాని తడికన్నులు గలవాఁడు, అడుసుకన్నులవాఁడు.

**సచివము.** సం. వి. అ. పుం. నల్లయుమ్మెత్త i

**సచివుఁడు.** సం. వి. అ. పుం. ౧. సహాయుఁడు, తోడు, బాసట, ౨. మంత్రి, (కావ్య) ౩. శృంగారనాయకునకుఁ దోడ్పడువాఁడు. (శృంగారనాయకునకుఁ సచివులు నలుగురు-పీఠమర్దుఁడు, విటుఁడు, చేటుఁడు, విదూషకుఁడు, ౪. మిత్రుఁడు

**సచేతనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) (పుం) ౧. జ్ఞానము గలవాఁడు, ౨. ప్రాణము గలవాఁడు. ౩. వివేకము గలవాఁడు. ౪. గ్రహణశక్తి గలవాఁడు. ౫. చైతన్యము గలవాఁడు.

**సచేతసుఁడు.** సం. విణ. (స్) ౧. బుద్ధిమంతుఁడు ౨. సుఖదుఃఖాద్యనుభవజ్ఞానము గలవాఁడు. ౩. ఏకాభిప్రాయము గలవాఁడు. ౪. (అలం) సహృదయుఁడు, రసగ్రహణపారీణుఁడు.

**సచేలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) వస్త్రము ధరించినవాఁడు.

**సచేష్టము.**[1] సం. విణ. (అ. ఆ. అ) చేష్టతోఁ గూడినది.

**సచేష్టము.**[2] సం. వి. అ. పుం. మామిడిచెట్టు.

**సచ్చము.** వి. చిల్లర రొక్కమువ్వ (శ. ర)

ఉ. అల్లునియమ్మగారి శిపు డాఁకలి గాదొకొ యింటికేమియున్ జిల్లరవెచ్చసచ్చములఁ దీరలు నంపవు. వైజ. ౩-౧౦౨.

సీ. చేనేఁత విశ్వసించినవారి వెచ్చసచ్చములఁ గీర్చుఱుచు వైశాతికొండ. శేం. పంచశం. ౧. ౪-౬౩.

సీ. వెచ్చసచ్చములకు వెరవు గాన్పింపదు కద పటివానికి వదుగులేదు. శివధర్మా. ౫-౧౦౨.

**సచ్చరిత(త్రి)ము.** సం. విణ. (అ. ఆ. అ) మంచినడత గలది.

కం నీ, సచ్చరితము ఫలమేయిట్లిచ్చుట నీయునికి ధాత కేమనఁ జేర్తున్. భార. ద్రోణ. ౧-౪౦.

**సచ్చరితము.** సం. వి. అ. న. ౧. మంచినడవడి, యుక్తప్రవర్తనము. ౨. మంచివారి చరిత్రము.

**సచ్చార.** సం. వి. ఆ. స్త్రీ. పసుపు i

**సచ్చిదానందము.** సం. వి. అ. పుం. సత్తయు జ్ఞానము నానందమును-౧. పరబ్రహ్మము.

ద్వి. సచ్చిదానంద భాస్వరమూర్తియేని నిచ్చమై నొలుకుల నేల వసించె?
పండితా. వాద. పు. ౬౧౬

౨. సచ్చిదానందస్వరూపము ౩. విష్ణువు.

**సచ్చె.** అ. క్రి. చచ్చెయొక్క రూపాంతరము

**సచ్ఛాత్రుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. శిష్యులతోఁ గూడినవాఁడు.

౩. సీ. సచ్ఛాత్రుఁడగుచు నిచ్చలు నేఁగి యుద్యోట నఘుమర్షణస్నాన మాచరించు. మను ౧-౫౪
వి. అ. పుం. (సత్ + ఛాత్రుఁడు) మంచిశిష్యుఁడు.

సీ. గానఁదోఁచునీదశై క్రీడించు సచ్ఛాత్రుఁ డింత కునెంత చింతింతు రొక్కొ. మను. ౧-౧౪.

సచ్ఛిద్రము. సం. విణ. (అ. ఆ. అ) ౧. రంధ్రములు కలది ౨. దోషములు కలది.

సచ్ఛీలము.[1] సం. విణ. (అ. ఆ. అ) మంచి స్వభావము గలది.

సచ్ఛీలము.[2] సం. వి. అ. న. ౧. మంచి స్వభావము. ౨. మంచినడవడి.

సచ్ఛూద్రుఁడు. సం.వి. అ. పుం. సదాచారము గలశూద్రుఁడు.

సజంబాలము. సం. విణ. బురదతోఁ గూడినది, మురికి యైనది.

సజగ్ధి. సం.వి.ఇ. స్త్రీ. పదిమంది చేరి యొకటిగా భుజించుట, బంతికుడుపు.

సజనము[1] సం. విణ. (అ. ఆ. అ) మనుష్యులు మున్నగు ప్రాణులతోఁ గూడినది.

సజనము.[2] సం. వి. అ. పుం. సగోత్రుఁడు, బంధువు.

సజలము. సం. విణ. (అ. ఆ. అ) ౧. నీటితోఁ గూడినది. ౨. తడిసినది. ౩. తేమ గలది.

సజాతము. సం.విణ.(అ.ఆ.అ) కలిసి పుట్టినది.

సజాతి. సం. విణ. (ఇ) ౧. ఒకజాతిసంబంధమైనది. ఒకతెగకు సంబంధించినది, ఒకవిధమైనది. ౨. సమానమైనది, పోలినది.

సజాతి. సం. వి. ఇ. పుం. సమానజాతిగల స్త్రీపురుషులకుఁ బుట్టిన పుత్త్రుఁడు.

సజాతుఁడు. సం. వి. అ. పుం. సోదరుఁడు.

సజాత్యము. సం. వి. అ. న. ౧. సాదృశ్యము. ౨. బంధుత్వము.

సజావు. హిం. విణ. స్పష్టమైనది, క్రమమైనది.

సజుషుఁడు. సం విణ. (ఉ) ౧. ప్రేమ గలవాఁడు ఆసక్తి గలవాఁడు ౨. సేవతోఁ గూడినవాఁడు. సం. వి. ఉ. పుం. మిత్త్రుఁడు, చెలికాఁడు.

సజ్జ. సం. వి. ఆ. స్త్రీ. ౧. వస్త్రాదిధారణము, అలంకరణము. ౨. సన్నాహము ౩. కవచము.

సజ్జె[2] వి. (సం. శయ్యా; క. సజె) = సెజ్జ ౧. పానుపు.

ఉ.... ఎవ్వఁడం, బజ్జెకుఁ జేరనీక తనభావము లోపల దాఁపురంబుగాఁ, బజ్జెకుఁ జేరియుండె నృపచంద్రుఁడు సాంద్రవియోగవేదనన్. పి. శకుం. ౨-౧౬౪.

క. వేసాలఁ బోకు రమ్మా, పూసజ్జెకుఁ బ్రొద్దు వోయెఁ బులియుట చాలున్. హర. ౪-౧౨౩

సీ. మిక్కుటంబుగ మేసియుక్కుచేఁ గములవ విరిపూవుసజ్జెల కరణి మాచి. రాజశే. ౩-౧౪౭.

౨. వాసగృహము.

ఉ. మజ్జన భోజనాదులకు మాత్ర శయించుటకున్ వసామణుల్ సజ్జనగేహ మొక్కటి విచారము చేసి యొసర్చు వారి సెన్ సజ్జనొ[illegible] యిచ్చుట బ్రిసన్నత నిల్చి లింగమున్ భవా పజ్జలరాశికుంభజాని భక్తి భజింపఁగఁ బొత్తు నంపెటన్. శా. ౪-౭౬.

౩. ఉప్పరిగ, శిరోగృహము.

ఉ. కేతుక నిట్లగణ్యాగచి విభ్రమభఙ్గ యోగం ద్రకవ్య రాఁ జూడనలించి నిల్చి కమ్మకి పాలపురీ పురంధ్రికల్, మామువులన్ హారముల మచ్చుల సజ్జెగోపురంబులన్. వసు. ౭-౭౪.

౪. బుట్ట.

కం. అనుటయు రసలింగము నిను, తనవ్రటువ ప్రేఁప సజ్జె దంతపు బరణిన్. మను. ౧-౭౮.

సీ. కృత్రిమగుణముల గేహంబు దేహంబు దపము దోషంబుల సజ్జబొజ్జ. శశిరేఖా. ౨-౩౪.

ద్వి. బిల్వపత్రము లత్రిపిరి సద్భక్తి, నల్ల
వాటిల్ల ఘనంబుగాఁ గోసి, సజ్జెనిండఁగఁ
బెట్టి చాటిటనితికి.
పండితా పురాణ. ౭-౨౭ పుట. ౩౪౫.

౫. శివలింగము నుంచెడిబుట్ట (లేక బరణి)

తం. అని శివ సజ్జలింగము దయాతిశయంబున
నావరిచ్చెఁన్. కాశీ. ౪-౭౦.

**సజ్జె.** వి. సం. సర్జ) ధాన్యవిశేషము, గంటె

మ. పెసరుంగాయకు మెత్తనెన్నులకునై పేరాడు
చున్ గొర్రెలన్ నుసలంజూచుచు దోసచేల్
చెంతచాల్ నుగ్గాడుచున్ సజ్జగోయ నుమా
లింపుచు సేనరా పెగని కాళ్యావంక కీరాం
కికై యసదంచంజదరంపుగుం పఁగ నాహా
యాళరద్వేళఁన్ రాజవాహన. ౨-౬౫.

సీ. బఁగ సజ్జెయు గిడగిరసజ్జె మజ్జపాల్ప్రద్దచే స్వద్ద
రాగియును యవయు. హంస ౪-౧౨౭.

ఉ.... మాపుమాపున మేపు సజ్జెకవణంపు మేపున
....పుటపుటనై .... కొదమపొట్టువగుంపు.
అము. ౪-౩౫.

**సజ్జక.** సం.వి.అ. స్త్రీ. పడకిల్లు, వాసగృహము.

**సజ్జెకట్టు.** విణ. అయితము.

**సజ్జెకము.** విణ. (క. సజ్జెక=క్రొత్తది, లేఁతది)
(సం. సజ్జస్కృత ప్రా. సజ్జోక్కం) మనోజ్ఞము,
క్రొత్తది.

సీ. జరగొప్పునాను వచ్చుపుసజ్జెకములైన విర
వాదులకు వింతవింతు లగుచు.
ఉ. హరి. ౧-౧౫౧.

దండ. గుజ్జె ప్రోయాలికిన్. సజ్జెకం బైన యం
దంబు నొందింపవే. పారి. ౩-౩౭.

క. సజ్జెకపుఁ బూవెుగ్గలును. శృం.నై. ౧-౯౫.

**సజ్జెకాయ.** వి. శివలింగ ముంచెడి కాయవంటి
బరణి.

సీ. శివలింగపు మెఱుంగు జవగల్లుగొలుసుల సజ్జె
కాయ మెఱుంగు చౌకళింప. ఇంమ. ౫-౬౦.

**సజ్జెనకోల.** వి. (సజ్జె+కోల) (క. సజ్జెకోల(
బెత్తము

ఎ. గీ. అలుకచే నుండ బుగ్గలు నలిమి తిట్టి
తొడలు వడిపెట్టి కోదండ మదరఁ గట్టి కొట్టె
నెగఁబెట్టఁ బట్టించు లేపుమాపుఁగొట్టు తె
ట్టుగ సజ్జెకోల నగను. హంస. ౩-౧౪౧.

**సజ్జనము.** సం. వి. అ. న. కట్టుట, బంధించుట.
౨. వస్త్రాదిధారణము, అలంకరించుట, ౩. సిద్ధ
మగుట, సన్నాహము. కవచాదిధారణము,
౪. కావలి. ౫. ఘట్టము, పడవలరేవు.

**సజ్జనుఁడు.** సం. వి. అ. పుం. మంచిమనుష్యుఁడు

**సజ్జము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సిద్ధమైనది
౨. వస్త్రాదికము ధరించునది. ౩. ముస్తీబు
చేయఁబడినది. ౪. కవచము మున్నగువానిని
ధరించునది, సన్నద్ధము. ౫. సంభృతము, నిండి
నది. ౬. నిభృతము, నిశ్చలమైనది. ౭. కోట
మున్నగు వానిచే రక్షింపఁబడినది.

**సజ్జెరసము.** వి. ధూపద్రవ్యవిశేషము (శ. ర)

**సజ్జెలింగము.** = ఇలువేల్పు.

సీ. ఉండు నేవీట మార్కండేయమునినాథు
సజ్జెలింగ మనంగ శాసనుండు.
కాశీ. ౧-౫౭.

**సజ్జెలు.** వి. బ. ధాన్యవిశేషము, గంటెలు. (క.
సజ్జె. తు. సజ్జెగె)

ద్వి. చణకముల్ గోధుమల్ సజ్జలు లంకలును
యవలును పెసమినుములును.
ప్రభులింగ. ౪. ఆ. ౧౭౧ పు. ౨౪ పం.

తం. సనగలు గోదుమల్ పెసలు సజ్జెలు లంకలు
కొఱ్ఱనిల్లవడ్లును.... బ. ప్రభులింగ ౫-౭౭.

**సజ్జాకారము.** వి. సర్జకవృక్షమున పుట్టెడియుప్పు.
(శ. ర.)

క. వలభు సట, జావులా నహి, యల నర్ఘము నున్న తలఁపు ల్రథచ్ఛాయల్, తలఁ దడవి బాస చేసిన, జలజాక్షుల నమ్మ రాదు సారంగ ధరా! సారం.గ ౨-౮.

౫. కొండెము.

సీ. చాడి కాఁ డనువాఁడు. సటలెల్ల బోధించు నందున కొఱులపై నలుగఁ దగదు.
నీతి. సీ. ౪. ౪౬.

సట.[2] సం. వి. ఆ. స్త్రీ. ౧. యోగుల జట, జడ కట్టినవెండ్రుకలు, ౨. (సింహము మున్నగువాని) కేసరము, జూలు.

వ. అనిన విని జరాసంధుండు సంగ్రామమునకు టః కుపితకుంజర వైరియుం బోలె గదు నలిగి
భార సభా ౧-౧౯౪.

3. ఏనుపంది ముల్లు ౪. ౫. శిఖ, జుట్టు.

సటము.[1] సం. వి. అ. న. సట.

సటము.[2] వి. (చూ. సట) అసత్యము, మాయ. (౧. చటమ్)

సీ. సటముగా నీక బాసటము పెట్టుకటంటకి.
సాం. ౧-౨౦౫.

సటలంబెట్టు. (సటల్ + పెట్టు) స. క్రి. బాధ పెట్టు, పీడించు.

క. ఇటులఁ దమి హెచ్చి మారుఁడు, సటలం బెట్టంగ నొచ్చి సడి నటు నిటుఁ జెందుటకు వెఱసొచ్చి రతిసంఘటనార్థము మిగుల వేగు కాలమునందున్ హంస. 3-౧౫౬.

సటలమొకము. మి. వి. సింహము, కేసరి.

వ. దంతావళావళులం దిలకించి వేసట నొనక సటలమొకంబులు గమకం బగు తిమికంబుల పైకి దుమికి. ప్రబం. ౧-౧౭౬.

సటలు. వి. బ. ౧. కపటము ౨. బాధలు.

చ. కనుఁగవఁ బాలఁ జూపెదవు గాని మనంబునఁ జూడ వుత్తులు, దని పెదు గాని భావమునఁ దన్ను వొకప్పుడు నీ ప్రవీణతల్ చేతు పడ వింక నీసటలు ఐచ్చిన చేతలు చాలుఁ జాలు. నరసభూ ౨-౧౪, హంస 3-౧౫౬.

సటవట. విశే. (క. సటివటి) కపటము.

చ. కిటుకుఁదనంబులున్ గపటకృత్య మసత్యపు మాట పల్కులున్, గుటిలము కూడిమారములు గుచ్చితముల్ దరితీపు చూపులున్ సట వట వందనంబులును బాగులబాగులు పెంచి చూడ నీ యటవటముల్ ధరిత్రి జలజాక్షులకున్ సహజప్రవర్తనల్.
బ. ప్రభులింగ. ౨-౬౩.

సటాంకము. సం. వి. అ. పుం. సింహము.

సటి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. కచ్చోరము †

సటిక. సం. వి. అ. స్త్రీ. కచ్చోరము †(చూ. సటి.)

సటీకము. సం. వి. అ. న. వ్యాఖ్యానముతోఁ గూడినది.

సట్టకము. సం. వి. అ న. ప్రాకృతభాషలో నుండెడి యొకయుపరూపక భేదము (ఉదా. కర్పూరమంజరి)

సట్టన. వి. అవ్య. త్వరగు, వెంటనే (అనుకరణము) దిగ్గనవలె.

ద్వి. సిట్టిరాళమువట్టు శివదేవి, నీవు సట్టన న్వత్యంబు సరసం బెఱింగి. బసవపు.
3. పుట ౧౪౧.

సట్ర. వి. సదకు ఊఁతపదము. (చూ. సడ.)

ద్వి. సదసట్ర నలిఁ ట్రసదిగ్వుగ్ర, వెదకియుఁ గానక మది విచారించి.
బస. పురా ౫౮ పు. ౨౭. పం.

సట్వా. సం వి.ఆ. స్త్రీ.౧.ఒకజాతిపక్షి ౨. వాద్యవిశేషము.

సతి. సం. వి. ఈ. స్త్రీ. చూ. సటి. †

**పడ.** వి. దట్టమగు సాలు వరుస, తసి.

క్రీ. సారటం బెంగను మీఱు పాప్యాంకురా, వలి .... తసి యన పడయునంగ దన్నరంబెర పంక్తి దనరుచుండు.... ఆం. భా. ౨-౩౫.

**పడకుడకలు.** వి. బ. భక్ష్యవిశేషము.

వ. పడికుడకలు పడకుడకలు- గూళ్ళుపెద లాదిగాంగల భక్ష్యంబులు.హంస. ౧-౧౦౫

**పడగరము.** వి. (క. పడగర) సంభ్రమము, ఉత్సాహము,

ఉ. ఏనంగు..... ఇప్పు డెత్తికొనం దండలమం దపుముట్టువారికిన్, దానవు లిచ్చినన్ పడగ రిం బవు లెమ్మెగి కిరులెత్తంగాన్.
కుమా. సం. ౧౧-౫౭౬.

ద్వి. ప్రాలంగం దిగిచితి రేల బింకంబు, పడగరం బులు వట్టి చాగుబగొలు గొడుగులు పడగలు తరంబడుటయును.
బస. పురా. ౧౮౦. పు ౨. పం.

**పడవు.** స. క్రి. అపహరించు. (క. ర)

సీ.... సామాజికులు తమసొమ్ము లెల్ల

గీ. నొసంగులంగ వైవ పడపుము నొప్పవిూకు. ఉక్తిచేనుకుంచు మాయాసిరూపి పెఱుసి.
ప్రభా. ౪. ఆ ౧౧౧.
(అచ్చుప్రతిలో నదుపుము నని యున్నది)

**పడలించు.** స. క్రి. (√ పడలు ౧. విప్పు; పడ లజేయు, వదల్చు)

తే.గీ....అవిశ పడలింప దిలకించి రమణుండు....
దశా. ౩-౭౬.

తే.గీ. నీవి పడలించి బడలించి పెలంత వపుడు, కిరి రతు లనలంచె రాక్షసవిభుండు.
ఉ. రా. ౪-౨౧౭.

సీ. పల్లైన పడలించు పర్యంతమును దాశ కరుల గోపాప్తి నొట్టట్టు జెనంగు...
శుక ౧-౧౭౦.

వ. వాగె పడలించి పగతుపై నిగిడి.

౨. విడుచు, తీయు మను. ౪-౧౧౭.

సీ. మంనుం గామక్రోధమదలోభముల కిచ్చి పడలించు రస్వాయాచారసరణి
భీమ. ౫-౧౭౩.

సీ. బీరమ్ము పెడలించి బిరుసులుపడలించి డాంగు. వారును గొంది సీగువారు.
లక్ష్మీవి. ౧-౭౮.

చ. పలుచనిదంత పుందసుకుపాయకల స్సడలించి కుంచితాంఘ్రుల వలిపంపుంజేలమునిరాంగొక యించుక దెుత్తి చిప్ప మింపలరంగ నొక్క యందమున నంమం దగ వైనిరెు వ్విభుండు.
శుక. ౧-౨౮౧.

తే. కాన్తుభాదివిభూషణస్కారము నెల్ల నొయ్య నొయ్యన పడలించి యున్నయంతి. పా. ౨-౭

౪. తెఱచు, తీయు.

వ.... గృహంబునకుం జని పంజరంబు పడలించి యిచ్చంచలాక్షిం గాంక. ఆము. ౬-౧౦౭.

క. తలుపు పడలింపు మనన్ం గుబ్బాము ను మాంత్రికుండు కూపెట్టెనచో దలకంచి వ్యాపారి మనశ్చలనము పో సీంపు నలది సంభ్రమ మొదవన్ హంస. ౩-౧౦౫.

౫. ఊడగొట్టు, పోంగొట్టు.

క. ఉడుపుం గ్రోధంబ హింసను, పడలింపుచు చేతు బ్రహ్మచర్యాదులను, కృడంగించు లోభుండు ధృతి, పదవోద లేకుండ నూన్యతాన్ర యముంన్. ప్రబోధచం. ౧-౫౬.

చం చిక్కులు పడలించి మేలుపనిగూర్పంగ శేస్తు రె. కలా. ఆ. ౨-౮౧.

౬. తప్పించు.

క. అంతటదగ్గతియాశే,దాంతసరస్వతి మనంబు పడలించెదుం బ్రాణాంతవ్యవసాయంబది. యింతులకుంగాక నీకు నెన్నిక యగునే.
ప్రబోధచం. ౫-౧౩.

**సడాక.** = సలాక (సం. శలాకా) వి. కడ్డీ.

క. మేలిమికడానిసడాకల, పోలిక గల యురగు పొరుగుపొలఁతుఁ జో నా, పోలికబాలిక.
శుక. ౨-౪౬౦.

**సడి.** వి. నింద, దూఱు, అపవాదు.

సీ. ఆఱడి యపసడి యగడొరు దూఱు దూఱుది సందు సడికోయి గోఁతకొచ్చ .... అపవాద సంజ్ఞయై యలరుచుండు. ఆం. భా. ౧-౧౧౫

సీ. శివలయుంబు దినంబుఁ గూల్చునా డిక బంగు, జీవ మూమోది గాఁ జేయనిసడి. వసు.౧-౧౦౭.

మ. కడు లేఁబ్రాయపుఁబూపచన్నఁగవ శృంగారంబు జోనాడి యీ, కడుపున్ నేనును బోయి ప్రోల నిలువం గన్నయ్య కాపట్య మొం,చడె విన్నయ్యలు విశ్వసింపుదురె యే సంబంధమున్ లేని యీ, సడి నావంటిలతాంగికిన్ విధి ఘటించన్ జెల్లునే యక్కటా.
ఉ. రా. ౧-౧౦౫.

౨. జాడ.

తె. అప్పుడు గోత్రవిఘాతిక, కుప్పతియుతుఁడై ధరిత్రిఁ గూలివసించెన్, ముప్పికొనియెడి వగ సడి, చప్పుడు గాకుండఁ బ్రాగ్దిశాకోణమునన్. వరాహ. ౩-౬౦.

**సడింపులు.** వి. బ. ఎసటిపోఁకలు, ఆహతతండులములు.

సీ. ఆహతతండులాహ్వయము లెసటిపోఁకలన సడింపు లనంగ నలరుచుండు.
ఆం. భా. ౨-౨౫౪.

ఎ. గీ. బ్రహ్మచారి భుజంబుమాత్రకు సడింపుఁ బ్రాలు.... ఆము. ౬-౪౧.

**సడికియ.** వి. కుక్కమెడకుఁ గట్టుత్రాడు.

గీ. తగునుసడికియ యనఁగను శ్వగళరజ్జు.
ఆం. భా. ౨-౨౪౦.

ద్వి. సడికెలు దుయ్యాడు సారమేయములు.
బస. పురా. ౧౩౯ పు. ౧౧ పం.

**సడికుడక.** వి. భక్ష్యవిశేషము. హంస. ౧౭(శ.ర.)
(సదకుదక అని అచ్చుప్రతి ౧-౧౦౫)

**సడికె.** వి. సడికియ.

ద్వి. భాగ. ౫. స్కంధ (శ. ర)

**సడిగొట్టు.** అ. క్రి. నిందగలిగించు

ద్వి. కూడుగూరకు సడిగొట్టక యడిగి.
హరిశ్చ. ఉత్త. ౧౬౩౬.

**సడిలు.** సదలు. అ. క్రి. (క. సడిల్) తగ్గు.

క. దీపమణఁగఁజేఁకటియును, గోపముడుగ శాంతి గుణముఁ గోల్కొను క్రియనా, టోపోద్భటము వేసవి సడిలఁదోఁచెఁ గారుకాలము దగ్గమై. పాండురంగ. ౪-౧౬.

**సడిల్చు.** స. క్రి. జాఱఁజేయు ( √ సడిలు ) (క. సడిలిసు)

చ. కనకపుఁ జేరుసోయగము గల్గినముత్తెపుఁ గ్రొత్తతోరములో, నునిచి యనర్ఘరత్నముల నొప్పగు గుత్తులు ప్రోఁబ్రేలఁగట్టిన ట్టెంఁగంది చెప్పులు సడిల్చకతారక యోగమార్గదర్శవరతులట్లఁ గన్గొనఁగ సాగిరి కన్యలనన్యచిత్తలై. కాశీ. ౪-౧౨.

**సడిసన్న.** విశే. నిందతొలఁగిన, కీర్తికెక్కిన.
సడిసన్న అనఁగా సడిచనిన యని భారతప్రయోగములవలన నేర్పడుచున్నది. అయినను పరబంధముగా నిట నీయఁబడినది.

సడిసన్నవాఁడు. భార. విరా. ౩. సడిసన్న యేడ్తెఱ విరా.

ఆ. సడిసన్నయాప్తయోధులు శాం. ౨- (శ.ర)

చ. అనుడు నతఁడు హంసడిభకానమతంబున రాజసూయమున్, జనపతి సేయ బూని భుజసారమునన్ సడిసన్నరాజులన్, ధనములు వోలఁ దండని ఫుదంపడి దేవర యున్న చోటికిన్, నడుఁ బనివంపె నిన్ను యజనంబున మున్నిడి చేయువాఁడుగాన్.
ఉ. హరి. ౪-౧౫౧.

ద్వి. సడిసన్న శివభక్తి సౌభాగ్యమహిమ లోడఁ
గూడునే వెండియొండుమార్గమున.
బసవపు. 3. పుట. ౧౪౩.

వ. మొదలనుండియు సకలకళల సడిసన్న చతురు
లప్రోడిఁ బెట్టఁగినది గాఁబోలుఁ గాలి పెండె
రంబు నొక్కటి గిలిగియున్నది.
ప్రభా. 3-౭౬.

సీ. త్రైలోక్యజనులైన తనయశర్వాణికి జనకుండు
నా సడిసన్నవాఁడు. కు. సం ౭-౬౫.
వ. అని సడిసన్నయేడ్తెఱ బృహన్నలకుం గ
దంబుజాననా. భార. విరా. ౪-౧౫.
గీ. అతని యాశ్రితులం దెల్ల నధికుఁ డనఁగఁ
జనుచుఁ దం ధన్యుఁ దన సడిసన్నవాఁడు.
వాసిష్ఠ. ౧-౪౦

వ. గురుఁడును భీష్ముఁడుం జనిన గొంచెపు
మూఁకలతోడ నేను సం, గరవిజయంబు
గోరి భుజగర్వమునన్ సడిసన్న పాండుభూ,
వరసుతవర్గముం దొడరువాఁ డన కాను మది
నిశ్చయింపు మీ వు, వ్వరిఁ గొని యింత నీ
వెఱుఁగవా నినుఁ గర్ణునిఁ గాడ నమ్మితిన్.
భార. కర్ణ. ౧-౨౪౬.

**సడుగు.** వి. ౧. వక్రోక్తి.

సీ.... సడుగుగా వక్రోక్తి యుదరుచుండు.
ఆం. భా. ౧-౧౧౭.

౨. జటిప్రదేశమందలి కీలు.

క. శాలుం, దడుఁగినఁ దొడగినవాడు శాత్రవు
లడుగులు సడుగులును వదలి యడుగవనిఁ
బడన్. భాగ. ౧౦ స్కం. పూ ౨౯౭

**సడ్డ.** వి. (సం. శ్రద్ధా. క. సడ్డ. ప్రా. సద్ధా)
౧. శ్రద్ధ, ఆసక్తి.

గీ. వార లిప్పలికితియును వలను మీఱ దాలుపనే
యని సడ్డతోఁ బలుకుటయును.
శీలా. ౧-౧౧౬.

సీ. నిను మ్లేచ్ఛు లేకీతి విని సడ్డసేయరు మించి
నీభూణ మాక్రమించఁగలరు.
వేంకటాచలమా. ౪-౧౩౦

౨. ఆదరము.

ద్వి. పట్టింపఁ దపసియు వడి నారగింప, సడ్డలు
చేయుచుఁ జప్పరింపంగ,
బస. పురా. ౧౫౪ పు. ౧౩ పం.

3. లక్ష్యము, గణుతి.

ఎ. గీ. మఱియుఁ దల కొకమాటగా మానిబాధ
తారు మన సడ్డసేయక తెపని నిజమ్ముగంబు
లెట్లట్ల వారును గవ దొలంగి, కలఁగనిమ్మని
శాపోక్తులంబు విడిచె. చంద్రభా. 3-౧౯.

ఉ. శంకరభూమ్యకు దైవకరజమ్మునిఁ జూడక
యేగుచుండఁ దత్ప్రంకజగమ్ముపైఁ గినుక
పర్వఁగ సుమారకుఁ డొర పీఁడు ని. శ్శంకతఁ
బోవుచుండె నను సడ్డ యొనర్పక యంచు
న్యుగ్రుఁడై, కింకరుచేత రాఁ బనిచి గీవ్వతితో
నిటుఁ బల్కె నత్తఱిన్. వెన్నబ. ౧-౨౬.

ఉ. బిడ్డ యొ పాపయో చిదిమి పెట్టినకైవడి
నున్న నిన్నుఁ దా, సడ్డ యొనర్ప కవ్వలఁ
బిశాచముపంటి గరానుఁ గూడె నీ, యడ్డెడు
శుక. ౧-౪3౭.

**సడ్డ.**[2] వి. (సం. స్పర్ధా) ద్వేషము.

ద్వి. చాకికి నిం తేల సడ్డలు జనులఁ, జేకొన కడి
చెడుఁ జేరంగనీక.
బస. పురా. ౭౨. పు. ౧౯. పం.

**సడ్డ.**[3] (సం. జడః జడుఁడు, అల్పుఁడు.

ద్వి. పోడ్డలదేవుతో పామేరుతోడ, సడ్డలనైన
ముల్ తర్పింప వశమె.
బస. పు. ౬. ౭౬౦. పం.

**సడ్డకుఁడు.** వి. (సం. షడ్డకః ప్రా. సడ్డఓ) తోడి
యల్లుఁడు.

**సడ్డసేయు.** (సడ్డ+చేయు) స. క్రి. ౧. సరకు
సేయు, లెక్కసేయు.

తే. ఇందు రమ్మని పిలువఁ గాళిందు యతడు
మత్తుఁ డని సడ్డసేయక మసలుటయును.
భాగ. ౧౦, స్కం. ఉత్త. ౪౯౯.

క. ఈతరణిఁ జూడుభాస్వతి, యాకాంక్షలుదీఱ
గాఁ దవహ్నిశ మతిసిన్, డీకొల్పి రథులఁ
జిపురంజేకత్తివలెను సడ్డసేయక యుండెన్.
హంస. ౬-౧౭౦.

క. ఈతీరు సకలభోగము, లాతతగతి నడచు
చుండ బాధార్తాఖ్యు, డాతలిరు గుత్తిగల
దొర,చేతి కటారికిని సడ్డసేయక యుండెన్.
హంస. ౨-౨౦౩.

చ. సరకుగొనందు నన్నుఁ దనచాయలు, వాలి
వదంచె మత్పురఁ,దరవిభు సడ్డసేయక యితఁ
డని రాఘవునాలి జాలి ము,న్నరకికుఁ దెప్పు
పోలిక ఘనాఘనమాలిక. చంపూరా ౬-౫౨.

తే. సామి వాని చలంబు మచ్చిరము బలిమి,
యొక్క డేవంక సేమని యెంచవచ్చు నొకటి
నొక్కటి సడ్డసేయక మెలఁగు,వాపాలంబునఁ
దరతరం బై మెకములు. జౌరంగ. ౧-౬౭.

క. ఈకైవడి నెచ్చెలి గన యాకాంక్షలు దీర్ప
నిర్భరానందముతో,నా కోడెకాఁడు చివు
రుం,జేకత్తి వలెను సడ్డసేయక యుండెన్.
శుక. ౨-౭౬.

**సడ్డసేయు.** అ. క్రి. ఆదరించు.

గీ. కానగాఁ గోరివచ్చిన తరుణి యగుట, సడ్డ
సేయక యాతఁడు పోకసేయు.
పార్వ. ౪-౭౯.

**సడ్డించు.** (క.చడ్డిదక్) అ. క్రి. అలక్ష్యము సేయు

వ. అడ్డగించి నించిన యొద్దువలలకు సడ్డించి
నెద్దునం బడక గడ్డుతికియు మృగంబు లనే
కంబులు వోలియుటయును.
ఉ. హరి. ౪-౭౭.

**సణుగు.** వి. ౧. బాధ.

గీ. దనుజకులవైరి కొడుకునందనులు నట్ల రక్కసులు
మనవారు వారలకు మనకుఁ బొసఁగునే నమ్మఁ
బెట్టినఁబూరిగాలు కేలచిత్రరేఖా మది నింత
సణుగు. ఉ. హరి. ౫-౧౫౭.

౨. అస్ఫుటవాక్కు (వా.)

**సణుగు.** గొణఁగు. అ. క్రి. అస్ఫుటముగాఁ బలుకు,
లోలోన పలుకు.

**సత.** వి. (సం. సప్త, ప్రా. సత్త, త. సత్తమ్)
౧. సప్తసంఖ్య ౨. పల్లము.

సీ. సత యనఁ బల్లము సప్తసంఖ్య చెలంగు.
ఆం. భా. 3-౫౦.

3. జూదమున వాడఁబడు ఏడుసంఖ్యకు సంజ్ఞ,
సత్తా.

సీ. ఇత్తిగ చక్కన నెసఁగును పట్కంబు సత
యన విలసిల్లు సప్తసంఖ్య .... అరయ నీరీతి
ద్యూతసంఖ్యలు చెలంగు.
ఆం. భా. ౨-30౬.

**సతతగతి.** సం. వి. ఇ. పుం. వాయువు, గాలి.

**సతతము.** సం. విణ. (అ. ఆ. అ) అవిచ్ఛిన్న
మైనది, ఎడతెగనిది.

శాం. మేల్ గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే
కాయంబు పాపాయమే భాగ. ౭-౫౯౨.

**సతతము.** అవ్య. ఎల్లప్పుడును, సర్వదా.

క. సతినిట్లు రాధికామణి,సతతము గనుగందనీక
చుముపున మనిచెన్. రాధికా. ౧-౬౨.

సతహాలుకలదునియోఁడు వి. సప్తజిహ్వలు గల
వేల్పు; అగ్ని. పాం. ని. దే. ౧౨.

(ఇక్ష్వే సతహాలుకల జేజే, అచ్చ. రా. బాల.
౭౪)

**సతప్రోళ్లు.** వి. బ. (మోక్షప్రదములగు) సప్తక్షే
త్రములు.

(అయోధ్య, మథుర, మాయ, కాశి, అవంతి,
ద్వారావతి అనునవి సతప్రోళ్లు.)

గీ. పుడమి నెన్నదఁగా ముత్తి యిడఁగఁ జాలి,
పొదలు సతప్రోళ్లయందును మొదలి దగుచు
నొరుల కిరీటఁ గెలవ రాకుండినట్టి కడిఁది
పేర్మిచి యాప్రోలు కరము మెఱయు.
అ.రా. బాల. 3౨.

సతము. వి. (సం. సతతమ్) శాశ్వతము.

చం. కలిమియు లేమియున్ సతముగా నవి పొంది నచోఁ జెలంగుచున్ గలఁగుచు నున్కి ధీరుల ప్రకారమె?.... భార. అర. ౭-౧౯౪.

గీ...... స్వర్గసౌఖ్యంబు సతమె?
శివధర్మ. ౫-౧౧౬.

సతర్కము. సం. విణ. (అ. ఆ. అ) తర్కమున నిష్ణాతమైనది, విచక్షణాశీలమైనది.

సతాయించు. హిం. క్రి. బాధించు, వేధించు.

సతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పతివ్రత, సద్గుణము లుగల స్త్రీ.

ఆ.... ఒప్పు గా దెయుత్తమ సతులకుఁ బతులఁ బూని నట్టి వ్రతము దాల్ప. పాండు. ౩-౧౭౯.
౨. దక్షుని కూఁతురు, (పార్వతి మొదటియవతారము) ౩. సన్న్యాసిని, యోగిని ౪. సౌరాష్ట్ర మృత్తిక, ఒకవిధమైన సువాసనగల మన్ను. ౫. భార్య.

కం. తనసతి కపకారము సేసిన పాముల కలిగి..
భార. ఆది. ౧-౧౫౨.

సతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. దానము, ఈవి, ౨. నాశము.

సతీన (క) ము. సం. వి. అ. పుం. ౧. కలాయ భేదము, ఒకవిధమగు బటాని. ౨. వెదురు.

సతీర్థు (ర్థ్యు) ఁడు. సం. వి. అ. పుం. సహాధ్యాయి.

సతీలకము. సం. వి. అ. పుం. సతీనము.

సతీలము. సం. వి. అ. పుం. ౧. వెదురు. ౨. వాయువు, గాలి. ౩. ఒకవిధమగు బటాని.

సతేరము. సం. వి. అ. పుం. ఊఁక, పొట్టు.

సత్కరించు. సం. స. క్రి. సన్మానించు, పూజించు.

ఆ. ఆమహర్షి మిగుల హర్షించి రాజఋషీంద్రు మతి పరిగ్రహించి మామ, సత్కరించి పనుప శౌరికి మామ యానతిచ్చి కరణిఁ బొంగుచుఁ డఁడు సనియె. ఉ. రా. ౧-౧౯౭.

సత్కర్మము. సం. వి. న్. న. ౧. మంచిపని, వేదవిహిత మైనయాగాదికార్యము,

క. అంతంతకు సత్కర్మము, లెంతయుఁ జేయు పొంద.... భార. శాంతి. ౫-౪౧౯.

ఉ. ధర్మనిరూపకత్వమున దైర్యమునన్ మహనీయవృత్తి సత్కర్మవిధిజ్ఞతన్ ....
భార. విరా. ౧-౫౧.

తే. ధర్మదేవతనీమ సత్కర్మమునకు మెచ్చి....
భార. విరా. ౧-౬౧.

౨. పితృకర్మము, ఉత్తరక్రియ. ౩. ప్రాయశ్చిత్తము, ౪. ఆదరము, సత్కారము.

సత్కాండము. సం. వి. అ. పుం. శ్యేనము, డేగ

సత్కారము. సం. వి. అ. పుం. ౧. గౌరవించుట, ఆదరించుట ౨. పూజించుట ౩. సన్మానము చేయుట ౪. గౌరవము. ౫. శ్రద్ధ ౬. విందు భోజనము, భోజనము. ౭. పర్వము, వ్రతదినము

కం. వారల సర్వక్రియ సత్కారులఁ గావించి పుచ్చి .... భార. ఆది. ౨-౧౯౭.

కం. తనకడకు నారదుఁడు వచ్చిన సత్కారము దగంగ జేసి .... భార. అను. ౨-౧౩౧.

సత్కృతము. సం. విణ. (అ. ఆ. అ) ౧. సత్కారముఁ జేయఁబడినది. ౨. గౌరవింపఁబడినది, ఆదరింపఁబడినది. ౩. పూజింపఁబడినది. ౪. అధికారము నొసంగఁబడినది, అధికృతము. ౫. సన్మానము చేయఁబడినది.

సత్కృతము. సం. వి. అ. న. ౧. ఆదరముతోఁ గూడినయాతిథ్యము. ౨. గౌరవము. ౩. సద్గుణము.

సత్కృతి. సం. వి. ఇ. స్త్రీ. సత్కారము గౌరవము, మర్యాద.

క. అని రాగతరంగిణి తను వినయోక్తుల వెలుఁగు మాన్పి వేగంబుగ మజ్జనభోజనాదిసత్కృతుల్ లోనరింపఁగ మామవేర నుపలాలితుఁడై.
విక్రమా. ౭-౧౨౪.

**సత్కృతుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సత్కృతుఁడు.** సం.విశే. (అ.ఆ. అ) ౧. గౌరవింపఁబడినవాఁడు.పూజింపఁబడినవాఁడు.3.అధికార మీఁబడినవాఁడు. ౪. సన్మానము చేయఁబడినవాఁడు.

**సత్క్రియ.** సం. వి. ఇ. స్త్రీ. ౧. మంచిపని ౨. సద్గుణము, మంచితనము 3, ఈవి, త్యాగము వితరణము. ౪. ఆతిథ్యము, అతిథిపూజ. ౫. మర్యాద, గౌరవము. ౬.పవిత్రముచేయు సంస్కారము ౭. ఉత్తరక్రియ, పితృకర్మము.

**సత్ఖ్యాతి.** సం.వి.ఇ. స్త్రీ. పూర్వమీమాంసకైకదేశమతము, రామానుజాచార్యమతము. (ఈమతమున భ్రమలేదు.ఇదిరజత మనుజ్ఞానము శుక్తిగతరజతావయవదర్శనమువలనఉపన్న మగుచున్నది. శుక్త్యవయవబాహుళ్యమువలన ప్రాయికముగ శుక్తిజ్ఞానోత్పత్తియు, రజతావయవాల్పత్వము వలన ఒకానొకప్పుడు రజతజ్ఞానోత్పత్తియు నగుచున్నది.)

**సత్త.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉనికి, ఉండుట. ౨. యాథార్థ్యము, కలరూపు. 3. ద్రవ్యగుణక్రియలయందలి జాతి౪.మంచితనము ౫. సత్తువ (శ. ర.)

**సత్తమము.** సం. విశే. (అ. ఆ. అ) మిక్కిలి మంచిది, అన్నిటికంటె నుత్తమమైనది, సర్వశ్రేష్ఠము.

వ.అని యుపదేశించిన....అస్త్రబోధనసత్తముండు భార. అను. ౧-౨౭.

**సత్తరువు.** వి. (సం. సత్రమ్,త. చత్తిరమ్) అన్నదానగృహము, సత్రము.

క. చలపందిరులును సత్తరువులు నూతులు బావులుం దువుందోఁటలుఁ జెఱ్వులు నల్గిండ్లును మొదలుగ గలిపె యమీన్ ఖానుఁడసమునింపెన్ బుడమిన్. యయా. ౧-3౭.

సీ. తెరవాట్లు గొట్టి సత్తరువు వెట్టుటకంటె, న్యాయయార్జితాన్న మింతైనమేలు. రామలిం. శ. 3.

**సత్తా.** (సం. సప్త, ప్రా. సట్ట. త. సత్తమ్) సత వి. ద్యూతమున వాడఁబడు ఏడుసంఖ్య.

క౦. అశీవం, చిత్తిగ, దుగ, సత్తా, డచ్చాకవంచ, చావం, చీకై.... ఉ.హరి. 3-౧౭౧.

**సత్తి.** (సం.శక్తి,త.చత్తి, క. సకతి, సకుతి తు. సకతి) వి. బలము, సత్తువ.

సీ. లావు సత్తి సత్తువ బల్మి పేఁచ మోపిగ యన వెలయు శక్తి. ఆం. భా. ౨-౨౭౧.

౨. గీ. హత్తి మిచ్చిచందంబున హత్తి వెడఁద కత్తిఁ గత్తికను బిటాఁడ గత్తిఁ దించి, సత్తి మత్తిల్ల బలిచేసి సత్తి నొక్కఁ డవనిపతి యిచ్చు మేలు మే లనుచు మెచ్చ. చంద్రా. ౨. ఆ. (శ. ర)

౨. శక్తి, ఆయుధవిశేషము.

తే. ముస్సు వెత్తమ్మిచూలిచేఁ గొన్నయట్టి సత్తి యనుతూపు నిగిడింప. అచ్చ. రా. యు. కాం. ౨౧౭.

ఆ. మత్తగిల్లు సత్తుగిత్తతత్తడి నెక్కి మిత్తిమొత్తి సత్తిసత్తి బత్తిఁ బత్తిడిన ముత్తిబుత్తులు రెండును, నొత్తి గుత్తగట్టుచుండు నోడ. నీలా. ౧-౧౨౦.

౪. శక్తి యనుముని. (వసిష్ఠునికొడుకు)

అ. అప్పు దదనుచెయ్యలలరించి సత్తియబ్బయు. అచ్చ. రా. అ. కాం. ౭౭.

**సత్తిగలాఁడు.**సత్తిగలుగుమేటి .వి.కుమారస్వామి ఇట్టే సత్తిబూనువలంతి, (సాం.ని. దే. 8) సత్తితాలుపు అని శ. ర)

**సత్తితాలుపు.** వి. కుమారస్వామి, శక్తిధరుఁడు.

**సత్తు.**[1] వి. మెత్తనిలోహవిశేషము, తగరము. (వ్యవ. సత్తుగిన్నె, సత్తుకంచము మొ.

**సత్తు.**[2] (సం. సక్తు) వి. పిండి.

సీ.... పిష్టంబు పిండినా సత్తునా వెలయుచుండు
ఆం. భా. ౨-౨౧౪

**సత్తు.³** వి. (సం. శక్తి) బలము, చేవ.

**సత్తు.⁴** వి. సత్యము.

**సత్తు.** సం. వి. ల్. న. నక్షత్రము.

**సత్తు.** సం. విశ. ౧. ఉన్నది. ౨. చదునది. ౩. పూజ్యము ౪. శ్రేష్ఠము. ౫. సత్యము. ౬. సాధువు.

**సత్తువ.** (సం. సత్త్వమ్, త. సత్తువమ్, క. సత్తు. వ. సగువు తు. సకువ.) వి. దేహబలము.

లావు, సత్తి, సత్తువ, బల్మి, పీచ మోనికె యన
వెలయు శక్తి ఆం. భా. ౨-౨౭౧.

**సత్తెనంగ.** వి. సస్య విశేషము.

ద్వి. సత్తెనంగ బెదంగ సత్త్రెయ్యి.
విష్ణు. పూ. ౩. (శ. ౪)

**సత్త్రపరివేషణము.** సం.వి. అ. న యాగమున నాహారము పెట్టుట, యజ్ఞమునం దాహారపదార్థములు పంచిపెట్టుట.

**సత్త్రము.** సం. వి. అ. న. ౧. యాగవిశేషము పదమూఁడు మొదలు నూఱుదినములవఱకును జేయఁబడు యాగము.

కం.సద్గుణసముదాయమ్మొప్పఁగఁ జేసె సత్త్రయాగము నిష్ఠన్ భార. ఆది. ౪-౩.

౨. యజ్ఞము. ౩. ఆహుతి, వేలిమి. ౪. సదాదనము,దక్షిణతోడిసదతాన్నదానము ౫. దాతృత్వము, ఔదార్యము. ౬. ఇల్లు ౭.కప్పు,అచ్ఛాదనము ౮. ధనము. ౯. అడవి. ౧౦. చెఱువు. ౧౧. మోసము, వంచన ౧౨. శరణము, రక్షణస్థానము, ఆశ్రయము.

**సత్త్రశాల.** సం. వి. ఆ. స్త్రీ. ధర్మశాల, అన్నదానముచేయుటకేర్పడిన గృహము, సత్రము.

ద్వి.చలిపందిరులు సత్త్రశాలలు గుండ్లుఁజెలమలు నంతంతఁ జేయఁ బంచుచును.
పండితా. పర్వత. పుట ౩౫౨.

**సత్రా.** సం. అవ్య. సహార్థకము, కూడ, తోడ (దీనికి సహ యనెడియవ్యయమునకు వలెనే సమాసపూర్వపదముగాఁబ్రయోగముండవచ్చును

**సత్త్రాపశ్రయము.** సం. వి. అ. పుం, రక్షకస్థానము, శరణము, ఆశ్రయము (విల్యమ్సు)

**సత్త్రాయణ(న)ము.** సం.వి.అ.న. దీర్ఘకాలము జరుగుయాగమునకు సంబంధించినసభ.

**సత్త్రి.** సం. వి. న్. పుం. ౧. అవిచ్ఛిన్నముగా యాగముచేయువాఁడు. ౨.దాత యైన గృహస్థు గృహస్థు. ౩. యాగమున సుప్రదష్టగా నుండు ఋత్విక్కు.

**సత్త్రి.** సం. వి. ఇ. పుం. ౧.మేఘము ౨.ఏనుఁగు

**సత్త్రి.** సం. విశ. జయశీలుఁడు.

**సత్త్వము.** సం. వి. అ. పుం. న. ౧. సత్తు, ఉనికి. ౨. స్వభావము, నిసర్గము. ౩. సైసర్గికగుణము, పుట్టుకతో వచ్చినగుణము ౪.ప్రాణము ౫. తెలివి, ఎఱుక, చిత్తము. ౬. భ్రూణము, కడుపులోనిశిశువు.

కం. అపన్నసత్త్వయాపగ యాపగిదిన్నీ దుమోసి
వనుచు. ౩-౭౧.

౭ద్రవ్యము, పదార్థము. ౮. భూమి జలము వాయువు మొll పంచభూతసంబంధ మైనపదార్థము. ౯. ప్రాణి, జంతువు.

సీ. వినుడెల్లసత్త్వంబులను బెంటిఁజంపుట,పాపంబు ... భార. శాంతి. ౩-౧౮౨.

కం.... దుష్యంతమహాబల మందరనగము సత్త్వ
భయజనకం బై. భార. ఆది. ౪-౧౧.
౧౦. పిశాచము. దయ్యము. ౧౧. మంచితనము, సుగుణము, ౧౨. సత్యము, యౌదార్యము. ౧౩. బలము, శక్తి.

మక కోశలము.

సామలెల్లొ నరించె మత్ప్రియభామకేసురుగుండ నుద్దామసత్త్వడ .... భార. ఆది ౧-౧౫౪.
తిరలము. వినుతిసత్త్వులఁగో రెఁ గద్రువ వేవురం గడు వేడ్కతోడ. భార. ఆది. ౨-3.

కం. నారాయణుండు వాఁకవాఁకజవ సత్త్వ ములు ధ్రువంబుగ నిచ్చెన్.
భార. ఆది.

౧౪. జ్ఞానము, మంచితెలివి, వివేకము, ౧౫. సత్త్వరజస్తమోగుణము లనెడి త్రిగుణములలో మొదటిది, సత్త్వగుణము.

క....తమో, ధీనతను రజఃపరత, జ్ఞానవలయుఁ గాక సత్త్వసైష్ఠికమగుగ్రు.
భార. శాంతి. ౬-౨౭౧.

గీ. సత్త్వమార్గాధిరతి యాత్మతత్త్వదర్శనంబు గావింపఁ దనుఁదాన వదుఁడు గాంచు.
భార. శాంతి. ౬-౨౭౧.

౧౬. విశేషధర్మము. నైసర్గికలక్షణము. ౧౭. విశేష్యము. నామవాచకము.

**సత్త్వమేజయము.** సం. విణ. (అ. ఆ. అ) జంతువులను బెదరించునది, ప్రాణిభయంకరమైనది.

**సత్త్వలక్షణము.** సం.వి.అ. న. గర్భచిహ్నము.

**సత్త్వవంతుఁడు.** సం. విణ. (త్. వత్. త్) (సత్త్వముగలవాఁడు)౧. జీవించి యున్నవాఁడు ప్రాణ మున్నవాఁడు. ౨. నిజమైనసారము గలవాఁడు. 3. మంచివాఁడు, సద్గుణములు గలవాఁడు. ౪. ధైర్యము గలవాఁడు.

**సత్త్వసంప్లవము.** సం. వి. అ. పుం. ౧. బలనాశము, బలక్షయము, ఉత్సాహభంగము, ౨. ప్రపంచనాశము, ప్రళయము.

**సత్త్వసంశుద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. స్వభావశుద్ధి స్వభావముయొక్క పాఁశుద్ధ్యము.

**సత్త్వసారము.** సం. వి. అ. పుం. ౧. బలముయొక్క నిగ్గు, ౨. మిగులబలము గలదేహము.

**సత్పత్రము.** సం. వి. అ. న. క్రొత్తతామరరేకు సం. విణ. (అ. ఆ. అ) మంచిపత్రములు గలది.

**సత్పథము.** సం. వి. అ. పుం. ౧. ప్రశస్తమైన మార్గము, మంచిదారి. ౨. సరియగుపద్ధతి, సన్మార్గము., మంచినడవడి. 3. ప్రాచీనసిద్ధాంతము. ౪. నక్షత్రమార్గము, ౫. ఆకాశము.

**సత్పరిగ్రహము.** సం. వి. అ. పుం. యోగ్యుని వలన దానము పుచ్చుకొనుట.

**సత్పాత్రము.** సం. వి. అ. న. దానమునకుఁ దగినవాఁడు.

సీ ....ఆన్నపాలుం డపూర్వసంబంధి సూరి యాజితపోనిష్ఠులందు సత్పాత్రము లెవ్వారలను టయు. భార. అను. ౨-3౬.

ఉత్తముఁడు.

**సత్పాత్రవర్గము.** సం. వి. అ. పుం.తగినవానికి దానముచేయుట.

**సత్పాత్రవర్షి.** సం. విణ. (న్. ణీ. న్) తగినవానికి దానమిచ్చువాఁడు.

**సత్ప్రతిపక్షము.** సం. వి. అ. పుం. (తర్క) హేతుదోషము, హేత్వాభాసములలో నొకటి, వ్యతిరేకపక్షమును సాధించుటకుఁ గూడ హేతు వగునట్లు చెప్పెడుహేతువు.)

**సత్ఫలము.** సం. వి. అ. పుం. దానిమ్మచెట్టు.

**సత్యా.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సత్యము, నిజము. ౨. సీత 3. ద్రౌపది. ౪.వ్యాసునితల్లియగు సత్యవతి. ౫. దుర్గాదేవి. ౬. కృష్ణుని భార్య యగు సత్యభామ.

**సత్యాకారము.** సం. వి. అ. పుం. ౧. నిజమైనదిగాఁ జేయుట. ధ్రువపఱుచుట, ఒడంబడిక, యంగీకరించుట. ౨. ముందుగా నిచ్చెడిసొమ్ము ధరావస్తుగా నిచ్చినసొమ్ము)

**సత్యకము.** సం విణ. (అ. ఆ. అ) సత్యము.

**సత్యకము.** సం.వి. అ. న. ౧. ఒడంబడిక మొదలగువానిని స్థిరపఱుచుట.

**సత్యదర్శి.** సం. విణ. (న్. ఈ. న్) నిజమును గనిపట్టువాఁడు

**సత్యదేవుఁడు.** సం. వి. అ. పుం. సత్యనారాయణస్వామి.

**సత్యపురము.** సం. వి. అ. న. విష్ణులోకము, వైకుంఠము.

**సత్యప్రతిష్ఠానము.** సం. విణ. (అ. ఆ. అ) సత్యము మూలముగాఁ గలది. సత్యము నాశ్రయించి యున్నది.

**సత్యఫలము.** సం.వి.అ.పుం.బిల్వము,మారేడు

**సత్యభామ.** సం.వి.ఆ. స్త్రీ. శ్రీకృష్ణుని భార్యలలో నొకతె. ఈమె సత్రాజిత్తు కూఁతురు.

**సత్యభామ.** సం. వి. ఆ. స్త్రీ. కృష్ణుని యష్టమహిషులలో నొకతె, సత్రాజిత్తనయ.

**సత్యము.** (సం. విణ. అ. ఆ. అ) ౧. నిజమైనది యదార్థమైనది. ౨. కాపట్యములేనిది.

**సత్యము.** సం. వి. అ. పుం. ౧. సత్యలోకము. ౨. అశ్వత్థవృక్షము.

**సత్యము.** సం.వి.అ.న. ౧.నిజము,యాథార్థ్యము ౨. నిష్కాపట్యము. ౩.మంచితనము. ౪. ఒట్టు శపథము. ౫. ప్రత్యక్షమైననిజము, రుజువు చేయఁబడిననిజము. ౬. కృతయుగము. ౭. నీరు, జలము, ౮. పరబ్రహ్మము.

**సత్యమూలము.** సం. విణ. (అ. ఆ. అ) సత్యప్రతిష్ఠాపనము.

**సత్యయుగము.** సం. వి. అ. న. కృతయుగము.

**సత్యరతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) సత్యమునందాసక్తి కలవాఁడు. సం.వి.అ. వ్యాసుఁడు.

**సత్యవతి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వ్యాసునితల్లి; పరాశరునివలన వ్యాసునిఁ గనినయామె. ౨. నారదుని భార్య. ౩. ఋచీకుని భార్య.

**సత్యవద్యము.** సం. విణ. (అ. ఆ. అ) నిజమైనఖ్యాతి గలది. వి. అ. న. నిజము, సత్యవచనము.

**సత్యవాక్కు.** సం. విణ. చ్. ౧. నిజమైన వాక్కుఁ గలవాఁడు, ౨. నిజముచెప్పువాఁడు.

**సత్యవాక్కు.** సం. వి. చ్. పుం. ౧. ఋషి. జ్ఞానదృష్టి గలవాఁడు, ౨. కాకి.

**సత్యవాక్యుఁడు.** సం. వి. అ. పుం. నిజమైన వాక్కుగలవాఁడు.
ఉ. మానితసత్యవాక్య యభిమన్యుకుఁ
దృహ.... భార. ఆది. ౨-౨౩౧.

**సత్యవాది.** సం. విణ. (న్. ఈ. న్) ౧. నిజము పలుకువాఁడు. ౨. కాపట్యము లేనివాఁడు, మనసులోనున్నది పైకిఁ జెప్పువాఁడు.

**సత్యవ్రతుఁడు.** సం. విణ. అ. ఆ. అ సత్యమే వ్రతముగాఁ గలవాఁడు.

ఆ .... పితృసమస్తకులును భిక్షితాన్న పూతశాంతభావములుగలవారు సత్యవ్రతులును బూజ్యు లనఘ నాకు. భార.అను. ౨-౧౩౩.

**సత్యశ్రావణము.** సం. వి. అ. న. ౧. ఒట్టు పెట్టుకొనుట. ౨. శపథము చేయుట.

**సత్యసంకాశము.** సం. విణ. (అ. ఆ, అ) బయటికి సత్యముగాఁ గనఁబడునది.

**సత్యసంగరుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు

**సత్యసంగరుఁడు.** సం. విణ, (అ. ఆ. అ) నిజమయిన ప్రతిజ్ఞ కలవాఁడు, ఆడి తప్పనివాఁడు.

**సత్యసంధ.** సం. వి. ఆ. స్త్రీ ద్రౌపది.

**సత్యసంధుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) నిజమయిన ప్రతిజ్ఞకలవాఁడు. వి. అ. పుం. ౧. రాముఁడు. ౨. భరతుఁడు. ౩. జనమేజయుఁడు.

**సత్యాకృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ముందుగాఁ జెల్లించినసొమ్ము. ధరావత్తుగా నిచ్చినసొమ్ము.

**సత్యాగ్ని.** సం. వి. ఇ. పుం. అగస్త్యుఁడు.

**సత్యానృతము.** సం. విణ (అ. ఆ. అ) ౧. నిజమైనదియు నిజముకానిదియు. ౨. పైకి సత్యముగాఁ గనఁబడుచు నసత్యమైనది.

**సత్యానృతము.** సం. వి. అ. న. ౧. సత్యాసత్యములు ౨. సత్యాసత్యవృత్తి, వాణిజ్యము, వర్తకము.

**సత్యాపనము.** సం. వి. అ. న. ౧. సత్యము పలుకుట. ౨. ఒప్పంబడిక, బేరము మొదలగువాని స్థిరపఱుచుకొనుట.

**సత్యాభిసంధుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. నిజమయిన ప్రతిజ్ఞకలవాఁడు, ౨. ప్రతిజ్ఞ ప్రకారము వర్తించువాఁడు.

**సత్యుఁడు.** సం. వి. అ. పుం. ౧. రాముఁడు. ౨. విష్ణువు. ౩. నాందీముఖ శ్రాద్ధమున కధిష్ఠాన దేవత.

**సత్యోద్యుఁడు.** సం. విణ. (అ. అ. అ) ౧. నిజము పలుకువాఁడు.

**సత్యోపయాచనుఁడు.** సం. విణ. (అ. అ. అ) కోరిక నెఱవేర్పువాఁడు.

**సత్రము.** సం. వి. అ. న. సత్త్రము.

సీ. సత్రంబు సాలయుఁ జలిపందిరియు రచ్చకొట్టము ద్రవ్వుట.... భార. అను. ౨-౬౧.

వ. వేంకటరంగపిళ్ల సత్రంబున విడిసితి. నీ. యా. పు. ౫.

**సత్వరము.** సం. విణ. (అ. అ. అ) వేగముతోఁ గూడినది. త్వరగలది.

కం. విని సత్వరముగ నటఁగొని చని యుద్దేశమున గల్గుజనములు.... భార. అను. ౨-౨౪౫.

అవ్య. వేగముగా.

**సత్స్నేహయుఁడు.** సం. విణ. (అ. అ. అ) మంచి స్నేహితులు గలవాఁడు.

**సత్స్నేహయుఁడు.** సం. వి. అ. పుం. మంచిస్నేహితుఁడు.

**సత్సారుఁడు.** సం. వి. అ. పుం. ౧. కవి. ౨. చిత్రకారుఁడు.

**సథూత్కారము.** సం. విణ. (అ. ఆ. అ) తుంపరలతోఁ గూడినది. వి. అ. పుం. ౧. తుంపరలతోఁ గూడినమాట, ౨. తుంపరలు పడునట్లు మాట్లాడుట.

**సద.** (సం. ఛదః) (క. సదె = చెత్త) ఆకు, ఆకుమీఁదినూఁగు.

ద్వి. సదసల్ట నలినల్ట సరిగన్యుగల్ట, వెదకియు, గానక మది విచారించి. బస. పురా. ౫౮ పు. ౨౭ పం.

**సదంజనము.** సం. వి. అ. న. ఇత్తడినుండి తీసిన యొకవిధ మయినకాటుక, పుష్పాంజనము (వాచ)

**సదంశ (శ) ము.** సం. వి. అ. పుం. కర్కటకము, ఎండ్రి.

**సదంశవదనము.** సం. వి. అ. పుం. నారాయణ పక్షి, రాఁబులుఁగు.

**సదనము.** సం. వి. అ. న. ౧. ఇల్లు, భవనము.

కం. మదమునఁ గృష్ణుఁడు తంతీసదనమునకుఁ జనిరొ.... భార. ఉద్యో. ౩-౧౮౧.

వ. విచిత్ర తర చిత్ర సదనాలంకృతంబును .... శివరహస్య. సంభవ. ౩-౧౬౫.

ఉ. వచ్చినకార్యమేమనుచుఁ జల్కినవాఁడు కూతునల్లునిన్ మెచ్చికఁబఁపఁగావఁయు మా సదనంబునకన్న.... రాధికా. ౨-౧౮.

౨. క్షయము, తెఱగుదల, నశించుట. ౩. అలయిక. ౪. జలము. ౫. యజ్ఞశాల, ౬. యమనివాసము, యమస్థానము. ౭. కూర్చుండుట. ౮. పీఠము

**సదమదమగు.** (√సదమదము) అ. క్రి. నలఁగు, మర్దిత (మృదిత) మగు.

క. చదురాడ పథ్య మని తోఁచ దురాడనపథ్య
మనుచు సదమదమయ్యెన్, మది రానన వశమై
తా, మది రానన వశమై మరులు మరలుప
వింకన్. శృం. శాకుం. ౨-౨౨.

**సదమదము.** విణ. నలఁగినది.

క. ఇది మొన యిది నలు కిది పో, టిది వీ టిది
ధుమ కిది యిది యని తా, రుదిరిపడి పంక్తు
గీటును, సదమదముగఁ గాలు గేలు జంట
పెంచఁగన్. ప్రబం. ౧-౭౮౬.

(జ. సదమదమగు, సదమదము చేయు, సదమద మొనర్చు)

వ. కోశల యిక్ష్వాకుల దెలిసిన యదవ నవోదర
నంబున సదమదంబు లగు నంగంబులు.
వసు. ౪-౨౩.

**సదమదముచేయు.** √ సదమదము. సక్రి. ౧. మస్తత మొనర్చు, నలఁగఁగొట్టు ౨. చంపు.

ఆ. సదమదంబు చేసెఁ జక్కాడె నుగ్గాడె....
హతము చేసె ననుట కాఖ్య లయ్యె.
ఆం. సం. మా. ౪౭, ౫౦.

**సదమద మొనర్చు.** సక్రి. చంపు, వధించు.

క. పదిమోముల రక్కసుని క, సదమద మొనరించి
కోఁతులంసంతసము నఁ, మ్మిత్రిదిలదొర బోఁదఁ
జేకొని, మెద వెదలో దిటము విడకు మింత
యుఁ దండ్రీ. అ. రా. కిష్కింధా. ౫౧.

**సదము.** సం. వి. అ. పుం. చెట్టుపండు.

**సదము.** సదస్సు. సం. వి. స్. స్త్రీ. న. సభ.

ఆ. సదములోని విప్రజనులమీఁద నెగడుపడఁగ
భార. ఆది. ౨-౧౩౦.

ఉ. ధీమత! యంను ధర్మజుఁడీసునకృష్ణుల
పెద్దలామనుచుం, బోయి సదంబు వెల్వడి సభ్రా
తృబలుం డయి చైద్యుఁ డల్కతోడన్.
భార. సభా. ౨-౧౫.

**సదయము,** సం. విణ. (అ. ఆ. అ) దయతోఁ గూడినది.

మ. ఇదిగో వచ్చెదనంచుఁ బోయి బహుశాస్త్రోగ్
మహాబ్ధంబులై సదయుం డేటికి రాఁడు నాయెడ
కటాక్షం బెట్లుఁ బోనాడెనో రాధికా. ౨-౬౧

**సదరహి.** హి. విణ. (రూ. సదరు) పైని చెప్పినది.

**సదరుబోయలు.** వి. బ. ఒకజాతి బోయలు.

**సదసద.** విణ. సడమడము. (క. సదె, సదెబడె. తు. సది, సదసదప్పు)

చ. కర్కసంబుఁడన్ సదసదగాఁగ ద్రోసియును.
జై. భా. ౪-౪౭. (శ. ర)

**సదసద్వివేకము.** సం. వి. అ. పుం. ౧. మంచి చెడ్డలు తెలుపు తెలివి.

కం. ఎట్టివిశిష్టకులంబునఁ బుట్టిన సదసద్వివేకములు
గలిగిన... భార. ఆది. ౫-౫౯.

**సదస్యుఁడు.** సం. వి. అ. పుం. ౧. రాజసభలోని పురుషుఁడు.

చం. అనిన సదస్యులందఱుఁ బ్రియంబున....
భార. ఆది. ౨-౨౩౨.

శా.... సుశిష్యబ్రహ్మసంఘంబుతో సద్యం
ద్యంను సదస్యుఁ డయ్యోపనిషన్ ...
భార. ఆది. ౨-౨౪౯.

సభాపతుఁడు. ౨. యజ్ఞమున సాహాయ్యము చేయు ఋత్విక్కు. యజ్ఞమున న్యూనాతిక్రతా విపర్యయపరిహారమునకై విధానమును జూచుచుండెడి ఋత్విక్కు.

చం. అనిన సదస్యు లందఱుఁ బ్రియంబున ....
భార. ఆది. ౨-౨౩౨.

**సదస్సు.** సం. వి. స్. న. ౧. నివాసము, ఉనికిపట్టు. ౨. సభ.

**సదా.** సం. అవ్య. ఎల్లప్పుడు.

క०. ఈ రెండుకారణముల మురారాతియయర్ఘ్యు
మునకు నర్హుఁడు జగదాధారుండు మాత్రకాదు
సదారాధ్యుఁడు విష్టపత్రయావాసులకున్.
భార. సభా. ౨-౨౬.

౨. శాశ్వతముగా.

**సదాగతి.** సం. వి. ఇ. పుం. ౧. వాయువు. ౨.సర్వేశ్వరుఁడు ౩.సూర్యుఁడు. ౪.మోక్షము, శాశ్వతానందము.

**సదాచారము.** సం. వి. అ. పుం. ౧. మంచినడవడి, సత్ప్రవర్తనము.

క. సారగదాధారసదా, చారసదాశయుని మాత్మ
చారుతరోద్య, త్స్మరజితాకారయుతా ....
రాధికా. ౪-౧౧౨.

౨. శిష్టాచారము.

**సదాటు.** విశే. వక్రోన్నతము.

ఒప్పును సదాటు నాగ వక్రోన్నతంబు
ఆం. భా. ౩-౧౯.

౨. దృఢము, బిఱుసుగలది.

సీ. గాటంపు వీఁక సదా టైనమేనుల పెంపుమట్టి
నిగనిగల్ మెఱుపుమీఱ.
శకాం. ౨-౧౬. (శ. ర)

**సదాతనుఁడు.** సం.విశే (అ.ఆ.అ) ఎల్లప్పుఁడు నుండువాఁడు. వి. అ. పుం. విష్ణువు.

**సదాతోయ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కరతోయానది. ౨. ఎల్లప్పుడును నీరు గలనది, ఎప్పుడును ప్రవహించుయేఱు.

**సదాత్ముఁడు.** సం. విశే. (న్) మంచివాఁడు, మంచిమనస్సు గలవాఁడు.

**సదాదానము.** సం.విశే. (అ. ఆ. అ) ౧. ఎల్లప్పుడును దానము కలది. ౨. ఎల్లప్పుడును దానము చేయునది. ౩. ఎల్లప్పుడును మదము కార్చునది, (ఏనుఁగు) వి. అ. పుం. ౧. ఐరావతము ౨. గంధద్విపము, మదపుటేనుఁగు.

**సదాదానుఁడు.** సం.వి.అ.పుం. ౧. ఇంద్రుఁడు ౨. విఘ్నేశ్వరుఁడు.

**సదానందుఁడు.** సం.విశే. (అ.ఆ.అ) ఎల్లప్పుడు నానందము గలవాఁడు, నిత్యసంతోషి. వి. అ. పుం. శివుఁడు.

**సదానర్తము.** సం. వి. అ. పుం. కాటుకపిట్ట, ఖంజరీటము.

**సదాప.** (హిం.సదాబ్.త. సదాప్పు. క. సదాప, సదాబు. తు. సదాపు, సదాబు. సం.శతపుష్ప అని కిట్టెలు) వి. ఒకానొక చెట్టు, మరువక.

సీ.... అలరుసదాప యంచ చన మరువక.
ఆం. భా. ౧-౫౯.

**సదాపుష్పము.** (సం. విశే. (అ. ఆ. అ) ఎల్లప్పుడును పువ్వులుగలది.

**సదాపుష్పము.** సం. వి.అ. పుం. నారికేళము ‡

**సదాప్రసూనము.** సం. వి. అ. పుం. ౧. రోహితము, మాలుమోదుగ ‡ ౨. అర్కము, జిల్లేడు ‡ ౩. కుందము, మల్లె ‡

**సదాఫలము.** సం.విశే. (అ. ఆ. అ) ఎల్లప్పుడు పండ్లు గలది.

**సదాఫలము.** సం. వి. అ. పుం. ౧. బిల్వము, మారేడుచెట్టు. ౨. పనసచెట్టు. ౩. ఉదుంబరము మేడిచెట్టు. ౪. నారికేళము, కొబ్బరిచెట్టు.

**సదాభవ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ఎల్లప్పుడు సన్నిధి నుండువాఁడు.

**సదాముస్తె.** వి.ఒకానొకచెట్టు. (శ.ర) జెముడు అని బ్రా.

గీ. పేలతీట కసిందయు గోలజెముఁడు, బొంత
జెముడల్లియును సదాముస్తె పొంపలు, గాఁ
గలుగుఁట్టి చిటుచెట్లఁ గాంచి యంత.
హంస. ౪-౧౦. (బ్రా. పా)

**సదాయోగి.** సం. వి. న్. పుం. ౧. కృష్ణుఁడు. ౨. విష్ణువు.

సదాశివుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

క. జయ జయ శర్వ! సదాశివ! జయజయపతి రాజ విజయ! జయజయమృత్యుం, జయ....
నిరంకుశో. 3-43.

సదృక్షము. సం. విణ. (అ. ఈ. అ) ౧. పోలినది, సమాన మైనది.

క. దక్షారామంబునకు సదృక్షంబగునట్టి పుణ్యక్షేత్రముగలదే. భీమ. ౨-౨౦.

౨. యుక్త మైనది, ఉచిత మైనది. 3. అర్హ మైనది, తగినది.

సదృశము. సం. విణ. (అ. ఈ. అ) సదృక్షము

సీ. సంకల్పభవమాత సదృశకర్ణాకల్ప కల్హార సౌరభాగత మదాళి. శృం. నై 4-4.

సదృశస్పందనము. సం. వి. అ. న. ఉచిత విధమున (నాడి) కదలుట. ఇట్టే సదృక్షస్పందనము.

సదేశము. సం.వి.అ.పుం. సామీప్యము, చేరువ

వ. రామభద్రుం రామానుజనాయక నామధేయుని సదేశంబునకుంబోయి యారేయి తిన్ని వేళంబున నిష్టగోష్ఠిం బరితుష్టుండనై....
సీ. యా. పు. 3

సదేశుఁడు. సం.విణ.(అ.ఆ.అ) ౧. దేశముతోఁ గూడినవాఁడు.౨. సమానదేశపువాఁడు. 3. పొరుగువాఁడు.

సదోషము. సం. విణ. (అ. ఆ. అ) ౧. దోషముతోఁ గూడినది. ౨. లోపములు గలది. 3. తప్పయినది, తగనిది,

సద్గతి. సం.వి.ఇ. స్త్రీ.మంచిస్థితి, ఉత్తమలోకము.

గీ. రెండుకులములయందు గలుగు పితృగణంబులెల్ల సద్గతికి బుచ్చు.... భార. అను. ౨-౧౧౧.

సద్గుణము. సం. విణ. (అ. ఆ. అ) మంచిగుణములు గలది.

సద్గుణము. సం. వి. అ. పుం. మంచిగుణము, మంచితనము.

సద్దు. వి. (సం. శబ్దః. ప్రా. సద్ద. త. చద్దమ్. క. సద్ద, సద్దు) ధ్వని, చప్పుడు.

సీ. మ్రోఁత నాదు రవళి మ్రోఁగుడు సద్దులివలికిడి చప్పు డులుకు దనఁగ శబ్దం బొప్పు.
ఆం. భా. ౧-౧౨౧.

సద్దుసేయు. అ. క్రి. √ సద్దు. శబ్ద మొనర్చు, ధ్వనించు, చప్పుడు సేయు.

సద్ధర్మము. సం. వి. అ. పుం. ఉత్తమధర్మము.

ఉం. నాకుఁ జూపమత్స్య నరపతి ధర్మవర్తి....
భార. విరా. ౧-౬౪.

సద్ధేతువు. సం.వి.ఉ.పుం.దోషము లేనిహేతువు

సద్భావము. సం.వి.అ. పుం. ౧. సత్త, ఉనికి, ఉండుట. ౨. యాథార్థ్యము.

మత్తకోకిలము

....... ఎల్లయందును ధర్మసద్భావమొక్కఁడి కేప్పరింపఁగ బ్రహ్మకైనను గోలునే?
భార. సభా. ౨-౧3౬.

3. మంచిస్వభావము, సుశీలము, మంచితనము ౪. సౌజన్యము.

క. వావులు హాని యిట్లను సద్భావమున....
భార. ఉద్యో. ౪-౨౫.

శా. ఈవంశంబునకెల్ల.... సద్భావంబారనీశాపోత్తు. భార. ఉద్యో. 3-౨౬౧.

సద్మము. సం.వి.న్. న. ౧. ఇల్లు వాసస్థానము.

కం. శ్రీకరణనిపుణ పదపద్మా శేవలసత్వసద్మ....
భార. శల్య. ౨-౧.

౨. స్థానము, చోటు 6. యుద్ధము 3. ఆలయము గుడి 7. జలము, నీరు. ౪. దేవుని పీఠము. 5. పీఠము, ఆసనము.

శా. అంమందుం ద్వయసద్మపద్మవదనుం దద్వం ద్వుడు...... ఆముక్త. ౧-౩౩.

సద్యఃకాలము. సం.వి.అ. పుం. అప్పుడు జరుగుచున్న కాలము.

సద్యఃకాలీనము. సం. విణ. (అ. ఆ. అ) జరుగుచున్న కాలమున నున్నది, ఆధునికము.

సద్యఃపాతి. సం. విణ. (న్. ఈ. న్) అప్పుడే పడిపోవునది, నశించునది.

సద్యఃప్రాణకరము. సం. విణ. (అ. ఆ. అ) వెంటనే బలము గలుగఁజేయునది. (శ్లో. సద్యో మాంసం నవాన్నం చ బాలా స్త్రీ క్షీరభోజనమ్ ఘృత ముష్ణోదకం చైవ సద్యఃప్రాణకరాణి షట్ (వాచ.)

సద్యఃప్రాణహరము. సం. విణ. (అ. ఆ. అ) త్వరగా బలమును పోఁగొట్టునది. (శ్లో. శుష్కం మాంసం స్త్రియో వృద్ధా బాలార్క స్తరుణందధి ప్రభాతే మైథునం నిద్రా సద్యః ప్రాణహరాణి షట్ (వా. చ)

సద్యము. సం. అవ్య. స్. ౧. వర్తమానదినము, జరుగుచున్న రోజు, ౨. తత్క్షణము, వెంటనే.

కం. గంగాతరంగశీకర సంగతమగు మారుతమున సద్యః పూర్వం బంగీకరించునెవ్వఁడు భంగపడుచుఁ దిరుగు ఘోరపాపచయంబున్.
భార. అను. ౨-౧౦౬.

చ. అద్యంశంబును నీయక, పద్యశభ వింగఁ గని వారికిఁ బాయున్, ఎద్యంబ బ్రహ్మహత్యా పద్యము మొదలైన పాప వర్గంబెల్లన్.
భార. స్వా. ౭౯.

౩. వేగముగా ౪. ఇంకను మునుపు, కించిత్పూర్వ కాలమున.

సీ. సద్యోవిచ్ఛిన్న సారంగనాభికా హృద్యమై పిసాళించుమృగమదంబు మను. ౨-౪౪.

సద్యశ్శౌచము. సం. వి. అ.న. వెంటనే కలుగు పారిశుద్ధ్యము.

సద్యస్కము. సం. వి. ణ. (అ. ఆ. అ) నవి క్రొత్తది. ౨. తత్క్షణమే యైనది.

సద్యస్స్ఫూర్తి. సం. వి. ఇ. స్త్రీ. తత్క్షణమే స్ఫురించుట, వెంటనే తోఁచుట.

సద్యోజాతము. సం. విణ. (అ.ఆ. అ) అప్పుడే పుట్టినది, తత్క్షణమే యైనది.

సద్యోజాతము. సం. వి. అ. పు. శేమాన, ౨. న. పంచబ్రహ్మమంత్రములలో నొకటి.

సద్యోజాతుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సద్యోభావి. సం. విణ. (న్. ఈ. న్) అప్పుడు పుట్టినది, క్రొత్తగాఁ బుట్టినది.

సద్యోభావి. సం. వి న్. పుం. శేమాన.

సద్రుపు. సం. విణ. (ఉ) ఆఁగునది. ౨. పొవునది.

సద్వంద్వము. సం. విణ (అ. ఆ. అ) కలహ స్వభావము గలది, తగవు లాడుటయం దాసక్తి గలది.

సద్వసథము. సం. వి. అ. పుం. పల్లె, చిన్న గ్రామము.

సద్వస్తువు. సం. వి. ఉ. న. ౧. మంచివస్తువు. ౨. మంచిప్రణాళిక. చక్కని కథాకల్పన, మంచి కథ.

సద్వృత్తము. సం.విణ. (అ. ఆ. అ) మంచినడవడి గలది, సుశీలమైనది.

సద్వృత్తము. సం. వి. అ. న.౧. మంచి నడవడి

కం.... రామధరణీపతి సద్వృత్తము
ని. రా. ౧-౧౧

౨. సౌజన్యము

సద్వృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. మంచినడవడి, సాధువర్తనము. ౨. చక్కని వ్యాఖ్యానము.

**సద్వృత్తి.** సం. విణ. (ఇ) మంచినడవడి గలది.

**సధర్మచారిణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కలిసి ధర్మకార్యముల నాచరించునది. ౨. అగ్నిసాక్షికముగఁ బెండ్లాడినభార్య, ఇల్లే సధర్మిణి.

**సధర్మి.** సం. విణ. (న్. ణీ. న్) సధర్ముఁడు.

**సధర్ముఁడు.** సం. విణ. (న్) ౧. సమాన ధర్మములు గలవాఁడు, సమానమైన గుణములు గలవాఁడు ౩. సమానజాతి కలవాఁడు, ఒక తెగవాఁడు. ౪. పోలిక గలవాఁడు, సమానుఁడు ౫. ధర్మముతోఁ గూడినవాఁడు.

చం. వినుము సుయోధనాఖ్యుఁడును మీరు సధర్ములు గాక.... భార. ఉద్యో. ౩-౨౬౧.

**సధి.** సం. వి. ఇ. పుం. అగ్ని. (త్రి). స.

**సధిస్సు.** సం. వి. స్. పుం. వృషభము, ఎద్దు.

**సధ్రీచి.** సం. వి. ఇ. స్త్రీ సహచరురాలు

**సధ్రీచి.** సం. విణ. కూడఁబోవునది.

**సధ్రీచీనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) కూడఁబోవువాఁడు, సహచరుఁడు.

**సధ్ర్యంచుఁడు.** సం. విణ (చ్. చీ. చ్) కూడఁబోవువాఁడు.

**సధ్ర్యంచుఁడు.** సం.వి. చ్. పుం. సహచరుఁడు, (భర్త)

**సనకుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మమానస పుత్త్రులైన నలువురు ఋషులలో నొకఁడు.

**సనగలు.** సెనగలు. (సం. చణకః. త. చణకమ్. క. చణక, చణఁగి) దే. వి. బ. ధాన్యవిశేషము.

ఉ. సనగలు గోధుమల్ పెసలు సజ్జలు లంకలు కొఱ్ఱనిల్లు వ, డ్లును. బ. ప్రభులింగ ౫-౭౪.
సనగసొంపు జాతింగ సమపె బొబ్బరలు.
విష్ణు. పుం. ౩ ఆ. (క. ర)
(సెనగకు మొదటి రూపము)

**సనత్కుమారుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మదేవుని మానస పుత్త్రులయిన నలువురుఋషులలో నొకఁడు.

**సన(తుఁడు)త్సు.** సం.వి.త్. పుం. బ్రహ్మదేవుఁడు.

**సనత్తు.** సం. అవ్య. ఎల్లప్పుడు.

**సనము.** సం.వి. అ. పుం. ఏనుఁగుచెవుల చేఁటపుంగటకర్ణముల యాస్ఫాలనము.

**సనయము.** సం. విణ. (అ.ఆ. అ) సనాతనము. ప్రాచీనము. (వైది)

**సనాతనము.** సం.విణ(అ.ఈ.అ) శాశ్వతమైనది.

కం. మనుజుఁడు శరణం బని యాశ్రయింప జాహ్నవి సనాతన పదోపలబ్ధి సంపదనొసఁగున్
భార. అను. ౨-౧౧౯.

**సనాతని.** సం.వి.ఈ.స్త్రీ.౧. లక్ష్మి ౨. పార్వతి ౩. సరస్వతి.

**సనాతనుఁడు.** సం.విణ. (అ.ఈ.అ) ౧. శాశ్వతమైనవాఁడు, ఎల్లప్పుడు నుండువాఁడు. ౨. స్థిరమైనవాఁడు ౩. ప్రాచీనుఁడైనవాఁడు.

**సనాతనుఁడు.** సం. వి. అ. పుం. ౧. విష్ణువు ౨. శివుఁడు ౩. బ్రహ్మ ౪. పితృదేవతల యతిథి. ౫. బ్రహ్మపుత్రులలో నొకఁడు.

**సనాథ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. భర్తతోఁ గూడియున్న స్త్రీ. ౨. బ్రతికియున్న భర్త గలది, సువాసిని

**సనాథము.** సం.విణ.౧.పరిపూర్ణమైనది.

గీ. హరునిచేత సనాథయై యతిశయిల్లు మోక్షభోగనివాసంబు దక్షవాటి. భీమ. ౨-౨౧.

౨. కూడియున్నది.

వ. సర్వక్రియా సమగ్రంబయి సదంగ సమృద్ధంబయి సంపూర్ణదక్షిణా సనాథంబయి సకలధనధాన్య సమన్వితంబయి జగన్నాథరక్షితంబయి సకలజనానందకరంబయి రాజసూయం బతిరమణీయం బయిన. భార.సభా. ౧-౨౯౨.

**సనాథుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ౧. యజమానుఁడు గలవాఁడు ౨. రక్షకునితోఁ గూడినవాఁడు, రక్షకుఁడు గలవాడు ౩. ఆక్రమింపఁబడినవాఁడు ౪. కూడినవాఁడు, పూర్ణుఁ డైనవాఁడు.

కం. అఁటుగా యీ యజ్ఞము విధి సనాథ బుద్ధిఁ గృతియోగ సంపూర్ణంబయ్యెను గదవచేరను.... భార. ఆది. ౨-౨౧౦.

కం. జలనిధి .... సౌందర్యమ్మునఁ దలఁపఁగ తను శ్రీ సనాథ హారిహరనాథా! భార విరాట.౧-౪౦

**సనాభి.** సం.విశే.(ఇ.) గర్భసంబంధము గలవాఁడు ౨. సంబంధము గలవాఁడు. ౩. పోలిక గలవాఁడు. సమానుఁడు.

చ. నవవిధశక్తిశేఖయసనాభిశయద్వయ! యివ్విసుంధరాధవుఁడు కళాంకితంబుగ ప్రధానపురీవి కధీశుఁడు- శృం. నై. ౫-౫౯.

౪. ప్రేమగలవాఁడు.

**సనాభి.** సం. వి. ఇ. పుం. ౧. సోదరుఁడు. ఏకగర్భజాతుఁడు. ౨. జ్ఞాతి. ౩. ఏడవ పురుషాంతరమువఱకు నుండెడిజ్ఞాతి, మూరపుజ్ఞాతి.

**సనాభ్యుఁడు.** సం. వి. అ. పుం. ఏడుతరములు దాఁటని బంధువు.

**సనామకుఁడు.** సం.విశే.(అ.ఆ.అ) సనాముఁడు.

**సనాముఁడు.** సం. విశే (న్) సమాన మైన పేరు గలవాఁడు.

**సని.** వి. (సం. శని శ. శని. త. చని) ౧. నవగ్రహములలో నేడవది, శని. (శ.ర) ౨. దురదృష్టము. (గ్రా.)

క. ఈ. నటనల మేమును మీ, మానినియు నిద్దాళ్ళు గూడిమాడి మెలంగన్, నా నోటను బుట్టునె సని దేఁ దెలుఁగనె తేలనే మహీసురముఖ్యా. వి.క్ర. ౪-౧౦.

౩. పాపము, అసత్యము

**సని.** సం. వి. ఇ. పుం. ౧. పూజ, ఆరాధనము. ౨. దానము, ఈవి. ౩. లబ్ధి, పొందుట, సంపాదనము. ౪. ప్రార్థనము, మనవి. ౫. దిక్కు ౬. చూపుయంత్రముయొక్క యొక భాగము.(ఈ. స్త్రీ)

౧. ఏనుఁగు చెవులచఱపు, ౨. జ్యోతిస్సు; ప్రకాశము ౩.గౌరి, పార్వతి.

**సనికలు.** వి. నూఱుటాయి.

క. వనితామణిపాదాబ్జము తఁమ హస్తాబ్జములఁ బట్టి దరహాసరుచుల్, కనుఁ దెప్పలలోఁ దాఁకఁ జేయ, సనికల్ ద్రొక్కించె రాజు సవ్వనిచేతన్. కవిజనరం. ౩-౪౫.

**సనికల్లు.** నూఱుటాయి.

సీ. వనజగేహినిచేత సనికల్లు మెట్టించి ప్రసవసరుంధతి జేర్కొఁ జూపి. ప్రబం. ౧-౬౦౩.

**సనితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. ఈయఁబడినది. దత్తము. ౨.పొందఁబడినది,సంపాదింపఁబడినది.

**సనీడ (ల) ము.** సం.విశే. (అ.ఆ.అ) ౧. కూడ నివసించునది, ఒకగూటిలో నుండునది. ౨. సమీపమున నున్నది, దగ్గఱగా నున్నది.

**సను.** అ. క్రి. రూ. చను.

**సనె.** వి. (రూ. సన్నె)

**సనెకలు.** వి. నూఱెడుటాయి.

చం. సనెకల్ దాఁచిఁ బెండ్లి మామనొక్కొ. కాశీ. ౫ ఆ. (శ. ర)

మ. కోక్కైనవాఱు నమ్మగువన్ బాదపలంబు పట్టి సనెకల్ మట్టించె మోదంబునన్. మను. ౫-౯౩.

మ. జనకోత్సంగనివాసవాసనతో గానవ్యస్తహస్తాభిమ, ర్శనసౌఖ్యామృతపారవశ్యమునతో పైనెన్ శిలాయోజనంబని సాధ్వీ ల్యాగడం బ్రియమఁగ్రోఁ సనెకల్ హత్తించె భూజాని. వసు. ౬-౩౨.

**సన్నకారు.** వి. కమసాలి, కమ్మరి మొదలైన వారి పనిముట్టు.

**సన్నకాళియలు.** వాద్యవిశేషము, ఒకవిధమైన బూరగొమ్ము.

ద్వి. అతిమంజు మురువేణునాదవాద్యగతులఁ, గుబుచల నిడుఁదల గూడి వాయింప, సన్నమేళంగి యానన్నకాళియలు, సన్నబూరుగుఁ గూడి జమిలిఁ బూరింప.
అ. మ. క. ౫. ౨౪౧ పు. ౧౮ పం.

**సన్నగలుకు.** కొంచెము గలుకు, ముదత.

సీ. భూరిదిగ్భిత్తులతోఁ రాచికొన సన్నగలుకెక్కి కప్పారుకంఠ మొప్ప నలఘువాయుస్కంధములు దాఁకి తారలు దొరగ వాడెను నిండు తోఁక యలర. (ఇది వృషభవాహనవర్ణనము)
హా. ఉ. ౭-౮౯.

**సన్నగాఁడు.** వి. చీమ. విణ. అల్పుఁడు, అనద.

తే. గీ. సన్నగాండ్రను బోఁదోలి సరగ వారి, నెలవు లెల్లను గైకొని చెలఁగుచుండు, గులువ విసదారిగా కూటువలకు నెందుఁ, దలఁప నొక్కించుకయు మంచితనము గలదె.
(రెండర్థములకు నిదియే యుదా)
అ. గా. శాల. ౧౦౬.

**సన్నగాణె.** వి. సొన్నాయి.

క. కొమ్ముల నినదమ్ములు శం, ఖమ్ముల శబ్దములు సన్నగాణెల సం, రావమ్ములు నాగస్వరనాదమ్ములు నపిరీరవంబు దరులం బర్వన్.
రాజవాహన. ౫-౬౦.

**సన్నగాలి.** వి. మందమారుతము.

తే. గీ. ఏల ప్రేలెదు తేఁటి యింతేటికలుగ, సంశ్రితల సన్నగాలిమో సన్నగాలి.
రామా. ౬. అ. (శ. ర.)

**సన్నగాళె.** వి. వాద్యవిశేషము, తిరుచిన్నము. (శ. ర)

**సన్నగిల్లు.** అ. క్రి. సన్నమగు. (రూ. సన్నగిలు)

**సన్నజాజులు.** వి. బ. ఒకవిధమైన జాజిపూవులు

సీ....కన్నెగేదఁగిరేకు నైఁ బొన్నచాయనె యున్న సన్నజాజులచెన్ను వన్నెమీరె....
దశా. ౩-౮.

**సన్నతము.** సం. విణ. (త్రి. ఆ. అ) ౧. వంగినది, నమ్రమైనది. ౨. క్రుంగినది. ౩. ముణుఁచుకొనినది. ౪. ధ్వనికలది.

**సన్నతాంగి.** సం. విణ (ఈ) అందముగా వంగిన యవయవములు గల స్త్రీ.

**సన్నతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. నమస్కారము ౨. నమ్రత, వంగుట. ౩. ధ్వని, చప్పుడు. ౪. ఒకవిధమైన హోమము. ౫. అడఁకువ, విధేయత.

**సన్నదు.** హిం. వి. ౧. యోగ్యతాపత్రిక ౨. ఆజ్ఞాపత్రిక.

**సన్నద్ధము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. కట్టఁబడినది. ౨. కవచముధరించినది. ౩. ఆతతాయి, ఇండ్లు కాల్చుట మొ. చెడ్డపనులు చేయునది ౪. మంత్రితంత్రములతోఁ గూడినది. ౫. వ్యాపించినది. ౬. సన్నిహితసంబంధము గలది. ౭. వికసించుటకు సిద్ధముగా నున్నది. ౮. వ్యూహములు పన్ని యుద్ధమునకు సిద్ధముగా నున్నది.

శా. ఈరీతిం జనులెల్ల నుల్లముల నూహింపంగ శంపారుచిస్ఫారజ్యాయుతచాపగోపథుఁడై సన్నద్ధసైన్యంబుతోఁ. సింహా. ౧-౧-౨౨౩.

**సన్నద్ధయోధుఁడు.** సం. విణ. కవచాదిసాధనసహితులైనయోధులుకలవాఁడు.

**సన్నద్ధుఁడు.** సం. వి. ఇ. పుం. ౧. సంసిద్ధుఁడు. ౨. కవచాదులు ధరించి యున్నవాఁడు.

సీ. చైద్యునకై పూని సన్నద్ధులై యున్న యీ రాజు లిందఱు. భార. సభా. ౨-౩౮.

**సన్నన.** వి. సన్నఁదనము.

**సన్నపిల్ల.** వి. సాలెపురుగు. (సన్నబిల్లి గ్రా. పా)

సీ.... జానకాడు చెలఁది సన్నపిల్లి, పాదొట్టనఁగ లూఁతపరిగు. ఆం. భా. ౨-౮౪.

**సన్నపువాఁడు.** విశే. అల్పుఁడు.

సన్నంపువాఁతో జగడ మేల. రా. యు. కాం. (౪. ౮)

**సన్నమండెగలు.** వి. బ. శాలిధాన్యవిశేషము.

**సన్నము.** విశే. ౧. స్థూలముకానిది.

ఉ. సన్నంపుచెలగోలఁ జెంత నిలిచి. నీలా. ౧-౭౧.

౨. మృదువైనది.

ఉ.... ఒక్క యంభోరుహపత్రనేత్ర నునుఁ బొంకపుఁజన్నుల మీఁది సన్నపుఁజీరచెఱంగు వాయగిలఁ జేసిన. కృ. నై. ౩-౭౯.

౩. చిన్నది, అల్పము.

ఉ. సన్నపునిద్రమల్ గలుగుచన్నులఁ బయ్యెద కొంగు జారఁగా. పాండు. ౩-౧౧౭.

౪. సూక్ష్మము, కొంచెమైనది.

వ. కృతజ్ఞతాగుణలేశంబు క్లేశపఱుచుచున్నయది సన్నంబు దొడ్డ యనువిశేషంబు విచారింపక హస్తకల్పాంతరం బైనద్వైవంబు ప్రశస్తి వివర్ణించి నా చేయు ప్రయోజనం బంగీకరింపుము. కృ. నై. ౪-౭.

౫. అలఁతి, మందమైన.

గీ. శిర సొకింపి యొత్తి సన్నంపుటెలుఁగుతో నిట్టులనియె. మను. ౩-౯౪.

వ. మారాజు దేవరకు విన్నవింపు మని నన్నుం బుత్తెంచె నన్ను సన్నంపునవ్వు నివ్వటిల్ల. వరాహ. ౫-౧౨.

**సన్నము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. కూర్చుండినది, పడుండినది. ౨. క్రుంగినది. ౩. వ్రేలాడునది, వదులయినది. ౪. దుర్బలమైనది, ౫. క్షీణమాయినది, క్షీణించినది, హీనమైనది. ౬. నశింపఁజేయఁబడినది. ౭. నిశ్చలము, కదలికలేనిది. ౮. మాఱిగినది. ౯. సమీపమున నున్నది. ౧౦. పోయినది, విడిచిపోయినది. ౧౧. హీనమైనది (కంఠస్వరము మొ)

**సన్నము.** సం. వి. అ. పుం. ప్రియాలవృక్షము అ. న. కొంచెము, అల్పభాగము.

**సన్నయనము.** సం. వి. అ. న. ౧. దగ్గఱగాఁ జేర్చుట, కూర్చుట. ౨. కలుపుట, సంబంధింపఁ జేయుట.

**సన్నయము.** సం. వి. అ. పుం. ౧. సైన్యము యొక్క వెనుకభాగము. ౨. సమవాయము. ౩. సమూహము, గుంపు.

**సన్నయేలకి.** వి. చిట్టేలకి †

**సన్నరాష్ట్రము.** వి. రాష్ట్ర †

**సన్నవలిపెములు.** వి. బ. సన్ననిచీరలు, వస్త్రవిశేషములు.

వ. శ్రీరామతోపులును జీబులును నుగిపట్టంబులును సన్నవలిపెంబులును వెలిపట్టులును పొంబట్టులును. ద్వా. ౩-౨౦౬.

**సన్నవాఱు.** అ. క్రి. (సన్న+పాఱు) ౧. సూచించు, బయల్పడు.

వ. కృష్ణుండును.... తాను శత్రుం డయ్యును గొనకొల్లక యర్ధ్యప్రసంగంబులం గొర్కె సన్నవాఱం బలుకుచుండ. హరి. పూ. ౩-౧౪౪.

౨. సన్నయేర్పడు, భావము సూచితమగు.

తే. గీ. అనుచుఁ బెక్కుమారు లత్యాదరంబునఁ గన్నెనేమ మరయుచున్నఁ జూచి, సన్నవాఱ నగుచు సకియ ప్రియంవద పార్థివేంద్రుఁ జూచి పలికె నిట్లు. కృ. శకుం. ౩-౧౩.

**సన్నసన.** విశే. (సన్న+సన్న) సులభము.

**సన్నసున్నము.** వి. పాలగార, మెఱుఁగుసున్నపుపూఁత.

వ. అప్పురంబు దారువాలించు సన్నసున్నంబు చేత తేఁతవెన్నెలలు చిమ్ముచు గ్రొమ్మించునుం గలమేడలును. పి. శకుం. ౧-౭౬.

**సన్నసూదులు.** వి. బ. ధాన్యవిశేషము.

సీ. సన్నసూదులు పచ్చగన్నేర్లు గోదండరామము
గ్గేసన్లు. రాయసర్లు. హంస. ౪-౧౨౭.

వ. నిమ్మరులు నీరుకావులు రెడ్డివంకెలు చౌట
వరులు తీగెమల్లెలు సుఖభోగులు సన్నసూ
దులు గొరవంక రాజసాలు కాటుకరేకులు.
ప్రబం. ౧-౧౧౨.

**సన్నహనము.** సం.వి.అ.న. ౧. సిద్ధముచేయుట, సజ్జీకరణము, కవచాదులుధరించుట ౨. సన్నాహము. ౩. బిగువుగాఁగట్టుట ౪. కట్టిపూనిక ౫. పరిశ్రమ. ౬. త్రాడు.

**సన్నాహపడుచు.** సం.క్రి.(సన్నాహము+పడు) సిద్ధపడుచు.

తే.గీ. లంకఁ జేరంగ శీఘ్రముగను సాహసోన్నతి
మీఱ సన్నాహపడితివి, వినత నీలనలాంగద
ద్వివిదకుముదజాంబవద్గంధ శరభాదిసైన్యము
లను. చంపురా. ౮-౬.

**సన్నాహము.** సం.వి. అ. పుం. ౧. యుద్ధమునకు సంసిద్ధ మగుట, కవచము తొడుగుకొనుట ౨. యుద్ధప్రయత్నము. ౩. కవచము.

సం. వి. పూనిక, ప్రయత్నము. సన్నహనము.

తే. ఇట్లు బలదేవకృష్ణుల కిద్దఱకును,గయ్యమునకు
సన్నాహంబు గలుగదయ్యె.
భార. ఉద్యో. ౪-౧౮౧.

క. మోహరములు రెండును సన్నాహంబునఁ
దారసించినన్. చిత్రభా. ౭-౬౬.

**సన్నాహ్యము.** సం.వి.అ.పుం.యుద్ధపుటేనుఁగు.

**సన్నికర్షణము.** సం. వి. అ. న. ౧. దగ్గఱగాఁ దీసికొనుట ౨. సమీపించుట, దగ్గఱగావచ్చుట. ౩. సామీప్యము, ప్రాంతము, చేరువ. ౪. సంబంధము. ౫ (తర్క)విషయేంద్రియసంయోగము (ఇది యాఱువిధములు) ౬. అర్వాచీనమైనది.

**సన్నికర్షము.** సం. వి. అ. పుం. సన్నికర్షణము

**సన్నికల్లు.**వి.మాఱుటాయి.(రూ.సనికల్లు,సనెకల్లు)

సీ. పొగుఱాతి కెగిరఁ బోవుచో దుర్దశ కాద
పెండిలి సన్నికల్లు దాఁచ. రామ. ౫౯.

**సన్నికృష్టము.** సం.విణ. (అ.ఆ.అ) ౧. కొంచె మించుమించు చేరినది, రమారమిగా నున్నది. ౨. దగ్గఱగానున్నది.

వి. అ. న. సామీప్యము, చేరువ.

**సన్నిచయము.** సం. వి. అ. పుం. సమూహము, సంగ్రహము.

**సన్నిచితము.** సం.విణ. అ. ౧. మలనిరోధకము కలది ౨. నిలువయుండి చెడిపోయినది.

**సన్నిధము.** సం. వి. అ. న.సామీప్యము,చేరువ.

**సన్నిధాత.** సం. వి. ఋ. పుం. ౧. దగ్గఱగాఁ దీసికొనివచ్చువాఁడు. ౨. నిల్వయించువాఁడు. ౩. దొంగసొమ్ము(దొంగిలి పడిన సొత్తు)పుచ్చుకొనువాఁడు. ౪ రాజసభయందు జనులను ప్రవేశపెట్టెడి యధికారి. ౫. అన్యుని బాధ్యత వహించి ద్రవ్యాదులను పుచ్చుకొనెడివాఁడు.

**సన్నిధానము.** సం. వి. అ. న. సమక్షము, సామీప్యము.

వ. అవిముక్తశివసన్నిధానంబున విశేషజగజ్జనని
యగు మహాదేవికి నమస్కరించి స్తుతి
యించిన......శివరహస్య సంభవ. ౫-౩౧౪.

౨. చేర్చి యుండుట, కలిపి యుంచుట ౩. కనఁబడుట, గోచరమగుట. ౪. ఆధారము, ఆశ్రయము ౫. పుచ్చుకొనుట, ఒప్పగించుకొనుట. ౬. కలయిక, ౭. ముత్తెము. ౮. నూంచుగా నిల్వయుంచుట. ౯. ఇంద్రియార్థము.

**సన్నిధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సామీప్యము, చేరువ.౨.సాక్షాత్కారము,ప్రత్యక్షము.

ఉ....ఏలవినుజోఁటికిఁ గ్రూరత సాధు సన్నిధిన్.
భార. అను. ౧-౧౨.

వ. ఈదృశంబు లగుపుణ్యప్రబంధంబుల్ల దేవ
సన్నిధిం బ్రకటించుటయు నొక్కయారా
ధనవిశేషం బగుటంజేసి. భార. విరా. ౧

**సన్నిధియగు.** అ. క్రి. సమీపించు, ప్రత్యక్షమగు.

తే. మందిరోద్యానఖేలనానందవిభవ మవధరించెదు తారావిటార్ధమౌళి జివురుగుత్తులవిరులఁ బూజించుటకునో యాఋతువులు సన్నిధి యయ్యె నచట. పాండురంగ. ౧-౧౭౦.

**సన్నిధిసేయు.** మి. అ. క్రి. సమీపించు, ప్రత్యక్షమగు.

గీ. ఎలమి సన్నిధిసేసె సర్వేశ్వరుండు
భార. విరా. ౧.

క. సన్నిధిసేసి తపము మెయి నున్నఁ బ్రయోజనము గలదె? యడుగుము పుత్రీ.
భార. శాం. ౫-౨౦౭.

**సన్నిపాతజ్వరము.** సం. వి. అ. పుం, ధాతుదోషమువలనఁ గలుగు నపాయకరమైన జ్వరము

**సన్నిపాతనిద్ర.** సం. వి. ఆ. స్త్రీ. మూర్ఛ, అపస్మారము, మైకము.

**సన్నిపాతనుదము.** సం. వి. ద. పుం. ఒకవిధమైనవేపచెట్టు. ‡

**సన్నిపాత(క)ము.** సం. వి. అ. ఆ. స్త్రీ. ౧. పడుట ప్రాలుట. క్రిందికిదిగుట. ౨. రెండునదులకలయిక, నదీసంగమము. ౩. సంఘట్టనము, ఒకదానిపై నొకటిపడి కొట్టుకొనుట. ౪. వివిధవస్తువుల కలయిక, ౫ కూడికకు హేతువైన ధాతుత్రయదోషము. ౬. సంగీతమునందలి కాలభేదము. ౭. మైథునము. ౮. యుద్ధము. ౯. ఒకవిధమగు గ్రహముల కూటమి.

**సన్నిపాతి.** సం. విణ. (వ. నీ. వ) ప్రధానకర్మతోడి ప్రత్యక్షసంబంధమువల్ల గాని సన్నిహిత సంయోగమువల్లఁ గాని దానియొక్క ప్రయోజనమును దెలుపఁగల అప్రధానకర్మ.

**సన్నిపాతితము.** సం. విణ. అ. ౧. విడువఁబడినది (బాణము మొ॥) ౨. ఒకచోటికిఁ జేర్పఁబడినది. ౩. కూర్పఁబడినది.

**సన్నిపాత్యము.** సం. విణ. అ. ౧. విసరివేయఁదగినది, ప్రయోగింపఁగదగినది. (బాణము మొ॥)

**సన్నిబద్ధము.** సం. విణ. అ. ౧. కలుపఁబడినది, అతుకఁబడినది. ౨. అమర్పఁబడినది, సిద్ధము చేయఁబడినది.

**సన్నిబర్హణము.** సం. వి. అ. న. ౧. వశపఱుచుకొనుట, ౨. నిరోధించుట.

**సన్నిభము,** సం. విణ (అ. ఆ. అ) (సమాసాంతమున) తుల్యము, సదృశము.

క. ఈశ్వరసన్నిభు లగు యోగీశ్వరులకు ....
శివధర్మ. ౩-౨౩.

**సన్నిభృతము.** సం. విణ. అ. ౧. గూఢము. ౨. ఉచితము. ౩. వినీతము.

**సన్నియ.** దే. వి. సన్నెకల్లు (రూ. సన్నె)

సీ. పువ్వులతోడిమలు ద్రుచ్చి నయంబున.... చందనంబు రాచి సన్నియఁ బెట్టు (సన్నియఁ బెట్టు సన్నెకంటిపైనూఱు)
కుమారసం. ౫-౬౧౭.

**సన్నియోగము.** సం. వి. అ. పుం. ౧. కలయిక, కూడిక. ౨. నియమించుట (ఉద్యోగాదులందు ౩. విధి, ఉపదేశము.

**సన్నిరుద్ధము.** సం. విణ. ౧. అడ్డగింపఁబడినది. ౨. అణఁచఁబడినది. ౩. రగుల్కొల్పఁబడినది (నిప్పు మొ॥) ౪. కప్పఁబడినది. ౫. నింపఁబడినది.

**సన్నిరోధము.** సం. వి. అ. పుం. ౧. అడ్డంకి, అవరోధము. ౨. నిర్బంధము. ౩. ఇఱుకుఁదనము ౪. ఇఱుకుత్రోవ.

**సన్నివాయము.** సం. వి. అ. పుం. కూడిక. గుంపు, సమూహము.

**సన్నివిష్టము.** సం. వి. ణ. (అ. ఆ. అ) ౧. ప్రవేశించినది. ౨. ప్రోఁగైనది, కూడినది ౩. తప్ప,

రమైనది, ఒకదానియందే లగ్నమైనది. ౪. నివసించునది, ఆశ్రయమేర్పఱుచుకొన్నది, ౫. సమీపమున నున్నది, దగ్గఱగా నున్నది. ౬. విడిచినది, బసచేసినది (దండు మొ॥)

**సన్నివృత్తము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. మరలినది, నివర్తించినది. ౨. ఆఁగినది. ౩. వెనుదీయునది.

**సన్నివృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. మరలిరాక ౨. నిరోధము, సంయమము, సహనము, ౩. విముఖత్వము వహించుట.

**సన్నివేశము.** సం. వి. అ. పుం. ౧. (మనస్సు) గాఢముగా మగ్నమగుట. ౨. సమూహము, గుంపు ౩. కూడిక. కలయిక. ౪. స్థానము, స్థితి, స్థలము, ౫. సామీప్యము. ౬. మూర్తి, ఆకృతి. ౭. ఉచితాసనములఁ గూర్చుండబెట్టుట. ౮. కుటీరము గుడిసె. ౯. తూగ్చుట, చొనుపుట. ౧౦. వినోదార్థముగాని వ్యాయామార్థముగాని పురజనులు చేరెడిపురబాహ్యప్రదేశము ౧౧. నక్షత్రసముదాయస్థితి. ౧౨. కడిదల.

**సన్నివేశనము.** సం. వి. అ. న. నివాసము. ప్రతిష్ఠానము.

**సన్నిసర్గము.** సం. వి. అ. పుం. సౌజన్యము, సాధుశీలము.

**సన్నిహితము.** సం విణ (అ. ఆ. అ) ౧. దగ్గఱగా నున్నది, ప్రక్క నున్నది. ౨. ప్రత్యక్షముగ నున్నది, ఉంచఁబడినది. ౩ సిద్ధముగా నున్నది. ౪. దగ్గఱగా నున్నది, సమీపమైనది.

వ. మఱియు నపరిమిత పదార్థరత్నరజతసువర్ణ పరిపూర్ణంబై మహామేరుశైలంబు సన్నిహితం బైనయట్లు.... భార. సభా. ౧-౨౭౩.

వి. అ. న. సామీప్యము.

**సన్నిహితాపాయము.** సం. విణ. అపాయము చేరువగాఁ గలది, నశ్వరము, క్షణికము, దుర్బలము.

**సన్నుతము.** సం. విణ. (అ. ఆ. అ.) పొగడఁబడినది, కొనియాడఁ బడినది.

ఆ. సన్నుతములు నైన యన్నపానాదుల ననుభవించి.... భార. ఆశ్ర. ౨-౬౯.

**సన్నుతి.** సం. వి. ఇ. స్త్రీ. స్తుతి, పొగడ్త.

**సన్నుతించు.** సం. స. క్రి. స్తుతించు.

వ... మమ్ము నిర్మించి నీవ వికతస్థానులం జేయక మన్నింపు మని సన్నుతించిన. వరాహ. ౫-౮౦.

**సన్నె.** వి. (కన్నసన్నె, సణ్ణె) సన్నెకల్లు.

క. అంతటఁ గనుపట్టెను భాస్వంతుఁడు చరమాద్రిమీఁద వారుణదిక్కామంతిని జలకేళికిఁ జిలుకంతి పసుపుముద్ద సన్నెపై నిడుభంగిన్. కాశీ. భా. ౨-౧౦౦.

**సన్నెకల్లు.** వి. నూఱుఱాయి.

సీ. గడపమీఁదను సన్నెకల్లున ఱోటిమీఁదను నుర్కుచేతను దఱుగుయికము.

పి. శకుం. ౪-౭౯.

౨. హోమద్రవ్యవిశేషములు, చిన్నసమిధలు.

ద్వి. పరసాక్షతలును లాజలు సన్నెకల్లు మరభిగంధము నేయి స్రుక్స్రువంబులును, మొదలైన సాధనంబులు గూర్చ క్రియలువదలక యవ్వధూవరుల కెల్పింప....

ద్వి. భార. విరా. ప. ౫-౧౦౪

**సన్న్యసనము.** సం. వి. అ. న. విడుమట త్యజించుట. ౨. సర్వసంగములను బరిత్యజించుట, సన్న్యసించుట. ౩. ఒప్పగించుట ౪. పదిలముగా నుంచుట.

**సన్న్యసించు.** సం. స. క్రి. ౧. త్యజించు, విడుచు, కామ్యకర్మలను విడుచు

తే. గీ. అతఁడు సన్న్యసించె నఖిలభోగంబులు. పాండు. ౫-౯౩.

౨. కలిపియుంచు.

**సన్న్యస్తము.** సం. విణ. అ. ఆ. అ ౧. విడిచి పెట్టఁబడినది, త్యజింపఁబడినది. ౨. ఉంచఁబడినది, అధీనము చేయఁబడినది. ౫. విడిచినది, మకాము చేసినది. (దండు)

**సన్న్యాసము.** సం. వి. అ. పుం. ౧. విడుచుట, త్యజించుట. ౨. ప్రాపంచికసంబంధమును పూర్తిగాఁ బరిత్యజించుట, సన్న్యసించుట. ౩. నమ్ముట, నమ్మి (సొమ్ము మొదలగునవి) దాఁచఁబెట్టుట. ౪. పందె మొడ్డుట. ౫. ఒడంబడిక పొత్తు. ౬. దేహము విడుచుట, మరణము. ౭. జటామాంసి.

**సన్న్యాసి.** సం. వి. న్. పుం. ౧. ఉంచువాఁడు, (సొమ్ము) పదిలముగా నుంచువాఁడు. ౨. ఐహిక విషయములను విడిచిన యతి, సన్న్యాసాశ్రమము గ్రహించినవాఁడు. ౩. త్యక్తాహారుఁడు, తిండిమానినవాఁడు.

కం. సన్న్యాసివేషమున రాజన్న్యసిఁ గని ....
భార. విరాట. ౧-౬౯.

**సన్న్యాసిని.** సం.వి.ఇ. స్త్రీ. సన్న్యసించిన స్త్రీ.

**సన్మాత్రము.** సం. వి. అ. పుం. (కేవలము సత్తు గలవాఁడు) జీవాత్మ.

**సన్మానము.** సం. వి. అ. గౌరవించుట, సన్మానించుట.

**సన్మానించు.** సం. స. క్రి. సమ్మానించు, గౌరవించు.

వ.... సురంగాంకశేఖరుండు .... సకలసందన సనత్కుమారాదిమహామునుల సంభావించి దేవకుల మన్నించి హిమవన్నగ చక్రవర్తి సన్మానించి. వరాహ. ౬-౪౭.

మ. సన్మానించి యే నర్తుతిన్. గనుఁడో యల్లన విచ్చి మేదినియు నాకాశంబునున్ జూచితిన్
దశకు. ౯. అ. ౫.

**సన్య.** వి. శాంతవప్రతికృతి.

సీ. శాంతవ ప్రతికృతి పేరు దనది యుండు సన్య యనన్, ఆం. భా. ౨-౨౯౫.

**సపక్షము.** సం. విణ. (అ.ఆ.అ) ౧. పక్షములు (రెక్కలు) గలది. ౨. ఒకపక్షముగలది. ౩. ఒక పక్షమునకుఁ జెందినది, సమానపక్షమునన్నది. ౪. సమాసము. ౫. (తర్క) పక్షము (విషయము) గలది.

**సపక్షము.** సం. వి. అ. పుం. ౧. సమానమైన యుదాహరణము. ౨. (తర్క) నిశ్చితమైన సాధ్యము గలది.

**సపక్షుఁడు.** సం. వి. అ. పుం. ౧. అనుసారి, సమానపక్షమున నుండువాఁడు. ౨. బంధువు.

**సపత్నము.** సం.విణ.అ. ఆ. అ విరోధము కలది

**సపత్ని.** సం. వి. ఈ. స్త్రీ. సవతి.

**సపత్నీకుఁడు.** సం.విణ. (అ) భార్యతోఁ గూడిన వాఁడు.

**సపత్నుఁడు.** సం. వి. అ. పుం. శత్రువు.

ఉ. ఆకేసరాత్మజావళిఁగోన వత్య్యధికులైన సపత్నులపేర్మిఁ జూచియేఁ, జూచి సహింప నోపక కృశుఁడ విషణ్ణుఁడ నైతి నెంతయున్.
భార. సభా. ౨-౧౧౪.

**సపత్రాకరణము.** సం.వి. అ. న. ౧. బాణము యొక్క రెక్కలుగల భాగము శరీరమునఁ జొచ్చునట్లు గాయపఱుచుట. ౨. మిక్కుటమగు బాధ గలిగించుట.

**సపత్రాకృతము.** సం. విణ. (అ. ఆ. అ) తీవ్రముగా గాయపఱుపఁబడినది.

**సపత్రాకృతి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కుటమగు బాధ, అధికబాధ.

**సపది.** అవ్య. (ఇది సంస్కృతసమాసములందే కానఁబడును) తత్క్షణమే, వెంటనే, వేగముగా.

మ.... సపదిస్ఫూర్తిఁ జరణద్వంద్వంబు గాఁగుం డినన్. మను. ౨-౧౪.

**సపరిచ్ఛదము.** సం. విశే. (అ. ఆ. అ) అవశ్యకములతోఁ గూర్పఁబడినది.

**సపరివాహము.** సం. విశే. (అ. ఆ. అ) అంచులు నిండినది.

**సపరివ్యయము.** సం. విశే. (అ. ఆ. అ) మిరియములు మొదలగు సంభారములతోఁ గూడినది.

**సపర్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పూజ, ౨. గౌరవము. 3. సేవ.

ఉ. అండజయాన నీ వొసఁగునట్టిసపర్యలు మాకు వచ్చె మను. ౨-౪౫.

**సపాట(ము)** విశే. (క. సపాట.) ౧. సేలమట్టము.

చ. పటియలుంవాటి ధాత్రిఁ బడు పర్వతమో యనఁ దేటతోడ నిర్భరముగ ఖడ్గగోముఁడు సపాటగఁ గూలె దురంబులోపలన్. మొ. రా. యు. 3-3౭.

క. వడిఁ దేఁటి దోలి గాజ్యార్ఛడి డొంకిసపాటగా సురస్థలి యపుడా, పిడికిటి గోరకన్ జేయన్, బిడికిటిబి ట్టెగసి బిల్లబీటుఁ బడియెన్. సా. ౧-౯౬. (శ. ర)

౨. సమమైనది, సమానమైన మితిగలది.

వ. తనమేని పొడవు సేల సపాటంబుగా వంచి వింధ్యాచలం బమ్మహానుభావు నెదుర్కొనియె కాశీ. ౨-౧౫౯.

3. మట్టమైనది, సమమైనది.

ఉ. దానవుఁ డద్ధరారమణుఁ దాఁకె సుదగ్రగదాగ్రఘట్టన, గ్లానిసపాటమై యచటి కాంచనకుట్టవిఘట్టితాకృతిన్, బూని కొడన్ గిరీశగళమూలహాలాహలకాలకాంతితో, మేన టి కంబు లాడు తనమేటిత్రిశూలముఁ బూని యుద్ధతిన్. మను. ౪-౯౭.

ఉ. ఏటికిఁ గుంటించి పలుకు విను మేటికి నీభయమోహభంగి యొప్పాట భవత్సమాన మగు పాటిసరి న్నికరంబు లేదు వాఁపాటవ మొప్పమత్పదముపైఁ బ్రవహింపు మదాజ్ఞ నన్నన, చొప్పట సపాటమై కదలి కోటియుఁ గొల్పె నిజప్రవాహమున్ పాండురంగ. ౨-౧3౫.

**సపాటము.** = సపాట. వి. ౧. ఒక్కుమ్మడి, ఒక్కమాట, ౨. చదరము.

క. తా దృష్టియు ముష్టియుఁ దగు, వనువుననుముష్ఠి యేయునతిఁ దప్పదు డించనకాయముల సపాటం, బునఁ బదియుఁ బదేను నచ్చిపోయెం గోలన్. భార. విరా. ౫-3౨

3. సేలమట్టమగుట, నాశము.

ఉ .... యిప్పాటి త్రుపాటకోటికి సపాటము గాటముగా ఘటిల్లదే. సమీర. ౪-౧౭.

**సనాద.** వి. (హిం దై) మహమ్మదీయప్రభువు.

గీ. అనుచు శిరములఁ దాల్చి రెవ్వాని సమగ్రసైన్యధరభూమిఁ జకితులై చను సపాద, కుకుభశాహి నిజామాదికులతలపతులు. వసు. ౧-౪౭.

**సపాదము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. పాదముతోఁ గూడినది. ౨. నాల్గవవంతు అధికముగాఁ గలది.

**సపాలము.** సం. విశే. (అ. ఆ. అ) (గొల్లల) కాపరి కలది. ౨. రాజుతోఁ గూడినది.

**సపిండీకరణము.** సం. వి. అ. న. ౧. చనిపోయినవాని నుద్దేశించి ప్రేతత్వనిమోచనముకొఱకు సంవత్సరాంతమునఁ జేయఁదగిన శ్రాద్ధవిశేషము. (ఇది తఱచుగా చనిపోయినతర్వాతఁ బన్నెండవ దినమునఁ జేయఁబడుచున్నది) ౨. సపిండుని (జ్ఞాతి) యొక్క యధికారమిచ్చుట.

**సపిండుఁడు.** సం. వి. అ. పుం. ౧. సమానపిండము గలవాఁడు. ౨. శ్రాద్ధసంబంధమైనపిండము మూలమున సంబంధించిన జ్ఞాతి.

**సపీతి,** సం. వి. ఇ. స్త్రీ. కలసి త్రాగుట.

**సపౌష్ణమైత్రము.** సం. విశే. (అ. ఆ. అ) రేవతి, అనూరాధ అను నక్షత్రములతోఁ గూడినది.

సప్త. సం. వి. అ. స్త్రీ. ఏడుతంతులు గలవీణ, పరివాదిని. (శ. ర.)

సప్తకము. సం.విశే. (అ.ఆ. ఈ. అ) ౧. ఏడు గలది. ౨. ఏడు.

సప్తకము. సం. వి. అ. న. ఏడింటిసమూహము.

సప్తకీ. సం. వి. ఈ. స్త్రీ. స్త్రీల మొలనూలు.

సప్తగంగము. సం.అవ్య. ఏడుగంగలు (గంగా ప్రవాహములు) కలసిన చోటు.

సప్తగుణము. సం. విశే. (అ. ఆ. అ) ఏడు రెట్లయినది.

సప్తచత్వారింశత్తు. సం. వి. త్. స్త్రీ. నలుబదియేడు.

సప్తచత్వారింశత్తు. సం. విశే. త్. స్త్రీ. నలుబదియేడుసంఖ్య గలది.

సప్తచ్ఛదము. సం. వి. అ. పుం. ఏడాకుల అరటిచెట్టు, ఇట్లే సప్తపత్రము, సప్తపర్ణము మొ.

సప్తజిహ్వుఁడు. సం. వి. అ. పుం. అగ్ని (ఏడునాల్కలు గలవాఁడు) (కాళి, కరాళి, మనోజవ, మలోహిత, సుధూమ్రవర్ణ, ఉగ్రప్రదీప్త అనునవి అగ్నియొక్క యేడు నాలుకల పేళ్లు.) ఇట్లే సప్తజ్వాలుఁడు మొ.

సప్తతంతువు. సం. వి. ఉ. పుం. యాగము, యజ్ఞము.

సీ. మహితపంచాక్షరీ మహిమంబు సమకూఱ
మటి సప్తతంతు కర్మంబులేల?
శివధర్మ. ౧-౧౫౬.

సప్తతి. సం. వి. ఇ. స్త్రీ. డెబ్బది.

సప్తతి. సం. విశే. ఇ. స్త్రీ. డెబ్బదిసంఖ్యగలది.

సప్తతిమము. సం. విశే (అ. ఆ. అ) డెబ్బదియవది.

సప్తత్రింశత్తు. సం.వి.త్. స్త్రీ. ముప్పదియేడు.

సప్తత్రింశత్తు. సం. విశే. త్. స్త్రీ. ముప్పది యేడుసంఖ్య గలది.

సప్తదశ. సం. వి. క్. పదునేడు.

సప్తదశ. సం. విశే. పదునేడుసంఖ్య గలది.

సప్తదశారత్నదానము. సం.వి.అ.ఏదైన నొక పదము రెండువిషయములను వాడఁబడినదో దానికిఁ రెండుటకు నీఱు లేనప్పుడు దానియందలి యంశ మునకుఁగాని తత్సంబంధికిఁగాని చెందునట్లు గ్రహింపవలె నని జైమిని, శబరులచే స్థాపింపఁ బడిన ఒకన్యాయము.

సప్తదీధితి. సం. వి. ఇ. పుం. అగ్ని.

సప్తద్వారములు. సం. వి. అ. న. పంచేంద్రియములు, మనస్సు, బుద్ధి అనునవి.

సప్తద్వీప. సం. వి. అ. స్త్రీ. భూమి.

సప్తధాతువులు. సం. వి.ఉ. పుం. రస, అస్ర, మాంస, మేదోఽస్థిమజ్జాశుక్రము లనుశరీరమందలి యేడుమూలవస్తువులు.

సప్తనలి. సం. వి. ఈ. స్త్రీ. పక్షులను పట్టుట కుపయోగించు చింక.

సప్తనవతి. సం. వి. ఇ. స్త్రీ. తొంబదియేడు.

సప్తనవతి. సం. విశే. (ఇ) తొంబదియేడు సంఖ్య కలది.

సప్తనాడీచక్రము. సం. వి. అ. న. (జ్యోతి) భవిష్యత్కాలమున వర్షములఁ దెలిపెడి జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధమైన యొకానొకయంత్రము.

సప్తపది. సం.వి.ఈ. స్త్రీ. ౧. వివాహమునందు దంపతులు కలిసి యేడడుగులు వేయు క్రియా విశేషము. ౧. ఏడడుగుల సహవాసము.
సప్తపదు లని బహువచనరూపమును గొందఱు వాడినారు.

తనుకడ నిడ సప్తపదులు మెట్టింపు మనిన గం
గాధరుం డమరజాయకుఁడు .... భామినిచే
సప్తపదులు మెట్టించి హేమాంబరుఁడు
లోఁటియిరవున నున్న

ద్వి. పరమ. ౫. ౪౩౨. పు.

సప్తపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. అత్తపత్తిచెట్టు, సోఁకుడు ముడుఁగుచెట్టు.

సప్తపాతాళము. సం. వి. అ. న. అతలము, వితలము, సుతలము, మహాతలము, రసాతలము, తలాతలము, పాతాళము, అను ఏడు భూభాగములు.

సప్తప్రకృతులు. సం. వి. ఇ. స్త్రీ. బ. వ. స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గ బలము లనెడి యేడురాజ్యాంగములు.
(చూ. ప్రకృతి.)

సప్తభద్రము. సం.వి.అ. పుం. శిరీషవృక్షము ‡

సప్తభూమ (మిక) ము. (సప్తభౌమము) సం. విణ. (అ. ఆ. అ) ఏడంతస్తులుగలది (ప్రాసాదము)

సప్తభౌమ. సం. వి. ఆ. స్త్రీ. ఒకనరకభేదము.

సప్తమంత్రుఁడు. సం. వి. ఇ. పుం. అగ్ని

సప్తమము. సం. విణ. (అ. ఈ. అ) ఏడవది.

సప్తమాతృకలు. సం. వి. అ. స్త్రీ. బ్రాహ్మి మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ అను ఏడ్గురు తల్లులు.

సప్తమి. సం.వి.ఈ. స్త్రీ. ౧. (వ్యాక) సప్తమీ విభక్తి. ౨. (జ్యోతి) పక్షమునం దేడవతిథి.

సప్తముష్టికము. సం. వి. అ. న. జ్వరమును పోఁగొట్టు నౌషధవిశేషము.

సప్తరక్తుఁడు. సం.వి.అ. పుం. ౧. అఱచేతులు అఱకాళ్లు, నేత్రాంతరము, నఖములు, తాలుకము, అధరము, జిహ్వ అనెడి ఏడుభాగముల యందును ఎఱుపు గలమనుష్యుఁడు.

సప్తరాత్రము. సం. వి. అ. న. ఏడురాత్రుల కాలము.

సప్తరుచి. సం. వి. ఇ. పుం. అగ్ని.

సప్తల. సం. వి. ఆ. స్త్రీ. విరజాజిలత ‡

సప్తలోకములు. సం. వి. అ. పుం. బ. వ. ఏడులోకములు, భూర్భువస్స్వర్మహర్జన స్తప స్సత్యలోకములు.

సప్తవింశతి. సం.వి.ఇ. స్త్రీ. ఇరువదిఏడు సంఖ్య

సప్తవింశతి. సం.విణ. (ఇ) ఇరువదియేడుసంఖ్య గలది.

సప్తవిధి. సం. విణ. (ఇ) ౧. ఏడురెట్లైనది ౨. ఏడువిధములైనది.

సప్తవ్యసనములు. సం. వి. అ. న. ఏడు వ్యసనములు.

వ. కామజంబు లగు నక్ష, మృగయా, స్త్రీ, పానార్థదూషణంబులును గ్రోధజంబు లగు వాక్పారుష్య, దండపారుష్యంబులును నైన సప్తవ్యసనంబులం దగులక.

భార. శాం. ౨-౨౭౫.

సప్తశతము. సం. వి. అ. న. ఏడునూఱులు, నూటయేడు.

సప్తశతము. సం. విణ. (అ. ఈ. అ) ఏడు నూఱులు సంఖ్యగలది.

సప్తశతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఏడునూరుల పద్యములసమూహము. ౨. ఏడునూఱులుసంఖ్య గల వస్తువులసమూహము.

సప్తశలాకము. సం. వి. అ. పుం. (జ్యోతి) వివాహముహూర్తములను స్థిరపఱుప నుపయోగించెడి జ్యోతిశ్శాస్త్రమందలి యొకచక్రము.

సప్తశిర. సం. వి. ఆ. స్త్రీ. తములపాకులతీఁగె.

**సప్తసప్తి.** సం. వి. ఇ. పుం. సూర్యుఁడు, సప్తాశ్వుఁడు.

**సప్తస్వరములు.** సం. వి. అ. పుం. బ. వ. స, రి, గ, మ, ప, ధ, ని అనెడి సంగీతమునందలి యేడుస్వరములు.

**సప్తాంగము.** సం. విశే. (అ. ఆ. అ) ఏడంగములు గలది (రాజ్యతంత్రము) బ. సప్తప్రకృతులు.

సీ. వర్గత్రయంబున వలనను సప్తాంగములయందు జిత్తంబు మెలఁగు
చుండ.... భార. శాంతి. ౬-౨౦౦

**సప్తాంశుపుంగవుఁడు.** సం. వి. అ. పుం. శని గ్రహము.

**సప్తాంశువు.** సం. వి. ఉ. పుం. అగ్ని.

**సప్తాత్ముఁడు.** సం. వి. న్. పుం. బ్రహ్మదేవుఁడు.

**సప్తార్చి.** సం. విశే. స్. ౧. ఏడుజ్వాలలు గలవాఁడు (అగ్ని) ౨. క్రూరదృష్టి గలవాఁడు.

**సప్తార్చి.** సం. వి. స్. పుం. ౧. అగ్ని.

సీ. వరుణు సమీరణుఁ దరణిఁ బర్జన్యుని సప్తార్చి నీశాను.... భాగ. అష్ట. ౨-౧౩౩.

౨. శని. 3. చిత్రమూలము

**సప్తాశీతి.** సం. వి. ఇ. స్త్రీ. ఎనుబదియేడుసంఖ్య.

**సప్తాశీతి.** సం. విశే. (ఇ) ఎనుబదియేడుసంఖ్య గలది.

**సప్తాశ్రము.** సం. వి అ. న. (క్షేత్ర) ఏడుకోణములు గలరేఖల యాకారము, సప్తభుజము.

**సప్తాశ్వుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

శా.... సముదీర్ణ రేణుసంఘంబు సప్తాశ్వుం గ్రమ్మ.... చిత్రభారతము. ౭-౧౦౭.

**సప్తాహము.** సం. వి. స్. న. ౧. ఏడుదినముల కాలము, ఒకవారము. ౨. ఏడుదినములు చేయు భజనసంకీర్తనపూజాదికము.

**సప్తాశ్రము.** సం. విశే. (అ.ఆ.అ) ఏడుకోణములు కలది.

**సప్తి.** సం. వి. ఇ. పుం. ౧. కాఁడి. ౨. గుఱ్ఱము పందెపుగుఱ్ఱము. 3. భాగస్వామి, కలిసి పని చేయువాఁడు.

**సప్పట.** ఊతపదము. (నడినెత్తురవరె సప్పటయూత పదము)

ఎ. గీ. అప్పనెపము నూఱాఱు లడిగి పుచ్చి, కొనినయంబునఁ దీర్పక కోఁకపోఁక, సరకు సప్పట సరిచెప్పి యరగటాఁచు, చెడుగరపు పోక్క నెవ్వానిఁ బట్టికుక్క.
శే. పంచతం. ౧-౩౩౯.

**సప్పపుఁజుక్క.** వి. ఆశ్లేషానక్షత్రము. (శ. ర)

**సప్పము.** వి. సర్పము, పాము.

క. ఎప్పుడుఁ దప్పులు వెదకెడు, సప్పగపుఁగొల్లఁ గూడ దదియెట్లన్నన్ సర్పంబు పడగ నీడను గప్ప వసించిన విధంబు గదరా సుమతీ
సుమతీ. శ. ౧౯.

**సప్రజ్ఞాతము.** సం. వి. అ. న. ఒకవిధమైన (యోగ) సమాధి.

**సప్రణయము.** సం. విశే. (అ.ఆ.అ) ౧. ప్రేమతోఁ గూడినది. ౨. మైత్రితోఁ గూడినది.

**సప్రతిభము.** సం. విశే. (అ.ఆ.అ) ౧. అనిశ్చితమైనది, ౨. ప్రజ్ఞతోఁ గూడినది, కాంతితోఁ గూడినది.

**సప్రతీవాపము.** సం. విశే. (అ. ఆ. అ) కలయికతోఁ గూడినది.

**సప్రత్యయము.** సం. విశే. (అ.ఆ.అ) ౧. నిశ్చితమైనది. ౨. సమ్మతములతోఁ గూడినది.

**సప్రపంచము.** సం. విశే. (అ. ఆ. అ) సర్వవివరములతోఁ గూడినది.

సప్రభము. సం.విణ (అ.ఆ.అ) సమానరూపము. గలది.

సప్రమాణము. సం.విణ. (అ. ఆ. అ) ప్రమాణములోఁ గూడినది.

సప్రవాదము. సం. విణ. (అ. ఆ. అ) ౧. వ్యుత్పన్న విభక్తిరూపములతోఁ గూడినది. ౨. ప్రవాదములతోఁ గూడినది.

సప్రసవము. సం. విణ. (అ. ఆ. అ) సమాన ప్రసవము గలది, ఒకేమూలమునుండి పుట్టినది.

సప్రాణించు. సం.అ. క్రి. సజీవములగు, బ్రదుకు.

సీ. మొగ మెత్తి మెత్తని యిగురాకు దోఁపంగఁ
దరువులు దనిగాఁపు తపసులను గాంచి
సప్రాణించి క్రమ్మఱఁ గొమ్మలఁగదలించి
నర్తనక్రమమొప్ప. హం. పూర్వ. ౭-౧౮౬.

సప్రేష్యుఁడు. సం.విణ. (అ. ఆ. అ) దాసదాసీజనములతోఁ గూడినవాఁడు.

సఫగము. సం. వి. అ. పుం. శఫరము.

సఫరి. సం. వి. ఈ. స్త్రీ. శఫరి.

సఫలకుఁడు. సం వి. ణ. (అ. ఆ. అ) డాలుతోఁ గూడినవాఁడు.

సఫలము. సం. విణ. (అ. ఆ. అ) ౧. ఫలముతోఁ గూడినది. ౨. నెఱవేఱినది, చరితార్థమైనది, వ్యర్థము కానిది.

గీ. పాపమయ్యెఁ గాకుండె నప్పని దలంచి,
యఱుకునుండుదు మద్భయము పాయింపుఁ,
దగులకగుణ నిష్కపటవృత్తి నభిమతమును సఫ
లముగఁ జేయుఁడివి నాకు సద్వరములు.
భార. ఆశ్రమ. ౨-౧౦౫

సఫలోదర్కము. సం. విణ (అ. ఆ. అ) జయసూచకమైనది.

సఫేదు. హిం. విణ. తెల్లనిది.

సఫేదు. వి. తెల్లవర్ణము.

సబంధువు. సం. వి. ఉ. పుం. చేరికబంధువు, దగ్గఱచుట్టము. సం. విణ. ౧. దగ్గఱసంబంధము గలవాఁడు. ౨. మిత్రుఁడు గలవాఁడు. ౩. ఒక కుటుంబము వాఁడు.

సబడి. = సబడీ వి. ఒకజాతియాయుధము.

చ....పరశులు.... పవులు పాశము లంకుశముల్
సబళ్లు.... కుమా. సం. ౧౨. ౭౮౬.

సబడీ. = సబడి, సబళ.

సబబు. హిం. వి. (హిం. సబబ్) కారణము.

తే. అట్టిపట్లు గాలకించి తమ్మన్న యనియె,
కోట ఖాళీ యొనర్చుట కేటిసబబు, మావలన
నేర మేమి మా రావుగారు, తమ్మ దైవంబు
మాటుగాఁ దలఁచుచుండు. రంగా. ౨-౧౪౯

సబము. వి. (సం. శబము) పీనుఁగు.

చ. సబముపయి న్నిగుడ్చిన నిశాతశిలీముఖ మెట్టి
వెట్టివో. హర. ౭-౫౫.

ద్వి. శబమందు ముట్టంగఁజాలని భుజగసబము
నీమీఁదఁ గొంచక ముట్టివైవ.
నవనాథ. ౪ అ. ౨౩౬ పు. ౧౮. పం.

సబలము. సం. విణ. (అ. ఆ. అ) సేనతోఁ గూడినది.

సబళ (ము) వి.(క. సబళ. ప్రాసము) ౧. ఆయుధవిశేషము. సబిడీ

వ. కాడి వంకిణి సబళ యీటె సెలకట్టె నిర్లను
ద్వాత్రింశదాయుధంబులు. ప్రబం. ౧-౭౮.

ఉ. ఏయుఁగఁ గోరమార్గణము లివ్వలి కవ్వలి కద్రి
దూయఁగా, ద్రేయు ధరాస్థలిన్ సబళ వెంటనె
గాంగఝురంబు లేవఁగాఁ జేయును నగ్గ
నూఁచములు చెట్టును జట్టును గొట్టి.
పాంచాలీ. ౧-౫౬.

వ. చేతులు నఱకుచు సబళంబులు జేడియుచుఁ
దలలు చిదుముచు. భార. ద్రోణ. ౨-౧౮.

ద్వి. ముసలముల్ సబళముల్ మొదలుగా
నొక్క, వెస నాయుధంబులు వెరవులు
మిగిలి. రం. రా. ఉ. కాం. ౪౮ పు. ౪పం.

వచ. గాంధారాసింధుసౌవీరులు కుఠారంబుల
సబళంబులు బరిశ్రమంబు గలిగి.
భార. శాం. ౩-౧౧.

రగడ. మొనలమొనల సబళముల సాదనలు
సేయ. పి. శకుం. ౩-౨౨౫.

ఉ. తమ్మి పెన్నెడము చాటుచేసి తొవనేలము
కాల్చికిఁ గ్రమ్మి దిక్కు లల్లాడగ జాజిపూ
సబళ మంది ఘనధ్వనిమీఱ నార్చుచున్.
చంద్ర. ౨-౧౫౯.

సీ.... కేతపియు సబళంబు కెడకెడఁ బరగించి
ధరఁ బడఁజేసియుఁ దరతరంబు.
భోజసుతా. ౮-౪౯.

వ. చక్రంబులఁ ద్రిప్పుచు సబళంబుల నొంచుచు
సురియల మెఱయుచు.
భాగ. ౬ స్కం. ౩౪౦

ద్వి. శూలంబు లంకించి సురియలు బిగిచి వాల
ముల్ జళిపించి వరశనుగ్రాణ. సబళంబు
లమరించి చక్రముల్ ద్రిప్పి.
రం. రా. యు. కాం. ౨౯౯ పు. ౧౩ పం.

౨. త్రవ్వెడిసాధనము.

పాఱనాఁగను నవదారణంబునకుఁ జేయ పరఁగుఁ
దవుగోల దోఁకుసుపాఱ నాఁగఁ వద్రికేపాభి
ధానంబు దగు సబళము. ఆం. భా. ౨-౨౩౦

**సబలి.** సం. వి. ఇ. పుం. సాయంసంధ్య, మాపటి
సంజె.

**సబాధము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. బాధా
కరము, బాధ కలిగించునది. ౨. బాధతోఁ
గూడినది.

**సబాము.** వి. స్వభావము (సం. స్వభావః)

తే. పాలు కడుఁ బెక్కు దానిసబాము లెస్స,
పెయ్య కర్మలి గలదు.
భార. అను. ౨. ఆ. ౮౨౪.

**సబీజయోగము.** సం. వి. అ. పుం. ఒకవిధమైన
(యోగ) సమాధి.

**సబ్బిణి.** వి. సంగవాచి.

సీ. ననుబంటియామనుబిడ్డను గన్నవారింతె పండు
కతే యేమియుఁ దెలియలేనిసబ్బిణుల్ వీరు
మీచాటుమాటులు గదా, నానాను మేలి
గుణంబుఁ జెఱచె దయ యింతలేక యొంకయు
నెత్తికొంటి రక్కటి.... శుక. ౮-౮౨.

**సబ్బు.** వి. మలధావనద్రవ్యము, సర్జక్షారము,
మలాపి. చౌకారము.

తనరియుండును వస్త్రధావపదార్థసంజ్ఞ చౌకార
మనఁగను సబ్బు నాఁగ ఆం. భా. ౨-౩౦౧.

**సబ్రహ్మచర్యము.** సం. వి. అ. న. ఒకగురుని
యొద్దఁ గలసి చదువుకొనుట, సహపాఠిత్వము.

**సబ్రహ్మచారి.** సం. వి. న్. పుం. ౧. ఒకగురువు
నొద్దఁగలిసి వేదవిద్యాభ్యాసము చేయుసాహ
పాఠి, ౨. సుఖదుఃఖములందు సానుభూతి గల
వాఁడు. ౩. సమానుఁడు.

**సభ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పరిషత్తు, సమాజము,
ఓలగము.

ఉ. ఆసభకేవవస్త్రమగునట్టివనున్ గొనివచ్చి ....
భార. ఉద్యో.

౨. (జన)సమూహము ౩. సభాభవనము, కొలువు
కూటము.

క. ఘన సద్గుణచ్ఛటాగౌరవనటాలికి నృపోత్తమ
సభల్ నృత్తరంగములు గాఁగ.
శివధర్మ. ౧-౨౦.

౪. న్యాయస్థానము ౫. ఆస్థానము ౬. ధర్మ
శాల. ౭. భోజనగృహము. ౮. జూదపుటిల్లు.

**సభక్తికము.** సం. విణ. అ. ఆ. అ భక్తితోఁ
గూడినది.

సీ. ఎద్దాని నెఱుఁగుట యెఱుకలకెల్లను నెక్కు
డనిసభక్తికసమ్మతిఁ బ్రార్థించి యడిగిన ....
భార. అను. ౧-౧౬౩

సభరువాఁడు. వి. (హిం. సఫర్) అశ్వరక్షకుఁడు. గుఱ్ఱములను కాయువాఁడు.

తే. నడుమ నీలున్నతోఁ బడా ల్పెదఁగు నూప, సభయముగ వెంటనరుదెంచె సభరువాఁడు, నమగముస్సై దురోజితో నరుగుదెంచే దారుణా కారుఁ డైనయుద్దాముఁ డొకఁడు. శుక. ౨-౮౭.

సభర్తృక. సం. వి. ఆ. స్త్రీ. బ్రదికియున్న భర్త గల స్త్రీ, విధవ.

సభాకారుఁడు. సం. వి. అ. పుం. సభాగృహ నిర్మాత.

సభాగృహము. సం. వి. అ. న. జనులు సమావేశ మగుభవనము.

సభాచారము. సం. వి. అ. పుం. ౧. సమాజ వర్తనము. ౨. కొలువున వర్తింపవలసినరీతి.

సభాజనము. సం.వి.అ. న. ౧. ఆలింగన కుశల ప్రశ్నాదులచే సంతోషపెట్టుట, ౨.అభివందనము 3. సన్మానము, మర్యాద. ౪. సేవ.

సభాజితుఁడు. సం. విణ (అ. ఆ. అ) ౧. గౌర వింపఁబడినవాఁడు. ౨. ప్రశంసింపఁబడినవాఁడు

సభానాయకుఁడు. సం. వి. అ. పుం. సభాపతి.

సభాపతి. సం. వి. ఇ. పుం. ౧. సభకుఁ బ్రభు వైనయతఁడు. ౨. రాజు. 3. అధ్యక్షుఁడు, ౪. ద్యూతగృహయజమానుఁడు.

సభాపరిషత్తు. సం. వి. ద్. స్త్రీ. సభాసమావేశము.

సభాపూజ. సం.వి. సభయందు సభ్యుల కొసఁగు గౌరవము.

సభామండపము. సం.వి.అ. న. సభాగృహము.

సభాయోగ్యము. సం. విణ. సమాజమునకుఁ దగినది.

సభావనుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సభాసదుఁడు. సం. వి. ద్. పుం. సభ్యుఁడు, సభయందుండుధర్మజ్ఞుఁడు.

చ...అట్టిచో, నడిగినసభాసదుల్ పలుకకుండిరి తద్దయుభీతచిత్తులై. భార. సభా. ౨-30.

సభాసాహుఁడు. సం. వి. అ. పుం. సభలో జరిగి వివాదమున విజయమును బొందినవాఁడు.

సభాస్తారుఁడు. సం.వి. అ. పుం.౧. సభ్యుఁడు, సామాజికుఁడు. ౨. తనధర్మవాక్యోపన్యాసము లచేసన్నప్రత్యర్థులను లేఖకప్రేక్షకాదులను రంజింపఁజేయు సభ్యుఁడు.

సభి(భీ)కుఁడు. సం. వి. అ. పుం. ౧. జూదమాడించువాఁడు.

గీ. సత్యములు చేసి సభికులసాక్షి గోరి. దశకు. ౫-౬౪.

౨. న్యాయవాది. 3.సభాసదుఁడు. (ఈయర్థము తెనుఁగున గానబడుచున్నది)

శా. విద్యారణ్యు లనంగ నొప్ప రతఁడే విద్యం బ్రకాశించె నీ, హృద్యంబైనపురం బొనర్చి విభవం బేలాగునం గాంచెనో, చోద్యం బయ్యెడిమీరు విన్నకథ యిచ్చో చెప్పగాఁ దెల్పుఁడీ యాద్యంతంబు నటన్న దత్సభికు లాహ్లాదంబుతో నందఁగిన్. కృష్ణ. ౨-౧౫.

సభయుఁడై వేగ మచ్చటియధికారి సభికులం దక్కినస్థానబువారి గావించి. ద్వి. పరమ. ౪-3౭౦.

సభోచితుఁడు. సం.వి.అ పుం. ౧. పండితుఁడు, విద్వాంసుఁడు విణ. (అ. ఆ. అ) సభకుఁదగిన వాఁడు.

సభోద్దేశము. సం. వి. అ. పుం. సభకుఁ జేరువ నుండుస్థలము,

సభ్యము. సం. వి. అ. పుం. ౧. పంచాగ్నులలో నొకటి ౨. సభకు నుచితమైనది.

**సభ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ౧. సభయందుండువాఁడు.

గీ. సభ్యులెంచిన పంచయజ్ఞములలోన జ్ఞానయజ్ఞంబుధ్యానయజ్ఞంబు మేలు.
శివధర్మ. ౨-౮౯.

ఆ. సభకువచ్చి ధర్మసందేహమడిగిన నెఱిఁగి చెప్పకుండిరేని సభ్యు, లనృతదోషఫలమునం దర్ధ మొందుదు రనిరి ధర్మవేదులైనమునులు.
భార. సభా. II ౨౩౪.

౨. సభయందుండఁదగినవాఁడు. ౩. నాగరకుఁడు ౪. సుశీలుఁడు, మంచినడవడి కలవాఁడు.

ఆ. .... సభలనెవ్వఁడేని సభ్యుడై పలుకు ....
భార. సభా. II ౨౩౮.

౫. విశ్వసనీయుఁడు, నమ్మదగినవాఁడు. వి. అ. పుం. ౧. న్యాయాధికారికి సహాయుఁడు. ౨. సద్వంశమునఁ బుట్టినవాఁడు. ౩. ద్యూతకారుఁడు

**సమ.** సం. వి. ఆ. స్త్రీ. సంవత్సరము, ఏఁడాది.

**సమంగ.** సం వి.ఆ. స్త్రీ. ౧. మంజిష్ఠ. ౨. ముడుగుఁదామర (శ. ర)

**సమంచితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. వక్రమైనది. ౨. సుందరమైనది.

క. రతిపంచబాణజాయా, పతికేళీసౌధయుగళపర్యంతసమంచితకాంచనకలశములీ, శతపత్రదళాయతాక్షి చామస్తనముల్.
శృంగా. నై. ౫-౧౪

**సమంజసము.** సం. విశే. (అ. ఆ. అ) ౧ ఉచితము, అర్హము, యుక్తము. ౨. స్పష్టము. ౩. ధర్మసహితము ౪. అనుభవసహితము.

కం. కల్మషహరణములైన నీ సమంజసఫణితుల్.
భార. అరణ్య. ४-౨౩౩.

**సమంజసము,౨** సం. వి. అ. న. ౧. ఔచిత్యము ౨. సమాధానము. ౩. సమానత్వము. ౪. సరియైన సాక్ష్యము.

**సమంతదుగ్ధ.** సం. వి. ఆ. స్త్రీ. జెముడుచెట్టు.

**సమంతపంచకము.** సం.వి.అ.న. కురుక్షేత్రము. లేక దానిసమీపప్రదేశము. (చూ. శమంతపంచకము)

**సమంతపర్యాయి.** సం. వి. న్. పుం. అన్నింటికిని సంబంధించినది.

**సమంతప్రాసాదికము.** సం. విశే. (అ. ఆ. అ) అన్నివిధముల సాయము చేయునది.

**సమంతభద్రకము.** సం. వి. ఒకరకమైన దీర్ఘకంబళము.

**సమంతభద్రుఁడు.** సం.వి.అ.పుం. బుద్ధదేవుఁడు

**సమంతభుక్కు.** సం. వి. జ్. పుం. అగ్ని.

**సమకక్ష.** సం. వి. ఆ. స్త్రీ. పరితూళకము.

**సమకక్షము.** సం. విశే. (అ. ఆ. అ) సమానమైన బరువు కలది.

**సమకట్టు.** అ. క్రి. ౧. కడఁగు, యత్నించు.

కం.....తా, నుపనయనము సేయఁగ, గశ్యపముని సమకట్టె. సకల సంభ్రమ మలరన్
దశ. ౫-౭౦.

సీ. గీ. ఆలక నీ వని చెప్ప నే నగప నతఁడు నడఁగ సమకట్టియు న్నతో నప్ప దెఱిఁగి.
యయా. ౩-౧౭౮.

వ. కావ్యకథనంబునకు గ్రథనంబు సమకట్టియున్న సమయంబున. రాజవాహన. ౧-౧౪.

క. పాగతుఁ డని వారలపైఁ, బని థంగముఁ బొందిగాఁగ సమకట్టెను నీ. తనయుఁడు గావున నీ వాతని వారింప వది యనుచితం బని కెమ్మిన్
భార. అర. ౧-౪౭.

క. అద్భుతము వదయన్, సమకట్టి సురేంద్రపురీ, గమునై హరిహరహిరణ్యగర్భులతోడన్.
భార. అది. ౨-౭.

క. అమితభుజశక్తి నంతక, సమునం బాండుసుతు లిందు సౌభ్రాతస్నేహము చెడ విచ్ఛేదముగా సమయాతిక్రమము సేయ సమకట్టరుగా.
భార. అర. ౧-౯౮.

వ. సూర్యమండలంబు భక్షింప సమకట్టి పోవుచున్నప్పుడు.
వి. పు. 3-౧౮౯.

చ. కలి దమయంతిం బాప సమకట్టు నతిం బతి వాయనోపఁడు.
భార. అర. ౨-౮౭.

ఉ. నాకలోకకాంతలకుం జనంగ సమకట్టెఁ బితామహుఁ డూర్మ్యపట్టి.
శృం. నై. 3-3.

౨. సన్నద్ధమగు, ఆయత్తమగు.

చ. భీకరసమరంబు సేయ సమకట్టినయట్లు మహోనురాగనిర్భరమున నున్న వాఁడు.
భార. ఆది. ౬-౨౮౬.

సీ. యాదవులను దొంటియట్టుల సమకట్టి వెకలి ఖేచరదృష్టి వెక్కసమున, మునుగంగఁ జోకి క్లేశించిన పోరాట పదవెనిమిదిమాఱు లెదిరి రప్పుడు.
హరి. ఉ. ౨-౬౭.

3. కలుగు, సమకూడు.

సీ. విమతకీర్తిప్రతాపములు నీచే సమకట్టునే యుద్ధయుగం బెదిరిన, యనవిస్ఫారతాటంక గరిమంబు నీచేతఁ గలుగునే గండరగండ బిరుద.
నరసభూ. ౫-౧౬౮.

౪. సరిపడు, తగు.

రగడ. విలువు నిలిచెను సోగ వగ పెన్నెఱుల కివి సమకట్టు గొల్లులు. శుక. ౧-౧౩౩

సమకట్టు. స. క్రి. ౧. ఏర్పఱుచు, నిర్ణయించు.

ఆ. భోగితలంబుపట్టు పూర్వదేవతలను, నాకపట్టు సురల వీకఁ బట్టి త్రొక్కునట్లుగాఁగ దామోదరుఁడు సమకట్టె వారివారి కదల నిలచి.
వి. పు. ౧-౧౭౦.

క. పాయక భూధేనువునకు స్వాయంభువుఁ గ్రేపుగాఁగ సమకట్టి మహీనాయకుఁడు పిదికె దుగ్ధప్రాయంబై జగము లెల్లఁ బరిపూర్ణముగన్.
వి. పు. ౨-౧౮౪.

వ. మానుషవ్యూహంబు సమకట్టిన వెన్నుండును నిట్టిదృఢవ్యూహంబు గనియును వినియు నెఱుంగ మని యెల్లవారు నచ్చెరువునం బొరయుచు.
భార. భీష్మ. ౧-౧౦౩.

౨. సమకూర్చు, ఘటించు.

ఆ. తండ్రి నీవు నాకు దయతోడ నిచ్చిన వరము చిత్తగించి వలయి తెలుఁగున మయసముచితముగ సమకట్టు మయ్య.
భార. విరా. ౧-౧౭౧.

3. కల్పించు, సిద్ధముచేయు.

వ. అర్ఘ్యోపాధనంబులు సమకట్ట సముచితపరివారంబునకుం జెప్పెదు. భార. భీష్మ. ౧-౭౨
సీ. మనుజ కల్పింప నామని సమకట్టిన పచ్చతోరణంబులు గాంచి.
ఉ. రా. ౬-౧౪.

౪. సంపాదించు.

కం విడితముగ నిన్నుఁ జేయిం, చెదఁ గ్రతువు ధరాధినాథ చేయుము నీకభ్యుదయంబగు సంభారస ముదయము సమకట్టు మనిన ముని వచనమునన్.
భార. అర. 3-౧౭౯.

౫. ధరించు, కట్టుకొను.

ద్వి. జంగమం బడిగిన సమకట్టనిచ్చు.
బస. పు. రా. ౭3పు. ౨౪ పం.

క. తోరపులత్తుకచాయల, వారువములు గట్టి మహిమవరకేతువు నెల్వార సమకట్టి తేరాసారథి గొని తేర నెక్కె సంరంభమునన్.
ఉ. రా. 3-3౪3.

సమకట్టు. వి. కూర్పు, రచన, కేవరచన.

సీ. సర్వాంగహారుఁ గానె సమకట్టు పుట్టంబు, గగనంబునకు నెల్లఁ గలుగ నెక్క.... తే. ఘుమఘుమారంభ గంభీరఘోషఘటిత, లహరికా ప్రతిశబ్దోపలబ్ధి యబ్ధి.
భీమ. 3-౫౧.

క. అల్లన కిచ్చెను బచ్చల, పల్లకియును దమ్మికెంపుఁ బదకపుఁ గోడున్, జల్లుల సమకట్లల రన్, బల్లించిన వారువమును బంగరు గొడుగున్.
యయా. ౪-౧౨3.

ద్వి. కట్టితి సర్వాంగకవచం బనుచుఁ, గట్టిన
సమకట్టు కాంతమాభ్రుకుసు.
బస. పు. ౪౨. ౨౪ పం.

వ....పార్శ్వంబులం గట్టు కంబట్టులాలవరిసమ
కట్టు కెక్కలుగా (గోష్ఠము వర్ణన)
మను. ౪-౧౦౫.

**సమకన్య.** సం. వి. అ. స్త్రీ. పెండ్లియాడుటకుఁ
దగినపడుచు.

**సమకర్ణము.** సం. వి అ. పుం. (క్షేత్ర) సమచ
తుర్భుజము, సమానమగు నాలుగుకోణములు గల
యాకారము.

**సమకాలము.** సం. వి. అ. పుం. ఏకకాలము,
ఒక్కసమయము.

**సమకాలము.** అవ్య. అప్పుడే; ఆసమయమందే.

**సమకాలీనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ఏక
కాలమున నున్నవాఁడు.

**సమకుటు.** అ. క్రి. లభించు.

క. పరసగుణా ధనము మేలు సమకుటు నచటన్
భాగ. ౪ స్కం. ౨౪౬.

**సమకూడు.** = సమకూరు. అ. క్రి. కలుగు.

క. ఇమ్మగ నున్నేమనియే, పమ్ముల మనుజులకు
నెల్ల సమకూడెను నే, క్రమ్ములలోపలనే
రూపమ్ములఁ బొడమాపఁ దొడఁగె పరమ
మునీంద్రా. వి. పు. ౫-౩౫౧.

**సమకూరు.** అ. క్రి. ౧. శక్యమగు.

క. నిమిషాంతరమున నిట్లు క్రమమున మర్త్యులకు
జేయ సమకూనునె? యుత్తముఁ డీతఁడు
బ్రాహ్మణరూపమున సురేశ్వరుఁడో?
భార. ఆది. ౩-౧౭౪.

చ. వననిధిలోని రత్నములు వానుకిమూర్ధజరత్న
సంఘముల్ గొనఁగ నశక్యముల్ జనులకున్
సమకూరదు గాన చెప్పుదున్.
భార. ఆది. ౭-౩౩.

౨. సంఘటిల్లు, ఘటించు.

వ. ఈ బ్రాహ్మణునకు నేమిప్రియము నేయ
సమకూరునో యని చింతించుచు.
భార. ఆది. ౬-౨౪౦.

వ. మాకు సుఖనివాసంబు నేసి పరమోపకారి
యైన బ్రాహ్మణునకుఁ బ్రత్యుపకారంబు
సేయ సమకూరె. భార. ఆది. ౬-౨౭౨.

తే. నీకు నిష్టంబు నేయంగ నెమ్మితోడ గోరు
చుండుదు నది సమకూరె నేఁడు.
భార. సభా. ౧-౧౫౦.

౩. లభించు, చిక్కు.

ఉ.... సర్వసాచిపైఁ గోపము పెద్దవాఁడు సమ
కూరిన బిట్టుఁ జంపుదుం జామీ.
భార. ఉద్యో. ౪-౬౭.

మ.... వ్రావిరి బ్రహ్మాస్త్రము నిన్న రేశ్వరునిపై
వేగం బ్రయోగింపుము, స్థిరలీలన్ సమకూరు
నీకు జయలక్ష్మినిత్యసాంగత్యముల్.
విక్ర. ౪-౧౨౩.

౪. కలుగు, సిద్ధించు.

సీ. సరవితో వర్షంబు సమకూర కుండుటఁ బంట
లేబర మయ్యెఁ బాడితోఁడ. కాశీ. ౧-౧౩౪.

తే. పూర్వజన్మమహాతపస్పూర్తిఁ జేసి, నీదు
సన్నిధి సమకూరె నిధియుఁ బోలె.
శృం. నై. ౨-౨౭.

వ. సందేహంబు వాసి మనంబునకుం జాగ్రుకుడును
సంవాదంబు సమకూటింం గంధర్వ. మందా
క్షంబులకు వశంవదయై. శృం. నై. ౫-౧౭౩.

క. తలఁపులు సమకూరెం గద, బలి లేమియు
లేకయింక వెంచేయఁ దగున్.
యయా. ౫-౧-౪౭.

ఉ. తామర తెంపు లంటినఁ దాచినముక్కలి
పీఁటమీఁదటన్, గోముల లంతఁ బెండ్లికోడు
కుం దగనుంచినఁ బోల్పు మీఁఱఁగాఁ బ్రామి
సుతుం దెలుంగునను రక్కసి యొజ్జ లోపంగాఁ
గూతుసన్, గోమునఁ బెంచు కోర్కి సమకూ
రుటకుం దనబాస మెచ్చఁగన్.
యయా. ౪-౧౦౪.

౫. కూడుకొను, బ్రోగగు.

చ. ఎనయఁగ నొక్క వల్లెదొర యింటను బందుగు
వాఁడు కాంత లెల్లను సమకూరి చేయు పను
లం బడియుండెడు వేళ నొక్క కామినియును
గాముకుం డొకఁడు మెల్లనె మూలకు చేరి
కయ్యమైఁ బెనఁగిరి కంతసీమలను బెక్కు
కవుంగిటఁ జేర్చి గుట్టుగాన్. గంధ. ౧-౧౪౬.

**సమకూరుట.** వి. సిద్ధించుట.

క. అంత వియచ్చరుఁ డభిమతిఁ దంతయు సమ
కూరుటయును నచ్చెర గర్వ, క్రాంత యగు
టయును గనుఁగొని, యింతట నిచ్చోటు
వాయ కానిక నున్నన్ మను. ౩-౧౨౪.

**సమకూర్చు.** (సమకూరుచు) స.క్రి. ౧. కలిగించు; ప్రాప్తింపఁజేయు.

సీ. భద్రవవిజయంబు సతతంబు సమకూర్చుఁ
దూలించు బహువిధదుఃఖములను.
సీతారా. ౧-౬౩.

సీ. సమధికావష్టంభ సంరంభజృంభణ సమకూర్చె
నిజభుజాస్తంభమునకు. హర. ౬-౪౪.

ఎ. గీ. మేలు సమకూర్చి త్రైలోక్య మేలువాని.
దశా. ౨-౨౫౭.

౨. నెఱవేర్చు, సిద్ధింపఁజేయు.

సీ. ఓ మహీధరరాజ యుర్వీశపతి యైన, దశ
రథరాజనందనుని యాజ్ఞ, సమకూర్ప వచ్చితి
సర్వలోకములకు హితమైనసత్కార్య మెల్ల
భంగి. భా. రా. యుద్ధ. ౧౭౨౨.

తే. గీ. చేర్చు మెఱయఁగ వడి సమకూర్పవయ్య
నీలా. ౧-౯౭.

చ....అంగనలం గరఁగింప నేర్చి కోర్కులు
సమకూర్పఁజాలి కడుఁ గొండొక ప్రాయము
గల్గువాని. కుక. ౧-౪౬.

౩. సిద్ధముచేయు.

వ. వాహనంబులు మొదలుగాఁ గలుగు దాన
ద్రవ్యంబులు సమకూర్చి సధికారుల సంభ్ర
మాలాపంబులవలన. పాం. ౫-౭౫.

౪. ఘటిల్లఁజేయు.

తే. ప్రబలదీర్ఘాయురారోగ్యభాగ్యకరము, లగు
వరంబులు సమకూర్చి రఖిలమునులు, నూతన
వివాహకౌతుకద్యోతమానమాననీయాకృతిఁ
జెదిమనుజపతికి. వసు. ౬-౪౩.

చ. అడిగినయంతలోన పరసాన్నములన్ సమ
కూర్చు. పారి. ౧-౬౧.

శా... ఈపాత్రదివ్యాన్నముల్, చాలంగా సమ
కూర్చుఁ గోరినతఱిన్. విక్ర. ౨-౭.

**సమకొను.** అ. క్రి. ౧. సిద్ధించు, కలుగు.

ఆ. మమ్ముఁ గరుణఁ జూడు మా ప్రొక్కు
గైకొను, సకలలోకహితము సమకొనంగ,
విన్నపంబు సేయుచున్నారు సురలెల్ల, నవధ
రించి ప్రోవు మంచితేశ.

భా. రా. బాల. ౩౫౨.

సీ. అన్యాయవర్తను లైనరాజులచేత, సమకొన్న
దుర్వ్యసనములచేత. ఖై. భా. ౯-౨౧౨.

క. వననిధి దాఁటుట వచ్చుట, యనిసేయుట
చేఁత మనుట యది సమకొనునే, మనుజాఁడు
నినుఁ గొనిపోయెడి, ఘనుఁ డెవ్వం డేమ
నీకుఁ గావలి యుండన్.

భా. రా. సుంద. ౨౩౩.

౨. లభించు, ప్రాప్తించు

ఆ. వె. కానఁజన్న రేఁచి తేనియ సమకొన్నఁ
గ్రోలకున్నవాఁడు శీలఁగాఁడె, యువిదఁ
దెచ్చి యూరకుండుమరే తా ప్రమ,చూడ కేలి
కింతఁ జొస్తుఁగాక!
భా. రా. యుద్ధ. ౧౦౯.

ఎ.గీ. తనకు సమకొన్న యారాజ్యమును నొసంగి,
తండ్రితాతలనాటిదై తనరు వేంకటగిరిరాజ్య
మ్మునకును దిరుగఁ జనియెను.

రంగా ౧-౧౧౬.

౩. పూను, యత్నించు.

క. అసురరాజయ్యును దితిజులు, సమరంబున
గాఁడుగాఁడు సమయను నందన్ సమకొ
నఁడు నీతఁ బుచ్చెఁగ, బ్రమసి యెట్లో యకట
యిట్టిపాపము గలదే.
భా. రా. యుద్ధ. ౧౪౮౫.
ద్వి. అసురేంద్రుచే జన్నమట వసిష్ఠుండు, సమ
కొనియె నూఱుసంవత్సరంబు, లందాఁక చే
యించి యని దీర్చి మరలి.
రం. రా. ఉ. కాం. ౧౨౯ పు. ౧౨ పం.
ద్వి. అసురేంద్రుఁ డేతెంచి యశ్వమేధంబు; సమ
కొని కావించి సకలసామగ్రి, యాగంబు
నిండంగ నట బ్రహ్మహత్య, వెస నింద్రుని
జూచి బెగడియు నిలిచి.
రం. రా. ఉ కాం. ౧౬౫ పు ౯. పం.

౪. ఒప్పు, తగు.

చ. మిసమిసలీను మేను నెఱమించుల గొంచెపు
టంచుఁ గమ్మలుం, గొఁబగుముక్కు మోము
సమకొన్న మెఱుంగుల కట్టదండయుం, గనుఁ
గనఁ గల్గు తేఁటి యొడికంబును.
శుక. ౩-౧౦౫.
కం. అజ్ఞానంబున హాసవశ, వజ్ఞఁ దలఁచి యతని
నొసలి వ్రాఁత ఫలమునన్, యజ్ఞము వే సెను
సురలయ, నుజ్ఞం బరవృష్టి కప్పనులు సమ
కొనునే. భీమ. ౨-౯.

౫. అనుకూల మగు.

చ. తమకము సాగి ముచ్చటకుఁ దార్చి నెపంబున
సోఁకి హస్తపం, గమమున కియ్యకొల్పి పుల
కంబులు మై బొదవించి వంచన, క్రమముల
నొయ్యఁ బయ్యెదయుఁ గంపమునుం దిలఁ
గించి పూన్కి కిన్, సమకొని సిగ్గువంతయును
జార్చి రయిదన్ సతిఁ గూర్చు నెన్నఁడో.
కవి. ౩-౫౪.

౬. రూపొందు, ఏర్పడు.

క. వాసుకి పితికడు వాఁడుగ భాసితఫణపాత్ర
గరళబహుదుగ్ధము లుల్లాసమునఁ గ్రోలి
తక్షకుడై సమకొనఁ గొనిరి దారుణాభ్యుత
భుజగుల్. హరి. పూర్వ. ౧-౧౪౦.

సమకొను, స. క్రి. వహించు, పూను.

ఉ. అట్టిన వింటివారి బిగియం దగిలించి విరోధి
మోముక్ బ్రేయవహించు కన్నుల నిరీక్షణ
మొప్పఁగఁ దెచ్చి వేటకాఁ డెత్తియుఁ బోలె
గవ్వచు సురేంద్రుని ముందటఁ బెట్టి వీఁడు
గో, గుణ్యుండొంగ చిక్కె సమకొన్నప్రతిజ్ఞ
ఫలించె నావుడున్. జై. భా. ౩-౧౧౪.

సమకొల్పు. స.క్రి. (√సమకొను) ౧. వహించు,
పొందు.

క. జగదే, కత్రాణపరాయణ విను, శత్రులు
భీతిల్ల నలుక సమకొల్పుమదిన్.
భా. రా. యుద్ధ. ౧౦.

క. దితినూనుఁ దునిమి మఱియును, దితిజకులము
పీఁచమడఁచు తేజమున మదిఁ బూని తీ చేని
మమ్మే వేలుంటు, సకలమును నమ్మె యెకిఁ గరుణ
సమకొలుపగదే. హరి. పూర్వ. ౪-౩౧.

క. జననీ యిట్లనుటను మజ్జనకు పలుకు మీఱఁ
గాను సమకొల్పు ధృతిన్ మనమున వగ
వకుము. భా. రా. అయో. ౯౬

౨. నెఱవేర్చు; పూర్తిచేయు.
ద్వి. సర్వకార్యంబులు సమకొల్పి వచ్చి యుర్వీశు
లవ్వీరు లాగిఁ గొల్చియుండ.
రం. రా. ఉ. కాం. ౧౯౨ పు. ౨౯ పం.

౩. సిద్ధముచేయు; కూర్చు.
వ. మఱియు నురుముఁ జిప్పనుగండెలు మొదలగు
మొదలగు మృగయాసాధనంబులు సమకొల్పు
ముదలయిదియు చంద్రాంగ. ౨-౯౪.

౪. కలిగించు.
సీ. వరసంబు నొందించి పల్లంబు కల్పించి నిగు
డంబు సమకొల్పి నెఱసు నెఱపి.
పా. శకు. ౧-౧౧౨.
౫. పూన్చు; పురికొల్పు.
ఉ. ఇల నెందొఁటలందుఁ జరియింపఁగ సౌధము
లెక్కఁ జిత్రపంక్తుల మృగరాజుఁ జూడ
సమకొల్పదు రాఁదఱకూర్చు నెయ్యపుం
జెలులకు పార్శ్వమాకన్నుపశేఖరు తమ్మనృపాల
చంద్రుతోఁ గలసమ మార్కొంగ రదఁగు
గర్వవిరోధు లదేమి చిత్రమో.
విప్ర. ౧-౫౧.

క. స్నేహార్ద్రహృదయులై యతి,సాహసకృత్యములు మాన సమకొల్పుటకై యూహాపోహ విచారస, మాహితగతిఁ దల్లి సుతుని మతి బోధించున్. కాశీ. ౪-౮౯.

సమకోటిక. సం. విణ. (అ. ఆ. అ) సరియైన పరిమాణము కలది.

సమకోలము. సం. వి. అ. పుం. పాము.

సమకోలు. వి. (సమకొను-టు) లభించుట, సిద్ధించుట (శర)

సమక్షము. సం. విణ. (అ. ఆ. అ) కన్నుల యెదుట నున్నది, ప్రత్యక్షమైనది.

సమక్షము. అవ్య. కన్నులయెదుట,ఎట్టయెదుట.

సమక్షము. వి. సన్నిధి.

వ. ధర్మరాజును జగదర్చితుండయిన....శాస్త్రమంత్రులయు సమక్షంబున....
భార. సభా. ౧-౭౩౫.

(ఇది సాధారణముగా సమక్షమునకు,సమక్షమున, సమక్షమునందు అను రూపములోఁ దనే వాడఁబడుచున్నది)

సమగతి. సం. వి. ఇ. పుం. వాయువు.

సమగంధకము. సం. వి. అ. పుం. ధూపము.

సమగంధికము. సం. వి. అ. న. వట్టివేరు.

సమగ్రగణి. సం.వి.ఈ. పుం. అందఱిలో మొదటివాఁడు.

సమగ్రము. సం. విణ. (అ. ఆ. అ) ౧. సకలము, సమస్తము. ౨. పూర్ణము, నిండినది.

క. రసకర్మజ్ఞుఁడు చారము, పసిండిసేఁతకుఁ బ్రయత్నపరుఁడై శుద్ధద్రవ్యసమగ్రము సేయు క్రియ,న్విమలక పఃశుద్ధిఁడీవునికిఁ జేయుటురున్
భార. శాంతి. ౫-౪౧౩.

వ ... విస్ఫారోల్లసత్పార్శ్వజా పాతించఁడపుకయుండుఁ బ్లుగ సమగ్రగాళ్ళర్య సంపాదకోద్ధత బాహావిభవంబుసూపె ....
భార. కల్యా. ౧-3౭౩.

సమచక్రవాలము. సం. వి. అ. న. వృత్తము.

సమచతురస్రము. సం. విణ. నాల్గువైపులు సమముగా నున్నది,చదరమైనది. వి. చతుష్కోణము.

సమాచతుర్భుజము. సం. వి. అ. న. అ. పుం నాల్గుకోణములు సమములు కాకుండియు నాల్గు భుజములు సమములైనది. (గోఁబన్)

సమచిత్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ) అన్నిటియందును సమానమైన మనస్సుగలవాఁడు ౨. ౨. తత్త్వజ్ఞానము కలవాఁడు

కం. సమచిత్త వృత్తులగు బుద్ధిమంతులకునిపుడు ద్రౌపదీప్రశ్నవిచారము సేయవలయు ....
భార. సభా. ౨-౨౩౬.

3. ఉదాసీనుఁడు.

సమచౌకము. (మి) విణ. సమమగు చదరము (పావు, వెడల్పు) గలది, చతురస్రము.

చ. మునివరులార తత్కుధరమూర్ధమునం బసునాల్గువేలయో,జనములఁ జూడ నొప్పు సమచౌకపుకొస్త్రము నిండి రత్నకాం,చనమయ తోరణావరణ సౌధవిలాసముచేతఁ జాల వర్ణనమున కెక్కు నొక్కనగరంబు మనోవతి నాఁగఁ దన్పురిన్. వరాహ. ౧౦-౧౧౨.

సమచ్ఛేద(న)ము. సం. విణ (అ. ఆ. అ) (గణిత) సమానమైన హారము గలది.

సమజము. సం. వి. అ. పుం. ౧. పశుపక్షిసమూహము. ౨. మూర్ఖులసమూహము,3.సమూహము.

సమజము.సం. వి. అ. న. వనము, అడవి.

సమజాతి. సం. విణ. (ఇ) మిశ్రితముకాని, ఒకే జాతికిఁ జెందినది.

**సమజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. కీర్తి, యశస్సు.

**సమజ్యా.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సభ. ౨. కీర్తి.

**సమత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సమత్వము, సమానత్వము.

ఉ. కావునలోకసంక్షయము గన్గొని యెల్లెడ నిర్మముండవై నీవును శాంతియున్ సమత నిష్ఠయు బూని .... భార. శాంతి. ౫-౩౮౮.

౨. కావ్యగుణములలో నొకటి 3. పోలిక.

**సమతిక్రమించు.** సం. స. క్రి. అతిక్రమించు' మీఱు.

చ. అట పని యాత్రమంబున హిమాచలమున్ సమతిక్రమించి వారు .... భార. మహా. 33.

**సమత్రిభుజము.** సం. వి. అ. (క్షేత్ర) మూఁడు భుజములు సమానముగా నుండు త్రిభుజము.

**సమదండ.** వి. మల్లవిద్యాసంబంధ మగు పదిరెండు దండలలో నొకటి.

వ. అవ్వీరుండు సమదండ గజదండ కుక్కుటపుదండ మొదలుగాఁగల పదిరెండు దండల పాండిత్యంబు దెలిపి. హంస. ౧-౨౦౩.

**సమదర్శనుఁడు.** సం. విణ. (అ.ఆ.అ) ౧. అందఱను సమముగాఁ జూచువాఁడు. ౨. పక్షపాతము లేనివాఁడు.

**సమదర్శి.** సం. విణ. (న్. నీ. న్) అన్నివస్తువులను బ్రహ్మభావముతోఁ జూచువాఁడు,

శ్లో. శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః. సమదర్శనుఁడు.

**సమదుఃఖుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ఇతరులయెడ సానుభూతిని జూపువాఁడు, ౨. పరులతోపాటు దుఃఖించువాఁడు.

**సమదృష్టి.** సం. విణ. (ఇ) సమదర్శి.

**సమదృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. అన్నివిషయములందును సమానమైనభావము.

**సమధర్మము.** సం. విణ. (న్) ౧. సమానమైన స్వభావముకలది, ౨. పోలియున్నది.

**సమధికము.** సం. విణ. (అ. ఆ. అ) మిక్కిలి యెక్కువైనది, అత్యధిక మైనది.

మాలిని. సమధికనిరవద్య ప్రైరనిత్యప్రభుత్వా. భార. శాంతి. ౨-౪౪౯.

**సమధిగమము.** సం. వి. అ. పుం. సమగ్రముగా తెలియుట.

గీ. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద సమధిగమము సత్యంబుతో సరియుఁగాన.... భార. ఆది. ౪-౯౬.

**సమధిగమనము.** సం. వి. అ. న. ౧. అతిశయించుట. ౨. ఓడించుట.

**సమధృతము.** సం. విణ. (అ. ఆ. అ) సమానమైనది.

**సమధ్వుఁడు.** సం. వి. అ. పుం. జతగాఁ బయనించువాఁడు.

**సమనంతరము.** సం. విణ. పిమ్మట.

క. ఫలాహారంబు లొసఁగి క్షుత్పరిహారం బొనరించి యలఁతి యంతియుఁ దీర్చెన్. ||క|| సమనంతరంబ మీ కీ, క్రమమున బెట్టలయ నేల ఘర్మాంతి, పరిభ్రమణమున నింత పుట్టెను విమతుల వధియింపఁ గడఁగి వెనుతగిలిరొకో. ద్వా. ౧౧-౧౨.

**సమనీకము.** సం. వి. అ. న. యుద్ధము.

**సమనీకమూర్ధము.** సం. వి. అ. పుం. అనిమొన.

**సమన్యుఁడు.** సం. విణ. ౧. కోపముతోఁ గూడినవాఁడు. ౨. దుఃఖముతోఁ గూడినవాఁడు.

**సమన్యుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సమన్వయము.** సం. వి. అ. పుం. ౧. క్రమము. ౨. పరస్పరసంబంధము. 3. సంయోగము.

**సమన్వితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. సంబంధము కలది. ౨. కూడినది.

గీ. వ్రతసమన్వితి భాసురవర్యుఁడొండె....

భార. శాంతి. ౧-౧౯.

3. క్రమముతోఁ గూడినది. ౪. నిండియున్నది

**సమపదము.** సం.వి. అ. న. ౧. యుద్ధమున విలుకాండ్రు నిలుచు నిలుకడలలో నొకటి, రెండు కాళ్లును సరిగా నిలిపి నిలుచుండుట. ౨. సురతమందలి బంధవిశేషము.

**సమబుద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. భేదభావము లేమి, పక్షపాతము లేమి.

కం. సమబుద్ధితోడఁ దత్తత్సముచితకర్మఫల మఖిలజంతుతతులకున్. భార. అరణ్య. ౭-౨3౦.

**సమభిద్రుతము.** సం.విశే. (అ.ఆ.అ) ౧.మీఁది కురుకఁబడినది. ౨. ముట్టడింపఁబడినది.

**సమభిధ.** సం. వి. ఆ. స్త్రీ. పేరు.

**సమభిప్లుతము.** సం.విశే. (అ.ఆ.అ) ౧. ముంచఁబడినది. ౨. తగ్గింపఁబడినది. 3. పారలి పోవునది. ౪.క్రమ్మఁబడినది. ౫. గ్రస్తము.

**సమభివ్యాహారము.** సం.వి.అ. పుం.౧. కలిపి చెప్పుట. ౨. సంఘము. 3. సుబోధమైన అర్థము గలపదములతోడి సంబంధము.

**సమభివ్యాహృతము.** సం. విశే (అ. ఆ. అ) ౧. కలిపి పలుకఁబడినది. ౨. కలిసియున్నది; కూడియున్నది.

**సమభిసరణము.** సం. వి. అ. న. ౧. సమీపించుట. ౨. వెదకుట, వెంబడించుట. 3. కోరుట.

**సమభిహారము.** సం.వి.అ. పుం. ౧. పునరుక్తి, ౨. కలిపి గ్రహించుట. 3. ఆధిక్యము.

**సమభ్యర్చనము.** సం.వి.అ.న. ౧. పూజించుట ౨. గౌరవించుట.

**సమభ్యాహారము.** సం.వి. అ. పుం. ౧. అనుసరించుట. ౨. కూడియుండుట.

**సమము.** సం. వి. అ. తుల్యమైనది, సరియైనది.

క. శ్రుతి మెఱుఁగుట పుణ్యము స్మృతి దానికి సమము సేఁత మధ్యము మతిఁ.

భార. ఆది. ౬-౨౪౧.

గీ. హరజటాజూట చంద్రరేఖామృతంబు సకలసీదగు దంతచ్ఛదామృతంబు సమముగా రెండు జిహ్వాలఁజవులుసూచి చేర్పుఁబోఁ వీఁడు చవిచీసినిశ్చయింప. శృం. నై. ౫-౨౭.

**సమయక్రియ.** సం.వి.ఆ.స్త్రీ. ఒప్పందము చేసికొనుట.

**సమయభేదము.** సం. వి. అ. పుం. ప్రతిజ్ఞాభంగము, ఒడంబడికను జెఱచుట.

**సమయము.** సం. వి. అ. పుం. ౧. కాలము

గీ. ఆత్మమూర్తులయందు దివావసాన సమయలక్ష్మీవిలాసంబు సంఘటిల్ల.

రాధమా. ౪-౭౮.

౨.శపథము,ఒట్టు. 3.ఆచారము. ౪.సిద్ధాంతము. ౫. అంగీకారము, ఒప్పుదల. ౬. భాగ్యము, సంపద. ౭. సంకేతము. ౮. నిర్దేశము. ౯. ఆజ్ఞ ౧౦. బుద్ధి. ౧౧. భాష. ౧౨. నియమము.

సీ. సమయ మెయ్యదియేనిఁ దమకును నీకుఁగల్గెఁ యట్టులైనను గిరియరచుట.

భార. విరా. ౨-౧౪౮.

దానవిధులఁ జేసి వానివలనఁ గ్రమముపడసి యొక్కసమయంబు సేసిరి.

భార. ఆది. ౬-౨౬౪.

౧౩. శాస్త్రము. ౧౪. ఈ శబ్దమున కిదియర్థమనెడి కట్టుబాటు, ఏర్పాటు. ౧౫. హద్దు, మర్యాద. ౧౬. సూచన, సైగ. ౧౭. ప్రతిజ్ఞ.

తే. వాలి యజ్ఞాతవాససంవత్సరంబు, నిండకుండంగ మున్న పార్థుండుబయలు, మెఱసి సమయంబుఁ దప్పె. భార. విరా. ౫-౩౬౮.

౧౮. తఱి, యుక్తకాలము.

సీ .... బలికి నే వచ్చుటఁ దెల్పుఁ డనుచు, నవరంబులవారి ననుసరింపఁగ వారు సమయంబుగా దని జాగుసేయ. దశా. ౨౯౪.

తే. గీ. ఐన సమయంబు గా దని యంటిరేని, కన్ను లర్కేందులును వాళిఁ గమలభవుఁడు, కయ్యరైయె కేషుఁ డుండంగ కొఁ గొల్వ మాకు సమయంబు గాదె ధీమహీశులార.

దశా. ౩-౧౩౪.

సమయగూడు. అ. క్రి. కలయు, ఏకీభవించు.

క. తమలోన నొంటకుండిన, సమసంధవు లైన వారు శత్రులయెడలన్ సమయము గూడుదు రెడిరికిఁ దమకు ట్టిన్నట శుభపదముగా దగుటన్. ప్రబోధచం. ౪-౬౩.

సమయవ్యభిచారము. సం.వి.అ. పుం. ప్రతిన తప్పుట, నియమోల్లంఘనము.

సమయాచారము. సం. వి. అ. పుం. పరంపరాగతమైన విధానము, రూఢమైన యలవాటు.

సమయాధ్యుషితము. సం.వి.అ.న. సూర్యుఁడు, గాని నక్షత్రములు గాని కనఁబడని కాలము, రాత్రిందివముల సంధికాలము.

సమయానువర్తి. సం. విశే. (క. సీ. న) ౧.పూర్వాచారముల ననుసరించి వర్తించువాఁడు. ౨.కాలానుగుణముగ నడచుకొనువాఁడు. ౩. ప్రతిజ్ఞ ననుసరించి నడచుకొనువాఁడు.

సమయించు. స. క్రి. (√ సమయము) చంపు.

చ. కేఁ డెనిమిదినాళు లయ్యె సమయింపవు కొంపవు సవ్యసాచి నన్నని యటు లుండ నిమ్ము. భార. భీష్మ. ౩-౧౪౧.

క. హిమకరుఁడు గురియు మంచున, భ్రమసి ముదుఁగుదైత్యకోటిఁ బాణాభిహతిన్ సమయించె వరుణుఁడు. హరి.పూర్వ. ౪-౧౭౪.

ఉ. ఏ ననుమాన మేను సమయించెద వైరము నేఁటితోడ. భార. శల్య. ౨-౩౫.

క. వసుధామరేంద్ర దానవు నసమున సమయింప్ర దేని యంతియు చాలున్. శుక్సం. ౫-౧౮.

సీ. ఆ. ధర్మ నూనుఁ గయ్యఁబుఁ జంపినఁ గోపించి గాండీవి కురుబలంబు, సమయించుమన మోపి సర్వపాండవులను జంపితి నేని. భార. ద్రోణ. ౧-౧౧౧.

తే. గీ. చెలువ యింక నొకించుక సేపు నీ వకాదరంబున నెప్పటియట్ల యున్న, మన్మథుఁడు సమయించిన మగుడ నన్నుఁ, బదయవచ్చునె యెన్ని యుపాయములను. భార. విరా. ౨-౪౭.

సీ. తంద్రి వధించి యెంతయు నల్కమై వీసినింకిట నేల సమయించువాఁడ. భార. ఉద్యో. ౩-౨౯౧.

వ. ఇవ్విధంబున నూటయేవు రుపకీచకులను సమయించి. భార. విరా. ౩-౨౯.

సమయు. (సం. శమ్. త. సమై. క. సమయ్.)

అ. క్రి. ౧. చచ్చు.

ఆ. కడఁగి నడచి మాఱుఁ గావింప నయ్యరా, వంశు నశ్వసేను యంతసేన, పుట్టి వాఁడిమీఁదఁ బుకికొని తలపడి, సమయఁజేసె నదియు సమసె నధిప. భార. భీష్మ. ౩-౧౧౧.

సీ. అనిమిషాసురయుద్ధమున ననురావలి సమయించి వర్ణాశ్రమముల కేర్పఱిచి. భార. శాం. ౧-౨౩౪.

క. ఈ గర్భము రక్షించిన, నా గౌరవ మేమిఁ జెడక నారాయణ నా,నాగుణసంపన్నులలో, సాగదు నటు గాకయున్న సమయుదు నగలన్ ఉ. హరి. ౨-౧౪.

వ. పడగ లవిసి సమసినఁ దద్గ్రజాగ్రస్మణులు భణిభూషణున కద్దురవస్థ నుయునక్ బరువు లిడుచు నున్నవడువున దవ్వుల మిడిసిపడ.
ఉ. రా. ౩.౪౭.

౨. చెడు, రూపఱు.

వ. ఇట్లిరువురు నొకవడి వృక్షయుద్ధంబు సేసి యాసన్నమహీరుహంబులు సమసిన మల్ల యుద్ధసన్నద్ధులై. భార. ఆది. ౬-౨౪౫.

సీ. వాన లేని కతాన వాడివస్తులవలె సకల సస్యంబులు సమసిపోయె.
వరాహ. ౪-౫౨.

౩. క్షీణించు, తగ్గు.

చం. సమసెను కౌరవేశ్వరుని సంపద.
భార. ద్రో. ౧-౨౭.

సీ. జనమారితాప్రాప్త జారచోరవ్రాత తాపం బులకు గొంత సమసివాఁడొ లే. అనఁగ దోషాకరుండు కళానుభూతి, దొరయ-
బిల్హ. ౩.౧౭౪.

౪. వ్యయమగు, చెల్లిపోవు.

ద్వి. ధనమెల్లఁ జందనంబునకు సమయును.
బస. పురా. ౧౦౭. పు. ౨౦ పం.

౫. అడఁగు, తగ్గు.

ద్వి. సుపగక వక్రకామునిఁ ద్రోసి చంపె. చంప యంతటఁబోకసమయుని కినుకఁ, దెంపు సొంపును బెంపు సొంపు దీపింప.
రం. రా. సుం. కాం. ౨౬౨. పు. ౭ పం.

౬. వట్టు, ఇంకు.

క. పురవీధుల గనుఁగొన నుందరమగు ఘట యోని సమయఁద్రాగినరత్నాకరములొకో వివిధరత్నా, కరములు నావరమణి ప్రకర భరితములై —
కుమా. సం. ౪-౯౫౦

౭. అస్తమించు, అగుపడకపోవు.

చ. తారకంబులు సమసెన్ మనోభవుఁడు పువ్వ ధనుర్గుణ మెక్కుడించె. పె. కపం. ౨-౨౦౯

౮. పాయు, తొలఁగు.

సీ. అర్కోదయంబుచే నంధకారము వాయునట్లు మక్కలుమచయంబు సరగ, మిమాఁజాది నప్పుడసమసె నిఁకేమి ధన్యుఁడనైతి నారిప్పు లెదఁద నిదక, పుత్రుల నొసఁగి సంపూర్ణ సంతోషాత్ముఁ జేయుము.
వేంకటాచలమా. ౨-౯౧.

ఆ. వె. ఆంజనేయ సచ్చిదానంద మయునిగా, నన్నుఁగాచు తెలుఁగు విన్నవింతు నమలమనము చేత నవధరింపుము నీవు, సకల సంశయములు సమసిపోవు.
సీతారా. ౨-౧౫౨.

పి. తిమిరంబుచే పొంపు సమసిన దిశలకువన్నియ నొసఁగు సౌవర్ణకరణి.
పారి. ౪-౪౯.

౯. ఆఱు, మఱుగు.

ఆ. వె. చమురు గలుగు దివ్వె సరవితో నుండును. చమురు లేని దివ్వె సమసిపోవు, తనువు తీరు లేని తలఁపు నశించుతో దవెతిఱు. వేమ. ౧-౪౫.

ఆ. వె. చమురు గలుగుదివ్వె సరవితో నుండును, చమురులేనిదివ్వె సమసిపోవు, తనువు తీరలేని తలఁపుతో దసె, తీరు, విశ్వదాభిరామ వినుర వేమ.
వేమ. ౧. భా. ౪౫.

గీ. విలస దనురాగమునఁ దన్నుఁగొలుచునట్టి, యంశువుల పాపములనెల్ల సమయఁజేయుఁబటు తిగాజ్ఞాన తరుఖండ పరశుధారరంగదుత్తుంగ పుణ్యతిరంగ గంగ.
జాహ్నవి. ౧-౨౩.

గీ. జగములన్నియు నొక్కట సమయవకట.
వాసిష్ఠ. ౫-౭౬.

సమరత. = సమర్త. (సం. సమర్థ తి. సమర్తి.) వయసువచ్చిన కన్య.

క. ఆ, పువ్వంబోఁడికి బాల్యము, జవ్వాడి తొలంగు నంత సమరత పొడమెన్.
కుక. ౧-౩౬౩

సమరథుఁడు. సం. వి. అ. పుం. ఒకవిలుకానితో సరిగానిలిచి యుద్ధముచేయు యోధుఁడు.

**సమరము.** సం.వి. అ. పుం. న. యుద్ధము, పోరు

**సమరమూర్థము.** సం.వి.హ్.న. ౧. అనిమొన. ౨. సంగ్రామాంగణము.

**సమరశిరము.** సం. వి. హ్ న. సమరమూర్థము

**సమరసము.** సం. విశే. (అ. ఆ. అ) సమానమైన యనురాగము గలది.

**సమరసము.** సం. వి. అ. పుం. సమానమైన యనురాగము. ౨. అభేదము, పేటుకామి.

**సమరించు.** స. క్రి. (తె. చమరు) సంహరించు.

సీ. గాఢబాహుకుఁ దురంగముతో, సమరించెఁ
గాశభర్తృవ్రణంబు గాఁ బెగల్చె. మత్స్యే
వల్లభుఁ బట్టి మర్దించి మిట్టిపాటం గేకుఁదను
బలాఢ్యత్తుఁ జేసె. రాజవాహన ౨-౪౫.

**సమరోద్దేశము.** సం.వి. అ. పుం. యుద్ధభూమి

**సమర్చనము.** సం. వి. అ. న. ౧. పూజించుట, ౨. గౌరవించుట.

**సమర్చించు.** సం. స. క్రి. పూజించు.

మ. అనుమానింపకు రమ్మునే ననఘునీకాయుఁబ్రప
దుండై తన, ర్చిన దేవుండ నిరంతరంబును
సమర్చింపంగ నర్హుండ....
హరివం. ఉ. ౯-౧౦౨.

**సమర్ణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ౧. మిక్కిలి పీడింపఁబడినవాఁడు; నొప్పింపఁబడినవాఁడు. ౨. ప్రార్థింపఁబడినవాఁడు, వేఁడుకొనఁబడినవాఁడు.

**సమర్త.** వి. (సం.సమర్థా.శ.సమర్తి) ౧. యౌవనము. (చూ.సమరత) ౨. స్త్రీ. ప్రథమఋతువు.

ఎ. గీ చిఱుతప్రాయంపు నాఁటి సజ్జీకపుచాయ,
తొలుసమర్తయ కాలంపుదిలసనమువఁదరుణు
లకు ..అమరు, మసరభేత్తను నీమంచు సోఁకి
నపుడు. క్రీడా. ౧-౮౦.

సీ. మాచకమ్మ సమర్త మఖపుణ్యహస్తచి త్తైన
నేమి పునర్వసైననేమి. శేను. ౨౩.

తే. తొలిసమర్తైన ముద్దుకోమలి వితాన
మల్లపురా. ౧-౭౩.

**సమర్తగు.** సమర్త+అగు. వి.క్రి. ఋతిమతియగు ప్రథమరజస్వలయగు

**సమర్తవెట్టు.** = సమర్తాడు.

ఎ. గీ. అంగన సమర్తవెట్టిన యపుడె నవ్వు,
గుస్తరింపని విటులేరి కేస్తమునకు
బహు ౫౭౭ పు.

మొన్న సమర్తవెట్టినని మాద్రియ దచ్చిన
నుబ్బె నయ్యెడన్. (చూ. (దబ్బు)

**సమర్తాడు.** అ.క్రి. ప్రథమ రజస్వలయగు.

సీ వేఁడు నాసతి సమర్తాడిన వేళయుఁ గొనకన్నను
గ్రూరమదివచింప, నోరు నాదను.
ఉత్తర హరివం. ౨-౩౩

**సమర్థకము.** సం. వి. అ. న. మసాంబరమూ, అగరు.

**సమర్థకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ఇష్టమైన ఫలముల నొసఁగువాఁడు (దేవుఁడు మొ)

**సమర్థన (ము).** సం.వి.అ. స్త్రీ. న. ౧. ఇదియే యుక్తమని నిశ్చయించుట. యుక్తాయుక్తములందిది యుక్తమని సమర్థించుట, వాదించుట, ౨. స్థాపించుట, ౩. చర్చించుట. ౪. సామర్థ్యము ౫. వ్యతిరేకించుట ౬. పొందుపఱచుట.

ఉ.... ఇ, ష్టార్థ సమర్థన క్షమములై తమమున్
వినయించుఁ బాతకా, నర్థము పొందరేకమును
నర్థము .... పాండు. ౩-౧౨౩

**సమర్థము.** సం. విశే. (అ. ఆ. అ) 1. శక్తి కలది; బలముకలది.

కం. సమయ....నితాంతో, త్తమ పరశమార్గదర్శన
సమర్థ పుణ్యాభిధాన సత్ప్రవృత్తరణా.
భార. ఉద్యో. ౪-౪౨౪

౨. హితమైనది. ౩. తగినది; అర్థమైనది. ౪. (వ్యాక.) సంగతమైన యర్థము గలది. (సమాసాది.) ౫. నేర్పు గలది; నిపుణమైనది.

**సమర్థించు.** సం. స. క్రి. ౧. తలఁచు; విశ్వసించు.

క. వినుము యుధిష్ఠిరు సైరణ, మన వారలు వెఱపుగా సమర్థింతురు. భార. ఉద్యో. ౨-౧౨

౨. స్థిరపఱుచు; బలపఱుచు; ఋజువుపఱుచు. ౩. ఆలోచించు; చర్చించు. ౪. సిద్ధముచేయు. ౫. సిద్ధాంతీకరించు; ధ్రువపఱుచు.

వ. వేదమర్మభేదంబునఁ గదా బోధసత్త్వంబు సత్త్వహేతువుగా జగం బస్థిరం బని సమర్థించె.... నైష. ౭-౬౪.

౬. సూచించు; వ్యంజించు. ౭. నిరూపించు.

**సమర్థితము.** సం. విణ. ౧. స్థిరపఱుపఁబడినది. ౨. భావింపఁబడినది. ౩. నిశ్చయింపఁబడినది.

**సమర్థుఁడు.** సం. వి. అ. పుం. ౧. గట్టివాఁడు. ౨. నేర్పరి. ౩. యోగ్యుఁడు.

**సమర్పణము.** సం. వి. అ. న. ౧. ఇచ్చుట.

వ. అని సమర్పణము సేసిన నమ్మహీసురోత్తముండు నా సక్తు వుపయోగించె. భార. అశ్వ. ౪-౨౨౪

వ. ఫలంబులు పరిమళంబుగా నుపహారంబు లిందురేఖా కిరీటునకు సమర్పణంబు గావించిన శివధర్మ. ౩-౨౧.

౨. అర్పించుట. ౩. అందఁజేయుట. ౪. నియోగించుట.

**సమర్పించు.** స. క్రి. ౧. (పూజ్యభావముతో) ఇచ్చు; ఒసఁగు.

తే. ఒడలు సిరియును నాకు నీ యొసఁగినవియ, కాఁగ దగ సమర్పించెదఁ గరుణ నీవు, నమ్మతించి యి మ్మత్స్యదేశంబుఁ గావు. భార. విరా. ౩-౩౨౨.

క. మతి నా, మూను సమర్పించితి మ, తూర్పున వధింపంగ రక్కసునకు వశంబే. భార. ఆది. ౬-౨౮౩

౨. ప్రతిష్ఠించు.

వ. ధర్మరాజుఁ బాండురాజు రాజ్యంబునందు సమర్పించిన. భార. సభా. ౨-౨౬౭.

౩. నియోగించు.

వ. పాండవుల నిందులకుఁ దోడ్కొని వచ్చువారుగా దుర్యోధన వికర్ణ ప్రముఖుల సమర్పింపు మనిన ద్రోణు వచనంబులు.... భార. ఆది. ౮-౩౮

**సమర్పితము.** సం. విణ. ౧. ఉంచఁబడినది. ౨. నిలుపఁబడినది. ౩. అర్పింపఁబడినది. ౪. నియమింపఁబడినది. ౫. పునఃప్రతిష్ఠింపఁబడినది.

సీ. కారకైశ్వర్యంబు గౌరవంబున సమర్పితమయ్యె నీయందు చెల్మితోడ. భార. సభా. ౨-౧౦౨.

**సమర్యాదము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. సమీపమైనది, చేరువైనది. ౨. హద్దుతోఁ గూడినది; హద్దు గలది. ౩. గౌరవము గలది.

**సమర్యాదము.** సం. వి. అ. పుం. సామీప్యము, దాపు.

**సమలము.** సం. విణ. ౧. మలినముతోఁ గూడినది. ౨. అపరిశుద్ధమైనది. ౩. దోషముతోఁ గూడినది.

**సమలము.** సం. వి. అ. న. విరేచనము, మలము.

**సమవకారము.** సం. వి. అ. పుం. రూపకభేదము. (దేవాసురాశ్రయమైన ప్రఖ్యాతవృత్తము, విమర్శసంధి తప్ప తక్కిన నాలుగు సంధులు గలిగిన మూఁడంకముల రూపకము) సా. ద.

**సమవతారము.** సం. వి. అ. పుం. ౧. దిగుట, నదిమున్నగు వానియందు స్నానార్థము దిగుట.

**సమవధానము.** సం. వి. అ. న. ౧. అతిశయమైన శ్రద్ధ. ౨. సంసిద్ధత. ౩. సన్నాహము.

**సమవర్తి.** సం. వి. న. పుం. యముఁడు.

గీ. సురుభయంకర కింకరకోట్లు గొలువ మూర్తి దీపింప నలసమవర్తి నిలుచు. శివధర్మ. ౪-౫౧.

కం. సమబుద్ధిలోఁ దత్తత్సముచితకర్మఫల మ మఖిలజంతుతతులకున్ సమకూర్పుట; నీ క య్యమను సమవర్తియనంగఁ జేరు జగద ధిపతి మై. భార. అరణ్య. ౬-౨౩౦.

**సమవర్తి.** సం. విశే. (న. నీ. న) అంతటను సమముగా వర్తించువాఁడు.

**సమవస్థ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నిశ్చలమైనస్థితి. ౨. తుల్యస్థితి. ౩. ఉనికి.

**సమవస్థితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. స్థిరముగా నిలుపఁబడినది. ౨. నిశ్చల మైనది. ౩. సంసిద్ధ మైనది.

**సమవాకారము.** సం. వి. అ. పుం. పదివిధము లగు రూపకములలో నొక భేదము. (చూ. సమవకారము)

**సమవాప్తి.** సం. వి ఇ. స్త్రీ. ౧. ప్రాప్తి, లబ్ధి, సిద్ధి.

**సమవాయము.** సం. వి. అ. పుం. ౧. సమూహము, గుంపు. ౨. (తర్క) నిత్యద్రవ్యములు మున్నగువానియందు జాత్యాదుల సంబంధము, అవినాభావసంబంధము.

**సమవాయి.** సం. విశే. (న. నీ. న) (తర్క) సమవాయ సంబంధము గలది, అవినాభావసంబంధము గలది.

**సమవేతము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. కూడినది. ౨. సమూహము గానున్నది.

సీ. సమవేతగౌరవక్ష్మాధర పరిభార పటుదైన్య సస్యసంపాతవృష్టి (యాచన) శివధర్మ. ౫-౯౩.

౩. (తర్క) సమవాయ సంబంధము గలది

**సమశనీయము.** సం. వి. అ. పుం. వివాహానంతరము దంపతులు చక్కఁగ భుజించుట కేర్పఱిచిన స్థాలీపాకము.

**సమష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సమస్తము, నిఖిలము, మొత్తము. ౨. చక్కఁగా వ్యాపించుట.

**సమష్ఠి (ష్ఠీ) ల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఏఱువంగ ౨. తురుజ ౩. ఒకజాతి కూరాకు మొక్క

**సమసకము.** వి. శుద్ధాంధ్రపదముల సమాసము. (శ. ర)

**సమసనము.** సం. వి. అ. న. ౧. కలయిక. కూడిక. ౨. సంక్షేపము, సంగ్రహము, ౩. సమాసము.

తే॥ ఒక్క సమసనముఁ శబ్దయుగముగూడి పదము లేర్పాటు గాఁ గానఁబడని...
అప్పక. ౩-౧౩౫.

**సమసీసము.** వి. మల్లబంధవిశేషము.

వ. సీసంబు, సమసీసంబు, గొంతమూరును.
మల్ల పురా. ౩-౭౯.

వ. సంమసీసంబును గొంతిమూరును సమ సీసమ్మును. ప్రబం. ౧-౭౮.

౨. సీసపద్య భేదము:- ఆఱింద్రగణములపై రెండు సూర్యగణములు గల పాదములు నాల్గు చెప్పి యామీఁద నొక యాటవెలఁదిగాని తేటగీతిగాని చేర్చినచో సమసీస మేర్పడును.

**సమస్తము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. సర్వము, నిఖిలము, అంతయు.

శా. ఈ, యాదేశం బని నేల చూచితి సమస్తావకాశంబులన్. మను. ౧-౭౧

౨. సంక్షిప్తము, సంగ్రహింపఁబడినది, ౩. అంతటను వ్యాపించునది. ౪. (వ్యాక) సమసించినది, సమాసముగాఁ జేయఁబడినది. (వ్యస్తము. వ్యతి. వ్యస్తము) ౫. కలుపఁబడినది.

**సమామ్నాయము.** సం. వి. అ. పుం. పశువులు మున్నగువాని యన్నిటినుండి గృహస్థునకు వచ్చు రాబడి. ద. శా. ౪-౧౨౬౮.

**సమస్య.** సం. వి. ఆ. స్త్రీ. కవుల సామర్థ్యమును పరీక్షించుటకై పూరింప నిచ్చెడు పద్యపాదాదికము.

**సమాంతగము.** సం. విశే. (అ. ఆ. అ) సమానమైన (ఎడము) గలది.

**సమాంశము.** సం. వి. అ. పుం. సమాన భాగము.

**సమాంశము.** సం. విశే. (అ. ఆ. అ) సమానమైన భాగములు గలది.

**సమాంశహారి.** సం. వి. న్. పుం. సమానభాగము పుచ్చుకొనెడిదాయాదుఁడు.

**సమాంసమీన.** సం. వి. ఆ. స్త్రీ. ప్రతివత్సరమును దూడను బెట్టెడి యావు.

**సమాకంపించు.** సం. అ. క్రి. మిక్కిలి వణఁకు, వణఁకు.

మ. కలహాక్షోణియు శాకసంబు దిశలున్ గాండ్రప్రకారంబులం గలయం గప్పి యదల్చి యార్చిరి సమాకంపింప భూతావళుల్. హర. ౪-౧౬౧.

**సమాకర్షి.** సం. విశే. (న్. ఈ. న్) ౧. చక్కఁగా నాకర్షించునది, బాగుగా లాగునది ౨. సువాసనను వ్యాపింపఁజేయునది, పరిమళమును వెదచల్లునది. ౩. దూరముగా వ్యాపించునది.

**సమాకర్షి.** సం. వి. న్. పుం. దూరముగా వ్యాపించుసుగంధము.

**సమాకర్షించు.** సం. స. క్రి. ఆకర్షణముచేయు; లాగు.

శా. సాంకేతికస్థానముల్, కందర్పుం డను మంత్రదేవత సమాకర్షింపఁగా నయ్యెడన్. అనిరుద్ధ. ౩ ౧౪.

**సమాకులము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. నిండినది. ౨. క్రందైనది. ౩. కలవరపడినది. ౪. కలఁతపడినది.

**సమాక్రమణము.** సం. వి. అ. న. ౧. నడచుట, త్రొక్కుట. ౨. దండెత్తుట. ౩. స్వాధీనపఱుచుకొనుట, వశపఱుచుకొనుట.

**సమాక్రమించు.** సం. స. క్రి. ఆక్రమించు, క్రమ్ము.

శా. గోదాంతంబు సమాక్రమించి గురుచిద్రూపంబు నీవై బహుప్రాదుర్భావము నొంది యుండుదువు కుంభత్వాప్రిభవస్ఫూర్తి నై. భా. రా. యు. ౨౩౭౦.

**సమాక్రాంతము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. చక్కఁగా నాక్రమింపఁబడినది. ౨. గడువఁబడినది. ౩. స్వాధీనము చేసికొనఁబడినది. ౪. చుట్టుముట్టఁబడినది.

**సమాఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. యశస్సు, కీర్తి.

ఉ. ఈ యవనీశ్వర ప్రవరు లిందఱు నిన్ను నగంగ నిట్లుగాఁ జేయుట ధర్మరాజను విశేష సమాఖ్య నిరర్థకంబుగా. భార. సభా. ౨-౧౫.

౨. పేరు, నామధేయము. ౩. యోగముచేత నర్థమును దెల్పుట ౪. బందుకట్టు, జాతికట్టుఁ బాటు (శ. ర)

**సమాఖ్యాతము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. గణింపఁబడినది, లెక్కింపఁబడినది. ౨. ప్రకటింపఁబడినది. చాటింపఁబడినది. ౩. ప్రసిద్ధికెక్కినది, ప్రఖ్యాతి చెందినది.

**సమాగతము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. కలసికొన్నది. ౨. వచ్చినది. ౩. పొందియున్నది. ౪. సమీపించినది. దగ్గఱకు వచ్చినది.

**సమాగతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. కలయిక ౨. రాక, వచ్చుట, చేరుట దగ్గఱకు వచ్చుట; ౩. యథాస్థితి, సమానస్థితి.

**సమాగమము.** సం. వి. అ. పుం. ౧. కలయిక కూడుట.

గీ. ఎట్టికార్యము గలిగిన బుధకమతీసమాగమము
దప్ప నీకున్న దాము చెప్పు.
భార. అను. ౪-౧౨౬.

౨. సహవాసము. ౩. రాక, వచ్చుట, దగ్గఱకు వచ్చుట.

చ.... సముదీర్ణ వసంత సమాగమంబులం, దుదిద
యనుగ్రహింపుము ఘృతోదధి తీరవనీవిహార
ముల్. శృం నై. ౫-౫౯.

౪. (జ్యోతి) గ్రహములసంయోగము.

**సమాఘాతము.** సం.వి.అ. పుం. ౧. యుద్ధము. ౨. పెద్దదెబ్బ. ౩. వధము.

**సమాచరణము.** సం. వి. అ. న. చక్కగా నాచరించుట.

సీ. ఆ. ఏకాగ్రత గలుగు పెట్లు, మాకు నియమ
విధసమాచరణములపై. భార. ఆశ్రమ. ౨-౧౪.

**సమాచరించు.** సం.స.క్రి. చక్కఁగాఁ గావించు, కావించు.

వ. అని స్నానంబు సమాచరించి, హోమంబు
యథాపూర్వంబుగాఁ బ్రవర్తించి.
భా. రా. యు. ౧౫౭౬.

**సమాచారము.** సం.వి. అ.పుం. ౧. నడచుట, ముందుకు సాగిపోవుట. ౨. సమాన మైన నడవడి ౩. తగిన యభ్యాసము. ౪. వృత్తాంతము, వార్త.

**సమాజము.** సం.వి. అ. పుం. ౧. మనుష్యాదుల సమూహము, సమూహము, గుంపు

కం. రాజమహేంద్ర కవీంద్ర సమాజ సురక్షా!
భార. ఆది. ౨-౨౩౯.

౨. సభ ౩. ఏనుఁగు.

**సమాజికుఁడు.** సం. వి. అ. పుం. (చూ. సామాజికుఁడు)

౧. సభ్యుఁడు ౨. ...కుఁడు

**సమాఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. కీర్తి, ఖ్యాతి.

**సమాదానము.** సం. వి. అ. న. ౧. చక్కఁగా గ్రహించుట. ౨. బౌద్ధులనిత్యకృత్యము.

**సమాదేశము.** సం. వి. అ. పుం. ౧. ఆజ్ఞ, శాసనము. ౨. నిర్దేశము, శిక్షణము.

**సమాధానము.** సం.వి.అ.న. ౧. అంగీకారము, ఒప్పుదల. ౨. ఉత్తరము, ఆక్షేపమును దొలఁగించుట, ౩. కలుపుట, కూర్చుట. ౪. నిశ్చల ధ్యానము, సమాధి. ౫. నిశ్చలత.

వ .... ఇమ్మహనీయేతిహాసంబు సమాధానమాన
సుండవై యాకర్ణించి నీవును బహుళపుణ్యా
న్వితుండవుఁగృతార్థుండవుఁ బరమార్థవిదుండవు
నైతివి. భార. స్వర్గా. ౭౫.

క. భూనాథ! విప్రులు సమాధానంబున నున్నఁ
బొదలు ధరణికి శుభముల్.
భార. అను. ౨-౧౪౦.

౬. శాంతి, సుఖము.

ఉ .... వినమాధరణుల్ కవన్ సమాధాన
సమేతులై .... భార. ఉద్యో. ౩-౧౭౬.

**సమాధి.** సం.వి.ఇ. పుం. ౧. నిరంతరధ్యానము. ధ్యేయమునం దేకాగ్రముగ మనస్సు నిలుపుట మనోలయము. ౨. మౌనము. ౩. ప్రతీకారము, ప్రతిక్రియ ౪ నియమము ౫. ఇంద్రియనిగ్రహము ౬. తపస్సు. ౭. సంయోగము, కూడిక. ౮. ఒద్దిక. అనుకూల్యము. ౯. అంగీకారము. ౧౦. ముగింపు, సమాప్తి. ౧౧. అభినివేశము, ౧౨. పట్టుదల ౧౨. (కఱవుకాలమున) ధాన్యాదులను నిలువ చేయుట. ౧౩. సంస్థానవిశేషము, స్థితివిశేషము, ౧౪. ఒకానొక యర్థాలంకారము. ౧౫. కావ్యగుణవిశేషము. ౧౬. సమర్థనము. ౧౭. అర్థోత్కర్షము హేతువుగాఁ గల జనులయాదరము.

**సమాఘ్రాతము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. ఊదఁబడినది. (శంఖాది) ౨. గర్వించినది. గర్వితము. ౩. ఉబ్బినది, పొంగినది.

**సమానము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. తుల్యము

శా. అత్రభ్యాన సమానకార్య వినదంబాకాశ
సంచారులన్ విశ్రాంతిం బొరలింప....
చిత్రభారతము. ౩-౧౦౪.

వ. ఒకచాయఁ గుద్య సమానంబులగు వళినవ
ద్వార పంక్తులఁ దెలుపొందుచు...
శివరహస్య. సంభవ. ౩-౧౪౫.

౨. ఏకము, ఒకటి. ౩. సాధువు.

**సమానము.** సం. వి. అ. పుం. శరీరమున నాభి యందుండు వాయువు.

**సమానయనము.** సం. వి. అ. న. ౧. ఒక్కచోఁ జేర్చుట. ౨. ప్రోగుచేయుట, ౩. తీసికొనివచ్చుట.

**సమానించు.** సం. స. క్రి. సమానముచేయు, పోల్చు.

దండకము .... వింతగాఁ గ్రొత్తగా జంటముత్తెం
బులన్ గూర్చు చెల్వొందు శంఖంబుల్ విలోకించు
వారల్పదోర్మిప్రమాయస్ఫురత్పద్మముంచున్
సమానింప నింపొందదాంభోగుహంబుల్.
వశా. ౪-౨౩౨.

**సమానోదర్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) తోడఁబుట్టినవాఁడు.

**సమాపకము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ముగించునది. సమాప్తి చేయునది. ౨. సంహరించునది, చంపునది.

**సమాపత్తి.** సం. వి ఇ. స్త్రీ. ౧. తారసిల్లుట, తటస్థపడుట, దైవికముగ సంభవించుట.

**సమాపనము.** సం. వి. అ. న. ౧. ముగించుట, ముగింపు. ౨. సంహరించుట. చంపుట.

**సమాపన్నము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సంప్రాప్తమైనది, పొందఁబడినది. ౨. తటస్థమైనది, సంభవించినది, ౩. వచ్చినది, చేరినది. ౪. ముగింపఁబడినది. అవసితము. ౫. ప్రవీణతకలది, నేర్పు కలది. ౬. క్లేశపఱుపఁబడినది, బాధ పెట్టఁబడినది. ౭. సంపన్నమైనది, కూడియున్నది. ౮. చంపఁబడినది.

**సమాపన్నము.** సం. వి. అ. న. ౧. సమాప్తి, ముగింపు.

**సమాపాదనము.** సం. వి. అ. న. ౧. పూర్తి చేయుట. ౨. తిరిగిపొందించుట.

**సమాప్తము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ముగిసినది, సమాప్తినొందినది. ౨. చచ్చినది. ౩. నేర్పు కలది, నిపుణము. (అ. ని) ౪. చక్కఁగాఁ బొందఁబడినది.

**సమాప్తాలుఁడు.** సం. వి. అ. పుం. భర్త, పెనిమిటి ప్రభువు.

**సమాప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧, ముగింపు, అవసానము. ౨. సమర్థించుట, సమర్థనము. (మే. ని.) ౩. నెఱవేఱుట, సఫలమగుట, సిద్ధి. ౪. పరిపూర్ణత.

ఉ. నీకరుణాంగరంబు రమణీయతరం బయి
సర్వవిఘ్నదూరీకృతమై సమాప్తి నొనరన్...
భార. సభా. ౨-౮౧.

**సమాప్తించు.** స. క్రి. సం. (సమాప్తి+ఇంచు. నామధాతువు) పూర్ణముచేయు, ముగించు.

క. ధరణీదేవుఁడు తెలియం బోరని నభిః భూమి
సురులు బోరన భూతేశ్వరు వినుతించి సమా
ప్తించి తత్క్రియ గోపరులు చెన్నెసలా
రన్. హరి. పూర్వ. ౯-౬౭.

వ. అనంతరంబ విధివిశేషంబు సమాప్తింపంగో
రవాలోకనం గడకంట వీక్షించుచు నిమథా
ధ్యక్షుం డగ్నిహోత్రగృహంబునకుఁ జని.
నైష. ౮-౩౬.

**సమాప్తికము.** సం. విణ. ౧. చివరిది, ఉపసంహరించునది. ౨. పరిమితము, సాంతము. ౩. పూర్తి చేయునది.

**సమాప్తికుఁడు.** సం. వి. అ. పుం. ౧. పూర్తి చేయువాఁడు ౨. వేదాధ్యయనాదికమును బూర్తి చేసినవాఁడు.

**సమాప్యము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ముగి యఁదగినది. ౨. వ్యాప్తి నొందఁదగినది.

**సమాప్లుతము.** సం. విణ. ౧. పొంగి పొరలినది, కలఁద రొత్తినది. ౨. నిండినది. ౩. స్నాన మాడినది, ముంపఁబడినది.

**సమాభాషణము.** సం.వి.అ.న. సంభాషణము. ఒకనితో భాషించుట.

**సమామ్నానము.** సం. వి. అ. న. ౧. పునః పునరుచ్చరణము, సంత చెప్పుట ౨. చెప్పుట, పేర్కొనుట. ౩. లెక్కపెట్టుట. ౪. సంప్ర దాయము ననుసరించి సంత చెప్పుట.

**సమామ్నాయము.** సం. వి. అ. పుం. ౧. సం ప్రదాయసిద్ధమయిన తీఁగి చెప్పుట, గురుపరం పరగా చెప్పినది చెప్పుట, సంత చెప్పుట ౨. ఆమ్నా యము, వేదము, వేదభాగము. ౩. సంప్రదా యము. ౪. పఠించుట, కంఠపాఠము, పాఠము. ౫. సమూహము, మొత్తము (ఉదా. అక్షర సమామ్నాయము)

**సమాయము.** సం. వి అ. పుం. ౧. రాక, చేరిక. ౨. సందర్శనము, చూడఁబోవుట.

**సమాయితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. విస్తరింపఁ జేయఁబడినది, వ్యాపింపఁజేయఁబడినది. ౨. పొ డిగింపఁబడినది, దీర్ఘీకృత మైనది.

**సమాయుక్తము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. కలిసి నది, కూడినది. ౨. ఏకాగ్రమైనది, ఒకవిషయ మందు లగ్నమైనది. ౩. సిద్ధపరుపఁబడినది, సం సిద్ధమైనది. ౪. సంపన్నమైనది, కలిగియున్నది. ౫. నియుక్తము, నియోగింపఁబడినది.

**సమాయుతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. కలిసి యుంచఁబడినది, కూర్పఁబడినది. ౨. చేర్పఁ బడినది, ప్రోగుచేయఁబడినది. ౩. కూడినది. పొందింపఁబడినది.

**సమాయోగము.** సం. వి. అ. పుం. ౧. కల యిక, సంబంధము. ౨. ప్రయత్నము. ౩. కూ ర్చుట, సంధించుట (బాణము) ౪. గుంపు, ప్రోగు, సమూహము. ౫. కారణము, ఆశయము ౬. సంఘము.

**సమారంభము.** సం. వి. అ. పుం. ౧. ఉపక్ర మము ౨. యత్నము. ౩. కార్యము, పని. ౪. గాయములకుఁ బూసెడు తైలము.

**సమారబ్ధము.** సం. విణ. మొదలు పెట్టఁబడినది, యత్నింపఁబడినది.

**సమారాధనము.** సం. వి. అ. న. ౧. సేవించుట, పూజించుట.

సీ. అధ్వపరిశ్రాంతుఁ డగు వింతవానికి నన్నం బిడినఫలం బట్టి దిట్టిదనఁ బెద్దయగ్ని సమారా ధనమునకు .... భార. అను. ౧-౧౪౩.

**సమరాధనము.** సం వి. అ. న. ౧. సేవించుట, పూజించుట.

సీ. అధ్వపరిశ్రాంతుఁ డగువింతవానికి నన్నంబిడి నఫలం బట్టి దిట్టి దనఁ బెద్దయగ్ని సమారాధ నమునకు.... భార. అను. ౧-౧౪౩.

౨. తృప్తి కలిగించుట, సంతోషపెట్టుట.

**సమారూఢము.** సం. విణ. ౧. ఎక్కఁబడినది, ౨. దృఢముగా నాటుకొన్నది. ౩. స్థాపింపఁబడి నది.

**సమారూఢి.** సం. వి. ఇ. స్త్రీ. ఎక్కుట,

గీ. జ్ఞానవిజ్ఞానతృప్తిశాశ్వతికశక్తిఁ, దయ్యెఁ జేసియు విడువరా దాశ్రమములఁ గ్రమసమా రూఢి యనుచు వేదములు దీనిఁ దెలియఁ జెప్పు నెపో మోక్షవిత్తులకు జన్మ.
భార. శాంతి. ౬-౨౭౫.

**సమారోపణము.** సం. వి. అ. న. ఒకదానిపై నుంచుట. ౨. అధీనముచేయుట, ఒప్పగించుట. ౩. (వింటినారి) నాటుట.

**సమారోపితము.** సం. విణ. (అ. ఆ. అ) ఒక దానిపైనుంచ బడినది. ౨. ఎక్కు పెట్టఁబడినది. (ధనుస్సు) ౩. నాటఁబడినది, ఒప్పగింపఁబడినది

**సమారోహము.** సం.వి.అ.పుం. ౧. ఎక్కుట, అధిరోహించుట. ౨. స్వీకృతిచేయుట ౩. అంగీకరించుట, ఒప్పుకొనుట.

**సమాలంబనము.** సం.వి.అ.న.౧. పట్టుకొనుట, వ్రేలాడుట. ౨. ఆనుకొనుట, ఆధారపడుట.

**సమాలంబి.** సం.విణ. (న్) ౧. పట్టుకొని వ్రేలాడునది.

**సమాలంబిని.** సం. వి. ఈ. స్త్రీ. ఒకవిధమగు గడ్డి.

**సమాలంభనము.** సం. వి. అ. న. = సమాలంభము.

**సమాలంభము.** సం. వి. అ. పుం. ౧. పరిమళద్రవ్యములతో శరీరమును నలుగు పెట్టుట, సుగంధద్రవ్యములను శరీరమునఁ బూసికొనుట. ౨. యజ్ఞమునఁ బశువును విశసనము చేయుట. ౩. గ్రహించుట, పట్టుకొనుట.

**సమాలాపము.** సం.వి.అ. పుం. సంభాషణము.

**సమావర్తనము.** సం. వి. అ. న. వేదాధ్యయనము ముగించి గృహస్థాశ్రమమును స్వీకరించుటకై గురుకులమునుండి వచ్చునప్పుడు చేసికొనెడి యొకానొక వైదికసంస్కారము. ౨. తిరిగి వచ్చుట.

**సమావిష్టము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. చక్కఁగాఁ బ్రవేశించినది. ౨. ఆక్రమింపఁబడినది. ౩. (గ్రహాదులచే) ఆవేశింపఁబడినది. ౪. సంపన్నము. ౫. అభినివేశము గలది, పట్టుదల గలది. ౬. స్థిరపడినది. ౭. దృఢముగాఁ గూర్చుండినది. ౮. బాగుగా బోధింపఁ బడినది.

**సమావృతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ఆవరింపఁబడినది, చుట్టుకొనఁబడినది. ౨. తెర వేయఁబడినది. ౩. మఱుఁగుపఱుపఁబడినది. ౪. రక్షింపఁబడినది. ౫. బహిష్కరింపఁబడినది, వెడలఁగొట్టఁబడినది. ౬. ఆఁపివేయఁబడినది, నిలిపి వేయఁబడినది.

**సమావృత్తుఁడు.** సం.వి. అ. పుం. సమావర్తనసంస్కారమును పొందినవాఁడు.

(రూ. సమావృత్తకుఁడు.)

**సమావృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. తిరిగిరాక. ౨. పూర్తిచేయుట.

**సమావేశము.** సం. వి. అ. పుం. ౧. ఒకచోఁ గలసియుండుట, సహస్థితి. ౨. కలసికొనుట, సంఘముగాఁ గూడుట. ౩. కలుపుట, అనేకార్థముల నొక్కవాక్యములోఁ గలుపుట ౪. మనోభావము (కామక్రోధాది) ౫. గ్రహావేశము, దయ్యము పట్టుట ౬. అభినివేశము, పట్టుదల

**సమావేశితము.** సం. విణ. (అ. ఆ. అ) ఒకచోట కూడియుండునది, ౨. ప్రవేశించినది.

కం. నీవును మృత్యువుఁ బాపసమావేశితమతుల
రోయఁగ వాడిన యంతన్....

భార అను. ౧-౨౯.

**సమాశ్రయము.** సం.వి.అ. పుం. ౧. శరణొందుట, రాజ్యతంత్రమునందలి షడ్గుణములలో నొకటి. ౨. రక్షణము, ౩. రక్షణస్థానము. ౪. నివాసస్థానము, ఇల్లు.

**సమాశ్రయించు.** సం స. క్రి. ఆశ్రయించు, అవలంబించు, అందుకొను.

ఆ. కీర్తి గని యొకండు గృహధర్మ మెడలి స,
మాశ్రయించు నాశ్రమాంతరంబు, దాన సంగ
మెడలఁగాఁ జేరదది యొల్లమియును వలవ
గాన వినవయ్య.

భార. శాం. ౬-౧౪౪.

చ ..... కంజభవాండము మోదలీలమై, దెనిచిన
దంభవాదును సురేంద్రుని నిన్ను సమాశ్ర
యించెదన్. మను. ౬-౧౧౦.

ఉ. .... శాశ్వతాఖండ సుఖాత్మ విష్ణు నధిక స్థిరభక్తి సమాశ్రయింత్రు ....
భార. శాం. ౬-౪౭౨.

చ. కవులు సమాశ్రయింపఁ దగి కర్పురగర్భిత శ్రీసురత్వమున్, కవులు సరస్వతీశ్వరుఁ డుదారత మాకుఁ జిరాయు వీవుతన్.
ఉ. రా. ౧-౫.

**సమాశ్లేషము.** సం. వి. అ. పుం. గట్టిగాఁ గౌఁగిలింత, గాఢాలింగనము.

**సమాశ్లేషించు.** సం. స. క్రి. చక్కఁగాఁ గవుఁగిలించు, కవియు.

శా .... మను, ద్యోషారత్నకిరీటఘూటనుషమారోయుజ్యమానాంఘ్రిని, శ్రీమచ్ఛ్రీ విందమ్మ్ర గద్దియ సమాశ్లేషింపఁ గొల్వుండు నా, భాషాదేవిఁ దలంచెదన్. నిరం. ౧-౭

**సమాశ్వాసము.** సం. వి. అ. న. తెప్పతిల్లఁ జేయు ౨. ఓదార్పుట.

**సమాశ్వాసము.** సం. వి. అ. పుం. ౧. ఊర్పు ౨. తెప్పతిల్లుట. ౩. విశ్వాసము, నమ్మకము. ౪. ఓదార్పు.

**సమాసంగము.** సం. వి. అ. పుం. (చూ) సమాసక్తి.

**సమాసంజనము.** సం. వి. అ. న. ౧ కలుపుట ౨. సంగ్రహపఱుచుట.

**సమాసంజితము.** సం. విణ. తగుల్పఁబడినది.

వ. పుష్పవల్లి శాఖాసమాసంజితసమంజసరత్న పంజరంబునఁ నున్న నన్నుంజూచి.
కళా. ౬. అ. ౨౦.

**సమాసకము.** సం. వి. అ. పుం. సమసకము.

**సమాసక్తము.** సం.విణ. (అ.అ.అ) ౧. తగిలి యుండునది, లగ్నమైనది. ౨. కలసియున్నది ఏకమైనది. ౩. చేరఁబడినది, పొందఁబడినది. ౪. మూర్చఁబడినది.

**సమాసక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. కలయిక తగులు, తగులము. ౨. గ్రహణము; -ఁగొనుట.

**సమాసమ.** సం. వి. అ. స్త్రీ. ప్రతివత్సరము, ఏఁటేట ఈ క్రింది ప్రయోగమున 'అప్' ప్రత్యయరహితముగ సమాస 'అనియు'దంపతిపద మేకవచనాంతముగను గనుపట్టుచున్నవి.

ఉ. ఆ విపినంబునం దొక మహామహీజంబున నగ్రశాఖపై, దా వసియించి యొక్కటకదంపతిపిల్లలఁ జేయుఁ జేయఁగా, శివమా సమీప బిలసీమమునన్ వసియించి యుండి వాఁడొ వఁగ నన్నిటిన్ మెసవి పోవుసమాసమ నివ్విధంబునన్. తెం. పంచతం. ౧-౭౨౦.

**సమాసము.** సం. వి. అ. పుం. ౧. సంక్షేపము, సంగ్రహపఱుచుట.

కం. వ్యాససమాసైకరూప హరిహరనాథా.
భార. విరా. ౫-౧.

౨. సమర్థించుట. ౩. సమూహము. ౪. (వ్యాక) అనేకపదముల నేకపదముగాఁ గలుపుట. ౫. కలుపుట, మొత్తము, పెరసి.

**సమాసర్జనము.** సం. వి. అ. న. పూర్తిగా విడిచి పెట్టుట. ౨ అర్పణము చేయుట.

**సమాసాదము.** సం.వి.అ. న ౧. సమీపించుట. ౨. కనుఁగొనుట, పొందుట. ౩. పూర్తిచేయుట, సిద్ధింపఁజేయుట.

**సమాసాదితము.** సం. విణ. అ. అ. అ పొందఁబడి ది.

కం.... పతితా భ్యాస వికాసి సమానసమాసాదితశాంతితోల హరిహరనాథా:
భార. అశ్వ. ౨-౧

**సమాసాస్థ.** సం. వి. అ. స్త్రీ. సమస్య (శ.ర)

**సమాసోక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఒకవిధమైన యర్థాలంకారము. (విశేషణాదిసామ్యముచేతఁ బ్రస్తుతవర్ణనముచేత నప్రస్తుతము గమ్యమానమగుచో సమాసోక్తి)

**సమాస్ఫోటించు.** సం. స. క్రి. పగులు, భేదించు.

శా. ఆటోపారభటీసముద్భట తరాహంకారబా
హాధనుర్జ్యాటంకారరవంబు లంబుజభవాండా
భ్యంతరంబున్ సమాస్ఫోటింపంగ....
శివరా. ౪-౭౩.

**సమాహరణము.** సం. వి. అ. న. ౧. జతపఱచుట. ౨. కలుపుట. ౩. ప్రోగు చేయుట. ౪. తెచ్చుట.

**సమాహరించు.** సం. స. క్రి. తెచ్చు; కొనివచ్చు.

తే. మీకు, వలయునట్టిపదార్థ మవశ్యమును స,
మాహరింతు నే ననుటయు నయ్యహల్య.
భార. అశ్వ. ౩-౮౩.

**సమాహర్త.** సం. వి. ఋ. పుం. ౧. ప్రోగు చేయువాఁడు. ౨. వసూలు చేయువాఁడు.

**సమాహారము.** సం. వి. అ. పుం. ౧. సమూహము. స్పష్టపడని యవయవభేదము గల పదార్థ సముదాయము. (వాచ.)

**సమాహితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. చక్కఁగా నుంచఁబడినది. ౨. స్వస్థము, నిశ్చలమైనది (మనస్సు) ౩ ప్రతిజ్ఞ చేయఁబడినది. ౪. ముగిసినది. ౫. పరిశుద్ధమయినది. ౬. చేర్పఁబడినది. ౭. ఏకాగ్రమైనది, ఒక్కవిషయమునందు లగ్నమైనది.

**సమాహృతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సంక్షేపింపఁబడినది, కుదింపఁబడినది. ౨. ప్రోగు చేయఁబడినది, కూర్పఁబడినది. ౩. సమృద్ధమైనది, అధికమైనది ౪. స్వీకరింపఁబడినది, అంగీకరింపఁబడినది.

**సమాహృతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧ కుదింపు, సంక్షేపణము. ౨. కూర్పు, సంకలనము.

**సమాహ్వ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నామధేయము, పేరు.

**సమాహ్వాయము.** సం. వి. అ. పుం. ౧. ధిక్కారము. ౨. తిరస్కారము. ౩. [illegible]

**సమాహ్వాయము.** సం. వి. అ. పుం. ౧. పిలుచుట. ౨. పేరు, నామధేయము ౩. జంతువులను పందెములుగాఁ జేసికొని యాడుజూదము (ఉదా. కోడిపందెములు మొ.) ౪. ద్వంద్వయుద్ధము, యుద్ధము. (ఆ. ని)

**సమాహ్వానము.** సం. వి. అ. న. ౧. చేరఁబిలుచుట ౨. సమావేశపఱచుట ౩. ఆక్షేపించుట, ధిక్కరించుట.

**సమింధనము.** సం. వి. అ. న. ౧. మండునట్లు చేయు, రగుల్చుట. ౨. వంటచెఱకు.

**సమికము.** సం. వి. అ. న. బల్లెము, శూలము.

**సమిత.** సం. వి. ఆ. స్త్రీ. గోధుమపిండి.

**సమితము.** √ సం + ఇ + త. సం. విణ. (అ. ఆ. అ) ౧. కలుపఁబడినది. ౨. ప్రోగు చేయఁబడినది. ౩. కూర్పఁబడినది, అతుకఁబడినది. ౪. చేరికయైనది, అంటియున్నది. ౫. సమాంతరమైనది. ౬. వాగ్దత్తమైనది. ౭. పూర్తి చేయఁబడినది.

**సమితి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సమూహము.

ఆ. పాపభీతి దోఁచఁ బల్క నమ్ముని దవదైవ
శిష్యసమితిలోన మునిచె. భార. అను. ౧-౧౨౫.

౨. యుద్ధము. ౩. సంగమము. (శ. ర)

**సమితంజయుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) యుద్ధమునజయించినవాఁడు.

**సమిత్తు.** సం. వి. త్. స్త్రీ. యుద్ధము.

ఉ. అద్దానవశక్తి నవ్విభుఁ డుదాత్తసమిత్క్రి
తిఁ ద్రుల్య శల్యునిన్. భార శల్య. ౧-౨౮౨.

**సమిద.** వి. (సం. సమిధ) చిదుగు.

సీ. తెలిమి సమిద్రోలియు దేబదండంబు, వల
తేల దాతేల వ్యజన మొకటి.
[illegible]. ౨-౧౧౫.

**సమిద్వత్తు.** సం. విణ. ౧. సమిధలుగలది, ౨. కట్టెలుచేసి మండింపఁబడినది.

**సమిధ.** సం.వి.ధ్. స్త్రీ. ౧. చిదుగు. ౨. వంటచెఱకు. (శ. ర)

**సమిధము.** సం. వి. అ. పుం. ౧. అగ్ని. ౨. ఇంధనము.

**సమిద్ధము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. రగుల్పఁబడినది, మండింపఁబడినది. ౨. నిప్పు రగిలింపఁబడినది. ౩. మండింపఁబడుచున్నది, ఉద్రేకింపఁబడినది.

**సమిరము.** సం. వి. అ. పుం వాయువు. (చూ. సమీరము)

**సమీకము,** సం. వి. అ. న. యుద్ధము.

**సమీకరణము.** సం. వి. అ. న. ౧. సమము చేయుట, మట్టము చేయుట. ౨. లోఁగొనుట, తనలోఁ గలుపుకొనుట. ౩. సమానము చేయుట. సమానస్థితి. (౪. గణితము) భిన్నాంకములను ఒకేహారముగలవిగా మార్చుట.

**సమీకృతము.** సం.విణ. ౧. సమము చేయఁబడినది. ౨. మట్టము చేయఁబడినది. ౩. ఏకము చేయఁబడినది.

**సమీక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. సమీకరణము.

**సమీక్ష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పరిశీలన, పరిశోధన ౨. విమర్శ, ఆలోచన. ౩. అవగాహన, బుద్ధి. ౪. సత్యముయొక్క సారము. ౫. పారమార్థికమైన సిద్ధాంతము. ౬. మీమాంసాదర్శనము. ౭. ప్రయత్నము. ౮. సాంఖ్యదర్శనము.

**సమీక్షణము.** సం.వి.అ.న.౧. అన్వేషించుట ౨. సూక్ష్మముగాఁ బరికించుట. చూపు. ౩. వీక్షణము.

ఉ. దుఃఖితే ధవపాకరాయితసమీక్షణ, వైశ్యమహోద్యమకప్రదా. భార. విరా. ౧-333.

**సమీక్షము.** సం. వి. అ. పుం. ౧. సమాలోచనము, సమ్యగ్దర్శనము. ౨. పూర్ణజ్ఞానము.

**సమీక్ష్యము.** సం. వి. అ. న. ౧. సమగ్రపరిశీలనము. ౨. సాంఖ్యదర్శనము.

**సమీక్ష్యకారి.** సం. విణ. (క. నీ. క) ౧. వివేకముగలది. ౨. ఆలోచనగలది. ౩. ముందువెనుకలు విచారించి యాచరణముఁ బూనుకొనునది.

**సమీచకము.** సం. వి. అ. పుం. సంభోగము, రతిక్రియ.

**సమీచము.** సం. వి. అ. పుం. మహాసముద్రము

**సమీచీనము.** సం.విణ. ౧. సత్యమైనది. ౨. పరిశుద్ధమైనది. ౩. తగినది.

**సమీచీనము.** సం. వి. అ. న. ౧. సత్యము. ౨. ఔచిత్యము.

**సమీదము.** సం. వి. అ. పుం. మెత్తనిగోధుమపిండి.

**సమీనము.** సం. విణ. ౧. వార్షికము, ఏటేటకతూర్పు యగునది. ఒక్కయేఁడాది యద్దముఁ దీసికొనఁబడినది. ౩. ఏఁడాదికమ్మటిది.

**సమీనిక.** సం. వి. ఆ. స్త్రీ. ప్రతిసంవత్సరము ఈనెడి ఆవు.

**సమీపము.** సం. విణ. దగ్గఱది, ప్రక్కనున్నది, అంటుపాటులోనున్నది.

ఉ. దీని ధ్వంయించి పురంబు సమీపభూమికిం దెమ్మని చెప్ప.... భార. విరా. ౧-౧౫౪.

**సమీపము.** సం. వి. అ. న. దగ్గఱ, చేరువ.

**సమీపవర్తి.** సం. విణ. (క. నీ. క) సమీపస్థము. చేరువనున్నది, పొరుగున నున్నది.

**సమీపించు.** సం.అ. క్రి. చేరువయగు, డాయు.

సీ. నిత్యకార్యవిధి సమీపించినఁ గదపనీ కదపనీ మట్టుంటుగతిం బోవని. కాశీ, ౩-౧౭౪.

**సమీరణము.** సం. వి. అ. పుం. ౧. వాయువు. ౨. ఊర్పు, ప్రాణము. 3. యాత్రికుఁడు, పాంథుఁడు. ౪. మరువకవృక్షము. ‡

**సమీరణము.** సం. వి. అ. న. ౧. విసరుట. ౨. ప్రసరింపఁజేయుట.

**సమీరము.** సం. వి. అ. పుం. ౧. వాయువు. ౨. జమ్మిచెట్టు ‡

**సమీరితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. వీవఁబడినది, విసరఁబడినది. రేఁచఁబడినది.

చ. నిర్దయతీవ్ర రోషమారుతనితాంతసమీరితమై
క్షణంబునన్ భార. సభా. ౨. ౮

౨. పలుకఁబడినది.

**సమీహా.** సం. వి. ఆ. స్త్రీ. కోరిక, లిప్స.

**సమీహితము.** సం. విణ. (అ. ఆ. అ) కోరఁబడినది. ఆశింపఁబడినది.

**సమీహితము.** సం. వి. అ. న. కోరిక, ఇచ్ఛ.

**సము.** సం. వి. అ. పుం. ౧. పాము. ౨. వాయువు, గాలి 3. పక్షి. ౪. సంగీతమున షడ్జస్వరమునకు సంక్షిప్తనామము. ౫. (ఛంద) సగణము, రెండు లఘువులపై నొకగురువు గల గణము.

**సము.** సం. వి. అ. న. ౧. జ్ఞానము. ౨. సమాధి, ధ్యానము. 3. బండ్లదాఁ. ౪. కంచె, ఆవరణము.

**సముందనము.** సం. వి. అ. న. తడియుట, తేమము, (శ. ర.)

**సముఁడు.** సం. విణ. సాధువు, సమబుద్ధిగలవాఁడు

క. ....సముఁడై యుయుత్సుఁ డయ్యున్నము రుష్టుం
బగుటఁ జెప్పినను భార. ఆది. ౫-౧౪౧.

**సముక్షణము.** సం. వి. అ. న. ౧. ప్రసరింపఁజేయుట, జిలికిమ్ముట. ౨. చల్లుట, చిలుకరించుట.

**సముఖము.** సం. విణ. మాటలమారి, మాటకాఁడు.

**సముఖము.** సం. వి. అ. న, ఎదురు.

చం. కని కొనిపోయి తండ్రిసముఖంబునఁ బెట్టిన.
వై. ౯ ఆ. (శ. ర.)

**సముఖా.** అవ్య. ప్రభువులనుగూర్చి వేత్రహస్తులు పలికెడి హెచ్చరికమాట.

మ. సముఖా యంచును వేత్రహస్తులు వచింపన్
డిగ్గనన్ లేచి యయ్యమరారాతి యహార్య
పక్షహరణాహంకారి తే తెమ్మటం, చమి
తోత్సాహము మీఱ నెత్తె....
దశ. ౨-౧౨౪.

క. కట్టిక వారు పారె సముఖాయన వామప
దంబు కెంపురా, మట్టిక నిల్పి గద్దెపయి
మార్పడ వేటోకజాను వ్రాది....
చంద్ర. ౨-౪౯.

**సముచ్చయము.** సం. వి. అ. పుం. ౧. ౧. ఒకచోఁ జేర్చుట ప్రోఁగుచేయుట. ౨. సముదాయము. 3. పదములనుగాని వాక్యములనుగాని కలుపునది. ౪. ఒక అర్థాలంకారము. (పెక్కుగుణములకుఁగాని క్రియలకుఁగాని ఒక్కదాని యందు సమావేశము కలిగించుట.)

**సముచ్చరము.** సం. వి. అ. పుం. ౧. ఎక్కుట. ౨. దాఁటుట, కడచుట.

**సముచ్చరించు.** సం. స. క్రి. చక్కఁగా వాక్రుచ్చు. పలుకు, చెప్పు.

మ. శుకవాణీ! యొక తేకతం బనుచు తచ్ఛ్రో
త్రింబులో పంచసాయకమంత్రంబు సము
చ్చరించున్. నిరం. ౨. ౪౭.

**సముచ్ఛిన్నము.** సం. విణ. పూర్తిగా నాశము చేయఁబడినది.

**సముచ్ఛేదము.** సం. వి. అ. పుం. ౧. సంపూర్ణనాశము ౨. సమూలముగఁ దుడిచిపెట్టుట.

**సముచ్ఛ్రియము.** సం. వి. అ. పుం. ౧. మిక్కిలి పొడుగు. ౨. ఎత్తుగాఁ బెరుగుట. 3. విరోధము, ప్రాతికూల్యము. (రూ. సముచ్ఛ్రాయము)

**సముచ్ఛ్రితము.** సం. విశే. ౧. మిక్కిలి పొడుగైనది, ౨. మిగుల పెంపొందినది.

**సముచ్ఛ్వసితము.** సం. వి. అ. న. ౧. గాఢముగా నిట్టూర్చుట, ౨. గాటపునిట్టూర్పు. (రూ. సముచ్ఛ్వాసము. అ. పుం.)

**సముజ్జృంభణము.** సం. వి. అ. న. ౧. ఆవులింత. ౨. పొంగుట, చెలరేగుట. ౩. తీవ్రముగా యత్నించుట.

**సముజ్జ్వలము.** సం. విశే. మిక్కిలి ప్రకాశించునది.

**సముజ్ఝితము.** సం. విశే. విడువఁబడినది.

**సముతు.** వి. ౧. కట్టుబాటు.

> మ. ఒక రేయేకాదశినాఁటి రేయి సముతై యున్నట్లు లోవెట్టవేఁ, డుక కాంద్రెవ్వరు రామిఁ బల్లవుఁ డొకండున్ లేకపోఁ గ్రాగి కయ్యెకడన్ నిల్వ సహింప కింత్యాదలి ....
>
> వైజ. ౨-౭౯.

(ప్రా. పా. సముతై. యున్నట్టి. అపముద్రి)

౨. తాలూకాలో నొకభాగము. (వ. ర)

**సముతుపడు.** స. క్రి. కట్టుపడు.

> తే. మస్తకము వంచి పలుమాఱుఁ గుస్తరించి, సమరసముఁ జూపి మెల్లన సముతుపఱచి, వాగ బిగియించి తమ్మిమాల్ వాగ సడలి పక్నె నొసఁకిన ముందఱఁ బఱవదయ్యె.
>
> చంద్రాంగ. ౩-౬౬.

**సముత్కర్షము.** సం. వి. అ. పుం. ౧. ఔన్నత్యము. ౨. గొప్పతనము సంపాదించుకొనుట.

**సముత్క్రమము.** సం. వి. అ. పుం. ౧. పైకి లేచుట, ఎక్కుట. ౨. హద్దు మీరుట, మర్యాద నతిక్రమించుట.

**సముత్క్రోశము.** సం. వి. అ. పుం. ౧. బిగ్గరగా నఱచుట. ౨. పెద్దకేక. ౩. చేపలను భక్షించు నొకవిధమైన పక్షి.

**సముత్థము.** సం. విశే. ౧. పైకి లేచునది, ౨. పుట్టినది, పొంగినది. ౩. సంభవించినది, జరిగినది.

**సముత్థానము.** సం. వి. అ. న. ౧. లేచుట, నిలుచుండుట. ౨. తిరిగి ప్రాణమువచ్చుట. ౩. రోగము పూర్తిగాఁ గుదురుట. ౪. మానుట. (గాయము) ౫. రోగలక్షణము. ౬. ప్రయత్నము, కృషి. ౭. వృద్ధి, పెరుగుదల.

**సముత్థాపించు.** సం. స. క్రి. నిలుపు, నెలకొలుపు.

> సీ. రంభాతరుస్తంభసంభారములు సముత్థాపించి రొగిఁ బ్రతిద్వారమునను.
>
> శివరా. ౪-౩౬.

**సముత్థితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. లేచినది, పైకెత్తఁబడినది. ౨. నెమ్మదించినది, కోలుకొన్నది. ౩. ఉదయించినది, ఉత్పన్నమైనది, జన్మించినది.

> క. .... వదనసముత్థిత వేదామదవద నురివారణకరణమంత్రవినోదా !
>
> భార. ద్రోణ. ౨-౩౭౨.

**సముత్పతనము.** సం. వి. అ. న. ౧. ఎగురుట, ఎక్కుట, దుముకుట. ౨. పుట్టుట, ఉదయించుట. ౩. నిర్గమించుట, బయటపడుట, వెలికు ఱుకుట. ౪. పైఁబడుట, ఎదుర్కొనుట. ౫. వెడలిపోవుట, అదృశ్యమగుట.

**సముత్పతితము.** సం. విశే. ౧. ఎగిరినది, దుమికినది. ౨. నిర్గమించినది.

**సముత్పత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పుట్టుక ౨. సిద్ధి, ౩. సృష్టి.

**సముత్పన్నము.** సం. విశే. ౧. పుట్టింపఁబడినది. ౨. సిద్ధించినది. ౩. సృష్టింపఁబడినది. ౪. ఏర్పడినది.

**సముత్పాటనము.** సం వి. అ. న. ౧. చీల్చుట. పెల్లగించుట.

> వ. అనిన విని జరాసంధుండు పటాపసముత్పాటన కుపితకుంజరవైరియుంబోలెఁ గడు నలిగి.
>
> భార. సభా. ౧-౧౯౪.

[illegible]

**సముత్పాటకము.** సం. వి. అ. పుం. సముత్పాటనము.

**సముత్పాటించు.** సం. స. క్రి. పెకలించు.

**సముత్పాదనము.** సం వి. అ. న. ౧. పుట్టించుట. ౨. కలిగించుట. ౩. సిద్ధముచేయుట.

**సముత్పాదించు.** సం.స.క్రి. పుట్టించు, కలిగించు.

మ. ధరపై నీవు నిజాంశ మొక్కటి సముత్పా
దించి దేవాంశజోత్కరముం బాలనసేయు
చేస్మి వెసఁగంగా.... హరి. పూ. ౫-౫౬.

**సముత్పింజ (ల) ము.** సం. విణ. ౧. మిక్కిలి కలఁతపడినది. ౨. క్రమరహితమైనది.

**సముత్పింజ (ల) ము.** సం.వి.అ. పుం. ౧. మిక్కిలి కలఁగఁబాఱిన సేన. ౨. కల్లోలము, కలఁత.

**సముత్సర్గము.** సం. వి. అ. పుం. ౧. విడిచిపెట్టుట, త్యజించుట. ౨. దానముచేయుట, వదలివేయుట, విసరివేయుట. ౩. మలాదులను విసర్జించుట.

**సముత్సవము.** సం.వి.అ. పుం. గొప్పపండుగ.

**సముత్సాహనము.** సం.వి.అ.న. ౧. పాఱఁదోలుట. ౨. వెంబడించుట, తఱుముట. ౩. వేటాడుట.

**సముత్సుకము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. మిక్కిలి యాతురము, సహనము లేనిది. ౨. అత్యాసక్తము.

సీ .... మత్కృతీశ్వరుఁ డగును ౨ మనుమాప్ర
పతి శుభగుఁ గావించుటకు సముత్సుకుఁడ
నైతి. నీలా. ౧.

౩. విషణ్ణము, తపించునది.

**సముత్సేధము.** సం.వి. అ. పుం. ౧. ఎత్తు, ఔన్నత్యము, ౨. లావు. స్థౌల్యము.

**సముదంచితము.** సం.విణ.(అ.ఆ.అ.)౧.మిక్కిలి ప్రకాశించునది. ౨. ఒప్పయినది.

**సముదక్తము.** సం.విణ. (అ. ఆ. అ) ౧ పైకెత్తఁబడినది. ౨. పైకితోడఁబడినది, (నీరుమొ.)

**సముదయము.** సం. వి. అ. పుం. ౧. చక్కని యుదయము. ౨. సమూహము, మొత్తము.

చ. అమరకిరీటకోటికవితారుణరత్నమరీచిమాలికా
సముదయశోభనోల్లసన చారుపదాంబుజకాం
తిపూర.... భార. ద్రోణ. ౫-౪౩౧.

ఆ .... సిద్ధచారణ, సముదయోపసేవితమును ....
భార. శాంతి. ౬-౩౨౬

కం. సమయింతుఁ బొదివి శాస్త్రకసమయంబున
నెల్లభంగిఁ నసురంగసమేతముగాఁగఁ బొందు
నృపసంతి, సముదయమును క్రమపదభూపసం
తానంబున్ శాస్త్రిక ౧-౭౫.

౩. యుద్ధము. ౪. ఆదాయము ౫. ప్రయత్నము. ౬. దినము, పగలు. ౭. సేనాపృష్ఠము.

**సముదయము.** సం. వి. అ. న. ౧. గ్రహముల యుదయము. ౨. శుభముహూర్తము, లగ్నము.

**సముదాగమము.** సం. వి. అ. పుం. పరిపూర్ణజ్ఞానము.

**సముదాచారము.** సం. వి. అ. పుం. ౧. యోగ్యమైన యనుష్ఠానము; సరియైన నడవడి. ౨. ఉచితమైన సంబోధన. ౩. ఆశయము, ఉద్దేశము, పథకము.

**సముదాయము.** సం. వి. అ. సమూహము.

క. అమరాసురసైన్యద్వయ, సముదాయం బప్పు
డధికచండం బయ్యెన్, సమనుద్దీప్తసమయజృం
భితసముద్రయుగసన్నిపాతసమత దొలఁకన్.
హరి. ఉ. ౧౦-౪౭.

కం .... సద్గుణసముదాయ మ్మెసఁగఁగఁ జేసె
సత్త్రయాగము నిద్ధున్. భార. ఆది. ౪-౩.

**సముదాయించు.** స.క్రి. ఓదార్చు. ఊరడించు.

**సముదాహరణము.** సం. వి. అ. న. ప్రకటించుట. ౨. తీర్మానించుట. ౩. చక్కఁగా ఋజువు పఱుచుట.

**సముదితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. పైకెక్కినది, లేచినది.

క. సముదితసూర్యసహస్రోపమసుప్రభాతేజా... భార. ఆది. ౧-౧౩౨.

౨. ఎత్తయినది, ఉన్నతము. ౩. పుట్టింపఁబడినది, కల్పింపఁబడినది. ౪. కూర్పఁబడినది, ప్రోగుచేయఁబడినది. ౫. పొందింపఁబడినది, సమకూర్పఁబడినది. ౬. సంభాషింప బడినది. ౭. పలుకరింపఁబడినది, పిలువఁబడినది. ౮. అంగీకరింపఁబడినది. ౯. అలవాటయినది, పరిపాటియైనది.

**సముదీరణము.** సం. వి. అ. న. ౧. ఉచ్చరించుట, పలుకుట. మాటాడుట. ౨. వల్లించుట, తిరిగి తిరిగి యుచ్చరించుట.

**సముదీరితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. పలుకఁబడినది, ఉచ్చరింపఁబడినది. ౨. వల్లె వేయబడినది, తిరిగి తిరిగి పలుకఁబడినది.

**సముదీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ) అధికము.
మ. పతియుక్తైస్త్రసముదీర్ణవిక్రమకళాపారీణుఁడై. భార. శల్య. ౧-౩౭౭.

ఉదారము, గర్వితము, శ్రేష్ఠము, సిద్ధము, ఉచ్చరితము.

**సముద్గకము.** సం. వి. అ. పుం. ౧. బరణి, సంపుటము. ౨. పూర్వోత్తరార్ధములందు అర్థభేదముండియు శబ్దభేదము లేని పద్యము.

**సముద్గతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పైకిలేచుట. ౨. పుట్టుట. ౩. ఉత్పన్నమగుట.

**సముద్గమము.** సం. వి. అ. పుం. ౧. ఉదయించుట, ఎక్కుట. ౨. పుట్టుట, ఉత్పన్నమగుట ౩. జననము, ఉత్పత్తి.

**సముద్గమించు.** సం. అ. క్రి. మీఁదికిఁబోవు, ఎగయు.

క. అని పలికి తానుఁ బ్రేయసియును నవ్వుల నరుగఁదగుప్రయోజనము మదంబునఁ దలిపి పోయివచ్చెద, నని చెప్పి సముద్గమించె నంబరవీథిన్. కవిరా. ౩-౧౭౩.

**సముద్గము.** సం. వి. అ. పుం. చూ. సముద్గకము.

**సముద్గయమకము.** సం. వి. అ. న. (అలం) ఒకవిధమైన యమకభేదము.

శ్లోకమందలి యర్ధభాగమును అర్థభేదము కలుగునట్లు పునరుక్తము చేయుట. 'అర్ధాభ్యాసః సముద్గః స్యాత్' అనిదండి ౩-౫౩)

**సముద్గిరణము.** సం. వి. అ. న. ౧. క్రక్కుట. ఎగఁజిమ్ముట. ౨. వాంతి, క్రక్కఁబడినది. ౩. పైకెత్తుట, లేపుట.

**సముద్గీతము.** సం. వి. అ. న. బిగ్గరగాఁ బాడఁబడినపాట.

**సముద్ఘాటించు.** సం. స. క్రి. భేదించు, పగుల్చు, త్రచ్చు.

శా. పా. తాళక్రోడమహాకటాహము సముద్ఘాటింపఁ దత్కంధరా, గోళస్థాయినియైన భూమిపృథువక్షోజప్రదేశంబునన్ లీలాపత్త్రవలక్రాంకురంబు లెగయన్. శివరా. ౧-౫౯.

**సముద్దకము.** సం. వి. అ. పుం. బరణి. సంపుటము. (శ. ర)

**సముద్దారు.** (సముతు—దారు.) హిం. వి. సముతుకు అధికారి.

**సముద్దిష్టము.** సం. విణ. (అ. ఆ. అ) చక్కఁగా నుద్దేశింపఁబడినది.

**సముద్దీపించు.** సం. అ. క్రి. మండు, విజృంభించు, చెలరేఁగు.

మ. (గర్దభాసురుఁడు) పదవిక్షేపములన్ సపృథుధరణీభాగంబు గంపింపఁగా, రదముల్ దీటుచుఁ గద్రించినచెవుల్ రాజిల్ల వాలంబు త్రి,

తిరమై తూలఁగఁ గావరంబున సముద్దీపించి
గోపాలకుల్, బెదరన్ రాముని ఫ్రొమ్ముఁ
దన్ని శిరములై చీరంబు దోరంబుగన్.
భాగ. ౧౦. పూ. ౬౧౪.

సముద్దీప్తము. సం. విణ. (అ. ఆ. అ) మిక్కిలి మెఱయునది, వెలఁగునది.

గీ .... విడిచి చని సముద్దీప్తమైన నేఁటంబు సూ
ర్యబింబంబు సొచ్చె ....
భార. కర్ణ. ౩-౩౬౩.

సముద్దేశము. సం వి. అ. పుం. ౧. చక్కఁగాఁ జూపుట. చక్కఁగా నిర్దేశించుట. ౨. సమగ్ర వర్ణనము, సంపూర్ణ వివరణము. ౩. తెలుపఁబడుట ౪. లెక్కించుట.

సముద్ధతము. సం. విణ. (అ. ఆ. అ) ౧. పైకెత్తఁబడినది, ఎగరఁగొట్టఁబడినది, లేఁబడినది. ౨. ఉద్రిక్తమైనది, ఉప్పొంగినది. ౩. గర్వముచే పొంగినది, పొగరెక్కినది. ౪. ఒద్దిక లేనిది, దుర్నయమైనది. ౫. మెఱసినది.

సముద్ధతి. సం. వి. ఇ. స్త్రీ. గర్వము, విజృంభణము.

మ. అమరేంద్రుండు సముద్ధతిన్ వెడలి దేవానీ
కముల్ తోడ్పడన్. భార. అను. ౧-౨౫౪.

ఉ. దంతిసనంగ భూమదధారలఁ గాలి యొత్తింగి
మూర్ఛ మత్యంతసముద్ధతిం గొలని కర్దపపన్
వెస వచ్చె.... భార. అను. ౧-౨౩౧.

సముద్ధరణము. సం. వి. అ. న ౧. పైకెత్తుట; లేవనెత్తుట. ౨. రక్షించుట, తప్పించుట. ౩. పెరుకుట, బయటకుఁదీయుట. ౪. నిర్మూలించుట, అంతమొందించుట. ౫. ప్రక్కఁబెట్టిన యాహారము

సముద్ధరించు. సం. స. క్రి. ౧. పైకెత్తు, లేవదీయు ౨. రక్షించు, తప్పించు. ౩. పెరికివేయు, లేకుండ చేయు. ౪. వేళ్లతోఁ బెకలించు, సమూలముగా నాశముచేయు. ౫. పొగడు, గౌరవించు.

(౨. రక్షించు.)

గీ. నిత్యకృత్యము ల్సలుపంగ నిజగృహమున
కిపుడ యరుగంగవలయు నా కిందువదన, యను
నుపాయ మేది చెప్పు మను సముద్ధరింపు నిత్య
క్రియాహాని సెంపు వదము.
మార్కం. ౪-౨౩౮.

సముద్ధూళించు. సం. స. క్రి. విభూతి మున్నగునవి పూసికొను.

సీ. భూతిసర్వాంగీణముగ సముద్ధూళించు, ధరి
యించు గుద్రాక్షదామకములు.
కాశీ. ౭. అ. (శ. ౪)

సముద్భటము. సం. విణ. (అ. ఆ. అ.) అతిశయముతో గూడినది.

చం. నినదసముద్భటస్ఫురణ నింగి వగుల్పఁగ....
భార. కర్ణ. ౩-౩౬౧.

సముద్భటించు. సం. అ. క్రి. అతిశయించు.

వ. కలకలనినదంబు గిరిశిలార్భటి సముద్భటించి
మ్రోఁగాఁరించి. సమీ. ౪-౧౭౯.

సముద్భవము. సం. వి. అ. పుం. పుట్టుక, ఉత్పత్తి; మూలము, జన్మస్థానము.

సముద్భవించు. సం. అ. క్రి. పుట్టు, ఆవిర్భవించు, కలుగు.

గీ. ఆగమంబులు నాలుగు నాననముల పరిణత
మూర్తి నవాలిత బ్రహ్మతేజ, మున మొదలుగ
విరించి సముద్భవించి. భువననిర్మాణ కర్మ
నైపుణి వహించె. మార్క. ౬౬. ౨౬.

క.... సంకల్పంబే కంకను సముద్భవించును సం
కల్పమై యచట మానసంబును నుండున్.

శివయోగ. ఉ ౧. అ ౨౧. పు;

సముద్భాసిలు (ల్లు). సం. అ. క్రి. ప్రకాశించు. ఒప్పు.

మ...మస్తం బామరద్వీపిని సరసాంధః కణమాలికా
భరణశస్తంబై సముద్భాసిలెన్.

చ. రా. ౭-౧౨.

**సముద్భూతము.** సం. విణ. (అ. ఆ. అ) పుట్టినది; ఆవిర్భవించినది.

క. జనవినుత బాదరాయణ మునీంద్ర వాగమృతనిధి
సముద్భూతాహ్లాదన కీర్తిసుధాకిరణా....
భార. ద్రోణ. ౫-౪౩౨.

**సముద్భాషించు.** సం. స. క్రి. ౧. స్తుతించు, సంభాషించు.

మ. కెలన న్మందర సిద్ధకింపురుషులుం గీర్వాణులు
న్నాగసాధ్యులు విద్యాధరకిన్నరేంద్రులు
సముద్భాషింప దివ్యాప్సరోలలనాబృంద
ము లాడ........ భీష్మ. ౪-౧౯౧.

౨. అలంకరించు.

**సముద్యమము.** సం.వి.అ. పుం. ౧. పైకెత్తుట. ౨. గొప్పప్రయత్నము చేసి శ్రమ.

క. మానుషము దుర్లభము సోపానంబగునది విముక్తి
పదము గనుటకున్ దాని,గవిలోంటిచందము,
రానీక సముద్యమమునఁ బ్రాఁకఁగవలదే.
భార. శాంతి. ౬-౨౩౪.

౩. ఆరంభము, పూనిక.

చం. దంతియు నీరువట్టున నదగ్రపుఁగోపము
సందడిఁపవర్తనంత సముద్యమం బెసఁగ దాని
పయింగవిసెన్.... భార. అను. ౧-౨౩౧.

౪. ఆక్రాంతి.

**సముద్యోగము.** సం. వి. అ. పుం. ౧. తీవ్రమైనశ్రమ. ౨. మహాప్రయత్నము. ౩. శక్తి, సామర్థ్యము.

**సముద్ర.** సం. వి. ఆ. స్త్రీ. వృక్షవిశేషము. (ZEDOARY) ! ౨. జమ్మిచెట్టు.

**సముద్రకఫము.** సం. వి. అ. పుం సొరచేపబొమిక.

**సముద్రకాంత.** సం. వి. ఆ. స్త్రీ. నది.

**సముద్రకుక్షి.** సం. వి. ఇ. పుం. సముద్రతీరము.

**సముద్రగ.** సం వి. ఆ. స్త్రీ. నది.

**సముద్రగము.** సం. విణ. సముద్రమున సంచరించునది.

**సముద్రగుఁడు.** సం. వి. అ. పుం. సముద్రమున సంచరించువాఁడు, నావికుఁడు, సముద్రగామి, సముద్రయాయి.

**సముద్రగృహము.** సం. వి. అ. న. జలమధ్యమున నిర్మింపఁబడిన వేసవివిహారభవనము.

**సముద్రచులుకుఁడు.** సం. వి. అ. పుం. అగస్త్యుఁడు.

**సముద్రనవనీతము.** సం. వి. అ. పుం. ౧. చంద్రుఁడు. ౨. అమృతము, సుధ.

**సముద్రము.** సం. విణ. (అ. ఆ. అ) ముద్రతోఁ గూడినది, ముద్రింపఁబడినది. సం. వి. అ. పుం. ౧. సాగరము. ౨. నాలుగు అనుసంఖ్యకుగుర్తు.

**సముద్రమేఖల.** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**సముద్రయోషిత్తు.** సం. వి. త్. స్త్రీ. నది.

**సముద్రసుభగ.** సం. వి. ఆ. స్త్రీ. గంగానది.

**సముద్రాంత.** సం.వి.ఆ. స్త్రీ. ౧. ప్రత్తిచెట్టు ! ౨. భూమి.

**సముద్రాంతము.** సం.వి.అ.న.పుం. ౧. సాగరతీరము. ౨. జాజికాయ ! ౩. తీఁటకసింద !

**సముద్రాంబర.** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**సముద్రారువు.** సం. వి. ఉ. పుం. ౧. మొసలి ౨. తిమింగిలము. ౩. రాముఁడు కట్టిన వారధి.

**సముద్రి (ద్రీ) యము.** సం. విణ. (అ. ఆ. అ) సాగరసంబంధి. ౨. జలసంబంధి. ౩. నౌకాసంబంధి (రూ. సముద్ర్యము)

**సముద్రుఁడు.** సం.వి.అ.పుం, ౧. సముద్రదేవుఁడు.

సముద్వాహము. సం. వి. అ. పుం. ౧. పైకెత్తుట, ఉద్ధరించుట. ౨. ఉద్ధరించునది.

సముద్వాహము. సం. వి. అ. పుం. ౧. ఉద్ధరించుట. ౨. వివాహము.

సముద్వీక్షించు. సం. స. క్రి. చూచు, అవలోకించు.

మ. దివిజాధీశు సుధర్మయన్సభస ముద్వీక్షింప భూదేవ రెండవకైలాసముఁ బోలె నున్నయది. కాశీ. ౩-౨౦౦.

సముద్వేగము. సం. వి. అ. పుం. భీతి, భయోత్కంపము.

సమున్నతము. సం. విణ. (అ. ఆ. అ) ౧. పైకెత్తఁబడినది. ౨. ఎత్తయినది. ౩. గొప్పది. ౪. గర్వము గలది. ౫. ముందుకు పొడుచుకొని వచ్చినది. ౬. ఋజువైనది, న్యాయమైనది.

సమున్నతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. పైకెత్తుట. ౨. ఔన్నత్యము, గొప్పదనము. ౩. ఎత్తు. ౪. అభివృద్ధి, ఐశ్వర్యము, విజయము. ౫. గర్వము, ఔద్ధత్యము.

సమున్నద్ధము. సం. విణ. ౧. ఉన్నతము, ఉదాత్తము. ౨. పొంగినది. ౩. నిండైనది. ౪. గర్వించినది. ౫. దురభిమానము గలది. ౬. అడ్డు లేనిది, విశృంఖలము. ౭. బద్ధమైనది, కట్టఁబడినది ౮. ఉత్కృష్టమైనది.

సమున్నము. సం. విణ. (అ. ఆ. అ) తడిసినది, తేమ గలది.

సమున్నయము. సం. వి. అ. పుం. ౧. వెలికి తున్నదండు. ౨. సమవాయము. ౩. సంపాదించుట, పొందుట. ౪. సంఘటన, సందర్భము.

సమున్నిద్రము. సం. విణ. (అ. ఆ. అ) మెలకువ గలది, జాగృతము, ప్రకాశించునది.

శా. నిత్యానిత్యవివేకశైత్యవసమున్నిద్రాంతరంగ స్ఫుటప్రత్యక్షా! పరమేశ! ........ భార. ఉద్యో. ౨-౩౩౨.

సమున్మీలనము. సం. వి. అ. న. ౧. తెలియుట, విప్పుట. ౨. వికసించుట.

సమున్మూలనము. సం. వి. అ. న. వేళ్ళతో పెకలించుట. ౨. రూపుమాపుట, నిర్మూలించుట.

సమున్మేషము. సం. వి. అ. పుం. ౧. కన్నులు విప్పారుట (గోల్కొనుటకు). ౨. వికసించుట, తెలిచికొనుట.

సమున్మేషించు. సం. అ. క్రి. వికాసముపొందు. ఆవిర్భవించు.

శా.... నృత్తం బాడుచు మృత్యుదేవత సమున్మేషించె హాలాగతిన్. శై. శ్రీరంగ. ౩-౬౧౭.

సముపగమము. సం. వి. అ. పుం. ౧. చేరిక, సమీపించుట. ౨. కలయిక, సంబంధము.

సముపభోగము. సం. వి. అ. పుం. రతిక్రీడ. మైథునము.

సముపవేశనము. సం. వి. అ. న. ౧. గృహము, నివాసము, భవనము. ౨. కూర్చుండఁబెట్టుట.

సముపవేశము. సం. వి. అ. పుం. ౧. కలసి కూర్చుండుట. ౨. వినోదపఱచుట.

సముపస్థ. సం. వి. ఆ. స్త్రీ. సముపస్థానము.

సముపస్థానము. సం. వి. అ. న. ౧. సమీపించుట, దరిచేరుట. ౨. సామీప్యము, చేరిక. ౩. సంభవించుట, సంఘటిల్లుట.

సముపస్థితి. సం. వి. ఇ. స్త్రీ. సముపస్థానము.

సముపార్జనము. సం. వి. అ. న. ౧. కలిసి సంపాదించుట. ౨. ఏకకాలమున సంపాదించుట.

సముపార్జించు. సం. స. క్రి. గడించు, సంపాదించు.

వ.... ఆ భూసురులు ....నీవు తమ క్షత్త్రియధర్మంబున సముపార్జించినయుజ్జ్వలశ్రీ సుస్థిరతం బొందెడుమని యతనికి నాశ్వాసం బొసఁగి.... భార. శాం. ౧-౩౬౬.

**సముపార్జితము.** సం. విణ. (అ. ఆ. అ) సంపాదింపఁబడినది. గడింపబడినది.

> కం. శ్రీలిపతులవలన సముపార్జిత మైనధనంబు గొలఁది ........ భార. సభా. ౧-౨౪౪.

**సముపాశ్రయించు.** సం. స. క్రి. ఆశ్రయించు, అండఁగొను.

> మ.... అతనిన్, గదుర్భక్తిన్, సముపాశ్రయింపఁగ నగుం గళ్యాణ మెల్లంగులన్. హరి. ఉ. ౪-౫౪.

> ఉ.... మహాసమాధానముతోడ సత్త్రము దక్షిణమై సముపాశ్రయించి యు, ద్దానవులు న్నుపర్వణము దన్నుఁ బ్రియంబుగఁ జూచుచుండఁగన్. హర. ౬-౧౧౭.

**సముపేతము.** సం.విణ.(అ.ఆ.అ) ౧.ఒకచోఁ జేరినది, గుమిగూడినది. ౨. చేరఁబడినది. 3. కలిగియున్నది. ౪. నివసింపఁబడినది.

**సముపోఢము.** సం. విణ. (అ.ఆ. అ) ౧. పైకి లేచినది, ఎత్తఁబడినది. ౨. పెంపొందినది, వృద్ధి పొందినది. 3. దగ్గఱకుఁ దేఁబడినది. ౪. నిరోధింపఁబడినది, నిగ్రహింపఁబడినది. ౫. పాణిగ్రహణంబుచేయఁబడినది.

> గీ. నూర్ణవీచుల సముపోఢరత్నపుష్పనికరని బిడిస మసునీరు నించి తెచ్చి యబ్ధివేలాసమాభ్యాగతాతురాతులార్థులకు నర్థిఁ బాదార్ఘ్య మాచరించు. పాండు. 3-౧౪౭.

**సముల్లసితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. మిక్కిలి ప్రకాశించునది. ౨. చక్కఁగా వికసించునది. 3. చక్కఁగా వ్యక్తమైనది ౪. వినోదించునది, క్రీడించునది, ఆనందించునది.

**సముల్లసిల్లు.** సం. అ.క్రి. ఒప్పు, ప్రకాశించు.

> ఉ. కోవిది కొండ అంగనల్ గ్రోవులు కొండు మల్లియలు నోఁగులుఁ బొన్నలుఁ జంపకంబులుం,దావియుఁ దెల్పువన్నుపుస దనువు మెఱుంగు సముల్లసిల్లఁగాన్. కు.సం. ౯-3౦౦

**సముల్లాసము.** సం. వి అ. పుం. ౧. అతిశయమైన కాంతి. ౨. అతిహర్షము, మహానందము.

**సమూఢము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ప్రోగు చేయఁబడినది. ౨. అప్పుడుపుట్టినది. 3. వంగినది. ౪. ఆవరింపఁబడినది. ౫. సంబంధించినది. ౬. మచ్చికచేయఁబడినది, శాంతపఱుపఁబడినది. శుద్ధిచేయఁబడినది. ౭. మోసికొని పోఁబడినది. ౯. త్రోవ చూపఁబడినది, నడిపింపఁబడినది. 10. పెండ్లియాడఁబడినది.

**సమూరకము.** సం.వి.అ.పుం. చూ.సమూరువు.

**సమూరము.** సం.వి.అ. పుం. చూ. సమూరువు.

**సమూరువు.** సం.వి.ఉ.పుం. ౧. తెల్లనిజాలును, లావుమెడయును మెఱుఁగెక్కిన నున్నని వెంట్రుకలును గలిగి గోధుమ వర్ణముగానైనను కృష్ణవర్ణముగానైనను ఉండెడు మృగవిశేషము. (శ. ర.) ౨. ఒకవిధమైన లేడి.

**సమూలము.** సం. విణ. ౧. వేళ్ళతోఁ గూడినది. ౨. మొత్తము.

**సమూహ.** సం. వి. అ. పుం. విచారణ, బాగుగ నాలోచించుట.

> క. వినుమీ గోమాయువు వచ్చిన యంతట నండి మనకుఁ జేసినహితముల్, గనికొనవల వదె యాతిర,మున వాఁ డిటు సేయుఁడను సమూహయు వలదే? భార. శాం. 3-౪౨.

**సమూహనము.** సం. వి. అ. న. ౧. ప్రోగు చేయుట. ౨. ప్రోగు; సమృద్ధి.

**సమూహని.** సం. వి. ఈ. స్త్రీ. చీపురుకట్ట.

**సమూహము.** సం. వి. అ. పుం. ౧. గుంపు, సముదాయము, మొత్తము,

> సీ. వదనపద్మనిధిపై ప్రాలిన యువతునో మోహాంధకారసమూహ మనఁగ. పాండు 3-౨౦౧.

సంఖ్య, ౨. శ్రేణి, సేన.

**సమూహి.** సం. వి. ఇ. సమూహము (ఇది తైవకవుల కృతులయందే ప్రయుక్తము)

ద్వి. ఇమ్ముగా నటమీఁద నిది శేషంబువకుసమ్మర్ద మెక్కుడ జాలంగఁ గలుగు.
రఘు. రా. బాలకాం. ౫౮ పు. 3౧ పం.

**సమ్మర్షము.** సం. వి. అ. పుం. ఓర్పు; సహనము.

**సమ్మహర్షము.** సం. వి. అ. పుం. పరస్పర సంతోషము.

**సమ్మాదము.** సం. వి. అ. పుం. ౧. మత్తు, ౨. ఉన్మత్తత.

**సమ్మాననము.** సం. వి. అ. న. ౧. పూజించుట. ౨. గౌరవించుట. ౨. బోధించుట, ఉపదేశించుట

**సమ్మానము.** సం. వి. అ. పుం. గౌరవము.

**సమ్మానము.** సం. వి. అ. న. ౧. కొలత. ౨. పోల్చుట.

**సమ్మానించు.** సం. స. క్రి. గౌరవించు. (శ.ర)

**సమ్మాను.** వి. నాణావిశేషము.

ఉ. శరధిం గప్పురిన్ గొనుపల్లివరికాసమ్మానుఁ దీపించు. (ఆనందముద్రణాలయప్రతిపా.)
హర. ౧-౨౪.

సోగుల న్యాఁటవిగా సామాన్లు అని పూర్వ ముద్ర. పా.

**సమ్మార్జకము.** సం. వి. అ. పుం. చీపురు.

**సమ్మార్జకుఁడు.** సం. వి. అ. పు. ఊడ్చువాఁడు.

**సమ్మార్జనము.** సం. వి. అ. పుం. ౧. ఊడుచుట. ౨. శుద్ధిచేయుట. 3. పులికాపు. ౪. భోజనపాత్రిలనుండి తుడిచివేయఁబడిన భుక్తావశేషము

**సమ్మార్జని.** సం. వి. ఈ. స్త్రీ. చీపురు.

**సమ్మాళి (గ).** వి. పాదరక్ష, పాదుక.

సీ. పాదరక్షాభిధ వరఁగును జెప్పు న, మఱకడ మ్మనఁగ సమ్మాళి యనఁగ
ఆం. భా. ౨-౫౯౭.

ఎ. గీ. మానృతమె కాని కాలుకఁ దొడుగఁబట్టి, పాయకాగ్రణిదబ్బుల ల్గాయసాగఁ, బిఁడి సమ్మాళిగలు లేక పాద మిడఁగ, భరముపడు రాజు బరిగాళ్ళఁ బఱవసాగె.
విరా. ౪-౬౩.

సీ. అట్టిటు దాఁడిగిన యంఘ్రులరత్నంపు సమ్మాళిగలు పారి జారుచుండ. కళా. ౨-౧౪.

**సమ్మాళిగతొండలు.** వి. బ. (భగవంతుని) పాదుకాసేవకులు.

ద్వి. పేరుపెంపులు పెట్టి బిడ్డలై నిన్నుఁ జేరి సమంచితశ్రీలఁ బెంపొంది, తుదిని సమ్మాళిగతొండలై యుండి, బ్రదుకంగఁ గోరు నీపరిచారజనులె యీవిధంబుల ద్రోహ మేల సేసెదరు? ద్వి. పరమ. 3-౨౧౨.

**సమ్మితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. కొలవఁబడినది. ౨. సమానమైన పరిమితి కలది. 3. సమానమైనది. ౪. కూడినది.

చ .... అవ్యనుమతీశ్వరుఁ దద్దినశేషయామినిల్ చతురమ భక్తియుక్తమును సంభ్రమదంబునుఁగా నయించె సమ్మితమ్ముదుపారభాషణసమీరణతం దదుపాంతివర్తి రై.
భార. శాంతి. ౬-౨౩౦

౫. సమానప్రాధాన్యముకలది.

**సమ్మితము.** సం. వి. అ. న. ౧. దూరము.

**సమ్మితి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సమానముచేయుట. ౨. పోలిక.

**సమ్మిశ్రము.** సం. విణ. (అ. ఆ. అ) ఒండొంటితోఁ గలుపఁబడినది.

**సమ్మిశ్రణము.** సం. వి. అ. న. కలపుట.

**సమ్మిశ్రితము.** సం. విణ. (అ. ఆ. అ) ఒండొంటితోఁ గలుపఁబడినది.

**సమ్మిశ్రుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**సమ్మీలనము.** సం. వి. అ. న. ౧. ముడుచుకొనుట. ౨. కప్పుట. ౩. పరిపూర్ణగ్రహణకాలము. ౫. నిష్క్రియత్వము.

**సమ్ముఖము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ఎదురుగానుండునది. ౨. ఎదుర్కొనునది. ౩. అనుకూలమైనది. ౪. తగినది.

**సమ్ముఖము.** సం. వి. అ. దర్శనము, సన్నిధి.

ద్వి. ఇది యెంతపెద్ద నా కిందీవరాక్షి, ముదమున నాకు సమ్ముఖ మిచ్చిచూడు.
పండితా. ౧౧౪.

**సమ్ముఖి.** సం. వి. ఈ. పుం. అద్దము.

**సమ్ముఖీకృతము.** సం. విణ. (అ. ఆ. అ) గురిపెట్టఁబడినది.

**సమ్ముగ్ధము.** సం. వి. అ. పుం. ౧. మూర్ఛనొందినది. ౨. కలఁతనొందినది. ౩. అందమయినది.

**సమ్మూఢము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. స్మృతి తప్పినది. ౨. మూర్ఛమైనది. ౩. కలత నొందినది. ౪. అవ్యవస్థితమైనది. ౫. బ్రద్దలయినది.

**సమ్మూర్ఛజము.** సం. వి. అ. పుం. గడ్డి.

**సమ్మూర్ఛనము.** సం. వి. అ. న. ౧. మూర్ఛనొందుట. ౨. అంతటను వ్యాపించుట, అభివ్యాప్తి. ౩. దట్టమగుట. ౪. కలయిక.

**సమ్మూర్ఛనోద్భవము.** సం. వి. అ. పుం. ౧. చేప ౨. చేపవంటి వంటి జలచరము.

**సమ్మూర్ఛము.** సం. వి. అ. పుం. ౧. ఆధిక్యము ౨. వ్యాప్తి.

**సమ్మెట.** = సంబెట. వి. (క. చమ్మట్టిగె. త. మ. చుట్టి తు. చమటిగె.) ఇనుమును సాఁగఁగొట్టు పెద్ద సుత్తి, కమ్మరివని ముట్టు.

ఎ. గీ. కంబళి చెలంగు సంబెల సమ్మెట యన నల్పమై యున్న సదసుత్తి యగుఁదగు హర!
ఆం. భా. ౧-౨౯౦.

ఉ. సొమ్ములఁగొన్న పుచ్చుకొని వోక్క శరీరము వాని కాలుచే, సమ్మెటపేటులం బడక సమ్మతితోడ మరికిచ్చి చెప్పెనే, బమ్మెరపోతరాజొకఁడు. భాగ. ప్ర. స్కం. ౧౩.

చం. ఇనుమునుబట్టి యగ్ని నలయింపక సమ్మెట పోటు భాస్కరా! భా. శ.

**సమ్మెట.²** సంబెట. వి. కశ; చబుకు; కొరడా.

వ. అరదంబును డిగ్గవిడిచి యపసరణంబుగా సందడి సదంగిపోయినం గలంగి రాజన్యులందఱు సమ్మెటలు వెట్టి గుఱ్ఱంబులం దోలియు సంతకంబు గాని యేనుంగులం దఱిమియు.
హరి. ఉ. ౧-౧౩౬.

సీ. వాని యశ్వబలముఁ దెలిసమ్మెటలను వేయుకోలల ద్రోసి యంకుశంబుల నాఁటి యతి రయమున వాహనంబులఁ దోలువారును.
భార. భీష్మ. ౩-౨౩౪.

వ. అమాత్యపుంగవుం డగు సత్యకీర్తి కదియం జనుదెంచి కరసరోజంబు పట్టి సమ్మెటం దోలంగొందిగిచి పోనైచి మఃంబునం గారుణ్యంబు పూరించి నిలిచె. హరిశ్చం. ౨-౧౨౯.

**సమ్మేల (ళ) నము.** సం. వి. అ. న. కూడిక, కలయిక, గుమికూడుట.

**సమ్మోదము.** సం. వి. అ. పుం. ౧. అధికమైన సంతోషము.

కం.... తూర్యవ్రాతంబు మెఱఁగ సమ్మోదాతిశయము వొందె... భార. కర్ణ. ౩-౩౬౭.

౨. వాసన.

**సమ్మోదించు.** సం. అ. క్రి. సంతోషించు.
(రావణుఁడు) .... సమ్మోదింప వచ్చుం డిలన్.
భాస్క. రా. యు. ౨౨౭౦.

**సమ్మోదికుఁడు.** సం. వి. అ. పుం. మిత్రుఁడు.

ద్వి. వసగొని సకలభక్తసమూహము చూడ.
బస. పురా. ౨౦౫ పు. ౨౬. పం.

కం. వారక కలహంసావలి భోరన నఱ్ఱులని
తెలిఁగి పాలు పటురె మహాంభోరాశి తెలిమి
తెలియఁగెడు శారదనీరదసమూహిచాడ్పునఁ
బోలెన్. కు. సం. ౧౦-౨౦.

ద్వి. భక్తసమూహికి బసవయ్యమహిమ వ్యక్తి
గాఁ జెప్పంగ నట్ల చే వింటి.
బసపు. ౫౨ పు. ౬౪౭. పం.

**సమూహ్యము.** సం. వి. అ. పుం. ౧. యాగాగ్ని యం దుపయోగింపఁదగిన పేరు ౨. ఉపచాయ్యము.

**సమృద్ధము.** సం. విణ. ౧. పెంపారునది, వర్ధిల్లునది, పెఱుగునది. ౨. సుఖము గలది, పుష్కలమైనది. ౩. ఐశ్వర్యముగలది, సంపన్నము. ౪. అతిశయముగా గలది, నిండుగాఁగలది. ౫. ఫలవంతమైనది, సఫలము. ౬. బాగుగాఁ బెరిగినది, పెంపొందినది. ౭. పూర్ణము, సర్వము ౮. వలసినంత మెండైనది.

**సమృద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పెంపు, పెఱుగుదల, వృద్ధి.

ఉ. జ్ఞాతుల నమ్మి తోడుకొని శత్రులనోర్చి
యహీనరాజ్యముం బ్రీతియొలర్పఁ జేకొనిన
పిమ్మట సౌఖ్యసమృద్ధితో షితజ్ఞాతివి
కాయుఁడై మది నజ్రసమా నమ్మక సర్వసం
యుతంబై తనగారు రమ్యనిలయంబున
నున్నటు లుండగాఁదగున్.
భార. శాంతి. ౩-౨౬౯.

౨. సంపన్నత, ధనికత్వము. ౩. సంపద, ఐశ్వర్యము. ౪. పుష్కలత, పుష్టి, నిండుదనము. ౫. అధికారము, ఆధిపత్యము.

కం. అతనిరాజ్యంబున సుర్వీతలము ప్రజాసమృద్ధి
దెలసి.... భార. ఆది. ౪-౯

**సమృద్ధుడు.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. మిక్కిలి సంపద గలవాఁడు. ౨. నిండు గలవాఁడు. (శ. ర.)

**సమేతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. కూడుకొన్నది.

వ. పాండవులు .... ధృతరాష్ట్రవిదురసర్వభరత
భార్యాసమేతంబుగా నచ్చట మాస
మాత్రంబు నిలిచిరి. భార. శాంతి. ౧-౨.

శా. ఆ క్షీరోత్సాహసమేతులై రయమునన్
భార. ఆది. ౨-౧౨.

౨. ప్రోగుపడినది. ౩. కలుపఁబడినది, కూర్పఁబడినది. ౪. చేరవచ్చినది, సమీపించినది. ౫. అనుసరింపఁబడినది. ౬. ఎదురైనది, తారసిల్లినది. ౭. అంగీకరింపఁబడినది.

**సమేధితము.** సం. విణ. (అ. ఆ. అ) బాగుగాఁ బెంపఁబడినది. ౨. బలమైనది, సుపుష్టమైనది. ౩. సంఘీభూతము, ఏకీభూతము.

**సమేల (ళ) ము.** (సం. సమ్మేళనమ్) వి. ౧. కలసినది, జతగూడుట, చేరిక, గుమి.

ఉ. మేలము లాడువేళల సమేలములై చెలు
లెల్లఁ గూడి యా, బాలిక శ్రీ నృసింహ
నరపాలు వరించెదవే యటన్న.
నరసభూ. ౩-౧౪౭.

ద్వి. పర్విన యుత్సవపదఁకు లేమాదు,లు......
మెలగుచుండుదురు సమేలఁబుతోడ.
ద్వి. పరమ. ౧౨ పు.

వ. ఆ, లీలావతివిలోచనంబులంబోలయు లజ్జా
విజయదరహాసంబులకుం దనమేలంబునుం
గరుణయు సమేళఁబున నెమర్కొన.
ఉ. హ. ౨-౭౩.

౨. ఒద్దిక.

సీ. అలవోకగా వచ్చి యప్పటప్పటికి సమే
లంపుమాటల మేలమాడు.
వి. పు. ౫ ఆ. (శ. ర)

**సమేల (ళ) ము.** విణ. కూడినది, కలసినది.

ఉ. మేలిపసిండిగాజుల సమేళపుఁబచ్చలకల్కు
డెంపుడా, కేలు మెఱుంగుగబ్బిచనుఁగ్రేవకుఁ
దారుచు.

**సమోదకము.** సం. వి. అ. న. సగముచల్లయు సగము నీరును గలిపినది; సమముగా నీరు గలిసిన మజ్జిగ.

**సమోదకము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. మోదకములతోఁ గూడినది. ౨. సంతోషముతోఁ గూడినది.

**సమోపమ.** సం. వి. ఆ. స్త్రీ. ఉపమాలంకార విశేషము.

**సమ్మంత్రణము.** సం. వి. అ. న. ఆలోచించుట.

**సమ్మతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సమ్మతి యైనది. ౨. ప్రియమైనది. ౩. మిక్కిలి గౌరవింపఁబడినది. ౪. సహితమైనది.

**సమ్మతము.** సం. వి. అ. న. ౧. అంగీకారము, ఇష్టము.

తే. ఇద్ధరాధోగ్రిఁ గ్రేపుల నెలమిఁ దేర్చి పితికి
కానుఁ దని పనిచె సమ్మతము మిగుల.
హరి. పూర్వ. ౧-౧౩౧.

౨. అభిప్రాయము.

**సమ్మతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. అంగీకారము.

ఉ. సమ్మోటపోటులం బడక సమ్మతి శ్రీహరి
కిచ్చి చెప్పె.... భాగ. ౧-౧౧.

౨. అభిలాష.

సీ. కేలు మొగిడ్చి యొద్దాని నెరుగుట యెఱుకల
కెల్లను వెక్కుడని సభక్తి సమ్మతిఁ బ్రార్థించి
యడిగిన .... భార. అను. ౧-౧౬౩.

౩. ఆత్మజ్ఞానము. ౪. గౌరవము. ౫. ప్రేమ.

**సమ్మతించు.** సం. అ. క్రి. ఇష్టపడు, అంగీకరించు. (√ సమ్మతి)

చ. అనవుడు నట్లకాక యని యా వరకాయకుఁ
డాత్మ సమ్మతించిన ... మార్కం. ౮-౨౬.

తే. వీరువడిరను పలుకులు వింపగాక, శకుని
కర్ణ దుశ్శాసనుల్ సమ్మతింప.
భార. ఉద్యో. ౨-౧౫౬.

గీ. పృథ్వ్యాదిపంచభూతసంఘంబున ఘటింప సిద్ధ
పడుఁ గాని కరనఖశిఖరలిఖితజాత సూత్రనక్ష
త్రాంకముల్ సమ్మతించు....పాండు. ౩-౧౨.

**సమ్మతిలు** (ల్లు) అ. క్రి. ఇష్టపడు, సమ్మతించు, ఇష్టపడు.

తే. కమ్మవిలుకాని యమ్ముల కుమ్మలించి, సెమ్మి
సే వేద నెమ్మది సమ్మతిలక, బొమ్మనియె...
అహల్యాసం. ౨-౪౨.

క. అని తాత బోధసేసిన, పనికిన్ సమ్మతిల
కతఁడు ప్రత్యాఖ్యానం బొనరించెన్....
ఉ. రా. ౨-౨౨౬.

**సమ్మతిపత్రకము.** సం. వి. అ. న. సభ్యాధికారి సమూహ మొసంగిన తీర్పు.

**సమ్మత్తము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. అధికముగా మదించినది. ౨. సంతోషవివశమైనది. ౩. మదావస్థలో నున్నది.

**సమ్మదము.** సం. వి. అ. పుం. ౧. అధికసంతోషము. ౨. సౌఖ్యము. ౩. ఆనందము.

ఉ. సమ్మదమంది చూచిరి ధృతంబుగ భూజను
లెల్లఁ బ్రహ్మతేజమ్మును. భార. సభా. ౧-౨౮౪

క. ప్రక్షీణదర్పు ద్రుపదు రథాక్షముతోఁ గట్టి
తెచ్చి యర్జునుఁడు ప్రియా, దక్షుం డయి
గురునకు గురుదక్షిణగా నిచ్చి చేసెఁ దత్స
మ్మదమున్. భార. ఆది. ౬-౮౪.

ఆ. సభ్యులెల్ల నదితసమ్మదు లయిరి దుశ్శాస
నుండు వస్త్రచయము పర్వతోపమానమయిన
నొలువంగ నోపక. భార. సభా. ౨-౨౩౧.

**సమ్మదించు.** సం. అ. క్రి. సంతోషించు.

క. అనుచుం బల్కి మహేలా, వనమునకుం బక్షి
విభుఁడు వరుణుని పురికిం, గొనిపోయి సమ్మ
దించుచు, వననిధిమధ్యంబు చొచ్చి వనజద
ళాక్షున్. ఉ. హరి. ౬-౨౪౪.

**సమ్మర్దనము.** సం. వి. అ. న. సమ్మర్దము.

**సమ్మర్దము.** సం. వి. అ. పుం. ౧. ఒరయిక, ఒరపిడి. ౨. గుంపు. ౩. పోరాటము. ౪. శత్రువుల నెదుర్కొనుట. ౫. త్రొక్కుడు.

**సమ్మోహకము.** సం. విణ. ౧. కలవరపొందిం చునది, ౨. ఆకర్షకమైనది.

**సమ్మోహనము.** సం. వి. అ. స్త్రీ. ౧. ఆకర్ష ణము. ౨. ఆయుధవిశేషము.

**సమ్మోహనము.** సం. వి. అ. పుం. మన్మథుని పంచబాణములలో నొకటి.

**సమ్మోహిని.** సం. వి. ఈ. స్త్రీ. మాయ.

**సమ్మోహము.** సం. వి. అ. పుం. ౧. కలత. ౨. మూర్ఛ ౩. అజ్ఞానము ౪. సంక్షోభము. ఆకర్షణము.

**సమ్యక్ప్రయోగము.** సం. వి. అ. పుం. సరియైన ప్రయోగము. ౨. సరియైన ఉపయోగము.

**సమ్యక్పాఠము.** సం. వి. అ. స్త్రీ. సరియైనపాఠము.

**సమ్యక్స్థితి.** సం. వి. ఇ. స్త్రీ. కలిసియుండుట.

**సమ్యగ్దర్శనము.** సం. వి. అ. న. అంతర్దృష్టి.

**సమ్యగ్జ్ఞానము.** సం. వి. అ. పుం. (సమ్యక్ + జ్ఞానము) సరియైనజ్ఞానము.

**సమ్యగ్వృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. స్థిరమైన అభ్యాసము. ౨. సక్రమవిధినిర్వహణము.

**సమ్రాట్టు.** సం. వి. జ్. పుం. చక్రవర్తి.

శా...శ్రీగోవిందుఁ దంభోజినీ, మాధుర్యంబున
కగ్గలించు నళిసమ్రాడాకృతిం గైకొనున్.
పాండు. ౩-౨౦౩.

రాజరాజై రాజసూయయాగము చేసినవాఁడు; పతికోట్లకర్షముల వార్షికాదాయము గల వాఁడు.

**సయాట.** = సయ్యాట. వి. పరిహాసము.

ఉ. మానులమై ననుగ్రహము మైత్రి మనోర
థుఁడై రమాయుతిం, బాలిశాకరంబున
సయాటల నాటలఁ బాటలన్ దయా,
ధీనుఁడు... శ్రీరంగ. ౫-౪౪.

**సయికము.** = సైకము. వి. సూక్ష్మదృష్టి.

తే. కలహశీల రాక్షసి సయికంబు లేదు, బొంకు
వలుకు చెప్పుడు నిద్రబోవు.
భార. అను. ౫-౨౪౪.

**సయూథ్యుఁడు.** సం. వి. అ. పుం. ఒకేజాతి లేక తెగకుఁ జెందినవాఁడు.

**సయోని.** సం. విణ. ౧. సహోదరము, ఏకగర్భ జనితము. ౨. దగ్గఱసంబంధముగలది, పోలినది.

**సయోని.** సం. వి. ఇ. పుం. ౧. సహోదరుఁడు. ౨. ఇంద్రుఁడు. ౩. అదకత్తెర.

**సయ్యాటము.** = (సయాట) వి. సహక్రీడ, క్రీడ.

సీ. ఆమనితోడి సయ్యాటకై యచ్చోటి కరు
దెంచి. యయా. ౩-౪౨.

క. కయ్యమునఁ దార్చి యనంగుని, సయ్యాటపుఁ
జిట్టకంపుఁ జదురుల కపుడా, యయ్య
దొరకొని .... రామా. ౪-౧౬౧.

౨. పరిహాసము.

శా. అంగోద్వర్తనవేళ నీవు దరహాసాంకూర
ముల్ లోచనా పాంగప్రాంతములం దిగుర్ప
నొక సయ్యాటంబు కల్పించి....
కాశీఖం. ౪-౧౦౩.

క. అయ్యా వగ పేటికి నే నియ్యెడ నిద
యున్నదాన నిర్విభుడు ననున్ జెయ్యమునఁ
దెచ్చెనిట్లొక సయ్యాటపుమాయ చెదరు
పనుదెంచి వెసన్. పర. ౪-౧౧౫.

ఉ.....వ్యాళకన్యక కెం, గేల నొసంగఁ
గైకొనియె సయ్యాటంబు వాటిల్లఁగన్.
విజ. వి. ౧-౧౪౧.

**సయ్యాటించు.** అ. క్రి. (√ సయ్యాట) పరిహసించు

శా. ఆ మందోద్భవభీతషుందరుచి సయ్యాటించు
చున్ మక్షికా, స్తోమం బాలకపక్షగుచ్ఛ
ముగుచున్ దోలరఁగా....పాండు. ౪-౨౫౪.

సయ్యొద్ద. వి. (సయి + ఒద్ద) చేరిక.

(వారు మిక్కిలి సయ్యొద్దగా నున్నారు ఇది సయ్యాద్దె అని వాడఁబడుచున్నది. శ. ర)

సరంగము. సం. వి. అ. పుం. ౧. నాల్గుకాళ్ళ జంతువు. ౨. పక్షి.

సరంగు. వి. ఓడనడిపించువాఁడు, నావికుఁడు (శ. ర)

సరంజాం. హిం. వి. సరకులు, సామాను.

సరండము. సం. వి. అ. పుం. ౧. పక్షి. ౨. స్వేచ్ఛాచారి, త్రిమ్మరి. ౩. బల్లి ౪. మోసకారి. ౫. ఒక విధమైన యాభరణము.

సరంతీలు. వి. బ. వస్త్రవిశేషములు.
రగడ. కాంతితతి వెదచల్లఁగల్గిన సరంతీలు, దుద్దుకంబళ్ళు చందువలు తివాచీలు.
హంస. ౫-౩౫౬.

సరంబీ. అన్య. వి. బల్లకూర్పు. (శ. ర)

సరకట్టు. వి. వీణాసోపానము, వీణమెట్టు. (సం. స్వరము, క. సర.)

వ. వెత్తిసారకాయఁబుఱ్ఱలం గట్టిన సరకట్ల కిన్నరలు మెఱయ మొరయించు మ్లేచ్ఛుల పాటల తానమానంబులును. కాశీ. ౩-౩౬.

సీ. తరుణాంగుళిచ్ఛాయ దంతపుసరకట్టు లింగిలీకపు వింతరంగు లీన. మను. ౧-౫.

సరకము. సం. వి. అ. పుం. అవ. ౧. తిన్నని మార్గము లేక వీధి ౨. పారాయణము. ౩. సురాపానము. ౪. సురాపానపాత్రిక. ౫. సురను పంచిపెట్టుట.

సరకము. సం. వి. అ. న. ౧. గమనము, పోవుట. ౨. చిన్నసరస్సు ౩. స్వర్గము.

సరకారు. వి. (హిం. సరకార్) సర్కారు, ప్రభుత్వము.

సీ.... తెల్లతెం, డా నవుబత్తున ధక్కి యాడి, గలిగిరాజచిహ్నా లొసంగఁబడె నుత్తరపు సరకారులందవుడు. రంగా. ౧-౧౧౬.

సరకు. వి. (క. తు. త. సరక్కు, మ. సరక్కు) సామగ్రి, వస్తుసముదాయము, వస్తువు.

సీ. సరకు మాఁదవవాఁడు మరల నీఁదలఁచిన వెల వదేశవపాలు విడువవలయు.
విజ్ఞా. ప్రా. కాం. ౩౦.

క. సరకుల భారవహులకును, భరియింపఁగఁ గొలఁదిరైనభంగిని మోపుల్ వెరవుపడఁగఁ గట్టుఁడు. భార. మౌస. ౧-౧౩౨.

క. కాకపు రకులఁ బోఁకలు వాకలు గొంగళ్లు దుడుపుటంబరములు కుం,దీకాలాగురువుల్ గానఁ, గైకోనఁ బ్రియమయ్యె శేతకాఁ నందున్. శేం పంచతం. ౧-౬౪౧.

"తమకు గొనిసన్న సరకు లెంతయును బత్తి నప్పనము చేసి, నీలా. ౨-౫౧

క. సరకుఁడు యాగంబులకున్ జొరకుఁడు మీరమును బుఱ్ఱిజాల నదమేటయున్, సరకుల మాటాడుటయును వరకులకన్యకలఁ బట్టి వాఁడేగుటయున్. ఉ. హ. ౧-౧౧౦

౨. అమ్మదగినవస్తువు.

తే. గూనివాడును బచ్చుకొనుటు గుజ్జుఁ గొలుచు లమ్మఁ జొఁ గ్రచ్చులు గలిపి సరకు మాఁచి పెట్టెడు చోటులఁ దూన్కి దరవు.
భార. అను. ౫-౧౦౪.

సీ. సరకు సంకట మగు నగుడు బట్ట్యద్రవ్య మమరు.... ఆం. భా. ౨-౨౪౫ (వారి)

మ. భువనసౌభాగ్యవిభవమ్మునీ జలధి వీఁక నెన్నవలె నీడ దోఁప తెలంతిల్ వణిగాకృతిన్ సరకు మార్పన్. ఆము. ౨-౧౨.

౩. సొమ్ము.

క. విను వట్టనకఁ ధను లగు, జనములు నిక్షేప మిడినసరకులు దొంగబా,ణుల సుగుణ నీక పెరమిడి. భార. అను. ౫-౧౦౯.

ద్వి. చంద్రుని ధరియించి సద్భక్తి గొలిచి, చంద్రశ్వ మది దనసరకుగాఁ బడసె.
పండితా. దీక్ష. ౧౯. పు.

సరకు.౨ వి. లెక్క; లక్ష్యము.

క. ఏ నలిగినవారిని నుర, లైనను రక్షింప నోప రమరు లలిగినం బూని చెదకుండఁ గాతును, మానవు లొక సరకె నాకు మనుజాధీశా.
భార. ఉద్యో. ౨-౨౬౩.

క. చని యాజసార్థనుని చే, ఘనమగు లవణంబు మనకుఁ గప్పమగు మే, ధనములును సరకు గావు.
ఉ. హరి. ౪-౧౩౪.

ఉ. ఏకమనస్కులై నిగుల మెండును లేక విరక్తధర్మలై, త్యాగరులైన వానినొకసందున డెందమునఁ జొచ్చి చించి కల్, కాఁకలు సేయునీకు మహిళాసమాచార దృఢావివేకు ని. ఖ్యాతుఁబరాభవించు టనఁగా సరకా నరకాంతకాత్మజా! వై(శ్రీరంగ. ౨-౨౬౬.

క. చిరజీవము మానావమును, సరకే మా కొకటి యిష్టసంచారము మై, నరుగక మీరట నాపినఁ బరిభవముఁ బొంద నాపఁబడితిమి మీచేన్.
కేయూర. ౩-౧౦౨.

ద్వి. భరతుని దస నాకుఁ బ్రాణంబులైన, సరకు గా వనియు రాజ్యము నాకు సరకె.
రం. రా. అయోధ్యాకాం. ౯౭ పు. ౯ పం.

సీ. లావునను గూడి పాణిపల్లవయుగమున నొత్తి పట్టిన సరకుగా కుల్లసమున హార కాంతిచ్ఛలంబున నల్ల నవ్వఁ, దరుణి చన్నులు రాజచిత్తము హరించె.
శృం. నై. ౭.౧౭౯.

ద్వి. అరు దగు లింగసముద్భవుల యిండ్ల వరవుద నానొక సరకె యర్థంబు.
బస. పురా. ౪౪. పు. ౨ పం.

క. మనజాలు పాండుతనూజాలు, జననాయక నాకు నొక్కసరకె తలఁపన్.
భార. కర్ణ. ౧.౨౪౧.

క. హరిహార కమలభవాదుల, సరకుగొనక గెలుచు నీకు సామాన్యమునే, శ్వరులను జయించు టనఁగా, సరకా నరకాంతకాత్మ సంభవ తలఁకక.
చిత్రభార. ౨-౭౮.

సరకుగఁజూచు. క్రి. సరకుసేయు.

సరకుగాఁగొను. స. క్రి. లెక్కసేయు, లక్ష్యపెట్టు.

ఉ. నూన్నెల మూఁడి బన్నములు మూడక లోన సదంచి నట్టి కో, పానల మెండియున్న నిలి డాటవిపైఁ బచరించు తీవ్ర, దావానలుఁబోలి శాత్రవచయంబు సయింగవియించి నిల్చినం, గాని యుధిష్ఠిరున్ సరకుగాఁగొన రా ధృతరాష్ట్రనందనుల్. భార. ఉద్యో. ౨-౧౩౭.

క. శిసుమునుమునుఁ గవలును దో, డన యురవడి నదరి పొదువుటయు నగ్గలికం, బెనఁగొ నతండా నలువుర కనలుఁ గదంకయును సరకుగాఁగొన కధిపా! భార. శల్య. ౧-౨౦౩.

చ. అనికి బలారి వచ్చినఁ బురారి గణంబులఁ దానుఁ బన్నినం, గినిసి కదంగి క్రీడియును గృష్ణుఁడుఁ దాఁకిన నీజయింతు మా,ర్కొని యనుచుండుదున్ సరకుఁ గొందునె ద్రోణునిఁదోడి యోఘులన్.
భార. ద్రోణ. ౨-౧౫.

సీ. కుల మొక్కఁడైనఁ దెకువ లేక బుద్ధియుఁ గార్యంబుఁ దెంపును సరకుఁగొనక.
భార. శాం. ౩-౪౦౭.

తే. గీ. తనవెనక క విభీషణుఁ దలఁగఁ దిగిచి, తూఁటియాసతిపైఁ జెక్కుతూపు లేయ, సరకుగొన కది నిగిడి యబ్బురముమగని త్రొమ్ము గాఁడిన ద్రెళ్ళి నే పొమ్మ సిల్లె.
ఆ. రా. యుద్ధ. ౩౭౭.

చ. సరకుగొనండు నన్నుఁ దన చాయలవారి నదంచె మున్పురందరవిభు సద్మనేయక యితండని రాఘవుశాలి జాలి మున్నరకకుఁ దచ్చు పోలిక. చంపూరా. ౬-౫౨.

క. అనుపలంతులు విని దుశ్శాసనుఁ డేమియు సరకుగొనక సమదవిలాసానుఁడై విజాగ్రజన్ముని గనుగొని యిట్లనియె గాఢగర్వస్ఫూర్తిన్. భార. విరా. ౩-౯౪.

ఆ. కడిమి మెఱయఁగఁ బోరు త్రిగర్తనాథు,
రథముఁ గనుఁగొని కదఁగి విరాటవిభుఁడు,
వరవునకు నల్గినట్టుల సరకుఁ గొనక, యతుల
రథసాతిరేకత నతనిఁదాకె.
భార. విరా. ౩-౧౭౫.

క. గురుఁడను జలనిధి, గదచితి, నొరులు దలం
పంగ రాకు నలిగాలుద లీ, నరపతుల సరకుఁ
గొన నీ వరదము సనవిమ్మ నేఁటి యని కల
యకుమీ. భార. ద్రోణ. ౮-౬౩.

ఉ. రాజను విద్యలు వచ్చునంచు నేఁ, గ్రొవ్విన
విప్రులన్ సరకుఁ గొక తిరస్కరణంబు చేసి
నన్. వరాహ. ౪-౭౮.

చ. తిరిసినకూడు దచ్చి నలుదిక్కుల బోదలు
తిండి పెట్టఁగా బెరిఁగిఁ పొట్టలోఁద నొకపీఁట
పయిం దొరవోలె నెవ్వరన్ సరకుగొనందు
పట్టుకొని వాఁగఱగొన్న బలే రయిఱుంగుఁడ,
క్కరి బలుమోవు మోము సయగారి తనం
బది యట్టిగట్టినన్. ఉ. హరి. ౮-౮౬.

క. పురి వప్రఖచితమణిగుణ, సురుచిర దీధితుల
వలన సొరిదిని దివియల్, సరకుఁకొన రెట్టి
రాత్రులఁ, గర మరు దప్పురముఁకోట కావలి
వారల్. విక్ర. ౧-౬౬.

వ. ప్రతికూలమారుతంబు లెదుగుకొన సరకు
గొనక పశ్చిమోన్ముఖుండై పంక్తిముఖుండు
తిత్తటినీతటంబునన్ జని చని.
ఉ. రా. ౩-౨౨౭.

తే. అరిగె సమచ్ఛదముగ రాజాన్వయమువి,
తనము దుఃఖవిరహ వర్తనలు నరకుఁగొనక
సమవర్తితనయుండు జనకుఁ డేలుపురమున
కరాళగతి వాని సరళసరణి. రాఘు. ౨-౨౫.

సగకుఁగొను. అ. క్రి. లక్ష్యపెట్టు.

రగడ. కొండ లగ్గల సరకుగొనని పేరాయలును
పి. కవం. ౩-౨౨౫.

సరకుసేయు. ద్వి. స. క్రి. ౧. లక్ష్యపెట్టు,
సరకుగొను.

క. ఇలఁ గ్రీడగఁ బుట్టిన వీ, రలఁ గేవలమర్త్యు
లని సరకుసేయ ని వ్వారలు గెడుదు రతిఁగిఁ
భక్తిం, గొలిచినవారలకు శుభ మగుచు విను
డెందున్. భార. భీష్మ. ౨-౨౪౧.

వ. గర్వోన్మత్తుండును గావున జనసమూహంబు
సరకుసేయక .... భార. విరా. ౨-౧౨౪.

ఆ. సరకుసేయ వను చద్దమాటలు గొన్ని యాడి
నంత కేమియయ్యె నింద్ర!
భార. శాం. ౮-౨౮౭.

సీ. అతఁడు త, న్మహిమ పెంపు నరాతి మత్సర
విధి, శాస్త్రలో సరకుసేయక సంభ్రమించె.
రాఘు. ౨-౩౨.

౨. గణించు, ప్రేమించు.

సీ. కామరూపంబు మనంబునఁ జిక్కనతరుణి
ద క్కొరగు కేలసరకుసేయు.
భార. విరా. ౨-౩౫౫.

సగగు. క్రి. విశే. ద్రా. (సం. ప్రాక్.) త్వరగా,
వేవ్వన.

సీ .... వెన్నునిచెంత క గి చాగిలి మ్రొక్కి సరగ
లేచి. నీలా. ౧-౪౦.

క. ఒలధిన్ రఘుపతి కగఁణన్, జలధిం గానీక
కాచి సరగఁదదాజ్ఞన్, నలుచే రిపువైన్య
దవా, నలుచే సేతువు ప్రియంబునన్ గట్టిం
చెన్. ఉ. రా. ౧-౧౨౩.

తే. సకల భూజము కెక్కలో సరగఁజేసి.
శృం. నై. ౬-౮౬.

వ. మహోరగంబులు సరగ నరుగఁగూడక.
ఉ. రా. ౩-౪౭.

వ. సత్యధర్మ మహీకాంతుండు సరగ నగరంబు
నలంకారింపంబనిచె. విక్ర. ౪-౪౩.

సరగు. వి. వేగము.

క. మనవాఁడె సంద్రుఁడు చె, ప్పిన మాటలు
వింటిరింకఁ బిఱుతికమల్ల, గొనివచ్చి కట్ట
కట్టుఁడు, తనకలయుమ్ గదలిదాఁటి సరగున
మనకున్. యయా. ౩-౩౩.

చ. ఒక్కవరాహమేఁగెఁజే, వకళిమినవ్వు డా
రెయిఱుకువాం(ద దరింపులకేమి సద్దసే, యుక
తన యిచ్చగా సరగున న్విడివడ్డమకేథమా
యసన్. సారంగ. ౧-౯౪.

క. తరుణులు తఱుములు పెట్టుచు, సరగునఁ దో
తేరఁ దెలియఁ జాలినమతిఁ ద, త్పురమును
జేరు పెతెంగినఁ, బరితాపము కొంత డిందు
పడదే నాకున్. రాజశే. 3-౯౬.

క. హారిగిరి ధరించి యిటువలె, సరగున జన
గరుడు వెంటఁ జనరేశసురా, సురుల ....
దశా. ౨-౧౭౫.

సీ. శరణాగతుండయి సరగునఁ ద(దామఘన
ఘృణార్ణవమున మునుఁగఁ బట్టి, కొనిపోయె.
రాఘ. 3-౧౧౯.

సరఘా. సం. వి. ఆ. స్త్రీ. తేనెటీఁగ.

సరజ. సం. వి. ప్. స్త్రీ. రజస్వల.

సరజము. సం. వి. అ. న. సద్యోత్పన్నవెన్న.

సరజస. సం. వి. అ. స్త్రీ. రజస్వల.

సరజస్క. సం. వి. అ. స్త్రీ. రజస్వల.

సరటము. సం. వి. అ. పుం. ౧. వాయువు. ౨. బల్లి. 3. తొండ. (శ. ర)

సరటి. సం.వి.ఇ.పుం.౧.వాయువు. ౨. మేఘము.

సరటువు. సం.వి.ఉ.పుం. ౧. బల్లి. ౨. తొండ.

సరడు. వి. భూషావిశేషము; స్త్రీలు మెడలను దాల్చుబంగారు అల్లిక తీగ. (శ. ర)

సరణము. సం. విణ. నడచునది. కదలునది, (ప్రవహించునది.

సరణము. సం. వి. అ. న. ౧. నడచుట, సాగిపోవుట, పారుట. ౨. ఇనుము. (సువ్వు.

సరణి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. త్రోవ, మార్గము, వరుస.

కం.... బదరీశరమండమండలాంతరసరణిన్ ధరణీ
సురుండు .... మను. ౨.

౨. తీరు,రీతి,విధము. 3. బుజారేఖ, ౪. తిన్నని గీత. ౪. ఒకవిధమైనకంఠరోగము.

(విధము) వీనికీయర్థమాంధ్ర గ్రంథములందు మాత్ర మగపడుచున్నది)

తే. శిబి తెలుంగున మాంధాతృ చెలువమున
యయాతిరీతి దిలీపు మర్యాద రంతి, సరణిఁ
బాలించి యలరు నా చక్రవాళ, వసుమతీ
చక్ర మమ్మహీవల్లభుండు. శుక. ౧-౧౦.

గీ. చక్రవర్తుల భాతిని సద్గుణముల, సరణిఁ బురు
షార్థముల శేవఁ జను రుపాయ,ముల విధంబునఁ
(బఖ్యాతి వెలపిరంత. వి(క. ౧-30.

గీ. (ప్రబలెన వ్వేంకటాద్రి నృపాలవరున, కవని
రెండవభార్య వెంగమ్మ యనఁగ, జలజలో
చనునకుఁ బంట వలఁతి కరణిఁ గనకగిరి
చాపునకు జహ్నుకన్యసరణి.
ఇందు. ౧-౨.

సీ. నే వధింపఁజాలక నిన్ను నీసరణిఁగరంబు
ద, వ్వాను సరించుట నన్నసదుగాఁగఁ దలఁ
చెదుగాఁబోలు. కళా. ౬-౬౭.

సీ. పెగకుల్కి మఱుఁగుఁ జొచ్చిన జహ్నురవి
జలసరణి మల్లెలతోడి జడలు మెఱయ....
ఆము ౨-౫౮.

సరణ్యువు. సం. వి. ఉ. పుం. ౧. వాయువు. ౨. మేఘము. 3. జలము. ౪. వసంతర్తువు. ౫. అగ్ని. ౬. యముఁడు.

సరత్తు. సం. వి. ప్. పుం. ౧. గాలి, వాయువు. ౨. మేఘము. 3. బల్లి. ౪. తేనెటీఁగ.

సరత్ని. సం. వి. ఇ. పుం. స్త్రీ. ఒకవిధమైన కొలత (మా. రత్ని లేక అరత్ని.)

సరథుఁడు. సం. వి. అ. పుం. ౧. ఒకేరథమున నున్నవాఁడు. ౨. రథమెక్కి యుద్ధముచేయు వీరుఁడు.

**సరదా.** అవ్య. వి. వినోదము, విలాసము.

**సరదారు.** (హిం. సరదార్) వి. నాయకుఁడు; ప్రధానోద్యోగి.

సీ. హరులు ప్రమ్గిన డిగ్గి యని వీఁగు సరదార్లు వడివనోసరిలు హరులు. చంద్రాంగ. ౬-౧౧౨

సీ. నును మావులను మావు లెసవిన కోయిల సర దార్ల కెల్లను సారెఁ జెప్పి. శకా. ౪-౭౬.

సీ. మొగలాయి ప్రభులకై వూని షేర్మహమదు భానుఁడనెడు పేరు గల్గినట్టి, సరదారుఁడు మనదేశమును జయింపగవచ్చె....
రంగా. ౧-౧౧౫.

**సరదు.** అ. క్రి. ౧. పంచు, విభజించు.

గీ. చలిది యతఁడందఱకు నిట్లు సరది పెట్ట.
పరమ. ౪-౨౩౬. (శ. ర)

౨. వెలువు, వ్యాపింపఁజేయు.

తే. గీ. కప్పురము పొదులోపలఁ గరము సరది, నాటివెన్నెల యను తేటనీటఁ దడపఁ మొనలు చూపిన ముత్యాల మొలక లనఁగ, నారపుతోడుతఁ జెలిపలువరుస దనరె.
యయా. ౪-౩౭.

**సరదుకొను.** స. క్రి. పంచుకొను.

ద్వి. ఒండొరులకు మున మొద్దికై సరదు, కొందము రమ్మంచుఁగూడిమువ్వురును...
ద్వి. పరమ. ౧-౪౪.

**సరపణి.** సరిపణి, సరిపెణ, సరిపెణము, సరిపెణీ, సరిపెన, సర్పెన, (త. చరప్పణి, క. సరపణి) వి. ౧. ఇనుపగొలుసు,

భ్రమరపంక్తుల సరపణులతో ఁదూఁగు.
ద్వి. పరమ ౧-౩౭ పు.

౨. గొలుసు.

తే. సుమపరాగముల్ కెళి పాంసువులు గాఁగ, భ్రమరపంక్తులు పైసరపణులు గాఁగఁ బుడమి వెల్లెడ వాహ్యాళి వెడలుమదను, మదపు టేనుఁగుఁబోలె నామని దనర్చె. రాఘ. ౨-౫.

౩. అలంకారముగా నుపయోగించు బంగరు గొలుసు, లలంతిక.

ద్వి. బంగారు సరణిని బాగుగానునిచి, గణికా శిరోమణి .... ద్వి. పరమ. ౪-౨౬౪.

సీ. అంఘ్రిపద్మముచుట్టు నతివలయంటగా నీలాలసరపణుల్ నీటు నూప.
వాల్మీకి. 3-30.

ఎ. గీ. పచ్చల కడెంబులును సరపణులు పూని, భద్రదంతావళంబెక్కి ప్రభువరుండు, నుదయ గిరిఁ దోఁచుభాను నట్లులసిల్లె.
కవిజనరం. 3-౧౧.

**సరపత్రిక.** సం. వి. అ. స్త్రీ. ౧. క్రొత్తతామ రాకు. ౨. తామరపువ్వు.

**సరపువ్వులు.** వి. బ. (సరము+పువ్వులు) దండ గాఁగుచ్చుపువ్వులు. (సరము. సం. అనియు మి. వి. అనియు ఆము. వ్యా. కాని సరము శబ్దము అచ్చ. రా. కిష్కి. ౦.౪౦. లో నుండుటచే అచ్చతెలుఁగనఁ వలెను.)

తే. గీ .... బంటి కుసు కేసు పోఁడకుఁ గంట గింప, కైరి తుఱిమెడు సరపువ్వులం దతివలు
ఆము. ౫-౧౦౬.

సీ. సరపువ్వులంగి మాలకట్టె పెక్కు తెలుఁగుల విరులనెత్తులఁగఁ గాఖంచినట్లు.
పి. శకుం. ౧-౨౩.

**సరఫరా.** హిం. వి. కావలసినవానిని సంపా దించుట.

**సరబడి.** (సరస+బడి) వి. ద్వారము, ఆశ్రయము. (త. సరసడి, సరపడి=కుటుంబము)

సీ. కోటకొమ్మలు క్రొత్తదంబులు పెద్దగవఁకులు సరబళ్ళుగట్టిపతిచి (అల్లవళ్లు అని ము. ప్ర) అచ్చ. యు. కాం. ౭౩

సీ. ఇనవంశమణి యొద్ద నెవ్వారి సరబడిఁ గొలువు పట్టితివి రామా. ౬-౧౯౭.

ఎ. గీ. తలఁచిన తన సరబడి నెల్ల దశముఁ గూర్చు (తలఁచి దృఢతరముగ అని ము. ప్ర)
పంచ. నా. ౧ .అ

**సరభసము.** సం. విణ. ౧. వేగముతోఁగూడినది ౨. ఉగ్రమైనది, ఉద్ధతమైనది.

కం. సరభసపరిచలిత మహాశరభద్విపపుండరీకశార్దూల మద ద్విరదాది ప్రకరభయంకర వనమధ్యమున నృపతి కడుఁ గడిమిమెయిన్. భార. ఆది. ౪-౧౨.

౩. ఉద్రిక్తమైనది. ౪. హర్షముగలది.

**సరభసిల్లు.** సం. అ. క్రి. (సరభసము+ఇల్లు) త్వరపడు. (ప్రా.)

సీ. పేరు విన్నప్పుడే దూరమై చను భూతచయములు దిగులున సరభసిల్లి. హంస. ౩-౬౩.

**సరమ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. విభీషణుని భార్య. ౨. ఆడుకుక్క, దేవశుని. ౩. దక్షుని పుత్రిక

**సరమ.** వై. వి. శ్రమము.

**సరమగొను.** (సం. శ్రమః) (సరమ+కొను) అ. క్రి. శ్రమపడు.

వ. పరమపుణ్య సరమ సరమగావక జానకి జంగూడి భయనివారణంబు సేయుచు. రామా. ౬. ౨౧౬.

**సరము.** సం. వి. అ. పుం. ౧. హారము, దండ. ౨. విరఁగడ. ౩. గమనము, చలనము. ౪. లవణము. ౫. బాణము. ౬. జలపాతము.

**సరము.** సం. వి. అ. న. ౧. నీరు. ౨. కొలను.

**సరము.**[1] వి. మాలిక, దండ. (సం. సరః, త. చరమ్, క. సర.)

క. ఒదయని యడుగులఁ బడి కడు, బదలిన సూర్యాత్మజుల నరుగు మటంచున్, మెడనొక పూలసరంబిడి, వడి ననిచిన నేఁగి పెంకువకుఁ బిల్చుటయున్. అ. రా. కిష్కింధా. ౪౦.

"పుక్కసరములు కుదుసు పఱిచి. నీలా. ౧-౧౩.

సీ. సరము లొత్తులు దండలు సరులనంగ నామధేయంబులగుఁబువ్వు దామములకు. ఆం. సం. స్థావ. ౧౩.

**సరము.**[2] వి. (సం. స్వరః) ముక్కుగాలి.

సీ. తేగిణి గొసరి బైనుక పెట్టి శలకపై సారెలు కోయించి సరముచూచి. ఉ. హరి. ౩-౧౭౦.

**సరము.** (సం. స్వరః, ప్రా. సర. త. చరమ్. క. సర.) స్వరము. చూ. సరకట్టు.

**సరయువు.** సం. వి. ఉ. పుం. గాలి, వాయువు.

**సరయువు.** సం. వి. ఉ. ఊ. స్త్రీ. అయోధ్యా నగర సమీపమందలి నదిపేరు.

**సరళ.** సం. వి. ఆ. స్త్రీ. తెల్లతెగడ ‡ (శ. ర)

**సరళద్రవము.** సం.వి.అ. పుం. దేవదారుబంక

**సరళము.** సం. వి. అ. పుం. పూతికాష్ఠము ‡

సీ. కొండగుమ్మడు కేగు గోరమి సంపగి కొండసంపెంగ మారేడుసరళ దేవ, దారు. హంస. ౪-౧౧.

(సరళ అని స్త్రీ. సమముగాఁగనఁబడుచున్నది. సరళమునకు "సరళ" అనియు, దేవదారువు, దేవదారు అనియు ప్రయుక్తములు.చూ.దేవదారు.)

**సరళము.** సం. విణ. ౧. తిన్నని, వక్రముకానిది. ౨. ఋజువైన, త్రికరణశుద్ధమైన ౩. అకృత్రిమమైన, సహజమైన.

**సరళము.** సం. వి. అ. పుం. ౧. ఒకవిధమైన దేవదారు వృక్షము ‡ ౨. అగ్ని. ౩. గకారాది వర్గతృతీయాక్షరము.

**సరళాంగము.** సం. వి. అ. పుం. దేవదారు వృక్షద్రవము.

**సరళి.** (క. సరళిస్వరగ్రామము. త. సరళి) కలయికలుగల సగమపధనియను సప్తస్వరముల గ్రామము

తే. గీ. ఛత్రకత్ర బో ధారణి ఝుంకెసరళి, పాటసైనిక యుపద్రుంకె మీటుకంపి, తాహతంబులు హులియుఁ బ్రత్యాహతమును, స్ఫురితములు వాద్యములనయ సరణి మీఱి". ప్రబం. ౧-౧౧౦.

**సరళిస్వరము,** వి. √ సరళి. వివిధములగు కలయికలతోఁగూడిన సరిగమపధని యను సప్త స్వరముల వరుస.
ఉదా. ముందు సరళిస్వరములు నేర్పి పిదప జంట స్వరములు నేర్తురు. (వ్య.)

**సరవ,** వి. చిన్నకడవ, బుంగ, బుడ్డి.

**సరవడి.** వి. ఈడిక, గడిలోనగు వానిఁదన్నెడి బండి, పరమువంటి సాధనవిశేషము.

సీ. అలరుఁదృణాద్యాసయన సాధన విశేష సంజ్ఞ యీడికయన సరవడియన.
ఆం. భా. ద్వి. ౭. (శ. ర.)

**సరవత్తి,** వి. ఒకదినుసు, బాణసంచు.

వ. సరవత్తుల వేగమున రంజకంబుదినుసున సురటి దిప్పినట్లు, తోకచిచ్చు బాఁగ వెదిల్చిన పగర గుండెలు చిద్రుపలుగ విదిర్చవలె నిలనద్రువ నగుచు. ప్రబం. ౧-౮౭౭.

**సరవి.** వి. ౧. క్రమము, వరుస.

"వానలు సరవితో వర్షించె" స్వా. ౬. (శ.ర)

తే. వాటికిస్వారఁడే యదునందనుండు, సరవి మీఱఁగూడి తిరిగి యీ చందమయ్యె.
వై. భా. ౭-౧౮3.

"క్రమమొప్పునందు సరవియనంగ"
ఆం. భా. 3-30.

సీ. వానలు సరవితో వర్షించె. మను. ౬-౧౨౧.
౨. తీరు, విధము.

కం. వరుఁడు సమాగమకాంక్షన్, ద్వారిత పడుమనుండ నిచటఁదడయుట తగదో, వర వర్ణిని రారమ్మొక, సరవినిఁదమియుండ దెల్ల సమయములందున్. ప్రభా. ౫-౨3.

తే. నీవు వాదాయతోఁగూడి నీచబుద్ధి చెప్పెదు వాకుఁదమ్ముఁడవె నీవు, కడగి నీమంత్రులును నీవుఁ గంటిలోన వెరసుసరవిగ నున్నారు నిశ్చయముగ. మొ. రామా. యు. ౧-౨౦.

3. ఒప్పు, అందము.

వ. శిగీరఘురథంబు వెంటవంటి పంటవలంతి కంటసరి, సరవిమీఱి నీహారగిరికుమారి భాగరథీ ప్రధానమాలికలిరయ్యె.
చంపూరా. 3-౨౫.

మ. భరతుండా రఘురాము పాదుకలపై భక్తిం బ్రతిష్ఠించిని,ర్భరభూచక్రము రామరాజ్యముగ మర్యాదానయాదార్యను,స్థిర కార్యంబుల నేలుచుండెఁజని నందిగ్రామసంస్థాయియై, సరవిం దత్పునరాగమక్రమ దిదృక్షాదక్షదీక్షా ధృతిన్. రామా. ౫-౧౦౧

చ. సరవిని దమ్మిక్రొవ్విరి పూజారముసం గొలు వుండు భారతీ,శ్వగుఁడు చిరాయు రున్నతు లొసంగుచు మాకయతిమ్మకారికిన్.
విప్ర. ౧-3

**సరవెంద.** వి. పెరవెంద. తీక్ష్ణగంధ i (శ. ర)

**సరవ్యము,** సం. వి. అ. న. చూ. శరవ్యము.

**సరస.** వి. ౧. ఆసవార్థము.

సీ. తక్కటి యనంగఁ దీరంబు దనరుచుండు, గద్దగద్దియ పీఁట బాఁగను గటాసనమ్ము చదఁక యనఁజర్మకమ్ము దనగు వాసవార్థంబు సరసనా నలరుచుండు. ఆం. భా. ౨-౧౬౫.

౨. సమీపము.

ఉ. కూరిమి నేఁడు మీ సరసకుం జనుదెమ్మని యాన తిచ్చుటో, నూరివరేణ్య వ న్నొరసి చూచుటకో మఱి నిక్కమో యనన్.
వైజ. 3-౬.

క. రాజసుతుఁడు సవినయమతియై తనగద్ద సరస నుచితా,సనయుక్తులఁ జేసి యనుప్రసన్నాననుఁడై. సారంగ. ౨-౨౬౫.

ఆ. వె. అతట వారి సునిచి యప్పుడె కోఁతుల నేని, సరస నేఁగి తాను జన్న తెలుఁగు, విన్న పం బొనర్చి ప్రేమ్మిడి సరవి న, ద్దొరలకడకు వేడ్కఁ దోడితెచ్చె.
ఆ. రా. కిష్కింధా. ౧౬.

౩. దాపు, పార్శ్వము, ప్రక్క.

క. కరితురగరథపదాతులు, పరివేష్టింపంగఁ
గొలుచుఁ బ్రజ మందలుగ, సరస జనార్దనుఁ
డుం జన, నగిరి కేఁటాడ ధరణి యల్లల
నాడన్. ఉ. హరి. ౪-౨౧.

౪. సమక్షము.

తే. అప్పు డయ్యేలదోఁటలో నతనిసరసఁ బరి
జనంబులు పరిపక్వఫలసుగంధ, కుసుమరస
పల్లవంబులఁ గొల్లలాడి. కళ. ౧-౨౭౫.

౫. వరుస, శ్రేణి.

సీ. ఒకరొయిలవాఁగ చేయూఁదివాఁ డిక్కడ
సరస నున్నవి వాగ్గుచరణములను........ ఒక
యింతి కెమరుగా నొలవివాఁ డిక్కడ నన్యో
న్యముఖములై యంఘ్రు లొప్పె.
భాగ. ౧౦ పూర్వ ౧౦౨౭.

క. ముదితలు దారును సరసన్ గంధర్వపతుల్
వరుసన్ హర్షించి పాడి రట్లు వసుధాధీశా !
భాగ. ౧౦. పూర్వ. ౧౦౭౬.

**సరస.** సం. వి. అ. కెల్లుతెగడ ¡

**సరసమాడు.** (సరసము + ఆడు) అ. క్రి. హాస్యమాడు, సరసముగాఁబలుకు.

తే. తెలవ యొక్కతె ముందర తెలవుచూప,
సరియ యొక్కతె యొయ్యన సరసమాడు.
చంద్రాంగ. ౨-౧౧౩.

గీ. చదువఁ బాడంగ నర్తింప సరసమాడఁ గథలు
చెప్పంగ నగ్గింపఁ గన్నులార్చ.
కాశీ. ౫-౩౧౬.

౨. పోలు, సాటియగు, కలియు, మిళితమగు.

సీ. చరమసంధ్యాకాలసంఫుల్లమల్లికాస్తబకపంక్తు
లతోడ సరసమాడి. శృం. నై. ౧-౩౭.

సీ. ఆతపత్రధ్వజకేతనచ్ఛాయలు చామరప్రభ
లను సరసమాడ. భా. రా. బాల. ౬౮౭.

సీ. స్ఫురితవిద్రుమమణిభాస్వరబింబగుచితోడ దర
హాసచంద్రిక సరసమాడ.
భాగ. ౧౦. ఉత్త. ౬౮౮.

తే. జలకణంబులఁ జెమటలఁ జెలిమిచేయ, నళి
రవంబులఁ బలుకులు నవఁగిపెనఁగ వెన్నె
లలఁ జిన్నినగవులు వియ్యమందఁ జల్ల
గాడ్పులు మూర్పులు సరసమాడ.
వరాహ. ౪-౬౫.

సీ. శఁపాలతాంగుల చరణకాంగులు కుశేశయ
కదంబముతోడ సరసమాడ. అని. ౨-౫౭.

**సరసము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. రసముతోఁ గూడినది. ౨. రుచిగలది. ౩. తడిగలది. ౪. చెమటచే తడియైనది. ౫. ప్రేమగలది, భావపూర్ణమైనది. ౬. అందమైనది, రమణీయమైనది. ౭. అభినవము, వికాసముగలది. ౮. శృంగారాదిరసములతోఁ గూడినది. ౯. సారముగలది. ౧౦. కూటగలది.

(రసయుక్తమైనది.)

సీ. కన్నుల కాశ్చర్యగరిమఁ జెందనివాఁడు సరస
భావలకు మెచ్చనినరుండు .... గీ. నాస్తి
యన్నతంబు దబ్బర నహి హుళక్కి.
హంస. ౨-౧౪.

**సరసము.** సం. వి. అ. న. ౧. సయ్యాట, (స్త్రీ పురుషుల) పరిహాసము, నవ్వులాట.

సీ ...... ఏ సీమ సరసంబు లివి యమ్మ నేఁ జెల్ల
యనిన నీ వెఱుగవే వనిత యింత జాణ
యయ్యును మానీ మ సరసమంచు.
దశా. ౭-౪౧.

౨. పరిహాసవాక్యము.

సీ. పాఁగింటి చెలిఁ గూడి సరసముల్ పలుకుచోఁ
జెంతనిల్చితిఁ జామా దంతిగమన.
కుశ. ౩-౫౦౦.

మ. సరసాలుం జిఱునవ్వులున్ మురిపెముల్
సయ్యాటలుం బింకలున్ గరగించెల్.
హంస. ౧-౨౪౧.

జ. సరసమా (ములా) డు.

**సరసర.** (క. చరచర త. సరసరప్పు) చరచర. వి. గమనాదులందగుధ్వని కనుకరణము, శీఘ్రము

ద్వి. తోటతోటములందు గృహాంతములయందు,
సరసి యాజంగమం బడుగుల కరగి సరసరఁ
దోడ్తెండు చనుఁడు మీ రనుచు.
పండితా. దీక్షా. ౭౧ పు.

ద్వి. సరసర గిత బందరు కవిలియలు,సరయుఁడు
శోధింపు డవ్వనములు.
పండితా. దీక్షా. ౭౦ పు.

ద్వి. సరసరలింగ పసాయితశస్త్రు కరతలంబై
చూడ కనుదృష్టినున్న.
బస. పురా. ౨-౪౩౨ పం.

సరసర. క్రి. విశే. మిక్కిలివేగముగా.

ద్వి. అరుగంగ సరసర లింగావసరము సేయించి
బస. పురా. ౨-౩౩౫.

సరసి. సం. వి. ఈ. స్త్రీ. సరస్సు, కొలను,

వ. శుకుండు మృగపక్షికైల పరిత్సరసీతరు గుల్మ
లతలం గలయంగనుంగొని ...
భార శాంతి ౬ 330.

గుంట.

సరసికము. సం. వి. అ. పుం. సారసము,
బెగ్గురుపక్షి.

సరసిజనాభుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.

సరసిజభవుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ.

సరసిజము. సం. వి. అ. న. పద్మము, తామర.

సరసీరుహము. సం. వి. అ. న. సరసిజము.

సరసీరుహము. సం. వి. అ. పుం. బెగ్గురుపక్షి.

సరసు. విశే. (కు.సరసు.) రుచిగలది,స్వాదువు,
గాటుతక్కువకలది, ఆకృతిలోఁ బెద్దది.

మ. వరసారస్వతపట్టభద్రులు కవుల్ వర్ణించి
వర్ణించియున్ సరసావంతయుఁ గానలేరు
తుద రూపావిర్భయాంభోధికిన్.
పాండు. ౫-౨౧౫.

సరసు. అ. క్రి. ౧. పరదు, పంచు, (సఖ్యముగాఁ
బంచు అని శ. ర.)

సీ. స్తనభార మొక్కింత సరకుక వచ్చెద నని
గబ్బితనుగుబ్బ లంటు కెవరు. దశా. ౭-౩౦.

తే. జంత యిటు లల్లి యుండ రా జంత నచట,
సరసిచెంత బిసాగ్రంబు సరసికొంత, మాగని
కందిచ్చు కోరి ప్రేమగని తనదు, దుండి
రొమదడగులెంచి యుండుండి యభ్రుకు.
సారంగ. ౨-౧౫౨.

౨. క్రమ్ముకొను.

సరస్వంతము. సం. విశే. త్. ౧. నీరుకలది.
౨. రసముకలది. 3. అందమైనది. ౪. రుచిగలది.
౫. శృంగారాదిరసములుగలది.

సరస్వంతము. సం. వి. త్. పుం. ౧. కొలను.
౨. నదము. 3. మహిషము. ౪. సముద్రము.
౫. వాయువు.

సరస్వంతుఁడు. సం. వి. త్. పుం. ౧. కుబే
రుఁడు. ౨. రసికుఁడు. 3. తెలిసినవాఁడు.

సరస్వతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పలుకుఁజెలి,
వాగ్దేవత. ౨. పలుకు 3. నది. ౪. ఒకనదిపేరు.

సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయుచుండి
భార. శల్య. ౨-౧౫౦.

౫. ఆవు. ౬. స్త్రీలలో శ్రేష్ఠురాలు. ౭. మనువు
భార్య. ౮. దుర్గ. ౯. సోమలత ‡ ౧౦. జ్యోతి
ష్మతి. ‡

సరస్సు. సం.వి. స్. న. ౧. కొలను. ౨. జలము.

సరహస్యము. సం. విశే. ౧. మార్మికమైన,
మాంత్రికమైన, అనిర్వచనీయమైన. ౨. శాస్త్రోక్త
మైన, మంత్రోపదేశపూర్వకమైన.

సరాగము. సం. విశే. (అ. ఆ. అ) ౧. రాగ
ముతోఁగూడినది, ప్రేమగలది. ౨. రంగుగలది.
3. రక్తవర్ణముగలది.

**సరాగము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. రాగముతోఁ గూడినది; ప్రేమగలది. ౨. రంగు గలది. ౩. రక్తవర్ణము గలది.

**సరాగము.** వి. ౧. ఒద్దిక, అనుకూల్యము. (క. సరాగ = అడ్డు లేనిది; సూటియైనది. (బాట మొ.) త. చరాచం. = సూటియగు బాట).

"అన్నదమ్ముల సరాగము వారలదే సుమీ".

విజ. వి. ౧-౪౧.

క. రాగము చిగురాకునకును, రాగము బోఁటులకు ఘన పరాగము వనికిన్, రాగము మధుకరములకు స, రాగము గృహులకును గల్గె రహి నవ్వేళన్. రసి. ౨ ఆ.

౨. ఒప్పిదము.

ఉ. ఆ చాయల కెంపు టోవరుల చందము నా చుంబద్గ్రాలంకు లే, రాయల రాయ రంగుల సరాగము నా మణికుడ్య భాగముల్.

సారంగ. ౨-౬౨.

**సరాతి.** వి. గోడవలె గుడారముచుట్టు నేర్పఱిచిన తెర. (శ. ర.)

మ. అమరం జుట్టుసరాతిపోల్కి వలయాహార్యం బువేల్యాదధిమహావీచుల చాలుగాలి తెరపై పెంపొందఁ దంష్ట్రాంకురాగ్రమునన్ ధారుణి యొంటి కెంబరము గుడారంబై తగన్ ద్వాదశార్యమ తేజోహతిఁ గందకుప్పనఁగమాయా దంష్ట్రి నిన్నెన్నెదన్. చంద్రాంగ. ౧-౪౬.

చ. తడవుగ నెంతయేని వడి దవ్వఁ జరించుటఁ జేసి మిత్రుఁ డబ్బుదలిక దీర్పఁ జేరుటను బశ్చిమదిక్పతి నిల్పు వేడుకన్, విడిది ఘటించి చుట్టు నొదలించినవొక్కపుటింద్రగోపపుం, బెడఁగుసరాతిరీతిఁ గనిపించెను దద్దిశ సాంధ్యరాగముల్. సమీర. ౩-౭౪.

గీ. రంజిలఁగ శ్యామిగోడ సరాతి యనఁగ, వసననిర్మితకుడ్యభావంబు గాను.

అం. భా. ౨-౧౫౪.

సీ. పాథోధినుతవీచి పట్టువొక్కపుగుడారంబు పొంబట్టు సరాతియునఁ ....

ఉ. రా. ౧-౩౧౬.

**సరాళము.** సం. విణ. (రూ. సరళము).

సీ. కల్లోలడోలాసముల్లోల లీలాసరాళ మరాళ వాచాలపుష్కరము. రామా. ౫ ఆ.

**సరావము.** సం. విణ. ధ్వని చేయునది, మ్రోగునది.

**సరావము.** సం. వి. అ. పుం. ౧. మూఁకి. ౨. మూఁకుడు; ముంత. (చూ. శరావము)

**సరాసరి.** వి. వి. (సరసిన + సరి) సరిచూడఁగానైన సమత్వము.

ఉ. ఈ కెంపులన్ని సరాసరికి ఏమి వెల ?

(శ. ర.)

**సరి.** సం. వి. ఇ. స్త్రీ. సేటిబుగ్గ.

**సరి.**[1] వి. ౧. తగిన సమాధానము.

క. నరవర యీప్రశ్నమునకు, సరి చెప్పఁగ రాదు నేను సామర్థ్యముచేఁ, బరికించి నీకుఁ జెప్పెద. భాగ. ౧౧ స్కం. ౩.

౨. సామ్యము; పోలిక.

ఆ. వె. అమృగాక్షిఘనకటీమండలంబుతో, సరికిఁ బెనఁగవచ్చు సైకతముల గౌరవంబు గుట్టు గాంచంగవచ్చుఁ బో, తెలియ నేనుపాటు గలిగె నేని. వరాహ. ౧౧-౪౬.

చ.... ప్రోల్....అలనాకపున్ సరిసై పెనఁగి.

ఆము. ౨-౯.

ఉ. కాంచన మంత్రిశేఖరుని గాదిలిపుత్త్రి హరిప్రియేశనారీచకురాస్య కాంతలనసిన్ గణుతింపఁగవచ్చు .... ప్రబోధ చం. ౧-౧౧.

౩. సాటి.

చ.... ....నీకు నెవ్వరు సరి సర్వశిల్పవిభవంబునయందు సమర్థ మెందు నచ్చెరువు భవచ్ఛిల్పభావము ప్రసిద్ధముగాద సురేంద్రపూజితా.

హరి. ఉ. ౨-౧౫౬.

మ. బలసాగరేయశలంపు నీకు సరిచెప్పన్ నీవకా
శిక్షాగుం, గలరేయుస్యలు గంధవాహభువన
ఖ్యాతంబు నీవిక్రమం, బలఘునూప్తియుతుం
డవు. హరి. ఉ. ౬-౧౭౨.

మ. సరి లే రీజలరాశివేష్టిత మహీచక్రంబు నవ్వి
క్రమా, పరి గాండీవికి. కాశీ. ౧-౫౩.

సీ. వెలుమలు పదియాలువేవురలో నెన్న పరి
లేరు సౌభాగ్యగరిమ నీకు. పారి. ౧-౫౮.

సరి[2]. (సం. సరః) వి. దండ; (పూవుల) దండ; సరము.

సీ. కురులు నున్నగ దువ్వి కొప్పు వెట్టెను గాని
తోరంపువిరిసరుల్ తురుమఁబోదు.
దశా. ౪-౫౮.

క. విరితేనె మే సరులకున్, హరినీలఁపుసరుల
కురులకు కురుల్, గురులై పెనవిలుతుని బెడ,
గురులై తగు నెమ్మిపురుల కొకదాఁపరులై.
చంపూ రా. ౩-౭౫.

క. తా రట్టులుగఁ దమ్ముం, జేరన ముత్తెంపు
సరులఁ జేదినచన్నుల్, లో రెంట లుడిపె....
ఆము. ౫-౨౩.

వ. సన్నజాజివిరులసరుల సిగులం గదలుకొని.
ఉ. రా. ౪-౧౬౩.

గీ. ఇరులసరులను బెన్నెలు విరువుకొనఁగ.
ఉ. రా. ౧-౨౫౪.

సీ. భుజగమధ్యమునఁ గ్రాలు భుజగహారంబులు,
గురిజపూగుబ్బసరులు గాఁగ. హర. ౭-౪౧.

"ముత్యాల సరులతో ముద్దుగురిసె".
శృం. నై. ౭-౧౧౩.

సీ. శీతాంబుజాతాక్షి చిలుకప్పుచాయతో సవ
రైన విరిమల్లెసరులు కొన్ని.
ఉ. రా. ౬-౨౯.

సీ. తెలిముత్తియపుసరుల్ దిద్దు నెపంబున, గుబ్బ
చన్గవలఁ గోరఁ జెనకి. నీలా. ౩-౧౦౩.

ఉ. వియన్నది నవాంభోరుహనాళసూత్రములఁ
బొందుగ దీని లతాంతము ల్సరుల్గా రచి
యించి నించుఁగుసుకంబున వీఁగు మెలుంగు
క్రొవ్వెదన్. పారి. ౪-౮.

తే. విరులసరు లిచ్చె నొక యరవిందగంధి.
పారి. ౨-౧౨.

౨. సమయము. వ్య. వ. ఇకఁ డీసరికి రావలసినదే.

సరి[3]. సం. విణ. (సం. సదృశమ్; ప్రా. సరి. త. చరి. క. సరి) సమము; సాటియైనది.

క. సురసిద్ధమునీంద్రతపశ్చరణలు నా తపము
తోడ సరి గా వంటిన్. భార. ౩-౨౧౬.

క. మనవీటన కా దయ్యు, జ్జ్వనకు సరివింటి
వానిఁ జూడఁగ లోకం, బున నెందు లేమిఁ
దెల్లంబు. భార. ఉద్యో. ౨-౧౬౭.

౨. సమానము.

చ. మరమున బంధుమిత్రులకుఁ దోడ్పడు పెంపును
ధాత్రియెల్ల భూసురులకు నర్థ మిచ్చుటయు
సూరిజనుల్ సుకృతంబు లెన్నుచో, సరియుగఁ
జేసి చెప్పుదురు. భార. ద్రోణ. ౩-౨౮౧.

ఉ. ధారాసలిలప్లవం బఖిలరంజకమై యొల
యుంగఁ జేయుచే, నీసరి యెవ్వ రిష్టు విధి
నిర్దయుఁడైన వశంబె యోరిన్.
హరి. పూ. ౯. ౧౫౬.

సీ. సరిసిద్ధ్యసిద్ధులు సములోష్ట = కాంచనమై
యుండు. భార. శాం. ౫-౨౨౫.

చ. బ్రహ్మభావభా, జనత ఘటింప దీని సరి
సమ్యగుపాయము లెందు లేవు.
భార. శాం. ౫-౬౨౨.

చ. చైద్యవసుధావరముఖ్యనృపుల్ ఫణీంద్రభో,
గములన నొప్పు బాహువులు గల్గినవిన్న
భజించు గోపికల్, క్రమమున నేముమున్
సరియు కామె భవత్కృప నంబుజోదరా!
భాగ. ౧౦ స్కం. ఉ. ౧-౨౧౦.

సీ. పరశురామునకు మేల్సరియైన తనయుండుఁ
గలిగె భంగంబు కుండిచేత.
భార. భీష్మ. ౧-౪౭.

క. దానంబునఁ గర్ణుని సరి, మానంబున పేర్మి ననుపమానుఁడు. హరి. పూర్వ. ౧-౦౩౧.

సీ. చిరతరలక్షుఁ జొరక నిందాస్తుతుల్ సరిగఁ గొనుచు. భార. శాం. ౧౫౮.

ఉ. హరి యిట్లు సతుల నందఱి సరిగాఁ జూచి యును. హరి. ౧-౪౧.

గీ. ప్రాణవాసనిసరియె యే బంధువులును. కాశీ. ౨-౮౨.

గీ. భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె. మను. ౧-౬౬.

ఉ. హేమధరాధరేంద్రమున కెక్కుటి పెద్దనృతిన్ భుజంగము, స్వామికి మేలు చేయి పటు వాగ్విభవంబున బుద్ధిసంపదం, దామర చూలికిన్ సరి ప్రధానులు దక్కినవారు సాటియే. శృం. నై. ౧-౨౮.

౩. అనుకూలము. తగినది.

సీ. హరి తమ్ము వంచించె సరిసేయగా దని దైత్యులు చేరిరి పాతాళమునకు. హర. ౬-౧౨౯.

మ. తదీయధ్వనిన్, సరిగాఁగైకొనియె న్వసంతము మహాసంపూర్ణ భావోన్నతిన్. వసు. ౧-౧౮౦

౪. యుక్తము, సమంజసము.

శా. తారుణ్యంబున నమ్మహీసుతుఁ డొగిన్ ధర్మార్థకామక్రియాచారంబుల్ సరిగాఁ జరించి తుద మోక్షశ్రీ నపేక్షించి. విక్ర. ౧-౧౯౪.

౫. సమర్థత గలవాఁడు.

క. ఆ యజాని చక్కఁదన మిఁక, నా యజుఁడే యెఱుఁగుఁగాని యవనీస్థలిలో, నే యువనియు లెఱుంగరు కాయజుఁడైనను సుతింపఁగా సరియగునే. ఇందు ౪-౨౩.

౬. సమాప్తము.

సీ. చదివినచదువులు సరి శరీరముతోనె తలఁపులు

చ. సరియగునిట్టి వెట్ట నివి సర్వము....

అమ. ౨-౪౭.

౭. ఋజువు.

క. చనుదెంచె నయోధ్యనుండి సరి యింతులకున్ భార. అర. ౨-౧౮౮ (శ. ర)

౮. సమాప్తము, చెడిపోయినది.

(వ్య) నీకు నాకు స్నేహము నేఁటితో సరి.

౯. తగినట్లు.

(వ్య) వానికి లెక్కలు సరిగా రావు = రాఁదగినట్లు రావు.

(వ్య) అచ్చు సరిగానే పడినది = పడఁదగినట్లే.

సరి. క్రి. విశే. ౧. సమానముగా.

క. లలిఁ బుణ్యాంగన లొలికెదు, లలితాక్షతములు వియత్తలమున నమరకాం, తలు గురియ కుసుమవర్షంబులు నొక్కటఁ గృష్ణు మేను భూషించె సరిన్. హరి. ఉ. ౩-౧౬౫,

క. హరుశరమును నరుశరమును సరి నిరుపక్కియలు దాఁకి జవమతి. భార. అర. ౧-౩౦౬

ఉ. అగ్గణముఖ్యులోదనొకఁడై సరి నాచెలువున్ భరించి తాఁదిగ్గన వచ్చె శంకరుఁడు దప్పరమైన వడిం చెమర్పుచున్. హర. ౧-౨౧.

౨. పూర్ణముగా.

ద్వి. ఆ జాహ్నవీదేవి దిగి రసాతలమునఁ దిరిగి యందున్న, సగరుల భస్మముల్ సరినిండఁ బాలె. రం. రా. బాలకాం. ౪౫ పు, ౧౦౫.

క. వనమునఁ బంట్రెండేండ్లను, జనపదమున నెఱుఁగకుండ సరినొకవర్షంబును జలుపఁ బూని సత్యము దనరఁగఁ జేసితిఁ బ్రతిజ్ఞ దగవృద్ధసభన్. భార. అర. ౧-౨౫౮.

ద్వి. అగణితశక్తి రెండడుగులయందు జగతీతలం బెల్ల సరి నాక్రమించి,

క. పసువడి రుధిరము దొరఁగఁగ నసుఁడుగఁ
దనరారె నిశకులాధిపుఁ డంతన్, నురరిపు
బాణము నెప్పచు, సరిసెత్తురు గురియుచున్న
జలదముబోలెన్. భా. రా. యుద్ధ. ౨౦౪౪.

3. యుక్తముగా

ద్వి. కరుణఁ దపోవృత్తిఁ గైకొని మీరు, సరి
బ్రహ్మచర్యంబుచరియింపవలయు.

రం. రా. బాలకాం. ౩౬ పు. ౨౨ పం.

౪. అనుకూలముగా

ద్వి. తరుణులతోఁ గూడఁ దగిలి మారాజు,
సరిజలక్రీడలు సలుపుచున్నాడు.

రం. రా. ఉ. కాం. ౪౧ పు ౨౫ పం.

సరి. అవ్య. అంగీకారార్థము (శ. ర)

సరించు. సం. అ. క్రి. ౧. పోవు.

చ. మిక్కుటముగఁ జంక నత్తిరి పెకూడ ధరించి
సరించి వెంబడిన్. వైజ. ౩-౬౪.

౨. సంచరించు.

చ. నిష్కరయోగిరంబుతో మసలు వెఱుంగు రాచ
లుపమాటలఁగాల్ కట్టు నంజామున్
మెసవి సరింకుమేసరెల మేమయి సామిరా
శేఁటలాడుచున్. చంద్రాంగ. ౨-౪౬.

సరి (యి) ంచే. స.క్రి. సిద్ధముచేయు, అందించే

శ్రీభీమేశ్వరు మహాదేవరకుం బెట్టిన అఖండవర్తి
తిర్ లోహవ్రుసివియు ౧ దీ .... క్క్రకము
నెయిసరింపంగలవారుం గా.దా.శా.౧౨౦౬

.... దీనికి నాటందార్థికీ ముం నెయిసరియింప్పం
గ్గలవారు గా. దా. శా. ౧౦౧౨.

సరిక, సం. వి. ఆ. స్త్రీ.౧.పోవుట,సాగిపోవుట.

౨. హింగుపత్రియనఓషధి ǂ నదమేస్వస్త్రీ
౪. మాఱు పేటలహారము.

సరికట్టు, అ. క్రి.సరిదాఁకు, సరిపడు(శ.ర.)

సరికట్టు, వి. సమానమైనమితి.

తే. ఇవ్విధంబున నయ్యెద్ద నెలవిసట్ల యుండి
యొకనాఁటిరేయిఁ బ్రచండకుసుమ, కొండ
ఛండనమున సరికట్లఁ జెలఁగి, మృష్టి బొందిరి.
తెమ్మెరల్ చూఱలాడ. శుక. ౨-౬౯.

సరిక (గ) డచే. అ. క్రి. ౧. ముగియు, సమా
ప్తముగు.

వ. త్రిభువనానందమాకంద వాటికా వసంతం
బైన యవ్వృత్తాంతంబు సరికడచె.

శృం. నై. ౭-౧౦౧.

కడమే, గతించే.

రగడ. బహుకల్పాంతంబులు సరిగడచిన, పం
ద్రెండేడుల చిన్నిప్రాయమున.

కాశీ. ౬-౧౨౫.

వ. కల్పంబు అతిక్రమించి మన్వంతరంబులు జరిగి
యుగంబులు సరికడచి వత్సరంబులు చని
కాలచక్రంబు అతిక్రమించుచుండ.

భీమ. ౧-౩౧.

3. అతిక్రమించు, దాఁటు.

సీ. అతినిశ్చలప్రసాంత పతత్త్రింబులై, డిగుచుఁ
గాముని ముందటికిని గొంత, సరిగడవఁగఁ
బాతి మరలి బోరలుదట్ట, గిలవొక్క కడ
వంచి మలప్రుదిరిగి. ప్రభా. ౨-౪౨.

౪. మించు, అతిక్రమించే.

క. మేరెట్టి దట్టి శోధన, కాలము సరిగడచె నేనిఁ
గాదని కంఠే కాలుఁడు కారుణ్యనము, స్మితత
మతిఁదనకుఁదాన నిలువంబడియెన్.

భీమ. ౪-౨౦౨.

సరిగ. సరిగె,వి.౧. హారము. "జనలఁ గ్రొస్సెల
మెడహారసరిగ" ఉ. హ. ౨ ఆ. ౧౩౧.

౨. జలతారు. "సరిగంచుకోక" (శ. ర)

చ. సరిగమెఱుంగు నంట కుబుసంబునఁ జన్నవ
పిక్కటిల్ల మేల్, తరమగు కావిసింబియు
పదంబులఁ జింపులు ద్రొక్క బచ్చకప్పు
రమున హెచ్చుకుంకుమపుఁబూఁతే సుగంధము
చోడుముట్ట. వాల్మి. ౩-౧౩౦.

వ. తొడగినట్టి సరిగకంగుల కూసపు పని కవురు
పరశాలిమొంటి పొరబిగువు నిమురకానెల.
ప్రబం. ౧-౭౫.

సీ. గిలుకు మెట్టెలడాలు చలువకుచ్చెలలపై
జాగువా బంగారు సరిగఁగూర్వ.
దశా. ౨-౩౫౨.

లయగ్రాహి. బంగరపుచెక్కులఁ జెలంగు చవు
కట్టువు మెఱుంగు బలుచుక్కలకుయిం గిరిసి
జంగల్, చంగువఁ గొనన్ సరగరంగు గల
కట్టుపసకంగుల గడల్ కొనిన యోగి పయి.
రాజవాహన. ౨-౩౯.

చ. హరహరయఁ డిచ్చినన్ బిగువు లంపుల
పాదిరి నీరు రంభకా, సరిగవ దేశకుద్దబహు
చారుల వాడఁగ లాగె యంచు వే, సరిగ
మెఱుం గటంచు వగ చందురు కావి
మెఱుంగు రంగుబం,గరు నునుగొంగు జట్టి
సురకాంతల చెంతనె పంతమాడుచున్.
వాల్మీకి. ౩-౪౨.

**సరిగంగలాడు.** అ. క్రి. ఆలుమగలు కొంగులు ముడివైచికొని స్నానముచేయు.

తే. అరిద్రవతముల సరిగంగలాడ.
వసు. ౬-౬౧.

**సరిగంచు.** వి. √ సరిగ. (సరిగ + అంచు) జరీయంచు.

చ. మెఱుపు కడానిమించు సరిగంచుల చీర
చెఱఁగు కుచ్చెలం బెరయఁగ మంచి పొంద
లుకు మెట్టెల మట్టెలు ఘల్లుఘల్లనన్.
ఇందు. ౫-౧౭౫.

సీ. శాతిమించు నిరిగాంచు సరిగంచు సన్నంపు,
చేలవాఁడు సుమాస్త్రలీలవాఁడు.
ఇందు. ౪-౨౨.

సీ. చల్వచేసిన పైఁడి సరిగంచు దోవతి చుంగు
లొప్పుచు మేనిసోగసు చూప.
వేంకటాచలమా. ౧-౧౩౪.

సీ. జిగివెండి సరిగంచు కొంగావి వలువని
కాంక్షింతు రంతయుఁ గట్టుకొనఁగ.
రామ. ౪౪౦.

వ. సోలి వలిపెపసరిగంచువలువపై రాణి సేలువ
మేలుముసుఁగిడి. ఉ.రా. ౪-౧౭౪.

చ. తిలకపురంగుతో నలకదీప్తులు సెన్నసరన్
నటింపఁగాఁ గలపపుఁదావి నల్లడల గమ్మనఁ
గన్ సరిగంచుచెల్వకుచ్చెలలు పరంజి మెట్టి
యలు జీరఁగ నందెలు మ్రోయ సోయగం
బొలుకఁగ వచ్చె నత్తఱి రఘూత్తము చిత్తము
తత్తఱింపఁగన్. ఉ. రా. ౬-౧౬౧.

**సరిగద్దియ,** వి. సమానపీఠము.

క. పరిజనుల ననిపి సాధుని, పరిసరమున కేఁగి
యతని పంపున మణిపింజరితధగద్ధగితం బగు,
సరిగద్దియ నుండునట్టిసమయమునందున్.
కాశీ. ౨.౯.

**సరిగస్తు.** (షహర్‌గస్తు) హిం. వి. ఊరేగింపు.
(శ. ర)

**సరిగె.** వి. (క. సరిగె. త. చరడై.) ౧. హారము, గొలుసు, కొప్పుగొలుసు.

ద్వి. ఇరుపసేవశములు నిత్తడిసరిగె.
పండితా. పర్వ. ౩౪౩.

సీ. రతనాలకుప్పె సౌరపుజడకుచ్చులు శశిపూల
చందురుల్ సరిగెలు చెవులను బవిరెలు కమ్మ
లును. చెన్నబ. ౨-౭౦౭.

౨. కాంతి, మెఱుఁగు.

క. ఈసతికొనుచ కేసరి, కేసరిసెమ్మోము కలిమి
కిం గల్వలసా, మేసరి, మే సరిగెకు మం, చే సరి
చేసరి సిజ మురుచేసరి బిరులన్.
ముకుందవి. ౨-౧౭౩.

౩. జలతారు, జరీ.

ద్వి. గిలుఁకులఁ దడి యొత్తి సంగావివన్నె
చలువపావడలపై జాలువాసరిగె, కొంగుల
నొప్పుమకూలముల్ గట్టి.
రం. రా. బాలకాం. ౭౪ పు. ౨౯ పం.

సీ. పులితోలు సరిగపూవులు హొమ్ముకిముఖాబు
గొప్పతమాసుగా నొప్పఁజేసి.
పార్వ. ౫-౧౪౯.

సీ. సరిగముత్యపుకట్టు చంటిపై మెఱయ హార
వైన పైఁటఁజీయరచట్టదొడిగి. రఘు.

౯. కలాఁబతువస్త్రము, బంగారు బట్ట.

సీ. జాళువాసొమ్ములు సరిగమువ్వలువలు హైమ
మాణిక్యసింహాసనములు ఉ. రా. ౫-౨౬౭.

సరిగొను. స. క్రి. ౧. పాటిగొను, లెక్కసేయు

చ. వరుని నిశేకుమూలఁ బడవైచినయట్టి మనస్తు
రంగముల్ సరిగొనకన్ జవంబు గొని సాఁ
గిఁ బాటుగమై సమీరు, డా, ర్చి రహీనిరా
దరాకృతి హరింపెఁ బదోద్ధతధూళిఁ గప్పి
తిత్తురి తురగోత్తమంబులు విభూషితసాది
బలోత్కరంబు లై. బిల్హ. ౧-౩౮.

౨. చంపు, రూపుమాపు, ప్రతీకారము చేయు.

లయవిభాతి .... సరిగొనఁగఁ గంటిన్ వనసుతున
కిప్పుడను.... స్త్రీ. ౧-౧౩౧.

సరిగ్రుచ్చు. స. క్రి. వరుసగా కూర్చు, మాలిక
గాఁ గ్రుచ్చు.

ఉ. భూరివివేకచిత్తులకుఁ బోలు నసందలఁపన్,
దళంబులన్ సౌరభమిచ్చు గంధవహుచంద
మునం బ్రకటంబు శేసి యిం, పారెడుపల్కు
లం బడయు నప్పలుకుల్ సరిగ్రుచ్చునట్లుగాఁ
జేయవ నేరఁగావలయుఁ జేసెద నేఁ గృతి
యన్నవారికిన్. నిర్వ. ౧-౫.

సరిచూచు. స. క్రి. సంప్రతించు, పరిశీలిం

సరిచెప్పు. అ. క్రి. సమానమని చెప్పు.

గీ. సరసపప్పట సరిచెప్పి యరగబాను, చెదు
గరపుదొక్కయోరోః పెట్టికుక్క.

శేం. పంచకం. ౧-౨౩౯.

సరిచేయు. స. క్రి. ౧. నాశముచేయు, సమాప్తము
చేయు.

ఉ. "చేరువ చెట్టులెల్ల సరిచేసి" ఉ. రా. ౪అ

ఉ. చేరువచెట్టులెల్ల సరిసేసి నిశాటుఁడు భాను-
జాపతీత్రిరమహీరుహావళులు దెచ్చెఁ బయిన్
బడవైచు. ఉ. రా. ౪-౧౩౫

ద్వి. చెప్పు, కాచెద నేమి చేసె నాతండు చెప్ప
నేనియు సరిచేసెద మిట్లు, చెల్లునే.
బస. పు. ౧౬౮ పు. ౧౭ పం.

౨. చక్కఁబఱచు, బాగుచేయు.

౩. సమానముగా నెంచు.

కం.... దేవవిభుఁడు కృతఘ్నుం డని రోయక
సరిచేసుక, చనునే మాటాడ రాత్రిచర
మూర్ధన్యా. దశా. ౨-౪౫౧.

సరిచేసికొను. స. క్రి. సమానునిగా నెంచు.

ద్వి. హింసకు లోనౌట కేమి కారణము సంసారి
నేటికి సరిచేసికొంటి.
బస. పురా. ౧౭౦ పు. ౧ పం.

తే. ఒప్పునే యింకఁ గదపట నిప్పిరాచి, నాకు
సరిచేసికొని దేవలోకపథకుఁ నీవు నూ నీవును
మ్మని యేవిధమున గలహ మాడెద నిది నీవె
తలఁచి చూడు. కళా. ౩-౨౨౯.

సరిజోడు. వి. గజకవచము.

ద్వి. అరదముల్ పన్నుఁడు హరులఁ గట్టుండు
సరిజోళ్ళు పెట్టుఁడు సామజంబులకు ....
రం. రా. ఉ. కాం. ౬౮. ౧ పం.

సరిజెంకణము. వి. నమస్కారవిశేషము.

రగడ. ధానువ్వస్థలిఁ దలకొను జగతీశ్వరునకు
బెట్టెద సరజెంకణమని. హంస. ౪-౨౧౩.

సరితరము. వి. భూమిని సారమునుబట్టి తరగతు
లుగా నేర్పఱుచుట (శ. ర.)

సరితాళంపుమొన. వి. మల్లబంధవిశేషము.

వ. లోమొన వెలిమొన .... సరితాళంపు మొన
[illegible]

హంస. ౧-౨౦౬.

వ. లోనైన వెలినైన యొనినైన చమురునైన పుణ్యంబునైన పాపంబునైన చాటదుగు నైన దాటదుగు నైన కదలునైన యర నీటునైన నెరనీటునైన రిపశాళంపు నైన లాదిగాఁగల పదిరెంటునైనలు.

ప్రబం. ౧-౭౮.

సరితూఁగు. అ. క్రి. సమానముగా తూఁగు, సమానమగు.

ద్వి. ధరణితలంబెల్ల దానితోఁగూడ సరితూఁగ కునికియారసి జూపనుఁడు. ద్వి. ౨-౪౯ పు.

"హ్యా,తో సరితూఁగ రమ్మ ...."

రా. వి. ౩ అ (శ. ర)

శా. పువ్వుం దీవెలఁ దూఁగు టుయ్యెలలపొంపుల్ నింపఁగాఁ దూఁగు న,వ్వవ్వుంబోడుల గబ్బి గుబ్బవలి పెంబుల్ జాతి వర్తింపఁగా నశ్వేశన్ సరిమూఁగ రమ్మనుచు భూపారావభాపార్భటిం ద్రొవ్వుల్ మీఱఁగ శేల్చు జవ్వనులకుం గొం గిచ్చిన ట్లొప్పెడిన్.

రాజవాహన. ౩-౯౦.

సరిత్తు. సం. వి. త్. స్త్రీ. ౧. నది, ఏఱు ౨. దానము, సూత్రము.

సరిత్పతి. సం. వి. ఇ. పుం. సముద్రుఁడు.

సరిత్సుతుఁడు. సం. వి. అ. పుం. భీష్ముఁడు.

సరిదాఁకు. అ. క్రి. (సరి+తాకు) ౧. సరికట్టు, దృష్టాంతమగు.

"మును చెప్పినట్టికతలున్ దలపోయ యథార్థముల్ మనంబున సరిదాఁకె తాకు ...."

కళా. ౨ అ. (శ. ర)

క. కలువలు కీలకిల నవ్వెన్, తొలిమల సెలయేటి యవలితుహినాంశు కరంబులు గని యపు డేటావలి, గిలిగింతలటంట వానికిన్ సరి దాఁకెన్.

సారంగ. ౨.౧౬౨.

క. అమాటలు సరిదాఁకెఁ గ,దా మా కీవిత్తుణో త్సవాతిశయంబునన్ బేర్మిమనుఁ జూడఁ గల్గెను.

కళా. ౩-౨౦౬.

తే. కిన్నరవిహంగయుగళిచే మున్ను విన్న,సన్న తాపన్నశుభదప్రసన్నఫణితి, మదికి సరిదాఁక మోదమునఁ బొదలి మేది, నీపతి హితాగ్రణినిఁ ద్రోవఁ జూపుమనుఁడు.

వసు. ౨-౪౭.

క. ఇందు నీ యొంటిఁగివయర్థం బెల్ల సరిదాకును గదా.

కళా. ౨-౫౮.

౨. దెబ్బతిను.

ద్వి. పులిచేత వడి వ్రేటువడిన, కరివైరివిధమున గరభంబుచేత, సరిదాఁకు వడి కుంజరము చందమున.

రం. రా. ఉ. కాం. ౮౭ పు ౬ పం.

సరిదిర్చు. స. క్రి. యుక్తముగాఁ బరిష్కరించు.

మ. భుక్తిక్రియోర్జ్యలుర్వైశే హరికొల్వున్ వివిధలాస్య స్వర్థి సుభ్రూభ్రుకుం, సులవాదుల్ సరిదీర్చి....

ఆము. ౪-౩౬.

సరిద్వంతుఁడు. సం. వి. త్. పుం. సముద్రుఁడు

సరిద్వర. సం. వి. ఆ. స్త్రీ. నదులలో శ్రేష్ఠమైనది, గంగానది.

సరిపడు. అ. క్రి. ౧. అనుకూలమగు. ౨. యుక్తమగు ౩. సమానమగు.

క. పురకాంతల కానులకున్, సరిపడ దని బ్రహ్మ యాకసము వారసి వే,సరి దానిఁ గుండలించిన, సరణిన్ దివి ముట్టి యుచటి సాలం బలరున్.

చంద్రాంగ. ౧-౩౦

క. కటుకునను మెండుకిగరులు, చటులాటోపమున రెండు సరిపడఁ బోరెన్.

క్రీడా. ౧-౨౨౯.

ఉ....చేవడి వీణె నీటుటలు చి క్కాడిలించుట లున్ సరింబడన్.

శ. ర. ఆము. ౧-౬౨. (ఇటసరిఁబడు అను రూపము కనవచ్చుచున్నది)

సరిపణి. ద్వ. వి. (సరి+పెన) ౧. సొలుసు, (రూ. సరిపణీ, సరిపెణ)

ఉ. సారెకుఁ గీరముల్ ఫలరసాలము శాఖలలోనఁ ద్రిమ్మరం, గా రహిఁ దన్మధూళికకుఁ గా నళి పంక్తులు వెంటఁ గ్రుమ్మరం, గా రొద మించె నంచుఁ జెలఁకల్విన లక్ష్మియుఁ దవ్వచన్ను ధాం, ధోరుచు లానఁగా సరిపణుల్ జను లిట్టిడి పెంపఁగాఁబలెన్. ఆము. ౫-౧౪౦.

౨. బంగారులోనగువాని గొలుసు.

చ. వినసరి వేఁలిన్ గిళభుజిన్ మణివల్లరి యంఘ్రివజ్రపున్, సరిపణి శాద్రిలోకి యను చాఁకుఁ దా నొక నీటువెట్టునం, బరఁగిటిని వతంస మిది పావకమూర్తి గతిం బ్రిభాపటి, స్ఫురణముఁ బూనుకొన్న విధమున్ వివరించెద నీకు రాఘవా! చంద్రరా. ౩-౯;

సరిపుచ్చు. స. క్రి. (√సరిపోవు.) ౧. నాశము చేయు.

సీ. చీకపుర్వొక చెంతఁ జేరిపై పోఁకిన సరిపుచ్చి వైచును సస్యమంత. రామ. ౪. ౧౦౦

౨. సరిపోవునట్లు చేయు.

క. అనిమాటమాట సరిపుచ్చిన వంచకుఁ డెఱిఁగి యతనిచేతికిఁ దులనిచ్చె నతండును దాఁచిన తత్త్వనయుఁ గృతఘ్నునకు సమ్మదంబున నిచ్చెన్. వేం. పంచతం. ౧-౪౯౦.

సరిపుచ్చుకొను. స. క్రి. (సరిపోవు, రజావు) పఱచుకొను. తార్కాణించుకొను.

వ. తన్మాతలు పూర్వకాలంబునఁ దమ మామ పలికిన చతురాగమనంతో శబ్దంబునకు నర్థంబు వీరయని తమలో దాను సరిపుచ్చి కొని. కళా. ౬-౧౫౧.

వ. అవ్వనితయు నతండు పూర్వజన్మంబున మణికంధరుం డను గంధర్వకుమారుం డగుటఁ దాను నెఱిఁగినది గావున నలినకి నట్టిపిలె గలుగుట సంభవించునది యని మనంబునకు సరిపుచ్చుకొని సంతసిల్లె. కళా. ౮-౨౩౦.

సరిపురుషుఁడు. మి.వి. అధికుఁడును హీనుఁడును గాని పురుషుఁడు.

క. కులమున నధికుం డొండెను గులమున సరి పురుషుఁ డొండె గుణయుతుఁ డగు కన్యలఁ బెండ్లియాడు టుచితము కులహీనుఁడు కులజఁ జేసికొనఁ జనఁ డెందున్.

విష్ణు. ఆచా. కాం. ౯౧.

సరిపెట్టు. (√ సరి.²) స. క్రి. నాశముచేయు, చంపు.

ఉ. రాముని పేరి బాణముల రాక్షస నాయకు మీద నార్చి యా, రామ చెలంగి వైచి నరాతి భయంకరమై కణంకతో, వేములఁ బోయి దానవునిం దాఁగిఁ ద్రుంచికిరీటపంక్తులన్ భీమ ముమిఁగఁ గ్రచ్చి సరిపెట్టెఁ దదీయశరీర తేజమున్ సీతా. ౪-౨౯.

సీ. కరటితో సరిపెట్టెఁ గటికి కౌఁగిట నగ్నదిమి మహోదరు నగ్నిసుతుఁడు.

రామా. ౭. ౧౬౫.

సరిపెణ (ము) వి. (రూ. సరిపెన.) ౧. సరిపణి, గొలుసు.

వ. అంకుశపుటలుగుల క్రిందికొంకులములు కుల గతికులు కొసిన యినుప సరిపెణలు పెనకువ గలయిత్తికొమ్ము పింగోటుల గుప్పకులును ప్రబం. ౧-౮౭.

వ. పెనురొదలు పొదల మొదలుకొదమతుమ్మెదల పదువులియుప సరిపెణల పెనుపునఁ బిలుపలు చుచుఁ గనుపట్టె. కళా. ౬-౨౨౪.

౨. కుక్కల మెడలకు కట్టుగొలుసు, ఇనుపగొలుసు.

గీ. సరిపెణఁ బట్టి దెచ్చిరి జాగిలముల.

మను. ౪-౩౧.

సీ. వడిగాలి వడి నిల్వ నసపోక బలితంపు సరి పెణల్ దునియ వేసరక నిగుడు.

శుక. ౧-౧౬౦.

సీ. జాగిలాల పసిండి సరిపెణ ల్వదలించి పట్టెద లుయు ముడిగట్టువారు. చంద్ర. ౨-౩౫.

౩. బంగారు లోనగువాని గొలుసు, లలంతిక.

సీ. అనిలవటోత్కటాత్యంత దరఁ దగు లతాబింబో ష్ఠులకు సరిపెణలానంగ. అని. ౧-౪౧.

తే. చిలిచాళట్టు సరిపెణల్ రళమెసంగు,
సంగరంబులు. శుక. ౨-౨౪౧.

సరిపెణ లాఁక్తము పూఁతకాటుకతిలకంబు.
దశకు. ౩-౮౮.

చ. రఘుపుంగవు సేతువు చూడు మోము
నీ, శ్వరకుఁచంద్ర యీజలధిశైవలినీపతి
యచ్చగెంపురా, సరిపెణమేనఁటు గన ఁంద
పువాటుటగ వైచెనో యనన్.
వాల్మీకి. ౨-౭.

క. వికసించు తమ్మినుండు మధుకరావళి వెసలె
వెలుఁగుదోరఁ గనఁగా పా, రతిలావంతుఁడు
మును గొంచక ప్రమింగి వెదల్చు నినుపసపెణ
మనఁగన్. రాజవాహన. ౩-౩౦.

సీ. ఇవికాటుకొల్పిన వృద్ధకూర్మము వీఁపు
చిప్పైన సెలచికైచిపఁ జాలు. తే. గీ.
ననఁగ ఘుర్ఘురగళగర్తజనితభూరి, భూభృదు
దుబిలభరిత ఫా ఫాధయంకరార్భటీ దీర్ఘ
ఔగ్నిస్తు లగుచుఁ జెలఁగె సరిపెణలఁ బట్టి
తెచ్చిన జాగిలములు. మను. ౪-౩౧

౪. ఆభరణవిశేషము.

ఉత్సాహయుక్తగీతి. సరిపెణలు ముత్తియంపు
ముంగరలు తాళిపతకములు దాల్చి పన్నిట
పదనమిఁచు, చందనమలంది రంతిట సంత
సమున. ప్రబం. ౧-౨౭౩.

సీ... నను వెడంద యురంబునను జేరి సరిపెణల్
మిన్నఁ ఉన్నదముతో మేలగొనఁగ....
దశా. ౭-౨౭.

సీ బొగడలు శాసఁగ్రోవులు తీఁగె మెదమాలు
కుతికంటు సరిపెణ గుండ్లపేసు.
హంస. ౨-౧౯౦.

సరిపెణీ= సరిపణి వి. బంగారు లోపగువాని
గొలుసు.

సీ. మగరాల మొగముట్టు నిగనిగల్ వెలయార్చు
హురుమంజిముత్తెంపు సరిపెణీలు.
చంద్రాంగ. ౨-౬౯.

సరిపెన= సరిపణి వి. బంగారుగొలుసు.

గీ. అనుచుఁ బచ్చల కడియముల్ పారతతులు
తాళిచాళట్లు జాలువా తగటుపాగ, బంగరు
మొలుంగు పేలుపు లుంగరములు, సరిపెనల్
చాలనొసఁగె నజ్జనవరుండు.
ఇందు. ౧-౩౫.

సరి (వో) పోలు. (√సరి¹) అ. క్రి. సాటియగు,
పోలు.

ఉ. గాకు లభీకదానవగణంబులతో సరిపోలు
వారె. కకు. ౫-౪౫.

తే. కాక సరిపోలఁజాలునే కమలవైరి యనధి
గతదోష మైన యాయతివ మొగము.
శృం. నై. ౩-౧౭౧.

సరిపోల్చు. స. క్రి. (సరిపోలు) సాటిచేయు.

సీ. ఓర్పుమై నుప్పిండి నుపవాస ముండసీ,
మగవాలి సరిపోల్పఁదగదు విధవ.
కాశీ. ౨౭౩.

తే. ఇతరతీర్థంబు సరిపోల్ప నెట్లువచ్చు, దక్ష
వాటంబునకు మహాస్థానమునకు.
భీమ. ౩-౨౨౯.

సరిపోవు. అ. క్రి. (√ సరి¹ ) సమాన మగు.

వ ....పెద్దలం జెనకి యోడియు సరిరైతి ననియు
సరిపోయి జయించితి ననియు నబద్ధంబులాడి
ఆము ౬-౯౭.

౨. సమ్మతమగు, అనకూలమగు.

చ. మనమున కొండురెండు మణుమాత్రములన్
సరిపోవఁ జెప్పినన్. ఆము. ౪-౨౬౫.

మ. ఇతఁడు దోర్లీలాపముల్లాసతం, జనుదేర
న్మన మేగి విందులగతిన్ సంధించుటే కార్య
మిప్పరిశాకున్ సరిపోదు మీకు రుచియింప
బోలు నిప్పట్టునన్. కుశ ౩-౩౬౪.

౩. సరిపడు, కుదురు.

క. ధరలోఁ గ్రియాన్వయంబుల సరిపోనిద పూర్ణ
మనఁగ సమ్మతి కెక్కన్.
నరసభూ. ౪-౭౨.

ఉ. ఓ! సరిపోరె నిర్వేదలకుం దన యోగను రాణివాసిగాఁ జేసి తో తొత్తులం బనులు వేయఁగ నిచ్చినఁ బోలదంటి నే వాసికి బోర నన్నుఁ గదవం బనిపాటులు సేయు వార లే, రీ సురఁ దాసి నైమయి ద్రౌపదిదు కంటివో పట్టుకొంటివో! (ఆక్షేపణమున వ్యతిరేకార్థద్యోతకము)
వేం. పంచతం. ౧-౨౬౬.

౪. పర్యాప్తమగు, చాలియుండు, సరిపడు.

ఉ.... ఇ ధాన్యన కొంటి కాఁ, గా సరిపోవ చేకరణిఁ గాంతకు దంతపుఁ బావ లిత్తు నం, చాసను గ్రుమ్మరన్.... దశా. ౩-౧౯౯.

౫. సరించే.

తే. ఇది యొఱుంగక యున్న నా కేమి కొదవ! నీకుఁ దెలియక యుండుట నీతిగాదు, చేరి వరు లేఁడు మిమ్మాటఁ జెప్పకున్నఁ జత్తు సరి పోవు ననుము నిస్సంశయముగ.
శుక. ౩-౨౩౦,

ఉ. ఈశఁడు పద్మతీర్థమున నేగి యొకానొక నాఁడు తత్పయోధారానిజాంగుఁడై చతుకతంబున విప్రవధాదిపాతక, వారిని దొంటి పుట్టువులఁ బాసిప్తము లైన యమంబులన్ మరుద్ధూతఘనాఘనావళితో సరియై సరి పోవు నన్నియున్. పాండురంగ. ౫-౭౪.
ఆ. బిగియఁబట్టి యుంచు బెణఁక నీకడిగాక, యర్థ మిందుఁ గలదొ యనుతలపున, జేడియు కదియఁ జత్తు సరిపోవు మాట వ్యక్తిక చెప్ప ననుచు వీఁక నుండె. ప్రభా. ౪-౯

సరిప్రొద్దు. అర్ధరాత్రము.

క. సరిప్రొద్దున నరుదెంచితి, నరుణోదయసమయ మెట్టులయ్యె దురంత, స్మరమాయాంధుఁడు గావున, నరరే విప్రుండు తుర్యయామం బనియెన్. వేం. పంచతం. ౪-౨౩౭.

క. అది కడుపు కొలఁదియును దిని సదనమునకు మగిడి వచ్చు సరిప్రొద్దున నిట్లద నరసి యరుగఁ దిరుగం, బోదిచెడి యొంటైరు కొన్ని పూఁటలు చనియెన్. వే. పంచతం. ౩-౪౬

తే. గీ. దండు నులభంబె పురుషవేదంశులకును గూడిఁ గావింప గుండియల్ గుబ్బురనఁగ, జగినదివసంబు సరిప్రొద్దు దీము వేళ కోదనాదర దూరులై యుండు టరుద!"
రాజవాహన ౨-౬౭.

వ. నృత్తగీత వాద్యంబులు ప్రవర్తిల్ల సరిప్రొద్దు పోవునందాక జాగరంబు చేసి.
కాశీ. ౪-౧౨౦.

ఉ. ఆ, రాసుకు దీర్ఘరోదనవిరావము వీనులఁ బడ్డఁ గాఁ బో నీసరిప్రొద్దు పోవు నెడ నెవ్వఁడో కో విలపించుచుండెడున్.
సారంగ. ౩-౧౩౯.

సరిఫేషు. (హిం. సర్ పేచ్) వి. (చంద్రవంక వలె నుండు) శిరోభూషావిశేషము. (రూ. సర్ఫేసు, సరిపేసు)

సీ. చెలువైనకళ లీనఁగల చిన్ని వెలతూన వృథు లవజ్రపుసరిఫేషు గాఁగ.
మృత్యుంజయ. ౩-౩౦.

సరిబిత్తరము. వి. మల్లవిద్యావిశేషము.

వ. ఊరూణింపును సరిబిత్తరంబును లాగును, వింటాణంబును, తిణింగియు.
మల్లుపురా. ౩-౬౯.

వ. పక్కి ఝుణింపు సరిబిత్తరంబును లాగు స్పృశింపఁబును నాదియగు ముప్పదిరెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి.
హంస. ౧-౨౦౬.

వ. డొక్కర మొత్తర డొక్కర కుమ్మరింపు జోడింపు సందుసీసంబును కొంకుమారును సవు. సీసమ్మును చేబయ్య కందనంబును కర్ణసంబును తొట్టనఃకిల్లియు బలిబసుటయు రొండివేటును పణఁబును కర్నాటును భారంబును బొంగణయు పెట్టాగును యూణింపును సరిబిత్తరంబును లాగును వింటాలంబును
ప్రబం. ౧-౪౭.

సరిబేసులు. వి. బాలక్రీడావిశేషము.

సీ. ఆడాద సరిబేసులాడి పోవిడిచిన ముదురు వెనుకళ్ళలో ముత్తియములు. యయా. ౧-౪౩

తే. గుఱ్ఱ దాఁగిలి ముచ్చులం గోడిపట్టె శిలపాటలం సరిబేసులీలకూత, లాదిగా శైశవక్రీడ లాడి రచట రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. ౮-౨౦౨.

సీ. పెంచుల చేరిదో ఒక్క గాలిపటంబు పఱచేసి పుటచెండుచాళిసుగాట. హంస. ౩-౧౪౬.

సీ. ఆడాడ సరిబేసులాడి పో విడిచిన ముదుఱు వెముళ్ళలో ముత్తియములం. యయా. ౧-౪౮.

**సరి(రీ)మ.** సం. వి. స్త్రీ. పుం. ౧ వదక, ప్రాకుట. ౨. గాలి.

**సరిమూయు.** అ. క్రి. విషయమగు, చెడు.

సీ. తనరుపాత్రిమినుకు బొఁదలబాట సరిమాయ భాస్కరమధ్యంబు పాడువడఁగ. చంద్రాంగ. ౧-౧౭,

**సరిమిన్ను.** ఆకాశమధ్యము.

సీ. అంతేని కెంటదీప్తి మెఱుఁగెక్కి సరిమింట జరియించు సంపూర్ణ చంద్రుకంటె. భా. రా. అర. ౧౩౫.

**సరియ.** వి. ౧. సందు ౨. రంధ్రము.

సీ. సరియ యనఁ గండి యనఁగను.... రంధ్ర మదరు. ఆం. భా. ౧-౧౪౫.

౩. దంతములసందు

క. హరిపదపీఠస్థితిఁ గల, సరి యనుజిట్టెలంకి దాఁగె సంవర్తహాతిన్ దెరలి వృకంమావ్వు డాతురతం దజ్జఠరపేటిఁ దూఱిపభాతిన్. పాండురంగ. ౪-౨౪౫.

వ. ఏఁడుపెసముండ్లఁ బండ్ల సరియలం చెఱియలు వాఱి .... మను. ౪-౬౦.

**సరియగు.** (√ సరి) ౧. నరించు.

(వ్య) "తీఱని సరి=తీఱని సమాప్తము"

చ. సరియగు నిట్టిపెట్టులను సర్వమునంచు, అము. ౨-౪౮.

౨. సమానమగు.

సీ. సరియయ్యెఁ గాదు నిశ్చలమైనబిగి కొప్పు కాంతయూరులతోడఁ గరభయుగము.

**సరియించు.** స. క్రి. = సరించు. అఖండదీపము నకు నూనె సిద్ధముచేయు.

**సరియు.** సరుదు. స. క్రి. సమముగాఁబంచు.

క. తిలివంద్రులం గడియించిన ములుగులలో విత్తమెల్ల ముందలకొలచి వలపునను సరిపి పెట్టుచు సెలమిమెయి న్మ్రంగగ నొక్క యూడిగదానిన్. శల్లా. ౧. (శ. ర) చూ. మలఁగు)

**సరిలము.** సం. వి. అ. న సలిలము

**సరివచ్చు.** ద్వ. అ.క్రి. సాటియగు.

తే. ఆద్యులై పేరుగలుగు పదార్థ రవని వరుల యాగంబులకు సరివచ్చు మిగులఁగాని. భార. అశ్వ. ౪-౧౮౮.

సీ. నలినాక్షి యైరావణంబుకుంభములతో సరివచ్చు నీ గుబ్బచన్నదోయి. కాశీ. ౫-౨౭౩.

ఉ. అక్కట మీ కుటీరనిలయంబులకున్ సరిరాక పోయె నే యిక్కడి రత్నకందరములం. మను. ౨-౫౦.

సీ. సరివచ్చు ననవచ్చు శతమన్యువీటికి వివిధ దేవాగారవిభ్రమమున భీమ. ౧-౧౦౬.

క. సరివచ్చు నీతిభూతివి, తరణంబులఁ దిమ్మ ధరణిధవనందనుఁ డీ, శ్వరుఁడు యుగంధర శిఖిం, ధరకంధరములకు నని జనంబు నుతింపన్. వరాహ. ౧-౩౨

**సరివాటు.** వి. (సరి+పాటు) సమభాగము చెలిసగము.

సీ. సరివాటుగాఁ గేసరములం గ్రుచ్చిన కురువింద విరిగుబ్బసరులతోడ. కళా. ౩-౨౦౪.

**సరివాఁడు.** విశే. ౧. సమానుఁడు, తుల్యుఁడు.

మ....కంసారితో బోరిపోసరివాఁడై యరి మీఁదఁ
బెట్టుట జరాసంధుండు వైరించునే ?
ఉ. హరి. ౪-౧౨౩.

౨. తనవారు.

మహాస్రగ్ధర. సరివారం గూడి యాడె
న్జవవరసునుఁ డాశైశవక్రీడయందున్.
ఇంద. ౨-౧౮.

సరిషపము. (సర్షపము) సం. వి. అ. పుం. ఆవాలు.

సరిసరి. అవ్య. బాగుబాగు

సీ. సరిసరిబులు పెల్ల సదలనో యిపు దను
భామినీమణి నెజ్జఁబాఱ మాచి.
రసి. ౫-౧౬౦.

సరిసరి. వి. సర్వవిధముల సమత్వము.

సీ. పెక్కెంద్రదపలుకుల విక్కంబుగొనునది పాసఁ
గఁగ సరిసరిఁ బుట్టిసేని ధర్మమునిరి ధర్మజ్ఞు
లై సమహాత్ము లెల్ల. విజ్ఞా. వ్య. కాం. ౧౦౮.

క. సరిగా నొండొరువులతోఁ బరువఁపుఁ బెనఁ
కువలు పెనఁగి పాడికి ధరణీ, శ్యాసపథకు
వచ్చి లేనియు, సరిసరిదండంబు గొనుట
సద్ధర్మ మగున్ విజ్ఞా. ప్రా. కాం. ౧౨౦.

సరిసర్లు. వి. బ. శూద్రులలో నొకజాతివారు.

వ. అందుఁ (శూద్రవంశంబునందు) బద్మనాయ
కులన వెలమ లన గమ్మ లన సరిస ర్లన వంట
ర్లన బహుప్రకారశాఖోపశాఖాభిన్నంబు
లైన మార్గంబులను, భీమ. ౧-౩౧.

సరిసేయు. (√ సర్¹). స. క్రి. ౧. సమానము చేయు.

తే .... మగుర కేచి పారఁజేసు, సెనల సరిసేయ
నగు తడవీక హస్తి. భార. విరా. ౨-౧౫,

౨. పోల్చు, ఉపమించు.

సీ. జల్లిమాటలు గాక సరిచేయవచ్చునే సవరంబు
లీశరోజాతములకు. హంస. ౧-౨౧౦.

సరిహద్దు. వి. పొలిమేర.

సరీసృపము. సం. వి. అ. పుం. పాము.

సరుగు. అ. క్రి. వర్ధిల్లు, పెరుఁగు.

రగడ. సరిగె నానాలతాజాలములు పొలములు
జరదళులనొప్పె వాచాలములు నీలములు.
రాఘ. ౨-౩.

సరుఁడు. వి. గతిలేనిసరము, బాణము.

ద్వి. సరుడులు వంకిలు జముదాడ్లుఁ జాల, సరు
డుగా మెఱయ జంద్రాయుధంబులును.
పారంగ. ౧-౯. పు. ౪. పం.

తే. పురుడు వాక్రువ్వఁగా రానిసరుడు వాని
వలుగువారలఁ బొమాన్చ నలుగు వానిఁ
బులుగువార్వపు టెక్కెడుగలుగువాని, మేలు
వాటిల మిము పెంతు మేలువాని.
చంద్రాంగ. ౧-౭౪.

సరుసు. వి. ౧. ఎల్ల, మేర, సరిహద్దు.
౨. వెల్లువ, వఱద.

సరుదు. స. క్రి. సమముగా విభజించు.

తే. చలిది యతఁడు దంపతులకునుదా సరిది పెట్టు నది
తలారియొక ముద్దేఁడు నారగించి.
పర. ౪-౨౩౬.

సరుదుకొను. స. క్రి. సవరించుకొను.

సీ. సొగసుగాఁ బూదండ జొల్లెపిల్లలు గ్రొప్పు
జాఱఁగా నొకచేత సరుదుకొనుచు.
వీధినాటకము. ౨౫ పం.

సరువు. హిం. వి. (రూ. సరుగు) ఒకవిదేశపు చెట్టు ; (శ. ర)

సరువు. సం. విశ. పలుచని, సున్నితమైన, చిన్నదైన.

సరువు. సం. వి. ఉ. పుం. కత్తిపిడి.

**సరూపత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పోలిక, సాదృశ్యము. ౨. సారూప్యము అనెడు మోక్షదశావిశేషము.

**సరూపము.** సం. విణ. ౧. సమానరూపము గలది ౨. పోలినది, సదృశమైనది.

**సరె.** సరియ వి. సంపు.

చ. ని వ్వరిరూగిరంబుతో మసలం వెలుఁగుగా
చలువమంటలఁ గాల్ కలుకుట్లనంబాడుల్,
మెసవి సరింతుమేసరెలమేమయి సామిరో
కేఁటలాడుచున్. చంద్రాఁగ. ౨-౪౬.

**సరేసు.** వి.ఒకదినుసు బంక (దీనిని వజ్రమందురు) శ. ర.

**సరోజము.** సం. వి. అ. న. తామర, కమలము.

**సరోజిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పద్మము. ౨. తామరకొలను. ౩. పద్మలత ౪. పద్మసమూహము.

**సరోత్సవము.** సం. వి. అ. పుం. కొంగ.

**సరోరుహము.** సం.వి.అ. న. తామర పద్మము.

**సరోవరము.** సం. వి. అ. న. సరస్సు, కొలను.

**సరోషము.** సం. విణ. ౧. రోషముతోఁగూడినది. ౨. క్రుద్ధము.

**సర్కము.** సం. వి. అ. పుం. ౧. వాయువు. ౨. మనస్సు.

**సర్కారు.** హిం. వి. ప్రభుత్వము.

**సర్క్యూటు.** అం. వి. దేశసంచారము, తిరిగి వచ్చుట.

**సర్గక్రమము.** సం. వి. అ. పుం. సృష్టియొక్క విధానము.

**సర్గబంధము.** సం. వి. అ. పుం. పెక్కు సర్గములు గలకావ్యము, మహాకావ్యము. "సర్గబంధో మహాకావ్యమ్" సా. ద.

**సర్గము.** సం. వి. అ. పుం. ౧. త్యజించుట, విడుచుట. ౨. సృష్టి. ౩. ప్రపంచోత్పత్తి. ౪. ప్రకృతి, విశ్వము. ౫. సహజగుణము, స్వభావము. ౬. నిశ్చయము, నిర్ణయము. ౭. అంగీకారము, ఒప్పుదల ౮. అధ్యాయము, గ్రంథమందలి భాగము. ౯. ఉద్యమము, ఉత్సాహము, పురోగమనము. ౧౦. విసర్జనము (మలాదుల యొక్క) ౧౧. మోహము, మూర్ఛ ౧౨. (వైదికము) అశ్వము.

**సర్గుఁడు.** సం, వి. అ. పుం. శివుఁడు.

**సర్జకము.** సం. వి. అ. పుం. ౧. జీవకము అను గంధద్రవ్యము. ౨. వేఁగిస, సాలము ‡

**సర్జనము.** సం. వి. అ. న. ౧. విసర్జించుట ౨. విడుదలచేయుట. ౩. సృష్టించుట. ౪. మలాదులను విడుచుట ౫. సేనాపృష్ఠభాగము.

**సర్జము.** సం. వి. అ. పుం ౧. సాలము, మద్ది ‡ ౨. సాలవృక్షనిర్యాసము ౩. కలపకు పనికివచ్చు ఒకవిధమైనచెట్టు ‡

**సర్జరసము.** సం. వి. అ. పుం. ౧. యక్షధూపము ౨. వాద్యభాండవిశేషము. శ. ర.

**సర్జి(ర్జీ)కా.** సం. వి. ఇ. ఈ. ఆ. స్త్రీ. సరోవర తీరములందు లభించు నొకవిధమైన లవణము (Natron)

**సర్జికాక్షారము.** సం.వి.అ.పుం. సజాకారము. శ. ర.

**సర్జువు.** సం. వి. ఉ. పుం. వర్తకుఁడు, వ్యాపారి

**సర్జువు.** సం. వి. ఊ. స్త్రీ. ౧. మెఱుపు, విద్యుల్లత. ౨. కంఠహారము ౩. పోవుట, వెంబడించుట.

**సర్జ్యము.** సం.వి.అ.పుం. సాలవృక్షనిర్యాసము

**సర్దు.** వి. సరుదు.

**సర్పచ్ఛత్రము.** సం. వి. అ. న. కుక్కగొడుగు.

సర్పణము. సం. వి. అ. న. ౧. ప్రాకుట, జారుట. ౨. వక్రగమనము, మెలికలుగా నడచుట. ౩. భూమికి సమాంతరమైన బాణప్రసరణము.

సర్పతృణము. సం. వి. అ. పుం. ముంగిస.

సర్పధారకుడు. సం. వి. అ. పుం. పాముల వాడు.

సర్పభుక్కు. సం. వి. జ్. పుం. ౧. నెమలి. ౨. కొంగ. ౩. పెద్ద పాము.

సర్పమణి. సం. వి. ఇ. పుం. పాము పడగపై నుండు మణి.

సర్పము. సం. వి. అ. పుం. ౧. పాము. ౨. వక్రగమనము. ౩. జారుట, ప్రాకుట. ౪. ప్రవహించుట. ఆశ్లేషానక్షత్ర కూటము. ౫. ఒక మ్లేచ్ఛ జాతి.

సర్పవిత్తు. సం. వి. ద్. పుం. పాములవాడు; పాముల మంత్రగాడు.

సర్పశిరము. సం. వి. స్. పుం. అభినయ హస్త విశేషము.

సర్పసత్రము. సం. వి. అ. న. సర్పయాగము.

సర్పహము. సం. వి. న్. పుం. ముంగిస.

సర్పహుడు. సం. వి. న్. పుం. గరుడుడు.

సర్పాంకుశము. వి. మల్లబంధ విశేషము.

వ. లోబిత్తరి వెలిబిత్తరి సర్పాంకుశంబును అల్లి మత్తును. మల్లు పురా. ౩-౬౯.

సర్పారాతి. సం. వి. ఇ. పుం. ౧. గరుడుడు. ౨. నెమలి. ౩. ముంగిస.

సర్పారి. సం. వి. ఇ. పుం. = సర్పారాతి.

సర్పావాసము. సం. వి. అ. న. గంధపు చెట్టు.

సర్పాశనము. సం. వి. అ. పుం. నెమలి.

సర్పి. సం. విశే. న్. ౧. ప్రాకునది, ౨. జారునది. ౨. మెలికలుగాఁ బోవునది, వంకరగా నడచునది. ౩. కదలునది, నడచునది.

సర్పి. సం. వి. స్. న. నేయి.

సర్పి. (దేశ్య) ఒక విధమైన చర్మవ్యాధి.

సర్పిణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆడు పాము. ౨. ఒక యోషధి.

సర్పిష్మంతము. సం. విశే. త్. నేతితోఁ దయారు చేయఁబడినది, నేయి కలది.

సర్పెన = సరిపెణి. వి. బంగారు లోహపువాని గొలుసు.

సీ. .... చిటిలు గంధముతో డిటీని సర్పెనచిక్కు మిసిమిమరుపటి దోఁచుపసపుబెక్కు. భోజసుతా. ౧-౭౯.

సర్పేశ్వరుడు. సం. వి. అ. పుం. వాసుకి, నాగ రాజు.

సర్పేష్టము. సం. వి. అ. న. గంధపు చెట్టు.

సర్మము. సం. అ. పుం. ౧. వెళ్ళుట, చలనము. ౨. ఆకాశము. ౩. స్వర్గము. న. న్. సౌఖ్యము.

సర్య్యా. సం. వి. అ. స్త్రీ. బాలెంత కిచ్చెడు మందు. కాయము. క. ర.

సర్వంకషము. సం. విశే. అ. అ. అ. ౧. సర్వమును నాశముచేయునది. ౨. సర్వశక్తిమంతము.

సర్వంకషుడు. సం. వి. అ. పుం ౧. దుష్టుడు. ౨. కుటిలుడు. ౩. దుర్జనుడు.

సర్వంసహా. సం. వి. అ. స్త్రీ. అన్నిటిని మోయునది, భూమి.

సర్వకము. సం. విశే. ౧. అంతయు, అన్నియు. ౨. మొత్తము, పూర్తి.

సర్వకరు(ర్మ)డు. సం. వి. అ. (న్) పుం. శివుడు.

సర్వకర్మీణము. సం. విణ. అన్ని పనులను చేయునది.

సర్వకాలీనము. సం. విణ. ౧. అన్ని కాలములందు ఉండునది. ౨. శాశ్వతమైనది.

సర్వకేశి. సం. వి. న్. పుం. ౧. నటుఁడు. ౨. అభినేత.

సర్వగ. సం. వి. ఆ. స్త్రీ. ప్రియంగు వృక్షము. İ

సర్వగము. అంతట నిండియున్నది, అంతట వ్యాపించినది. వి. అ. న. ౧. బ్రహ్మము. ౨. పరమాత్మ. ౩. ఆత్మ.

సర్వజనీనము. సం. విణ. ౧. ఎల్లరకుఁ దెలిసినది. ౨. ప్రఖ్యాతము, ప్రసిద్ధము. ౩. ఎల్లరకు హితమైనది.

సర్వజిత్తు. సం. విణ. త్. ౧. సర్వమును జయించునది. ౨. అప్రతిమానము.

సర్వజిత్తు. సం. వి. త్. పుం. ఒక సంవత్సరము పేరు.

సర్వజ్ఞుఁడు. సం. వి. అ. పుం. ౧. అన్నియుఁ దెలిసినవాఁడు. ౨. శివుఁడు. ౩. బుద్ధుఁడు. ౪. పరమాత్ముఁడు.

సర్వతః. సం. అవ్య. ౧. అన్నిదిక్కులనుండి. ౨. అంతట, అన్ని దిక్కులందు. ౩. పూర్తిగా, అంతయు.

సర్వతశ్శుభ. సం. వి. ఆ. స్త్రీ. ప్రియంగు వృక్షము. İ

సర్వతోగామి. సం. విణ. ౧. అంతటను సంచరించునది. ౨. ఎచ్చటికైనను పోఁగలది.

సర్వతోభద్ర. సం. వి. ఆ. స్త్రీ. నర్తకి, నటి.

సర్వతోభద్రము. సం. వి. అ. పుం. ౧. విష్ణుదేవుని రథము. ౨. వెదురు, కీచకము. ౩. పద్యబంధ విశేషము. ౪. నాల్గుదిక్కులందు ద్వారములు గలభవనము. ౫. నింబవృక్షము. ౬. సేనావ్యూహవిశేషము.

సర్వతోముఖము. సం. విణ. ౧. అన్నివిధములయినది. ౨. అపరిమితమైనది. ౩. సంపూర్ణమైనది.

సర్వతోముఖము. సం. వి. అ. పుం. ౧. ఆత్మచైతన్యము. ౨. స్వర్గము. వి. అ. న. ౧. జలము. ౨. ఆకాశము.

సర్వతోముఖుఁడు. సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨. శివుఁడు. ౩. పరమాత్ముఁడు. ౪. బ్రాహ్మణుఁడు. ౫. అగ్ని.

సర్వత్ర. సం. అవ్య. ౧. అంతట, అన్నిచోటులందు. ౨. అన్ని వేళలందు.

క. ధాత్రీశుల కర్జున, సర్వత్రజయముఁ బుత్రుచేఁ
బరాభవముఁ గనం, బాత్రము ........
జైమి. ౮ ఆ.

సర్వత్రగామి. సం. వి. న్. పుం. వాయువు.

సర్వత్రగుఁడు. సం. వి. అ. పుం. = సర్వత్రగామి.

సర్వధా. సం. అవ్య. ౧. అన్నివిధముల. ౨. పూర్తిగా, బొత్తిగా. ౩. కేవలముగా, నిశ్చయముగా. ౪. ఎల్లవేళలయందు. ౫. అతిశయముగా, అత్యంతముగా.

సర్వదమనుఁడు. సం. వి. అ. పుం. ౧. అన్నింటిని వశపఱుచుకొనువాఁడు, అజేయుఁడు. ౨. శకుంతలాదుష్యంతుల పుత్త్రుఁడు, భరతుఁడు.

సర్వదర్శనసంగ్రహము. సం. వి. అ. పుం. సాంఖ్యాదిషడ్దర్శనములసిద్ధాంతములను క్రోడీకరించి మాధవాచార్యులు వ్రాసినగ్రంథము.

సర్వదా. సం. అవ్య. అన్నివేళలందు, ఎల్లప్పుడు, శాశ్వతముగా.

కం. ఒకవర్షశతంబున నొం, డొకతీర్థమునందుఁ
గల్గుప్రయోజనలాభం, బొకదివసంబున వానం
దకాననమునందు సర్వదా సిద్ధించున్.
కాశీ. ౮ ఆ.

సర్వదుంబలా. హిం. వి. పన్ను లేని మాన్యము.

**సర్వధనము.** సం. వి. అ. న. (గణితమున) క్రమవర్ధమానములైన యంకెలుగల యొక సంఖ్యయందలి అంకెల మొత్తము.

**సర్వవేదముఖుఁడు.** సం. వి. అ. పుం. అగ్ని.

**సర్వధారి.** సం. విణ. న్. సర్వమును ధరించునది.

**సర్వధారి.** సం. వి. న్. పుం. ఒక సంవత్సరము పేరు.

**సర్వధురీణము.** సం. వి. అ. పుం. అన్ని బరువులు మోచెడి యెద్దు.

**సర్వనామము.** సం. వి. న్. న. (వ్యాక) నామమునకు మాఱుగా నుపయోగింపఁదగిన పదము (పర్యాదిపదములు సర్వనామములు)

**సర్వభక్షు.** సం. వి. అ. స్త్రీ. ఆఁడుమేక, మేకపెంటి.

**సర్వభక్షకుఁడు.** సం. వి. అ. పుం. అన్నింటిని భక్షించువాడు, అగ్ని.

**సర్వమంగళ.** సం. వి. అ. స్త్రీ. పార్వతి.

**సర్వమంగళము.** విణ. శూన్యము.

> ఉ. వండినచొప్పునుం బోగపువాసనయుం బోగపాలుచందమున్ భాండసమృద్ధిసంపదయుఁ, బానవిభూతియు సర్వమంగళం బండజయానరి త్తిప్రియ మాడెడుచేఁడును భోజనంబు లే, కుండుట గానవయ్యె నసితోత్పలగంధియు పేమిమాయయో. భీమ. ౨-౧౩౩.

**సర్వమాన్యము.** సం. వి. అ. న. ఏవిధ మగుపన్నులేక గౌరవార్థము ఇచ్చిన గ్రామము లేక భూమి.

> సీ. మాకందవని సర్వమాన్యంబుఁ జేసెదఁ బ్రకటింపుడీ వన్నుఁ బికములార! కమలాకరంబుఁ బాళెముపట్టు గొనఁగొన పెంచుఁడీ వాడెన వంచలార! చంద్రాంగ. ౪-౫౨.

**సర్వము.** సం. సర్వ. ౧. ఎల్ల, అన్ని.

**సర్వము.** సం. విణ. ౧. పూర్ణమైనది. ౨. నిశ్చితమైనది. వి. న. జలము.

**సర్వమూషకము.** సం.వి. అ. పుం. అన్నింటిని కొంగిలించునది, కాలము.

**సర్వరసము.** సం. వి. అ. పుం. ౧. సాలవృక్షనిర్యాసము. ౨. బంక, ఉప్పు, ఉప్పదనము. 3. ఒకవిధమైన జంత్రము.

**సర్వరసుఁడు.** సం. వి. అ. పుం. విద్వాంసుఁడు.

**సర్వరి.** సం. వి. ఈ. స్త్రీ. = శర్వరి.

**సర్వల(లి).** సం. వి. అ. ఈ. స్త్రీ. చిల్లకోల, తోమరము.

**సర్వలగ్గ.** మి. వి. శత్రుసేనలు నలువంకలనుండి కోటనెగఁబ్రాకుట.

> వ. రాజవాహనుండు కటకటంబడి కటంబులునాడుగఁజని కోపాటోపం బంకురింప శంకారహితహుంకారపూర్వకంబుగా లేశ్య సర్వలగ్గయని చాటింపంబంచి. రాజవాహవ. ౫-3౨.

**సర్వలింగి.** సం. వి. న్. పుం ౧. మోసగాఁడు, కపటవేషధారి. ౨. వేదబాహ్యుఁడు, పాషండుఁడు.

**సర్వలోహము.** సం.వి.అ.పుం. ఇనుపబాణము.

**సర్వవల్లభ.** సం. వి. అ. స్త్రీ. కులట, వేశ్య.

**సర్వవేదుఁడు.** సం. వి. న్. పుం. సర్వసంపదలను దక్షిణగా నిచ్చి యజ్ఞముచేయువాఁడు.

**సర్వవ్యాపి.** సం. విణ. న్. అంతటను అలముకొన్నది, అంతట నిండినది.

**సర్వశః.** సం.అవ్య. ౧. పూర్తిగా,నిశ్చయముగా. ౨. అంతటను,సర్వత్ర. 3. అన్నిదిక్కులందును.

**సర్వసంగతము.** సం. వి. అ. పుం. త్వరగాఁబంటకువచ్చు నొకవిధమైన వరి.

సర్వసహా. సం. వి. ఆ. స్త్రీ. = సర్వంసహా.

సర్వసాక్షి. సం. వి. న్. పుం. ౧. పరమాత్మ ౨. వాయుదేవుఁడు. 3. అగ్నిదేవుఁడు.

సర్వసిద్ధాంతము. సం. వి. అ. పుం. అన్నిమతములవారిచేతను అంగీకరింపఁబడిన సిద్ధాంతము.

సర్వసిద్ధి. సం. వి. ఇ. స్త్రీ. సర్వతోముఖమైన విజయము.

సర్వసిద్ధి. సం. వి. ఇ. పుం. బిల్వవృక్షము Ì

సర్వస్వము. సం. వి. అ. న. ౧. అంతయు, మొత్తము, ౨. ఒకనిసమస్తమైన సొత్తు. 3. సారము, తత్త్వము.

సర్వహారకము. సం. వి. అ. పుం. మృత్యువు, మరణము.

సర్వహితము. సం. వి. అ. న. మిరియము. (Black pepper)

సర్వాంగము. సం. వి. అ. న. ౧. శరీరమంతయు ౨. వేదాంగము లన్నియు.

సర్వాంగీణము. సం. విశే. ౧. అన్నియంగములకు సంబంధించినది. ౨. అన్నియంగములందును వ్యాపించినది.

సర్వాంగుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సర్వాకారము. సం.అవ్య.పూర్తిగా,సమగ్రముగా (సమాసములందు వాడఁబడును)

సర్వాణి. సం. వి. ఈ. స్త్రీ. (చూ. శర్వాణి)

సర్వాత్ముఁడు. సం. వి. న్. పుం. శివుఁడు.

సర్వాధ్యక్షుఁడు. సం. వి. అ. పుం. సర్వవిషయములను అధ్యక్షించువాఁడు.

సర్వానుక్రమణి (క). సం. వి. ఆ. ఈ. స్త్రీ. సర్వవిషయములపట్టిక (సూచిక)

సర్వానుభూతి. సం. వి. ఇ. స్త్రీ. తెల్లతెగడ Ì శ ర.

సర్వాన్నీనము. సం. విశే. అన్నివిధములైన యాహారపదార్థములను భక్షించునది.

సర్వాభిసంధి. సం. విన్. పుం. ౧. అపనిందాప్రచారకుఁడు. ౨. కపటధార్మికుఁడు.

సర్వాభిసారము. సం. వి. అ. పుం. చతురంగసమేతమైన సైన్యము.

సర్వార్థసాధిక. సం. వి. ఆ. స్త్రీ. దుర్గాదేవి.

సర్వార్థసిద్ధుఁడు. సం. వి. అ. పుం. బుద్ధభగవానుఁడు.

సర్వావసరము. సం.వి. అ. పుం. అర్ధరాత్రము

సర్వీ. ఆం. వి. పొలములను కొలుచుట మొదలగు పనులు.

సర్వేశుఁడు. సం.వి.అ.పుం.౧. పరమాత్ముఁడు. ౨. సర్వమునకు ప్రభువు, రాజాధిరాజు.

సర్వేశ్వరుడు. సం.వి.అ.పుం.చూ. సర్వేశుఁడు.

సర్వౌఘము. సం.వి.అ. పుం. సర్వాభిసారము.

సర్షపము. సం. వి. అ. పుం. ఆవాలు. (రూ. సరిషపము) ౨. ఒక అల్పమైన తూకపు కొల. 3. ఒకవిధమైనవిషము.

సల్లు. వి. గ్రుక్కుటయందగు ధ్వన్యనుకరణము. "వెలుఁగులతోని వేవెలుఁగు వేఁడిమి సల్లున గ్రుక్కు" చంద్రా. ౨ ఆ శ.ర,

సల. వి. (క. స. ల) ౧. ప్రవేశము.

సీ. శేకరిసామి నీ వీపట్టు సూడుము బోయ నీవాసఁచాయకావుము. ప్రబం. ౧-౧౯3.

౨. వత్తి, వర్తిక.

చ. పొలిఁ లపెల్ల సోసి కొనిపోయెను వారును
బోయి పోటులన్ సలలికువారు ....
కుమా. సం. ౧౧-౪౪౮.

సీ. గతిగాన .... ఎపకంబుతోఁ దాఁకునీటెలు
గుమిసిన పలువోటులకుఁ జల్పుసలలు గాఁగ....
కుమా. సం. ౧౧-౬౯౨.

౩. ఏటి కాలువ లోనగువానినీళ్ళు అవలికిఁ బోవుటకు నడుమనడ్డముగా నిలిపెడుజల్లి తడక. శ. ర.

సలక. వి. ౧. చిన్నగోనె (మా. అడిగము) ౨. రెండున్నరతూము. శ. ర.

సలక్షణము. సం. విణ. అ. ఆ. అ సమానలక్షణములుకలది.

సలగ. వి. సలగపాఱ.

సలగపాఱ. వి. పాఱచిప్ప.

గీ. మఱియు దోఁకినగొడ్డలి మచ్చుకత్తి సలక
పాఱయు మొదలు గాఁ గలిగినట్టి, సాధనంబులు.
విప్ర. ౪-౩.

సలగము. వి. విష్ఠ, మలము.

సలగ్నకము. సం. విణ. హామీయిచ్చిసంపాదింపఁబడినది (అర్వా)

సలజ్జము. సం. విణ. అ. ఆ. అ ౧. సిగ్గుగలది. ౨. వినయముగలది.

సలము. సం. వి. అ. న. జలము.

సలరేవు. చెలరేఁగు. అ. క్రి. విజృంభించు.

క. తలలు తెగిపడినట్లుగ ....ిసలరేవంబొడిచె
నుగ్రసమరాగ్రమునన్.
కుమా సం. ౧౧-౬౯౦.

సలలితము. సం. విణ. మనోహరము.

క. లలిఁ బదములతో నర్థము సలలితముగు కెచట
నతిప్రసారము కృతులన్, బలిపఫుఁబయ్యెద
లోనన్, దొలకాడెడు వలుదచన్నుదోయిని
బోలెన్. కావ్యా. ౪. ఉల్లా. ౭౩ ప.

సలవ. వి. సలగ.

సలసల. వి. క్రాగుటయందును, తెల్లుటయందును నగు ధ్వన్యనుకరణము.

సీ. పన్నీ రనుచు నన్ను భ్రమయించి యక్కటా!
సలసలఁ గ్రాఁగుక్రొంజమురు చల్లి.
చంద్రాంగ ౪-౧౪.

"సరసిపై నీరు సలసల దరలె" పాండు ౧.ఆ

క. ఆగోనెకావశనగు లాంగోలప్రళయదహన
హాళహాళిహేలా ఖేలాత్మదేహకిరణ, జ్వాల
లచేఁ దజ్జలంబు సలసల గ్రాఁగన్.
వరాహ. ౧౦-౭౦.

క. సలసల గ్రాఁగెడు తైలము కొలఁదిరెంబుఁగఁ
దలఁచుభంగి గుణరత్నసము, జ్జ్వలుఁడుగు
భిల్లున నులికెను, జలనిధిలో నస్తమించు జల
జాప్తుక్రియన్. ద్వా. ౬-౧౨౬.

సలహా. హిం. వి. ౧. ఆలోచన. ౨. సమ్మతి.

సలాక. (సం. శలాకా) ౧. బంగారులోనగువాని కమ్మి.

ఆ. వె. కెంపుటాలవనుమ సొంపారుపసిఁడి స
లాకపోరె పీక లలిఁదనర్చు.
అ. రా. యుద్ధ ౫౪౯.

సీ.... కదఁగి పంచాగ్నులనడు చక్కనిలుమచో
లలితమాపసిఁడి సలాకజోక....దశా. ౫-౩౧.

౨. వెదురు మొదలగువాని బద్ద.

క. కీసిన వెదురు సలాకలు సేసిన యిరుదలకిఖండి
నిడుముంచమునన్ దోసఁలి కటకుటీర విలాసిని
రమియించే మిండల సహస్రములన్.
క్రీడా. ౧-౪౦.

ఉ. సౌరభ మొందు కాంచనపు జంత్రపు ప్రతిక
వాగ్విలాసము ల్వారక చేర్పు రత్నపుశలాక
తిరంబగురూపు(జెందు తో,ల్కారు మెఱుంగు
జీవకళ(గాంచినచిత్త్రరుబొమ్మయాన శృం
గారిణి యానుధాసరసీ(గా సతిసేయు(గ
వచ్చు పెచ్చెలిన్. హంస. ౧-౬౪.

ఉ.ప్రస్నని మేను పుష్పలత ౖ(డినలాక ప్రసూన
నాయకం,బు. విక్ర. ౩-౪౭.

సలాపము. వి. సముద్రములో ముత్యాలచిప్ప
లేఱుట.

సలాము. వి. (హిం. సలామ్) నమస్కారము,
వందనము.

రగడ. భర్మరస్థలమున(బరగు బలాఢ్యస్వామి
సలా మని సత్కారమెత్తుచు,
హంస. ౪-౨౧౩.

సలాముచేయు. క్రి. నమస్కరించు.

సీ. కేటారుతునియలు కేయుమేలైన వ, జీర్ల
వచ్చి సలాముచేసినిలువ. సారం. ౧-౬౨.

సీ. చలువదుప్పటులు కుచ్చెలయంచు ముత్తెముల్
పదినఖ్రపభకు సలాము సేయ.
శుక. ౧-౨౦౦.

చ. అని తలపోసి యేనిటు రయంబున(దెచ్చితి
నిస్తురంగము(, గను(గొను మిత్తురంగము విక
ల్పి నిష్ఠురహేమచే(బరా, కని ముహురు
న్మరున్మ్రపుముఖంబున సారెకు సారెకున్
సలా, మొనరుచు దీని(గైకొని జయోన్నతి(
జెందుము రాజనందనా! వసు. ౨-౪౮

చ.సరిగ సలాముచేసి ముడిసన్న పుత్రాళ్ళు ధరించి
మల్లులై, బిరబిర తాళకంబు లిడి పేర్కొని
మీసలుదువ్వి. ప్రబం. ౧-౮౧.

సలి. వి. సందడి, అలికిడి.

శం. సలిచప్పుడు లేక మ్మెయి(దొ(గిన సైన్యంబు
లెల్ల(దొడిమూరంగాగ లయ(బడి.
ఉ. హరి. ౩-౩౧.

సలించు. అ. క్రి. చలించు.

వ. చలిచిపోక చాలింపక సలింపక.
ఉ. హరి. ౪-౨౪౮. (శ. ర)

మ. అనిలోయుందు రథాంగమాత్రనయనం డా
ఢీలనీలాంగు(డు వ్యసలింపంగ బకారిరై
నడిచె. హరి. ఉ. ౧౦.౩౧.

సలికము. విణ. అల్పము, శ. ర.

సలిగ. వి. (త. చలిగై. క. తు. సలిగె) ౧. ఆశ్ర
యము, ప్రాపు.

సీ.సలిగయుంచవల(గ నాశ్రయబలంబు చెలంగు....
ఆం. భా. ౨-౨౫౧.

క. అరుకక మాయింటికిరా, వల దనుచుట్టంబు
నాగ(క)వాసములోనన్,గలదో చూతమయా
చెలి, సలిగభయం బేల రమ్ము సద్గుణశీలా!
ఉత్తర హరిశ్చం. ౪-౧౨౬.

౨. కూడని స్వాతంత్ర్యము.

సీ. ఔర బాగాయె నీకేమి యంతసలిగ యీామె
శివభక్తురా లని యెఱుక లేక, యత ని
గర్హించె టొప్పనే యనుచు(గసలి సుదతి
యొక్కటై గట్టిగా జుట్టువట్టె.
పార్వ ౪-౧౨౧.

సలితము. వి. కొలువుడుకానిని కొలువునుండి
త్రోయుట (కొలువునందు చేర్చుకొనుట లావ
ణము) శ. ర.

సలిలకుంతలము. సం. వి. అ. పుం. నాచు,
శైవలము.

సలిలక్రియ. సం. వి. అ. స్త్రీ. అంత్యక్రియలందు
శవమునకు స్నానముచేయించుట.

సలిలము. సం. వి. అ. న. ౧. నీరు, జలము,
౨. ఉత్తరాషాఢానక్షత్రకూటము.

సలిలరయము. సం. వి. అ. పుం. జలప్రవా
హము, ఏఱు.

**సలిలాశయము.** సం. వి. అ. పుం. ౧. కొలను. ౨. నీటిని నిలువచేయుతొట్టి.

**సలిలేంధనము.** సం. వి. అ. పుం. బడబాగ్ని

**సలిలోపప్లవము.** సం. వి. అ. పుం. ౧. వఱద ౨. జలప్రళయము.

**సలీలము.** సం. విణ. ౧. విలాసముగలది. ౨. ఒయ్యారమైనది. ౩. భావవ్యంజకమైనది. ౪. శృంగారమైనది.

**సలీసు.** హిం. విణ. సులభమైనది.

**సలుఁగ.** వి. ధాన్యము కొలుచునపుడు నిర్ణీతసంఖ్య ముగిసినతోడనే గుఱుతుకై దోసిటతో నెత్తి పోసెడుధాన్యపుకుప్ప. ౨. కొలుచువానికి ప్రతి కింతయని యిచ్చెడు పెచ్చుధాన్యము. ౩. పెచ్చె ౪. రూపాయలు లోనగునవి యెంచునపుడు నిర్ణీతసంఖ్యముగిసినతోడనే గుఱుతుకై యెత్తియుంచెడు రూపాయలలోనగునది (చూ. సలువ) (దీనినే సలగయని వాడెదరు)

**సలుగు.** వి వరాహము, పంది.

సీ. ఒకచేత సలుగొంట నొక దుప్పికొదముగా
నొక్కడూఁచినయూఁపు లుప్పతిల్ల.

శుక. ౪-౯౩.

క. ఎలుగుల పులుగుల నలుగుల, గులగులలుఁగఁ
జేసి పట్టుకొనిబిట్టులుకం బలుగులసలుగుఁ బులుగులఁ
గలఁగంగాఁ జేసి రట్టిగట్టి కిరాతుఁడ్.

రాజవాహన. ౩-౬౦.

**సలుప.** వి. కమ్మరివాని యొక్క నొకపనిముట్టు.

ఉ. సలుపకతన రాయి సారె కలాసంబు క్రొ
యినుము, జల్లికదవముల్లు,మంటిముంత గుబ్బ
ప్రమాను సావంబును, మన్ను మోయఁబోఁగు
పులయుచుండు. హంస. ౫-౫.

**సలువు (ల్పు) (రూ. చేలుపు).** స. క్రి. ౧. కావించు, చేయు.

గీ. ఆశరచ్ఛేదనము తృణప్రాయముగను సలుపుకొ
వింతయదియు కావలెనటన్న.

దశా. ౧-౨౪౮.

సీ. హరినివినుతియించునంచు నానావేదశాస్త్ర
ములే ఖిలముగా సల్పువారు. దశా. ౩-౭౬.

౨. కదపు,

ద్వి. ఎలమి శుక్రుఁడు పురోహితుఁడుగా కడిమి,
వెలయు రాజ్యము పెక్కువేలేడు లంచు సలు
పుచు.... రం. రా. ఉ. ౧౬౦. పు. ౨౦పం.

**సలుపు.** అ. క్రి. (కుఱుపు మొదలుగునవి) బాధ కలిగించు (సరుపు అని శ. ర, చి. వి., బ్రౌ.) (వ్యవ) పుండు సలుపుచున్నది. కుఱుపు సలుపుచున్నది. పండ్లు సలుపుచున్నవి.

**సలుపు.** వి. ౧. పుండు, కుఱుపు. మొ. వాని వలనఁ గలిగెడి బాధావిశేషము.

తి. సారంగ. ౨-౩౬.

సీ. వంతగాని వెతారము కాఁయపెక, ....కొంప
లంబు, సలుపునోలి యనంగఁ బగు వ్యథ
అం. భా. ౧-౧౫౦.

(వ్యవ) మంట, పోటు, సలుపు అధికముగా నున్నవి.

౨. బాధ

ద్వి. ఇలబొమ్మదిలఁ బడి యేడ్చుచు నొదలిపలు
పున వదలుచు జడిఁగొని వొరుగు, కన్నీరు
సోనల" ద్వి.తి.సా. ౨-౩౬. పు. ౧౯ పం.

**సలువ.** వి. అధికము, పెచ్చు. (సలుగుయొక్క రూపాంతరము)

**సలోకత.** సం. వి. అ. స్త్రీ. ౧. ఒకేలోకమునం దుండుట. ౨. ఆరాధింపబడిన దేవత యుండు లోకమునం దుండుట (చతుర్విధముక్తులలో నొకటి చూ. సాలోక్యము)

**సల్లకి.** సం. వి. ఈ. స్త్రీ. (రూ. సల్లక్. అ. స్త్రీ) అందుగుచెట్టు ।

**సల్లపనము.** సం. వి. అ. న. సల్లాపము.

చం. వాక్యవిస్తరచతురత్వ మేర్పడఁగసల్లపనం
బొనరించు. భార. విరా. ౨౦౮.

సల్లాపము. సం.వి.అ.పుం. పరస్పరసంభాషణము

సల్లాపించు. సం.అ.క్రి. పరస్పరముసంభాషించు.

సవ.వి.౧. జాడ. (దీనియామ్రేడితరూపము సవసవ)

వ. అప్పరిమళంబు సవ పట్టుకొనిపోయి.
కాశీ. ౪-౧౨౩.

క. ఆసవ యొయ్యన నెఱిఁగి మృగాసురు వెను
వెంటఁ బోవ వదలించి గత, త్రాసుఁ డయి
చేతికఁ గొని త్రేసె న్నను నిట్లు గోమవివ
శుం డగుచున్. రాఘశే. ౨-౩౨.

౨. క్రమము.

క. రవిశశికుజబుధసురగురు, కవిభానుజ రాహు
కేతుగణములు వాకున్, దవిలి ఘటంబున
నుండుచు, సవ నిత్తునగాతి సకలసంపద లెపు
డున్. అప్పక. ౧-౨౫.

౩. ఛాయ.

క. సవరాలఁ దెగడి నీలపు, సవరాలుచు కురులు
దనరుజవరాలి కొంటు విరాలి దెలుప
వచ్చెను, లోవరావియ్యంపు మోము దుల
కింపంగన్. ప్రబం. ౧-౪౫౦.

సవతాణము. దే. వి. ౧ వీణకుఁ గట్టఁబడిన్స్వర
భేదమును దెలుపుతీఁగెలలో నొకటి. ౨. స్వర
స్థానవిశేషము.

ద్వి. తనరుచు మెుగచాళమును నవతాణమును....
సారణయుఁ దలిర్ప సంప్రీతి నిపుడంగ.
బస. పుం. ౩౦ పు. ౨౭ పం.

సవడి. వి. ౧. ఆయుధవిశేషము.
చ. సవడులు భిండివాలములు శక్తులు శంఖులు
దోమరంబులున్....కుమా. సం. ౧౧-౯౫.

సీ.శతమూడ్కిఁ దునియలుగా చేయు విలుకానిఁ
గని దలఁబడక్కైచు సవడికాని.
కుమా. సం. ౧౧-౬౧౦.

౨. (సవ్వడియొక్కరూపాం) జోడు.

సీ....రమణఁబెంచిన మయూరమ్ములు తేలుథ్రు
కమ్నెల కరతాళగతుల వాడు, వసిన నంచుల
ననిచెప్ప నమరులైన,సవడిగ్రహరాజు మేదలు
సవరణలను, మేటితొడవులు నిట్టిట్టిపాటి
వనుచు,జగములోపల మతిసేటె పొగడ నేలి
వై. శ్రీరంగ. ౪-౯౫౭.

మ. కవిరాజార్చితవాక్యకోశగృహరంగద్వాక్య
మాణిక్యముల్, సవడిన్ మ్రుచ్చిలిపోఁక పక్క
కయిజన్ జట్టియఁగాఁ జూచుమా, నవదేహం
బుల సందిగంతలని మందవ్యాప్తి వర్తించు
దుమ్మువి చోరావళి నిల్వనేర్చునె మధీ
చంద్రాతపస్ఫూర్తికిన్.
హ. వరాహ. పు. ౧-౧.

సవతాలు. వి. (సవతి+అలు) సవతి

చ.... ఇవ్వనితకు సేమగూర్తుఁ తెలువా సవతా
లన నోర్తుఁ గల్గునీ,మను విదియేల లక్ష్మణ
కుమారు వినిర్జితిమారుఁ బొందు....
భా. రా. అర. ౧౪౩.

క. సవతాలికిఁ బతివలచిన, నవుఁగా కని యతని
యిచ్చ కనురూపముగాఁ దివిరి నడచుసతి.
భార. అను. ౫-౨౩౨.

వ. యుయుత్సుండు .... ధర్మనందను బలంబులం
గలసె నది యట్టిదకాక సవతాలిప్రజలు
పొందనేర్తురె. భార. భీష్మ ౧-౧౯౭.

తే. దాని యైనసవతాలికిఁ దల్లిపనులఁ, జేసి
నలఁగంగ. భార. అను. ౧-౨౦౫.

సవతి. (స. సపత్నీ. త. సవత్తి. క. తు. సవతి),
సపత్నీ, సమానభర్తృ గలస్త్రీలలో నొకతె.

క. కాఁచికొని కొడుకు నడిగెఁ,జే చనపువ
వాలుమగ దపే వరమిచ్చెం జూడె మనుసవ
తులచే నీచులుకదనంబు చేరనీకుము కృష్ణా!
ఉ. హరి. ౨-౩౭.

సీ. సవతులఁ గొనియాడు సఖులఁబోలె.
ఆం. భా. ౨-౧౧౫.

ద్వి. సరసంబ్రుమాతల్లి సవతిమేల్బంతి,మతియొప్పఁ
జిత్రాంగి మా పినతల్లి.
సారంగ. ౧-౯౪ పు. ౨౦ పం.

వ. వసుమతికి సవతియనందగు వసుమతీదేవి యగ్ర
మహిషిగా. దశకు. ౨-౪.

**సవతితల్లి.** వి. మాఱుతల్లి, విమాత.

**సవతిపోరు.** సవతులకయ్యము.

చ. హృదయమువ్రేఁ గొకింత శమియించెను.
జెల్వపుఁగ్రొవ్వు పెంపునంబొదలెడు రంభకున్
సవతిపోరు ఘటించుట కంతురార్పణం బిది...
కళా. ౨-౩.

**సవతీవ.** వి. (క. సవతి+తీవ) లతావిశేషము.

సీ. సంది దండగఁ బెట్టు సవతీవబలుచుట్టు, నీక
జుట్టుతలమున్క వెకలిచుట్టు, విప్పుగలపాఱు
టాకుబల్ కప్పడంబు (ఇది కిరాతవర్ణనము)
చంద్రాంగ. ౨-౩౭.

**సవతు.** (సం. సమతా) వి. ౧. సామ్యము, ఔప
మ్యము, ఈడు. సమానము

ఆ. ఏట్టిపుణ్యవతులొ యీచేడియలు సెప్ప,
సవతులేనియట్టి సవతులయ్యెఁగడుపు పడసిరి
భాగ. ౬ స్కం ౨౫౩.

గీ. పెంపు వహియింప నెపుడు విలింపసతుల,
సవతునకెలంగుమురు వారయువతు లచేట.
ఉ. రా. ౧-౮౧.

క. ఔరా సెచ్చెలి నామదిఁ, బెనఁగొనెడు
దురాశకతనఁ బేరోకటైనా, వీనులఁ సోఁకె
నమంగళదీనికి మాతల్లి సవతుదిటచెడిపడితిన్.
ప్రబోధ. చం. ౩-౧౭.

తే. గీ. ఉవిదనిద్దంపు జంఘల సవతుఁగోఁ, కలదు
గర్భంబు లడఁచు లోఁగంటకములు....
ఆము. ౫-౩౩.

గీ. చక్రఁదవమున నీరేడుజగములందు, సవతుఁ
గాంచనినుతు గాంచె ధవునికరుణ.
నిరం. ౧-౬.

సీ. ఉవిద నీకనదోయి సవతెందులేదని, ధాత్రిఁ
దమ్ములవైచి దాఁటవచ్చు.
సారంగ. ౨-౨౦౪.

తే. పూని వర్ణింప దాని కేసాని సవతు?
చంద్రరేఖావిలా. ౩-౬౦.

క. భువనంబులు మెచ్చఁగ శై, శవయౌవన
సంధిసప్తసంతానములున్ సవరించె వాని
కెవ్వరు?సవతు సుధాంధసులందఱ్క్రొ పర్వం
సహామై. వరాహ. ౧-౩౭.

సీ.... అంచంపు మెఱుఁగు వాఁగాఁ మగన్గవచూడ్క్ర
శ్రవణకుండలకాంతి సవతుగాఁగ ....
ఆము. ౫-౬౮.

సీ. దక్షిణాంబుధి వధూత్రామపర్ణినది సవతు
వైఘుకు నెన్నఁజాలుమనిరి. కాశీ. ౩-౧౩౯.

మ. గజఘోట స్యందనాళీకబలితధరణింగాద్ర
వేయాదిరాణ్మూర్ధజరత్నశ్రేణులంతర్మణుల
సవతులై.... ఆము. ౪-౧౭౫.

క. గణనాతీతసముజ్జ్వల, గుణమణి మునిలోక
సింహకుంభజకుభకా, రణపుణ్యదేహభువ
నాంగణముల నీసవతు సేయఁగలరే తపసుల్.
రామా. ౫-౧౧౭.

౨. విధము, పద్ధతి.

వ. వెలిదైన తావులు ముడిగి సరసుక కఱచిన
కాటులు విదక కాళ్లు పట్ట కపటియోగకోలా
సవతునను, పిచ్చుకలు పట్టుపట్టెడి జోడున
ప్రబం. ౧-౮౭౭.

ద్వి. అలసోమదామములు, తనకొప్పునం బూని
తనకొప్పుతోడ, మించుటజడఁబు మీఁద
వేడించు, పంచున నొసపరి సవతుగాఁ జుట్టి,
యొదసావిగాఁ జూచి యింటిలోనున్న, నడ
బావిలోన గ్రన్నన నీడఁజూచి.
ద్వి. పరమ. ౫-౩౭౧.

౩. ఖ్యాతి.

తే. కొండలం తేనిపనులు చేకూర్చుకొనఁగ భువన
మాలిన్యముడిపినసవతు జగతిఁ, గనునగస్త్యున
కును శరత్కాల మొసఁగు, బిసదుకుంచియు
లనఁగఁ గప్పురము లెగసె.
చంద్రాంగ. ౪-౯౮.

**సవతువచ్చు.** అ. క్రి. సమమగు, సాటియగు.

ఉ. నీ, వచ్చుటఁ జేసి ప్రాణములు వచ్చెఁ
జామి యిట లేదు మాకు విచ్చవచ్చుఁడు
పోరుఁడ్ సవతువచ్చునె నీకసమానమానసా
రాజశే. ౩-౨౨౨.

చ. వఁ పులకేశికిన్ సవతువచ్చు విలాసముగల్గి
శుక. ౧-౪౬.

**సవతుసేయు.** స. క్రి. పోల్చు, సాటిచేయు.

ఎ. గీ. మించుఁ జెమ్మని డాలుఁగలంచు బసిఁడి. నార
యారగమహిళలసౌరు, సౌర, సారసాక్షుల
చెలువంబు సవతుసేయు, నీలలన యంఘ్రి
నఖములఁ బోలఁగలవె. రసి. ౩-౬౩.

ద్వి. శివుని కెంజెడలలోఁ జెలఁగు జాహ్నవికి
సవతు సేయఁగఁ దగు సరయువు పొంత...బరుల
కసాధ్యమై పరఁగునయోధ్య.
ద్వి. హరిశ్చం. ౧-౨ పం.

**సవదండవల.** వి. జాలభేదము, ఒకానొకవల.

వ. తెరచీరికట్లును ద్రోఁగుచుట్లును దొడ్డివల కేటి
వల, కుందేటివల, పందివల, సవదండ
వలను, కిరివల, రౌలికవల మొదలుగా వలయు
వలలును. కాశీ. ౩-౪౬.

తే. గీ. కేటివలలును మఱియుఁ గుందేటి వలలు
మొలకవలలును సవదండవలలు దొడ్డి, వలలుఁ
బందిటివలలును బలువుమకరి, వలలు మొద
లుగఁ గలిగినవలలు మఱియు.
యయా. ౧-౩౭.

**సవదరించు.** స. క్రి. (త. చవక్కెట్టల్) ౧. సంఘటించు, ఒనగూర్చు.

సీ. పెదవిల్లుచిగురాకు గొడుగులు గొనివచ్చి
చరణద్వయంబు గా సవదరించు.
పి. శకుం. ౨-౧౪

గీ. ఘోరమాయాక తూణీరగుప్తకాంత, శరమునకు
నొక్కచెరలాట సవదరింపు.
కువల. ౨-౧౫.

గీ. ఆదికాలంబు పతిఁ బెండ్లియాడఁబోవు నవస
రంబున పెబ్బంగి సవదరించె, దివ్యశృంగార
మబ్బఁగి దేవదేవుఁ డాదరించెను సమ్మోద
మావహిల్ల. హర. ౪-౭౩.

సీ. తనతనుప్రభలతో పెనవచ్చుపటికంపుజప
మాల యొకకేల సవదరించి. విక్ర. ౨-౨౩.

గీ. మేనఁ గలపంబుఁ గదువింతగా వలంది
గొనబు మీఱంగఁ దావిక్రొన్ననలు దుఱిమి
సన్నవలిపంపు వలెవాటు సవదరించి, కప్పురము
నించి వచ్చి బాగా లొసఁగి. విప్ర. ౪-౯౪.

తే. గీ. జన్నిదంబుగఁ బెనుపాము సవదరించి,
యంఘ్రికటకంబు ఘల్లుఘల్లనుచు మెరయ,
వాహితుండిక గరళ విద్యాధరాజా. వచ్చెఁ
బాముల మొంగఁడు వదరులాఁడు.
క్రీడా. ౧-౨౨౩.

సీ. కదవన్నె తలుకుబంగరుకోటకెంజాయ సంజ
కె. జిగిరంగు సవదరింప. ఉత్త. ౧-౨౬౨.

గీ. జంగమం బైనరూపంబు సవదరించి, యెదు
రుగా వచ్చె వింధ్యమహీధరంబు.
కాశీ. ౧-౯౩.

౩. మోచు, వహించు.

సీ. సవదరించుట యెట్లు జఠరగోళంబున నవమ
మాసావసానంబు దాఁక.
కాశీ. ౪-౧౭.

౪. సిద్ధముచేయు.

తే. అలక తిమిరంబు తనుఁగప్పు ననుభయమున
ముఖసుధాసూతి నునువెన్నెలమలికఁ గూర్చి
సవదరించినకింగాణి చాయ నొసలి, వంక
చూపునఁ దగ గతివంకబొమలు.
పాండురంగ. ౨-౪౫.

సీ. పచ్చలకింగాణిఁ బన్నీరు గులికిన. చందన పం
కంబు సవదరించి, పడియాలువన్నియ బం
గారుభృంగారుకంబున హంసోదకంబునించి,

తే. కారుక్రొమ్మెఱుంగులవంటి కాంతలాయి,
తంబుచేసిరి. వరాహ. ౪-౧౫౬.

సీ. మహిమ నెవ్వనియనుగ్రహము కించిద్‌జ్ఞుల
సర్వజ్ఞులుగఁ జేసి సవదరించె.
ఉ. రా. ౭-౩౪౬.

౬. చేకూఁజేయు, సవరించు.

సీ. చెదరినయలకల చిక్కు చక్కఁగఁ దీర్చి
జాఱిన గవయంబు సవదరించి.
విక్ర. ౧-౧౫౯.

౭. ఆశ్రయించు, వహించు.

సీ. దుగ్ధవారాశి కూఁతురు వాలుఁగూడి నీశర
ణంబుఁ జరణంబు సవదరింప.
ఉ. హరి. ౧-౧౧౭.

౮. అనుగ్రహించు.

తే. నీదుసామర్థ్య మెవ్వఁడు నేర్చుఁ బొగడ,
సవదరింపుము నామాట లవధరించి, యమ్మ
నందుఁ గృపఁజూడు నమ్మితోఁద, నెల్ల
కాలంబు రక్షింపు మిద్ధచరిత,
పద్మపు. ౪-౧౭౯.

ఆ. వేఁటకాఁడ నగుట వీనిఁ దెచ్చితి రాజ! సవ
దరింపు చూడ నవధరింపు.
చంద్రాంగ. ౨-౪౨.

**సవనము.** సం.వి.అ. న. ౧. యజ్ఞము. ౨. స్నానము. ౩. సోమపానము. ౪. సోమరసము పిండుట. ౫. బిడ్డలను కనుట. ౬. యాగమందిచ్చెడుబలి.

**సవము.** సగము. వి. అర్ధభాగము. (చూ. సవరేయి) వృత్తియందు దీని యంత్యవర్ణమునకు లోపము.

**సవము.** సం. వి. అ. పుం. ౧. యజ్ఞము. ౨. సోమరసము పిండుట. ౩. బలి. ౪. సంతానము. ౫. ఉత్పాదకము. ౬. కల్లుతేట. (శ. ర) ౭. అర్కవృక్షము.

**సవము.** సం. వి. అ. న. ౧. జలము. ౨. పూఁదేనె. ౩. సోమరసముపిండుట. ౪. యాగమునఁ జేయుబలిదానము. ౫. ఆజ్ఞ, శాసనము. ౬. ప్రేరణము.

**సవయస్క.** సం.వి. ఆ. స్త్రీ. చెలికత్తె, సమానవయస్సుగలది.

**సవయస్కము.** సం. విణ. అ. అ. అ. సమానవయస్సుగలది.

**సవయస్కుఁడు.** సం.వి.అ.పుం. స్నేహితుఁడు, చెలికాఁడు. సమానవయస్సుగలవాఁడు.

**సవర.** విణ. చక్కనిది, అందమైనది. (దీనికి కర్మధారయమున నిగామము వికల్పముగ వచ్చును)

వ. సవరనిపాపలం దడవి తడవి తమయేలికకుం
గానికగా నీవలయు నని ఉ. హరి. ౧-౫౩.

క. నవదంతకుంద కాంతులు సవరని చెక్కుల్,
సాంద్రచంద్రిక లీనన్. ఘటికాచల. ౨-౨.

చ. సవరనిదంచు నిబ్బరపుఁజన్నులదంచు సుధాం
సుమండలీసువదన యంచు.
ప్రబోధచం. ౪-౭.

౨. ఒత్తిడిలేనిది.

సీ. సవరగాఁ గొంచు దండువ్రలు దర్శనములు
కోలాసగొనకూర్చు గుత్తికి.
పి. శకుం. ౪-౧౭౫.

**సవర.** (సం. శబరః) ఒకయాటవిక జాతిపేరు

**సవరంగా.** చక్కఁగా (రూ. సవరనగా)

మ. కవికిల్ చెప్పినఁ బాదకేర్పిన వృథాకష్టంబె
యీబోగపుం జవరాంద్రేశద భాగ్యశాలి
నులు పుస్తంబేల పోపోఁచకా, సవరంగా
సొగసిచ్చి సెల్ యువతికేపం బిచ్చి పుట్టిం
తుకే? విప్రనాటకము. ౫౬.

**సవరచేయు.** స. క్రి. (సవర+చేయు) చక్కఁజేయు, సరిచేయు.

సీ. చేదోయి మొగ్గుఁగఁ జేసి నెత్తురులైన యవ
యవంబుల నోరసవరచేయు.
శృం. నై. ౨-౫.

గీ. విపములకు విన్ను వీధి విటంకంబు నంతరాంత
రముల వరసి యరని యక్షకర్దమమున యక్షే
శ్వరాదులు సవరచేసి రధిక సంభ్రమమున
భీమ. ౫-౨౭.

**సవరణ.** (రూ. సవరణము) వి. (త. సవరనై క. సవరణె) యుద్ధపటకరము.

క. అని గనియు వినియు నులుకక, సవరణలొప్పారఁ బుర సంభ్రమునై యాదవులు. భార. మౌస. ౧-౨౮.

క. సవరణలు నొప్పి యనిఁ బాండవబలముల మార్కొనం గదంగుచో నస్యూ, త్సవమునఁ జేర్పించేసేల కవకాశము లేదు వినియ హస్తిపురిమునన్. భార. ఉద్యో ౧-౨౬౬.

క. అరదములు సవరణలతోఁ బరపై యొక్కొక్కయూథిపరపున నరిగెన్. భార. భీష్మ. ౧-౮౪.

౨. సామగ్రి.

క. అవు బేహారముఁ గృషియున్, సవరణలును బసులసొంపు సనయట్లగుటన్, భువిఁ బసులు గలుగు కాఁపుల, నవనీశుఁడు గన్నబిడ్డలయట్టరయదగున్. భార. శాం. ౨-౩౮౮.

.... పులిజాన్న మొదలుగాఁ బురుషాయుషావధి కందుఁడ సవరణల్ పొందుపఱిచి.... ఆము. ౪-౨౬౧.

౩ సన్నాహము.

క. మఃపరిజలోఁ గరిపుటకం, జనుదేరఁగ వలయు వారసవరణతో రండని యేర్పడనియమింపు భార. ఉద్యో. ౩-౧౩౧.

తే. వలయు సవరణతోడ భూవల్లభుండు వెడలె వేఁటకు మృగయూపరిపీలునైన శబరకాయకులుభయపార్శ్వములఁ గొలువ. శకు. ౨-౧౩౧.

౪. వాహవాద్యలంకారము.

క. తెల్లని సవరణ మెఱయ సముల్లసితము లగు తురంగముల మొత్తము చం, చల్లలితపక్షముల కొ, ల్లిల్ల గతుల నొప్పు సంచరించుం బోలెన్. భార. శల్య. ౧-౧౨౬.

వ. ఈశ్వరాదిదేవతలు సమకట్టిన సవరణ గల యర్జునుచేత నిర్జింపఁబడిన యత్యుత్కృష్టజాతులశ్వములు శిలుగుట యొఱుఁగుదురు కాదె. భార. ఉద్యో. ౨-౨౪౪.

సీ. ఉత్తమహాయదంతిసత్తమరథరత్నములు నూరి సవరణ లలవరించు. నిర్వ. ౭-౧౪౩.

ద్వి. వాందును చను దెంచి వరుసఁ బాండవులఁ బోండిగాఁ బురమునకును దోడితెచ్చి సవరణలన్నియు జాల నిప్పించి వివిధాఁబకంబులు వెలయఁగా చేసి, ఆరూఢనియతితో నరదంబులెక్క సారథ్యములు వారు చక్కఁబెట్టుచును విరాటపర్వ. ౧-౧౨.

౫. సేవ.

కం. అవు బేహారము కృషియున్ సవరణయును బసులసొంపు స.... భార. శాంతి. ౨ అ.

౬. సౌమ్యము. శ. ర.

**సవరణచే(సే)యు.** స. క్రి. (సవరణము + చేయు) అలంకరించు. చలువదుస్తులు మేన సవరణచేసి. రఘు.

శి. ఇభములాదిగ వాహనముల సవరణసేయన్. భార. మా. ౧.

**సవరణము.** వి. పరికరము.

వ. సుశర్మయు కేలివవానిపనిఁ బూని జోడు పక్కెర కైదువులురదురవణంబు మొదలయిన సవరణంబులం జాల నక్కజంబుగాఁ గూడి భార. విరా. ౩-౧౩౧.

**సవరణించు.** స. క్రి. (సవరణ + ఇంచు) సవరణ చేయు.

సీ. విఖ్యాతి కెక్కిన కొలిమావుసాటిగా సైంధవంబులనెల్ల సవరణించి. వరసభూ ౪-౬౫

**సవరఁదనము.** వి. చక్కఁదనము.

ద్వి. అవతారమస్మ్రఘుం దనవచ్చు వీని, సవరదనంబు లక్షవరాలు సేయు. సారంగ. ౧-౨౨ పు. ౧౩ పం.

**సవరవ.** విశ. ౧. చేమవు, సమము.

వ. వివిధోన్నత భాగంబులవలన వసమంబుగా [illegible] శిలోత్పలయంబులు గాలించి యుల్ల [illegible] సవరనై యుండ నొనర్చి నగరగోపురాదులు రచియింపం బనిచె. హరి పూర్వ. ౧-౧౩౦.

సి. సన్నపునడు మొప్ప సవరైనపిఱు చొప్ప
    లలితకనకకుండలములు నొప్ప. వీర. ౧-౧౭౭.

సీ. లవలీదళములట్ల స వర్ణ నచెక్కు లుం వాడు
    వాఱఁగముద్దులాడియాడి. ఉ. రా. ౪-౨౧౭.

చ. సవరగు నొక్కయద్దమునఁ జయ్యనజాబి
    కపోలబింబిగుం,దవ్వ్రుఁ గాంచి సిగ్గుమెయి
    నంతట నివ్వెఱవోయె నెంతయున్.
                                    తపతీ. ౫-౩౫.

సీ. సవరైన రతనాల బవిరెకమ్మల నిగ్గు నవి
    నీకు మనమురావంటి వేవి, యాణిముత్యమ్ముల
    వారమ్మ లొసఁగుదు.                హంస. ౨-౩౭.

ద్వి. సవరైన నల్లపూసలపేరు.
                        ద్వి. పరమ. ౩-౧౪ పు.

**సవరుచే (ర్చు)** స.క్రి. ౧. కూర్చు. ౨. చిత్రించే

క. జనకుఁడు భువిఁగల్రపాయఁపు, జనపతులం
    బటములందు సవరిచి యనుఁగుం, దనయ కద
    కనుప నితరము, గనవొల్లదు నీపటంబె కాని
    మురారీ.                    ముకుందవి. ౨-౧౨౨.

కీ. చదుదోయి కప పటు కొని ఘుమ్మరన
    జాంబవతి సవర్చిన వల్లెవాటు మెఱయ.
                    ముకుందవి. ౧-౫౦ పుం. ౪ పం.

**సవరేయి.** ౧. (సవము+రేయి) అర్ధరాత్రము.

సీ. సంద్రపొద్దున నుండి సవరేయి గడసన
    సమ్మెళమ్మునఁ గొల్చి సంపసించు.
                            పాంచరంగ. ౫-౨౮.

ద్వి. సవరేయిపైఁ జొక్కి చల్లి సంధించి తివు
    టమై దొగిలతెమ్పుచు మఱిగి.
                        ద్వి. పరమ. ౬-౪౮౮.

ద్వి. దొఁగను జాతోడి దొంగలు మీరు, దొఁగిలం
    దని గడిదొంగరై కోరి, పదనముల్ సారఁ
    బాఱి సవరేయి యాలఁ బిడికి వెండియు నదు
    బికుకింతలేక.
                    అ. మ. క. ౧-౩౨ పుం. ౨౫ పం.

**సవర్ణనము,** సం. వి. అ. న. భిన్నాంకములను తుల్యలవములు గలవానిగా మార్చుట.

**సవర్ణము,** సం. విశే. ౧. తుల్యవర్ణముగలది ఒకేరంగుగలది. ౨. పోలినది, సరూపము. ౩. ఒకే కులమునకుఁ జెందినది. ౪. ఒకేజాతికిఁ జెందినది, సధర్మమైనది, ౫. తుల్యాస్యప్రయత్నమైన వర్ణము.

**సవసవ.** చూచాయ, మెలమెల్ల.

వ. నా దౌష్ట్యంబు సవసవగాఁ దెలిసి.
                                మను. ౫-౨౭.

వ. జానకీనూన్యం బైనరథంబునున్. గనుంగొని
    పురజనులు గుంపులు గూడుకొని సవసవగా
    విన్న మనము విన్నది నిజంబై తోఁచుచున్నది.
                            ఉ. రా. ౬-౩౪౩.

౨. క్రమక్రమము.

చ. సవసవగా వెలింగి తనుజాతుఁడు నేనుచు
    నుండఁ గొల్చిగా దివిజవిభుండు లేవగవుఁ
    దచ్చికొనన్ శిబియుల్కఁజూడ గై, తవమునఁ
    బిల్వనంపినఁ దప్పక మాచుచు సొమ్మసిల్ల,
    మక్కువనొసఁగున్ జాయక్కరని కోడలి జం
    కించె నదల్చుచున్.            కువల. ౪-౧౭౭.

ఉ. సవసవ దీపపంక్తులు వెసన్ దెలుపెక్కఁ
    దలంప మిగ్రుఁగన్ దపిలినయార్తి డెందములఁ
    దాల్పరక్కైహదళాను వర్తిఁల్.
                            ప్రబంధ. ౧-౧౧౭.

౩. కొంచెము, అత్యల్పము.

క. అని విన్నవించి యతఁ డో, జనార్దనా!
    యిప్పు డేను సవసవగా చెప్పినపాటి యొక్క
    గీతము వినిపించెద.            చంద్రి. ౧-౧౨౪.

౪. సంభ్రమము, తొట్రుపాటు.

క. సవసవ వినయము బలుకుచు నవనతగతిఁ
    దోడిదచ్చి యాతిథ్యంబుల్, సవరించిన.
                                చంద్రభా. ౩-౨౨.

క. అవనములు చనిగ్రోలెడి, యా సవసవ లెఱిఁగి
    లేఁటు లలరులగమిపై, యాసవవలి పాజలి
    కడతి. యాసవసవ గాంచి పెంక జాడ రయ
    మునన్.                        ప్రబం. ౧-౨౫౦.

౫. భేదము.

క. సవతులు దిత్యదితివిలా, సవతులు మఱి వా
ర్తాత్మసంభవు లగుమీ, సవతు లమర్త్యులు
వారికి, సవతులుమున్ మీరు మీరు సవసవ
లేలా! లక్ష్మీ. వి. ౨-౫౬.

సవాయి. వి. (హిం. సవాయి) ౧. పదవపెద్ద మొకు, ౨. మేహరోగవిశేషము. 3. మహమ్మదీయఁ ప్రభువుల బిరుదనామము.

చ. వవలక యుత్కలేంద్రుని సవాయిబలీను
నదంచు మర్జయున్. కళా. పీఠ. 33

సీ. పదమటను సవాయిబనువనిగాఁ జేసి యచటఁ
గొయ్యలకొండ యతిరించె. తపతీ. ౧-౨౪.

సవారి. హి. వి. పల్లకి, గుఱ్ఱము నెక్కిపోవుట. శ. ర.

సవాలు. హిం. వి. ప్రశ్న, విచారణ.

సవి=సావి. అవ్య. అని. (ఇత్యర్థకము)

సీ.... ఇతులు శార్థ్యబుగా దనరుసవిసావి
యనియన నిత్యమైతనర్చు ....
ఆం. భా. 3-౬౭..

(ప్రాతిపదికార్థము)

తరువోజ. జలనిధి .... సంవర్తకాదిజలదముల్
ప్రీతి నజ్జలజాకరంబు జలము లక్ష్యయములు
సవినుధారసము చవి యని మెచ్చి....
కుమా. సం. ౧౦. 3౭౭.

(హేత్వర్థకము)

చ. కనఁబడు వార లెల్లఁ దమఁ గన్నడిరేసని
విన్నపలుక్క లెల్లమఁ దమఁగూర్చియే సవి
తలఁకునఁ గొంకుమనైన జాహసంబునఁ దగ
వచ్చి యుస్టి వెఱవోవఁగఁ గౌఁగిటఁ జేర్చి
విగ్గుటన్, వరితి మహార్త మాత్రిముగ వల్ల
భునిం దొలుక్రొత్తలంకుఁన్.
కవి. ౪-౧౦౫.

చ. జలజము సావికోశములు షట్పదముల్ వఱ
తెంచి తద్దయున్ నలివిచుశాస్త్రమందఁము
జానికయున్ శశిబింబచంపకంబులు సవి
దాయ నొల్లక.... కుమా. సం. ౭-౭.

(భ్రాంత్యర్థకము)

చ. నినుపు లోకస్తుచేతఁ గమనీయలతాంతము
లున్న నొక్కదన్, గనుఁగొని ముగ్ధయై
క్కతె వికాసిని రైయ నవకంపుఁదీవఁ బూ,
చిఁరయింగొమ్మగుత్తి సవిచే నయంబునఁబట్టి
కోయఁజూ, చిన నదియల్ల నవ్వనదిసిగ్గు వడం
గని యూర్చురందఱున్. సిర్వ్యా. ౭-3౬.

క. చూపులఁ గని తల్లుల సవి, చాపలమునఁ జేర
హరిణశాబము. లబ్బుల్, చాపఁగ దుర్వాంకు
రములు మేపుదురు శరీరములు నిమిరముని
వనితల్. వరాహ. ౪-౨౪.

మ. దిశ లాకాశము ముంచుచుంచుల మృగీదృష్టి
స్త్రశాశ్లిష్టులన్ దశమావస్థలఁ బెట్టుచట్టితటి

సీతాసేవ్యుఁ డానేతకున్, దశకంఠానుదుచెల్లె
లాంపడెఁ బద్మాదేవి కెల్లమిృకిన్, బిసితం
పున్ సవి నేఁగుడేఁగదెలి తబ్బిబ్బైన చందం
బునన్. చంపూరా. ౫-3౧.

మ. తలఁబక్షచ్ఛటఁ గ్రుక్కబాహుపులు శేదారం
పుఁగుల్యాంతరస్థలి నిద్రింపఁగఁ జూచి యా
రెకు లుమస్నాన్నతప్రియాతద్విజావలి పిండీ
కృతశాటికల్పవి తదావాసంబుఁ జేర్పంగ
రేపులు డిగ్గన్ వెసఁబాఱు ...
ఆము. ౧-౨౫.

సవికల్ప (క) ము. సం. విణ. ౧. వైకల్పికము. ౨. సందిగ్ధము. 3. జ్ఞాతృజ్ఞేయాది భేదము గలది.

సవికాశము. సం. విణ. ౧. పూర్తిగా వికసించినది. ౨. విస్తరించినది, విపులమైనది

సవిగ్రహము. సం. విణ. అ. ఆ. అ. ౧. మూర్తిమంతము, శరీరము గలది. ౨. అర్థముగలది. 3. కలహించునది.

సవిత. సం. వి. ఋ. పుం. (రూ. సవితృఁడు) ౧. సూర్యుఁడు. ౨. తండ్రి. 3. సృష్టికర్త. ౪. ఇంద్రుఁడు. ౫. అర్కవృక్షము ।

సవితర్కము. సం. విణ. అ. ఆ. అ. ఆలోచనము గలది.

సవితృఁడు. సం. వి. ఋ. పుం. సవిత.

చ. ఇట్టల మగుకూరిరవృత్తికిఁ గదంగుచుకే సవితృండు రశ్ములన్, జల మొసఁగంగ
భార. అను. 3-౨౬౧.

క. భువనైకదీపకుం డగు, సవితృనకుఁ దనూజ మతియు. భార. ఆది. ౭-౮౦.

సవితృలము. సం. విణ. సూర్యసంబంధమైనది.

సవిత్రము. సం. వి. అ. న. ఉత్పత్తికారణము.

సవిత్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. తల్లి, ౨. ఆవు.

సవిత్రియము. సం. విణ. సూర్యసంబంధమైనది.

సవిధము. సం. విణ. ౧. సమీపమైనది. ౨. ఒకే విధమైనది.

సవిధము. సం. వి. అ. న. చేరువ, సమీపము.

సవినయము. సం. విణ. వినయముగలది.

సవిభ్రమము. సం. విణ. ఒయ్యారము గలది, విలాసముగలది.

సవిమర్శము. సం.విణ.అ. ఆ. అ. సవితర్కము.

సవిలాసము. సం.విణ. అ. ఆ. అ. సవిభ్రమము.

సవిశేషకము. సం. విణ. ౧. భేదకలక్షణములు గలది. ౨. తేటపఱచఁబడినది.

సవిశేషకము. సం. వి. అ. న. ౧. భేదకలక్షణము. ౨. ప్రత్యేకధర్మము.

సవిశేషము. సం. విణ. ౧. ప్రత్యేకగుణములు గలది. ౨. విశదమైనది. అసాధారణమైనది. 3. విలక్షణమైనది, విశిష్టమైనది ౪. ఉత్కృష్ట మైనది శ్రేష్ఠమైనది.౫.భిన్నమైనది, వేఱైనది.

సవిస్తరము. సం. విణ. వివరములతోఁ గూడినది, సూక్ష్మాంశములతోఁ గూడినది, సమగ్రమైనది.

సవిస్మయము. సం. విణ. ౧. ఆశ్చర్యపడినది. ౨. సందేహముగలది.

సవృఁడు. సం. వి. అ. పు. ౧. సూర్యుఁడు, చంద్రుఁడు.

సవురు = సౌరు. వి. ౧. అందము, ఒప్పిదము, వైభవము.

ఆ. నువ్వులబువ్వసవ్వ జవ్వని వానిక, చివురు సవురు చివురు నుటద మోవి, ముబ్బుముబ్బుగొబ్బ బిబ్బోకవతి తేజి, వెఱఫనొంఅపుఁబులపుఁ దెలవమేము. విజ. ౧-౮౪.

చ. చలువలకోఁక నీప్రవుకు సన్నముగాని .... నింపురాకుమీ. వి. నీలా. 3-౨౦

సీ. అవికఁబూన్చినలీల సవురొందు గందము వందిన చందంబునందమయ్యె. ఉ. రా. ౬-౧౧౫.

ఎ. గీ.... అవమువంబులసవురు రాజాధరాజ చర్యలను బోల.... దశా. ౨. ౨౩3.

౨. కాంతి.

క. చివురాకానెల వల్లని, కవురా నునుసోఁగ వెంద్రుకలు ప్రత్తిడిమేల్, సవురా దేహము ముద్దుల, దవురా యని జనులు పొగడ వాలిద యమరున్. హంస. 3-౧౯3.

3. నిగ్గు, సారము.

తే. గీ. అవుర శృంగారరసముతో సవురు దీసి, చేసెనవ నొవరుఁ బోలునీసేత ధాత, తేక తేతాదృశవిలాసలీల గను నె, వానవారాతి మాపిసి మూఁహోతి. ముకుందవి. 3-౨3౬.

౪. విధము.

క. నవపల్లవాధరక్త్రిం,పవిలెదుకొమ్మల రమింపఁ దమకీక సుదినం, బవురె యని కడఁక నరగెను, సవురుఁ గారాకులనివెనక కనుఁ గొంకే. సమీర. ౧-౧౨౪.

వ. కురుకేస సవెనన గుబాళించు మనువంధు వలభులతో ఉ. రా. ౬-౨౪.

సవృద్ధికము. సం. విణ. వద్ధికలది.

సవేశము. సం.విణ.౧. సమీపమైనది. ౨. అలంకృతము, పరిష్కృతము.

**సవైలక్ష్యము.** సం. విణ. ౧. అసహజము, కృత్రిమము, బలాత్కృతము ౨. భీతము, లజ్జితము.

**సవ్యపేక్షము.** సం. విణ. అ. ఆ. అ. ఒకదానికి సంబంధించినది, ఒకదానిపై నాధారపడినది.

**సవ్యభిచారము.** సం. వి. అ. పుం. (తర్కమున) హేత్వాభాసములందలి యైదు ప్రధాన విభాగములలో నొకటి, అనైకాంతిక యనుదోషము.

**సవ్యము.** సం. విణ. అ. ఆ. అ ౧. ఎడమ ౨. కుడి, దక్షిణము. 3. ప్రతికూలము.

**సవ్యసాచి.** సం. వి. న. పుం. అర్జునుఁడు.

**సవ్యాజము.** సం. విణ. అ. ఆ. అ ౧. కృత్రిమము, కపటము. ౨. మిషతోఁ గూడినది, ప్రయోజనాపేక్ష గలది.

**సవ్యాపారము.** సం. విణ అ. ఆ. అ ౧. క్రియాత్మకము. ౨. నియుక్తము, ఉద్యోగవంతము.

**సవ్యుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**సవ్యేతరము.** సం. వి. అ. ఆ. అ కుడి, దక్షిణము.

**సవ్యేష్ఠ.** సం. వి. ఋ. పుం. సారథి.

**సవ్యేష్ఠుఁడు.** సం. వి. అ. పుం. సారథి

**సవ్రీడము.** సం. విణ. అ. ఆ. అ ౧. లజ్జగలది. సిగ్గుపడినది.

**సవ్వడి.** (సద+వడి). వి. జాడ (స్వార్థమున వడి) క. ర.

**సశబ్దము.** సం. విణ. అ. ఆ. అ. ౧. ధ్వనిచేయునది. ౨. పరికింపఁబడినది.

**సశల్యము.** సం. విణ. అ. ఆ. అ ౧. ముండ్లుగలది. ౨. శరములు లేక ముండ్లు గ్రుచ్చుకొనినది. 3. కష్టమైనది, బాధతోఁ గూడినది.

**సశస్య.** సం. విణ. ధాన్యము నుత్పత్తి చేయునది, ధాన్యముగలది.

**సశస్య.** సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన ప్రొద్దుతిరుగుడుపూవు.

**సశ్మశ్రువు.** సం. విణ. ఉ. ఉ. ఉ. గడ్డము, మీసములుగలది.

**సశ్మశ్రువు.** సం. వి. ఉ. స్త్రీ. గడ్డము, మీసములుగల స్త్రీ.

**సశ్రీకము.** సం. విణ. అ. ఆ. అ. ౧. సంపదగలది, శుభముగలది, అదృష్టముగలది. ౨. ముచ్చటైనది, అందమైనది.

**ససందేహము.** సం విణ. అ. ఆ. అ. సందేహముగలది.

**ససందేహము.** సం. వి. అ. పుం. ఒకయర్థాలంకారము (చూ. సందేహము)

**ససంధ్యము.** సం. విణ. అ. ఆ. అ సాయంకాలము, సంధ్యకు సంబంధించినది, సంధ్యలందు సంభవించునది.

**ససంభ్రమము.** సం. విణ. అ. ఆ. అ తొట్రుపాటు, తొందరగలది, కలవరపడినది.

**ససత్త్వ.** సం. వి. ఆ. స్త్రీ. గర్భవతి.

**ససత్త్వము.** సం. విణ. అ. ఆ. అ. ౧ బలముగలది, వీర్యముగలది. ౨. గర్భము ధరించినది. 3. జంతువులతో నిండినది, ప్రాణులతో నిండినది.

**ససనము.** సం. వి. అ. న. బలిదానము, అర్పణము, త్యాగము.

**ససాధ్వసము.** సం. విణ. అ. ఆ. అ. బెదరినది, భయపడినది, భీతమైనది, పిరికిది.

**ససి.**[1] విణ. నిగ్గుగలది.

వ. ససి మెఱుంగు ముత్తెంబులు. మను. 3-[illegible].

**ససి.**[2] క్రి. విణ. బాగుగ.

ఉ. నీటున దేవుయొక్క ససినిల్పి యొకించుక వాతిధృతిపాటన మొప్ప నతం డొనర్చె నప్పాటునఁ జెన్నమీఱి పరిపాటిగఁ గొంజిగు రెక్కడక్కడన్ మోటికలెత్తి క్రొవ్విమలు మొగ్గలు వెగ్గలమయ్యె నయ్యెడన్.

విక్ర. ౨-౨౩.

మ. వినుఁ డొక్కింతయు లేక తాఁవ్వలయున్ వీని స్నానాకాలమున్, పసిఁజక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై నాళీకపత్రాక్షికిన్.

కాశీ. ౨-౭౩.

ససి. వి. ౧. బాగు.

చ. దొసగులు వచ్చువేళ గుణధుర్యుల ధైర్య గుణంబు సర్వముం, బసచెడు వంచుఁ జూపె దవు పాపపురైవము యీదు రాగ్రహ, వ్యసనము మాను మాను ప్రళయంబున వీనిని జక్రిమంబులై ససిచెడ వించుకంతయును సాగరముల్ కులపర్వతంబులున్.

భర్తృ. ౧-౯౦.

౨. విధము.

తే. అర్ధచంద్రత సమయంబునఁ దరమించి, పూర్ణతనుఁ జెందు ససిని యప్పుడమిఱేఁడు యౌవరాజ్యోత్తరమునందు సాధరాజ్య, మంది హాపియించి మిక్కిలి యంద మందె.

రఘువం. ౭-౬౫.

౩. నిగ్గు.

చ. అ,త్తిలకిని యొప్పమీఱె ససిసీరివ మాఱుని వాలుపోలికన్. కృ. శకుం. ౨-౧౭౨.

౪. ఆరోగ్యము.

ససి.[1] వి (వైకృతము) సం. సస్యం.. క. సని; పైరు, సస్యము.

క. ఖండించి వేలు యొకశతకాండంబున వాని తలయు ఖండించె మణిమండల కాంతులు వసుధాఖండంబుఁ రత్నకోరకపు ససులెత్తన్.

సుద. ౫-౧౩.

సీ. పెనుఁగంపతోడుగు లీడ్చినమొల్క ససి యయ్యె, గగనంబులో రాయుకాన నములు ....తే. కమలసంభవవరదాన గర్వి తాను, రవరపట్టణనిర్భరాక్రమణవిక్రృతి ...

పాండురంగ. ౫-౧౨౭.

క. ఒసఁగె రగస్త్యార్ఘ్యములం, గొసరి జనుల్ వార్ధి నీరుగ్రోలితి వివిన్, ససినై మాకిమ్మని కొక్కసరుఁడుగం, గావ నప్పగించెదు మాడ్కిన్.

ఆము. ౫-౧౨౭.

సీ. అసమాయుధునికీర్తి ససులకై వడి మల్లికా కుంజవితతి మొగ్గలుదనర్చె.

వైజ. ౨౯౨. (బ్రా. పా.).

ఎల్లకడల మొలఁగుమే ససి చెల్ల సేయును.

నీలా. ౨-౪౩.

చ. చక్కనిమింట నేగు చెలువందు జలకనకేందు కాంతి పుం, జక్కటిఁదోఁచు రత్నమయసౌధములందుఁ గిరీటిపచ్చతా, మొక్కలడాలు పేరి ససి మొత్తము నిచ్చలుఁ జొచ్చి మేతకై, ద్రొక్కనటంచు బందిపోరఁ దోలెఁ బురేందిరనాఁగ రాత్రులన్.

చంద్ర. చ. ౬౯.

ససియూడు (క. ససి) దే. అ. క్రి. చెల్లచెదరుగా విసరివేయు.

సీ. గజయూధముల ........ భీషణాకారములు దాల్చి పెచ్చువెఱిగి చంపి ససియాడి రొక నిమిషమున సమయు.

కుమా. సం. ౧౨-౭౭౬.

ససులెత్తు. అ. క్రి. మొలకెత్తు, అంకురించు.

ద్వి. సిరులఁ జూపట్టుబాసికములు గట్టి, పరస రత్నముల సూసకము లమర్చి, ససులెత్తునగువుల సయ్యాటయాడు నొసపరి చెమ్మా ము నొకకొంతవంచి.

అ. మ. క. ౫-౨౩౩ పు. ౫ పం.

ససువు. విణ. సాధువు.

సీ. మంచివాఁడు ససువు మంచిసాదు నన నజ్జనం బొప్పు. ఆం. భా. ౨-౧౪౦.

క. అసరుల మాయోపాయముఁ గనిమసఁగఁగ సటమఖంబు గావఁగ సటు! తా, ససఁ డొకఁడేఁట ససువులఁ గ్రొన్ననువుల నడిగొనటమునలు నిర్మోహులకా. రామా. ౪-౭.

ససువు. స. క్రి. విజృంభించు, ఖండించు.

ససేమిరా. అవ్య. మొండిపట్టుదలను సూచించు పలుకు.

వ్యవ. ఎంతిచెప్పినా వాడు ససేమిరా కేను రా నన్నాడు.

ససైన్యము. సం. విణ. అ. ఆ. అ. చతురంగ బలముతోఁగూడినది.

సస్కాని. వి. రెండుడబ్బులనాణెము. క. ర.

సస్పృహము. సం. విణ. అ. ఆ. అ ౧. కోరిక గలది. ౨. ఆశగలది. 3. అభిలాషగలది.

సస్మితము. సం.విణ.అ. ఆ. అ చిఱునవ్వుగలది. మందహాసముతోఁగూడినది.

సస్యకము. సం. విణ. అ. ఆ. అ. మంచిలక్షణములుగలది, గుణవంతము, శుభము.

సస్యకము. సం.వి.అ. పుం. ౧. ఖడ్గము ౨. ఆయుధము. 3. ఒకవిధమైనరత్నము.

సస్యసంవిదము. సం.విణ. అ. ఆ. అ. సారవంతమైనది. ౨. చక్కనిఫలము నొసఁగునది.

సస్యమారి. సం. విణ. న్. ణీ. న్. పైరును నాశముచేయునది.

సస్యమారి. సం. వి. న్. పుం. ఒకవిధమైన ఎలుక.

సస్యము. సం.వి.అ.న. (రూ. శస్యము) ౧. పైరు ౨. వృక్షాదిఫలము 3. ఆయుధము ౪. సుగుణము, శుభలక్షణము, పుణ్యము.

సస్యసంవరము. సం.వి.అ.పుం. సాలవృక్షము İ

సస్యేష్టి. సం. వి. ఇ. స్త్రీ. క్రొత్తపైరుపంటకు వచ్చుసమయమున చేయుయజ్ఞము.

సస్వేద. సం. వి. ఆ. స్త్రీ. అప్పుడే చెరచఁబడిన కన్య.

సస్వేదము. సం. విణ. చెమటచేఁదడిసినది, చెమర్చినది.

సస్సెము. వి. (సం. సస్యం) పైరు, సస్యము.

సహ. సం. అవ్య. సాహిత్యబోధకము.

క. వీరును గుంతియు సహ, పరివారమహామాత్య భృత్యవర్గుల రై. భార. ఆది. ౬-౧33.

సహా. సం.వి.ఆ.స్త్రీ. ౧. భూమి. ౨. చేమంతి İ 3. పిన్నగోరంట İ ౪. పిల్లిపెసర İ

సహా. సం. వి. స్. పుం. ౧. మార్గశీర్షమాసము. ౨. హేమంతఋతువు.

సహా. సం. వి. స్. న. ౧. వెలుఁగు, తేజస్సు. ౨. బలము, శక్తి. 3. జయము. ౪. ఔద్ధత్యము. ౫. జలము.

సహకరించు. సం. అ. క్రి. తోడుపడు, కలసి పనిచేయు.

సహకారభంజిక. సం. వి. ఆ. స్త్రీ, ఒకక్రీడా విశేషము.

సహకారము. సం. విణ. "హ" కారముతోఁ గూడినది.

సహకారము. సం. వి. అ. పుం. ౧. తియ్య మామిడిచెట్టు. ౨. కలిసి పనిచేయుట. 3. తోడ్పాటు, ౪. ఐకమత్యము.

సహకారి. సం.విణ.న్. ణీ. న్. తోడుపడునది, కలసిపనిచేయునది.

సహకృతము. సం.విణ. అ. ఆ. అ సహకరింపబడినది, కలిసిచేయఁబడినది.

సహకృత్తు. సం. విణ. త్. సహకరించునది.

సహకృత్తు. సం. వి. త్. పుం. సహాయుఁడు, తోటివాఁడు, కలసిమెలసియుండువాఁడు.

సహగమనము. సం. వి. అ. న. ౧. కూడఁబోవుట ౨. భర్తతోఁగూడచితిజొచ్చుట. (దీనిసాగుమానము అందురు)

**సహచరము.** సం. విణ. అ. ఈ. అ. ౧. వెంటఁ బోవునది, ౨. కలసియుండునది.

**సహచరము.** సం. వి. అ. పుం. ౧. హేమ్మీ, కురువ. ౨. పచ్చపువ్వుల ముల్లు గోరింట.

**సహచరి.** సం. విణ. వెంటఁదిరుగునది.

**సహచరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. స్నేహితురాలు, చెలికత్తె. ౨. భార్య. ౩. పచ్చపువ్వుల ముల్లు గోరంట.

**సహచరితము.** సం. విణ. అ. ఆ. అ. ౧. వెంట నుండునది. ౨. కూడియుండునది. ౩. సంబంధించి యుండునది.

**సహచరుఁడు.** సం. వి. అ. పుం. ౧. వెంటనుండు వాఁడు. ౨. మిత్రుఁడు, సహాయుఁడు. ౩. సేవకుఁడు, అనుచరుఁడు. ౪. భర్త.

**సహచారము.** సం. వి. అ. పుం. ౧. అనుసరించుట, వెంటఁబోవుట ౨. అంగీకారము, సమ్మతి, ఐకమత్యము. ౩. (తర్కమున) హేతుసాధ్యములయొక్క యవినాభావసంబంధము. ౪. సహమార్గము. ౫. కలసియుండుట, విడిపోకుండుట.

**సహచారి.** సం. విణ. న. ౧. స్వతస్సిద్ధమైన పుట్టుకతో వచ్చినది, సహజమైనది. ౨. వంశక్రమాగతమైనది, పైతృకమైనది.

**సహజ.** సం. వి. ఆ. స్త్రీ. తోఁబుట్టినది, సోదరి.

**సహజమిత్రము.** సం. విణ. ఆజన్మమిత్రుఁడు.

**సహజము.** సం. విణ. అ. ఆ. అ. ౧. కూడఁ బుట్టినది. ౨. స్వాభావికము. ౩. జన్మసిద్ధమైనది

**సహజము.** సం. వి. అ. పుం. స్వభావము.

**సహజాతము.** సం. విణ. అ. ఆ. అ. తోడబుట్టినది, కలిసిపుట్టినది.

**సహజారి.** సం. వి. ఇ. పుం. ఆజన్మశత్రువు.

**సహజీవనము.** సం. వి. అ. న. ౧. సంఘజీవనము. ౨. కలసిమెలసి జీవించుట. ౩. మైత్రి, సాహచర్యము.

**సహజుఁడు.** సం. వి. అ. పుం. సోదరుఁడు, తోఁడఁ బుట్టినవాఁడు.

**సహత.** సం. వి. ఆ. స్త్రీ. కలయిక, కూడిక, ఐకమత్యము, కలసికట్టుతనము.

**సహదారుఁడు.** సం. వి. అ. పుం. భార్యతోఁ గూడినవాఁడు, వివాహితుఁడు.

**సహదేవుడు.** సం. వి. అ. పుం. పంచపాండవులలో చివరివాఁడు.

**సహధర్మచరి.** సం. వి. ఈ. స్త్రీ. భార్య.

**సహధర్మచారి.** సం. వి. న. పుం. ౧. భర్త. ౨. కలసిపనిచేయువాఁడు, సాటి కార్మికుఁడు.

**సహధర్మచారిణి.** సం. వి. ఈ. స్త్రీ. అగ్నిసాక్షిగాఁ బెండ్లాడబడినభార్య.

**సహధర్మము.** సం. వి. అ. పుం. సమానధర్మము, తుల్యగుణకర్మాదికము.

**సహధర్మి.** సం. విణ. న. సమానధర్మముగలది.

**సహధర్మి.** సం. వి. న. పుం. సమా ధర్మము గలవాఁడు, సాటివాఁడు.

**సహధర్మిణి.** సం. వి. ఈ. స్త్రీ. సహధర్మచారిణి.

**సహనము.** సం. విణ. ఓర్చునది.

**సహనము.** సం. వి. అ. న. ఓర్పు, క్షమ.

**సహపథి.** సం. వి. న. పుం. తోటిబాటసారి, సహయాత్రికుఁడు.

**సహపాంశుకిలుఁడు.** సం. వి. అ. పుం పసితనమునుండియు గలసిమెలసి యున్నమిత్రుఁడు.

**సహపాఠి.** సం. వి. న. పుం. తోటివిద్యార్థి.

సహభావి. సం. వి. న. పుం. ౧. మిత్రుఁడు. ౨. భాగస్వామి. ౩. అనుచరుఁడు.

సహభువు. సం. విశ. ఉ. ఉ. ఉ. సహజమైనది, స్వాభావికమైనది.

సహభోజనము. సం. వి. అ. న. బంధుమిత్రులతోఁ గలిసి భుజించుట.

సహమరణము. సం. వి. అ. న. సహగమనము.

సహమృత. సం. వి. ఆ. స్త్రీ. భర్తతోఁ సహగమనము గావించిన స్త్రీ.

సహయుధ్వ. సం. వి. న. పుం. సాటియోధుఁడు, కలిసియుద్ధము చేయువాఁడు.

సహరక్ష (స్) ము. సం. వి. స్. పుం. మూఁడు విధములైన యాగాగ్నులలో నొకటి.

సహరి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

సహర్షము. సం. విశ. అ. ఆ. అ. సంతోషముతోఁ గూడినది,

సహవసతి. సం. వి. ఇ. స్త్రీ. సహవాసము.

సహవాసము. సం. వి. అ. పు. కలిసియుండుట, మైత్రి.

సహవాసి. సం. వి. న్. పుం. కలిసియుండువాఁడు, ఒకయింటనివసించువాఁడు, మిత్రుఁడు.

సహసా. అవ్య. ౧. బలత్కారముగా ౨. తొందరపాటులో, అనాలోచితముగా. ౩. ఆకస్మికముగా, ఏకకాలమున ౪. చిఱునవ్వుతో, స్మితముగా.

సహసానము. సం. విశ. అ. ఆ. అ. ౧. ఓర్పుగలది. ౨. జయించునది.

సహసానము. సం. వి. అ. పుం. ౧. నెమిలి. ౨. బలి, త్యాగము. ౩. యాగము.

సహస్యము. సం. వి. అ. పుం. పుష్యమాసము.

సహస్రకరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు

సహస్రకాండ. సం. వి. అ. స్త్రీ. తెల్లగఱిక

సహస్రకిరణుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

సహస్రతయము. సం. విశ. అ. ఆ. అ. వేయిరెట్లు.

సహస్రతయము. సం. వి. అ. న. వేయి.

సహస్రదంష్ట్రము. సం. వి. అ. పుం. వేయి కోఱలుగలచేప, పాఠీనము.

సహస్రదీధితి. సం. వి. ఇ. పుం. సహస్రకిరణుఁడు.

సహస్రదుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సహస్రదృక్కు. సం. వి. శ్. పుం. ౧. ఇంద్రుఁడు ౨. విష్ణువు.

సహస్రధా. సం. అవ్య. ౧. వేయిశకలములుగా ౨. వేయిరెట్లుగా.

సహస్రధార. సం. వి. అ. స్త్రీ. దేవతావిగ్రహములను కడుగుటకై పెక్కురంధ్రములుగల పాత్రమునుండి విడువఁబడు జలధార.

సహస్రధారము. సం. వి. అ. పుం. విష్ణుచక్రము.

సహస్రనయనుఁడు. సం. వి. అ. పుం. సహస్రదృక్కు.

సహస్రనేత్రుఁడు. సం. వి. అ. పుం. సహస్రనయనుఁడు.

సహస్రపత్రము. సం. వి. అ. న. ౧. కమలము ౨. బెగ్గురుపక్షి.

సహస్రపాత్తు. సం. వి. ద్. పుం. ౧. విరాట్పురుషుఁడు. ౨. విష్ణువు. ౩. శివుఁడు. ౪. బ్రహ్మ.

సహస్రబాహు. సం. వి. ఉ. పుం. ౧. కార్తవీర్యార్జునుఁడు. ౨. బాణాసురుఁడు. ౩. శివుఁడు. ౪. విష్ణువు (అని కొందఱు).

సహస్రభుజ. సం. వి. ఆ. స్త్రీ. దుర్గ.

సహస్రభుజుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.

సహస్రము. సం. వి. అ. న. ౧. వేయి, పది నూఱులు ౨. పెక్కు, పెద్దమొత్తము.

సహస్రమూర్ధుఁడు. సం. వి న్. పుం విష్ణువు. సహస్రమౌళి.

సహస్రమౌళి. సం. వి. ఇ. పుం. విష్ణువు.

సహస్రరశ్మి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

సహస్రరోమము. సం. వి. న్. న. కంబళము.

సహస్రలోచనుఁడు. సం. వి అ. పుం. సహస్రనేత్రుఁడు.

సహస్రవదనుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.

సహస్రవీర్య. సం. వి. ఆ. స్త్రీ. గఱిక i

సహస్రవేధము. సం. వి. అ. న. ౧. పుల్లప్రబ్బి i ౨. పుల్లగంజి.

సహస్రవేధి. సం. విణ. వేయింటిని వేధించునది

సహస్రవేధి. సం. వి. న్. పుం. కస్తూరి.

సహస్రవేధి. సం. వి. న్. న. ఇంగువ.

సహస్రశః. సం. అవ్య. వేలకొలఁదిగా, వేయి విధములుగా.

సహస్రశిఖరము. సం. వి. అ. పుం. వింధ్య పర్వతము.

సహస్రశీర్షుఁడు. సం. వి. అ. పుం. విరాట్పురుషుఁడు.

సహస్రశ్రవణుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.

సహస్రహార్యశ్వము. సం. వి. అ. పుం. ఇంద్రుని రథము.

సహస్రహస్తుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సహస్రాంశువు. సం. వి. ఉ. పుం. సూర్యుఁడు, వేవెలుఁగు.

సహస్రాక్షుఁడు. సం. విణ. ౧. వేయికన్నులు కలవాఁడు. ౨. జాగ్రత్త గలవాఁడు.

సహస్రాక్షుఁడు. సం. వి అ. పుం. ౧. ఇంద్రుఁడు ౨. విరాట్ పురుషుఁడు. ౩. శివుఁడు. ౪. విష్ణువు.

సహస్రాధిపతి. సం. వి. ఇ. పుం. వేయి గ్రామములకు పరిపాలకుఁడు.

సహస్రాననుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.

సహస్రార్చి. సం. వి. స్. పుం. సహస్రాంశువు.

సహస్రావరము. సం. వి. అ. పుం. ఐదువందలకు పైఁబడి వేయింటికిలోఁబడిన పణములజరిమానా.

సహస్రి. సం. తణ. న్. ౧. వేయికలది. ౨. వేలతోఁ గూడినది. ౩. వేయిమొత్తమైనది. (జరిమానా మొ॥)

సహస్రి. సం. వి. న్. పుం. ౧. వేయిమందిమొక్క లేక వేయింటి సమూహము. ౨. వేయిమందిగల సేనకు నాయకుఁడు.

సహస్వత్తు. సం. విణ. బలిష్ఠము, శక్తిమంతము.

సహాధ్యయనము. సం. వి. అ. న. ౧. కలసి చదువుకొనుట. ౨. సహాధ్యాయిత్వము.

సహాధ్యాయి. సం. వి. న్. పుం. సహపాఠి.

సహాయత. సం. వి. ఆ. స్త్రీ: ౧. సహాయుల సమూహము. ౨. కలయిక, మైత్రి. ౩. సాయముతోడ్పాటు.

ఉ. అమ్మాయి బ ధుమిత్త్రుల సహాయత కల్మి ప్రయోజనంబు లేదు.

భార. అశ్వ. ౧-౧౧౫.

**సహాయము.** సం. వి. అ. పుం. ౧. తోడ్పాటు. పోషణ. ౨. ఎజ్జిబాళు ౩. ఒకవిధమైన పరిమళము. ౧. తోడ్పాటు.

క. అనఁటయు వారలు హరికి, ట్లను పేను
రణ బునకు సహాయం బొల్లన్.
భార. ఉద్యో. ౧-౦౬.

క. అంఘుబలవిక్రమోదాత్తులకైనను బలములేక
దోర్గర్వము మై, పెలఁపఁగ దళమె సహాయము
భాగ. ౧-౧౫.

క. తగినసహాయము గలిగిన, పగతుని యెడ
మొక్కలాపుఁబని గాదనిన్.
ప్రబోధచం. ౧-౫౭.

**సహాయుఁడు.** సం. వి. అ. పుం. ౧. మిత్రుఁడు సహచరుఁడు. ౨. అనుచరుఁడు. అనుసారి. ౩. తోడ్పడువాఁడు, పోషకుఁడు. ౪. శివుఁడు. ౫. తోడైనవాఁడు.

క. విదితధనుర్విద్యావిదు, ఘనుఁ గన్ల సహా
యుఁగఁ బడసి కౌరవపతిఘనుఁడు.
భార. ఆది. ౬-౬౭.

**సహారము.** సం. వి. అ. పుం. ౧. మామిడిచెట్టు ౨. సర్వనాశనము, మహాప్రళయము.

**సహారువు.** వి. జూదమునందలి పంభాష.

ఉ. ఇంతయు సేల మీకు నెమకొక్కటిలో
మునికిం బదాఱు సెల్లింతుఁ గదల్లతాఁకున
నెలింబడ సారెగలప్వ డిత్తు గెల్పంతపసం
గ్రహంబున సహారువుతోఁ గన మాడిపోయి
నం బంతముతో వ్యవహారమునఁ బట్టుదుఁ బా
సికబొమ్మ గట్టుదున్. ఉ. హరి. ౩.౧౦౭.

**సహార్థము.** సం. విశే. అ. ఆ. అ. ౧. సమాన లక్ష్యముగలది. ౨. సమానమైన యర్థముగలది.

**సహార్థము.** సం. వి. అ. పుం. సమానలక్ష్యము లేక ప్రయోజనము.

**సహాసనము.** సం. వి. అ. న. ఒకే ఆసనమునఁ గూర్చుండుట.

**సహి (ఋ) ంచు.** సం. స. క్రి. ౧. క్షమించు.

వ. వాఁడును గడు భీకరం బయి యగ్నిదేవుఁడు
సమస్కరించి మహాపురుషా! నా యజ్ఞానంబు
సహింపవలయు ననె. భార. సభా. ౧-౨౫౫.

ఉ. అక్కమలాక్షి పొందు దగవాడి తుదిన్ ; జ
మేది కోటికి యిక్కురాక తిక్కనసహిం
చునె నన్ మనుఁడు. భార. విరా. ౨-౧౯౬.

౨. ఓర్చు.

చ. వినుమాతుల! మానధనాఢ్యుఁ డైనభూపతి
సహియింపనోపునె! సపత్నులవృద్ధియు నాత్మ
హానియున్. భార. సభా. ౨-౬౭.

దశగ్రీవదో, ర్బలమైనన్ సహియింపవచ్చు.
ఉ. రా. ౧-౧౫౭.

**సహిత.** సం. విశే. ఋ. సహించునది, ఓర్చుకొనునది.

**సహితము.** సం. విశే. అ. ఆ. అ ౧. కూడియున్నది, కలసియున్నది. ౨. సహింపఁబడినది, ఓర్వఁబడినది.

**సహిష్ణువు.** సం. విశే. ఉ. ఉ. ఉ ఓర్చుకొనునది, సహించుశీలముగలది.

**సహురి.** సం. వి. ఇ. పుం. సూర్యుఁడు

**సహురి.** సం. వి. ఈ. స్త్రీ. భూమి.

**సహృదయము.** సం. విశే. అ. ఆ. అ ౧. మంచి హృదయముగలది, దయగలది. ౨. చిత్తశుద్ధి గలది.

**సహృదయుఁడు.** సం. వి. అ. పుం. ౧. విద్వాంసుఁడు. ౨. రసజ్ఞుఁడు. ౩. విమర్శనసమర్థుఁడు, వివేకి.

**సహేలము.** సం. విశే. విలాసముతోఁగూడినది, వినోదముతోఁగూడినది.

**సహోక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఒకయర్థాలంకారము.

**సహోఢుఁడు.** సం. వి. అ. పుం. ౧. వివాహకాలమున గర్భవతియైయున్న భార్యకుఁబుట్టినవాఁడు. (ద్వాదశపుత్రులలో నొకఁడు) ౨. దొంగిలింపఁబడిన సొత్తుతోఁబట్టుపడినదొంగ.

**సహోదరి.** సం. వి. ఈ. స్త్రీ తోడఁబుట్టువు, సోదరి.

**సహోదరుఁడు.** సం. వి. అ. పుం. సోదరుఁడు.

**సహోపమ.** సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన ఉపమాలంకారభేదము.

**సహోరము.** సం. విశే. మేలయినది, శ్రేష్ఠమైనది.

**సహోరుఁడు.** సం. వి. అ. పుం. ముని, ఋషి.

**సహ్యజ.** సం. వి. ఆ. స్త్రీ. కావేరీనది.

**సహ్యము.** సం. విశే. ౧. భరింపఁదగినది, ఓర్వఁదగినది, సమర్థింపఁదగినది. ౨. ఓర్వవలసినది. ౩. ఓర్వఁగలది. ౪. సరిపడినది, సరియైనది. ౫. తీయనిది, పథ్యమైనది. ౬. బలమైనది, శక్తిమంతమైనది.

**సహ్యము.** సం. వి. అ. పుం. సప్తకులపర్వతములలో నొకటియైన సహ్యము అను పశ్చిమసముద్రతీర పర్వతము.

**సహ్యము.** సం. వి. అ. న. ౧. ఆరోగ్యము, రోగోపశాంతి. ౨. సహాయము, తోడ్పాటు. ౩. యోగ్యత, పర్యాప్తి.

**సహ్యాత్మజ.** సం. వి. ఆ. స్త్రీ. సహ్యజ.

**సళాది.** పెద్దయగు కాపు నొకరు, మణియగాని కింకరుఁడు.

ఎ. గీ. ముద్రగరిటియ భుజముపై మొనయఁబెట్టి, ఘంటఖంగని మ్రోయనంగళ్లబడిని, మరిగితిరుగు సళాదికి మణియకాంద్ర, కవని బడికాఁపుకావించనలరు సంత. హంస. ౨-౪౯,

**సళించు.** అ. క్రి. దుఃఖించు.

క౦. లేమా! నీవెతమానుప, లేమా? మామాటమున సళింపఁగనిపుడేలే? మాఱుమాట యొసఁగుము. నీలా. ౨ అ. (శ. ౭)

**సళిగె.** (సం. శలాక. క. సళిగె) బద్ద

ద్వి.... ఆల, వట్టముల్ నిలువుఁబల్లిక ల్వెమరు సళిగెలున్ సంబెసల్ సానలు మ్రుగ్గు. (వెదురుసలాగెల సంబెటల్ (కాపు) పండితా. పర్వత. ౩౪౩.

**సళియము.** వి. కలయంపి.

ద్వి. ఎల్లెడ సళియంబు లిప్పించి రంగ, వల్లులు లెట్టించి వాడవాడలను. పండితా. మహిమా. ౭౯౫.

ద్వి.... సిద్దేశ్వ, రముకాదియవరేశ్వర స్థానములను, సల్లలితములుగా సళియమిప్పించి, పెల్లుగా ముగ్గులు పెట్టంగఁ బంచి రో పండితా. పర్వత ౩౬౭.

**సళుపరించు.** అ. క్రి. వ్రణములోనగునది పోటెత్తు.

**సళుపరింత.** వి. సళుపరించుట, సళుపు.

**సళుపు.** అ. క్రి. వ్రణములోనగునది పోటెత్తు.

**సళుపు.** వి. వ్రణములోనగు దానిపోటు.

**సళువు.** విశే. భారమైనది.

**సళ్లబెట్టు.** (సళ్లన్ + పెట్టు) స. క్రి. సడలఁజేయు.

సీ. సనక సనందనాదినిఖిలాంతర్యామి హృల్లీన భావంబుసళ్లఁబెట్టి. పాండురంగ. ౨-౧౧.

ఉ. చంచలనేత్రి దాల్చు జలజాతమృణాలసరంబు వేగ స, ళ్లించిన బాలుతెంచి కబళించి .... ఆము. ౫-౧౫౦.

**సళ్లు.** అ. క్రి. (సడలు యొక్క రూపాంతరము) ౧. వెనుకకు తగ్గు.

క. అనిసదము విని యావన, సీసలు పొంగారె జెదిరివేవలు సళ్లెన్

చ. వ్రేఁగుబడి కాంచి ప్రాఁతలను చుట్టియుఁ
గుత్తులు వ్రేవి సందిటం బెరయఁగఁ బట్టి పెక్కు
గతులఁ బెంచి గిరేర్పడఁగఁ జిల్చి కొక్కెరయుఁగఁ
జూచి పందియపుఁ బోఁకువ దిద్దుచుఁ జెక్కు
చేసి పల్లిఁ మరి వోయుటంచును ఖిలీ పెళి
పుంజాలు దన్నులాడఁగన్ హంస ౩-౨౧౬.

౨. పలికించు, జాలు.

తే.గీ. వీటిలో విడిమేలపుఁ జటుని విధము, సాఁగఁ
గొన్నార్భు నిజపిత్ప్రసంచితంబు, బొల్లుగాఁ
బల్లి యదియెల్ల సళ్ళుటయును, డిల్లడిల్లుచు
దుర్గారత్తల్లజూంచు. ప్రబం. ౧-౬౭౫.

సళ్ళు. స. క్రి. విడుచు, వదలు.

చ. కరచిన కాటువీడ కొడిగంబుగఁ బట్టిన పట్టు
సళ్లకత్తె తెఁగిలకొట్టి పలుకు బెడిదంపుఁ బెనం
కువగోష్ఠ నొక్కుచున్ చంద్రాంగ ౬-౧౫౨

చ. కరచియుఁ గాళ్ళఁ దాచియును గట్టులు గొట్టులు
చిట్లవైచియున్,... బిగువు సళ్ళక తోఁకలఁ
బట్టి కొట్టియున్, వడిమటి యాము జేనఁగఁబ
మావుల లొట్టియలం గడిందిగా, నట మెన
రించి పెచ్చుఁక నూల్కానఁ దేరులు పిండి
సేయుచున్. అ. రా. యుద్ధ. ౧౩౧.

## సా

సా అను ఒకయక్షరము.

సా. సం. వి. ఆ. స్త్రీ. ౧. లక్ష్మి. ౨. పార్వతి ౩. దేహకాంతి.

సా. వై. విశే. వృత్తియందు సామశబ్దమునకు అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (సాఁబాలు, సామేను మొ.)

సాంకర్యము. సం. వి. అ. న. మిశ్రణము, కలయిక, భిన్నద్రవ్యములకలయిక, కలగలుపు.

సాంకలము. సం. వి. అ. న. సంకలనము వలన నేర్పడినది.

సాంకలి. సం. వి. ఈ. స్త్రీ. సాంకలము.

సాంకపము. సం. వి. అ. పుం. సంకమదము, జవాది.

సాంకాలిక. సం. వి. ఆ. స్త్రీ. ప్రతిదినము నిచ్చెడి వడ్డీ.

సాంకాశ్య (ము) సం. వి. ఆ. స్త్రీ. అ. న. జనకమహారాజు తమ్ముఁడగు కుశధ్వజుని రాజధాని.

సాంకేతికము. సం. విశే. అ. ఈ. అ. ౧. సంకేతములకు లేక చిహ్నములకు సంబంధించినది. ౨. సాంప్రదాయికము. ౩. ప్రయోగనైపుణ్యమునకు సంబంధించినది. ౪. సంకేతమువలన నేర్పడినది.

సాంక్షేపికము. సం. విశే. అ. ఈ. అ. సంక్షిప్తము, క్లుప్తము, సంగ్రహము.

సాంఖ్యము. సం. విశే. అ. ఆ. అ. ౧. సంఖ్యకు సంబంధించినది. ౨. లెక్కించునది, గణించునది. ౩. వివేకించునది. ౪. పరిశీలించునది, చర్చించునది, తర్కించునది.

సాంఖ్యము. సం. వి. అ. పుం. న. షడ్దర్శనములలో నొకటి. (చూ. దర్శనములు)

సాంఖ్యుఁడు. సం. వి. అ. పుం. ౧. సాంఖ్యదర్శనానుయాయి. ౨. శివుఁడు.

సాంఖ్యముఖ్యుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు

సాంగకము. సం. వి. అ. న. ఒకచేయిమాత్రమే ప్రయుక్తమగు నసంయుత హస్తాభినయమునందలి యొకముద్ర.

సాంగము. సం. విశే. అ. ఆ. అ. ౧. అవయవములు లేక భాగములు గలది. ౨. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, అను వేదాంగము లారింటితోఁ గూడినది.

సీ.... ఆపస్తంబసూత్ర పవిత్ర శీలుఁడు సాంగ
వేదవేది. భార. విరాట. ౧-౧౧౦.

సీ. సాంగంబు లగుచుండ నకలవేదంబులుఁ జదివె
వసిష్ఠులో.... భార. ఆది. ౪-౧౬౯.

౪. సంపూర్ణమైనది.

తే. సాఁగముగఁ దండ్రి కగ్ని కార్యములు దీర్చి
వివిధభంగి యథావిధి విప్రవరుల, నిష్టనిఖి
లార్థదానసంతుష్టిఁ దేల్చి యదలు రఘువీర
వనయాత్రి వార్తఁ దలచి.
రామా. ౫-౭౯.

**సాంగతికము.** సం.విణ. అ. ఈ. అ. ౧. సంఘమునకు సంబంధించినది. ౨. జతకూర్పునది; కలుపునది.

**సాంగతికుఁడు.** సం. వి. అ. పుం. ౧. అతిథి, ఆగంతుకుఁడు. ౨. కార్యార్థమై వచ్చినవాఁడు.

**సాంగత్యము.** సం. వి. అ. న. ౧. కూడిక, కలయిక, చేరిక. ౨. మైత్రి, స్నేహము. ౩. ఒక సారస్వతప్రక్రియ.

**సాంగమము.** సం. వి. అ. పుం. కలయిక, సంఘము, సమావేశము.

**సాంగుబలా.** వి. ౧. వేత్రధరులు హెచ్చరిక చేయునపుడుపయోగించుపదము. (రూ. సా(ం)గుబళా)

క. కులపతియు వేత్రధరు లార్తిలి సాంగుబళా
యనంగఁ దేవ డిగి. వసు. ౧-౧౫౦.

ద్వి. కోతికట్టికలు సాంగుబలా యనఁగ.
రం. రా. కిష్కిం. చి. ని. పా.

౨. నతివిశేషము, ఎరఁగుట.

వ. ప్రయాగయందలి మాధవునకు సాగుబలా,
గయ యందలిగదా ధరునకు మోడ్పు.
ప్రబం. ౧-౭౭౦.

రగడ. విక్రమస్థలి దివ్యవిక్రమ హరికిని సాకెవ
సారెకు సాంగుబళాయని. హంస. ౪-౨౧౩.

**సాంగోపాంగము.** సం. విణ. అ. ఆ. అ. అంగములతోడను, ఉపాంగములతోడను కూడినది, సవిస్తరమైనది, సంపూర్ణమైనది.

**సాంగ్రామికము.** సం.విణ.అ.ఈ. అ. ౧. యుద్ధసంబంధి. ౨. కలహాశీలి. ౩. ఉగ్రము, ఉద్ధతము.

**సాంగ్రామికుఁడు.** సం. వి. అ. పుం. సేనాపతి

**సాంఘాతికము.** సం. విణ. అ. ఈ. అ. వినాశకరము, మృత్యుకరము.

**సాంఘికము.** సం. విణ. అ. ఈ. అ. సంఘమునకు సంబంధించినది.

**సాంజనము.** సం. వి. అ. పుం. బల్లి.

**సాంతపనము.** సం.వి.అ. న. మూఁడు దినములు పగళ్ళును మూఁడు దినములు రాత్రులును భోజనముచేసి మూఁడు దినములు అయాచితలబ్ధపదార్థంబులను భుజించి పిమ్మట మూఁడు దినములు నిట్టుపానుముండెడు వ్రతము. పంచగవ్యమును కుశోదకమును పుచ్చుకొని ఒకరాత్రి యుపవాసముండుట. (అనికొందఱు) శ. ర.

**సాంతము.** సం. విణ. (అ. ఆ. అ) అంతముగలది. ౨. పూర్ణము, పూర్తియైనది. ౩. మొత్తము ౪. సకారము అంతముగాఁగలది.

**సాంతరము.** సం. విణ. అ. ఆ. అ. ౧. ఎడముగలది, విరళమైనది, విరామములు గలది. ౨. జల్లి చేఁతగలది. జల్లికూర్పుగలది.

**సాంతానికము.** సం.విణ. అ. ఈ. అ ౧. వ్యాపించినది, విస్తరించినది, కొనలు సాఁగునది. ౨. సంతానమునకు(వంశమునకు)సంబంధించినది. ౩. సంతాన వృక్షమునకు సంబంధించినది.

**సాంతానికుఁడు.** సం. వి. అ. పుం. సంతానము కొఱకు పెండ్లాడఁగోరువాఁడు(బ్రాహ్మణుఁడు)

**సాంత్వన(ము)** సం. వి. అ. స్త్రీ. అ. న. ౧. శాంతపఱుచుట, ఓదార్చుట ౨. సంధిచేయుట, సామోపాయము. ౩. సాదరవచనము, సామవచనము. ౪. శాంతము, మార్దవము. ౫. ఆదరముతోడి పలుకరింపు, పరామర్శ.

సాంత్వము. సం. వి. అ. పుం. సాంత్వనము విణ. అ. ఆ. అ మృదువైనది, మధురమైనది, స్నిగ్ధమైనది, (వాక్కు)

సాందీపని. సం. వి. అ. పుం. ఒకఋషి (శ్రీకృష్ణ బలరాముల యుపాధ్యాయుఁడు)

సాందృష్టికము. సం.విణ. అ. ఆ. ఆ. తత్కాల ఫలప్రాప్తి సంబంధించినది. అప్పటికప్పుడు కనిపించునది.

సాందృష్టికము. సం. వి. అ. న. సద్యఃఫలము. తత్క్షణప్రయోజనము.

సాంద్రము. సం.విణ.అ. ఆ. అ. ౧. చిక్కనిది, దట్టమైనది, ఎడములేనిది.

సీ. శే. సాంద్రతరచంద్రికా కేళిచంద్రముములు. పాఁజా. ౧-౬౫.

౨. మెత్తనైనది, మృదువైనది. 3. క్రిక్కిరిసినది ప్రోగైనది. ౪. బలిసినది, దృఢమైనది. అతిశయమైనది, సమృద్ధమైనది. ౬. గాఢమైనది, తీవ్రమైనది ౭. ప్రియమైనది, స్నిగ్ధమైనది,జిడ్డుగలది. ౮. నున్ననిది, మెత్తనిది. మనోహరము, సుందరము.

సాంధ్రము. సం. వి. అ. పుం ౧. పోగు,రాశి, గుంపు, ౨. పొద, అడవి, గుబురు.

సాంధి... సం. వి. అ. పుం. ... బట్టిపట్టువాఁడు.

సాంధివిగ్రహికుఁడు. సం. వి. అ. పుం. విదేశవ్యవహారములు నిర్వహించుమంత్రి

సాంధ్యము. సం. విణ. అ. ఈ. అ. ౧. సాయంసంధ్యాసంబంధి. ౨. ఉదయసంధ్యాసంబంధి.

సాంధ్యరాగము. సం. వి. అ. పుం. ఉదయ సాయంసంధ్యలకు సంబంధించినయెఱుపు.

సీ. స్నానకవల్కల క్షాళనోద్ధతకాంతి సాంధ్యరాగద్యుతి సంహరింప. ఉ. హ. ౨-౧౧౧.

సాంపరాయము. సం.విణ.అ.ఈ. అ ౧. యుద్ధసంబంధి, దుర్ఘటము. ౨.ఆముష్మికము,భవిష్యము. వి. అ. పుం. న. ౧. విరోధము, కలహము ౨. భవిష్యత్తు, ఉత్తరజన్మము. 3. పరలోకప్రాప్తిసాధనము. ౪. భావినిగూర్చినచింత. ౫. విచారము, పరిశోధన ౬. సందిగ్ధావస్థ, అనిశ్చయము.

సాంపరాయికము. సం.విణ. అ. ఈ. అ. సాంపరాయము.

సాంపరాయికము. సం. వి. అ. న. యుద్ధము కలహము.

సాంపరాయికము. సం. వి. అ. పుం. యుద్ధయోగ్యమైన రథము.

సాంప్రతము. సం.విణ.అ.ఆ.అ. ౧. ఉచితము, తగినది. ౨. అనుకూలము, సంబద్ధము.

సాంప్రతికము. సం. విణ అ. ఈ. అ. ౧. తగినది, ఉచితమైనది, ఒప్పయినది. ౨. వర్తమానకాలమునకు సంబంధించినది.

సాంప్రదాయికము. సం. విణ. అ. ఈ. అ. ౧. ఆచారమునకు సంబంధించినది. ౨. వంశపరంపరాగతమైనది.

సాంబంధికము. సం. విణ. అ. ఈ. అ. చుట్టరికమువలనఁ గలిగినది

సాంబంధికము. సం. వి. అ. న. చుట్టరికము, సంబంధము.

సాంబరము. సం. వి. అ. న. సంబరమున ఉత్పన్నమైన ఉప్పు.

సాంబరి. సం. వి. ఈ. స్త్రీ. (రూ. శాంబరి) ౧. ఇంద్రజాలము,మాయ, ౨. మాంత్రికురాలు.

సాంబారు. వి.(తమిళం) ఒకవిధమైనపప్పుచారు.

సాంబుఁడు. సం.వి.అ.పుం.౧. అంబ (పార్వతి) తోఁ గూడినవాఁడు. ౨. శివుఁడు. విణ. అ. ఆ. ఆకలితోఁ గూడినవాఁడు.

సాంబ్రాణి. వి. ౧. సంబరేణు చెట్టువలనఁ గలిగెడు ధూపద్రవ్యవిశేషము. ౨. ఉత్తమాశ్వము,

తే. "పసిఁడి పళ్యారతేజ సాంబ్రాణి పొక్క" రామా. ౪ అ. (శ. ౪)

**సాంబ్రాణి.** సామ్రాణి (శ.సాంబ్రాణి) ఒకానొకదేశము ౨. ఆదేశపుగుఱ్ఱము. వి. ణ. సామ్రాణి దేశమందు బుట్టినది. ఆదేశపుగుఱ్ఱము.

సీ. తోరంపుసాంబ్రాణి ధూపధూమము గట్టు పగడాల బాబాలబారుఁ దీర్చి దశావ ౧-౨౬౫.

వ. తుమ్మెదలయిమ్ములకిమ్ముజూపు సాంబ్రాణి ధూపధూమములతో ఉ. రా. ౧-౧౩౪

తే. గీ. లలితకలకంఠకోలాహలంబు లెసఁగ, దళముకొని రెండుగెలలఁ గాదంబకోటి, గొల్వ రాచిల్క సాంబ్రాణిగుఱ్ఱ మెక్కి దర్పకుఁడు పాంథజనులపై దండువెడలె. ఉ. రా. ౪-౧౫౬.

తే. గీ. చిఱుక సాంబ్రాణితేజి వశీయఁ గేదు, కమ్మతెమ్మెర .... దశా ౬-౨౧౪.

**సాంబ్రాణివత్తి.** వి. ఊఁదువత్తి.

**సాంభవి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఎఱ్ఱలొద్దుగ ౨. సంభవత, కాఁగలది.

**సాంయాత్రికుఁడు.** సం.వి.అ. పుం. సముద్రము మీఁద వాణిజ్యముచేయువాఁడు, నౌకావాణిజ్యముచేయువాఁడు, నౌకావాణిజ్యము చేయువాఁడు పోతవణిజుఁడు.

**సాంయుగీనము.** సం. విణ. అ. ఆ. అ యుద్ధసంబంధ, కలహాకేలి, సమరకుశలి.

**సాంయుగీనుఁడు.** సం. వి. అ. పుం. యుద్ధవీరుఁడు, సమరకుశలుఁడు.

**సాంరావిణము.** సం.వి. అ. న. పెద్దకేక, ఉచ్చైర్నాదము, అఱపు, బొబ్బ

**సాంవత్సరము.** సం.విణ.అ.ఈ.ఆ. వార్షికము, ఏడాదికొకతూరి జరుగునది.

**సాంవత్సరికము.** సం. విణ. అ. ఈ. ఆ. వార్షికము, ఏటికొకతూరి జరుగునది.

సం. వి. అ. న ఆబ్దికము, ఏటికొకతూరి పితృదేవతలనుద్దేశించి చేయుశ్రాద్ధకర్మ. దీనికి సంవత్సరీకము అని వ్యవహారముకలదు.

**సాంవత్సరికుఁడు.** సం. వి. అ. పుం. (రూ. సాంవత్సరుఁడు) ౧. జ్యోతిష్కుఁడు ౨. పంచాంగకర్త ౩. ముహూర్తములు పెట్టువాఁడు. ౪. జ్ఞాని ౫. గణకుఁడు.

**సాంవాదికము.** సం. విణ. అ. ఈ. అ ౧. వ్యావహారికము, వాడుకలో నున్నది, ప్రజలు మాటాడునది. ౨. వివాదాస్పదమైనది.

**సాంవాదికుఁడు.** సం. వి. అ. పుం. వాది, తగవు తెచ్చినవాఁడు.

**సాంవృత్తికము.** సం. విణ. అ. ఈ. అ. క్షణభంగురము, ప్రాతిభాసికము.

**సాంశయికము.** సం. విణ. అ. ఈ. అ ౧. సందిగ్ధము. ౨. అనిశ్చితము, అనిర్ణీతము. సం. వి. అ. న. సంశయాస్పదము, ఉపద్రవకారియైన పని.

**సాంశసంఖ్య.** సం. వి. అ. అంశము అనగా ఒకటియందలి భాగము. దానితో కూడినసంఖ్య సాంశసంఖ్య.

ఉదా : $1\frac{1}{4}$, $2\frac{1}{2}$, $3\frac{3}{4}$. (చూ. వాచ)

**సాంసారికము.** సం. విణ. అ. ఈ. అ. ౧. సంసారికసంబంధి. ౨. ఐహికము, ప్రాపంచికము.

**సాంసిద్ధికము.** సం. విణ. అ. ఆ. అ. ప్రకృతిసిద్ధము, స్వాభావికము, సహజము ౨. స్వతస్సిద్ధము, అయత్నసిద్ధము, 3. కేవలము, అకారణము. ౪. దైవికము.

**సాంస్థానికుడు.** సం.వి.అ. పుం. సజాతీయుఁడు, తనదేశపువాఁడు.

సాంస్రావిణము. సం. వి. అ. న. ప్రవాహము, నది.

సాంయుగసనకము. సం. వి. అ. పుం. ౧. రథిక సంబంధి, సైనికము.

సాఁకించు. (సాకు+ఇంచు- స్వార్థమునం దించు గాగమము) స. క్రి. రక్షించు, కాపాడు.

ద్వి. ఆఁకొనకుండంగ నరసి పాలిచ్చి, సాకించి పెనుపదే జనని గల్గినను.
బస. పురా. ౫౨ పు. ౪౬ పం.

సాఁకు. స. క్రి. ౧. రక్షించు, కాపాడు. ౨. పెంచు (క. సాకు) శ. ర, చి. ని, ధాతుమాల.

క. అనఘుఁడ బహుశాస్త్రేకులు గాడి వెఁకొడిగట్టి సాఁకుకొంటివి సుమ్మా, బహలిక నిపు డిట్ల గదవు, పురమిం బవరించి నిదురవోయితో తెఁడ్రి!
అ. రా. యుద్ధ ౩౯౩

ఉ. అక్కట దోసలోఁట యిదియెఁదవీయు ఫలంబు లమ్మి యూ, పొక్కను సాకఁ గోరితి
శుక. ౩-౩౭౯.

గీ. ...నాయకుఁడవై నన్ను సాఁకుమయ్య, రామలింగేశ! రామచంద్రపురవాస!
రామ. శ. ౧౦౫.

సాఁకుముప్పుఁటుగు. వి. కోయిల.

సాఁగదీయు. స. క్రి. (సాగన్+తీయు) ౧. ప్రార్థించు, బతిమాలు ౨. పొడిగించు.

సాఁగఁబడు. అ. క్రి. (√సాఁగు) శరీరమంతయు భూమిమీఁద తాకునట్లుపడు, సాష్టాంగముచేయు.

ఉ. ముందల వచ్చి సాఁగఁబడి మ్రొక్కిన శౌరి కృపార్ద్రచిత్తుఁడై. సా. ౫-౩౫.

సాఁగిలి. వి. (√ సాగు) నతివిశేషము. సాష్టాంగ నమస్కారము.

వ. మసుర నున్న బాలకృష్ణునకు సాఁగిలి మాయాస్థానము నున్న మధుసూదనునకుఁ గోరికి.
ప్రబం. ౧-౭౭౦.

సాఁగిలు(ల్లు). = చాఁగిలు. ౧. శెలకువార్లు

చ.... సుమోదభక్తి తత్పరత దలిర్ప లేచి కర పాలుఁడు సాఁగిలిమ్రొక్కి ...
కళా. ౪-౧౬౩.

౨. సాష్టాంగనమస్కారముచేయు, మ్రొక్కు.

శా.... జగద్గురుఁడున్ సాఁగిల్లి యీభూవరున్ దీవన్ బ్రోవు కృపాసముద్ర యని యెంతేఁ బ్రార్థనల్ చేసినన్. శ్రీరంగ. ౬-౭౬.

సాఁగు.[1] = చాఁగు[1] అ. క్రి. ౧. సాష్టాంగ నమస్కారముచేయు.

గీ. ఇట్లు నేత్రోత్సవముగ లక్ష్మీశుఁ జూచి, భయము విడిచి సుపద్మలు ప్రమద మొంది, సాఁగి ప్రణమిల్లి లేచిహస్తములు మొగిచి, వినతు లొనరించి తగవిన్నవించి రిట్లు.
జాహ్నవి. ౧-౭౫

౨. దీర్ఘమగు.

ఆ. దివము కాని యిఁక భువనంబునం దిట, పట్టి రాత్రి లేనియట్టుగాఁగఁ జేసి నొక్క విధ విశేషించి ... సేఁత దివముసాఁగి నిలిచె నొక్క. భార. ... ౨-౩౧౩.

వ. ఇంకులతో దింకులుసాగి. ఉ. రా. ౪-౧౬౩

౩. పోవు, నడచు.

ద్వి. పురజను లాస్త్రులై పురఘరఁ బొక్క, పురము వెల్వడి సాఁగిపోవుచు నుండె.
హంశ. పూర్వ. ౧౫౩౦.

౪. అడుగున త్రాడుకట్టి ... యలుగువంటి ఆయుధము. (వాచ)

సాఁగుడుమానిసి. వి. పొడగరి.

సాఁచు. స. క్రి. చూ. చాఁచు.

సాఁచు. వి. శేతన్న. (స్త్రీ సంబంధి)

సాఁతు. వి. గోనెలు నేయువాఁజాతి.

వ.... అన్నీటి యేటి సాలెయగసాలె పటుసాలె వానివైజాతి సాఁతు టెస్తుల కోమిరెలు ....
అము. భార. ४-3౫.

తే. కోటిసంఖ్యల మాదలఁగూడఁ బోయు, నవ సరంబున నొక్కసాఁ తరుగుదెంచి.
దశకు. 3-౫౭.

**సాఁబంతి.** విశే. సహపంక్తి (భోజనాది); ఒకే వరుస యందలిది.

**సాఁబాలు.** వి. సగముపాలు, అర్ధభాగము.

సీ. ఖర్జూరఫలములు గణకుండు కొనితెచ్చి సాఁబాలు మోహంపుసతికి నిచ్చె.
పావులూరి మల్లన.

**సాక.** వి. (సం. చషకమ్, త. చరక) ౧. కల్లు త్రాగెడి పాత్రము.

సీ. గ్రుక్కెడు చవిజూచు మక్క యీామధువని తీపులు దమలోనఁ జూపికొనుచు గీ. చెట్టి వస్తువు గడియించె నీతఁ డనుచు, బ్రహ్మఁ గొనియాడి యిది సాకఁబట్టు మనుచుఁ బొట్ట కొలఁదిగ బోంట్లకు బోసి పోసి, పటిమించిరి యొండొండ తరుణు లెల్ల.
ద్వా. ४-౫౯.

క. చెఱకులఁ బన్నిదమాడిన తెఱఁగున వీరూపు లొక్క తేపనె యనిచే నఱుకుచు బేతాళున కెత్తెలు నెత్తురు సాకసాకతీరున నేతున్.
ప్రబం. ౯-౭౭౯.

౨. జాడ (హిం. సాకా)

ద్వి. పలికె నిచ్చట నుండఁ బనిలేదు మనకు, వలయు నెచ్చటికైన వడిఁ జనవలయుఁ గాకున్న సాకసాకల నిత్తెఱంగు, లోకు లెఱింగిన లోకంబులోన నపనిరి వచ్చు.
(అపసడి ముద్రి)నవనాథ ४-౧४౧ పు.౯పం.

ద్వి. నరవాసుఁ డింకొక్కవాఁడు నా కల్లసాక సాకలఁబట్టి చంపించుచావు. మెయికొంటి యొక్కటి మీఁదటితగవు నెయ్యంబుగల దింక నీకును నాకు.
[illegible]

**సాకతము.** వి. ౧. అనుగ్రహము.

ఆ. ఏనుగట్టివాలుదాన నా కెవ్వఁడు, గడుంపు కూడు పెట్టి కట్టఁ జీర, యిచ్చి సాకతమున నేలుదు రట్టి వా, రెలమఁ బసులు సేసి మెలఁగు బుద్ధి.
భార. విరా. ౧-౭౬౭.

చ.... శేఁ డిచటికిం దనదివ్యరథంబుతోడ సా, కతమునఁ బంపె నెంతపనికైనఁ గాక శచీ విభుండు.
విక్ర ౭-౭౫.

౨. దయ.

క. ఈ కృత్రిమపతి యిపుడు, మీకులమున నెల్ల దానమ్మఖ్య వఁ౦గా, మూఁకొని ముసలముఁ గనుఁ సాకతమతివారి కరెఁను శాపం బిచ్చెన్.
పద్మ. ౧౦-౭౭౦.

౩. పోషణము.

క. పేరు వలయుండు గూడుం, జీరయు నిడి సాకతంబు సేసినఁ జాలుం.
భార. విరా. ౧-౭౧౯.

४. ఊరడింపు.

క. కైకొను మర్చన మనవుడు, నాకోమలి నెలిని యర్ఘ్యమందుకొనియె నుఁ, శ్లోకుఁ డగు నమ్మునీశ్వరు సాకతమున శోకవహ్ని శాంతతఁ బొందన్.
సిర్హ. ౯-४౭.

౫. చేపట్టు, (వావ)

**సాకము.** వి. ౧. వ్యాజము. నెపము, కపటము, ౨. ఉత్సవము.

గీ. సాక మనఁగను వ్యాజ ముత్సవము దోఁచు....
ఆం. భా. 3-౫౯. గ్ర.

**సాకము.** సం. వి. అ. న. (మా. శాకము) పైదానితోఁ గూడ అనుటకు పేరు. (సం౦)

**సాకరము.** సం.విశే. అ. ఆ. అ.ఆకారముగలది, పరిమాణముగలది, సపరిమాణము.

**సాకల్యము.** సం. వి. అ. న. సకలత్వము, పూర్ణత్వము.

సాకాంక్షము. సం. విణ. అ. ఆ. అ. ౧. కోర్కె గలది. ౨. ప్రయోజనముగలది. ౩. ప్రమాణమును కోరునది.

సాకారము. సం. విణ. అ. ఆ. అ. రూపము గలది, శరీరము గలది.

సాకి (రి) వి. (సం, సాక్షి, త, చాక్కి, క. సాక్కి) సాక్షి.

సీ. వేఁడి సెగల్ గల్గుకేల్పు సాకి యైన యప్పుడు గాని కే లంటరాదు. కువల. ౪-౪౯.

సీ. సాక్షి యొప్పగుసాకి సాకిరి కరి యన ....
ఆం. భా. ౨-౩౦౪ వ్రా.

తే. గీ మీరు సాకిరు లని పల్కి భూమిమీఁదముఁ దాను వ్రాసిన యట్టి పత్రింబు నజూనిఁ, జముపు మన నబ్జభవుఁ డంత పరవి దానిఁ జదివె నీరీతి ధనముఁ డీశ్వరుఁడు వినఁగ.
వేంకటాచలమా. ౫-౧౫౯.

చ. దుర్గళా, సమితికి నీనిమిత్తముల సాకిరిగావె నృపాలనందనా. ఉ. రా. ౬-౨౩౯.

సాకు. వి. మిష, వ్యాజము, నెపము

ఉ. ఎన్నఁ కబంటవీవు నిను నేలికఁ జిల్పి ప్రియంబు చెప్పఁ నే, సన్నకసన్నఁబోక పెంపన్నల సాకులుపన్నటొప్పునే. పంచ. నా. ౩-౭౨౦.

సాకురుండము. సం. వి. అ. పుం. కప్పుఫలము. (వాచ)

సాకూతము. సం. విణ. అ. ఆ. అ. ౧. సాభిప్రాయము, అర్థవంతము. ౨. ఉద్దేశపూర్వకము. ౩. సకామము, ప్రీతితోఁగూడినది, విలాసముతోఁ గూడినది.

సాకె=సాకిరి. వి. సాక్షి.

సీ. సాక్షి యొప్పగు సాకె సాకిరికరియన ....
ఆం. భా. ౨-౩౦౮.

సాకేతకుఁడు. సం. వి. అ. పుం. అయోధ్యానగరవాసి.

సాకేతము. సం. వి. అ. న. అయోధ్యాపట్టణము. (వాచ)

సాకేతులు. సం. వి. అ. పుం. (నిత్య బహు) అయోధ్యానగరవాసులు.

సాక్తుకము. సం. వి. అ. న, పుం. అ. న. (Basley) పేలాలరాశి, అ. పుం. యవధాన్యము,

సాక్షాత్కరణము. సం. వి. అ. న ౧. కన్నుల కగపడునట్లుచేయుట. ౨. మానసప్రత్యక్షము.

సాక్షాత్కరించు. సం. అ. క్రి. ప్రత్యక్షమగు, కనఁబడు.

గీ. తనపదాంభోరుహములు తత్పరతఁగొలువఁ గడఁగు వారికి సేవేల్పు కల్పవృక్ష, మట్టివేల్పు గదాధరు నాశ్రయింతు, వనిన సాక్షాత్కరించి నారాయణుండు.
వరాహ. ౨-౧౫.

సాక్షాత్కరించు. సం. స. క్రి. ప్రత్యక్షము చేయు, కనిపింపఁజేయు.

సీ. పవమాననూనుండు పగలు దీవటిఁబూని స్వప్రతాపంబు సాక్షాత్కరింప.
దశ. ౭-౧౮౬.

సాక్షాత్కారము. సం. వి. అ. పుం. ౧. ప్రత్యక్షమగుట. ౨. ఇంద్రియగోచరమగుట. ౩. జ్ఞానము.

సాక్షాత్కృతము. సం. విణ. అ. ఆ. అ ౧. ప్రత్యక్షముచేయఁబడినది, ఇంద్రియగోచరము చేసికొనఁబడినది. ౨. భావనాదృష్టమైనది.

సాక్షాత్కృతి. సం వి. ఇ. స్త్రీ. = సాక్షాత్కారము.

సాక్షాత్తు. సం. అవ్య. ౧. ఎదుట, కండ్లముందు, బహిరంగముగా ౨. సాకారముగా, యథార్థముగా. ౩. సూటిగా, తిన్నగా, స్వయముగా.

సాక్షి. సం. విణ. పు. స్త్రీ. న. ౧. చూచునది, గమనించునది. ౨. ఋజువుచేయునది, నిరూపించునది, నిర్ధారించునది.

**సాక్షి.** సం. వి. ఇ. పుం. ౧. పరమాత్ముఁడు. ౨. ప్రత్యక్షజ్ఞానము గలవాఁడు. ౩. ఏదేని యొకకార్యమును కనిగాని వినిగాని తెలిసిన వాఁడు.

సీ. సత్యమంతయుఁజెడు సాక్షిబొంకిన నని విప్ర వంశజాలకు వెలయఁజెప్పి....

విజ్ఞా. వ్యవ. ౧౦౬.

లే. గీ. సత్యమువలనేసి పక్షికులసాక్షిఁగోరి.

దశకు. ౫-౬౪.

సాక్షులు పదునొకండ్రు, అందుకృతసాక్షు లేవురు, అకృతసాక్షులార్వురు, కృతసాక్షులు లిఖితుఁడు, స్మారితుఁడు, యదృచ్ఛాభిజ్ఞుఁడు, గూఢుఁడు, ఉత్తరుఁడు, అకృతసాక్షులు గ్రామస్థులు, ప్రాడ్వివాక లేఖకసభ్యులు, గా కార్యార్థకారి, వాదిచేఁబంపఁబడినవాఁడు (కుల వివాదములందు) కులమువారు. కృతసాక్షులు అనఁగా నిర్ణయించుకొనఁబడిన సాక్షులు. అకృతసాక్షులనఁగానిర్ణయించుకొనఁబడనిసాక్షులు. శ. ర.

**సాక్షిపలుకు.** స. క్రి. సాక్ష్యమిచ్చు.

సీ. పైవెట్టమియొకాని పైకొనుటిమికల్మి, పత్తిని పులకలు సాక్షిపలుక. కవి. ౩-౨౦౩.

**సాక్షేపము.** సం. విశే. అ. ఆ. అ. తిరస్కారముతోఁగూడినది. నిందాత్మకమైనది, ఎత్తిపొడుచునది.

**సాక్ష్యము.** సం. వి. అ. న. ౧. సాక్షికనినవిని చెప్పినమాట. ౨. బుజావు. ౩. ఏకాదశాహశ్రాద్ధము, షోడశము. చనిపోయినవానికి పదునొకండవదినమున జరుగు శ్రాద్ధకర్మ.

**సాఖేయము.** సం. విశే. అ. ఈ. అ. ౧. మిత్రసంబంధి. ౨. స్నేహపూర్ణమైనది.

**సాఖ్యము.** సం. వి. అ. న. స్నేహము, మైత్రి, చెలిమి.

**సాగగడ్డ.** వి. పాదవైనగట్టు. లే.గీ. నగనుమిర వైననిడుసాగగడ్డ తోడ గట్టెపుట నోడె నవు డొక్కకమ్మకోలను. కమ. ౨-౭౫.

**సాగతము.** వి. (సం. సాంగత్యమ్) ౧. సంబంధము.

సీ. మిలిపామంతోడి సాగతంబొల్ల సవరింపవో బంగారు జెన్నిదమ్మ. హర. ౫-౫.

౨. మైత్రి.

ఉ. పట్టికరంబు కిన్కపటు పావకకీలలఁద్రోఁచి, యొంతయుఁ, గట్టిఁడి తండ్రి నిన్ను నిటుగాల్పఁగ నష్టముసొచ్చివానితోఁ బెట్టినమాద నిన్నెదలఁబెట్టిన చుట్టలతోడి సాగతం, బిట్టిదియయ్యె నారఖలుఁడేమి యొనుఁగు మహోపకారముల్. నృసింహపు. ౪-౧౦౭.

**సాగనంపు.** స. క్రి. (సాగన్+అంపు) ప్రయాణమై పోవువానిని కొంతదూరము తీసికొనిపోయి విడుచు. శ. ర.

**సాగనంపు.** అ. క్రి. అనుగమించు, వెంటవెళ్ళు.

ఆ. వె. కాఁయాపనంబు గావించి భూపతి, సాగనంపి తండ్రి సందిదప్పు, నింక నిల్పుదాన జేసంచు మది నెచ్చ, యుంచి యంతిలోడ నిట్టు లనియె. చెన్న బ. ౫-౧౩౫.

**సాగరగ.** సం. వి. ఆ. స్త్రీ. సాగరగామిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. నది. ౨. గంగానది.

**సాగరము.** వి. నెయ్యి, నూనె మొదలగునవి నింపిన పిడ్డలసాఁడు.

**సాగరము.** సం. వి. అ. పుం. ౧. సముద్రము.

స్రగ్విణి. సాగరాంతక్షమా సంపకేకాస్పదా. పాంచా. ౨-౧౦౬.

౨. వాలుగు లేక ఏడు సంఖ్యకుగుర్తు. ౩. ఒకవిధమైనజింక. ౪. ఏనుఁగు పెవియందలిమదము. ౫. అంకెము పదిమ్మార్లుసంఖ్యామానము. (వాచ)

**సాగరమేఖల.** సం.వి. ఆ. స్త్రీ. భూమి. సాగరము (ల) చేత ఒడ్డాణము వలెచుట్టుకొనఁబడినది.

**సాగరాంతము.** సం. విశే. అ. ఆ. అ. సముద్రము లే అంతముగాఁగలది. సముద్రములవఱకు వ్యాపించినది.

సాగరాంబర. సం. వి. ఆ. స్త్రీ. భూమి.

సాగరానులకూలము. సం. విణ. అ. ఆ. అ సముద్రతీరము వెంటనున్నది.

సాగరాలయుఁడు. సం. వి. అ. పుం. వరుణదేవుఁడు.

సాగరిక. సం. వి. ఆ. స్త్రీ. ఒకవీణపేరు.

పండితా. ౨-౪౪౪.

సాగరోత్థము. సం.వి.అ. న. సముద్రలవణము.

సాగవచ్చు. అ. క్రి. కూడవచ్చు, వెంటవచ్చు.

తే. గీ. సాగరమ్మునుపలుకు మించంగఁగరము, వీచిపైటికిఁ జెత్తు లద్రోచికైచి, వాహినీ వాఘుఁడోఁడోఁడాహవమున గలయఁ బకుటయుఁగనుపట్టె ఖచరతతికి.

రాజవాహన. ౫-౮.

సాగవేయు. స. క్రి. పంపు, పుచ్చు, తరలించు.

వ్య. ఆసొమ్మంతయు నింటికి సాగవేసినాఁడు.

సాగా. అవ్య. పైని.

క. హంసాగా నీరూపము, శిరమున ధరియించి కాదె శిక్షించెమను, త్వాపంగఁగఁనకశిపుం గనవైరి నిన్నుఁబొగడగా మా వశమే.

వెం. పంచతం. ౧-౩౪౮.

సీ. కలివరకాతిపుని సాగా విత్తవంతుని వేల్పు గాఁజూచి సేవింతు రపుడు.

వెం. పంచతం. ౩-౩౭.

సాగించు. స.క్రి.√సాగు౧. జరుపు, కావించు.

గీ. అతివపగరైన మాపైన నతనితోఁ డ,నిచ్చనొక సాగసాగించు నిధువనంబు. శివరాత్రి. ౩-౧౧౪.

గీ. శివుఁడు దాతభోక్తశ్రీ మహాదేవుండు, పర్వమును హరుండు శాశ్వతుండు, శంభువేలు సేసి సాగింపవచ్చునే, క్రియలు వెట్టివేలయయితి చెపుడు. కాశీ. ౭-౭౨.

౨. నిర్వర్తించు.

మ. ప్రియుఁ నిం గూర్పన్ మరుం డెంతయున్, గెలవిన్ దానికిఁ బెండ్లిపీఁటయము సాగింపన్ మదింజూచెనో. చంద్రాంగ. ౪-౧౫౪.

౩. నెరవేర్చు.

సీ. కృత్యపంచకము సాగింపలేఁడీయింతి ప్రాభ్రలేక కృతాంత భంజనుండు. కాశీ. ౪-౧౫౦.

క. అధనము నీకు వచ్చినసాధనముగ నధ్వరంబు సాగించిబుధా, రాధనముచేయు నిరతా, యోధనచణులైన తమ్ములూఅట గాఁగన్.

జై. భా. ౧-౬౭.

౪. నడిపించు.

సీ. పాలదిండి యేలి మావుల దేరుగై మవుఁటదంబు సాగించు నతఁడు సిదము.

అ. రా. యుద్ధ. ౨౨౨.

౫. నిర్వహించు.

గీ. పేరటాంధ్ర నర్పింపఁగ నేరవైతి, సలిలసత్రంబు సాగింపఁజాలనైతి. కాశీ. ౩-౮౧.

౬. ప్రవర్తించు ౭. యత్నించు.

సాగింత. వి. నమస్కారవిశేషము. (వాచ)

సాగిపాటు. అ. క్రి. చెల్లు, సమర్థుఁడు.

ఆ. వె. ఉచితవంతుడైన, నుద్యోగపరుఁడైన సాగిపాటియున్నసమయమునను, పరులకుపకరించి పరులరక్షించును విశ్వ. వేమ.౩-౧౩౬.

సాగివచ్చు. అ. క్రి. జరిగివచ్చు.

ఉ. రిపుగర్వహరుండు మురాంతకుండనీ,గర్వము సెల్లనిచ్చుటన కాకటనల్లెదు సాగివచ్చునే.

హరి. ఉ. ౬ ఆ. ౧౧౨.

చ. లలనరో యెంద నీవిఁకఁ గులామునకుంజన పస్తు మాకునిక్కల పెనుమాళ్ళ కోవెలఁబ్రసాదము కట్టడిసాగవచ్చునా తెలియప్రసాదమీవు నతితంబుఁ బసాపడుము.

నైజ ౨ ఆ ౭౮.

సాగు. వి. కృషి, వ్యవసాయము.

క. అంతంతసాగి ప్రజలు వో పెహ్న మసంగియుండఁ
దా నయ్యవసరంబున. కాశీ. ౪-౧౨౦.

చ. మలయసమీరణాభిహతి మ్రాఁకులవాకులు
డల్లిక్రొ మ్మొలకలు సాగి.
కుమా. సం. ౪-౪౪౩.

౧౧. ప్రసరించు, వ్యాపించు.

ఉ. సారసబాంధవుం డపరసాగను నయ్యెడ
సాంధ్యరాగముల్. ఇందు. ౬-౩౩.

౧౨. ఒప్పు.

క. పటు నీలకాంతులఁ బెరి, స్ఫుటమై నూగారు
సాగనుదతికి రకవా, కటకాదిభూషణము
లుత్కటభారముఁ దయ్యోహీమానగ ప్రేయసికిన్.
జాహ్నవి ౯౯.

౧౩. ప్రారంభించు, మొదలు పెట్టు. (ఈయర్థ
మున నిది సమాసాంతమున కనుప్రయోగమగును)
ఎంచసాగు = ఎంచుటకు మొదలు పెట్టు.

ఉ. .. పదఁగులార కోటగాములు వేములు
పెంచసాగినా, రమ్మక పెల్ల. శీలా. ౭-౧౧౦
పిలువసాగు = పిలుచుట మొదలు పెట్టు.

చ. మనమున కొందు రెండుమరుమంత్రిముఁ న్పరి
పోవఁ దెప్పెనం, జనపతు లాతనిం బిలువ సా
గుదు రాగతి.... ఆము. ౪-౨౬౫.

ఒనర్ప సాగు = చేయుటకు మొదలు పెట్టు.
ఉ. చింతయొనర్పసాగకుము చిన్నబిడాయని
పారఁద్రోసి యత్యంతరయంబున స్వభుజ
తన్గని కొల్వఁగ ధీరచిత్తయై. పార్వ. ౪-౧౦.

పొంగసాగు = పొఁగుటకు మొదలు పెట్టు.

తే. గీ. క్రాఁగుపై మ్రొగ్గుతెలినిగ్గు గాగ్రిగ పొంగ
సాగుపాలని పైనీరు చల్లి చల్లి. యట్లకొనునట్టి
వెన్నెల నల్లుకొన్న, యన్నుమిన్నలు విహ
రించి రన్నివగల. రాజవాహన. వి. ౩-౧౩.

పీల్వసాగు = పీల్చుటకు మొదలు పెట్టు.

తే. కవిఁచి వామేని రక్తమాంసములఁ బీల్వ,
సాఁగె నతిగాఢతర లుత్పజ్వరాగ్ని.
శుక. ౨-౨౫౨.

చెప్పసాగు చెప్పుటకు మొదలు పెట్టు.

తే. జనపతిని శేరఁబోనీక దినముదినము కతలు
చెప్పఁగ సాగితో కతలకాండ్ర,చిన్నరాయంత
యుఁకనైన సెలవొసంగు, పోయివచ్చెదనన
హంస పాలఁతి కనియె. హంస. ౫-౩౩౭.

తినసాగు = తినుటకు మొదలు పెట్టు.

ఉ. ఈ, చక్కరవంటి పండ్లు తి-సాగిరటంచుఁ
గృశించు పెంతయున్. శుక. ౩-౩౭౯.

సాగుపాటు. వి. జరుగుఁబాటు.

సాగుబడి. వి. ౧. సాగు, చెల్లుబడి ౧. పైరు
పెట్టుట, కృషి, ౨. సాగుపాటు. చెలామణి.

తేగీ. కదుక చే మాటలు నెఱుంగ నెవరునిలఁ పు
సాగుబడి హస్తగణవిత్తవాగదత్త.
ప్రబం ౧ ఆ ౭౪౪.

సాగు,౨ వి. (క. సాగు²) సేద్యము, కృషి.
వా. ఆ భూమిని సాగుచేయుచున్నారు.

సాగుబళా. వి. చూ. సాగుబళా. నతివిశేషము

సాగుమానము. వి. సహగమనము (వాచ)

సాగ్ని. సం. విణ. ఇ. ఈ. ఇ. ౧. అగ్నికలది.
౨. పవిత్రాగ్నిని వెంటఁగొనిపోవునది.

సాగ్నికము. సం. విణ. అ. ఆ. ఆ. ౧. అగ్ని
కలది. ౨. అగ్నిపూర్వకమైనది.

సాగ్నికుఁడు. సం. వి. అ. పుం. అగ్నిహోత్రి
యైనగృహస్థుఁడు. అగ్నిహోత్రములను వెంట
గొనిపోవు సోమయాజి.

సాగ్రము. సం. విణ. అ. ఆ. అ ౧. మొత్తము,
సర్వము. ౨. అధికము, మిగులుకలది.

సాచి. సం. అవ్య. వక్రముగా, కుటిలముగా,
అడ్డముగా, ఓరగా.

సాచివాటిక. సం. వి. ఆ. స్త్రీ. తెల్లపూలు.
(Hog-weed)

**సాచివిలోకితము.** సం. వి. అ. పుం. ఓరచూపు, కటాక్షము.

**సాచివ్యము.** సం. వి. అ. న. ౧. మంత్రిత్వము, మంత్రిపదవి, ౨. మంత్రిమండలి, పాలకవర్గము, పాలనము. 3. మైత్రి, స్నేహము.

**సాచీకృతము.** సం. విణ. అ. ఆ. అ. ౧. వంకరగాఁద్రిప్పఁబడినది. ౨. అడ్డముగాఁద్రిప్పఁబడినది.

**సాజము.** (సం. సహజం. క. సాజ) విణ. స్వభావముచేఁ గలిగినది.

చ....ఒకవన్నెలాఁడి మొగమంటి కనుంగొనుచున్వారాశిచే సతమని నమ్మియందు రిదిసాజమెకా మగవారి కారయున్. శుక. 3-౧౪౬.

శా. శ్రీ లీలావతి నవ్వనేఁటి కని ఘూర్ణింపంగనే నవ్వనో, బాలా సాజము సింహవక్త్రియున కీ పారీంద్రచిత్రింబు. దశా. ౪-3.

మ. హరికిన్ సాగరకన్య శంకరున కయ్యార్యామహాదేవి తోయరుహాసీనునకున్ సరస్వతియునైన ట్లుందమై యున్న దీ, ధరణీనాథకుమార రత్నమున కీ తన్వంగి సాజంబు లీ, వరలావణ్యవయోవిలాసగరిమల్ వర్ణింపఁగా నెంతయున్. ఇందు. ౬-౧౦.

**సాజము.** = సహజము వి. స్వభావము.

ద్వి. వజ్జంబొ వారంబొ వారిసాజంబొ, వెజ్జుఁజూపింపరు వేల్పుల కిదరు. ద్వి. పరమ. 3-౧౫౪.

**సాజాత్యము.** సం. వి. అ. న. ౧. ఒకేజాతికి కులమునకుఁ జెందియుండుట. ౨. జాతిసామ్యము, తుల్యజాతిత్వము. 3. సామ్యము, ఐక్యము.

**సాట.** వి. ౧. పరివర్తకము, ౨. వినిమయము. 3. వర్తకులు ఒకవస్తువునిచ్చి మఱియొకవస్తువును పుచ్చుకొనుట.

**సాటా.** వి. సాట.

**సాటాకోటి.** వి. సాటా బేరము. వస్తుపరివర్తనపు బేరము.

**సాటి.** వి. ౧. సమానము.

తే.గీ. శేషు లింగము విముక్తలింగమునకు సాటిసేయంగ భూర్భువస్స్వస్త్రయమున. కాశీ. ౨-౧౩౬.

గీ. సాటి [illegible] సీటు పరిపాటి పోటియుద్ధి యనఁబాడి.... ఆం. భా. ౨-30౨.

ఉ. .... బుద్ధిసంపదం, తామరమాత్రికిన్ సరిప్రధానులు దక్కినవారు సాటియే. మామిడి వీరభద్రున కమాత్యశిఖామణి కివ్వసుందరన్. శృం. నై. ౧-౨౭.

చ....తత్పురము సాటిగ నన్యపురంబు లెన్నఁగా నమరు నటన్న హస్తిమశకాంతర మింతియు వాని చూసినన్. కాశీ. ౧-౨౨.

ఉ. తిమ్మనమంత్రి సాటి జగతీస్థలిఁగొపల మంత్రి గల్గునే? దశా. ౧-3౬.

**సాటి.²** (క. సాటి) వి. ఉపమానము, పోలిక.

వ నీకు నితరపర్వతంబులకును సాటియే? హం. ౪-౬౨.

ఉ. సంగ్రామములోన నొక్కనరు గానికి వానిదొలంగఁ డీశ్వర,ప్మామహిళా మనోహరుని సాటియె యీశ్వరుఁ డెన్నిభంగులన్. పారి. పీఠి. ౯.

సీ. సాటికిఁ బోటికి సరససంగీతసాహిత్యాది విద్యలు నృత్యమాద. సారంగ. ౧-౬౨.

ఉ. వింధ్యకు మేల్తరంబు ఘనవేణి కనుంబొమదోయి బంగరుంగిండ్లకు మేటిసాటి తులకించు చనుంగవ లేఁతతమ్మిపూఁ దూండ్లకు మిన్న యన్నఁజిగి దొడ్కెడుచేతులు లోకమందుఁబూ,బోండ్లకుఁ గానమో వినమొ పోలరు తత్సతి కాలిగోరునన్. హంస. ౧-౬౧

ఉ. ఆర్యురుచక్రవర్తులు పహాక్ష్యరు రాజులు విశ్వధారణీ, నిర్వహణ ప్రభావమున శేర్వరు లైనను వీని సాటియే. విక్ర. ౨-౩౪.

సాటి², వి. (సం. శాటీ ౪. సాటి. త. చాటి) శాటిక.

సీ. గడిదంబు మట్టిచల్లడముపై బంగారుసాటి చెంగులుగాకింతబాఱఁ గట్టి.
ఉత్తర హరివంశం. ౨-౫౨.

సాటిక, (సం. శాటికా) వి. శాటి.

సాటికిబేటికి, అవ్య. మాటిమాటికి

క. దేవికి వేడుక యపుడని, దేవరయును వరము గోరఁగ దేవరఁ గనుమన్ దేవియు సాటికి బేటికి దీవింపఁగ నైన్యశిశువు తేయు నొం దెన్. ఉ. రా. ౧-౨౬౫.

సీ. గీ. ప్రియునిచే శేగిరము నొకింతయును మించనీక సాటికిబేటికి నింమవదన (సాటికి మాటికి, సాటికిబేటికి నని ముద్రిత ప్రతులు పా) కళా. ౭-౭౬.

చ. కలికి డోలికావిహృతి సాటికి బేటికినింతు లిష్టలున్. రామా.౧-౧౭౧.

సాటివచ్చు. అ. క్రి. (√సాటు) ఈడగు, సమానమగు.

తే. గీ. తోయజాహోదరాజలు దోయిలించి ప్రమదమున శేల్ల నొకకొన్ని చెమట నంట బ్రోల్చ గనుపట్టెఁ గెంజాయ వీతిహోత్రు వాలుకలు సాటిరాకున్న నవ్వెననఁగ. మను. ౫-౭౧.

సాటిచే(సే)యు. స.క్రి. (√సాటి) ఉపమించు

సీ. అతనుండు మొదట హ్రస్వాకారుఁ డాటచే జెలువంబునకు సాటిసేయరాదు. దశా. ౧-౫౨.

తే. గీ. విమషి యాయింతి తలవాల్చు వెంట్రుకలకు నహహ! యెబ్బంగి సాటిసేయంగవచ్చు బనువుచేతఁ బురస్కృతిఁ బడయలేక చాపలంబున వర్తించు చామరములు. శృం. నై. ౨-౧౩.

సాటియగు, అ. క్రి. సమానమగు

చ. ఇతని కితండె సాటియగు, నీతని కీతఁడె సాటి. పారి. ౫-౨౯.

సాటువ, విశ. ఉచితము.

ఉ. సాటువ యైనట్రోవ మనసా విను మున్ను భవాఁబురాశిలోఁ గోటులసంఖ్య లైన జనుల్ బహుభాతనూభవుల్, గాటపుఁబుట్టు వొందరో పాకాలరో వీరలసంగమంబు మి, థ్యాట పారింబొరిం దలఁపుమాక్సతికృష్ణ్యఁడ వయ్యెదిత్తటిన్. ప్రబోధచంద్రో. ౫-౨౮.

సాటువ, వి. ౧. సామ్యము.

గీ. సాటిసాటువ తెరబడి సవతుతిరము దీటుసరి పాటిపోటి యుద్ది యనఁబాడి, యీడనఁగ సదృశాఖ్యలై యొసఁగుచుండు ....
ఆం. భా. ౨-౩౦౨.

౨. ప్రసిద్ధి.

ఉ. ఘోటకముల్ రథావలులు కుంజరముల్ బహువాహినీ పతుల్, సాటువకెక్కువీరభట సంకులముం దగు నప్పురంబునన్.
రుక్మాం. ౧-౭౩.

సాటెనగొట్టు, విశ. దుష్టుఁడు దుష్టురాలు.

సీ. సం జెతెంగినదొంగ సాటెనగొట్టు పిపాసి దిమ్మరి జేరనముబడని. చెన్నబ. ౨-౬౪.

సాటోపము, సం. విశ. అ. ఆ. అ. ౧. గర్వించినది, విజృంభించినది, ఉప్పొంగినది. ౨. గంభీరమైనది, ధీరమైనది. ౩. పొంగినది, ఉబ్బినది, నిండినది. ౪. ఆటోపములోఁ గూడినది.

సాడంబరము, సం. విశ. అ. ఆ. అ. ౧. దర్పముగలది, పటాటోపముగలది. ౨. ఆడంబరముతోఁ గూడినది.

సాత్, సం.తద్ధితప్రత్యయము.కృత్స్న (అంతయు) మనినయర్థమిచ్చును (విభాషా సాతి కార్త్స్న్యే ౫-౪-౫౨. పాణి.సూ) తదధీనము. ౨. తమాత్ప పము.

చ. అతిరుచిరక్రియాభిరమణైన పురోచనుతోట భస్మసాత్కృతమయి చెడ్డగద్విపులగేహము. (భస్మసాత్కృతం గేహంకృత్స్నం గేహం) భస్మకృతం భస్మసాత్కృతం ఇల్లంతయు భస్మముచేయఁబడినది భార. ఆది. ౬-౧౬౪

**సాతత్యము.** సం. వి. అ. న. నైరంతర్యము, అఖండవ్యాప్తి, శాశ్వతత్వము, నిత్యత్వము.

**సాతని.** వి. (౯. చత్తాదవన్) జందెము లేని వైష్ణవుఁడు.

వ..... పరస్థలంబులనుండి చూడవచ్చిన బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్రులను — వడసాలె సాలెసాతని కటికభట్టుజెట్టి జాంద్రిగొగట గాండ్లవారును హంస. 3-౭౯.

**సాతము.** సం. విణ. అ. ఆ. అ. ౧. ఈయఁబడినది. ౨. నాశముచేయఁబడినది.

**సాతము.** సం. వి. అ. న. ఆహ్లాదము, ఆనందము

**సాతల.** సం. వి. ఆ. స్త్రీ. సంబరేగి

**సాతాని.** = సాతని. వి. శూద్రజాతివిశేషము.

గీ. వీని సేతెంచి సాతాని వేస్కలాఁడి. వీర. ౧౭.

వ. మఱియుఁ గిపురించ కంకణంబులు గట్టినరతి నస్మిబ్బు పుస్తెడికంకణంబులు గలసాతాని జాతి గీటకత్తెలు. ప్రబం. ౧-౭౫.

**సాతాను.** అన్య. వి. సైతాను శయతానరము.

**సాతాళించే.** స. క్రి. వానిన విస్తులు మొదలగు వానిని జమరుకొంచెముగా వేసి పక్వముచేయుట (వి. ని. ధాతుమాల)

వ్యవ. ఆకుపసగలు సాతాళించినారు. వానిన పెసరపప్పు సాతాళించుము.

**సాతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. దానము, ఈవి. ౨. లాభము ప్రాప్తి 3. సాయము. ౪. నాశము ౫. అవసానము, ముగింపు ౬. తీవ్రమైన బాధ, పోటు ౭. సమాప్తి, నిలుపుదల. ౮. ధనము, సంపద.

**సాతిన.** వి. (౯. చాత్తినవర్) జందెము వేసికొనిన వైష్ణవుఁడు.

వ. కమ్మరి వడ్రంగి కాసె కంచర యాగసాలె వడసాలె సాతిన సాతని కటికభట్టు జెట్టిజాంద్ర తొగటగాండ్లవారును. హంస. 3-౭౯.

**సాతీన (క) ము.** సం. వి. అ. పుం. బఠాణీ ట్టు

**సాతలకము.** సం. వి. అ. పుం. సాతిల (క) ము, సాతీన (క) ము.

**సాతు.** వి. (సం. సార్థ) వర్తకజనసమూహము.

ఆ. సాతువారిన పుతికి జనములు నమ్మిద, లీల సేలఁ బెట్టి కాలఁ బమర (వ. గ ౦.ూ) భార. శాం. 3-౪౭౪.

గీ. తాను నిల్లాలుఁ గొమ్మయు దనయయుగము మొదలు దీనారములు బాలికనుం గొంచి, సాతువారితో ... ... ... ... ... ... ... గురం బట్టి ధనమెల్ల నొలిచినాని. కాశీ. ౭-౬౫౦.

క.... బిజుబెట్టిన టాఁకవడెం ... తెలిపియుఁ గన లేమి సాతు విరుగుడు నడియెన్. ఆము. ౬-౭౪.

ద్వి. చలువపట్టున విడ్సెసాతెల్లనను. పండితా. పర్వత. 3౭౯.

**సాత్కరణము.** సం. వి. అ. న. ౧. స్వాధీనము చేయుట ౨. తాద్రూప్యము పొందించుట.

**సాత్కరించే.** సం. స. క్రి. అధీనపఱుచు.

(తదధీనవచనే ౫-౪-౪౫ పాణినిసూత్రమున బ్రాహ్మణసాత్కరోతి ఇత్యాదికముగా నామవాచకమునైన తద్ధితమా సాతిప్రత్యయము వచ్చును. ఇటనామవాచకము లేకయే కేవలము ను బ్రత్యయముచేఁ గృజ్ధాతుకృతో బ్రయోగము వింతయని యెఱుఁగునది. మఱియు మా. శం. సై. సర్గాంతసాఖ్యవ్యాఖ్య)

తే. పృథుఁడు నేసె వాజాధ్వరము లవి, సెప్ప నేల, సకలధాత్రి బ్రాహ్మణులకు సాత్కరించె. భార. శాం. ౧.౨౮౩.

ఉ. దివ్యసారభవిభూతి యెలర్పఁగ సాత్కరించెఁ బెం, పగ్గలమైనభక్తి మహిపాక్షరజస్త్రపకేణు సమ్మిళ ద్గగ్గుల ధూపధూమములు గోమలతారకరాజమార్గికిన్. వైమ. ౮-౧౦౮.

సాత్కాలు. వి జాతకమున కపభ్రంశరూపమా?

మ. కలంగా జేవరచెప్పె రేయిరెయిదుటం గన్పించి నెయ్యఁబువా,ఁటిల నీపాలికి జేపఁడింక బవ నీకే యంచుఁదా వాడఁగా, వలెనే బాపన మెప్పెవైన నరియే వారెల్ల సాత్కాలు నీ, వలె గోరించిరె నిన్నెకొల్తునను చు న్వప్నింపఁచో నంతటన్. శుక. ౨-౪౧౫.

సాత్కృతము. సం.విణ.అ. ఆ. అ. స్వాధీనము చేయఁబడినది, తాత్మాప్యము పొందింపఁబడినది.

అనుర ఫస్మసాత్కృతులఁ జెయ్యన్. భార. ఆది. ౧-౧౩౨.

సాత్కృతి. సం. వి. ఇ. స్త్రీ. సాత్కరణము.

సాత్తని. =సాతాని.వి. (క.చాతాని,చాతాళి, సాతాని. చ. చాత్తాని.) సాతానిజాతివాఁడు.

సీ. కలన సాత్తని వైష్ణవులు బ్రోవుబ్రోవాడ నల- సంకీర్తనపరులు చనఁగ. విప. ౫-౧౦.

సాత్మించు. వై. స. క్రి. సహించు, సైచు (ఎం. సాత్మ్య)

క. ఆయాసము సాత్మింపని, మీరాయుదలు తపః క్రియలకు మెయికొనియెదరె. భార. అశ్వ. ౨-౧౩.

తదూర్ధిపార్థమునఁ నన్నయ ప్రయోగించునట్లు సంస్కృతివివరణము.

సాత్యకి. సం. వి. ఇ. పుం. శ్రీకృష్ణునితమ్ముఁడు. సత్యకునిపుత్రుఁడు సాత్యకి శ్రీకృష్ణునకుతమ్ముని వరుసయైనవాఁడు.

సాత్వతి. సం.వి.ఈ.స్త్రీ. ౧. నాట్యవృత్తులలో నొకటి (భారతి, ఆరభటి, సాత్వతి, కైశికి అని వృత్తులు నాలుఁగు ౨. శిశుపాలునితల్లి పేరు (శ్రీకృష్ణునిమేనత్త)

సాత్వతుఁడు. సం. వి. అ. పుం. ౧. విష్ణువు. కృష్ణుఁడు ౨. బలరాముఁడు. ౩. కులభ్రష్టుఁడైన వైశ్యునిపుత్రుఁడు. ౪. (బహు. వ.) యాదవ వంశమునందలి యొకతెగవారు. ౫. పురుషో [illegible] ప్రధానుఁడు.

సాత్వత్తు. సం. విశే. పుం. ౧. శ్రీకృష్ణునియందు చిత్తము లేకభక్తుఁడు. ౨. యాదవవంశమునకు జెందినవాఁడు.

సాత్త్వికము. సం. విణ. అ. క్లీ. అ. ౧. యథార్థము, సారభూతము ౨. నిర్మలమైనది, శుద్ధమైనది సహజమైనది. ౩. నిష్కపటము, మంచిది. ౪. గుణవంతము, సాధువు. ౫. శక్తిమంతము, ౬. సత్త్వగుణముకలది. ౭. సత్త్వగుణమునకుసంబంధించినది. ౮ మనస్సువలబుట్టినది, అంతరము, మానసికము.

సాత్త్వికము. సం. వి. అ. పుం. సత్త్వగుణము వలనఁబుట్టిన భావవిశేషము(స్తంభము,ప్రలయము రోమాంచము, కంపము, స్వేదము, వైవర్ణ్యము వైస్వర్యము, అశ్రుపాతము, ఈ ఎనిమిదియు సాత్త్వికభావములు)

సాత్త్వికి. సం. వి. ఈ. స్త్రీ. దుర్గ

సాత్త్వికుఁడు. సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ, ౨. బ్రాహ్మణుఁడు. ౩. సత్వగుణముకలవాఁడు.

సాదన. (సం. సాధనమ్) ౧. మల్లవిద్య.

సీ.... శస్త్రదక్షుఁ గీ. డలఁగుఁ దద్విద్యసాదన యనఁగ నెగడు ఆం. భా. ౨-౨౦౫.

౨. నైపుణ్యము.

ఉ. వేదన మించు నీవిరహవేదన తాళఁగఁజాల గించుకనిన్, సాదవరాదుగా తనదుసాదన చూపఁగఁ బొంగి గామ్పుడా, నీదనవచ్చునే మెదలనీదనలాకృతి నేఁడినూపుమన్,బోదవఁ జెల్లునాకదమఁ బోదాయంబుకుకంబు ప్రేలుచున్. సారంగ. ౨-౧౨౫.

౩. అభ్యాసము. (సం. సాధనము)

ఉ. సాదనమేలు చెంపపయి జగ్గగ్రేలు రుమాలు. హంస. ౧-౨౦౭.

తే. గీ..... ఒక, గరిడిలో వింతసాదన క్రమము కాదు. ఉశా. ౭-౧౪౪.

ఆ. వె. కదలిగట్టు పనికి గరిడిసాదన వీని, కిది యటంచుఁ దజ్ఞులెంచు కొనఁగ, జనకరాజ కన్యయును రామభద్రుండు, గట్టిరి శిక్షమైత్రిఁ గంకణములు. చంపురా. ౩-౧౨౯.

సీ. మినుకు బజ్జెట్టిసాదనకును నెవ్వాని, లాలిత రసన విలాసఖురళి. విప్ర. ౧-౪౦.

౪. సాము.

రగడ. మొనలు ముంగట సబళముల సాదనలు సేయ. పా. శకుం. ౩-౨౨౫.

క. కలవె యిహపరసుఖముల్, దలఁపఁగ మద్భక్తివిరహితములగు యజ్ఞాదుల యందు కొందఱైనను, జలజానన నేలవిడిచి సాదఁగలదే? విప్ర. ౪-౫౧.

తే. మరుఁడు మఱచినసాము సేమఱును జేయఁ, దలఁచి సాదనగరిడిలో దట్టి గట్టి. శుక. ౩-౪౮౨.

౫. మల్లవిద్యాప్రదర్శనము.

తే. గీ. గదలు బాగాల్పటాలు సగ్గలికఁబూని, పరువడుల్ ద్రొక్కుకొనుచు నిబ్బరపుబీర ములగనంబడ సాములు ప్రోలఁజెలఁగి, సాదనలొనర్పఁ జెల్లు హెచ్చరికఁ బెనఁగ. రవి. ౧-౮౧,

సాదనకాఁడు. విశే. (సాదన + కాఁడు) శస్త్ర దక్షుఁడు, ఆయుధవిద్యయందారితేఱినవాఁడు.

సీ. సాదనకాఁడన శస్త్రదక్షుఁడు... ఆం. భా. ౨-౨౦౫ బ్రా. పా.

కటారిసాదనకాఁడు = కత్తిసాముసేయువాఁడు, మల్లుఁడు.

వ. ఒక్కయత్యంతచాతురీధురంధరుండైన కటారిసాదనకాని వలన నేకకాలం బభ్యసించి. కళా. ౮-౧౦౬.

సాదనజోదు. వి. మల్లుడు. ఆం. భా. ద్వి. ౨౦౩-

సాదనదీవె. వి. గస్తితిరుగుయోధులు. రాత్రి పట్టెడిదీపము.

మ. పురిచుట్టు న్నిశరుండు సారణుఁడు నీభోజాంధకుల్లాడి క, త్తెరగాయంబులు గంద ముఁగిళులు సందింగొమ్మకొమ్మన్నిరం, తర మున్ సాదన దీవెలెత్తి చనఁడు.... ఉ. హ. ౨-౭౪

సాదనపెనఁకువ. వి. గదాయుద్ధము.

వ.... జెట్టిదంపు సాదన పెనఁకువలన్ జేయుచు ఉ. రా. ౩-౨౪౬.

సాదనము. సం. వి. అ. న. ౧. శ్రమించుట, అలముట ౨. అలపు. ౩. ఇల్లు, నివాసము. "మృత్యుసాదనమునకున్" భార. ఆర. ౧ ఆ. (శ. ౪)

సాదని. సం. వి. ఈ. స్త్రీ. అలపు, గ్లాని, సత్త్వసంక్షయము, బలహీనత.

సాదము. వి. అన్నము.

సీ. విను మేము ప్రాలుమాలిన దీవెయిడిగాక కిని సినకెంపు గుగ్గిళ్లుగాక యెక్కునవింటిగంధప్రసాదముగాక మనసైనవోక వడకునకగాక, యుట మటించినఁ గుంచెడంతసాదముగాక కాదేని యొక గుల్లకానుగాక. విప్ర. ౫-౧౦.

సాదము. సం. వి. అ. పుం. ౧. క్రుంకుట, దిగఁబడుట, కూలఁబడుట. ౨. అలపు, విసువు. ౩. కృశించుట, బక్కచిక్కుట. ౪. నశించుట, క్షీణించుట. ౫. బాధ, యాతన ౬. స్వచ్ఛత, నిర్మలత. ౭. గమనము, చలనము, నాశము,

ఆ. అల్పమైనయగ్ని యదఁగునింధనములు, మీఁదనైనబలము మిగులలేనియోగమట్లతనకు నురునట్టిదానవ, సాదమొందు సకలజనమనోజ్ఞ భార. శాం. ౫-౫౭౯.

సాదరము. సం. విశే. అ. ఆ. అ. ౧. ఆదరముతోఁ గూడినది. ౨. దయగలది.

ఉ. సాదరవృత్తి సాధ్యులఁ బ్రహర్ష సమేతులఁ జేయఁబూని వందనాదముఁజేసె దేవమునివందనాదరుఁ డజాం డని. భార శాం. ౫-౫౪౦.

సాదరు. వావి. వాదక పుసామ్ము ౨. కలిమి.

సాదా. హిం. విశే. సాధారణము, నగిషీ లేనిది.

సీ. సాదాపని మెఱుంగు గాంచు సౌవారి, కుందనంబున మణుల్ గూర్పఁగలఁడె?

రామలిం. ౧ ఆ.

౨. కలుపులేనిది.

సాదా² వి. మల్లవిద్యావిశేషము.

వ. సాదా, పాంబా మొదలగు కొనితావరుసలను మల్లుపురా. ౩-౭౯.

వ. అష్టాదశజాతి ప్రభూతంబులై శుద్ధభిన్నగౌళదేశపాదాంతోపరాగసంజ్ఞల బ్రసిద్ధంబులైన శుద్ధరాగంబులును. శ్రీరంగ. ౩-౭౦.

సాది. సం. విశే. ఇ. ఈ. ఇ. ౧. మొదలుగలది.

౨. పుట్టుకగలది.

సాది. సం.వి.ఇ. పుం. ౧. సారథి. ౨. రథికుఁడు

యోధుఁడు. ౩. నిర్వీర్యుఁడు, అశ్వారోహి ౪. వాయువు.

సాది. సం. విశే. న్. సీ. న్. ౧. కూర్చుండినది.

౨. అలసినది. ౩. నీరసమైనది, ఖిన్నమైనది.

సాది. సం. వి. న్. పుం. ౧. గుఱ్ఱపురౌతు.

౨. మావటివాఁడు, గజాధిరోహి ౩. సారథి.

సాదితము. సం. విశే. అ. ఆ. అ ౧. కూర్చుండబెట్టఁబడినది. ౨. నీరసము, అలసము. ౩. క్రాంతము, అలసినది. ౪. నాశముచేయఁబడినది అంతమొందింపఁబడినది. ౫. క్షీణించినది, శిథిలమైనది.

సాదించు. అ.క్రి. మాటలతో బాధించు, బాధించు

ద్వి. మానమేరికిని సమానంబుగాన, మానంబుగాచి మామఱలబుట్టములు, సాదింపకింకఁ బ్రసాదింపుమయ్య, కాదన్న నిను మీఱఁగలమె యేమనిన.

అ. మ. ౪. ౨-౭౫ పు. ౫. పం.

ద్వి. మగుడి వచ్చినసిగ్గు మాలుతుననుచు, జగడాఁగముదుసలి సాదించుచుండె.

ద్వి. పరమ. ౪-౩౦౨.

సాదు. విశే. (సం. సాధుః ప్ర. సాదు. చ. చాతు) యోగ్యుఁడు, మంచివాఁడు.

ఉ. ఎక్కడికేగుదెంచితి వహీనవిహారదికిత్ప నీకుఁడేఁ, జక్కనొనర్చెదం బెలుచఁజంపితి దొంగిలి [illegible]. గక్కసులన్ నినుం బొదివి పాశ్రిణముగొందుఁ గదంగి సాదకై తుశ్రిక్కడియున్నఁబోవిదువఁదొల్లిటి త్రుళ్ళిక చెల్లదిచ్చటన్. పాండురంగ. ౫-౧౦౪.

౨. సాధువు.

ఉ. శేషఁమింతు నీ విరహవేదన తాళఁగఁజాలఁ గంతునిన్, సాదనరాదుగా తనదుసాదన మాపఁదొడంగె. సారంగ. ౨-౧౨౫.

సాదు. వి. సాధువైన పశువు.

ఉ.... తొఁదల పాలంబున నిల్చునె సాదుశేగినన్ విప్ర. ౭-౪౧.

తే. మన్మథాశేశ విలసన మహిమనెఱపు, తపని, గని సాదుశేఁగిఁదల పాలాన, నిలువదను మాట నిజమయ్యె నేఁడటంచు, మగువవచ్చుచు జేఁతకుమాఱుచేసె. కళా. ౩-౩౪.

క. అనుజులకు నడ్డపడియే, మిని జేయఁగ నీమిఁ జూచి మెచ్చితిగాక, ఘను సాదుశేఁగవిని న్వను తలపాలమునకాని నిలువదునుమ్మీ. భార. ఉద్యో. ౨-౧౩.

ద్వి. ఉరిసినపుండ్లపైనుప్పును జల్లి కరలఁ జేసె దపు, నేఁగినిలితివేని చక్కఁబెట్టఁగలేరు సాదుశేగినను, బొక్కనిల్వదు తలపాలమునఁగాని హరిశ్చ. ఉత్త. ౧-౨౫౯.

౨. సాధువు (సన్యాసి)

ఉ. ఆతని తేజుగల్గి యలరారెడు నయ్యేకిమీదు వేయినూ, టాలల రొక్కముల్ తొడవు లందముల్ వలిపంపుఁ జీరలుం, జాలుల గాఁగ నింటగల సొమ్ములు నెమ్మినొసంగి యత్తఱిన్ బాలుల దీవసాదులకు బందుగులన్ దనియించె నెంతయున్.

అ. రా. బాల. ౧౯౬.

దుర్జనులఁగూడి పేదసాదులను గొట్టు.
భల్లాణ. ౩. ఆ. ప్రా.

సాదు.² అవ్య. బాగు, మేలు.

క. వేదాదివిద్య లెఱిఁగెన్ వేదండవిభోద్ధి చండ
విక్రముఁడు బుధుల్, సాదన శాస్త్రవులెల్ల
హా, సాదన జెవజెట్ల దొడరిసాదన సేయన్.
రామా. ౩-౧౪౯.

తే. సంతసంబయ్యె సురరాజు సాదుసాదు.
కృ. వై. ౩-౧౬.

సాదు.³ స. క్రి. ౧. సంరక్షించు, పెంచు. ౨. పరిదిద్దు, అనుపులోనుంచు.

సాదుతనము. వి. సాధుత్వము.

క. సాదుతనంబుఁ దనరెడి, గాదిలిసుతుఁజూచి
మున్నుగైకొనిన మహాక్షేపంబు వాసి.
సమీర. ౨-౨౦౧.

సాదృశ్యము. సం. వి. అ. న. ౧. పోలిక, సామ్యము. ౨. ప్రతిరూపము, ప్రతిమ, ప్రతిబింబము.

సాద్యంతము. సం. విణ. అ. ఆ. అ. మొత్తము, సర్వము, సకలము.

సాద్యస్కము. సం. విణ. అ. ఈ. అ. తత్క్షణము. శీఘ్రము.

సాధంతుఁడు. సం. వి. అ. పుం. సన్న్యాసి, భిక్షువు.

సాధకము. సం. విణ. అ. ఆ. అ. సాధించునది.

సాధన. సం. వి. ఆ. స్త్రీ. ౧. సిద్ధి, సమాప్తి, పూర్తి. ౨. పూజనము, ధ్యానము, అర్చనము. ౩. ప్రసాదనము, సమాధానము.

సాధనక్రియ. సం. వి. ఆ. స్త్రీ. ౧. సమాపకక్రియ. (A Finite verb) ౨. కారకయుక్తమైనపని.

సాధనత. సం. వి. ఆ. స్త్రీ. ౧. సాధనముకలిగియుండుట, సాధించు సామర్థ్యము. ౨. సంపూర్ణత.

సాధనపత్రము. సం. వి. అ. న. సాక్ష్యముగా నుపయోగపడు పత్రము.

సాధనము. సం. వి. అ. న. ౧. సాధించుట. ౨. ఉపకరణము. ౩. ఉపాయము. ౪. ధనము. ౫. వధము. ౬. మృతసంస్కారము. ౭. గమనము. ౮. అనుగమనము. ౯. ఋణదానము ౧౦. నివర్తనము. ౧౧. సైన్యము. ౧౨. మగుతి. ౧౩. తృతీయావిభక్తి. ౧౪. ద్రవ్యము, పదార్థము. ౧౫. సహాయము. ౧౬. ఋజువు, సాక్ష్యము. ౧౭. హేతువు (తర్కము) ౧౮. జయము. ౧౯. వశీకరణము. ౨౦. తపస్సు ౨౧. ముక్తి. ౨౨. ఔషధము. ౨౩. అంగము, అవయవము. ౨౪. మైత్రి. ౨౫. లాభము.

సాధర్మ్యము. సం. వి. అ. న. ౧. సామ్యము సౌమ్యము, ౨. సమానధర్మము కల్గియుండుట. ౩. సమానగుణలక్షణములు కలిగియుండుట. ౪. ఒకేమతమునకుఁజెందియుండుట.

సాధారణత. సం. వి. ఆ. స్త్రీ. సమానత, సమత విశ్వజనీనత.

సాధారణత. సం. వి. అ. న. సాధారణత్వము.

సాధారణధనము. సం. వి. అ. న. సమిష్టిస్వత్వము.

సాధారణము. సం. విణ. అ. ఆఈ. అ. ౧. సామాన్యము. ౨. విశ్వజనీనము. ౩. తుల్యము సదృశము. ౪. అనైకాంతికము (తర్క) ౫. సమానము.

సాధారణము. సం. వి. అ. పుం. ఒక సంవత్సరము పేరు.

సాధారణము. సం. వి. అ. న. ౧. ఎల్లలకు వర్తించువిధి. ౨. సామాన్యనియమము. ౩. జాతిలక్షణము.

సాధారణస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. ౧. సామాన్యస్త్రీ. ౨. కులట.

**సాధారణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. సమసరమ్మ. ౨. తాళపుచెవి.

**సాధారణీకరణము.** సం. వి. అ. న. ౧. సామాన్యముచేయుట. ౨. విశ్వజనీనముచేయుట. ౩. స్వగతత్వపరగతత్వాదిభేదము లేనిదిగాఁ జేయుట (అలంకా) ౪. నిర్విశేషము చేయుట. ౫. పరిశుద్ధము చేయుట.

**సాధారణీకృతి.** సం. వి. ఇ. స్త్రీ. సాధారణీకరణము.

**సాధారణ్యము.** సం. వి. అ. న. సాధారణత.

**సాధి.** సం. వి. ఈ. స్త్రీ. అత్త, శ్వశ్రువు.

**సాధించు.** సం. స. క్రి. ౧. పూర్తిచేయు, నిర్వర్తించు. ౨. జయించు. ౩. సంపాదించు, సమకూర్చు ౪. వశపఱచుకొను. ౫. తీసుకొను, గ్రహించు ౬. మాన్చు, శమింపజేయు. ౭. పోవు, తన త్రోవను తానుపోవు ౮. వసూలుచేయు (అప్పు మొ.) ౯. పరిపూర్ణముచేయు ౧౦. సంహరించు, నాశముచేయు.

జయించు.

సీ. పెనుగొండసాధించె. వరాహ. ౧-౩౦.
తమకసాధ్యుల సాధింపఁదలఁపఁదగునె.
కుమా. సం ౪-౭౩.

సంపాదించు.

శా. సంసారస్థితినుండి యోగగరిమన్ సాధించెనే
నిన్. బుధా, త్వంసం బాతఁడెయంత ధైర్య
మహిమన్ దాల్పంగఁ జాలోవునే, సంసా
రంబును బానిసైన సమనువ్యంబైనచో నుండి
విద్వాంసుం డభ్యసనంబు సేయఁదగునిర్వాం
ఛాస్వభావంబునన్.
శివయోగ ఉ. ౧. అ. ౧౮. పుట.

వశపఱచుకొను.

వ. ఇట్లు మాహిష్మతీపురంబు సాధించి నీలుచేత
నరిఁగొని సహదేవుండు.
భార. సభా. ౧-౨౬౦.

తీసుకొను, గ్రహించు.

మ. విశ్వామిత్రుఁడి ట్లయ్యెడన్, సతతాభ్యాస
కుతూహలాగ్రిమనియతిన్ సాధింపఁగా విద్య
లా, తతతీవ్రార్తి భయంబునన్ దలఁకి య
త్యంతంబు [illegible]

సంహరించు.

మ. లవణున్ రోధించి సాధింపుమా.
ఉ. రా. ౭-౭౨.

**సాధిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నిపుణురాలైన స్త్రీ ౨. గాఢనిద్ర.

**సాధికారము.** సం. విణ. అ. ఆ. అ ౧. ప్రభుత్వముగలది, అధికారముగలది. ౨. రాజనియోగబలముగలది.

**సాధిక్షేపము.** సం. విణ. అ. ఆ. అ ౧. తిరస్కారము ౨. అధిక్షేపముతో గూడినది.

**సాధితము.** సం. విణ. అ. ఆ. అ ౧. నెఱవేర్పఁబడినది. ౨. పూర్తిచేయఁబడినది. ౩. నిరూపింపఁబడినది. ౪. పొందఁబడినది. ౫. నిర్వర్తింపఁబడినది. ౬. శిక్ష విధింపబడినది.

ఉ. సాధితసర్వధర్మ! యవసాదితదుర్జనకర్మ
హరి. ఉ. భా. ౯-౨౮౪.

౬. వశపఱచుకొనఁబడినది. ౭. తిరిగి పొందఁబడినది. ౮. దండుగధనము విధింపబడినది. ౯. శిక్ష విధింపబడినది.

**సాధిమ.** సం. వి. న్. పుం. ౧. సౌజన్యము. ౨. ఉత్కృష్టత. ౩. శ్రేష్ఠత. ౪. పరిపూర్ణత.

**సాధిష్ఠము.** సం. విణ. (సాధు, సాధీయాన్, సాధిష్ఠ) అ. ఆ. అ. సాధుతమము, మిక్కిలి సాధువైనది, మిక్కిలి పదిలమైనది.

**సాధిష్ఠానము.** సం. విణ. అ. ఆ. అ. ఆశ్రయముగలది. ఆధారముగలది.

**సాధీయము.** సం. విణ. స్. ఈ. స్. సాధుతరము.

సాధీయసుఁడు, సం వి. స. పుం. చాలగట్టివాఁడు. ౨. చాల మంచివాఁడు.

సాధు, సం. అవ్య. మేలు, బాగు, బళా, చాలు, సరి.

సాధుజము. సం. విణ. అ. ఆ. అ. సత్కులమున బుట్టిన ఉన్నతసంభవము.

సాధుఁజేయు. స. క్రి. చక్కఁజేయు.

సీ. నకులుని నైపుసాయకముల గ్రుక్కించి, సహ
దేవు నేడింట స్సాధుఁజేసి నవవిశిఖముల
మాత్స్యవరేణ్యు నడఁగించి, యేడింటసాత్యకి
యేపుమాపి. భార. ద్రో. ౧-౨౦౫.

సాధుత. సం. వి. ఆ. స్త్రీ. (రూ. సాధుత్వము. అ. న.) మంచితనము, సౌజన్యము, సౌశీల్యము, యోగ్యత, పరిపూర్ణత.

సాధుదర్శనము. సం. విణ. అ. ఆ. అ. ౧. అందమైనది. ౨. ఆలోచనగలది, జాగ్రత్తగలది. దర్శనయోగ్యమైనది.

సాధువాదము. సం. వి. అ. పుం. ౧. మేలు మేలనుమాట. ౨. పొగడ్త.

చం. దివంబున్, వెలయఁగ సాధువాదములు
వించె. భార. సభా. ౨-౩౧.

సాధువాహము. సం. వి. అ. పుం. (రూ. సాధువాహి. న. పుం.) సుశిక్షితమైనయశ్వము.

సాధువు. సం. విణ. ఉ. ద్వి. ఉ. ౧. మంచిది. శ్రేష్ఠమైనది. ౨. తగినది, ఒప్పయినది. ౩. గుణవంతమైనది, పవిత్రమైనది, శుద్ధమైనది. ౪. దయగలది. శాంతమైనది. ౫. ఆహ్లాదకరమైనది, సుందరమైనది. ౬. ఉదారమైనది. ౭. ఉదాత్తమైనది, ఉత్తమవంశమున బుట్టినది. ౮. సమర్థమైనది.

సాధువు. సం. వి. ఉ. పుం. ౧. సత్పురుషుఁడు, సుజనుఁడు ౨. ముని, యతి.

క. అఘవిదారసాధువిసరన, మాధవ రాజ్యాకారామరూ
త్తరవార్తా లోకార్థవిహితమద్వి, త్తాధిగమా!
పెద్దవెంకటాధిప సుగమా!
రాఘవ పాం. ౩-౧౪౩.

౩. వణిజుఁడు. ౪. జైనముని ౫. వడ్డీవ్యాపారస్థుఁడు. ౬. చక్కని (వాఁడు)

సాధువృక్షము. సం. వి. అ. పుం. కదంబము, కడిమిచెట్టు.

సాధువృత్తము. సం. విణ. అ. ఆ. అ ౧. మంచి నడవడికలది. ౨. మంచి వృత్తాంతముగలది. ౩. మంచి వర్తులాకారముగలది. ౪. మంచిపద్యములుగలది.

సాధువృత్తము. సం. వి. అ. న. సత్ప్రవర్తన, ఆర్జవము, సౌజన్యము.

సాధృతము. సం. వి. అ. న. ౧. అంగడి, దుకాణము. ౨. ఛత్రము. ౩. సెమిల్లగుంపు.

నాధ్యఋషి. సం. వి. ఇ. పుం. శివుఁడు.

సాధ్యత. సం. వి. ఆ. స్త్రీ. ౧. సాధింపఁదగియుండుట. ౨. సాఫల్యావకాశము. ౩. నివర్తనయోగ్యత.

సాధ్యపక్షము. సం. వి. అ. పుం. అభియోగమున వాది విన్నపము.

సాధ్యము. సం. విణ. అ. ఆ. అ. ౨. సాధింపవలసినది. ౨. సాధింపఁదగినది. (చూ. సాధించు.) ౩. శాస్త్రమువలన రూపొందినది.

సాధ్యము. సం. వి. అ. న. ౧. సిద్ధత, పూర్ణత. ౨ నిరూపింపవలసిన యంశము ౩. (తర్కము) అనుమేయము.

సాధ్యము. సం. వి. అ. పుం. ౧. దేవత. ౨. ఒక మంత్రము పేరు.

సాధ్యసిద్ధి. సం. వి. ఇ. స్త్రీ. ౧. లక్ష్యప్రాప్తి ఉద్దిష్టార్థలాభము. ౨. సిద్ధాంతము, సమాప్తి.

**సాధ్యుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఒకజాతిదివ్య పురుషుఁడు. ౨. గణదేవతావిశేషము-పన్నిద్దరు గణదేవతలలో నొకఁడు (వాచ)

క. సాగ్నులగు మూర్ధ్నుముని గిరధ. మధ్యంబున వాత్రికేగమ ప్రబుద్ధుండై. హరి.ఉ. భా. ౧౦-౯౮

శా. సాధ్యాది త్రిదశావకీర్ణగుణకృష్ణాతుంగ భదాత్రిపగమధ్యద్వీప....
రాఘవాభ్యుదయము. ౬-౩౬౩.

**సాధ్వసపడు.** అ. క్రి. భయపడు.

క. ఆనురుకొనంగ పరినవెస, దెసచెడియు క్రొండనెక్కితి నతండిటుదా, రసమై వచ్చు టకున్ సా, ధ్వసపడఁగారణము తేటపడ వినమింకన్. చంద్రూరా ౬-౨౨౬.

**సాధ్వసము.** సం. వి. అ. న.

౧. భయము. ౨. ఉద్వేగము, ఉత్తలపాటు.

**సాధ్వి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పతివ్రత, క్రొత్తది, శీలవతి. ౨.ఒకదినుసుఢంప. ౩. భ. న. జ. న. స. న. న. భ. గురువుగలవృత్తము ౮-౧౨-౨౨ యతులు.

**సాన.** వి. (సం. శాణః ప్రా. సాణ.) ౧. ఒఱపు ఱాయి. అస్త్రము మొ॥ పదునుపెట్టుఱాయి ౨. గంధముఱ దిఱు గంధపు చెక్కతో చాదెడి ఱాయి.

౨. మణులమొక్కలు పోటాచెడు ఱాయి.

౩. గంధము తీసుకొనుఱాయి.

ద్వి. మదమున వలపలి మోఁచేయిసాన, గది యించి తిగిచి శ్రీగంధంబు వడసి.
బస. పు. ౪-౮౩౩ పం..

**సానందము.** సం. విణ. అ. ఆ. అ. ఆనంద ముతోఁగూడినది, సంతోషపడినది.

**సానకత్తి.** వి. సాదనకత్తి.

వ. పులు లెక్కిన యంగములు దళుంగలింపఁ జూపట్టుకరమ్ము కరింబుల నిలువు సాన కత్తుల మెగు భుజంబుల నిక్కిరిగి.
ప్రబం. ౧-౪౮.

**సాన (ల) ఁదీరు.** అ. క్రి. సానచుపిడిచే మెఱుఁగెక్కు.

ఉ.సత్కవికల్పనావిశేషానహపూర్వప్రవృత్తములు సానలఁ దీరిన జాతిరత్నములే....
వసు. ౧-౧౯.

సీ. అంగజాగా త్రాదిసంగోపమానంబు నవ విల్తు సానదీరినల కోరి (ఇది క్రొవ్విరివర్ణనము)
రాజవాహన ౩-౭౫.

చ. అలుకొ కయింత లేక కుసుమాస్త్రుఁడు క్రొన్నెల సానదీరిన [illegible]
కళా ౨.౪౬.

సీ.... ముద్దియకమ్మ కెమ్మోవి మాణిక్యంబు సానదీరినరీతి చాయలూనె. దశా. ౯-౧౦౦.

**సానఁదేఱు.** అ. క్రి. మెఱుఁగారు, పదునెక్కు

సీ.... తెలివాలుగను కెలంకుల సానఁదీఱెడి చికిలిమూపు లాకింప నిగ్గుగుణకు....
దశా. ౬-౧౫.

**సానఁబట్టు.** స. క్రి. పదునుబెట్టు, మెఱుఁగుపెట్టు

చ. అమ్మనిపాలికివచ్చె వేర్పఁడో, య్యలి నును సానబట్టిన యనంగుని మోహనబాణమో యనన్.
మను. ౬-౨౪.

గీ. సానఁ బట్టిన రాపాడి చేల్లి మెదిపి.
మను. ౨-౩౬.

తే. సానఁబట్టిన మకరాంకు శస్త్ర మనఁగ.
పారి. ౧-౭౮.

**సానఁబెట్టు.** స. క్రి. (సానన్+పెట్టు) సానపై నూఱి పదునుపెట్టు.

తే. పెదమరలి యేసె వాని నప్పుడమరుఁడు, సానఁబెట్టిన మోహనాస్త్రంబు దొడిగి.
శ్ప. నై. ౬-౧౧౬.

**సానలము.** సం. వి. అ. పుం. సాలవృక్షపుబంక

సానలవాఁడు. వి. మణికారుఁడు, మణులను బాగుచేయువాఁడు.

సీ. సానలవాఁడు పూసలవాఁడనంగను, మణికారసంజ్ఞయై మనుచునుండు....
ఆం. భా. ౨-౨౮౬.

సానసి, సం. వి. ఇ. పుం. ఖంగారము.

సానాకత్తి. వి. సానకత్తి.

సీ. ననవింటివాని సానాకత్తి పరుజాటెక్కుల వాక్కుటపు సామునొండె లలర.
కువల. ౧-౨౬.

సానాగడ, వి. పాదరక్ష.

క. కాంచిన ననపానాగడ, కెంచపు మాస్టీడు చెట్టుగొరలుచు. ఉ. హరిశ్చ. ౪-౧౧౪.

సాని, వై. వి. (సం. స్వామినీ, త. చాని. క. సాని) ౧. స్త్రీ.

సీ. అయ్యిద్దఱును గృష్ణవర్ణుప్పఁదోడ్కొని చని యొక్కమూఁదఁలిసాని కపుడు.
భార. ఆది. ౭-౨౭౮.

౨. అధిపురాలు, రాణి.

క. మానిని నిను కాపట్టపు, సానిగ నొనరించి సకలసామ్రాజ్యంబున్, మానుగ నీకిడి కొలిచెద. రసిక. ౬-౧౧౪.

సీ. ఏమన్న ననిరోఁగాకేమి మీ రేలికసాని వచ్చితి నీవ చాలుమాకు. కాశీ. ౬-౨౨౧.

౩. భార్య. చూ. ఒజ్జసాని.

తె. పెట్టుపోకల పొగసాని సెట్టిసాని,యింటికడ నుండియుక్తాడుబంటువాఁడు. శుక. ౨-౨౦౫.

౪. వేశ్య, వారస్త్రీ.

ఉ.... సానులకూటముల్ గలుగు జాణలు నీటులు పెట్టకుందురే ? దశా. ౨-౧౫౫.

ఉ... దేవుని సానివారికి మద్దెలకానికి పుల్లాయ యముల వాకి క్షేత్రమగు ౨౦౦౦.
౧౧౬౧. శా. శా. ౩-౧౦౫౮.

సీ. తే....భీమేశ్వరునిగొల్తు రప్పురమున, సాను లనుపేరి యప్సరశ్చంద్రముఖులు.
భీమ. ౧-౭౫.

౫. స్త్రీల పేళ్లచివర అమ్మయను నర్థమున వచ్చు ప్రత్యయము.

ఉ. మంత్రి శ్రీధరుఁడు వానికి నూరవసానికిని బృహస్పతి నిభుఁడుద్భవించె బుధబాంధునిధానుండు గంటడిమ్మహిన్.
శా. శా. ద. శా. ౪-౬౯౫.

పెంటిసెట్టికిం పేరసానికి సుపుత్రుండైన కాపిసెట్టి. దా. శా. ౧౧౪౩.
పత్నిగుణవతీతస్య యొటియాసానీతివిశ్రుతా.
దా. శా. ౧౧౬౪.
తమతల్లి మల్లాసానికిం బెట్టిన అఖండవతిన్.
దా. శా. ౧౦౬౭.
దండనాయక చోడపనాయకునితల్లి కొమ్మసాని పెట్టిన. దా. శా. ౧౦౩౯.
వృత్తిగలస్త్రీ (మంత్రసాని), దేవదాసి భీమేశుండుసాని వాదకరుగున్. భీమ. ౧-౧౧౨.
(పెమ్మసాని, అల్లసాని ఇత్యాదిగా గృహనామములయందును కనిపించుచున్నది) (దేశప్రాంతీయనామముగాకూడ కలదు. కురాసాని గోమము. (వాచ)

సానిక, సం. వి. ఆ. స్త్రీ. ౧. గొట్టము, వెదురుగొట్టము. ౨. మురళి, పిల్లనగ్రోవి.

సానిక. వి. ౧. వెలుపాటికట్ట.
ఆం. భా. ౨-౨౪౫
౨. మట్టికంచము, ౩. మల్ల. శర.

సానికరణము. లెక్కలు సరిచూచు(ట) వాడు.

సానిప, (రూ) సాన్పు, సాన్పి, సానుపు, సానిపి వి. వాకిలికుడిచి కళ్లాపుచల్లుట (వాచ)

సానివాడ, వి. వేశ్యవాటి ౨. దేవదాసీలు నివసించుపేట.
"భీమేశుండు సానివాడ కరుగున్.
భీమ. ౧-౧౧౨.

సానివాఁడు. వి భోగముకుల మువాఁడు.

సానుకంపము. సం. విశే. అ. ఆ. అ. దయగలది, సానుభూతిగలది, జాలిగలది. అనుకంపగలది.

సానుక్రోశము సం. విశే. అ. ఆ. అ. సుకుమారము, దయగలది, జాలిగలది.

సానుతాపము. సం. విశే. అ. ఆ. అ. పశ్చాత్తాపముగలది, సంతాపముగలది.

సానునయము. సం. విశే. అ. ఆ. అ. ౧. వినయముగలది. ౨. మర్యాదగలది. 3. ఆదరముగలది. ౪. నాగరికమైనది.

సానుబంధము. సం. విశే. అ. ఆ. అ. ఎడతెగనిది, నిరంతరమైనది.

సానుమంతము. సం. వి.త్. పుం. త్. తీ. త్. పర్వతము.

సానుమంతము. సం. వి. ఈ. స్త్రీ. సానుమతి, ఒకయప్సరస.

సానురాగము. సం. విశే. అ. ఆ. అ. ప్రేమగలది, చనవుగలది, ఆసక్తమయినది.

సానువు. సం.వి.ఉ.పుం. ౧. శిఖరము, శృంగము ౨. కొండనెత్తము, ఉపరితలము. 3. మొలక ౪. అడవి. ౫. బాట, పథము. ౬. పైభాగము, అగ్రము. ౭. పర్వతప్రాంతము. ౮. సుడిగాలి. ౯. విద్వాంసుఁడు. ౧౦. సూర్యుడు.

సానేయి. సం. వి. ఈ. స్త్రీ. సానిక.

సానేయిక. సం. వి. ఆ. స్త్రీ. సానిక.

సాన్నహనికుఁడు. సం. వి. అ. పుం. కవచధారి కవచవాహి.

సాన్నాహనికము. సం. విశే. అ. ఈ అ. ౧. కవచము ధరించునది. ౨. యుద్ధమునకుఁ బురికొల్పునది.

సాన్నాయ్యము. సం. వి. అ. పుం. హవిస్సు దధిపయోరూపమైన హవిస్సు (అని కొందఱు) శ. ర.

సీ. ప్రాగ్వంశబంధుర బహుగంధ సాన్నాయ్య
మాగ్నీధ్ర ముఖ్యర్త్విగా శ్రయంబు.
శు. హ. ౨-౧౦౮.

సాన్నిధ్యము. సం.వి.అ. న. ౧. సామీప్యము. ౨. ప్రత్యక్షము, సాక్షాత్కారము. 3. హాజరు.

సాన్నిపాతికము. సం.వి.అ.ఈ.అ. ౧.మిశ్రము, సంకరము, కలగాపులగము. ౨. క్లిష్టము, సంకీర్ణము.3. వాతపిత్తశ్లేష్మదోషముల సాంకర్యము.

సాన్యాసికుఁడు. సం. వి. అ. పుం. ౧. తురీయాశ్రమస్థుఁడగు బ్రాహ్మణుఁడు. ౨. సన్న్యాసి.

సాన్వయము. సం.విశే. అ. ఆ. అ. ౧. సంబంధముగలది. ౨. వంశపరంపరాగతమైనది. 3. పైతృకము.

సాపడు. =పాపము+పడు(త.చాప్పిడు) స.క్రి. తిను, భుజించు.

చ. మరలి వసుంధరామరకుమారుఁడు వైష్ణవ
రాజమందిరాం, తరములకేగి యందు నియ
తంబుగ మాధుకరంబుఁదెచ్చి శ్రీహరికి సమ
ర్పణంబని తదన్నము సాపడిరేవగల్ను దా,
వరముగనుండె నయ్యటజవాటికఁదోఁటకుఁ
బ్రోది సేయుచున్. విక్ర. ౨-33.

ఉ. శీతలవారిఁ ద్రావువడఁ జెందినవాఁడు తృష
ధార్త డిష్టవృష్టా, తతభక్ష్యమాంసకలితా
న్నము సాపడు. ధర్మ. 3-౧౯.

సాపత్నము. సం. విశే. అ. ఆ. అ. సవతివల్ల కలిగినది, సవతికి సంబంధించినది.

సాపత్నులు. (బహు) సం. వి. అ. పుం. సవతి బిడ్డలు.

సాపత్న్యము. సం. వి. అ. న. ౧. సవతితనము. ౨. వైరము, స్పర్ధ, పోటి.

సాపత్న్యుఁడు. సం. వి. అ. పుం. ౧. సవతి కొడుకు, ౨. శత్రువు.

సాపరాధము. సం. విణ. అ. ఆ. అ నేరము గలది, అపరాధముతోఁ గూడినది.

సాపవాదము. సం. విణ. అ. ఆ. అ. ౧. అపనిందను ప్రచారముచేయునది. ౨. అపవాదము పాలైనది.

సాపాటు. √ సాదము. వి. ఆరగించుట.

తే. గీ. ధాన్యముష్టి గులామెత్తి దానవిత్య, మే కతంబునఁ దా స్వయంపాక మాచరించి సాపాటుఁజేయుదునంచు వతని, మెుఱఁగి తన యింటి కేగి మమ్మెుఱు భుజించు.
వైజ. ౨-౧౨౨.

సాపించు. స.క్రి. (సం. శాపించు) శపించు,తిట్టు
ద్వి. కనుకయా! సాపింపఁగాకి యుత్తమకి.
బస. పు. ౧౪౯ పే ౧౨ పం.

సాపిండ్యము. సం. వి. అ. న. ౧. ఒకేపితృదేవతావర్గమునకు పిండము లర్పించుసంబంధము. ౨. బంధుత్వము, రక్తబంధము. ౩. జ్ఞాతిత్వము.

సాపెనలమారి. వి. శాపనశీలుఁడు. తిట్టుబోతు.
తే. గీ. చేటపెయ్యకల్మిచ్చు చెడుగుసాపెన మారి. హంస. ౫-౧౧౩.

సాపేక్షము. సం. విణ. అ. ఆ అ. ౧. సంబంధించినది, అన్యముపై నాధారపడేనది. ౨. కేవలముకానిది. (వ్యతి. నిరపేక్షము)

సాప్తపదము. సం. విణ.అ. ఈ. అ. కలిసిఏడు అడుగులు నడచుటవలనఁ గాని ఏడు మాటలు పలికికొనుట వలనఁగాని ఏర్పడినది.

సాప్తపదము. సం. వి. అ. న. ౧.వధూవరులు అగ్నికి ప్రదక్షిణముగా ఏడు అడుగులు వైచుట. ౨. మైత్రి, స్నేహము.

సాప్తపది. సం. వి. ఈ. స్త్రీ. చూ. సాప్తపదము.

సాప్తపదీనము. సం. విణ. సం. వి. అ. న. చూ. సాప్తపదము.

సాప్తపౌరుషము. సం. విణ. అ. ఈ. అ.ఏడు పురుషాంతరములకు సంబంధించినది.

సాఫల్యము. సం. వి. అ. న. ౧. ఫలప్రాప్తి, ప్రయోజనము. ౨. లాభము. ౩. జయము.

సాఫీ. హిం. వి. శుభ్రత, తిన్నదనము.

సాఫు. హిం. విణ. తేట, శుభ్రమైన, వంకరలేని. సూటియైన.

సాఫు. వి. దిద్దుబడు, తప్పులులేనివ్రాత.

సాబాధము. సం. విణ. అ. ఆ. అ. ౧. క్రమరహితమైనది, చెల్లచెదరైనది.

సాఁబాలు. వి. (సాము+పాలు) సగము, అర్థభాగము, సగముభాగము, సంగోలు.

సీ. గోరఁబోఁజినమాడ్కి గొన్నింటి జక్కసాబాలుగా ప్రయ్యలు వాపిపాపి.
భార. విరా. ౫-౩౫.

(వృత్తియందు సాముశబ్దమునకంత్యవర్ణలోపము) (సగమునకు సాయాదేశము)

చ. సతి శుశ్రూషలఁ గైకొనున్ మఱియుఁదా సాబాలు ధర్మస్థితిన్. మార్కం. ౨-౧౭౮.

సీ. ఏకంధగంధగాన హృదయమువ్విస్ఫూర్తి భవునిమైఁ జక్కసాఁబాలుఁగొనియె.
కాశీ. ౪-౧౫౦.

సీ....వడిబెట్టులోఁ జెలికదవము సాఁబాలూన్న, జెలఁగుసంబారంపుఁజింతపండు.
ఆము. ౨-౯౩.

సీ. పచ్చకప్పురము సాఁబాలు కూర్చిపరంగ ముదమున గీలుకామంబు దిద్ది. కువల. ౨-౪

సాబాలు. వి. సమాంశము. అర్ధాంశము

ఉ. శేలను బోటువాలు దులకింపఁదలంకొంగ మేలుమేలిసా బాలున వాలుకన్ జడలు పట్టున దొన్కిసలాడుచుండు పెన్ జాలుపి. రుండగబ్బి పాదచారల వన్నెమెకంబు తోలు

డాకాలునగండపెండెరపువ్రాకారపుడాలును
గల్గుసామికిన్ చెన్న. ౩. ఆ. ౩౭ ప.

సాబ్ధి. సం. వి. ఈ. స్త్రీ. ఒకవిధమైనద్రాక్ష.

సాబాసు.¹ (సేబాసు) అవ్య. ప్రశంసార్థకము.

శా. మ్రుగ్ఝూరే లీనము చాఁగురే స్ఫురితముల్
సాబాసు ఘాలించు చంద్ర. ౧-౧౨౯.

సాబాసు.² వి. హెచ్చరికపదము

కం. టాబొమ్మకు గిలిగింతలు, నీబోటుని బేలు
పఱచి నేడిదచుట్టంబై బయయించెనునన్నున్.
సాబాసేబాల వాని సరసకుఁ దియకే.
ప్రపం ౧ ఆ. ౬౩౦.

సాభిప్రాయము. సం. విణ. అ. ఆ. అ. ౧. ఉద్దేశపూర్వకము. ౨. సార్థకము. ౩. రత్యాది భావసహితము. ౪. వ్యంజకము.

సాభిమానము. సం.విణ.అ.ఆ.అ. ౧. అహంకారముగలది. ౨. గర్వముతోఁగూడినది. ౩. అభిమానముతోఁ గూడినది.

సాభోగము. సం. విణ. అ. ఆ. అ. విస్తృతిగలది, విశాలమైనది.

మ. అవితోర్వీనవఖండ! ఖండపరశుజ్యాభోగి
సాభోగ,భా,గవిభాస్వద్భుజదండ....
వసు. ౧-౧౬౪.

సాభ్యసూయము. సం. విణ. అ. ఆ. అ. ౧ ఈర్ష్యగలది. ౨. అసూయతోఁగూడినది. ౩. ఈర్ష్యలేనిది.

సామంజస్యము. సం. వి. అ. న. ౧. ఔచిత్యము, యోగ్యత. ౨. అన్యోన్యసాపేక్ష్యము, సరిపడియుండుట, ఒప్పు.

సామంత. సం. వి. అ. పుం. ముప్పదిరెండునపుంసకరాగములలో నొకటి.

సీ. మధ్యమావతియును ముఖారి మలహరి సామం
తపంతు వరాళియు బాళిరాగ.
హంస. ౫-౧౭౪.

గీ. చెంచు మలహరి దేశాక్షి శ్రీవరాళి మాళ
వియుఁబాండిసింధురామక్రియయు వసంత
సామంతశుద్ధవసంత గుజ్జరియును హిజీజ్జి
నీలాంబరియు నవంగ

తే. గీ. పొసఁగు ముప్పదిరెండునపుసంకములు
హంస. ౫-౧౭౫.

వి. ఒకానొకరాగము.

సీ. శుద్ధవసంత మధ్యమాధులు సామంతమలహరు
లును చెంచు మలహరియు ముఖారి మాళవి
యును ప్రబం. ౧ ఆ. ౭౬.

సామంతము. సం. విణ. అ. ఆ. అ. ౧. పొరుగునమున్నది, పొలిమేరనున్నది. ౨. సార్వజనీనము, సామాన్యము.

సామంతము. సం. వి. అ. న. ఇరుగుపొరుగు, చుట్టపక్కములు, ప్రౌఢిమ, దిట్టతనము (క. సామన్త)

క. అంతటవాగసరంబుల నింతులు తానములు
మిగుల హెచ్చించుచు సామంతముపరవన్
బరియు వసంతములోనైన దనుచు జనుదే
మతియున్. యయా. ౪. ఆ ౧౫౭.

సామంతరాగోల. వి. ఆయుధ విశేషము.

ద్వి. సామంతరాగోల చంకనబెట్టి.
పల్నా. వీర. పుట. ౧౧-౧౧౯.

సామంతుఁడు. సం.వి. అ. పుం. ౧. ఒకదేశము రాజ్జకుచేరికనున్న రాజు. ౨. పొరుగునమన్నవాఁడు ౩. అరిగాపు. ౪. నాయకుఁడు.

సామంతవళు (దు) లు. మి.వి.వస్త్రవిశేషము.

సీ. నిండువన్నెలు మంచినిగమ గోచరులు
సామంతవళులు ప్రతిమలను బొగదపచ్చలును
ప్రబం. ౧. ఆ. ౨౪౨.

సామకము. సం. విణ. అ. ఆ. అ. సామవేదసంబంధి.

సామకము. సం. వి. అ. న. ౧. అనలుసొమ్ము. ౨. ఋణమిచ్చినధనము.

సామకము. సం.వి.అ. పుం. ౧. సాన. ౨.ఒఱ పిడిరాయి.

సామగర్భుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.

సామగాయనుఁడు. సం. వి. అ. పుం. సామ గర్భుఁడు.

సామగుఁడు. సం. వి. అ. పుం. సామగానము చేయు బ్రాహ్మణుఁడు.

సామగ్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. వస్తుసముదా యము, సాధనసంపద. ౨. నిలువసరుకు, పదా ర్థసంచయము. ౩. ద్రవ్యసంభారము.

సీ..... సాకేతనస్థాన సాధనసామగ్రి, నతఁడు
తెమ్మనక యాయితముఁజేసి.
రాఘవాభ్యుదయము. ౩-౫౩.

సామగ్ర్యము. సం. వి. అ. న. ౧. సంపూర్ణత.

శా. గోబృందముల్, మాంగల్యాకృతిఁగ్రాల
నెంతయును సామగ్ర్యంబునం బందులు,
ప్పొంగన్. హరి. పూర్వ. ౨-౨౭.

౨. మొత్తము, సర్వము. ౨. పరివారము, అనుచర వర్గము. ౩. సాధనసంచయము. ౪. సంభారము, నిలువ.

సామజ (జాత) ము. సం. విశే. అ. ఆ. అ. ౧. సామవేదమునుండిపుట్టినది. ౨. సామోపా యమువలనఁగలిగినది.

సం. వి. అ. పుం. ఏనుఁగు.

మ. కరదీపంబులతోడ సామజతురంగస్యందనా
ఘంబుతో.... ఉ. హ. ౩-౨౭.

సామనము. సం. విశే. అ. ఆ. అ. (వైదికము) శాంతమైనది, సౌమ్యమైనది.

సామని (న్ని). సం. వి. ఈ. స్త్రీ. పశువులను గట్టివేయుత్రాడు.

సామన్యుఁడు. సం. వి. అ. పుం.స౧. సామవేద నిష్ణాతుఁడు. ౨. ఋగ్గానవిజ్ఞుఁడు.

సామము. సం. వి. న. న. ౧. శాంతపఱచుట, ఓదార్చుట, అనునయించుట. ౨. సం/ధిదింపు, నచ్చజెప్పుట,హితము (చతుర్విధోపాయములలో మొదటిది. చూ. ౪. ఉ.) ౩. మృదువచనము. ౪. సౌజన్యము, సౌమ్యము ౫. స్తుతి రూపమైన పద్యములేక పాట. ౬.సామవేదమందలిమంత్రము. చతుర్వేదములలోనొకటి.

సీ. తే.... సామగానారవంబు, నంతకంతకుఁ
జెలంగ.... ఉ. హ. ౨-౧౧౧.

సామయాచారికము. సం. విశే. అ. ఈ. అ. ౧. సమయములకు, ఆచారములకు సంబంధించి నది. ౨. సాంప్రదాయికము.

సామయికము. సం.విశే.అ. ఈ. అ. ౧. ఆచా రమునకు సంబంధించినది, సాంప్రదాయికము. ౨. సమ్మతము, అంగీకృతము. ౩. నిర్ణయాను సారి. ౩. వేళతప్పనిది, సకాలము. ౫. న్యా యము, సమయోచితము. ౬. అప్పుడప్పుడు జరుగునది. తాత్కాలికము.

సామయికాభావము. సం. వి. అ. పుం. ౧. వి లకడలేమి, క్షణికత్వము. ౨. మిథ్య, అసత్తు.

సామయోని. సం. వి. ఇ పుం. ౧. బ్రాహ్మ ణుఁడు. ౨. ఏనుఁగు.

సామరస్యము. సం.వి. అ. న. సమరసభావము; మైత్రి, ఐకమత్యము, చెలిమి.

సామరి. (సాము+అరి)విశే. సాముసేర్చినవాఁడు, సాముచేయువాఁడు.

ఉ. సంపెఁగ మొగ్గమల్కి గడ్డ్యమరి....
విజ. ౧ ఆ.

తే. గీ. గదలు ఖాణా ల్పటాలు నగ్గలికఁబూని
పరువడుల్ ద్రొక్కుకొనుచు నిబ్బరభుజీర
ములు గనంబడ సామరుల్ ప్రోలఁ జెలఁగ
సాదన లొనర్చ వెల్లి హెచ్చరిక లెసఁగ
రసిక. ౧-౮౧.

సామర్థ్యము. సం. వి. అ. న. ౧. శక్తి, బలము, వీర్యము, దక్షత ౨. ఏకలక్ష్యత, ఏకాశయత్వము. ఏకార్థకత్వము, ఏకప్రయోజకత్వము. ౪. యోగ్యత; ఔచిత్యము. ౫. అర్థసమర్పణశక్తి, సంకేతశక్తి, అభిధాశక్తి. ౬. లాభము, వద్ధి. ౭. ధనము, సంపద. ౮. ఉత్పాదకత్వము. ౯. కారణత్వము ౧౦. సాధకత్వము.

సామవాయికము. సం. విణ. అ. ఈ. అ. ౧. సాముదాయికము ౨. అవినాభావసంబంధము గలది.

సామవాయికుఁడు. సం. వి. అ. పుం. ౧. సచివుఁడు; మంత్రి ౨. సంఘాధ్యక్షుఁడు; నాయకుఁడు.

సామవేదము. సం. వి. అ. పుం. నాల్గువేదములలో నొకటి. (ఋక్, సామ, యజుర్, అథర్వణము అని వేదములు నాలుగు.)

ద్వి. అనుపమ సామవేదాన్విత మహిమఁ
 గనిన ని ద్రక్షకంపాపరోక్షులును. పండితా
 పుట ౧-౫౦౩

సామవేది. సం. వి. న్. పుం. సామవేదాధ్యాయియైన బ్రాహ్మణుఁడు.

ద్వి. శ్వపచయ్య నాఁగ నాసామవేదులకు
 పండితా ౧-౧౫౧

సామవేదీయుఁడు. సం. వి. అ. పుం. ఛాందోగ్యుఁడైన యాజకుఁడు.

సామాజికుఁడు. సం. విణ. అ. ఈ. అ. సమాజమునకు సంబంధించినది. ౨. సభాసంబంధ ౩. సంఘసంబంధ.

సామాజికుఁడు. సం. వి. అ. పుం. ౧. సమాజమండలివాఁడు ౨. ప్రేక్షకుఁడు, శ్రోత. ౩. సహృదయుఁడు; రసికుఁడు.

సామానాధికరణ్యము. సం. వి. అ. న. ౧. సమానావస్థయందుండుట, తుల్యస్థితికత్వము ౨. ఏకాధికారమునకు లోఁబడియుండుట ౩. ఏకాశ్రయత్వము; ఏకాధారత్వము.

సామాను. హిం. వి. సామగ్రి, వస్తువులు.

సామాన్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒకనాయికాభేదము. (స్వీయ, పరకీయ, సామాన్య అని నాయికలు త్రివిధము) ౨. వేశ్య; కులట.

సామాన్యజ్ఞానము. సం. వి. అ. న. ౧. జాతిలక్షణములను మాత్రమే యెఱుఁగుట ౨. ఎల్లరకుఁ గల జ్ఞానము.

సామాన్యపక్షము. సం. వి. అ. పుం. ౧. ఉభయమునకు సంబంధించిన విషయము, ౨. మధ్యస్థము.

సామాన్యము. సం. విణ. అ. ఆ. అ. ౧. సాధారణము ౨. సదృశము. తుల్యము. ౩. మధ్యమము, ౪. గ్రామ్యము, అవిశేషము. ౫. మొత్తము, సర్వము.

సామాన్యము. సం. వి. అ. న. ౧. సమాజము, జాతి, సమూహము ౨. సమాన ధర్మము, జాతి ధర్మము; ౩. మొత్తము, సర్వస్వము ౪. జాతి, తెగ ౫. ఐక్యము, అభిన్నత్వము ౬. సమానత్వము, తుల్యత్వము ౭. ప్రజావ్యవహారము. ౮. సార్వవిషయికమైన యర్థమును ప్రతిపాదించువాక్యము.

సామాన్యలక్షణము. సం. వి. అ. న. ౧. జాతిగుణధర్మములను మాత్రము వివరించు నిర్వచనము (తర్క), ౨. సముదాయమైన గుణక్రియాదికము.

సామాన్యశాస్త్రము. సం. వి. అ. న. ౧. నిత్యముగా సర్వమునకు వర్తించు నియమము; సాధారణవిధి. ౨. సాధారణమైన ఆధునిక విజ్ఞానశాస్త్రము.

సామాసికము. సం. విణ. అ. ఈ అ. ౧. సామూహికము, సాంగోపాంగము, సమగ్రము. ౨. సంక్షిప్తము, క్లప్తము, లఘువు. ౩. సమస్తపదమునకు సంబంధించినది. ౪. సమసించినది, సమస్తము.

సామాసికము. సం. వి. అ. న. సర్వసమాసములకు సంబంధించినది. సమాస సమూహము.

సామి, వి. ౧. రాజు, ౨. దేవుడు. "ఓసామి యిపుడేమిసేయుదు". ఉ. రా. ౧. ఆ.

వి. (సం. స్వామి) ప్రభువు

క. మాయాతు మలానినయది
పాయకసంతోషమున్న పలమిలసామీ !
కళా ౬. ౧౬౧

వై. వి.

సీ. వెలిదమ్మి రేకుపొత్తుల చిన్నిపాపఁడు
నలు మోముదమ్ముల వెలయుసామి
దశా. ౨. ౬౨.

౩. పెనిమిటి.

గీ. ఒకయలాబు శిలాటుఖండోదరమున
బూన్చియటుడించి తాను బొత్తుగలని
సామి దప్పెన్నకబళముల్ సామికొసగు
ననుచు జవులెచ్చరించుచు విగురుబోడి.
పాండు. ౩. ౮౭.

సీ. ఏసామి సామేన నేపొద్దు
నీలా. ౧ ఆ. ౧౨౮.

గీ. సోదమాసామి కేఁటాడిసూడరాదె.
ఉ. రా. ౧. ఆ.

గీ. సామి నను(గూర్చి నీతోడ నేమిపలికె".
(అచ్చ. సుం. కాం. - క. ర.)

౪. కుమారస్వామి

సామి, సం. అవ్య. ౧. సగము, అసంపూర్ణము. ౨. నింద్యము, నీచము.

"దంతమరీచులసామి నిర్గమంబును"
విరాట. ౧ ఆ.

"హరి యిచ్చటనె సామి హరిదైు హిరణ్యక
శిపుడీర ఖరనఖశిఖరములను"
వాల్మీకి ౨ ఆ. ౫౬

సామిగట్టు. స్వామిమల, కుమారస్వామి యున్న కొండ.

సీ. వలిమెట్టునాఁడు గావలిపట్టు దేవర
సామిగట్టుకు నేను సామినౌదయ.
చంద్రా ౨ ఆ ౪౫

సామిధేని. సం. వి. ఈ. స్త్రీ ౧. సమిధ, ౨. ధాయ్య (యాగమునందు అగ్నిని జ్వలింపఁ జేయునపుడు పఠించెడు ఋక్కు.)

సామిమల. వి. కుమారస్వామి వసించియుండు నొకానొక పర్వతము.

వ. "సామిమలకుంజని మహాముని ఘటో ద్భవుఁడు"
కాశీ. ౪ ఆ- ౩౦౨

సామిదోగి. వి.స్వామిద్రోహి

వ. సామిదోగులై పాఱిపోయెడివారు తిరుగ
రాజేస్తరా ప్రబం ౧ ఆ.-౭౮౮

సామీచి. సం. వి. ఈ స్త్రీ. స్తుతి, శ్లాఘ, నమస్కారము.

సామీప్యము. సం. వి. అ. న. చేరిక, సాన్నిధ్యము, సమీపత్వము.

సామీప్యుఁడు. సం. వి. అ. పుం. పొరుగువాఁడు.

సామీరి, సం. వి. ఇ. పుం. ౧. హనుమంతుఁడు ౨. భీముఁడు.

సాము, వి. ౧. సగము, సగభాగము. అర్ధము.

గీ. అఱసాము సగము సవము
వాఁగ నర్ధాహ్వయంబులౌ వాగభూమ.
అం. సం. ౭౩.

చ. కన్నులు సామువాయుచుం, బొరిఁబొరిదేఱి
చూచుచును. భా. రా. కిష్కిం. ౩౭౯

చం. కవిసి భరంబులైన మునికాళ్లను జేయఁగ
సాము నీరిలోనను వెడలకుండి కూర్మము.
భార. అను. ౧. ౨౩౨

తే. గీ. అతనిదేహంబునందు సామాలిఁజేసి.
కుమా. సం. ౪-౫౨

౨. వ్యాయామము.

ఆ. వె. చదువుసాముగలిగి క్షత్రియుల్ సంపూర్ణ
విద్యలనఁగ వీటవినుతికెక్కె. కవి. ౧ ఆ.

కం. సామ దిగవిడిచి యొదలిటు, సామగ నట్ట
దవి నిదురసవిమాని....(ఇది రెండర్థములకును
లక్ష్యము) వాల్మీకి ౨ ఆ.

సాము, విణ. సగము.

కం. మృదుమేనిసామువూతురు, జడనిధిచెలికాని
కొడుకు సర్వంసహాకున్, గొలకోలకదలిక
దలకు,వదకుంగుబ్బలికి సరియొవసుధాధరముల్
హర. ౫-౨౪.

సాము. వి. వ్యాయామము.

గీ. సాముగఁడీలు మాకు గోత్రపురేండ్రు.
మను. ౨. ౪౩

సాముకంటిచుక్క. వి. (సాముకన్ను+చుక్క) పూర్వఫల్గునీనక్షత్రము. శ. ర.

సాముకొవ్వు. వి. అరకొవ్వు.

సీ. వలిచట్టిపూదండ వెలిమట్టుగనొప్పు; కప్పు
చిప్పిలు సాముకొప్పుదఁర.
వాల్మీ. ౨ ఆ. ౧౩

సాముదాయికము. సం.విణ.అ.ఆ. అ. సామూహికము, ౨. మొత్తమునకు లేక సర్వమునకు సంబంధించినది.

సాముద్రము. సం. విణ. అ. ఆ. అ. సముద్రమునఁ బుట్టినది.

సాముద్రము. సం. వి. అ. న. ౧. సముద్రలవణము, ౨. సొరచేప యెముక, ౩ భాగ్యసూచకదేహలక్షణము.

సాముద్రికము. సం. విణ. అ. ఈ. అ. ౧. సముద్రమునఁ బుట్టినది, సముద్రసంబంధి, ౨. అదృష్టసూచక దేహలక్షణములకు సంబంధించినది.

సాముద్రికము. సం. వి. అ. న. సాముద్రికశాస్త్రము; శరీరావయవములను బట్టియు హస్తరేఖలనుబట్టియు ఫలమును చెప్పునట్టి శాస్త్రము.

సాముద్రికుఁడు. సం. వి. అ. పుం. ౧. సాముద్రికశాస్త్రవేత్త. ౨. హస్తరేఖలను బట్టి భవిష్యత్ఫలితములు తెలుపువాడు.

సాముద్రుఁడు. సం. వి. అ. పుం. ౧. సముద్రయాత్ర చేయువాఁడు. ౨. నావికుఁడు.

సామునెలముల్కి. అర్ధచంద్రబాణము.

సీ. సామునెలముల్కిదోయి నిశ్చలముగా బిఱు
గించి కాళ్ళురెండును దునించి కలువదాయ.
అ. రా. యుద్ధ. ౨౪౭

సామూహికము. సం. విణ. అ. ఈ. అ. సాముదాయికము.

సామెత. వి. లోకోక్తి.

గీ. రాజమగఁడైన వెనుకకు గాజుకడియ
మన్న సామెత నిక్కంబె యయ్యెమాకు.
యయా. ౩ ఆ. ౧౦౫

ద్వి. తామసించినవాఁడు రామసియన్న
సామెత నిఁమాయె సతిమాటలకును
సారం ౩ ఆ. ౧౧౨ పు ౧౩ పం.

సామేను. వి. సగముమేను, అర్ధశరీరము.

గీ. సామి సామేను చేకొన్నచాన.
ఆంధ్రనామ సంగ్రహము.

గీ. హరిభుజాంతరవాసినియైన లక్ష్మి
కైతికవునకు సామేనవైతివీవు.
మార్కం ౬-౧౨౦.

సీ. ఏసామి సామేనఁ జేపాద్దు వలిగట్టు
దొరపట్టి నర్మిలితోడబూను.
నీలా ౧ ఆ-౧౨

సీ. అర్ధనారీశ్వరుండగుట నీశానుఁడు
సామేనియంకిలి జాగకుండె.
శృ నై ౪-౧౨౯

తే. గీ. ఏమి వినుజాలు కనువాలు నిట్టికేలు
ఏది తోల్చిర మెదచార యొయ్యకోర
యేది పెలకూన సామేన నిడివచాన
యితఁడు కేళేలదొరయని యొటులనందు
చెన్న. ౩ ఆ-౫౨.

సీ. ప్రియుని సామేననుండియును దత్తేజంబు
సైరింపజాలని శాంభవినగి. ఉ. రా. ౧-౩౪.

**సామోద్భవము.** సం. వి. అ. పుం. ఏనుగు.

**సామోపచారము.** సం. వి. అ. పుం. సామో పాయము; శాంతిమార్గము.

**సామ్ముఖ్యము.** సం. వి. అ. న. ౧. అనుకూల్య ము, ఆదరము, ౨. దయ, ప్రసాదము, ౩. ప్రత్య క్షము, సమక్షము.

**సామ్యము.** సం. వి. అ. న. ౧. సమత్వము, సమానత్వము, ౨. పోలిక. సాదృశ్యము ౩. సామరస్యము ౪. అవైషమ్యము, పక్షపాత రాహిత్యము, ౫. అభేదము, ఐకమత్యము.

**సామ్రాజ్యము.** సం. వి. అ. న. ౧. చక్రవర్తి త్వము; ఏకచ్ఛత్రాధిపత్యము, ౨. సువిశాల మైన రాజ్యము.

క. ఆగతసామ్రాజ్య మంతకంతకుఁ బేర్చెన్.
నృసిం. ౪ ౨.

**సామ్రాణి.** వి. (రూ. సాంబ్రాణి) ఉత్తమా శ్వము.

క. తామ్రధ్వజ భూవరుఁడా, తామ్రనయనుఁ డగుచుఁ గనలితంత్రాధిపునీ, సామ్రాణెవ్వ రిదన విని, నమ్రుఁడగుచు లీలఁగదలి నకుల ధ్వజాఁడున్. జై. ౭ ఆ

**సాయమ్.** సం. అవ్య. అపరసంధ్యాకాలమున. సాయంప్రాతర్హుతప్రజ్వలిత.... భార. సౌప్తి.

సీ. సాయం సమారంభ చక్రవాళద్వంద్వ విరహా వలోకన విభ్రమములు. పారిజాత.౧ ఆ ౬౫. (ఇది సమాసగతమై ప్రయుక్తమగుచున్నది)

**సాయంకాలము.** సం.వి. అ. పుం. అపరసంధ్య వేళ.

**సాయంగేహి.** వి. సాయంకాలమున కిల్లుచేరు వాఁడు.

ద్వి.... వెదకుచు నొక్కచో వీసమంతయును, వాసక్తిలేక సాయంగేహులగుచు.
ద్వి. పరమ. ౧-౪౨ పా.

**సాయంతనము.** సం. విశే. అ. ఈ. అ. సాయం కాల సంబంధమైనది.

వ.... హృదయంబు ప్రీతుంబుబం జేసంగొన సాయంతన సమయంబున. ఉ. హ. ౨-౧౧౦

**సాయంధృతి.** సం. వి. ఇ. స్త్రీ. సాయంసంధ్యా బలి.

**సాయంప్రాతలు.** వి. ఉభయసంధ్యలు.

**సాయంమండనము.** సం వి.అ.న. ౧. సూర్యా స్తమయము. ౨. సూర్యబింబము.

**సాయంసంధ్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సంధ్యా రుణకాంతి ౨. సాయంసంధ్యోపాసన ౩. సంధ్యాదేవి(సాయంసంధ్యకు సరస్వతియని పేరు)

**సాయంసంధ్యాదేవత.** సం. వి. ఆ. స్త్రీ. సరస్వతి.

**సాయ.** వి.ఒక రాగవిశేషము. పండితా.౨-౪౫౫.

**సాయకపుంఖము.** సం. వి. అ. పుం. బాణము యొక్క ఈకలంకట్టఁబడినభాగము.

**సాయకము.** సం. వి. అ. పుం. ౧. బాణము. ౨. ఖడ్గము.

ఉ. ఒండొరుసేయు సాయకము లుక్కున నిద్దఱుఁద్రుంపఁగా హరి. ఉ. భా. ౧౦-౮౬

**సాయగౌళ.** వి. ఒక రాగవిశేషము.
పండితా. ౨-౪౫౪.

**సాయనము.** సం. వి. అ. న. విషువద్బిందువు నుండి గుర్తింపఁబడిన గ్రహముయొక్క రేఖాంశ ములు.

**సాయబు.** హిం. వి. (హిం. సాహబ్) ప్రభువు

ఉ. దిట్టతనంబునఁ జొచ్చి కచ్చిమేల్, రాయన దాని బారి నిగళంబునఁ బెట్టున కంటగట్టి శేఁప్రాయపుఁ జెంపోకందు తనుఁబల్మిబు సాయబు జూడ జేదుకన్.
చంద్రాంగ. ౨-౯౩.

సాయము. వి. సాహాయ్యము, తోడు.

సాయము. సం. వి. అ. పుం. ౧. అంతము, అస్తమయము, సమాప్తి ౨ దినాంతము. 3. బాణము.

సాయరు. హిం. వి. సుంకము.

సాయాహ్నము. సం. వి. అ. పుం. దినాంతము ప్రొద్దుగ్రుంకువేళ.

వ. వాయుతనయుండు వాయువేగంబునఁ జని సాయాహ్నంబున నొక్క వటమహీజాత శీతల శిలాతలంబున నునిచి.
భార. ఆది. ౬-౧౭౧.

సాయి. సం. వి. న్. పుం. అశ్వికుఁడు, గుఱ్ఱపు రౌతు.

సాయిల. వి. డుబుడక్కవాఁడు. (బుడబుక్కల వాఁడు)

సాయు. అ. క్రి. తొలఁగు, నశించె.

తే. గీ. అపుడు చంద్రమతీదేవి యాత్మలోన లేశమాత్రంబు చలనంబులేక దైవ మెల్లవగపులు సాయంగ నిచ్చెవరము, తెగడుచింతింపనింక డెందమున ననుచు.
హరిశ్చం. ౫-౧౨౫.

సాయుజ్యము. సం. వి. అ. న. ౧. ఐక్యము, లయము. ౨. పోలిక, సాదృశ్యము. 3.చతుర్విధ ముక్తులలోనొకటి.

సాయెబు. = సాహేబు వి. హిం. చూ. సాహెబు, సాహేబు.

సాయేబు. = సాహేబు, వి. హిం. చూ. సాహెబు, సాహేబు.

సార. సం. వి. ఆ. స్త్రీ. ౧. గతిక. ౨. దర్భ.

సారంగ. వి. ఇరువదినాలుగు స్త్రీరాగములలో నొకటి.

గీ....మల హారులు సారంగ రామక్రియ లు ఐనంగ, గన్నడ యనంగ మంగళ కౌశి యన, వెలయు నారాయణియు, జతుర్వింశతి వి ధముల దనరారు స్త్రీరాగములను.
హంస. ౫-౧౨౩.

తే. గీ. పూర్వగౌరళ సారంగమంగళ కౌశి కలును, కన్నడయుఛాయయును గౌళ కడు నపూర్వ, మైన భల్లాతకియును నారాయణి యనుక్రమత నిరువదినాల్గు స్త్రీరాగములును
ప్రబం. ౧-౯౫.

సారంగము. సం. వి. అ. పుం. ౧. త్వరగా బోవునది. ౨. చిత్రవర్ణము. 3. ఇఱ్ఱి ర. లేడి.

శా. సారంగాక్షుల చూపు చోఱగములజ్జగ్గొండ లన్మోహదుర్వ్యారావర్తములన్మునింగి....
పారిజా. ౨-౧౦౦.

౫. సింహము ౬. ఏనుఁగు ౭. తుమ్మెద. ౮. కోయిల ౯. పెద్దకొంగ, కొక్కెర ౧౦. నె మలి. ౧౧. ఛత్రము. ౧౨. పక్షివిశేషము. (Flaning) ౧3. మేఘము. ౧౪.ఉదుపు. ౧౫. జుట్టు, కేశము ౧౬. శంఖము. ౧౭. కమ లము. ౧౮. కర్పూరము ౧౯. విల్లు. ౨౦. చం దనము. ౨౧. జంత్రవాద్యము. ౨౨.ఆభరణము ౨3. బంగారము. ౨౪. భూమి. ౨౫. చాతక పక్షి. ౨౬. పుష్పము. ౨౭. రాత్రి. ౨౮. వెలు తురు. ౨౯. ఒకరాగము.

సారంగవీణ. సం. వి. అ. స్త్రీ. తంత్రీవాద్య విశేషము. పండితా. ౨-౪౪3.

సారంగి. సం. వి. అ. స్త్రీ. ౧. ఆడులేడి. ౨. తంత్రీవాద్యవిశేషము.

సారంగుఁడు. సం.వి.అ.పుం. పక్షులవేటకాఁడు వ్యాధుఁడు.

సారంగుఁడు. సం. వి. అ. పుం. ౧ శివుఁడు. ౨ మన్మథుఁడు.

సారండము. సం. వి. అ. పుం. పాముగ్రుడ్డు, సర్పాండము.

సారంభము. సం. విశే. అ. ఆ. అ. ప్రయత్నముతోఁగూడినది. (ఆరంభముతోఁగూడినది)

సారకము. సం. విశే. అ. ఆ. అ. ౧. విరేచనకారి. మలమోచనకారి. ౨. క్షాళనముచేయునది. శుద్ధిచేయునది.

సారగంధము. సం. వి. అ. పుం. చందనము.

సారగ్రీవుడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సారఘము. సం. వి. అ. న. మధువు, తేనె.

సారటు. ఆం. వి. రథము, గుఱ్ఱపుబండి.

సారణ. సం. వి. ఆ. స్త్రీ. ౧. పాదరసమువంటి లోహములకు చేయుసంస్కారవిశేషము. ౨. షడ్జమస్వరమునుబలుకు వీణయొక్కతీఁగె.

ద్వి. తాళవట్టియయుఁగస్త్రరి చోళవణియు లీల సారణయుఁదలిర్ప....

బస. పురా. ౭౦ పు. ౨౯ పం.

సారణము. సం. విశే. అ. ఆ. అ. ౧. కదలునట్లు చేయునది. ౨. ప్రవహించునట్లు చేయునది.

సారణము. సం. వి. అ. పుం. ౧. అతిసారరోగము. ౨. ఒకవిధమైన జీడిమామిడి ‡

సారణము. సం. వి. అ. న. ఒకవిధమైన సుగంధద్రవ్యము.

సారణము. వి. శ్యేనభేదము, డేగలలో నొకజాతి.

ద్వి. సాళువంబుల మంచిజలకట్టియలను, బెద్ద సారణముల బెట్టుగా విడిచి.

హరిశ్చ. పూర్వ. ౬-౨౭.

సారణి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. కాలువబోదె. ౨. చిన్ననది, వాగు. ౩. షడ్జస్వరము బలికెడు తంత్రి.

సీ. జవ్వాదిఁబదనిచ్చి సారణుల్ సారించి సరసత విరదలు చక్కనొత్తి.

వాల్మీకి. ౩-౧౩౩.

సారణికము. సం. విశే. అ. ఈ. అ. పయనించునది, కదలునది.

సారణికుఁడు. సం. వి. అ. పుం. యాత్రికుఁడు, బాటసారి.

సారణుఁడు. సం. వి. అ. పుం. ౧. రావణుని వేగుల వాండ్రలో నొకఁడు (శుక, సారణులు) ౨. రోహిణీవసుదేవుల కుమారుడు.

సారతరువు. సం. వి. ఉ. పుం. అరఁటిచెట్టు ‡

సారథి. సం. వి. ఇ. పుం. తేరుగడపువాఁడు రథచోదకుఁడు.

తే. రథికునకుఁగల మునికి సారథియుఁగర్ణ ధారుడును బోలె. భార. శాం. ౫-౫౨౨

౨. సహాయుఁడు ౩. సముద్రము.

సారథ్యము. సం. వి. అ. న. ౧. రథము నడుపు పని, రథచోదకత్వము. ౨. నియంతృత్వము, నాయకత్వము.

సారద. సం. వి. ఆ. స్త్రీ. ౧. సరస్వతి. ౨. దుర్గ

సారద్రుమము. సం. వి. అ. పుం. ఖదిరవృక్షము ‡

సారభాండము. సం. వి. అ. న. సహజమైన యానపాత్ర. ౨. సరకులు, ఓడయందలి పణ్యద్రవ్యములు ౩. సాధనములు, ఉపకరణములు.

సారమితి. సం. వి. ఇ. స్త్రీ. వేదము.

సారము. సం. విశే. అ. ఆ. అ. ౧. ముఖ్యము. ౨. శ్రేష్ఠము. ౩. యథార్థము, సత్యము. ౪. దృఢము, వీర్యవంతము, ౫ బుజువైనది, సిద్ధాంతము నిశ్చితము. ౬. సర్వోత్తమము.

సారము. సం. వి. అ. న. ౧. జలము. ౨. ఔచిత్యము, యోగ్యత. ౩. అడవి. ౪. ఉక్కు.

సారము, సం. వి. అ. పుం. ౧. ముఖ్యాంశము. ౨. నిగ్గు, ఆయువు పట్టు.

తే. వేదసారంబు సత్యంబు వినుఁడు సత్య సార మూర్తిదమము దమసారలార మోక్షమీపరిపాటి
భార. శాం. ౫-౫౪.

౩. రసము, జీవము ౪. తత్త్వము, పరమార్థము ౫. రసము, చేవ.

సీ. తే.... అచల సంఖ్యాతాలంబుల నధికసార తిరుల ధరగూల్చెఁ జూపఱు వెరఁగుపడఁగ.
రాఘవపాం. ౩-౧౨౧.

౬. సంక్షేపము, సంగ్రహము. ౭. బలము, వీర్యము, శక్తి. ౮ ఉత్సాహము, విక్రమము, శౌర్యము. ౯. స్థైర్యము. ధైర్యము, దార్ఢ్యము. ౧౦. సంపద, ఐశ్వర్యము. ౧౧. అమృతము. ౧౩. వాయువు. ౧౪. మీఁగడ ౧౫. సాకము-చీము, పదార్థము ౧౭. విలువ, అతిశయము. చందర పుపావు. ౧౯. ఒక అర్థాలంకారము. ౨౦. హృదయము.

సారిమేయము. సం. వి అ. పుం. మగకుక్క

సారిమేయి. సం. వి. ఈ. స్త్రీ. ఆడుకుక్క.

సారలోహము, సం. వి. అ. న. ఉక్కు.

సారల్యము. సం. వి. అ. న. ౧. ఋజుత్వము. ౨. నిష్కపటత్వము. ౩. తిన్నఁదనము, సూటితనము.

సారవంతము, సం. విశ. త్రి. త్రి. త్రి. త్రి. ౧. దృఢమైనది, సరుకుగలది. ౨. ఫలప్రదము, బలముగలది. ౩. రసముగలది.

సారవము, సం. విశ. అ. ఈ. అ. సరయూనది సంబంధమైనది. (శ. ర.)

సారస (శ) నము. సం.వి. అ. న. ౧. మూఁడు పేటలుగల ఆడుదాని మొలనూలు. ౨. కవచము తొడిగినవాని నడికట్టు.

సారసము, వి. వినోదము.

తే. అధిప నీ తనయుండు గయ్యంబు బొడుచు, తెంపువదలక విభవంబు పెంపు మెఱసి, సారసానక వచ్చిన చందమునను చెలిమిఁ బొందిరి పాండవేయులను హరియు.
భార. భీష్మ. ౧-౧౪౨.

సారసము, సం. విశ. అ. ఈ. అ. ౧. సరస్సునకు సంబంధించినది. ౨. బెగ్గురు పక్షికి సంబంధించినది.

సం వి. అ. న. ౧. తామరపువ్వు. ౨. స్త్రీ మొలనూలు.

సం. వి. అ. పుం. ౧. బెగ్గురుపక్షి. ౨. పక్షి.

సారసి (క) సం.వి. ఇ. ఆ. స్త్రీ. బెగ్గురుపెంటి.

సారసుఁడు, సం. వి. అ. పుం. చంద్రుఁడు.

సారస్యము. సం. వి. అ. న. సరసత్వము.

సారస్వతము, సం. విశ. అ. ఈ. అ. ౧. సరస్వతికి సంబంధించినది. ౨. సరస్వతీనదికి సంబంధించినది. ౩. వాగ్ధాటికలది, వాచాలము. ౪. సారస్వత దేశమునకుఁ జెందినది.

సారస్వతము. సం. వి. అ. పుం. ౧. సరస్వతీ ప్రాంతమండలి దేశము. ౨. సరస్వతీ పూజాంగము. ౩. బిల్వదండము.

సారస్వతము. సం. వి. అ. న. వాఙ్మయము, వాగ్ధాటి, వాక్కు. జడునికైనను గల్గు సారస్వతమ్ము.
ద్వి. పరమ. ౩-౧౭౯ పు.

సారస్వతుఁడు, సం. వి. అ. పుం. ౧. ఒకతెగ బ్రాహ్మణుఁడు, ౨. దధీచి వీర్యమును సరస్వతీ నది ధరించుటచే జన్మించిన పుత్రుఁడు.
సారదుని పూర్వజన్మపు బ్రాహ్మణనామము.

సారాంశము. సం. వి. అ. పుం. ౧. ముఖ్య విషయము. ౨. పిండితార్థము.

సారాయము, వి. మద్యము, మదిర.

**సారాయి.** వి. (సం. సురా. క. సారాయి. తి. మ. చారాయి) మద్యము.

తే. కమ్మసారాయికై సంచకర మొసంగుఁ, జిత్తజాయత్తుఁడై కాపుచిన్నలాడి. కుక. ౨-౪౩౪.

**సారా(యి)** సారాయమునొక్క రూపాంతరము

**సారాలము.** సం. వి. అ. పుం. నువ్వు,తిల

**సారి.1** వి. ౧. యుద్ధయాత్ర.

సీ. నానుమూపులను మాపురెపసిన కోయసరదార్ల కెల్లను సారెఁజెప్పి శశాం. ౪-౮౬.

వ. కంసారి మానవు సారి వెడలినదాని దుము దారిగా కేగంటిదనే దారి రాజపమ్మనగు మీసరమ్మున. ప్రబం. ౧-౬౦౫.

సీ. సారిగా నీ వొక్కసారి గాటపువీధి మూరు చోఁబోదలఁ బోదూరురిపుఁడు. అహల్యాసం. ౧-౩౨.

౨. వేఁట.

తే. సామి శా విన్నపము విని సారి వెడలి, మొక్క మలచెంతగడె తిరవున్న జాలుఁ, దెందు దెం డాడి మెకముల బెండుపఱచి, దేవరకు కెక్కఁబట్టింతు దేవుడాన. కుక. ౧-౧౫౭.

3. చక్రము (కుమ్మరివానిది)

సీ. బలభేదికరి... ....చిట్టిన సారెవోలె నొక్క గోరఁదిరిగె. కుమా. సం. ౧౦. ౪౩౧.

చ. కర మవిచారి తద్దయు వికారి మనంబది సారెవోలెసే, దిరిగెడుఁ గాని నిల్వదకట. కుమా. సం. ౬-౭౦౪.

**సారి.2** వి. తూరి, తడవ.

వ. ఒక్కొక్కమాఱు విభూతపత్త్రియు, నొక్కొక్కసారి యూర్ధ్వాయన దుర్విభావంబును. శృ. నై. ౨-౩౫.

ద్వి. నీ బొద్దమునాలున నీ నిరోగంబు, సభయును నీవు నీ సారి నూడుఁడు. పండితా. మహిమా. ౨౫౨.

సీ. ఒడిమీఁద నిడుకొనియురముపైఁ జేర్చుట చేరికదికడసారియేమొ. ఉ.రా. ౬-౩౦౨.

**సారి.** సం. విణ. న. త్రి. న. ౧. నడచునది. ౨. సారముగలది.

**సారి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. పాచిక ౨.పక్షి విశేషము.

**సారించు.** సం. స. క్రి. ౧. చాఁచు

సీ. కేలు సారించి ఝంకించి యుఱ్ఱల్లనపట్టినఁగుబు చలబాతి కెమగు. చిత్రభార. ౪-౩౬.

వ. అత్తికంబులు కత్తికంబులువానిచేఁ బూని చియు సారించియుఁ బరశువులు పరశూగుల కొసంగియు నెంగిటయు. ఉ. హరి. ౬-౫౦.

వ. వింశతి కరంబులు సారించి పాలంకరించి. ఉ. రా. ౩-౭౭.

క. వాఁడు రంగస్థలమునఁ జేఁ తరంగంబులనెసు కెట్టులు పైపైఁ, బోరంగ నడుమ బలు ప సారించి ధరణి వెలఁగెన్. వాల్మీకి. ౨-౧౦

౨. త్రిప్పు, ఆడించు.

మ. గద సారింపుచు సంఖ్యకాల విచలత్కాలాకృతిన్ భీముఁడు. భార. ఉద్యో. ౨-౧౩౭.

మ. కవిసెన్ గుంతభుశుండితో మరకతా ఖడ్గాది శస్త్రాస్త్రతీవ్రవిహారంబు విరోధి దుర్విషహ సంరంభంబుగా నొక్కపె, ట్టవడిం దవ్వుల మెల్ల వారముఁడు చెక్కం గుంచె సారింపఁగన్. భార. విరా. ౨-౧౧౧.

3. ఆకర్షించు, లాగు.

సీ. సారసారకులీల సారించు మార్గ్యాలు, పటుతటిల్లతలఁపగిది గాఁగ. భా. రా. సుంద. ౩౬౯

౪. సరిదీయు, చక్కఁజేయు.

సీ. జవ్వాదిఁ బదనిచ్చి సారణుల్ సారించి బిరదలు చక్కనొత్తి. వాల్మీకి. 3-౧33.

వ. గుణంబు సారించి మార్గణంబు విగిడించి. మార్క. ౨-౩౩౫.

౫. ప్రయోగించు.

ద్వి. ఆ రాక్షసునితోడ నిఖిలాయుధములు, సారించి విడువక పరిపోరి పోరి.
రం. రా. ఉ. కాం. ౪౭ పు. ౨౫ పం.

౬. వెలిగొల్పు; ప్రసరించు.

క. ఏ పనులకు దీపము దగు నీ పనులకుఁ దగ దటన్న నింతియిట్లులనెన్, దీపము మనసందు చీర తెర సారింతున్. వైజ. 3-30.

౭. తెరుచు.

క. ఈ కోటకు నాలుదిక్కుల వాకిలి సారించి. ఉ. హరి. ౨-౬౩.

క. ఈ కోటకు నాలుదిక్కున, వాకిలి సారించి యానవాలుగఁ జారుల్, రాకలఁ బోకలఁ జక్రముఁ జేకొని రక్షకులతోడఁ జెప్పిచనఁ దగున్. ఉ. హరి. ౨-౬౩.

౮. మెదుపు.

సీ. మృగమదపంకంబు మృదువుగా సారించి తిలకంబు పెట్టుడుఁ జెలువు మిగుల.
భార. విరా. ౧-౧౦౪.

౯. విసరు.

వ. కాంచనగర్భ సంభవుండు నిర్భరాహ్లాదంబునఁ గుంచె సారించి యింతకాలంబునకు.
వరాహ. 3-33.

౧౦. ప్రసరింపఁజేయు; పఱపు.

మ. కేవల రాద్రోత్తులఁబల్కుఁజన్న పితరుల్ వాచింతురే మీరు బిడ్డల మీదన్ కృపనివ్వ టిల్లు కరకంటం జూడ్కి సారింపఁగన్.
రంగా. ౨-౯౮.

సారిక, సం. వి. అ. స్త్రీ. పక్షివిశేషము.

సారిక, వి. (సం. చర్చరిక. త. చారికై) నాట్య విశేషము.

సారికలుగొను, అ. క్రి. వర్తించు.

వ. శారికలెత్తిన కోరికలు సారికలుగొన నాసం గుచు. భాగ. 3. ౫౦౪.

సారిణి, సం. వి. ఈ. స్త్రీ. తూర్పరాకి. (పటాలిక)

సారిఫలము, సం. వి. అ. పుం. జూదపుఁబలక.

సారు, వి. నాట్యగతిభేదము. అం. భా. ౧-౧౩౦.

సారుగా నేలపైఁజమరువారు
-కుమారసం. ౧౨-౧౦౫.

సారు, వి. ద్రవపదార్థము. (త. తు. సా ఱు. క. సారు=చారు)

సీ. గజయూథముల ...... దనుజాలఁబ్రభుపాద తలహతి వడిఁజంపి సారుగా నేలపైఁజమరు వారు.... కుమారసం. ౧౨.౧౦౬.

సారువ, వి. 1. సోపానపంక్తి (?)

వ. అదియును బరంబు .... బహు ప్రకారంబు లైన సారువులనుం జేసి యొప్పుచు.
భార. ఆది. ౪-౧౭౬.

౨. అడ్డకట్ట.

క. ఆరీతి సేనపోరగఁ హేరాళము రక్తనదము లీఁదఁగరామిన్, సారువగట్టిన్ వివిహిత, వైరిమహీభృత్కబంధవారము చేరన్.
చంద్రా. ౬-౧౦౯.

సీ....అధిప! యిది మానికపుఁగోనయది లతాంత రజము సారువ యిది కప్పురంపుటనఁటి, చప్పరంబిల్లయది కాంతసదనము.
వసు. ౨-౫౨.

సారువ=మేరువ-బరువగువస్తువులను పైకెక్కించుటకు పాదవుగా మట్టితోఁ బోసిన మేరువకు సారువ అనిపేరు. అనివ్యాఖ్య.

లయగ్రాహి. ఓరఁ గైవ్రాలిన మేకపుల ఫుప్పాడుల సారువుల వెంట సహకారమిళ దేలా, ధారముల జారు హిమవారి కలిత సారణులు. వసు. ౧-౨౨.

3. దిబ్బ.

ఉ. అమ్మపరాకు పోక వనమల్లెద తల్లని మల్లి కాగ్రముం, జమ్మిదెకప్పురంపనఁటి సారువ లివ్వ రసాల సాలము, గమ్మని పువ్వ దేని

యలకాలువ పొన్నదయ్యెక్కంటినే, నిమ్మల చాయ గొజ్జఁగులనీటఁదొలంగు దొంటదశోదరి! రాజవాహన. ౩-౮౩.

వ.... తండతండంబులగు వేదండంబుల తొండంబుల పెండెలం దగిలినం గదలనేరని తురగంబులపై పులంగి దంతంబుల కొలందికిం దరువలి కత్తులం దుత్తుమురుగా మొత్తి విడిపించు రవుతులు దేరుల గముల చేరువల సారువలు గట్టు వారువంబుల. ఉ. హరి. ౪-౨౨౪.

సారువా. వి. వర్షాకాలమందు నీరాసరాను పండెడు పల్లపుపంట. (శ. ర.)

సారూప్యము. సం. వి. అ. న. ౧. సమాన రూపత్వము. ౨. దేవతరూపము వంటి రూపము పొందుట. (చతుర్విధముక్తులలో నొకటి)

సారె. వి. ౧. తడవ. పర్యాయము.

శా. ఏమీ పార్థుఁడు నీవు దండిమగవై యీవచ్చు కౌరవ్య సంగ్రామ క్షోభము బాహాదర్పమునఁ దీర్పం బెద్ద మిక్కిలిన్, మెల్లన్ పెంపఁగంది చూచెదము గాక సారెకుం బోయిరా, భీముండిత్తతి కత్తమాటలకుఁగోపింపండు నూ పెంపటున్.

భార. ఉద్యో. ౩-౬౫.

౨. (సం. శారి) జూదమున నుపయోగించు పనిముట్టు, సొగటాలకాయ, పాచిక, జూదమాడెడు నిడుపాళ్ళు.

వ. సైరంధ్రిం గనుంగొని సారెలు దెమ్మని పనిచి భార. విరా ౫-౨౪౪.

వ. సభామండపంబునఁ గూర్చుండి పలకయు సారెలుం దాచికలును దెప్పించి క. ద్యూతమునకు బలభద్రుని, భీతి సమేతంబుగాఁగఁ బిలుచుటయుం. హరి. ఉ. ౩-౨౨౮.

సీ. శేగిణి గొనరి పైనిడబెట్టి పలకపై సారెలు వోయించి పరమఁజూచి ఉ. హరి. ౩-౧౨౦

౩ [illegible]

సీ. చెలిచేతి వీణయు చేనంది గవిసెన సడలించి సారెలు చక్కనొత్తి. చిన్నవి. ౨-౨౩౫.

ద్వి. రాగసంగతులకు రా సారెలొత్తి. హరిశ్చ. పూర్వ. ౯-౫౦.

సీ. చెలియ తెచ్చిన వీణఁ గొంకేకనంది, కొని మెఱుఁగు గవియఁగ గవిసెన యొదల్చి, తీఁగెలు బిగించి సారెలు దిద్ది శ్రుతులు, గూర్చి యుత్తర తుంబిక కుచముఁజేర్చి.
చిత్రభార. ౩-౩౩.

౪. చక్రము, కుమ్మరివాని చక్రము.

క. ఒకసారె యొడు తేజాలు విశలాంగుఁడు నూకుఁదనిల వీధి తెరువుగా. ద్వా. ౫-౮౩.

సీ. విష్ణువు చక్రంబు వేడుకఁద్రిప్పెడు చాట్పునఁ బలుమారు సారెద్రిప్ప. హంస. ౫-౯.

తే. ధాత్రికుమ్మరి సారె విధమునఁదిరిగె.
భార. ఉద్యో. ౪-౧౧౬.

శా. రాకెం జక్కలు గుబ్బలున్ వగిరె సంద్రింబుల్ గలంగెన్ వడిన్, కేలం గుమ్మరి సారె త్రొక్క దిరిగెన్ విశ్రకన్ దసల్ దీకుచే
యయా. ౨ ౬౬.

౫. భక్ష్యవిశేషము.

ఉ. గారెలు బూరెలిడ్డెనలు గమ్మని దోసెలు జక్కిలంబులున్, జారులు గూరలున్ ఫలరసంబులుఁ దేనెలుఁ బానకంబులున్, సారెలు చాయపాన్నములు. సానందో. ౧. ఆ.

౬. గోరువంక.

కం. సారెయుదపాదవు మని యొక, సారెయొకతె యత్నకేళిసమయంబునని చ్చారతి నొకతెకుఁ జెప్పిన సారెకనకపంజరమున సాధ్యసముండెన్. శృం. నై. ౩-౧౦౩

౭. మేనత్తవారింటి కనుపునపుడు పుట్టింటి వారిచ్చు అరణము. ౯లు|| ౮. పగడ పాలకాయ (శ. ర)

సారె.² అవ్య. మాటికి

సీ. గోరంబుగా సారెగుంటకన్నులు దిరిప్ప
కుక. 3-౩౪.

(ఇది షష్ఠ్యంతమై యామ్రేడితార్థకమున వాడఁబడును. సారెకున్ సారెసారెకున్, ద్వితీయాంతమయి కూడ నిట్లుప్రయోగింపఁబడినది)

క. వలవని మాటలు సారెం బలుకం బనియేమి
విప్ర ౨-౭౧.

చ. జగాతివాఁడిపై, సకియలు గొల్వ నిండుమతి సారె మనోజ కరార్తిఁగాగ్రఁగన్.
ఇందు. 3-౭౦.

చం.......ఘటఘట ధ్వని సారె మలంగి చూచుచున్.
అము 3-౭౭.

ఉ. నా, సారవచో విజృంభణలు సారె వినందగు నంచు నిట్లనన్. ఉ. రా. ౧-౧౬౪.

సారెకు, అవ్య.మాటికి. సారెసారెకు అని ద్విరుక్తముగను షష్ఠ్యుక్తముగను దఱచుగ వాడఁబడు.

క. ద్వారక వైకుంఠపురం బీ, రుక్మిణి లక్ష్మి మీరలిచ్చట నునికిన్ సారెకుఁ గొల్వఁగ వస్తున, గోరికతోఁ గంసహర ముకుంద మురారీ! పారి. ౧-౫౧.

వ. సారెకున్ దారకల నీరికలెత్తు పొంగరన.
మను. 3-౯.

(ఆ మ్రేడిత మగుచో సారెసారెకు లేక సారెకు సారెకు.)

ఇత్తెఱంగుఁజెప్పఁదలంచిన సారెసారెకుం గిలికిలలాడుచున్. నీలా. ౨-౭౧.

ఉ. నూతన మానసోత్సవ వినోదపరిక్రమ ఖిన్నులై నయ.జ్ఞాన ముఖీ నృపోత్తముల సారెకు సారెకు నేడఁదేర్చు. విక్ర. ౩-౧౧౫.

సారెస(సె)త్తులు. వి. భక్ష్యవిశేషములు, జంతికలు.

వ. చంద్రకాంతంబులు మణితలు సారెసత్తులు చలువ మజ్జిగ లెల్ల నీరు కొంతికపాయంబు మొదలుగాఁగల నిఖిలభక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయాదులు. ప్రబం. ౧-౧౦౨.

సీ. వడలు మండెఁగలుండ్రములును ఫేణీలును సారెసత్తులు సొజ్జె బూరియలును.
బ. ప్రభులింగ ౫-౭౨.

గీ. హంసడిభకులు రాజునూయంబు చేయమనము గప్పంబుఁగొని పోక మంచిమాట, సేఁదు సారెసత్తుల మొనల్ వాఁడి చేసి, నోరి, చారవ భూతేశుండు వారిఁజెతిచె.
ఉ. హరి. ౪-౧౫౩.

ద్వి. వడలు మండెగ లర్ప్యములు ఫేణీలు, కడు మెత్తనగు పాలగారెలు సారె, సెత్తులు నవుగులు చిమ్మిటుండలును.
ప్రభులింగ. ౪-౧౫౦. ప్రుట ౨౨ పం.

సారోష్ట్రికము, సం. వి. అ, పుం. ఒక విధమైన విషము.

సార్గలము, సం. విశే. అ. ఆ. అ. ౧. అడ్డగింపఁబడినది. ౨. నిరోధింపఁబడినది.

సార్జంతు (ఆం. సార్జంట్) వి. సేనాధికారులలో కొకఁడు,భటులమీఁది యధికారి.(క.ర); జాతి బంట్రోతు. ( బ్రౌ )

మ.సమరోజ్జృంభిత శౌర్యధుర్యులగు సార్జంతుల్ మయూరుల్ కుమందములున్ వీరులు సోలు దారులు సుబేదారుల్ మొదల్గల్గుసైన్యములు
రంగా. ౧-౧౪౩.

సార్థకము, సం.విశే.అ. ఆ. అ. ౧. అర్థవంతము ౨. ప్రయోజనవంతము. 3. ఫలవంతము, లాభకరము.

సార్థము, సం. విశే.అ. ఆ. అ. ౧. అర్థముగలది, ౨. ప్రయోజనము గలది.సమానార్థకము ౪. ఉపయోగకరమైనది.౫.ధనవంతము; సంపన్నము.

సార్థము, సం. వి. అ. పుం. ౧. ధనవంతుఁడు ౨. వర్తకసమూహము. 3. మనుష్యసమూహము ౪. ఒకే జాతికిఁజెందిన జంతువులగుంపు. ౫. సమూహము, గుంపు ౬. యాత్రికుఁడు.

సార్థవంతము, సం. విశే. త్ .తీ. త్, ౧. అర్థముగలది. ౨. సహాయసంపద గలది.

సార్థవాహుఁడు, సం. వి. అ. పుం. ౧. వణిక్స మూహనాయకుఁడు. ౨. వణిజుఁడు.

సార్థవాహుఁడు, సం. విణ. ౧. ముఖ్యుఁడు. ౨. నాయకుఁడు "కురు మా మంబ కృతార్థసార్థ వాహం"

సార్థికుఁడు, సం. వి. అ. పుం. వర్తకుఁడు, వణిజుఁడు.

సార్ద్రము, సం. విణ. అ. అ. అ. తడిసినది, తేమ గలది.

సార్ధము, సం.విణ.అ.అ. అ. సగము పెరిగినది.

సార్ప (ర్ప్య) ము, సం. వి. అ. పుం. ఆశ్లేషా నక్షత్రకూటమి.

సార్పిషము, సం. విణ. అ. ఈ. అ. నేతితో వండఁబడినది. (రూ. సార్పిష్కము)

సార్లా, విణ. అనుకూలము, సఫలము (శ. ర)

సార్వకామికుఁడు, సం. విణ. అ. ఈ. అ. సర్వకామములు తీర్చునది.

సార్వకాలికము, సం. విణ. అ. ఈ. అ. శాశ్వతము, నిత్యము.

సార్వజనికము, సం. విణ. అ. ఈ. అ. సర్వ జనులకు సంబంధించినది.

సార్వజనీనము, సం. విణ. అ. ఈ. అ. సార్వ జనికము.

సార్వజ్ఞ్యము, సం. వి. అ. న. సర్వజ్ఞత్వము, అన్నియుఁ దెలిసియుండుట.

సార్వత్రికము, సం. విణ. అ. ఈ. అ. సర్వ ప్రదేశములకును సంబంధించినది, అన్ని సందర్భ ములకుఁ దగినది.

సార్వధాతుకము, సం.వి.అ.న. లట్, లోట్, లఙ్, లిఙ్, లయందు ధాతువునకుఁ జేర్పఁబడు ప్రత్యయములు.

సం. విణ. అ. ఈ. అ. వికరణ ప్రత్యయాదులు చేర్చిన పిమ్మట చేర్పదు క్రియాప్రతిపదికకు సంబంధించినది.

సార్వభౌతికము, సం.విణ.అ.ఈ.అ. ౧. సర్వ ప్రాణులకు సంబంధించినది. ౨. పంచభూతము లకుఁ జెందినది.

సార్వభౌమము, సం. విణ. అ. ఈ. అ. సర్వ భూమికిని సంబంధించినది.

సార్వభౌమము, సం.వి.అ. పుం.ఉత్తరదిగ్గజము పేరు.

సార్వభౌముఁడు, సం. వి. అ. పుం. ౧. సర్వ భూమండలాధిపతి, చక్రవర్తి, సమ్రాట్టు.
(సర్వభూమి పృథివీభ్యామణ ఞా. ౫.౧.౪.౧. పాణి. సూ. సర్వభూమేర్నిమిత్తం సార్వభౌమ అను శతికాదిత్వా దుభయపదవృద్ధిః)

చ. ధర్మజాం.దలఘుఁడు యావరాజ్యయుతుఁ డయ్యును బెంపున సార్వభౌముఁడై.
భార. ఆది. ౭-౬౨.

౨. అహం యాతియనువాని పుత్రుఁడు.

సార్వము, సం. విణ అ. ఈ. అ. ౧. సర్వము నకుఁదగినది.

సార్వము, సం. వి. అ. పుం. సార్వుఁడు; బౌద్ధ సన్యాసి.

సార్వవేదసుఁడు, సం. వి. అ. పుం. యాగము నందన సర్వస్వమును దానము చేయువాఁడు.

సార్ష్టి, సం. విణ. ఇ. ఈ. ఇ, ౧. తుల్యబలము గలది. ౨.తుల్యావస్థ యందున్నది. ౩.సమానాధి కారము గలది.

సార్ష్టిత, సం. వి. ఆ. స్త్రీ. ౧, తుల్యబలత్వము, సమానాధికారము. ౨. ఈశ్వర సామ్యము, సా యుజ్యము.

సార్ష్ట్యము, సం. వి. అ. న. సాయుజ్యము.

సాల. సం. వి. ఆ. స్త్రీ. ౧. గోడ, వప్రము, ప్రాకారము. ౨. గృహము.

సాల. వి. (సం. శాలా. క. సాలె. త. చాలై) ౧. ఇల్లు-పాటకశాల, గుఱ్ఱపుసాల, వంటసాల. ౨. చావడి-మొగసాల, కొలువుసాల; జన్నసాల వడి జన్నసాల నివాసంబుగొని- ౨-౬౬.

సాలంకలు. వి. బ. ధాన్యవిశేషము.

సీ. సాలంక లలుగు రాజనములు సంభావులవసర దార్లు మోహనపుసరులు. హంస.౪-౧౨౮.

సాలంకారము. సం. విశే. అ. ఆ. అ. అలంకారముతోఁ గూడినది.

సాలంకృతము. సం. విశే. అ. ఆ. అ. ౧. చక్కఁగా నలంకరింపఁబడినది. ౨. అలంకారములతోఁ గూడినది.

సాలకటంకటేయుడు. సం. వి. అ. పుం. శ్రీమద్రామాయణోత్తరకాండమున బ్రసిద్ధుడగు నొక రాక్షసుని వంశమునఁ బుట్టిన వాఁడు; రాక్షసుఁడు.

మ. అనిన సాలటంకటేయుండు సాల కటకటం బడి— ఆము. ౬-౬౬.

సాలకరి. సం. వి. న. పుం. ౧. ఇంటిపనివాఁడు యుద్ధమున బందీగా గొనబడినవాఁడు.

సాలగ్రామము. సం. వి. అ. పుం. విష్ణుమూర్తి చిహ్నిత శిలావిశేషము. విష్ణ్వాత్మకమైన గండకీ నదియందలి శిల. "సాలగ్రామము మున్నగాఁ గొనఁడు.... మనుచ. ౧-౫౫.

సాలనము. సం. వి. అ. పుం. ౧. సాలవృక్షపు బంక.

సాలపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. మయ్యూరు పొన్న ỉ

సాలపోతకుఁడు. సం. వి. అ. పుం. ఒకసర్ప రాజు.

సాలభంజిక. సం. వి. ఆ. స్త్రీ. వస్త్రదంతకాష్ఠాదుల చేత చేయఁబడిన బొమ్మ; పుత్త్రిక. "శిలాఁభంజనిరై యపుడు సాలభంజిక పలికెన్ సింహా. ప్ర. భా. అ. ౨. ౬౧.

సాలము. సం. వి. అ. పుం. ౧. మద్దిచెట్టు ỉ

సీ. తే. దావపావక ఘనశిఖాదగ్ధశాల, సాల సంకాశమగు పిశాచద్వయంబు. ఉ. హ. ౨-౧౨౨.

౨. మద్దిబంక. ౩. చెట్టు ỉ ౪. గృహావరణము; ప్రాకారము. ౫. గోడ. ౬. ఒకవిధమైనచేప.

సాలమిశ్రి. వి. ఒక మందు దినుసు.

సాలారము. సం. వి. అ. న. గోడలో బిగింపఁబడిన చిలుకకొయ్య.

సాలావృకము. . సం.వి.అ. పుం. శాలావృకము. ౧. కుక్క. ౨. కోఁతి. ౩. తోఁడేలు. ౪. నక్క.

సాలియ. వి. సాలె, నేఁత నేయువాఁడు.

ఉ. దాంతదశం గృశియించి యిచ్చలో కేసరి నిర్చె సంజకద వేటాని సాలియవాని లోఁ గిటన్. పంచతం. ౧-౬౧

సీ. సాలీఁడు గాఁబోలు సమద వేదండంబు తెలి నారచీరలు దులిచితెచ్చె. కువల. ౨-౬౩.

సాలీఁడు. వి. (సాలె+ఈఁడు) సాలెవాఁడు.

గీ. నేఁపయుద్ధ మధ్యంబున మెలఁగి యొక్క, శివయు సాహసభూతిచేసిద్ధ మునియుఁ దొడరి సాలీనిచేత మాతికయును, శాత్మకృత దోష మున గాఁడ హానిఁబడిరి. పంచ. నా. ౧-౧౬౪.

౨. సాలెపురుగు

సీ. చెవిగూట వెలకొన్న కవపిట్ట కవకవల్ మొనసి నాదబ్రహ్మ మినుమడింప, మైనిండు సాలీని మగ్గంపుఁ జకచకల్ బూదిపూఁతకు రట్టుపుట్టసేయ. చంద్రాంగ. ౩-౭౯.

క. బోయయు సాలీఁడును మా, కాయజహరుఁ గొలిచి ముక్తిఁ గాంచిరె గాదే. శివతత్త్వ ౧౩౨ ప.

సాలీయానా, హిం. విశే. (రూ. సాల్యానా) సంవత్సరపు. (శ. ర)

సాలు, వి. రాంకవము.

సీ....ముత్యాల మొలనూలు ముదురుచందురు కావిజిలుగు సాలామీఁదఁ జెలువు మీఱ
భాను. ౪-౭౨.

౨. సాలువ; శాలువ; ఉన్నితోఁ దయారైన వస్త్రోత్తరీయము. ఏమేలు సరిపెనో హుంబట్టు సన్నసాలు. నీలా. ౧-౧౦౯.

౩. సన్నని వస్త్రము.

చ. జిలుఁగగు శాలిసామములు చెంపల గందము లోరపాగలున్, వలిపపుసాలు వింతవలె వాటులు లాగులు రావిరేకులుం, గలిగిన గుజ్జరూపములు. సారంగ. ౧-౧౧౬.

సీ. వలుప బంగరు సాలు వలెవాటుగా వైచి కేయూరహారము ల్గీలుకొలిపి.
కవిజనరం. ౩-౧౧.

వ. బూరగొమ్మ్రగల తుపాని, జారువాసాలు కాలుపు జియ్యే ప్రబం. ౧-౭౬.

ఉ. శుభరేఖవ్రాసి కై చెంద్రికపెట్టి యందుప యిఁకెంద్రిక పన్నియసాలు సుట్టిని,స్త్రం(దరఁ దానె ముద్రయిడిచారులచేఁ బనిచెన్ రయంబునన్. విజ. ౩-౧౩౧.

సాలు, హిం. వి. ఏడాది, సంవత్సరము.

సాలువ= సాలు. (త. చాల్వై. క. శాలువె) వి. ఉన్నివస్త్రము; ఉత్తరీయము.

క.నందనము వెడలి పయనపు టందముగ జవాది పూఁతలలంది తోడవులుం, గుందనపుటంచు వగజిలు, గుం డలిసాలువలు జారుగొప్పులు నొప్పన్. (ఇది రంభోర్వశుల శృంగార వర్ణనము). వాల్మీకి. ౩-౭౯.

సీ. నీలి సాలువ మీఁదఁ గీలుకొల్పినయట్టి వెల వంక కత్తుల తళుకులెసఁగ,
చిత్రభార ౩-౧౨౫.

౨. సన్నవస్త్రము.

సీ. తనుకాంతి గనుపింపఁదనరు నంగీ జోడు. వలిపెంపు సాలువపల్లెవాటు. కుక ౨-౪౨౬.

౩. తృణభేదము.

తే.గీ. తొల్వరంటిద్రింక సాలువ యుప్పుగడ్డి, పరికమల్లూచి మొలయము బైటి తుంగ, మొదలుగాఁ బూరిదవలింపఁ బోదలు వెదలు
ప్రబంధ ౧-౨౧౧.

సాలువు, వి. సాలువ.

సాలుసరి, హిం. విశే. ఏడాదికి సంబంధించినది.

సాలూరము, సం. వి. అ. పుం. (రూ. శాలూరము) కప్ప; మండూకము.

సాలె (లియ) వై. వి. (సం. శాలికః ప్రా. సాలిఓ. క. సాలిగ.) బట్టలు నేసి జీవించు జాతి.

వ....అప్పేటి మేటి సాలెయగసాలె పటుసాలె. వానె వైజాతి సాఁతు కోసుల కోమిరెలు తుములమై........ ఆము. ౪-౩౫.

సాలెత, వి. తంతువాయస్త్రీ, సాలెజాతి యాఁడుది.

ఉ. ఆ, బాలిక కాలికమ్మ్ర కొన బట్టలు నేసెడి వానికిచ్చె హా,సాలెత గామరా కుసుమ సాయకు పట్టపుదంతి యింతియే.
వీధినాటకము ౭౬ ప.

సాలెపట్టు, వి. ౧. సాలెపురుగు నేసిన నేత. ౨. ఆకాబంధము. (శ. ర.)

సాలెపురుగు, వి.బొద్దునందలి నూలు విడిచి నేత నేసెడి యొకపురుగు; తంతువాయము.

సాలెవాఁడు, వి. నేతనేయువాఁడు.

సాలేయము, సం.వి. అ. న. (రూ.శాలేయము) వరిచేను.

సాలోక్యము, సం.వి.అ.న. ౧.తుల్యలోకమునం దుండుట. ౨.ఇష్టదేవత యున్నలోకము నందుట (చతుర్విధ ముక్తులలో నొకటి)

సాల్వఁడు. అ. కి. (సాలు+వడు) (చూ. చాల్వడు) చీలిబారులకట్టు

మ.... వారిద, ప్రకరుల్ సాల్వడ ధార. ఆది. ౨. ౦౦౧.

ఉ. మహామారుత మస్థిచేసె....ధరి, శ్రీరమా కాభులన్ వితిగి శ్రేళ్ళఁగ గుల్మలతాలి సాల్వడన్. భార. అర. 3. ఆ.

3. ధారగాఁబ్రవహించు

చ. అని మొన విశ్వభూవిభుని హస్తకృపాణము చంద్రహాస మ, య్యను మతి చిత్రిభాను వన

సజ్జ్వల మయ్యెడు చోట నప్పుడు వనితల చున్నులం బులుకవర్గము వెళ్ళఁను వైరి ధీరులో, చనమ లవఱ్రివారములు సాల్వడు నందును నిండునుం బోఁడ్.
కావ్యా. ౫. ఉల్లా ౧౨ ప.

సాల్వఁటుచు. క్రియ సాల్వఁడు.

చ. ప్రతిబలిబాహ్ని బాడబము భంగి దహించును రాముబోలిఁన్, శితశరధారి సాల్వఁటుచు.
విక్ర. ౬. అ. (క. ర)

సాల్వహుఁడు. సం. వి. అ. పుం. సాల్వఁడను రాక్షసుని జంపినవాఁడు, విష్ణువు.

సాల్వికము. సం.వి.అ. పుం. ఒకవిధమైనపక్షి.

సాల్వుఁడు. సం. వి. అ. పుం. ౧. రాక్షసుఁడు. ౨. సాల్వదేశపు రాజు. 3. సాల్వదేశస్థుఁడు. ४. శిశుపాలుని తమ్ముఁడు.

సాల్వేయుఁడు. సం. వి. అం. పుం. నిశంతుని కుమారుఁడు (కూరపేవాడులయన్న)

సాళఁగనాట. వి. ఒక రాగవిశేషము. పండితా. ౨-४౫౫.

సాళగము. సం.వి. అ. న. తిలతండుల న్యాయమున నయిన రాగమేళనము.

ద్వి. లాలిత శుద్ధ సాళగములు బెరయఁ, గాత్రి లుచు దేశిమార్గఁబులు వెలయ.
బస. పురా. ८౧. పు. ౫. పం

క. క్రమ మొందనాథటా వళి,గమకము గా శుద్ధ సాళగములను సం, కీర్ణములాగి పుంఖింపఁగ మం,ద్రము మధ్యము తార మక్కువాదరమీఁటన్.
సమీర. ౬-౨౦౫.

సాళగించు. సం. అ. క్రి. (√సాళగము) మిళితముగు, కలియు.

వ. కమ్మకసింది గంధంబుదోడం దార్కొను నేలకుల పొరథంబులును, నేలకుల పొరథంబులతో సాళగించు కాలాగురు కురంగనాభి కర్పూర గంధసార నీహారావాః పూరంబుల వలపులును.
కాశీ. ౭-౧౯౫.

ఉ. ప్రా,దేశిక మంగళ్ప్రమువలు వీనుఁలకింపుగఁ బాడి రంగవల్, దేశివిధంబు మార్గమునఁ దేటయు నొక్కట సాళగింపగన్.
కృ. వై. ౭-౧౬.

ద్వి. చిఱునవ్వు వెన్నెల జిగిసెలయించు మోవి వెన్నెల సాళగించు. ద్వి. పరమ. ౨-౫౯.

సాళగింపు. √గించు. వి. కలగలుపుఁదనము, మేళనము.

సీ. కేరడంబులు సాళగింపులు. కిల్బిషాక్రీడం బులు నడకించువగలు.... దుర్గుణంబుల ప్రోవులు ద్రోహమతులు, వారకాంతలఁడడవిన వచ్చుఁగీడు.
పాండురంగ. 3-४3.

సాళి.వి. రాగములలో నొకటి,స్వరసాయి భేదము.

ద్వి. సాళి పెళ్ళాపెళ్ళి జాయను జాలు, ఉచిత మొయ్యారంబు నొగిఁబంజళంబు.
బస. పురా. ८౧ పు. ౧ పం.

సాళించు. స. క్రి. బలియిచ్చు.

వ. దేవిచేరువ గమ్మని ముందట నిడి తలంగిన ఆమె మెచ్చుగాక యిట్టి మేకము సాళించెద, ననుచుఁజండి మంత్ర మొనరజెప్పి, పూజకుం డొకండు భూమీశుతలఁద్రెంప, బెడిదమైన వాఁడి యడిద మెత్తె.
ద్వా. ౧౧-30.

సాళియలు. వి. బ. వస్త్రవిశేషములు, అంగదట్టములమీద కట్టికొనినైఁటలు.

ఉ. చందురుకావిపావడల జాజిపిఱుందులఁజెందు
ద్రొక్కఁగాఁ గందపుసాళి పాళియలఁగట్టి
దాటులఁ బెన్నుగు కీలుజడల్ నటింపగా,
సుందరులందఱున్ వనము సొచ్చి చలన్మణి
నూపురంబుగన్. వాల్మీకి ౩-౧౧౨.

సాళువము. సాళ్వము వి. శ్యేనవిశేషము, ఒక జాతిడేగ.

తే. విజయ విఖ్యాత గుండభూవిభునృసింహ, సార్వ
భౌముని బిరుదైన సాళువంబు
జై. భా. ౧-౪౫.

చ. మట్టికాసెలన్, బిడియములంటదోఁపి పృథు
భీషణ బాహుల సాళువంబులన్, ద ద వి
శేరల్ప్చుచున్ జనిరి సాధునిమ్రోల నృపాల
నందనుల్. మను ౪-౩౦.

తే. గీ. మృగయులంతటఁ దెచ్చిరి లగుడుగిడు
జాలె జలకట్టె కణుజాశేసదము బైరి, కురుజా
వారిణయను డేగ కోలము సాళు, వములఁ
బిలుపుచు వేఁటకు వచ్చువాని.
పి. శకుం. ౧-౧౧౦.

౨. వేఁటకుక్క కియిబడిన పేరు.

సీ. గీ. పుణ్యతీర్థంబు చేమంతి పోతురాజా, సాళు
వము వాఁగఁ శేర్వడ్డజాగిలములు.
రామేశ్వరమా. ౫-౭౮.

౩. పందెపు కోడిపుంజున కియ్యఁబడిన పేరు.

ఎ. గీ. కూలము పిరంగి తెలివక్క సాళువంబు
కాళరాత్ర్యంతకుఁడు కందగాండ్రు మెచ్చ
లరెడు పేరుల పుంజాలగాని మిగించి.
హంస. ౩-౨౧౫.

సాళ్వము. సాళ్వుఁడు=సాళువము వి. ౧. ఒక జాతిడేగ.

క. నా చిన్ని ముద్దుకూఁతురు, నా చక్కని తల్లి
వీధివడయాడఁ గన, న్నిచు కొనిపోయె సాళ్వ
ము, రా చిలుకంగొంచుఁ బోవుక్రమమునఁ,
దండ్రీ! రాజశే ౨-౩౧.

ద్వి. మువ్వల గిలిగిల మొఱయజాడించి, క్రొవ్వున
నుప్పొంగు కొమరు సాళ్వములు.
అ. మ. క. ౫ ఆ. ౨౨౧ పు. ౨౭ పం.

౨. తృణవిశేషము.

ఎ. గీ. పాలిక పెసు కెడ కుండేటి పొరజాగరక
పరికి సాళ్వముసొంటు కుందురు గరిమిడి.
హంస. ౫-౪౫.

సావకము. సం. విణ. అ. ఆ. అ. ప్రసవించునది; ఉత్పాదించునది; పుట్టించునది.

సావకము. సం. వి. అ. పుం. జంతు సంతానము. శాబకము.

సావకాశము. సం. విణ. అ. ఆ. అ. విశ్రాంతి గలది; తీరికగలది వీలుకలది;

సావజ్ఞము. సం. విణ. అ. ఆ. అ. అనూయ గలది; ద్వేషముగలది, తిరస్కారముగలది.

సావద్యము. సం. వి. అ. న. యోగిసాధించు సిద్ధులలో నొకటి, ఐశ్వర్యము (నిరవద్యము సావద్యము సూక్ష్మము, యోగసిద్ధులు).

సావధానము. సం. విణ. అ. ఆ. అ. ౧. చిత్తైకాగ్రతి గలది, శుద్ధిగలది. ౨. అప్రమత్తమైనది

క. అనురక్తి సావధానం, బనుచుందెరఁబట్టికొని
మహాసంకల్పం, బవఘమతి నుచ్చరింపుచు,
మొనసి వధూవరులఁదార్పమదమిం పొందన్.
రాఘవాభ్యుదయము. ౬-౪౪.

౩. పరిశ్రమించునది.

సావధి. సం. విణ. ఇ. హద్దుగలది, పరిమితము, సంకుచితము.

సావనము. సం. విణ. అ. ఈ. అ. సవనములకు సంబంధించినది.

సావనము. సం. వి. అ. పుం. ౧. సవనాంతము. సవనాంతమునఁజేయుకర్మ. ౨. ముప్పది సౌర దినములుగల నెల. ౩. సూర్యోదయాది సూర్యాస్తమయాంతమైన దినము. ౪. ఒకవిధమైనసంవత్సరము.

సావనుఁడు. సం. వి. అ. పుం. ౧. యజమానుఁడు; యాగకర్త. ౨. వరుణదేవుఁడు.

సావము. సం. వి. అ. పుం. బలి, హవిస్సు.

సావయవము. సం. విణ. అ. ఆ. అ. ౧. అవయవములు కలది. ౨. భాగములతోఁగూడినది.

సావరణము. సం. విణ. అ. ఆ. అ. ౧. కప్పబడినది, దాచఁబడినది. ౨. ఆచ్ఛాదితము, పిహితము. 3. ఆవృతము, నిరుద్ధము.

సావరము. సం. వి. అ. పుం. ౧. దోషము, నేరము. ౨. పాపము, క్రౌర్యము. హింస.

3. లొద్దుగచెట్టు ‡

క. కావుడు నతఁడొక కీరం, బై వెసఁజని నింగి
నిలిచి యగచరపతితో రావణు సందేశము
గడు, సావరమునఁజెప్పి మరలి చనఁ దొన
కవుల్. భా. రా. యుద్ధ. ౨౦౨.

సావర్ణము. సం. విణ. అ. ఈ. అ. ఒకేవర్ణమునకుఁజెందినది; ఒకేకులమునకుఁజెందినది.

సావర్ణలక్ష్యము. సం. వి. అ. న. ౧. ఒకేకులము-కు జెందుటను సూచించుచిహ్నము. ౨. చర్మము.

సావర్ణి. సం. వి. ఇ. పుం. అష్టమమనువుపేరు (సూర్యునివలన సవర్ణకుఁబుట్టినవాఁడు)

సావర్ణుఁడు. సం. వి. అ. పుం. అష్టమమనువుపేరు

సావర్ణ్యము. సం. వి. అ. న. ౧. వర్ణతౌల్యము. ౨. సమాన కులత్వము. 3. అష్టమమనువుయొక్క మన్వంతర కాలము.

సావలి. వి. దుబుదక్కవాఁడు.

సావలీఁడు. వి. =సావలి.

సావలేపము. సం. విణ. అ. ఆ. అ. గర్వముగలది.

సావశేషము. సం. విణ. అ. ఆ. అ. ౧. మిగులుగలది; శేషముగలది. ౨. అసంపూర్ణము; లోపముగలది.

సావష్టంభము. సం. విణ. అ. ఆ. అ. ౧. గర్వముగలది, ధీరమైనది, గంభీరమైనది. ౨. స్థిరమైనది, దృఢమైనది. 3. శక్తిమంతమైనది, ఉగ్రమైనది, తీవ్రమైనది.

సావహేళము. సం. విణ. అ. ఆ. అ. తిరస్కారముగలది, ద్వేషముగలది.

సావాసము. వి. (సం. సహవాసః త. చాకవించ౯) కలిసియుండుట, స్నేహము, పొత్తు.

సావాసి. వి. సావిడల్లుఁడు, అంతఃపురపు కావలివాఁడు.

ద్వి. సేనాగతాంగ వాశించితంబులును, సావాసు
లదరించు చందమాంశ్యతులు.
రం. రా. యు. కాం. ౨౯౦ పు ౬. పం.

క. కావుడు సంతోషించితి, సావాసులు వీరవచన
చతురత సత్వా, దేవి యుచిత్తపు మాటలు గా
విని తెలిసి కాని మెచ్చెఁగంసారాతిన్.
ఉ. హరి. 3-౧౪౨.

సావి. ౧. కాలము.

సీ. తటి తతి పదను వాదను సావియదను వాఁగా
లాభిధానంబు గాఁ దెలంగు. ఆం. భా. ౧-౭౬.

సీ. వానకాలమువచ్చె వర్షంబులందందు, జడి
వట్టి కురిసె వాసావియందు. కాశీ ౬-౪౦.

చ. విలిఖితమో శిలాకృతియొ విస్మృతియో పువ
హించెనో యనన్, జలద విమారుఁదయ్యెఁ
దొలుసారి పయోధర ధారఁదోఁగున య్యల
దకొత్తు క్రొత్తపులు నేపున కేపులకల్
తినూలతిన్, మెలవఁగనున్న నవ్వియదమ
ఖ్యుఁడు తాపసము ఖ్యు గిట్టుచున్.
పాండురంగ. ౨-౫౨.

సీ. కాదంబినీ మార్గ కేదారమున విండ మొలపిన
తెన్నెల మొలకలనఁగ, వడిసావి యెలుకర్వి
బడిగంటబిలు మబ్బు కొక్క గుంపులకిద్ద
కొలకు లనఁగ. చంద్రాంగ. ౫-౫౨.

౨. భ్రాంతి, భ్రమ.

క. నీవిందు సుధన్వునిరొమ్ము, సావిం దుసిమించి తెందు సాగద వనుచున్. జై.భా. ౫-౬౦.
తన నీడ నీరిలోపలఁగని యదిప్రతిగజము సావి కదుకొని  కుమా. సం. ౧-౯౫.

౩. సారము.

సీ. మెఱసి నిల్కడచూపు మెఱుపులో రొమ్ముపు బిత్తరుపులో తరము నిద్దాపనిండి, తనిమిలో మిసిమి నిబ్బరపు సంపంగి పూతావిలో సావి కందర్పు చేతి, కిసలులో బిరుసు చిత్తరువు పుత్తడిబ్రాఁత. (ఇది స్త్రీ వర్ణనము).
ఘటికాచల. ౨-౮౩.

సావి. విణ. మనోజ్ఞము.

ఉ. తుమ్మెద కంటువూ మొగదలోఁదుఁ దూఁ గులతాంగి ముక్కుసొత్తమ్మికి జాతి దాయవనితా జనతామణి మామ్రకంటు క్రొత్తమ్ముల తమ్మలిందు కళికాలిక వాలిక చూపుఁగోపుల, క్కామ్మకుసావిమావి సెఁ గొమ్మకు సాటియొబోటు లెయ్యెడన్.
రామా. ౪-౬౬.

ద్వి. సావి గన్నెరవూపుచాయ నీర్కావిధోవతి మీగాళ్ళతో నెఱయంగ.
ద్వి. పరమ. ౩-౨౨౫.

సావి.=సవి అవ్య. అని. (అని భ్రాంతిపడి)

క. తననీడ నీరిలోపలఁ గని యది ప్రతిగజము సావి కడుకొని కోపం, బునఁ దాఁకి పోరఁ జొచ్చెను.  కుమా. సం. ౧-౬౫.

ఉ. చాతుసభోగిరాట్కటకసన్నిధి దీపితదీప మాలికాఛాయఁ బురఃప్రదేశమునఁ జాగిన నిర్ఝరవాహినీమహాతోయము సావిచీరయొగఁ ద్రోచి చొరంగఁదలంచె నెందలో తోయని కొంకికొంకి పతిసుం దతఁ డాసవపావవిత్రి యన్.  శివరాత్రి. ౪-౪౦.

సీ. ఇందుబింబంబుఁ జూచి చెందుమ్యాగలసావి, యెఱు లెత్తి తాకంగ. నాపపడిన.
కాశీ. ౩-౧౨.

సావిక. సం. వి. అ. స్త్రీ. ౧. మంత్రసాని, ౨. కాన్పుచేయు స్త్రీ.

సావిత్రము. సం. విణ. అ. తు. అ. ౧. సూర్యునకు సంబంధించినది. ౨. సూర్యునివలనఁ బుట్టినది. ౩. గాయత్రీసహితమైనది.

సావిత్రము. సం.వి.అ.పుం. గర్భము, పిండము.

సావిత్రము. సం. వి. అ. న. యజ్ఞోపవీతము.

సావిత్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. సూర్యకిరణము ౨. ఒకమంత్రము.

క. భూమ్యాది సత్యాంతముగ వ్యాహృతులతోడ సావిత్రిమున్నాటు చదువుటయును....
విజ్ఞా. ఆచా. ౬౨.

౩. ఉపనయనకర్మ. ౪. బ్రహ్మయొక్క భార్య ౫. పార్వతి. ౬. కశ్యపుని యొక భార్య. ౭. సూర్యునిపుత్త్రి. ౮. సత్యవంతునిభార్య ౯. సంధ్యాదేవతయు మధ్యాహ్న కాలపువేళ.

సావిత్రీపతితుఁడు సం. వి. అ. పుం. యథా కాలమున ఉపనయనము చేసికొనని ద్విజుఁడు.

సావిత్రీవ్రతము. సం. వి. అ. న. వైధవ్యము పరిహరింపఁబడుటకై స్త్రీలు జ్యేష్ఠమాసశుక్ల పక్షాంతమున మూఁడుదినములు చేయువ్రతము.

సావిత్రుఁడు. సం. వి. అ. పుం.౧.సూర్యుఁడు. ౨. బ్రాహ్మణుఁడు. ౩. శివుఁడు. ౪. కర్ణుఁడు. ౫. ఒక వసువు.

సావిలి. వి. బుడబుక్కలవాఁడు.

ఉ. ఆ వనజాక్షుఁ డ్రదిపయి వంబుధిస్వప్రతి బింబముం దగన్, గేవలమైన యమృతము గిల్కాను చక్రయుగంబుగా మయూఖావళి సూత్రసంహతియు గా భువిఁ బాంగుల పేఱు తూరుపన్, సావిలిదల్పు ఢక్క యనుచాట్పువ జొప్పు విచిత్రభంగిరైు. ప్రబం. ౧-౧౭౧.

సావిష్కారము. సం. విణ. అ. ఆ. అ. ౧. అహంకారము గలది. ౨. స్పష్టమైనది; సువ్యక్తమైనది.

సావు, వి. (రూ. చావు.)

సాశంకము. సం. విణ. అ. ఆ. అ. ౧. బెదరు గలది. ౨. సందేహముగలది. ౩. అనుమానించునది. ౪. భయపడునది.

సాశంయదశము. సం. వి. అ. పుం. ఒకవిధమైన బల్లి.

సాశంసము. సం. విణ. అ. ఆ. అ. కోరికగలది; ఆశగలది; ప్రతీక్షించునది.

సాశూకము. సం. వి. అ. పుం. కఁబలము, దుప్పటి.

సాశ్చర్యము. సం. విణ. అ. ఆ. అ. ఆశ్చర్యము గలది; విస్మయము చెందినది.

సాశ్ర (స్ర) ము. సం. విణ. అ. ఆ. అ. ౧. కోణములు గలది; ౨. అశ్రువులు గలది.

సాశ్రుధి. సం. వి. ఈ. స్త్రీ. అత్త, శ్వశ్రువు.

సాశ్రువు. సం. విణ. ఉ. ఉ. ఉ. అశ్రుపూర్ణమైనది.

సాష్టాంగము. సం. అవ్య. దండాకారముగా, ఎనిమిదియంగములు నేలకు దగులునట్లుగా.

మ. అనలుం డంజలిసేసె నంగకుఁడు సాష్టాంగంబు గావించె.... పారిజా. ౩-౭

సాసువులు. వి. బ. ఆవాలు.
హంస. ౨. ఆ.

సాసూయము. సం. విణ. అ. ఆ. అ. అసూయఁ గలది, ఈర్ష్యగలది.

వ. సత్యభామ సాసూయంబుగా వాసుదేవున కిట్లనియె ఉ. హ. ౩-౧౧౪.

సాస్నా. సం. వి. ఆ. స్త్రీ. గంగడోలు.

సాహంకారము. సం. విణ. అ. ఆ. అ. అహంకారము గలది, గర్వముగలది.

సాహచర్యము. సం. వి. అ. న. ౧. సహవాసము; కలిసియుండుట. ౨. అవినాభావసంబంధము.

సాహనము. సం. వి. అ. న. సహనము.

సాహసము. సం. వి. అ. న. ౧. బలాత్కారము ఔద్ధత్యము. ౨. నేరము, చౌర్యాదిదోషము. ౩. క్రౌర్యము. ౪. తెగింపు.

శా. ఓరీ బ్రాహ్మణధూర్త నాయెదుర నోహో సాహసం బెట్టిదో వైరం గోరి నుతించుమాట లెటు గావచ్చెం గృతఘ్నా....
ఉ. హ. ౪-౧౮౭.

౫. తొందరపాటు; అవిమృశ్యకారిత ౬. దండన, శిక్ష. ౭. కీర్తి. (ధనం)

సాహసాంకుఁడు. సం. వి. అ. పుం. ౧. విక్రమాదిత్యుఁడు ౨. ఒక కవి పేరు ౩. ఒకనిఘంటు కర్త పేరు.

సాహసి. సం. విణ. ఇ. ఈ. ఇ. ఉగ్రమైనది, క్రూరమైనది. ౨. నిర్భయమైనది, గర్వముగలది.

సాహసించు. సం. అ. క్రి. తెగించు, పోరవ

మ. శస్త్రాశస్త్రిఁ బోరాడ మెత్తురు మే ల్మేలని సాహసించుతతి నెంతో ప్రాణపర్యంత ని,ర్భరమున్సంకటమైన నవ్వుదురు.
చంపూ. రా. ౪-౧౨౩.

సాహసికము. సం. విణ. అ. ఈ. అ. ౧. బలప్రయోగము చేయునది, తీవ్రమైనది, ఉద్ధతమైనది. తొందరపడునది, వేగిరపడునది, ముందు వెనుకలు చూడనిది.

సాహసికుఁడు. సం. వి. అ. పుం. ౧. తొందరపాటు కలవాఁడు, ఉద్ధతుఁడు. ౨. క్రూరుఁడు అహంకారి, నిర్భీకుఁడు ౩. దోపిడికాఁడు ౪. వ్యభిచారి ౫. బలికుమారుఁడు.

సాహస్రము. సం. విణ. అ. ఈ. అ. ౧. వేయింటికి సంబంధించినది. ౨. వేయింటితోఁ గూడినది ౩. వేయింటిచే కొనఁబడినది. ౪. వేయింటికిగాఁ జెల్లింపఁబడినది. ౫. వేయిరెట్లయినది.

**సాహస్రిము.** సం. వి. అ. పుం. వేయిమందిగల సేనానాయకము.

**సాహస్రిము.** సం.వి.అ. న. వేయింటి మొత్తము సహస్రవస్తు సమాహారము.

**సాహస్రుఁడు.** సం.వి.అ. పుం. సహస్రజనులమున కధికారి.

**సాహాయకము.** సం.వి. అ.న. ౧. తోడ్పాటు, ఆదరణ, అండ. ౨. సాహచర్యము, ౩. మైత్రి ౩. సహచరవర్గము. ౪. సహాయసేనాదళము.

**సాహాయ్యము.** సం. వి. అ. న.౧.తోడ్పాటు, అండ. ౨. మైత్రి, స్నేహము.

**సాహిణము.** వి. (సం.సాధనమ్.ప్రా.సాహిణ) ౧. సేన. చూడు. సాహిణి.
౨. గుఱ్ఱపుసాల.

క. సాహిణమునఁ బాగాయిత, వాహాగారంబు నడుమ వర్తిలుఁ జేర్చె. ఆం. శే. ౨౫.
మహాస్రగ్ధర. ఎక్కి రాఁగన్ మందువాసాహిణములఁ గలభద్రేభసందోహవాహప్రకరంబుం గొంచు
మను. ౧-౪౦.

ఉ. క్రొం, బూవిలుకాని సాహిణపుఁబోఁడిపగి యామని వచ్చె నత్తరిన్.
కృ. శతం. ౧-౭౦.

౩. గజశాల.

సీ. రక్షోభయంకరై రావణమదగంధనాగంబు దన సాహిణమున నుండ. వరాహ. ౩-౬౫.

౪. గుఱ్ఱము.

ఎ.గీ. పవనపౌలస్త్యపశుపతు ల్జవనరూఢిఁ బరఁగు తమసాహిణములనిబ్బరము చూప. నిరం ౩-౩౬.

**సాహిణి.** = సాహిణీ వి. (సాహిణము+ఇ) ౧. గుఱ్ఱాలసాలపై నధికారి.

గీ. పిలిపించె తలాటంబు పేరజీంబు, మణుల మొంగముట్టువన్ని, సాహిణిరొకండు, కర్త రొండుపటికిఁ గొనివచ్చె గంధవాహ, బాంధవం బగువోకమహా సైంధవంబు,

౨. గుఱ్ఱపురౌతు, సాది.

ఉ. అక్కులకుంఠకుంఠి తెలియం గనినప్పుడె ధిక్కరింపుమున్ జక్కరఖాణపుందురికి సాహిణివాయల జంటదారిమేల్, వొక్కపువాఁడి చెంగలువ నూరికటారినిఁ బోటుఁ బేటు పెం, పెక్కఁగ వొక్కటన్ వలిపుటిక్కవఁ బక్కన రేచి యార్చెఁగన్.
ఉత్తరహరివంశం ౨-౫౬.

౩. గుఱ్ఱపువాఁడు.
తే. ఉత్తమాశ్వంబు సాహిణి యొకఁడు విలువ.
సారంగ. ౧-౭౧.

చ.... మోముపట్టనీ, టలరచి రాజప్రమోలకు హాయంబోక సాహిణి తెచ్చె చెచ్చెరన్.
కా. శకం. ౧-౧౧౩.

**సాహిణీ.** వి = సాహిణి. రౌతు, గుఱ్ఱపురౌతు.

చ.... సాహిణీలు మావుల బెలుపంగ. ఆము. ౩-౨౨.

**సాహిత్యము.** సం.వి అ. న. ౧. సాహచర్యము మైత్రి, సంఘము, సంఘటన, ౨. కావ్యవాఙ్మయము.

సీ. సరసకథాలాప సంగీత సాహిత్య చతురకుక స్తోమ సంచితంబు. ఉ. హ. ౬-౨౬౭.

౩. కవిత్వము, కావ్యశాస్త్రము. ౪. సామాగ్రీ సంకలనము. ౫. భోజనావసరవస్తువుల మొత్తము.

**సాహిబూ,** హిం. వి. సాహేబు. (ప్రభువు.)
మ. పలుకుం జిల్కలకొల్కి రాచిలుక బాబా సాహిబూ మెచ్చు పుంగలవన్ సౌఖ్యము గాంచి. దశా. ౧-౨౯౭.

**సాహు.** వి. (క. సాహుకారు. త. సావుకార్ రన్. హిం. సాహుకారున్) వడ్డివ్యాపారము చేయువాఁడు.

సీ. ఇద్దవడ్డికి నోర్చి మృగ్యురూపమునై, సాహులచే బుణగ్రాహియగుచు.
పాండురంగ. ౩-౧౬.

**సాహుకారు.** హిం.వి. సాహూకారు, సాహు. (రూ. సాహుకారి. క. ర.)

సాహూకారు. హిం. సాహుకారు.

సాహెబు=సాహేబు.వి.ప్రభువు;సామంతరాజు.

శా. ఢిల్లీపాదుషహాని యోగమున రూఢిన్ రాజ
రాజా నిజామల్లీపేరిటి మేటి సాహెబు.
రంగా. ౧-౧౩౮.

ఉ. మాయలబ్బపదంబు లాన నిజమాడెద హైదరు
జంగు సాహెబా రంగా ౨-30.

సాహేబు. హిం. వి. సాహేబూ; సాహెబు;
సాయిబు, (హిం. సాహిబ్.)
౧. ప్రభువు.

తే.గీ. ఉభయకటముల శ్రీముద్ర లూర్ధ్వపుండ్ర
సంగతాంగారజవయవక్షారలోహి తాక్షతి
శ్రీల హేజీబు లపుడు వచ్చి, రగణితస్థితి
సాహేబునగరి కడకు.రాజవాహన ౫-3౫.

౨. మగఁడు; భర్త.

సీ. దంబెచ్చుతపసి కన్నంబాపపేరక్క సందలి
కుంకేటికందు నొకటి చాయజక్క వచంటి
సాహేబు పావని తురకమాని కనుగుడుంతి
కెంకటి. ప్రబం. ౧-౧౬౨.

సాహో, హిం. అవ్య. పరివారజనము సేయు
హెచ్చరిక.

క. నిశ్శాణంబుల జరణప్ప, దాశ్వంగద భూమ
లదర ధరవల్లభసా, ధక్వంగణ భాగంబున
కాశ్వరపతి డిగ్గి సురలు సాహో యనఁగన్.
వరాహ. ౬-౮౨.

క. మోహంబు దతివైభవమున సాహో యని
కటిక వారు సందడి జడియంగా హేమరత్న
ఖచితమ హాహర్మ్యము వొచ్చియందు నాకీ
నుండై. ప్రబోధచం. ౨-౭౯.

ఎ.గీ. స్వామి! సాహో పరాకు హెచ్చరిక య
నుచు వేత్రహస్తులు పలుమాఱు విన్నవింప
అని. ౮.

క. కర్ణపుటర.సాయన సౌవిదల్లసాహో, నినదం
బెసఁగంగ నెక్క నృపుడు విభుఁడై.
కుమా. ౧-౬౨.

సాహ్యకృత్తు. సం. వి. త్. పుం. సహచరుఁడు
మిత్రుఁడు.

సాహ్యము. సం. వి. అ. న. ౧. సంయోగము,
సహభావము, సఖ్యము, సమాజము, ౨. తో
డ్పాటు, అండ.

సాహ్వయము. సం. వి. అ. పుం. పొట్టేళ్లు
మున్నగువానితో జూదమాడుట.

## సి

సింగఁడు. వి. (సం.సింహ.) ౧.ఎఱుకువాఁడు.
౨. నృసింహుఁడు.

క. మా సింగఁ డల్లతగి గుండతితేఁ దలమోచి
తెచ్చిన యని. కుశ. ౧.

సింగఁడు. విణ. కోపించినవాఁడు.

ఉ. చెప్పిన నద్దురాత్ముఁడు సింగఁడు బూరఁడు
నై. పంచ వేంకటనాథుఁడు ఆ. ౧.

సింగనాదము. కంటిసల్లగుద్దు.

సింగన్నదాఁటులు. వి. బాలక్రీడావిశేషము.

సింగపుఁబీట. వి.(సింగము+పీట)సింహాసనము.
తమ్మిపూ సింగపుఁబీట. పాంచా ౧ ఆ.

సింగపుగొంగ. వి. ఖడ్గమృగము, శరభము.

సింగపుదండ. వి. మల్ల (శాస్త్రములోని) బంధ
విశేషము.

సింగపురాసి. వి. (సింహము + రాసి) సింహ
రాశి.

సింగము. వి. ౧. సింహము.

శా. సింగం బున్న గుహాసకేసరములు వికున్.
భార. విరా. ౨-330

పదోత్తరఘటితమై శ్రీవృషాదిక మగును.
ఉదా. రాచసింగము.
౨. మల్లబంధవిశేషము.

సింగరవళి. వి. సింహారావము.

సింగళము. వి. సింహళద్వీపము.

సింగాణి. వి.(సం. శార్ఙ్గమ్)రూ. సింగిణి సింగిణీ ౧. శృంగిణి, శృంగధనువు. ౨. బాణము. ౩. ఒక రకమగు కర్ర.

సీ. జిగు రంటించుటకు వెన్దగిలి పోనీక యీ సింగాణిమనుఁబోతుఁ కెండిమైచు. సా. ౧.

సింగారవుఁదోఁట (సింగారము+తోఁట) వి. శృంగారవనము, ఉద్యానవనము.

సింగారము. విశే. మంజులము, హృద్యము.

సింగారము. వి. శృంగారము అలంకారము, అందము

సీ. కొమ్మ సింగారంపుఁగొలఁకునం దేలక బలు విరాలపు వెట్ట దోలఁగు చెట్టు. నీలా. ౨-౩౬.

వ. అని పనిచి తానును యోధవీరోచితప్రకారంబున సింగారంబు సత్వరంబుగాఁ జేసికొని భార. విరా. ౩-౧౮౮.

సింగారి. వి. శృంగారి, శృంగారవతి.

సింగారించు. స. క్రి. (శృంగారించు) శృంగారము చేయు, అలంకారముచేయు, కుస్తరించు, దిద్దు, పారాణించు; పదరించు; భూషణించు.

సింగి. వి. ఎఱుకలసాని, చెంచుది.

సింగిణి. వి. (సం. శార్ఙ్గమ్) రూ. సింగాణి; సింగిణీ, ధనువు, విల్లు.

సీ....రాజు నొప్పారు పైశాణంబు సింగిణి, తళుకుల కోరుల తరకసంబు. మనుచ. ౪-౭౨.

సింగితమనుకువల. వి. చేపలఁబట్టుటకుపయోగించు నొకవిధమైనవల.

సింగినాదము. వి. శృంగనాదము, కొమ్మువాద్యము. ౨. పొదలుగల మువ్వికొమ్ముతోఁ జేయఁబడి యోగులచే నుపయోగింపఁబడు సుషిర వాద్య విశేషము, కిల్లయోగుల వాద్యవిశేషము.

చం. ఎలిఁగ నుపట్టు కిన్నెరయు లాహిరి మోదము సింగినాదముం జెలు వలరంగ. కళా ౨-౫౦.

౩. చప్పుడుఁ గలిగినది కాని దానినిగూర్చి తిరస్కారముగా మాటాడునప్పు డీమాట వాడఁబడును. ఉదా (వ్య) ఆ! ఏమున్నది? సింగినాదము.

సింగిలీకకము. వి. రూ. సింగిలీకము. పెద్దవల్లకోఁతి.

శిరములు దగిపడు సింగిలీకములు. నళ. ౩. భా.

సింగులు. వి. బొందిలీలని, బాలాజీ లని పిలువఁబడు ఉట్టియొకజాతి జనులు.

సింగోట. వి. రెండు దిత్తికొమ్ములు జతచేసి యేర్పరచిన ఆయుధవిశేషము.

సీ. జింకకొమ్ములు రెండు చేర్చి యల్లం లమర్చి డాకేలఁ బూని కొద్దగఁ బొడువ సంగతిగల యుది సింగోట యనఁగను దివిదారుకొమ్ము వాఁ దేజరిల్లు. ఆం. భా. ౨-౨౦౬.

సింఘ (ఘా) ణము. సం. వి. అ. న. రూ. సింఘాణకము. ౧. నాసామలము. ౨. ఇనుపగుబ్బు ౩. గాజుగిన్నె.

సింఘిణి. సం. వి. ఈ. స్త్రీ. ముక్కు.

సింఘుపో(త్రే) బ్రాహ్మణులు. వి. బ. కపూరిచి బ్రాహ్మణులు.

సించ (చి) త. సం. వి. అ. స్త్రీ. పిప్పలి.

సించనము. సం. వి. అ. న. సేచనము, చల్లుట, నీళ్ళుపోయుట.

సింజ. (రూ. శింజ.) సం. వి. అ. స్త్రీ. అందెలు మున్నగుదాని రవళి.

సింజితము. సం. వి. అ. న. ఆభరణముల మ్రోఁత.

సింజిని. సం. వి. ఈ. స్త్రీ. వింటినారి.

సిందుకము. సం. వి. అ. పుం. ౧. వావిలి. ౨. సిందువార వృక్షము.

సిందురము. వి. (సం.సిందూరమ్) ౧. చెందిరము నాగసంభవము.

కం. పగడము మంకెన విరియును జిగురాకును దొండపండు సిందురమును సొంపగు తమ్మి కెంపు గుంపును. నీలా. ౨-౨౨.

3. వావిలి.

వృషభగతిరగడ:- చెలువచెలువపుఁదావి యూరపు సింధుసింధుర మింపుమీఱఁగ.

వసు. 3-౧౪౯.

౪. పెద్దరేను. ౫. అంకుడుచెట్టు. i

సిందువార (క) ము. సం. వి. అ. పుం. వావిలిచెట్టు.

సీ ...కర్ణికారముఁబోడగన్న మాటాడుడు, సింధువారము మీఁద తేర్ప చూర్పు.

వి|క. ౧-౧33.

సిందూరతిలక. సం. వి. ఆ. స్త్రీ. ఐదువ. పుణ్యస్త్రీ.

సిందూరతిలకముఁ సం. వి. అ. పుం. ఏనుఁగు.

సిందూరపుష్పి. సం. వి.ఈ.స్త్రీ. పక్కచెట్టు.

సిందూరము. సం. వి.అ.పుం. ౧. ఒకవిధమైన వృక్షము, వావిలి. i

సిందూరము. సం. వి. అ. న. చెందిరము, జేగురురాయి, రాగద్రవ్య విశేషము.

సిందూరరసము. సం. వి.అ. పుం.పాదరసముతోఁ చేయఁబడిన యొకయౌషధము.

సిందూరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. తెల్లతెగడ చెట్టు. ౨. ఎఱ్ఱనివస్త్రము. 3. ఆరచెట్టు.

సిందూరిక. సం.వి.ఆ. స్త్రీ.సిందూరము, జేగురు రాయి.

సిందూరితము. సం.విశే. ఎఱ్ఱగాఁజేయఁబడినది; జేగురురంగు గలది.

సింధుకన్య. సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి.

సింధుకఫము. సం. వి. అ. పుం. ఒకవిధమైన చేపయొక్క యెముక.

సింధుకము. సం. వి. అ. పుం. రూ. సిందుకము వావిలిచెట్టు i ఏనుఁగు.

సింధుకము. సం. విశే. సముద్రమునకు సంబంధించినది.

సింధుజ. సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి.

సింధుజ (న్మ) ము. సం. విశే. అ. (న్) ౧.జలమునఁ బుట్టినది; జలసంబంధ, ౨. నదియందుఁ బుట్టినది. ౪. సింధుదేశమునఁ బుట్టినది.

సింధుజ (న్మ) ము. సం.వి.అ.న. రాతి ఉప్పు; లేక-సైంధవలవణము.

సింధుజుఁడు. సం.వి.అ.పుం. (సింధునందనుఁడు; సింధుపుత్త్రుఁడు) చంద్రుఁడు.

సింధునాథుఁడు. సం. వి. అ. పుం. (సింధుపతి, సింధురాజు.) సముద్రుఁడు. ౨. సింధుదేశపు రాజు. జయద్రథుఁడు)

సింధుపిబుడు. సం. వి. అ. పుం. అగస్త్యుఁడు.

సింధుపుష్పము. సం. వి. అ. పుం. శంఖము.

సింధుమంథజము. సం.వి.అ.న.సైంధవలవణము.

సింధులవణము. సం.వి.అ.న. సైంధవలవణము.

సింధువారము. సం. వి. అ. పుం. ౧. జాత్యశ్వము. ౨. సింధుదేశమునఁబుట్టిన యుత్తమజాతి యశ్వము. 3. వావిలిచెట్టు.

సింధురము. సం. వి. అ. పు . ౧. ఏనుఁగు.

తే.గీ. గంధసింధురకుండా ప్రకాండ కరభ, కదళికాకాండ కాంతివర్గములతోడి పెందొడలు కాంత పెదొడ తెందు నరయ, మదన కేళికనర్హయౌనమగువ గలదె.విక్రా. ౧-౧౯.

౨. అష్టసంఖ్య.

**సింధురవదనుఁడు.** సం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు.

**సింధువు.** సం. వి. ఉ. పుం. ౧. సముద్రము.

ఉ. వద్రిమోదరసనింధు తరంగల ... లాడ. భోజ. ౪-౪౦.

౨. సింధునది. ౩. సింధునది చుట్టుపట్టుగల దేశము. ౪. మాళవదేశమందలి యొకనది పేరు. ౫. ఏనుఁగు తుండమునుండి యొగఁజిమ్ముఁబడిన జలము. ౬. ఏనుఁగు కణతలనుండి స్రవించు మదము. ౭. ఏనుఁగు. ౮. విష్ణుపు నామము. ౯. తెల్లనిలవణము. ౧౦. ఒకరాగభేదము.

**సింధువు.** సం. వి. ఉ. స్త్రీ. ౧. నది, మహానది. ౨. సింధునది.

**సింధువృషుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**సింధుశయనుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**సింధుసంగమము.** సం.వి.అ. పుం. ౧. నదులు సముద్రములోఁ గలియుట. ౨. రెండు నదులు కలియు చోటు.

**సింధూఫలము.** సం.వి.అ.న. సైంధవలవణము.

**సింధూరి.** సం. వి. ఇ. స్త్రీ. వీరపుష్పి, వృక్షవిశేషము.

**సింబ.** సం. వి. ఆ. స్త్రీ. రూ. శింబ, సింబి. పెసరమున్నగువానిపై పొట్టు.

**సింబ (బి)** సం. వి. ఆ. ఈ. స్త్రీ. గింజ, బీజము, ద్విదళబీజము, ఒకవిధమైన మొక్క i

**సింబి.** సం. వి. ఈ. స్త్రీ. సింబ.

**సింహా.** సం. వి. ఆ. స్త్రీ. నరము; రక్తనాళము

**సింహాకర్ణము.** సం. వి. అ. పుం. సింహపు బొమ్మలతో గూడిన మూలనున్న దాపరము.

**సింహాకర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. బాణము వేయునపుడు ఏర్పడు కుడిచేతి విన్యాసము.

**సింహాకేస (శ) రము.** సం. వి అ.పుం. ౧. వకుళవృక్షము i ౨. సింగపుజూలు; ౩. భక్ష్యవిశేషము.

**సింహాకేళి.** సం. వి.ఇ.పుం. పూర్వాజైనవిశేషము

**సింహాగర్జనము.** సం.వి.అ.న.౧ ఏనుఁగులుమున్నగు జంతువులు భయపడునట్లుగా వీరులు చేసెడి ధ్వని. ౨. వీరావేశములో బెట్టుబొబ్బ. ౩. సింహారావము.

**సింహాగుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సింహాఘంటాన్యాయము.** సం. వి. అ. పుం. సింహము మెడను గంట నెవ్వరును కట్టలేరను రీతి;

**సింహాతలము.** సం. వి. అ. న. తెఱచిన యఱచేతులజంట.

**సింహాతలాటము.** సం. వి. అ. న. కవి పండితులకు సన్మానముగ నిచ్చుసింహపు బొమ్మలతోన గూడినమురుగు.

**సింహాతుండము.** సం. వి. అ.పుం. ఒకవిధమైన చేప.

**సింహాదంష్ట్రుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సింహాదర్పుఁడు.** సం. విశే. సింహమువలె నుద్ధతుఁడు.

**సింహాద్వారము.** సం. వి. అ. న. ప్రధానద్వారము; భవనముయొక్క ముఖ్యద్వారము.

**సింహాధర.** సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

**సింహానందనము.** సం. వి. అ. పుం. జన్యతాళవిశేషము.

**సింహానర్ది.** సం.విశే.సింహమువలెగర్జించువాఁడు.

సింహనాదము (సింహధ్వని. రూ.సింహనాదకము. ౧. సింహముయొక్క గర్జనము. ౨. యుద్ధవీరుని కేక. ౩. శివుని యొక్క వాద్యములలో నొకటి ౪. సమ్మకముతో నొక్కిచెప్పుట. ౫. సింహము చేయు నాదము వంటి నాదము

సీ. సముద్భట సింహనాదవదనుడై యున్న నా వసుదేవుడు.-ఉ హరి 3-౭౩

సింహపర్ణ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక యౌషధివిశేషము.

సింహపీఠము. సం. వి. అ. న. సింహాసనము.

సింహపీఠిక. సం. వి. అ. స్త్రీ. సింహాసనము.

శా... సింహపీఠికc జలత్వం. బొండు మాతంగ్రిమం. శిరం బించుక పుల్లుమన్న. మనుచ. ౪-౭౬

సింహపుచ్ఛి. సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న, నక్కతోక పొన్న సింహపు తోకవంటి కొమ్మలు గల పొన్నవృక్షవిశేషము.

సింహబలుడు. సం. వి. అ. పుం. కీచకుడు (విరాటరాజు బావమఱది)

సింహమలము. సం. వి. అ. న. ఒక రకమైన యిత్తడి.

సింహము. (√హింస్.) సం. వి. అ. పుం. ౧. మృగరాజు. ౨. సింహరాశి. ౩. ఉత్తరపదమైనపుడు) శ్రేష్ఠము.

సింహముఖము. సం. వి. అ. న. అసంయుత హస్తవిశేషము.

సింహముఖి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక యోషధి.

సింహయాన. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

సింహరథ. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

సింహరేఖ. సం. వి. ఆ. స్త్రీ. ర, జ, గగములతో నగు నొకవృత్తము.

సింహలము. సం. వి. అ. న. ౧. తగరము. ౨. ఇత్తడి. ౩. బెరడుతోక పెంకు. ౩. ఒకద్వీపము.

సింహలీలము. సం. వి. అ. పుం. ౧. జన్యతాళవిశేషము. ౨. రతిక్రీడావిశేషము.

సింహలుడు. సం. వి. అ. పుం. సింహలద్వీపవాసి.

సింహవాహనుడు. సం. వి. అ. పుం. శివుడు.

సింహవాహిని. సం. వి. ఈ. స్త్రీ. పార్వతి.

సింహవిక్రమము; సింహవిక్రాంతము, సం. వి. అ. పుం. గుఱ్ఱము.

సింహవిక్రీడితము. సం. వి. అ. న. ౧. 108 కరణములలో నొకటి. ౨. జన్యతాళవిశేషము.

సింహవిష్టరము. సం. వి. అ. పుం. సింహాసనము.

సింహసంహననము. సం. వి. అ. న. సింహమును జంపుట.

సింహసంహననుడు. సం. విణ. ౧. సర్వాంగ సుందరుడు. ౨. సింహముయొక్క శరీరమువలె శ్రేష్ఠమైన శరీరము గలవాడు.

సింహాకర్షితము. సం. వి. అ. న. కరణవిశేషము.

సింహాణము. సం. వి. అ. న. రూ. సింఘాణము. ౧. చీమిడి. ౨. ఇనుపతుప్పు. ౩. పాండువోగమును బోగొట్టు ఇనుపచిట్టెము.

సింహారావము. సం. వి. అ. న. సింహగర్జనము.

సింహావలోకనన్యాయము. సం. వి. అ. పుం. సింహము ముందుకుc గొంతదూరము సాగిపోయి ఒక్కసారి నిలcబడి వెనుకకుcదిరిగి చూచుకొను చుండునట్లు ఏదైన నొకకార్యము కావించి మరల దానినంతను పరామర్శించుట.

సింహావలోకనము. సం. వి. అ. న. ౧. వెనుక చూపు, పునరాలోచనము. ౨. సింహము యొక్క చూపు. ౩. శబ్దాలంకారమైన యమ

కములలో నొక భేదము. ఇందు వాక్యము కొందఱి మాట తిరిగి తుదను గూడ వచ్చును.

ఉదా:- క. మన కేటికి నూతనమూ, తనమూ, రొదఁ బ్రేమ తనకుఁదక్కి తినుమూనుమూనక దయ దనరం దనరంతులు మాని నరసభవు రమ్మనవే. కావ్యాలం. ౪.

సింహాసనము. సం.వి.అ. న. సింహాముఖ మేర్పఱిచిన స్వర్ణమయమైన యున్నతపీఠము, రాజగద్దె

సీ. సింహాసనస్థులై సిరులు నించినవారు భోగసంపదలచేఁ బొదలువారు.... పార. ౫-౧౦౧.

సింహాసనము. సం. వి. అ. పుం. రతిక్రీడావిశేషము.

సింహాసనాంశ. (అం). అయిదువర్గంబులు స్వవర్గంబు వచ్చెనేని సింహాసనాంశయగును. (వాచస్పత్యము.

సింహాస్యము. సం.వి.అ. పుం. ౧. ఒక విధమైన హస్తముద్ర. ౨. ఒకవిధమైన యౌషధి విశేషము; అడ్డసరపు చెట్టు (సింహము నోరువంటి పువ్వులు గలది)

సింహి. సం. వి. ఈ. స్త్రీ. ౧. సింగపుఁబెంటి. ౨. రాహువుయొక్క తల్లిపేరు ౩. అడ్డసరము ! ౪. ములక !

సింహిక. సం. వి. ఆ. స్త్రీ. రాహువుయొక్క తల్లిపేరు; అడ్డసరము.

సింహుండము. సం.వి.అ. పుం. బొమ్మజెముఁడు

సిక. వి. శిఖ.

సికగన్నదాఁటుట. వి బాలక్రీడా విశేషము.

సికత. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఇసుకనేల. ౨. మొరపనేల, ౩. ఒకానొక రోగము. ౪. ఇసుక.

వ.... ఉత్పాదిత గగనకోటర విపాటనంబు లగు సికతావర్షంబులు పరిహృతంబు లయ్యె నయ్యెడ. పార. ౫-౭౯.

సికతాకూపన్యాయము. సం. వి. అ. పుం. ఇసుకనేలఁద్రవ్విననూతి యొడ్డెప్పటికప్పుడే విఱిగి పడిపోవుచుండును. బలిష్ఠములైన యుక్తులు లేకుండ చేయు వాదము మొదలైనవానిని గూర్చి చెప్పునపు డీన్యాయమును వాడుదురు.

సికతాతలము. సం. వి. అ. పుం. ఇసుకదిన్నె.

సీ. సికతాతలనితంబ వికచకంబుగోత్తమ, వర తరంగావళీ వళి విలాస....విక్రమా. ౭-౧౩౬.

సికతాప్రాయము. సం.వి.అ.న. ఇసుకతీరము.

సికతామయము. సం.విశే. ఇసుకతోఁగూడినది.

సికతామయము. సం. వి. న. పుం. ౧. ఇసుకదిబ్బ. ౨. ఇసుకతో నిండినతీరముగల ద్వీపము.

సికతావంతము. సం. విశే. త్. తి. త్. సికతామయము.

సికతాసేతువు. సం. వి. ఉ. పుం. ఇసుకగట్టు.

సికతిలకము. సం.విశే.అ.ఆ.అ. ఇసుకగలది(నేల)

సీ.... కాంచన కేదృలంకార చూర్ణాయిత, సికటిత కర్పూరసికతిలంబు. నిరంకుశో. ౧-౬౨.

సికఫలము. సం. వి. అ. న. సీకాయ.

సికా. వి. ముద్ర.

సికాయుంగరము. వి. ముద్రగల యుంగరము; ముద్దుటుంగరము.

సికారు. రూ. శికారు. హిం. వి. వాహ్యాళి.

సిక్తము. సం. విశే. అ. ఆ. అ. ౧. తడిసినది; చిమ్మఁబడినది, నీరు పైని జిలుకరింపఁబడినది. ౨. తడుపఁబడినది; పానఁబెట్టఁబడినది. ౩. గర్భాధానము చేయఁబడినది. తడిసినది.

మం. పంచాస్త్ర గురుండు భూరిరయజాసిక్తత్త కాంభోజుఁడై. పార. ౫-౭౭.

సిక్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. చల్లుట. ౨. చిమ్ముట. ౩. వెలిగ్రక్కుట.

సిక్థకము. సం. వి. అ. న. మైనము.

సిక్థము. సం. వి. అ. పుం. ౧. ఉడికిన బియ్యము. ఉప్పుడు బియ్యము ౨. అన్నపుముద్ద.

సిక్థము. సం. వి. అ. న. ౧. మైనము. ౨. నీలిమందు.

సిక్యము. సం. వి. అ. న. చూ. శిక్యము. ౧. ఏనుఁగుస్త్రాగ్రమందలి పదము.

మ. కరపాదస్థన గోమహోపకట సత్కర్ణాక్షి కోశాలికి, కరమేఘూతత సిక్యధర్మ జలదం గద్దాన సంపూర్ణసా, గర శీధూన్మద సమ్మతాప్తమదముల్ గ్రమ్మం దదష్టాంగబం, ధుర మై సింధుర ముప్పుచుండె వలగీతుల్ వించు సోలంబునన్. కు. పం. ౨-౬౦.

౨. ఉట్టి. ౩. చిక్కము.

సిక్త్యము. సం. వి. అ. పుం. ౧. స్ఫటికశిల. ౨. అద్దము, గాజు.

సిగ. వి. ౧. శిఖ, ౨. సీకాయ చెట్టు ౩. వెమ్మిచెట్టు

సీ. పొగడుగా విరిసరుల్ చుట్టి కట్టిగనిడ్డ సిగ పెంపు వాఁడెంపు సిరుల నీన. నీలా. ౨-౫౦.

సిగదండ. వి. ౧. శేఖరము. ౨. భూషణవిశేషము.

సిగపట్లు. వి. దబ్బలాట.

చం. పలుకులు వాదు రేపి సిగపట్లకు దగ్గఱచేసి. కువల. చరి.

సిగబంతి. వి. ౧. శేఖరము ౨. భూషణవిశేషము.

గీ. అమ్మగొడ వేల యుఁగక యమ్మలకును, ఖడ్గ మంకింపఁగా నేల ఖడ్గములకు, భల్ల మదియేల దాయిభల్లములకు, నయ్య యీ బంతిసిగబంతి యయ్యెనేమొ. చంద్ర. ౨.

సిగపువ్వులంబోట్టు స్వేచ్ఛగా నుండు
అభయం బనునది సిగపూవులు బొట్టి.
(ధర్మజరాజసూయము)

సిగము. వి. రూ. సివము. దేవతావేశము

సిగర. వి. రూ. సిగరి. ౧. మెంతిమజ్జిగ. ౨. మజ్జిగపులుసు.

సీ. ఒకకొన్ని సిగరులు నొకకొన్నియంబళ్ళు. పాండు. ౪-౧౮౪.

౩. దధిశర్కరాదికృత లేహ్యము.

సిగరము. వి. శిఖరము.

సిగరి. వై. భస్మము.

సిగరెట్టు. అన్యదే. వి. కాగితపు తొడుగు గల పొగచుట్ట.

సిగినాలు. వి. వాణెమైన వక్కలు.

సిగు. వి. సిగ్గు.

సిగ్గరి. విశే. ౧. సిగ్గుగలవాఁడు. ౨. సిగ్గుగలది.

సిగ్గరికత్తియ. (రూ. సిగ్గరికత్తె). వి. సిగ్గుకలది

ఎట్టకేలకుం బెట్టకాలకుం జెవియొగ్గిన సిగ్గరికత్తియలకు. వసు. ౪-౨౩.

సిగ్గఱు. అ. క్రి. సిగ్గుచెడు.

చం. సిగ్గఱి తుది నట్టు పాఱు టిది కర్జమె. భార. ద్రోణ. ౪.

సిగ్గిఁడి. (సిగ్గు+ఇడి) విశే. ౧. నిర్లజ్జము. ౨. సిగ్గుచెడినవాఁడు. ౩. సిగ్గుచెడినది.

సిగ్గు. వి. బిడియము, లజ్జ.

తే. కన్నియవుగాని ప్రౌఢవుగావు నీవు, పువ్వుబోఁడిరో సిగ్గెల్లఁ బోవనడిచి, బలుదొసంగులఁ బొరలఁగఁ బాడె నీకు, నించుకేనియు మదిలోన వెంచ వకట. నీలా. ౨-౭౪.

వ.... ఇంక సిగ్గుమాలి రణంబు సేయం జేసియు ద్రోణుండు చేయుంగాని యే నిట్టిదాని కోర్వ వది యనుసంగాక. భార. విరా. ౪-౧౯౫.

**సిగ్గుపడు.** అ. క్రి. లజ్జచెందు.

**సిగ్గుపాటు.** వి. సిగ్గుపడుట.

సీ. వంచనమై దాగి వర్తించు టిదియేమి ప్రాభవం బని సిగ్గుపాటు చెందు. హైమ. 3-౮౪.

**సిగ్గువోవు.** (సిగ్గు+పోవు) అ. క్రి. సిగ్గుపడు.

ఎ.గీ. అనురచిత్తంబు గానంగ నలవిగాక సిగ్గు వోయిరి యచ్చర చెలువ లెల్ల. లక్ష్మీ. ౨-౯౦.

**సిచయము.** సం. వి. అ. పుం. ౧. వస్త్రము, ఉడుపు. ౨. చినిగిన ప్రాతయుడుపు.

**సిడము.** వి. రథాదులపై నుంచఁబడు జెండా.

వ. సిడంబులు మడిపడ వెదలించి. ఉ. హరి. ౪-౨౦3.

౨. ధ్వజస్తంభము.

క. హయములఁ బూన్పుము రథమున రయమున సిడమెత్తు మిపుడ.... భార. విరా. ౪-౪౨.

**సిడి.** వి. ౧. అంకుశము.

మణులును మదకరికి సిడ్కి చూపినభంగిన్. కుమా. సం. ౧౦-౧౪౪.

౨. ఏతపుమ్రాను. 3. సిడిమ్రాను.

సీ. అంభోధరము క్రింద నసియాడు నైరావతి యంబోలె సిడిమ్రానిపై బెలువ యొత్తు. పాండు. 3-౭౭.

౪. గ్రామదేవత జాతరలో నొకనినీపున గాలము గ్రుచ్చిగాని ఒకనిని గంపలోఁ గూర్చుండఁబెట్టిగాని త్రిప్పునట్టి దూలము.

**సిడిముడి.** వి. ౧. చిడిముడి. ౨. రోషము. 3. కోపము.

**సిడిమ్రాకు.** వి. గ్రామదేవతల జాతరకు నాటిన స్తంభము.

**సిడులు.** (రూ. సిడ్లు) వి. అంకుశము; బాగోల.

**సిత.** సం.వి.అ.స్త్రీ. ౧. చక్కెర. ౨. వెన్నెల. 3. అందగత్తె. ౪. సారాయము. ౫. తెల్లగరిక. ౬. అరబ్బీమల్లె.

**సితము.** సం. విణ. ౧. తెల్లనిది. ౨. కట్టఁబడినది, బంధింపఁబడినది. 3. చుట్టఁబడినది. ౪. ఎఱుఁగఁబడినది; తెలిసికొనఁబడినది. ౫. పూర్తిచేయబడినది, ముగింపబడినది.

**సితము.** సం. వి. అ. పుం. ౧. తెల్లనిరంగు. ౨. శుక్లపక్షము. 3. శుక్రగ్రహము. ౪. బాణము. ౫. పంచదార.

**సితము.** సం.వి.అ.న. ౧. వెండి. ౨. చందనము. 3. ముల్లంగి.

**సితపాటల.** సం. వి. ఆ. స్త్రీ. తెల్లకలిగొట్టు చెట్టు.

**సితచ్ఛత్రి.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పెద్దసదాప; కుప్పిచెట్టు. ౨. తెల్లగొడుగువంటి పువ్వులుగల చెట్టు.

**సితచ్ఛత్రి.** సం. వి. ఈ. స్త్రీ. సదాపమొక్క.

**సితపర్ణి.** సం.వి. ఈ. స్త్రీ. (చూ) సింహాస్యము.

**సితమాషము.** సం. వి. అ. పుం. అలచంద.

**సితవాలుకము.** సం. వి. అ. పుం. గుగ్గు.

**సితవీర్యా.** సం. వి. ఆ. స్త్రీ. జీలుగుచెట్టు.

**సితశింబికము.** సం. వి. అ. పుం. గోధుమ.

**సితశివము.** సం. వి. అ. న. రూ. శితశివము. ౧. ఇందుప్పు. ౨. సైంధవలవణము.

**సితశూకము.** సం. వి. అ. పుం. యవధాన్యము.

సితాంకము. సం. వి. అ. పుం. వాలుకాగడ తునుచేప.

సితాంగము. సం. వి. అ. పుం. శ్వేతరోహిత వృక్షము ‡

సితాంభోజము. సం. వి. అ. న. తెల్లతామర.

సితాంశువు. సం. వి. ఉ. పుం. ౧. చంద్రుఁడు; ౨. హారతికర్పూరము.

సితాగురువు. సం. వి. ఉ. న. క్రొధనకము; గంధద్రవ్యవిశేషము.

సితాగ్రము. సం. వి అ. పుం. ముల్లు.

సితాతపవారణము. సం. వి. అ. న. రాజలాంఛనమైన వెల్లగొడుగు.

సితాపాంగము. సం. వి. అ. పుం. నెమలి.

సితాభ (భ్ర) ము. సం. వి. అ. పుం. కర్పూరము.

సితాది. సం. వి. ఇ. పుం. పంచదారమడ్డి.

సితారు. వి. వాద్యవిశేషము.

సితార్జకము. సం.వి.అ. పుం. ౧. తెల్లతులసి ‡ ౨. తెల్లగగ్గర ‡

సితాలిక. సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగు జెలగ.

సితావరము. సం. వి. అ. పుం. శాకవిశేషము.

సితాసితుఁడు. సం. వి. అ. పుం. బలరాముఁడు.

సితి. సం. విశే. ౧. తెల్లనిది. ౨. నల్లనిది.

సితి. సం.వి.ఇ. స్త్రీ. ౧. తెలుపులేక నలుపురంగు. ౨. బంధనము.

సితికంఠము. సం. వి. అ. పుం. నెమలి.

సితికంఠుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సితుఁడు. సం.వి.అ. పుం. ౧. శుక్రుఁడు. ౨. తెల్లనివాఁడు.

సితేతరగతి. సం. వి. ఇ. పుం. అగ్ని.

సితేతరము. సం. విశే. అ. ఆ. అ. నల్లనిది.

సితోదరుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

సితోద్భవము. సం. వి. అ. న. తెల్లచందనము.

సితోపలము. సం. వి. అ. పుం. స్ఫటికము.

సితోసీరము. సం. వి. అ పుం. వట్టివేరు.

సిద్దకిన్నర. వి. తంత్రివాద్యవిశేషము.

సిద్దాయము. వి.౧. వెచ్చపుసొమ్మునందు కూడఁబెట్టిన ధనము. ౨. కప్పము. 3. వ్యయవిశేషము.

సిద్ది. అధికబలముగల నీగ్రో జాతివాఁడు.

సిద్దియు. వి. బుంగవలె తోలుతోఁగుట్టినపాత్ర.

సిద్దీ. వి. సిద్ది.

సిద్దె. వి. సిద్దియు; తోలుతోఁగుట్టినపాత్రము.

సిద్ధకము. సం. వి. అ. పుం. సాలవృక్షము ‡

సిద్ధక్రియ. సం వి. ఆ. స్త్రీ. పరమహంసక్రియ

సిద్ధజలము. సం. వి. అ. న. పులిసిన బియ్యపుగంజి, బియ్యపుకడుగు.

సిద్ధధాతువు. సం. వి. ఉ. పుం. పాదరసము.

సిద్ధనది. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశగంగానది.

సిద్ధపఱుచు. అ. క్రి. సంసిద్ధముచేయు.

సిద్ధపుష్పము. సం. వి. అ. పుం. కరవీరము, గన్నేరు ‡

**సిద్ధభైరవతంత్రము.** ౧. శివప్రోక్తతంత్ర విశేషము.

**సిద్ధమగు.** అ. క్రి. ౧. సన్నాహమగు. ౨. సంపూర్ణమగు.

ఉ.... నా మనోరథం, బిక్కడ సిద్ధమయ్యె ఫల మబ్బెను.... హంస. ౧-౭౪

**సిద్ధము.** (√సిధ్) సం. విణ. ౧. నెఱవేర్పఁబడినది, చేయఁబడినది. సాధింపఁబడినది, పూర్తిచేయఁబడినది. ౨. పొందఁబడినది, ఆర్జింపఁబడినది. ౩. జయించినది, విజయవంతమైనది. ౪. స్థిరీకరింపఁబడినది, స్థాపింపఁబడినది, ౫. ధ్రువపఱుపఁబడినది, నిరూపింపఁబడినది, దృష్టాంతీకరింపఁబడినది. ౬. ప్రమాణీకరింపఁబడినది, హేతుబద్ధమైనది. ౭. సత్యముగా నంగీకరింపఁబడినది. ౮. నిశ్చయింపఁబడినది, తీర్మానింపఁబడినది. ౯. చెల్లింపఁబడినది, తీర్పఁబడినది (ఋణము మొ.) ౧౦. వండఁబడినది. ౧౧. పక్వమైనది, పరిణతిమైనది. ౧౨. చక్కఁగాఁ గలిపి, వండి తయారు చేయఁబడినది (ఔషధము మొ.) ౧౩. చేకూరియున్నది (ధనము మొ॥) ౧౪. వశపడియున్నది. (మంత్రముచేత) ౧౫. లోఁబఱుచు కొనఁబడినది. ౧౬. నిష్ణాతమైనది, నిపుణమైనది. ౧౭. శుద్ధము లేక పవిత్రము ఐనది. (తపస్సుచేత) ౧౮. విముక్తమైనది. ౧౯. అతీంద్రియశక్తులఁ గలది. ౨౦. పవిత్రము, పుణ్యము. ౨౧. దివ్యము, అమరము, శాశ్వతము. ౨౨. ప్రఖ్యాతము, సువిదితము. ౨౩. ప్రకాశించునది, తేజరిల్లునది.

**సిద్ధము.** సం. వి. అ. పుం. ౧. అభియోగము. న్యాయవిచారణ. ౨. ఒకవిధమైన కందచక్కెర ౩. నల్లయుమ్మెత్త.

**సిద్ధము.** సం. వి. అ. న. సముద్రలవణము,

**సిద్ధయోగి.** సం.వి.ఇ. పుం. శివుఁడు.

**సిద్ధరసము.** సం. వి. అ. పుం. ౧. పాదరసము. ౨. మణిశిలలోనగు నౌషధవిశేషము.

**సిద్ధరసుఁడు.** సం. వి. అ. పుం. స్వర్ణయోగి, రసయోగి.

**సిద్ధసాధనము.** సం. వి. అ. న. ౧. అతీంద్రియశక్తులను సంపాదించుటకొఱకు మాంత్రికకర్మల నాచరించుట. ౨. మాంత్రికకర్మలందుగాని, రసాయనిక ప్రక్రియలందుగాని యుపయోగింపఁబడు ద్రవ్యములు.

**సిద్ధసింధువు.** సం. వి. ఉ. స్త్రీ. దేవగంగ (గంగానది)

**సిద్ధసేనుఁడు.** సం. వి. అ. పుం. కుమారస్వామి.

**సిద్ధస్థాలి.** సం.వి.ఈ. స్త్రీ. మంత్రసిద్ధునిపాత్ర, కోరినప్పుడు కోరినయాహారపదార్థములతో నిండియుండుపాత్ర.

**సిద్ధాంతకోటి.** సం. వి. ఇ. స్త్రీ. వాదమునందు ఆఖరిదైన నిర్ణయముగాఁ బరిగణింపఁదగిన యంశము.

**సిద్ధాంతకౌముది.** సం.వి. ఈ. స్త్రీ. పాణినీయ వ్యాకరణముపై భట్టోజీ దీక్షితులు రచించిన వ్యాకరణము.

**సిద్ధాంతము.** సం. వి. అ. పుం. ౧. వాదప్రతివాదములపిదప నిశ్చయపఱుపఁబడిన పక్షము. ౨. నవవిధ జ్యోతిషగ్రంథములు. శ. ర. ౩. పూర్వవాదభేదము. ౪. నిర్ణయము.

క. సంతతి రొదఁ దెగినంతన, సంతటి పుణ్యాగతులైన నెదదెగునని సిద్ధాంతము విను సాతమ్ముఁడ! చింతింపకు మొక్కటెఱిఁగి చెప్పెద నీకున్. భోజరా ౬-౪౯.

**సిద్ధాంతి.** సం. వి. ఇ. పుం. ౧. పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతము స్థాపించువాఁడు ౨. శాస్త్రగ్రంథములందు నిష్ణాతుఁడు ౩ మీమాంసాదర్శనమును అనుసరించువాఁడు ౪. తత్త్వశాస్త్రము నెఱింగినవాఁడు.

**సిద్ధాంతీకరించు.** సం.స.క్రి. సిద్ధాంతము చేయు.

**సిద్ధాయము.** సం. వి. అ. పుం. కప్పము.

**సిద్ధార్థము.** సం. విణ. ౧. తీరినకోరికలు గలది.

**సిద్ధార్థము.** సం. వి. అ. పుం. తెల్లయావాలు.

**సిద్ధార్థి.** సం. వి. న. పుం. ఒకానొక సంవత్సర నామము.

**సిద్ధార్థుఁడు.** సం. వి. అ. పుం. ౧. తీరినకోరికలు గలవాఁడు. ౨. శివుఁడు. ౩. బుద్ధుఁడు.

**సిద్ధాశ్రమము.** సం. వి. అ. పుం. ౧. క్షేత్ర విశేషము. ౨. ఋష్యాశ్రమము.

**సిద్ధాసనము.** సం. వి. అ. న. యోగాభ్యాసమందలి యొక విధమైనయాసనము

**సిద్ధి.** సం వి. ఇ. స్త్రీ. ౧. లాభము, ప్రాప్తి. సమగ్రత, సంపూర్తి. ౨. జయము, వృద్ధి, స్వస్తి, ౩. ప్రతిష్ఠాపనము, స్థాపనము. ౪. నిరూపణము, నిదర్శనము, నిర్ణయము. ౫. సామ్రాజ్యము, యాథార్థ్యము. ౬. తీర్పు, నిశ్చయము, పరిష్కారము ౭. నిష్కర్ష, నిజము. ౮. చెల్లింపు, ఆనృణ్యము. ౯. మందులు మొదలగు వానిని వండి తయారు చేయుట. ౧౦. చిక్కువిడఁదీయుట, సమస్యాపరిష్కరించుట. ౧౧. సంసిద్ధత. ౧౨. పరిశుద్ధత, పవిత్రత. ౧౩. అతిమానుషశక్తి (సిద్ధులు ఎనిమిది. అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము) ౧౪. మంత్రౌషధాదులవల్ల అతిమానుషశక్తులు సంపాదించుట. ౧౫. అద్భుతమైన నైపుణ్యము లేక శక్తి. ౧౬. సఫలితము. ౧౭. పరమానందము; మోక్షము, ౧౮. అవబోధము, బుద్ధి. ౧౯. పిధానము, అంతర్ధానము. ౨౦. మంత్రపాదరక్ష. ౨౧. ఒక విధమైన యోగము. ౨౨. ప్రయోజనము, ఉపయోగము. ౨౩. పరిపూర్ణజ్ఞానము. ౨౪. దుర్గాదేవి పేరు. ౨౫. శివుని పేరు. ౨౬. ధరించిన వాని నిచ్చవచ్చిన చోటికిఁగొనిపోవు పావుకోళ్ళు.

**సిద్ధించు.** సం. అ. క్రి. ౧. తటస్థించు. ౨. ఫలించు, ఈడేరు. ౩. ఒదఁగూడు.

వ. ....జన్మత్రయంబున దర్శనంబు సిద్ధించు ననుట సిద్ధంబు. భోజరా. ౬-౩౧౨.

**సిద్ధిదము.** సం. విణ. ౧. విజయము నిచ్చునది. ౨. అష్టవిధ సిద్ధుల నిచ్చునది.

**సిద్ధిదుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సిద్ధియాల.** వి. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొకశాఖ.

**సిద్ధుఁడు.** సం. వి. అ. పుం. ౧. అణిమాదులయిన యష్టసిద్ధులు గలిగిన దివ్యపురుషుఁడు. ౨. అతీంద్రియ దర్శనము గల ఋషి. ౩. యోగి, ముని, ఋషి. ౪. ఇంద్రజాలమునందారి తేరినవాఁడు. ౫. మంచిమేధ గలవాఁడు. ౬. ముక్తుఁడు.

వ. యక్షరక్షో గంధర్వ సిద్ధసాధ్యక బోధ నాది వివిధామర విశేషంబులును.

నార. ౫-౧౧౭.

సీ. అట్టు కర్ణాకర్ణి నవ్వార్త విని భూమిఁ గలసిద్ధులెల్ల నయ్యలఘువిద్యఁ బరికించు వేడుక నరుదెంచుచుండంగ.... భోజరా. ౨-౧౮౪.

**సిద్ధురాలు.** (సిద్ధ+అలు) = సిద్ధిపొందిన స్త్రీ.

తే. గీ. సిద్ధురాలు హేమావతీసితకరాస్యవలపు రేఖాతిశయవైభవమును దెల్ప....

హంస. ౧-౭౮.

**సిధ్మము.** సం. వి. అ. న్. న. ౧. మచ్చ; పొడ. ౨. కుష్ఠవ్యాధి. ౩. కుష్ఠపుపొడ.

**సిధ్మల.** సం. వి. అ. స్త్రీ. ౧. ఉప్పుచేప. ౨. సిధ్మముగలది. ౩. బొల్లి, పొఁడ.

**సిధ్మలము.** సం. విణ. అ. ఆ. అ. ౧. మచ్చలు గలది. ౨. పొడలుగలది. ౩. కుష్ఠవ్యాధి గలది.

**సిధ్యము.** సం. వి. అ. న. పుష్యమీ నక్షత్రము.

**సిధ్రక.** సం. వి. అ. స్త్రీ. వృక్షవిశేషము.

సిధ్రికారణము. సం.వి.అ.న. దేవోద్యానము.

సిధ్రికి. సం. వి. ఈ. స్త్రీ. లింగపొట్ల.

సిధ్రిము. సం. విణ. ౧. పూర్ణము, శుభము. ౨. సంరక్షణము.

సిధ్రిము. సం. వి. అ. పుం. వృక్షము.

సిధ్రుఁడు. సం. వి. అ. పుం. పుణ్యపురుషుఁడు.

సినీవాలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. చంద్రకళతోఁ గూడిన యమావాస్య. పార్వతి.

సిపాయి. హిం.వి.౧. కాలిబంటు. ౨. భటుఁడు.

సిపారసు. హిం. వి. ౧. యోగ్యతావచనము. ౨. యోగ్యతాపత్రిక. శర

సిప్రి. సం. వి. అ. స్త్రీ. ౧. స్త్రీ యొక్క కటిచక్రిము. ౨. మహిషి-గేదె.

3 ఉజ్జయినీ సమీపమునందలి యొక నదిపేరు.

సిప్రిము. సం.వి.అ. పుం. చెమట, స్వేదజలము.

సిప్రుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

సిబ్బంది. హిం. వి. ౧. సేవకులు. ౨. సైన్యము.

సిబ్బి. వి. ౧. ఇత్తడి మున్నగువానితోఁ జేయఁబడిన అంచులులేని గుండ్రిని పళ్ళెము. ౨.మూఁకుడు. 3. పళ్ళిక.

సిబ్బితి. వి. సిగ్గు.

కం. ఇప్పని దలిదండ్రులకుం జెప్పఁగ వలె నంచుఁ గలఁప సిబ్బితి మిగులన్, ముప్పరిగొనఁ జుం బైపయిఁ గప్పు నొరుల చాటువారు గారె కన్నెల్. నీలా. ౨-౮౦.

సిబ్బితికత్తె. విణ. సిగ్గుగల యాడుది.

సిబ్బితికాఁడు. విణ. సిగ్గుగల పురుషుఁడు.

సిబ్బిపళ్ళిక. వి. వెడల్పు మూతిగలగంప.

సిబ్బిమనిమొకము. వి. ఏనుఁగు.

సిబ్బియము. (రూ. సిబ్బెము) వి. బొల్లి, పొడ

సిబ్బుద్ది.

వ. అని యనేకప్రకారంబులఁ దన్ను సిబ్బుద్దివడలఁ బలుకుచున్న వారి నందఱం గటాక్షించి కు. శం. ౬-౧౮.

సిబ్బెత. వి. సిగ్గు.

సిబ్బెము. వి. (సిబ్బియము) ౧ బొల్లి, పొడ. ౨. శోఫ.

సిభాండి. సం.వి.అ.ఈ.స్త్రీ. అగ్నిమేడివృక్షము.

సిర. సం. వి. అ. స్త్రీ. రూ. శిర. ౧. నాడి. ౨. బోలుఁగరము 3 ఈసె.

సిరంగఁడు. వి. శ్రీరంగఁడు

సిరంగము. వి. శ్రీరంగము.

సిరకా. వి. ౧. పులిమెట్టు ౨. పులియఁబెట్టిన కడుఁగునీళ్ళు.

సిరము. సం. వి. అ. పుం. పిప్పిలి కట్టె.

సిరము. సం. విణ. ౧. చల్లనిది.

సీ. సిర మైన పచ్చకప్పురము గందంబుతోడఁ గలిపి పాలిండ్లపై ఁ బూఁది యుఁడది. విక్రమార్క. ౪-౧౬౨.

౨ శిరస్సు.

వృషభగతిరగడ గానిగా సిర మంటె నలపక కప్పదప్పు మేల అంకులు వసు 3-౧౪౮.

3. సీ. చెక్కులక్రేవల సిరపుమించులతోడఁ దరపాల తళుకులు తడఁబడంగ. విక్రమా. ౩-౧౧౬.

సిరసు. వి. శిరస్సు.

సిరస్తాదారు. హిం.వి. ౧. ఒకానొక యుద్యోగి ౨. లెక్కలుచూచువారికి పైయుద్యోగస్థుఁడు. శ. ర.

సిరా. సం.వి.ఆ.స్త్రీ. ౧. రక్తనాళిక, ధమని ౨. గొట్టమువంటిపాత్ర. ౩. ప్రవాహము,ఏఱు.

సిరా. హిం. వి. కలముతోఁ గాగితము మున్నగు వానిపై వ్రాయుటకుపయోగించుద్రవపదార్థము.

సిరాజాలము. సం. వి. అ. పుం. ౧. కంటియందలి ధమనులు ఉబ్బుట. ౨. నాడులసమూహము.

సిరాజి. వి. పరివారము. ౨. ఒకానొక దేశము.

సిరాజి. విణ. శ్రేష్ఠమైనది.

సిరాజీ. వి.౧.సిరాజి. ౨. సంపూర్ణ మగునాణెము కలది. ౩. దేశవిశేషము.

సిరాణము. వి. ఆయుధవిశేషము.

వ. సెలకపై పట్టెంబు సిరాణంబు చక్రంబు మొదలగు నాయుధములు. ఉ. హరి. ౪-౪౧౩.

సిరామోక్షము. సం. వి. అ. పుం. ధమనులను దున్నించుట.

సిరావ్యధము. సం. వి. అ. పుం. ధమనులను దున్నించుట.

సిరి. వి. ౧. లక్ష్మి. ౨. సంపద. ౩. శోభ.

ఆ. వె. అంత నీలఁగూడి....బులుగుదాశ్వేలు పుతలఁకులేని సిరులఁ దనరుచుండె.
నీలా. ౩-౧౧౨.

సీ. సొగసుగా విరిపదుల్ చుట్టి గట్టిగ నిద్దనిగ నెంపు వాఁడెంపుసిరుల సీ:. నీలా. ౨-౫౦.

౪. వీధిబడియందు మనుమందు వచ్చినవారికి చెప్పెడుగుర్తు.

సిరికమ్మ. వి. అడ్డకమ్మ. ౨. తోరణపుఁగమ్మ.

సిరిగంధము. వి. (రూ. శ్రీ గంధము) ౧. చందనము. ౨. శ్రీ చందన వృక్షము.

వృషభతి రగడ: అలసి యలసిరి గంధ మదరెదు పాదపాదభుజంగి వగుదువె. కను. ౩-౧౪౮.

సిరిగట్టు. వి. శ్రీశైలపర్వతము.

సిరిచూలి. వి. శ్రీ పుత్రుఁడు, మన్మథుఁడు.

సిరిమంతుఁడు. విణ. శ్రీమంతుఁడు.

సిరివరుణుఁడు. వి. విష్ణువు.

సిరిసింగనాలవృత్తి. బాలక్రీడావిశేషము. (రూ సిఁసింగణావృత్తి; సిరిసింగణాలవృత్తి)

సీ. విమతుఁ డెందేగిఁ జెమరెద నన్న యున్నతి వాఁడు సిరిసింగణాల వృత్తి. రా. వి. ౨-౨౩.

సీ. చిట్టిబొట్లాకాయ సిరిసింగణావత్తి, గుడుగుడు గుంచాలు తందనగుడి. శ్రీకాళహస్తి ౩-౩౩.

సిరోత్పాతము. సం.వి.అ. పుం. ౧. ధమనులకు సంబంధించినవ్యాధి. ౨. కంటిశలాక.

సిల. వి. (రూ. సెల. ) నీరుపట్టుతావు.

సిలము. సం.వి.అ.న. (రూ.శిలము) ఉంఛవృత్తి.

సిలాజితు. వి.(రూ.సిలాజిత్తు) ఒకానొక మందు దినుసు.

సిలుగు. వి. ౧. ఉపద్రవము.

కం. మఱిచ్చులు జారులుఁ బోరిఁబోరి జిచ్చులఁ గఱవులను రాచసిలుగులఁ జెడియుం జచ్చియుఁ బ్రజకొంచెమగా నెచ్చోట్లును బాడయగు మహీతల మెల్లన్. హరి. ౯-౪౪.

౨. హాని ౩. కష్టము.

సిలువ. వి. క్రీస్తును బంధించి వధించిన కొయ్య.

సిల్హము. సం.వి. అ. పుం. ౧. చిల్లమడ్డి. ౨. అందుగు బంకతోఁ జేసిన సుగంధ ధూపద్రవ్యము.

సివంగి. వి. ౧. సివఁగి. ౨. సివంగివలెనుండుకుక్క. ౩. కస్తూరి.

చ. పులియఁడు బూచిగాఁ దనురపోతులరా జను
మంతిగాఁడు చెంగలువసివంగి కైరవుఁడు....
మనుచ. ౪_౩౨.

సివము. వి. ( రూ. శిగము ) ౧. ఆవేశము. ౨. దైవము మేనిమీఁదికివచ్చుట.

సివమెత్తు. అ. క్రి. దైవావేశమగు.

సివరము. సం. వి. అ. పుం. ఏనుఁగు.

సివా. అవ్య. ( రూ. సివాయి ) తప్ప, కాక

సివారు. వి. (రూ. శివారు) పెద్దగ్రామమునకుఁ జేరియుండు చిన్నపల్లె.

సివిలు. ఆం. విశే. ఆస్తివిషయమైనది. శ. శ.

సివ్వఁగి. వి. సివంగి.

సిషాధయిష. సం. వి. ఆ. స్త్రీ. ౧. సాధించు కోరిక. ౨. నిరూపించు కోరిక.

సిసల్ (లు) హిం. విశే. నిర్ధారణమైన శ. ర.

సిసువరకము. వి. కుకూ్రమ.

సిసువు. వి. ( రూ. శిశువు. ) బిడ్డ.

సిసువుఁడు. వి. శిష్యుఁడు.

సిసృక్ష. సం. వి. అ. స్త్రీ. సృష్టింపవలె ననుకోరిక.

సిసృక్షువు. సం. విశే. సృష్టింపవలె నన్నకోరిక గలవాడు.

సిసృప్స. సం. వి. ఆ. స్త్రీ. పోవలె నన్నకోరిక

సిసృప్సువు. సం. విశే. పోవలె నన్నకోరిక గలవాఁడు.

సిస్తు. వి. ౧. కప్పము ౨. పన్ను. ౩. రాజసందర్శనవేళ నిచ్చుదుకానుకర. అందము. ౫. సొంపు:

సిహుండము. సం. వి. అ. పుం. కెముడు ¦

సిహుల్లిక. సం. వి. అ. స్త్రీ. కాళ్ళు చేతులు పగిలిన కుష్ఠువు.

సిహ్లకము. సం. వి. అ. పుం. ( సిహ్లము. రూ.) ధూపము.

సిహ్లకి సం. వి. ఈ. స్త్రీ. ( సిహ్లి ) సాంబ్రాణి చెట్టు.

సిహ్లభూమిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. సిహ్లము. ౨. ధూపము.

సిహ్లము. సం. వి. అ. న. ౧. సిహ్లము. ౨. ధూపము.

సిళ్ళు. వి.(సిడులు)౧. ములుకోల. ౨. అంకుశము. ౩. బఁకోల.

క. చౌలు విడు మనిన పలు కెద గొలవిం గొని
చూడఁట్టు గొని కాలఁగ బిట్టుఁ గోవ
వహ్నిఁజూచెం జాలిచుతి మదకరికి సిళ్ళు
మూపిన భంగిన్. కు. సం. ౧౦-౧౪౪.

## సీ

సీ(అవ్య) జుగుప్సా సూచకమైన యవ్యయము.

సీ. వి. శ్రీ, సంపద శ. ర.
" సీ రామ సేన వాలు మెకంబుల్ " మను.౪౫.

సీకరము. సం. వి. అ. పుం. గుంపరులు గాఁ బడు వానతుంపర (శీకరము)

సీకాయ, వి. శిఖాఫలము, నూనె మొదలగువాని జిడ్డును పోఁగొట్టుదినుసు.

కారి, వి. గాయకుఁడు.

సీత. సం. వి. ఆ. స్త్రీ. ౧ శ్రీరాముని భార్య. ౨. నాఁగటిచాలు. ౩. దున్నఁబడినభూమి. ౪. గంగ. (తూర్పుశాఖ) ౫. మద్రపతి కేతనపు గుర్తు. ౬. వ్యవసాయము ౭. ఇంద్రునిభార్య. ౮. ఉమ. ౯. లక్ష్మి. ౧౦. మద్యము.

సీతభేది. వి. అనువిశేషము.

సీతాకోకచిలుక. వి. చిత్రవర్ణమయమైన పెద్ద రెక్కలు గల యొక పురుగు.

సీతాద్రవ్యము. సం.వి.అ. న. వ్యవసాయపుఁ బనిముట్లు.

సీతాధ్యక్షుఁడు. సం. వి. అ. పుం. వ్యవసాయ పర్యవేక్షకుఁడు.

సీతా (తీ) నకము. సం. వి. అ. పుం. బటాణీ గింజ.

సీతాపతి. సం. వి. ఇ పుం. శ్రీరాముఁడు.

సీతాఫలము. సం.వి.అ.పుం. ౧. ఫలవిశేషము, ౨. సీతాఫలపుచెట్టు.

సీతాభోగములు. (బహు.) సం. వి. అ. పుం. శాలిధాన్యము.

సీతి. వి. శైత్యము.

సీతు (వు) వి. ౧. చలికాలము.

సీ. వానయు సీతును వర్జించి మంచు వేసవి గాక
మాన్న సస్యములపంట లాదవెడు తడి చెత్తు
నది శత్రుపయి. భా. శాం. ౨. ఆ.

౨. చలి.
సీతుసకలాంగకంబులు పిరితున్నము లయ్యెడు.
భా. శాం. ౩. ఆ.

సీతోపీగము. సం. వి. అ. పుం. వట్టివేరు.

సీత్కారము. సం.వి. అ. న. ఊపిరిని నోటితో లోనికిఁ బీల్చునప్పుడు చేయుధ్వని.
(నిట్టూర్పు చలిబాధ మున్నగు వాని నిది సూచించును)

సీత్కృతము. సం. వి. అ. న. సీత్కారము.

ఉ. జాన దొలంగి చుంబన పెంపెసర్చుచె శా
దోశఁడోశు వంతరిబిం జానునెపాయు
జందుర్తిఁ జమ కాంతర బింబికుబిం బునఃపునః
పానకపానకర్మము పెంపంబునఁ జేసి తదోష్ఠ
పల్లవం, బానుచు జాచరించెను సముచిత
సీత్కృత చూత్కృతంబులన్.
శృం. నై. ౬-౧౩౮.

సీత్కృతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. సీత్కారము. ౨. రతిధ్వనివిశేషము.

సీత్యము. సం. విశే. అ. అ. అ. దున్నఁబడినది (నేల)

సీత్యము. సం.వి.అ. న. బియ్యము; వరిధాన్యము

సీదరవుఁబెద్ద. వి. అదిశేషువు.

సీదరము. వి. (రూ. సీదరము.) ౧. ఎద్దడి. ౨. బీదతనము ౩. సర్పము.

సీ. అనయంబు నడకతప్పని గోత్రపతు లెవ్వ
డును సీదరములేని యనఘభోగులు.
వసు. ౧ ఆ. ౯౫. (చివరి రెండర్థములకు)

సీ. తరితాడు సీదరంబు పొర లంటి గాలిచే
జడియు చందమున నంచలు భ్రమింప.
పాండు. ౨. ఆ.

సీద్యము. సం. వి. అ. న. సోమరితనము.

సీధుగంధము. సం. వి. అ. పుం. ౧. వకుల వృక్షము. ౨. మద్యవాసన.

సీధుపము. సం. విశే. అ. అ. అ. మద్యము త్రాగునది.

సీధుపానము. సం. వి.అ.న. మదము త్రాగుట.

సీధుపుష్పము. సం.వి.అ.పుం. కదంబవృక్షము, వకుళవృక్షము.

సీధుపుష్పి. సం.వి.ఈ. స్త్రీ. ధాతకి, ఆరెపువ్వు

సీధురసము. సం.వి. అ. పుం. ౧. మామిడిచెట్టు ౨. మధురసము.

**సీధువు.** వి. (రూ. శీధువు) ౧. పక్వమైన చెఱకు రసము నుండి చేయఁబడిన కల్లు. ౨. మద్యము. 3. ఏనుఁగు కన్నులయందలి మదము.

తరల. పదనుమీఱు రసాలపేశల పల్లవావళి మెక్కులం, జిడిమి కుత్తుకబంటి తద్రిస సీధువుం గొని చొక్కి సక్కదమూకోయిలగుంపు .. శార. ౨-౧౧౦.

**సీధుసంజ్ఞము.** సం.వి. అ. పుం. వకులవృక్షము.

**సీధ్రము.** సం. వి. అ. న. గుదము (?)

**సీనా.** వి. మెత్తని చక్కెర.

**సీపము.** సం.వి.అ. పుం. పడపరూపమున నుండు యజ్ఞపాత్రము.

**సీపి.** హిం. వి. ముత్యపుఁజిప్ప.

**సీమ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఎల్ల, పరిహద్దు. ౨. ఎల్లక్షేత్రాదుల యెల్లలను సూచించుగుట్ట. 3. గుర్తు. ౪. తీరము. ౫. క్షితిజము. ౬. పుఱ్ఱెయందలి వాని వంటి కుట్టు. ౭. ఔచిత్యమర్యాద ౮. అత్యున్నతి. ౯. కాలము. ౧౦. మెడవెనుకభాగము. ౧౧. అండకోశము. ౧౨. కేశాభరణము.

**సీమ.** సం.వి.న.స్త్రీ.౧.ఎల్ల,పరిహద్దు, పొలిమేర ౨. అండకోశము. 3. పెడదల. ౪. వరిమడి.

**సీమ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఎల్ల ౨. ప్రదేశము 3. పరిమాణము. ౪. వరిమడి. ౫. వృషణము. ౬. ఉనికి ౭. చెఱువు మొదలగు వాని గట్టు.

సీ. అమృతపూరాశ్చర్య తమవిరజానదీ సీమావరుద్ధసంస్కృతికథంబు. కళా. ౮-౨౦౪.

చ. లలన యొకర్తు వగ్గు కృకలాసముఁ జేరఁగఁ దెచ్చి వంచనన్ నలునకుఁ బంచె వట్టు నెలబాగపదద్వయమధ్యమంబునన్ నిలిపిన, గాలు ప్రాఁక నది నీలియ సీమకు. శృం. నై. ౬-౧౧౧.

**సీమంతకము.** సం. వి. అ. పుం. పాపటదిద్దుట.

**సీమంతకము.** సం.వి.అ.న. సిందూరము, కెంపు.

**సీమంతకుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొక నరకవాసి.

**సీమంతమండనము.** సం.వి.అ. న. సిందూరము

**సీమంతము.** సం. వి. అ. పుం. ౧. పాపట.

శా..... పౌరాంగనా, సీమంతంబులఁ బుష్పరేణువునుచున్ సిందూరరేఖాకృతిన్. విక్ర. ౧-౯౬.

౨. గర్భ సంరక్షణార్థము. 4, 6 లేక 8 వ నెలలో చేయునట్టి కర్మవిశేషము.

గీ. పొలఁతికిని గర్భ మేర్పడఁ బుంసవనము మూఁడుగా నాలు నెలలసీమంతవిధియుఁ జేయఁదగు.... విజ్ఞా. కాం. ౧-౧౪.

3. పరిహద్దురేఖ. ౪. పొలిమేర.

**సీమంతితము.** సం. విశ. అ. ఆ. అ ౧. పాపట వలె విడదీయఁబడినది. ౨. గీఁతచే విడఁదీయఁబడినది.

**సీమంతిని.** సం.వి.ఈ.స్త్రీ. ఆఁడుది, ముత్తైదువు.
సీ. సుమతి సీమంతినీ కమనీయ శశికాంత పాంచాలికా శితభానుఁ దగుచు విక్రి. ౧-౧౬౩.

**సీమంతోన్నయము.** సం. వి. అ. పుం. ౧. సీమంతము. ౨. గర్భవతులకు 4 వ 6 వ లేక 8వ నెలలలో పాపట తీయు నుత్సవము.

**సీఅగిసె** వి. ఒక విధమైన అగిసె.

**సీమక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చీమ. ౨. చీమల పుట్ట. 3. వాలుక క్రింద నుండు కురుపు.

**సీమకము.** సం.వి.అ. పుం. ౧. వృక్షవిశేషము. ౨. చీమలపుట్ట. 3.చీమ లేక చిన్నకీటకము.

**సీమకరక.** వి. శ్లేష్మమును హరించు ఓషధి విశేషము.

సీమటపాకాయ, హి. వి. చిన్నరకము టపాకాయ.

సీమరేగు, వి. పెద్దరేగుపండు ( యాపిల్ ).

సీమలింగము, సం. వి. అ. న. సరిహద్దు గుర్తు.

సీమవంగ, వి. రామమునగకాయ (టొమేటో).

సీమాంతము, సం. వి. అ. పుం. సరిహద్దురేఖ.

సీమాంతపూజనము, సం. వి. అ. న. ౧. గ్రామపు సరిహద్దును బూజించు నుత్సవము. ౨. గ్రామపుఁ బొలిమేరకు వచ్చినప్పుడు నూతన వరుని సత్కరించుట.

సీమాటి, వి. సౌభాగ్యవతి.

సీమాధిపుఁడు, సం. వి. అ. పుం. పొరుగురాజు.

సీమానిశ్చయము, సం. వి. అ. పుం. సరిహద్దు విషయమై చేయఁబడిన న్యాయస్థానపుఁదీర్పు.

సీమాలింగము, సం. వి. అ. పుం. సరిహద్దురేఖ.

సీమావివాదధర్మము, సం. వి. అ. పుం. సరిహద్దు వివాదములకు సంబంధించిన న్యాయము.

సీమావివాదము, సం. వి. అ. పుం. సరిహద్దుల విషయమై యేర్పడు తగాదా.

సీమావృక్షము, సం. వి. అ. పుం. సరిహద్దు గుర్తుగానుండు చెట్టు.

సీమాసంధి, సం. వి. ఇ. పుం. రెండెల్లలుకలియుచోటు.

సీమాసేతువు, సం. వి. ఉ. పుం సరిహద్దుగానుండు గట్టు లేక వంతెన.

సీమోల్లంఘనము, సం. వి. అ. న. సరిహద్దునతిక్రమించుట.

సీరకము, సం. వి. అ. పుం నాఁగలి.

సీరకుఁడు, సం. వి. ఉ. పుం. సూర్యుఁడు.

సీరధ్వజుఁడు, సం. వి. అ. పుం. జనకుఁడు.

సీరపాణి, సం. వి. ఇ. పుం. బలరాముఁడు.

సీరము, సం. వి. అ. పుం. ౧. నాఁగలి. ౨. జిల్లేడు మొక్క.

సీరయోగము, సం. వి. అ. పుం. ఎడ్లను నాఁగలికిఁ గట్టుట.

సీరవాహకుఁడు, సం. వి. అ. పుం. కర్షకుఁడు.

సీరాంగము, సం. వి. అ. న. నాఁగటి కట్టు.

సీరాయుధుఁడు, సం. వి. అ. పుం. శివుఁడు.

సీరాసనము, సం. వి. అ. న. సీరము.

సీరి, సం. వి. న్. పుం. బలరాముఁడు.

గీ. నడుమ నయిదు బాణంబుల నఱకె సీరి.
ఉ. హరి. 3-26.

సీరుఁడు, సం. వి. అ. పుం. సూర్యుఁడు.

సీర్ణము, సం. వి. అ. న. చల్లఁబడినది.

సీల, రూ. చీల. మేకు, మొల.

సీలంధము, సం. వి. అ. పుం. ఒకవిధమైనచేఁప

సీలమండ, వి. (రూ. చీలమండ) చరణగ్రంథి.

సీలము, సం. వి. అ. న. నాఁగలి.

సీలు, ఆం. వి. ౧. ముద్ర. ౨. అచ్చుపోఁత. 3. తిరుగుట.

సీవకుఁడు, సం. వి. అ. పుం. కుట్టువాఁడు.

సీవనము, సం. వి. అ. న. ౧. బట్ట మొదలగునవి కుట్టుట ౨. కుట్టు.

**సీవని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. సూది. ౨. గుఱ్ఱము గుదస్థానము క్రిందిభాగము.

**సీవిరి.** వి. ఆలవట్టము ౨. వింజామర. ౩. కల్లు.

**సీసకము.** సం. వి. అ. న. ౧. సీసము. ౨. సత్తు ౩. మల్లబంధవిశేషము.

వ. వాసుదేవుండు సీసకంబు పూంచిన కైవడి యుండు. ఉ. హరి. ౩-౬౪.

**సీసజము.** సం. వి. అ. న. సిందూరము.

**సీసము.** సం. వి. అ. న. ౧. సీసకము. ౨. సత్తు ౩. ఛందోవిశేషము. ౩. వెట్టి. ౪. రోషము.

**సీసా.** వి. గాజుపాత్రవిశేషము.

**సీహుండము.** సం. వి. అ. పుం. జెముడు చెట్టు.

## సు

**సు.** ఉపసర్గము. ౧. మంచి. ౨. తగిన. ౩. పూర్ణము. ౪. సమృద్ధము. ౫, ఆశ్రమము. ౬. అందమైన.

**సు=చు.** అవ్య.

"చు అను నవ్యయము కళలమీఁద గసడదవాదేశముచే సు అగును. చూ: చు

**సుంకపుఁగాసులు.** అడవులనుండి కట్టెలు మొ॥ తెచ్చుకొనుటకై చెల్లించెడి రొక్కము.

చ. వలనగు పుట్టగోచి బిగివాళ్ళను సుంకపుఁగాసులు న్విభా, విలు కరసాన గొడ్డలియుఁ జిక్కమునన్ సారకాయబుఱ్ఱలోఁ, బలిదియు సుంచి బంధుజనసంగతి దర్పవిభీతి లోఁగుచున్, గొవులఁబోసుకొంచు నరిగెన్ హసంబునకై రయంబునన్. శుక. ౩-౨౪౭.

**సుంకమడుగు.** సుంకమిమ్మని నిర్బంధించి యడుగు.

సీ.... వన పింఛమయ భూష లవధరించి నటించు పంకజాక్షుని చెల్వు సుంక మడిగి;.... మను. ౩-౧౯. ప్రా.

**సుంకము.** (సం. శుల్కమ్. ప్రా. సుంకో. సుంగో. క. సుంక.) వి. వర్తకులపైని విధించెడి పన్ను.

సీ. తే.గీ.... సుంక మన దాణ మనఁగను శుల్కమెసఁగు.... ఆం. భా. ౨-౧౯౨.

సీ. ధాన్యములు సువర్ణాదాయములును దుర్గాదుల నుడియు బేహారుల సుంకములును. ఉత్తరహరివంశం ౧-౬౭.

౨. వివాహమునందుఁ గన్యక కిచ్చుధనము.

ఎ.గీ. ఉంకువన వోలియనఁగను సుంకమనఁగఁ బైఁడి యనఁగన్యకాశుల్క వాచకమగు. ఆం. భా. ౨-౧౭౯.
(సంకనంగ అని ముద్రితపాఠము)

౩. ప్రతిబంధము.

చ. అతఁడు తదల్పపాపఫల మందుట సుంకము తీఱిపోయి త, చ్ఛతదళపత్ర నేత్రునకుఁ జాఁగిలి మ్రొక్కి. అము. ౬-౪౪.

**సుంకముపట్టు.** పన్నురాఁబట్టు.

చ. సుంకము పట్టునఖాంకురాంకము. శృం. నై. ౫-౧౦౩.

**సుంకరి.** వి. శుల్కాధికారి; పన్నురాఁబట్టువాఁడు (సుంకము + అరి).

సీ.... శుల్కాధికారి, చనుసుంకరి యనఁగను.... ఆం. భా. ౨-౧౭౩.

క. నమ్మకు సుంకరి జూదరి. సుమతి. శ. ౬౨. ప్రా.

క. పరకమ్మోడు బేహారులు, పరపతి సుంకరుల కెక్కనమ్మకతోడన్, పరకమ్మిన సొమ్మునఁ దా, కరువదియగు పాలు సుంకమీఁదగుఁ దీర్చెన్. విజ్ఞా. ప్రా. కాం. ౭౩.

సీ. కాలంబు పేరి సుంకరి యంబరంబునఁ బొడిచి నట్టి యరుణముద్ర యనఁగ. (సూర్యోదయ వర్ణనము.) రాజవాహన. ౩-౨౯. ప్రా.

క. నీ నడకలు గంటిఁగదే, యీ నవనగరఁ జెప్పి కారించెద ని,స్నేహంచుఁ గుంటి సుంకరి, పూనిక బెదరించుఁబోలఁతి బొమముడి పెట్టన్. శుక. ౩-౩౫౭.

గీ. మాట నిలకడ సుంకరి మోటకేల, చవిటి వానికి సత్కథాశ్రవణమేల. రమ. శ. ౩౩. ప్రా.

**సుంకరీఁడు.** వి. (సుంకరి+ఈఁడు) శుల్కాధ కారి; సుంకము తీయువాఁడు.

క. అడిగిన పతితో నిట్లను, దడవాయెను సుంక రీఁడు తమలెక్కలకై పడియున్నాఁడిద కను మని, పడఁతి యతనిఁజూపఁజూచి భయము ప్రాపంగన్. హంస. ౪-౧౧౫.

**సుంకీఁడు.** వి. శుల్కము పుచ్చుకొనువాఁడు; పన్ను రాఁబట్టువాఁడు.

ద్వి. వెంకదామంచయ్య లీల మీనగరి, సుంకీఁడు కుంకెళుబంక య్యగారు. బస. పురా. ౨౬. ౩౭ పు. ౪౭౭౫.

**సుంకు.** వి. ౧. సస్యకుసుమరజము; పువ్వాకి; రజస్సు; దుమ్ము.

సీ....సస్యకుసుమసంజ్ఞ చను సుంకసంగను.... ఆం. భా. ౨-౨౩౭ ప్రా.

మ. బిరుదున్ గంటలు గట్టి సుంకు వెలయన్ బింకంబుతో సెంతిగాఁ గఱపిల్ జూపెను బోదు దన్ విరిసి సుత్రిక్కన్ ప్రాలుచున్ గంకిగాఁ బరువొందం దెగుసంతెగాఁ గలమ గర్భంబుల్ ద్రుణపాత్రియామై, సరసీజానన జంఘకా ప్రతిథికంచన్ సాటిరా సేస్పుసే. ఉత్తరహరివంశం. ౩-౫౭ ప్రా.

ద్వి. కరమూల యొగలి బంగరు సుంకురాల విరి బంతి కెంగేల వికసింప మఱియు. ద్వి. పరమ. ౨-౫౭ ప్రా.

మ. అనుచుం గాంచన కింకిణీరవముతో నాబద్ధ మాల్యాసితో, మిసిమిల్ దట్టపుఁబట్టెసామ ములతో మేలుక్కునన్ బోసి తె,ద్చివదుల్లున్ గుడికోలలుం దరుముచున్ కేళాల్దులన్ మోది యొక్కనిఁబోనీయక సుంకు రాలిచిన రక్త స్రావ గాత్రంబునన్. శ్రీరంగ. ౩-౯౭ ప్రా.

౨. ప్రతిబంధము.

సీ. మీనులఁ బుట్టించి మెఱుఁగులఁబుట్టించి ముత్తులఁ బుట్టించి సుంకణంచి. కవిక. ౩-౪౭. శ. ర. పా.

౩. పెండ్లియందుఁ బళ్ళెరమునఁబోసి వధూవరుల మీఁద చెరుగు వడ్లపాట్టు.

క. శంకరరాజత్కుఁడలకుఁ, బంకజనేత్రలకుఁ బుణ్యభాగులకు సుమా, శంకరభక్తుల కప్పడు, సుంకులు చల్లిరి శశాంక సుందరవదనల్. బ్రహ్మోత్తర. ౩-౧౭౦.

క. పల్లవపాణులు గొందఱు పళ్ళెరములఁ బూని యవల బంగరు గాజుల్ ఘల్లురన సుంకుఁ జెరిగిరి, యల్లో నేరెడటంచు న య్యిందిరకున్. ప్రబం. ౧-౧౫౧.

వ. బెగ్గురు పెండ్లికొడుకునకు సుంకులు చల్ల ఘన వేణికా సమాజంబు. చంద్రికా. ౪-౬౭.

కం. సంకులు బెరిగిరి మునివర, పంకజలోచనలు సువ్విపాటనటో శే. యంకురము లెత్త సభ వారింకను వినవలె నటంచు రేమనరక్తిన్. పార్వ. ౫-౧౨౧.

వ. ఇరుగెలంకుల కుంకుమపు సుంకుల వెదచల్లు బింకపుచంకలపొంకంబును. ప్రబం. ౧-౭౭.

**సుంకేసరి.** వి. వృక్షవిశేషము.

సీ. గొగుపాగదములు గోరంటలును బెద్దవెలమ సుంకేసరివెత్తిచిక్కి. హంస. ౪-౧౧.

సుంకెసల సుంకాసరి, అని బ్రౌ.

**సుంకేసలము,** వి. వృక్షవిశేషము.

**సుంత,** వి. కొంచెము; ఇంచుక.

క. ఏ నింతవాఁడ వేవయి, భూనుతుఁడవఁట యెద్ది
గాకపోయెదు వని సుం, కైన ఫల మందఁడీ
యదు, మానవులకఁ గాదు విను మమర్త్యుల
కైనన్. పాండు రంగ. ౫-౨౬౩.

ద్వి. చూడు మేమందు నీచుఁడ సుంతలోన,
వాడుదానిది యేను రంటకపోడు.
పారంగ. ౧-౩౧ పు. ౯ పం.

సీ. వరశంఖపూగసంపద గళస్థమునీకు సతి
పోఁకముడి సుంత సడలరాదె.
చంద్రికా. ౬-౧౩౩.

**సుందరము.** సం. విణ. అ. ఈ. అ. ౧. అంద మయినది. ౨. ఆదరపాత్ర మయినది.

**సుందరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. అందకత్తె. ౨. ఒకానొకచెట్టు.

సీ. చిటిగార సుందరి చీకట్టిదమ్మయుఁ దల్ల
దమ్మల్లిందకళ్ళితొట్టి. హంస. ౪-౯.

**సుకంటక.** సం. వి. ఆ. స్త్రీ. ఔషధమునకుఁ బనికివచ్చు నొకమొక్క. †

**సుకందువు.** సం. వి. ఉ. పుం. గజ్జి, చీడ.

**సుకందకము.** సం. వి. అ. పుం. ఉల్లి

**సుకందము.** సం.వి.అ.పుం. ౧. ఉల్లి. ౨. తృణ విశేషము. ౩. చిలకడదుంప.

**సుకత.** సం. వి. ఆ. స్త్రీ. సాధువుకాని యావు; బత్తియు. (శ. ర.)

**సుకదట్టము.** వి. చిలుకపచ్చవన్నెగల బట్ట.

రగడ. గిండెంబులు బతి నీలిదపలీలను గిము
కాకరకుల సుకదట్టమ్ములు .... కలిగిన తలు
వన్నెలపుట్టంబులు. కవి. ౩-౧౯౫.

**సుకము.** (సం. సుఖమ్) వి. హాయి.

సీ. తే.గీ.... హాయి సుకము సుమారకము ఉవఁగ
సుఖము.... ఆం. భా. ౧-౯౭.

ద్వి. వకవకలై యింతపత్రము దక్కనను-సుకము
దక్కకపోయెఁ జూచిరే యనుచు,
ద్వి. పరమ. ౪-౩౦౨ పు. వ్రా.

**సుకర.** సం. వి. ఆ. స్త్రీ. సాధువైనయావు; తేలికగా మాలిమి యైనయావు.

**సుకరము.** సం. విణ. అ. ఆ. ఈ. అ. సులభ మైనది, సులభముగాఁ జేయఁదగినది.

**సుకరము.** సం. వి. అ. న. వితరణము; ఔదార్యము; ఈవి.

**సుకర్మము.** సం. వి. న్. న. ౧. మంచిపని. ౨. ఒకగ్రహయోగము.

**సుకర్ముఁడు.** సం.వి.న్. పుం. ౧. ధర్మకర్మము చేయువాఁడు. ౨. విశ్వకర్మ.

**సుకలుఁడు.** సం.వి.అ.పుం. దాతయు, భోక్తయు నైనవాఁడు; దానధర్మములచేత ఖ్యాతి గడించిన వాఁడు.

**సుకవాసి.** విణ. కష్టపడక సుఖముగా నుండు వాఁడు.

ద్వి. ధనరాశి యిచ్చోటఁ దఱలక యిత్తు, నొక
విచారము మాకు నొదవె నీరాజా, సుకవాసి
పనిపంద చూపు గుత్తంబు.
హంస. ఉత్త. ౧౪౯౬. వ్రా.

**సుకసుకము.** వి. మిక్కిలిసుఖము. (సం. సుఖసుఖమ్)

ద్వి. లోలత నఱచేతిలో నిమ్మపండు. లీల బో
షింప లాలిత వైభవమున, సుకసుకంబున నుండి
స్రుక్కక చావఁ గొకరించెదవు విధి గెలువ
నీవశమె. నవనాథ. ౧-౬౭ పు. ౧౫ పం.

ద్వి. సుకసుకంబున నుండి సుతసోదరాది, సకల
బాంధవులతోఁ జావఁగోరదవు.
రం. రా. అర. కాం. ౧౭౧ పు. ౭ పం. వ్రా.

**సుకాండము.** సం. వి. అ. పుం. కారవేల వృక్షము †

**సుకాండి.** సం.వి.న్. పుం. తుమ్మెద.

**సుకాండిక.** సం. వి. ఆ. స్త్రీ. కాండీరలత.

**సుకాష్ఠము.** సం. వి. అ. న. వంటచెఱకు.

**సుకారి.** వి. ఎద్దులమీఁద సరకు కెత్తించుకొని యూరూరు తిరిగి వర్తకము చేసెడి యొకజాతి

సీ. ఆడుబిడ్డ సుకారియల్లుఁడు పింజారిమఱఁదలు గోడలు మారువాడి. ....శతకము. శర;

**సుకించు.** (సం. సుఖించు) అ. క్రి. సుఖపడు, క్షేమముగానుండు.

క. విసుగులు మేమును నీదయ, పసి జొప్పడ నడవిఁ గడుపు చల్లఁగ దలకె, ద్దెసఁ బొద్దు వోడుచు పెఱుఁగక, యొసపరి గీముల సుకించి యుంటిమి సామీ.

రామేశ్వరమా. ౫-౬౯ ప్రా.

**సుకిని.** వి. సుఖవతి.

**సుకియ.** వి. ఐ. భక్ష్యవిశేషము, బూరెలు అని బ్రా.

ద. అప్పములు పెన్నప్పములు సుకియ లమృత కలశంబులు లాగులు చక్కెరబురు లుక్కెరలు. ప్రబం. ౧-౧౧౨.

మ. ఇది రమ్మాని కుపాయనంబులు మనోభీష్టంబుగా బూరియల్, వడలుం జక్కెర కజ్జెకాయలును బాద్షా లుక్కెరల్ పూర్ణపుం, గుడుముల్ గారెలు బెల్లమండిగలు నాఁగుల్ కమ్మచాఁపట్లు నూ,టిడులున్ దోసెలు నప్పముల్ సుకియలున్ హేగాళమై కన్పడన్. రామా. ౨-౧౧౫. ప్రా.

సీ. కుడుములు సుకియలుఁ గడియంపుటట్లు పె, న్నప్పాలు వడియంబు లప్పడాలు.

కళా. ౪-౮౧. ప్రా.

**సుకియించు.** అ. క్రి. సుఖించు.

ఎ. గీ. గుండియలు ప్రమింగి దిగకున్న గ్రుడ్లు మిడిచి ధరణిఁ బొరలాడు పెనుమదిదయ్యములును, మూడును నంజాళ్ళు మచ్చటముసుఁగ మెసఁగి, చొక్కి సుకియించు బలితంపురక్కసులును.

మైరా. ౩-౧౪౩. ప్రా.

**సుకుందకము.** సం. వి. అ. పుం. ఉల్లి.

**సుకుమార.** సం. వి. ఆ. స్త్రీ. దొంతరమల్లె. ౨. అరటి.

**సుకుమారము.** సం. విశ. అ. ఈ. అ. ౧. మృదువైనది. ౨. అందమైనది. ౩. లేఁతది.

**సుకుమారము.** సం. వి. అ. పుం. ౧. శాలిధాన్యము. ౨. ఒకవిధమైన చెఱకుగడ ౩. శ్యామాకధాన్యము. ౪. ఆవాలు. ౫. అడవిసంపంగి.

**సుకుమారము.** సం. వి. అ. న. తమాలపత్రము

**సుకుమారి.** సం. వి. ఈ. స్త్రీ. నవమల్లిక

**సుకుమారుఁడు.** సం. వి. అ. పుం. ౧. లేఁతవయస్సువాఁడు. ౨. యువకుఁడు. ౩. అందగాఁడు

**సుకృతము.** సం. విశ. అ. ఆ. అ. ౧. చక్కగాఁ జేయఁబడినది. ౨. పూర్తిగాఁజేయఁబడినది. ౩. యోగ్యముగా నిర్మింపఁబడినది. ౪. సహకరింపఁబడినది. ౫. పవిత్రమైనది, పుణ్యమైనది. ౬. అదృష్టవంతమైనది.

**సుకృతము.** సం. వి. అ. న. ౧. ధర్మకర్మము, మంచిపని. ౨. పుణ్యము. ౩. అదృష్టము, శుభము. ౪. ప్రతిఫలము, లాభము.

**సుకృతి.** సం. విశ. న్. మేలుచేయునది. ౨. శుభమైనది, పుణ్యమైనది. ౩. తెలివి గలది, వివేకము గలది. ౪. ఉదారమైనది, దయ గలది. ౫. అదృష్టము గలది.

**సుకృతి.** సం. వి. న్. పుం. ౧. మంచిపని చేయువాఁడు. ౨. పుణ్యశాలి. అదృష్టవంతుఁడు, కృతార్థుఁడు.

**సుకృత్తు.** సం. విశ. త్. తి. త్. ౧. మేలు చేయునది. ౨. లాభకరమైనది. ౩. పవిత్రమైనది.

౪. విజ్ఞమైనది, తెలివిగలది. ౫. మంచియాగములు చేయునది.

**సుకృత్తు.** సం. వి. త్. పుం. ౧. నిపుణుఁడైన పనివాఁడు. ౨. త్వష్ట.

**సుకృత్యము.** సం. వి. అ. న. ౧. మంచిపని. ౨. సత్కార్మ.

**సుక్కురుఁడు.** వి. (సం. శుక్రః) శుక్రాచార్యుఁడు.

ఆ. వె. అనుచు దానిచంద మంతయు సెఱిగించి,
సుక్కురుండు పనుప సోఁకుతోఁడు, మరల
దీవి కఁగి మతిమీఁతికోటలు, గట్టిసేసి మూఁ
కఁ గాపు వెట్టె.

అచ్చ. రా. యుద్ధ. ౪౩౭ ప్రా.

**సుక్కుళ్లు.** (సుక్కుళ్ళు రూ.) వి. బ. మాదతలు.

సీ. మృదు తనూనుమవల్లి మిగులఁ గ్రాఁగఁదొ
డంగ నీకైన మైపూఁత పేటు లెత్తె, సొగసు
లేఁజెక్కుల సుక్కుళ్ళు గనుపట్టె పదనారి
విందంబు వాడుపాటె.(సుక్కుళ్ళు. గ్రా. పా)

భోజనుతా. ౩-౭౭.

**సుక్రతువు.** సం. వి. ఉ. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. మిత్రావరుణుఁడు. ౩. అగ్ని. ౪. శివుఁడు. ౫. సూర్యుఁడు. ౬. సోమము.

**సుఖ.** సం. వి. ఆ. స్త్రీ. వరుణదేవుని రాజధాని.

**సుఖంఘుణము.** సం. వి. అ. పుం. ౧. ఖట్వాంగము. ౨. కపాలము. ౩. అగ్రమునఁగల దండము.

**సుఖంబు.** క్రి. విశే. సుఖముగ.

ఆ. రుజము సెఱుఁగ కమర, భావమునసుఖంబు
శివింగురటె. భార. ఆది. ౪-౧౫౮.

**సుఖంబుండు.** అ. క్రి. సుఖముతోనుండు.

ఆ. వె. ఇట్టి తలఁపుఁబుండిగియుంటికిఁజని సుఖం,
బుండు మని పురోహితుండు పలుక, వీని
మనంబులోన వెలసిన వైరాగ్య, మగ్గలింపఁ
బిక్కతతనితోడ. జాహ్నవి. ౪-౧౫౩. ప్రా.

**సుఖచారము.** సం. వి. అ. పుం. ఉత్తమాశ్వము.

**సుఖద.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దేవవేశ్య, అప్సర. ౨. గంగానది. ౩. జమ్మిచెట్టు.

**సుఖదము.** సం. వి. అ. న. విష్ణుపదము.

**సుఖబోధము.** సం. వి. అ. పుం. ౧. సుజ్ఞానము. ౨. సులభమైన జ్ఞానము.

**సుఖభోగులు.** వి. బ. ధాన్యవిశేషము.

సీ. పచ్చపరుల్ రెడ్డిపాలవంకెలు సుఖభోగులు
పచ్చకర్పూరసరులు. హంస. ౪-౧౨౮ ప్రా.

వ. సుఖభోగులు సన్నసూదులు గౌరవంకరాజనాలు కాటుకరేకులు....

ప్రబం. ౧-౧౧౨. ప్రా.

**సుఖము.** సం. విశే. అ. ఆ. అ. సంతోషకరమైనది. ౨. తృప్తికరమైనది. ఇష్టమైనది. ౩. మధురము, అనుకూలము. ౪. సులభము, సుకరము.

**సుఖము.** సం వి. అ. న. ౧. ఆనందము. తృప్తి. ౩. దుఃఖరాహిత్యము. ౪. సౌలభ్యము. ౫. స్వాస్థ్యము, భద్రత, ఆరోగ్యము; క్షేమము, ఐశ్వర్యము. ౬. సౌకర్యము. ౭. స్వర్గము. ౮. జలము. ౯. ఇంద్రియములకు సంతృప్తిగా నుండునది

**సుఖము.** అవ్య. ౧. ఆనందముగా ౨. స్వస్థముగా. ౩. సుకరముగా. ౪. శాంతముగా. ౫. స్వచ్ఛందముగా.

**సుఖముండు.** మి. అ. క్రి. సుఖముతో నుండు.

తే. సురేశ్వరుఁడు దనదు, పురమునకు సేఁగి
సుఖముండెఁ గురువరేణ్య!

భార. శాం. ౪-౧౫౩. ప్రా.

క....అవిపా, దమ్మున సుఖముండిరి వినయ సొమ్మ
ప్పఁగ శాలిహోత్రు నాశ్రమభూమిన్.

భార. ఆది. ౬-౨౨౭. ప్రా.

**సుఖవర్చ్ఛకము.** సం. వి. అ. పుం. ౧. సర్జక్షారము. ౨. క్షారము.

**సుఖవాసము.** సం. వి. అ. పుం. పుచ్చకాయ.

**సుఖవాసి.** సం. విన్. పుం. ౧. కారుబుడమ i ౨. సుఖముగా వసించువాఁడు.

**సుఖశ్రవము.** సం. విణ. అ. ఆ. అ ౧. సులభముగా వినఁదగినది. ౨. చెవికి ఇంపైనది.

**సుఖసంకథావినోదంబులు.** వి. రాజు కొలువుదీర్చి జరుపుఇష్టగోష్ఠి.

శ్రీ మన్మహామండలేశ్వర కాకతియ్యగణపతిదేవ మహారాజులు ఓరుగల్లు నిజరాజధానిగా సుఖసంకథావినోదంబులం బృథివి రాజ్యంబు సేయుచుండగా.

౧౧౬౩ దుర్గిశాసనము. గు. జి.

**సుఖసంగి.** సం.విణ.న్.న్. ఈ. నీ. న్. సుఖమునందాసక్తిగలది.

**సుఖస్పర్శము.** సం.విణ.అ. ఆ. అ. ౧. ఆహ్లాదకరమైన స్పర్శకలది. ౨. సంతోషప్రదము. ౩. రమణీయము.

**సుఖాంతము.** సం. విణ. అ. ఆ. అ. ౧. సంతోషమునఁ బర్యవసించునది. ౨. అనుకూలము. ౩. మైత్రీపూర్ణము.

**సుఖాయతము.** సం. వి. అ. పుం. సుశిక్షితమైన అశ్వము.

**సుఖాయనము.** సం. వి. అ. పుం. సుఖాయతము.

**సుఖావహము.** సం. విణ. అ. ఆ. అ. సుఖము కలిగించునది.

**సుఖాశకము.** సం. వి. అ. పుం. దోసకాయ.

**సుఖాశము.** సం. వి. అ. పుం. ౧. సుఖముగా భుజించుట. ౨. ఆహ్లాదకరమైన ఆహారము.

**సుఖాస్వాదము.** సం. విణ. అ. ఆ. అ. ౧. మంచి రుచిగలది; ఆహ్లాదకరమైనది. ౨. సుఖానుభవము.

**సుఖి.** సం. వి. న్. పుం. ౧. యతి. ౨. సుఖము గలవాఁడు.

**సుఖి(యిం)చు.** సం. అ. క్రి. సుఖపడు: సౌఖ్యమనుభవించు.

క... అ, త్ర్యంజరసుతతో నెక్కి పి, కుంజరుఁడొకకొన్నియేండ్లు కూడి సుఖించెన్.

ఉ. రా. ౫-౭౯.

చ.... ఈ ద్విజుం, డనయము లబ్ధజీవుఁడు నిరామయుఁడున్ దృఢయౌవనుండునై, వనితయుఁ దానుఁ గూడి శతవత్సరముల్ సుఖియించుచుండెడున్. మార్క. ౨-౧౯౫.

వ... నరు లీచరిత్రంబు విన్న రోగనిర్ముక్తులునై సుఖయింతురు. వరాహ. ౫-౯౭.

**సుఖైషి.** సం. విణ. న్. న్. ఈ. న్. ౧. సుఖము నపేక్షించునది. ౨. సుఖమును ఆశాసించునది.

**సుఖోదర్కము.** సం. విణ. అ. ఆ. అ. ౧. సుఖముచేఁ బర్యవసించునది. ౨. సుఖప్రదము. ౩. సుఖోత్పాదకము.

**సుగంధ.** సం. వి. ఆ. స్త్రీ. తులసి. i

**సుగంధకము.** సం. వి. అ. పుం. ౧. గంధకము ౨. ఎఱ్ఱతులసి i ౩. నారింజ i

**సుగంధము.** సం. వి. అ. పుం. ౧. సువాసన ౨. గంధకము.

**సుగంధము.** సం. వి. అ. న. ౧. చందనము. ౨. నీలోత్పలము. ౩. ఒకవిధమైన సువాసనగల గడ్డి. ౪. Small cumin seed.

**సుగంధారుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సుగంధి.** సం. విణ. సువాసనగలది. ౨. పవిత్రమైనది, సుగుణములుగలది.

**సుగంధి.** సం. వి. ఇ. పుం. ౧. మంచివాసన. ౨. పరబ్రహ్మము. ౩. నూగుదోస i ౪. ఒకవిధమైన సువాసనగల మామిడి i

**సుగంధి.** సం. వి. ఇ. న. ౧. పిప్పలివేరు. ౨. ఒక విధమైన సువాసనగల గడ్డి. ౩. ధనియాలు.

**సుగంధిత్రిఫలా,** సం. వి. ఆ. స్త్రీ. ౧. జాజికాయ. ౨. పోకచెక్క. ౩. లవంగము.

**సుగంధిమాల,** సం. వి. ఆ. స్త్రీ. మావలి † శ. ర.

**సుగంధిమూలము.** సం. వి. అ. న. వట్టివేరు.

**సుగంధిమూషికా,** సం. వి. ఆ. స్త్రీ. ౧. చుంచు Musk rat ?

**సుగంధుఁడు** సం. వి. అ. పుం. వర్తకుఁడు.

**సుగతుఁడు,** సం. వి. అ. పుం, బుద్ధదేవుఁడు.

**సుగమము.** సం. విశే. అ. ఆ. అ. ౧. సుఖముగాఁబొందఁదగినది. ౨. సులువైనది. ౩. స్పష్టమైనది, సుగ్రాహమైనది.

**సుగము,** సం. విశే. అ. ఆ. అ. (వ్యతి. దుర్గము) ౧. చక్కగా నడచునది. ౨. సొగసైనది; ఒయ్యారము గలది. ౩. సుఖముగాఁబొందఁదగినది. ౪. సుబోధము, సుగ్రాహము.

**సుగము,** సం. వి. అ. న. ౧. మలము. ౨. సుఖము.

**సుగము,** వి. సుఖము; సుకము.

సీ.... సంతస మంచన సంతోస మంచన నలరు సంతోసంబు పెలయ సుగము

తే.గీ. హాయి సుకము సమాళము చనఁగ సుఖము
ఆం.భా.౧-౯౦.

**సుగవాసి.** = సుకవాసి. విశే. సుఖవాసి, సుఖముగా నుండువాఁడు.

ఉ. వచ్చినఁ బెద్దరెడ్డి సుగవాసివి మే లిపుడైన నీదకస్, వచ్చితె యంచు.
కుక. ౨-౪౪౩. ప్రా.

**సుగహన.** సం. వి. ఆ. స్త్రీ. భూతపిశాచాదులు చొరకుండునట్లు యజ్ఞభూమిచుట్టు నిర్మింపఁబడిన ఆవరణ.

**సుగాలము.** వి. ఆయుధ విశేషము.

తే.గీ. చిఱుతిచెయ్యమ్ము గండకత్తెర తుపాకి
గొరకను సుగాలమును గ్రద్దగోళ్లు బుట్టె,
చూరిబాణా ధరించు వవ్వీరుఁ డెపుడు.
హంస. ౧-౨౦౫.

**సుగిపట్టములు.** వి. బ. వస్త్రభేదము.

వ... శ్రీతోపులును శ్రీగామతోపులును జీబులును సుగిపట్టంబులును సన్నవలిపెంబులును.
ద్వా. ౩-౨౦౬. ప్రా.

**సుగుడి.** విశే. సరసుఁడు. గుణవంతుఁడు, యోగ్యుఁడు.

తే. వలచి పట్టినతాలిమి వదల కిప్పు, డెన్ని
చెప్పెదు తగవు వివేకతమున, మెలఁతనీ యూ
రకె రతిరంగమునకు రాని సుద్దు లివియేల
చాలింపు సుగుడివాడు. (సుగణి యని ముద్రితపాఠము) సారంగ. ౨-౧౧౭. ప్రా.

క. ముసలి కపియించెనపు, డ, య్యసితాక్షేక్ష
ణల రాజయక్ష్మక్షోభం, బెసఁగ నశియించు
నగుఁ న, ద్దసఁ బాలుఁడు సుగుడిగామి తెల్ల
మిరాయె కదా! మను ౪-౯౧. ప్రా.

**సుగుడితనము.** వి. యోగ్యత, మంచితనము.

గీ. అని విచారంబు తనకు నింతైన లేక, సుగిడితన
మును మాటెల్ల యగుచుఁ దిరుగ నావిధము
తెల్లఁ గడు దేవదేవి గాంచి.
విప్ర ౪-౧౫. ప్రా.

**సుగృహీతనాముఁడు.** సం. వి. న. పుం. పవిత్రమైన నామము గలవాఁడు. ౨. సార్థకనాముఁడు.

**సుగృహీతము.** సం. విశే. అ. ఆ. అ. ౧. గట్టిగాఁబట్టుకొనఁబడినది. ౨. ఉచితముగాఁ బ్రయోగింపఁబడినది. ౩. తగినట్లుగా స్వీకరింపఁబడినది.

సుగ్గడి. విణ. (ప్రా. సుగ్గమ్ = విసర్జితమ్ దేశీయ నామమాల) నీతిబాహ్యుఁడు.

ఉ. సుగ్గడి నైతి నీ వెంగము చూడక నెట్టులు నేర్తు చెప్పుమా. దశకు. ౪-౪౬. ప్రా.

సుగ్గడితము. విణ. (సం. సుఘట్టితమ్) సుఘట్టితమై, తఱచయిన నేఁత గలది.

ఉ. కమ్మలు హవ్యవాహములు గుత్తపుసుగ్గిడితంపుఁ దోఁపు రెంటమ్ములు.
ఆం. భా. ౨-౧౫౨. ప్రా.

చ. పదఁతి యొకర్తు నెందిరిక పావడఁబై తడియొత్తినైన సుగ్గడితపుఁజీబు నేత్రి మొకరామిని గట్టనొసంగ సంజకెం, పెదలిచి నిండువెన్నెల వహించి పయోనిధి మండలంబు వెల్లడు నుడురాజు నానలకళానిధి యంబుగ్రహంబు వెల్వడన్. వరు. ౫-౭౧. ప్రా.

మ. చిరమైగోవజవాజి పూఁత కలిమిన్ జెంతన్ గుబాళింప గుజ్జరి నిద్రాతగటీకురాళములలో సంపంగిపూఁబానుపన్, పరిగంచున్ బనిపట్టు సుగ్గడితపున్ పర్యాటపున్ గప్పులన్ దరుణుల్ గాంచిరి సౌఖ్యసంపద నితాంతక్షేమమై యత్తఱిన్. చద్రాంగ. ౪-౭౦.

సీ. బంగారు పరిగంచు రంగు సుగ్గడితంపుఁదలిదువ్వటము బెళబెళల నీన.
ఘటికాచల. ౨-౧౫౨.

సుగ్రాసము. సం. వి. అ. పుం. సరసమైన యాహారము.

సుగ్రీవము. సం. వి. అ. పుం. ౧. మంచిమెడగలది. ౨. హంస. ౩. ఒకవిధమైన ఆయుధము ౪. శ్రీకృష్ణుని రథాశ్వములలో నొకటి.

సుగ్రీవుఁడు. సం. వి. అ. పుం. ౧. వీరుఁడు ౨. శివుఁడు. ౩. ఇంద్రుఁడు ౪. వాలితమ్ముఁడు.

సుగ్లము. సం. విణ. అ. ఆ. ఆ. మిక్కిలి యలసినది.

సుచకము. సం. వి. అ. పుం. మొతిఁగాడికుక్క

సుచక్షువు (స్సు). సం.వి. స. పుం. ౧. మంచికన్నులు గలవాఁడు. ౨. వివేకముగలవాఁడు. ౩. మేడిచెట్టు I

సుచరిత (త్ర). సం. వి. ఆ. స్త్రీ. పతివ్రత.

సుచరిత (త్ర) ము. సం. విణ. అ. ఆ. అ మంచినడవడి గలది.

సుచరిత (త్ర) ము. సం. వి. అ.న. ౧.సత్ప్రవర్తనము. ౨. సుకృతము; పుణ్యము.

సుచర్మము. సం. వి. న. పుం. భూర్జవృక్షము I

సుచింత. సం. వి. ఆ. స్త్రీ. గాఢమైనధ్యానము.

సుచింతనము. సం. వి. అ. న. సుచింత.

సుచిత్ర. సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైనకాయ (పొట్లకాయ?).

సుచిత్రకము. సం.వి.అ. పుం. ౧. లకుముకిపిట్ట ౨. పొడలపాము.

సుచిరము. సం. అవ్య. ౧. చాలకాలము. ౨. చాలసేపు.

సుచిరాయువు (స్సు). సం.వి.స. పుం.దివ్యుఁడు; దేవత.

సుచూటి. సం. వి. ఈ. స్త్రీ. పట్టుకారు.

సుచేలకము. సం. వి. అ. పుం. సన్నని వస్త్రము.

సుచ్ఛత్ర. సం. వి. ఆ. స్త్రీ. సట్లెజ్ నది.

సుచ్ఛత్రుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సుజనత. సం. వి. ఆ. స్త్రీ. ౧. మంచితనము సాధుత్వము. ౨. సుజనుల సమూహము. ౩.ధీరత్వము, ఉదారత్వము.

సుజనుఁడు. సం. వి. అ. పుం. ౧. సాధుపురుషుఁడు. ౨. దయగలవాఁడు, ఉదారుఁడు. ౩. ఇంద్రుని సారథి.

**సుజన్మము.** సం. విణ. న్. ౧. మంచివంశమునం బుట్టుక గలది.

**సుజలము.** సం. వి. అ. న. తామరపూవు.

**సుజాతము.** సం.విణ.అ. ఆ. అ. ౧. చక్కగాం జెలఁగినది. ౨. చక్కగా ఉత్పాదింపఁబడినది. ౩. ఉన్నతవంశమునం బుట్టినది. ౪. అందమైనది.

**సుడాలము.** వి. అశ్వగతిభేదము.

తే.గీ. తనకుఁ బ్రీతిదేవుఁ డెందు లేదనుచు నెమకు, పగిది దిగుసాడ్డెకేడెము ల్చరచి మతి యు, ధంజలిమురళి ఝళిపిఝంపయు సుడాల, మనఁగను లెసఁగఁ జూపుచు వాళిమీఁఱ (సంధాలము. ముద్రితపాఠము)
ప్రబం. ౧-౧౮౫. ప్రా.

చ. హతిగవిభుండు మింటిపయి ధంజలి కామురళీ సుడాల, వ, ల్గితముల రా నెదుర్కొడిన ఖేచర వర్గము లోపరించి యద్భుతముగ ద్రెంక్క లేనగవుతోఁ గనుగొంచు....పారి. ౨-౧౦౨.

**సుడి.** వి. ౧. గాలుల చక్రభ్రమణము. బ. సుడులు, సుళ్ళు నెం.

చ.... కాచకటకాకృతి సుళ్ళ మెలంగె గాడుపుల్. ఆము. ౫-౧౨౩.

చ. కుకిసిన క్రింది పుష్పాదులఁ గొంచు వగంబుల మీఁదికై పిశం, గరుచులగొన్నిపై ల్లెగ సె గాడ్పుల సుల్. ఆము. ౫-౧౨౪.

౨. జలావర్తము.

వ. పూఁదేనియ కాలువ వాళ్ళ సుళ్ళం బడి వడి వడిం దిరుగు కెంపుఁబొంగరంబులం బోని మెట్టదామర మొగడులును. యయా. ౪-౧౩.
సుగ్రిక్కులు తరఁగలు పొక్కిలిసుడి.
నీలా. ౨-౧౭.

౩. రోమావర్తము.

చ. అనువగుసుళ్ళ నొప్పవులయానిలవాహము నెక్కి. మను. ౬-౨౭.

౪. వట్రువసుడి.

సీ. వట్టివట్రువయును బరిపుష్టితలకట్టు గుణి సున్నకియ్యయు సుడియు మడియుఁ గలుగొన వ్రాయసంబులు వ్రాయ వ్రాయఁ గొంకు కొసరును తేటపఱ్లగొనకయుండు లలితముక్తాఫలాకారవిలసమున,మతిమరుమ్మంత్రివరుఁడు.
పాండురంగ. ౧-౨౧.

౫. కష్టము, బాధ.

క. సుడి యొయుఁగనిమారి సుడివడ సుడిగాలి తెఱంగు రక్కసుఁడు విసరెడి యా,సుడిగాలి ధూళి గన్నుల, సుడిసిన గోపకుల చెగడి సుడివడి రధిపా! భాగ. ౧౦-౨౬౫.

౬. రాజులకు కోటలనుండి వచ్చుఆదాయభేదము.

సీ. ధాన్యములు సువర్ణాదాయములును దుర్గాదుల సుడియు బేహారుల సుంకములును.
ఉత్తరహరివంశం. ౧-౬౩.

౭. అదృష్టము.

వ్యవ. వానిసుడి బాగున్నది. చూ. సుడిగొను.

**సుడిఁబడు.** = సుడివడు. అ. క్రి. బాధపడు, కలవరపడు.

ఉ. గ, ర్వాలసుఁడై సుడిం బడక.
ద్వా. ౧౧-౧౧౦. వా.

సీ. నతివాళిపాళిసౌందర్య మెంచినయంతఁ బలువివేకము సుడిఁబడఁదొడంగె.
శశాం. ౪-౫౩.

**సుడికయిదువ.** వి. √సుడి. చక్రము.

తే. గీ. వలమురి సుడికయిదువయుం బలుఁగు సిడము, పసిఁడినునువలువకలిమి కదఁ దుకయును, గలుగును గఁదగు నిను మదిఁదలంచి నపుడె విడిచి చనుఁగదె బలుకోల లిడుముగములు. అ. రా. అరణ్య. ౧౧౪.

**సుడికొల్పు.** స. క్రి. కష్టపెట్టు; బాధించు.

ద్వి. "సురుచిరావర్తంబు సుడికొల్పు వార్ధి, గురుచక్రములఁ దిరుగుడుపెట్టు పిడుఁదు"

ద్వి. పరమ. ౩-౨౨౨.పా.

**సుడిగట్టు.** √ సుడి వి. చక్రవాళపర్వతము.

సీ. తన యాన సుడిగట్టువెనుకఁ బర్వఁగఁ జాల తేజున మించె నేరాజుతాత.

యయా. ౧-౧౯.

**సుడిగాడ్పు.** √ సుడి. వి. సుడిగాలి. (సుడివలె గుండ్రముగఁ దిరుగుగాలి)

ఉ. సేమ మెలర్పఁగా గొడుగునీడ వహించు వసుంధరాస్థలి, సీమను యెక్కియాడెను విచిత్రగతిం దురగోత్తమంబు నా, భూమి విభుండు తద్భ్రమలు వో యెదతెవ్వఁగ యభ్యసించు వా, త్యాయనచక్రచంక్రమవిహారములన్ సుడిగాడ్పు లిప్పుడున్.

నైష. ౧-౭౭.

సీ. సుడిగాడ్పు లేచినట్టుఁ జుట్టలుపెట్టి గడిఁది మంటలు వెళ్ళఁగ్రక్కి నక్క.

ఉ. రా. ౬-౨౩౫ వ్రా.

**సుడిగాలి.** దే. వి.౧. సుడియు (చుట్టిచుట్టి వీచు) గాలి, వాత్య.

క. కదురుగ్మలిఁ గ్రొవ్వుం జను, గుడుపఁదొడఁగె నొక్క సురభిగురు పాల్పెరయం, బడు నత్ని వక్త్రఫేము సుడిగాలిం మాలిపడియె సొదపై ననఘా! భార. శాం. ౩-౫-౧౮.

తే. ఇల కుడిగి చుట్టిచుట్టి దుమ్మెత్తి యెగసి, పోయి తము ముంచు సుడిగాలి....

ఆము. ౪-౭౧.

౨. ఒకానొకజాతి పందెపు కోడిపుంజు.

తే. (చిలుకు) టమ్ము సుడిగాలి చక్రంబు నల జడదరి,కూలమాఁదిరంగి వెలినక్క సాలువంబు కాళరాత్ర్యంతకుఁడు పందెగాండ్రు మెచ్చ లనెడు పేరుల పుంజాల గొని ముగించి.

హంస. ౩-౨౧౫.

**సుడిగొను.** అ.క్రి.౧.కలఁత నొందు, బాధపడు

శా. జాలిం బొందె బలాయముల్ సుడిగొనె స్వారంగముల్ నిచ్చె కే,గోలంబుల్ బెదరెన్ జమూరుగణ మాక్రోశించెఁ బంచాస్యముల్, తాలాంకాపరజుండు మందరమహాభాత్రిధరం బెత్తినన్. హర. ౬-౪౬.

క. శూద్రుండు పిలిచె నేనియు, శూద్రిం దనమతి యెుసంగ శూద్రుఁడు చూడన్,శూద్రునియింట భుజించిన, శూద్రాదికనీచజాతి సుడిగొండ్రు ద్విజుల్. శివ. ౩-౧౭.

౨. భ్రమించు, తిరుగు.

క. బలువిడి మొఱయఁగ వక్షం,బులఁ దలలం బగిలివారి బొందులు సుడిగొం, చిలఁ గూల జూచి. భా. రా. యుద్ధ. ౫-౧౨. వ్రా.

౩. చుట్టుకొను, పెనఁగు.

సీ. సుడిగొని వెదలంగఁ గదఁగు క్రొత్తావి యల్లన మీఁది కెగయఁగ మొనలు విచ్చి.

నిర్వ. ౬. ౭౯. వ్రా.

క. సుడిగాలి వచ్చి నిన్నున్,సుడిగొని కొనిపోవ మింట సుడిసుడిగొనుచున్, బెగఁ దదరెడి నా ముద్దుల, కొడుకా.

భాగ. ౧౦ స్కం. ౨౬౭.

౪. అదృష్టము ఫలించు.

చ. సుడిగొని రామపాదములు సోఁకిన ధూళి వహించి రాయియ్యేర్పడ నొకకాంత యయ్యె నట పన్నగనీతిని పాదరేణు వియ్యెడ వడి నోడసోఁక నిది యేమగునో యని సంశయాత్ముఁడై కడిగె గుహుండు రామపదకంజయుగంబు భయమ్ము పెంపుసన్.

మొల్ల. రామా. అయో. ౩౨.

**సుడిగోరు.** వి.తింతి మీటుటకు బంగారు లోనగు వానితోఁ జేసి వ్రేలికి తొడిగికొనెడుగోరు.

ద్వి. శ్రుతిగూడఁ దంత్రులు సుడిగోళ్ల మీటుచు

హంస. ౨.

**సుడిపురువు.** √సుడి. వి. అరణ్యజంతువిశేషము

తే.గీ. సుడిపురువు నుస్తెపడులును మిడుత మెదుకు,చెలుకపాల్ పాలెరకుఁ గ్రొలి యరతిఁ గరలి. ప్రబం. ౧-౧౩౦

**సుడియ.** వి. తమలపాకుల బరువునందు సగము.

**సుడియ.** విణ. తులువ. శ. ర.

**సుడియాడు.** అ. క్రి. పరిభ్రమించు.

ద్వి. పుడమిలోపల సారెపోలయుబండి, సుడి
యాడె వని చెప్ప చొక్కపుమాట, విధ
మారయు మంచె నావిధమెల్ల దెలిసి.
సారంగ. ౨-౫౨ పుట. ౮. పం.

**సుడియు.** అ. క్రి. తిరుగు, భ్రమించు.

క. నూతతనయునారాచ. న్యూతములై వార
ణంబు లొలలును సుడియన్ భూతలమునఁ
బొరలఁ దెరలు, వే తూలును జెఱ్ఱిదిరుగు
విచ్చుం జచ్చున్. భార. కర్ణ. ౧-౭౭. ప్రా.

సీ. కరులదానంబులకు మధుకరము లెఱిఁగి,కుంజ
రమ్ములు నీరిలో గ్రుంకియున్న,మీఁద సుడి
యుచు నుండెఁ దుమ్మెదలు....
కుమా. సం. ౧-౬౫.

ఆ. వె. గీము విడిచి సుడిసి గిక్కురుమనకుండు,
జీవు విడుచువేళ శివుని దలచు, మనసు గోల్ప
కయును మాయచేఁ బొరలెదు, పాపపరుల
కేటి పరమ శివ. శివ. 3. భా. ౧౦౫.

౨. ప్రసరించు, వ్యాపించు.

సీ. ఎద మేని చెత్తావి సుడియంగఁ బయ్యెద
సగము దూలించి పై మగుడఁ దిగిచి.
భార. విరా. ౨-౬౮.

సీ. అరుణాంఘ్రితలదీప్తి నవనీతలం బెల్ల....తనూ
లత సుడియు చెత్తావి గైకొని సమీరుఁడు
గంధవహుఁ డనురూఢిఁ దవర....
కుమార. సం. ౬-౬౯౦. ప్రా.

తే. 'అనుచుఁ గరములు పెంగముల కడ్డ మిడుచుఁ
గోసినటువలె మనసున గోసి గోసి, క్రిసి
యుమియుచు సుడియు దుర్గంధమునకు, నాసి
కలు మూసికొనుచు సహ్యాసివరులు.
వాల్మీకి. ౨-౭౯.

సీ. క్రొవ్విరు లెసఁగి.... కమ్మవాతెఱవాసన
గలసి కలయ పొదుముట్టుచు మూర్పులు
సుడిగొనుచుండు, కుమా. సం. ౭-౯.

3. చుట్టుకొను, క్రమ్ము, వ్యాపించు.

సీ. మధుసమాకలిత హై ... తరుణిచే సోఁకినఁ
దావి పొంపిరివోవు తమ్మినాఁ దగు సుగం
ధంబు సుడిసె. కుమా. సం. 3-3౧౪.

వ. వెన్నెలలు అరవిరచెందొవ పెంగదలం బడి
సుడియుచు. పారి. ౨-౫౨

క. సుడి రొయుఁగని హరి సుడివడ, సుడిగాలి
తెఱంగు రక్కసుఁడు విసరెడి యా,సుడి గాలి
ధూళి గన్నుల సుడిసిన గోపకులు బెగడి.
సుడివడి రథిపా.
భాగ. ౧౦ స్కం. ౨౬౫.

౮. అడ్డువచ్చు, వచ్చు.

స్రగ్ధర. చొచ్చున్ గేహాంతరంబుల్ సుడిసిన
మగలన్ జాట్టలన్ బిట్టుపాట్టల్, వ్రచ్చున్
శాతాసిధారన్. ఉ. రా. ౮-౯౨.

సీ. అంతంతఁ బసిబిడ్డ లడ్డంబు సుడిసిన జంకించి
మిన్నంటఁ జొకలించి.
భోజరా. ౬-౨౫ ప్రా.

క. గొడుకు దినఁబోవుపసరము, బడిఁబోకుమ
తురగగార్దభ ద్విరదాదుల్, నడచుపథంబున
కడ్డము, సుడియకు దుర్జనులు మెలఁగుచో
నిలువకుమీ. భోజరా. ౬-3౮.

గీ. దేవి యిటగాక మఱియును లావు మట్టి,
బలియుబికిరంబు జోగు గోపాళమనను వీధి కె
వ్వారు సుడిసిన వెక్కిరించు, నయ్యనుగన్న
కొయ్య గయ్యాళితల్లి. విప్ర. 3-౧౫.

౫. డాయు, సమీపించు.

క. నా వదనము కమలం బని, తావికి నొక మస్త
షట్పదము సుడిసిన నే నావేగంబున దా
నిలుబోవఁగఁ జోఁపఁగ.... దశకు. ౮-౯3.

సీ. ఉపహతి గావింప నొకకాక మీతెంచి,
సుడియంగఁ బలుమాఱుఁ జోఁపి చోపి,కదు
డయ్యుటయును. భా. రా. అయో. ౧౬౮.

సీ.... సుడిసిన పెంగమెత్తి చూడకుండు,పరాకు
కుసుమబాణుని నైనఁగు విటుకేయు....పాత్రి
మల్ పెత్తమూడు. అము. ౧-౫౯.

(వి. రూ. ఇద్యక్రి. సుడిసి, సుడిసెను, సుడిసె
దను)

౬. వీఁచు.

ఉ. సాసాలతాం, తనవామోదముఁ బొందుచున్
సుడియు నిత్యము గరంబిష్టమై.
భార. ఆది. ౮-౬౯.

సీ. కరువలి సుడియమిఁ గదలక చెన్నొందు నెల
విరితమ్ముల నఱక తెగడి.
భార. విరా. ౨-౮౩. వ్రా.

సీ. దశదిశాంతరములఁ దఱచుగా విస్ఫులింగ
ములు గ్రుక్కుచు వడగాలి సుడియ.
వరాహ. ౨-౬౪.

౬. సుడిగా వీచు.

ఆ. సుడియు గాలిఁ బువ్వుబోడి దన్నుఁ గప్పనో
యనుచు బెగ్గలించు. విరా. ౨-౩౦౪.

సీ. బడిబడిఁ గమ్మ పుప్పొడి నిప్పుకలు చల్లి వెద
వెదగా గాలి సుడిసె సేని. రాజశే. ౩-౮౦.

ఆ. వె. కనినయప్పు డచటఁ గడునుగ్ర మగు
రక్త వృష్టి గురిసె నుల్క లప్ష దిశల బడియె
వఱకు లఱచె బిడుగు లుర్విని బడి, మ్రోసె
గాడ్పుసుడిసె మాసె నినుఁడు.
నిర్వ. ౩-౫౬.

౭. మెదలు, ఆడు.

సీ. సుధఁ జిందు మోవిపై సుడియు తేనియ
లొలుక్కష్టి నోదక ప్యాయసార మెనయ.
ఉత్తర హరివంశం. ౧-౩౪.

ఆ. నూవృతంబు గాని సుడియదు నాజిహ్వ
బొంకఁజాల నాకు బొంకు లేదు.
భాగ. ౮ స్కం. ౬౪౩.

క. అనిలుండ వయ్యి నయ్యొ చనునే యిల
మెలఁగ నంబుజముఖీయుతు లౌజనులకద
సుడియ నేలా నను నేచెద వింతచలమునం
బవమానా! రామా. ౬-౨౩.

౯. చలించు; కదలు.

సీ. అలకలన్ దరుణుల నార్చుచు దారాడిమాఘ
వర్తన లన సుడిసె బొమలు....
కుమా. సం. ౮-౧౬౯.

౧౦. సంచరించు, మసలు.

ద్వి. చోరుల జారుల సుదయుంగనీక వారల దం
డించె పదలక పట్టి.
రం. రా. అయో. కాం. ౧౩ పు. ౬ పం.

క. ఆ కేసరి నరకేసరి కాకున్న మహీయదేశ
కాననగిరులన్ భీకరహరిదర్పకర, మూకరనిక
రముల కెట్లు సుడియఁగ వచ్చున్.
హై. భా. ౬-౨౧౨.

తే. గీ. చూచి యా దివ్యపురుషుండ నూచు
కేఁడి, మాపులకు జంకెలకుఁ జెంత సుడియ
వెఱచి. ఉ. రా. ౪-౧౧.

౧౧. లీనమగు; అణఁగు.

క. చక్కరయును లవణంబును గ్రుక్కన నుదక
ములయందుఁ గరగినరీతిన్, మిక్కిలి తనుఁ
గను ఘను మది. చొక్కుచు నానందజలధి
సుడిసి నశించున్. సీతారా. ౩-౫౮.

౧౨. కలఁత నొందు.

క. నీ కోడలు కొడుకునకై, శోకం బుడిగింపలేక
సుడిసినయది యస్త్రోకబలంబునఁ దమ్ముఁడ,
నే కదఁగవలయు బాలు విడిపించుటకున్.
హరి. ఉ. ౮-౪౬.

సుడివడు = సుడిఁబడు. అ. క్రి. (సుడి + పడు)
పరిభ్రమించు; (అవశతచే) గిరగిరఁ దిరుగు.

క. పడుచును లేచుచుఁ బాఱుచు సుడివడుచును
దెసలు గలయఁజూచుచు.
భా. రా. అర. ౨-౨౩౪.

క. సురధునితల గరుడుఁడు కొని యరిగెడుఁ
దెమ్మనిన నాతఁ డచటికిఁ జని తద్గుహ దని
లాహుతి సుడివడి, సురగాలిం బడిన వొప్ప
వొరుగుచు బోలెన్. హై. భా. ౫-౮౩.

౨. చుట్టుకొనుచు రాలు, పడు.

ఉత్సాహ. చుక్కలొ గ్రుక్క డెక్కడైన సుడి
వడంగఁ దొడఁగె. రామా. ౬-౧౦౮.

౩. ఆవర్తములు గలదియగు; సుడులుగలది యగు;
సంక్షోభించు.

క. నుడివడి యడలుచు బిట్టును లెడనూపక
పాదపవంత వెలయఁగఁ గడులోఁ, నుడు
కుచు నుండెడివారల,యెడ దారలకుఁ గినియ
బోలునే యొకిమీఁడా? అ. రా. యుద్ధ. ౮౮.

సీ. తొఁగలించిపరివార మగుతారసంఘంబు కంఖ
రింఖన్మణిసరణిఁ జూప, జవనీతహరిదంతజల
ధరవార్రితంబు కూలశైవలజాలలీలఁ దోఁప,
నుడివడి తిరిగెడు సురవిమానశ్రేణు లెడనెడఁ
బడువలవడువు దెలుప. చంపూరా. ౩-౨౦.

వ. పలిమించు క్రొమ్మించే ఔడులీఁది యీఁది
సడిసడలి నుడివడుచు నొదలోము సోమరి
గాలియులవోక సోకుఁకు. మను. ౩-౨౮.

౪. చిక్కువడు.

తే.గీ. అనుచు లావణ్యనిధి కామిని సరోజనేత్రి
తన కూర్మి గావరా నిలిచి సరసానుకూల
వాక్యములలహరి గొలిపెను, సుంధరాభర్తృ
చిత్తంబు నుడివడంగ. వరాహ. ౬-౧౨౬.

సీ. ఒకచోఁ బునర్వసు పూఁగ వృక్షముకొమ్మ
నుడివడ్డముత్త్యాలజోగువోలె. కాశీ ౧-౧౩౮

౫. కలఁతపడు; బాధనొందు.

చ. నీదు సైన్యముల్, నుడివడ భీష్ముఁ డాఁకు
టయుఁ జూచి మనంబున నాఁట దానితోఁ
బొడుతుసెటుంచు మార్కొనకపోయెఁ దొ
లంగి యతండు భూవరా!
భార. భీష్మ. ౨-౨౮౫.

క. కురువంశము దుర్లించుటకుం, జొరఁజాలక
జామనంబు నుడివడియెడు.
భార. ఉద్యో. ౪-౩౬.

వ. కొడుకుచెడుఁడవడికి నదలంకదరిం బడి నుడి
వడియెుకతల్లిచంద్రుల-పాండురంగ. ౩-౨౪.

శా. వైశంపాయనుఁ డెంతయున్ నడివడెన్
వాడె న్నమతుం దలి,క్లేశం బందిర పైలకై
మినులు దుఃఖించెన్. మదిన్ దేవలుండు.
భీమ. ౨-౯౯.

వ. అమ్మెన్న చిక్కువడియును నుడివడియును
గలంగియుఁ దొలంగియు.
భార. ద్రోణ. ౨-౧౮.

౬. చెదరు.

క. నినుఁ గనినప్పటఁ గోలెను, దనమది నుడి
వడఁగ రామధరణీశుఁడు నిన్ గనఁగొనఁ
గోరదుఁ దదయంజన, దియ్యోడ వదిన వైరి
చను మర్యాదకున్. భార. అర. ౧౪౯.

క. శేణిభరకుచకుంభ, శ్రోణీభారములఁ గాను
నుడివడఁగ గదా,పాణిఁ గరుణించి పల్లవ,పా
ణికిగర్భంబునందుఁ బ్రాపై నిలిచెన్.
రామా. ౩-౮౫.

సీ. గళగళధ్వానలతోఁ గంగశృంఖుల లూడ్చి
నుడివడఁ గుక్కల నదవిఁ గలిపి,
మను. ౪-౧౦౩.

౭. సంక్షోభించు; తొట్రువడు.

వ....బయలుపడి చేయునదిలేక యాకదకు మగిడి
తుబుము విచ్చుచుఁ దద్వారణాభినయవత్ప్ర
రాచీనకరాజులై నుడివడువెడం బొదము....
ఆము ౪-౩౫.

చ. అదరుచు హుంకరించుచు నహంకృతిఁ జూ
పుచు నస్త్రధారలన్, నుడివడఁజేయుచున్
బెగడుచున్ బెగడించుచు నిల్వరించుచున్,
గదఁగుచు గోపరించుచు ముఖాముఖి నిల్చుచు
బి ట్టనల్చుచున్,జడియక పోరి రయ్యుభయ
సైన్యములన్ గలయోధు లుద్ధతిన్.
ఉ. రా. ౪-౨౯౫.

౮. దుర్బలమగు; నిస్సత్త్వమగు.

క. కడిమిం దాఁకిన యురవడిఁ బడు గడిచిన
భంగిరైయినబమ్మటితోఁచన్ నుడివడుచు నుండి
కొండొక,దడవునకుం దెలిసి నిలిచి తాలిమి
కలిమిన్. భా. రా. సుంద. ౨౯.

సీ. అనిశంబు వీఁడు వాఁ డనక యెక్కఁగ
శేలు, టేనుఁగునకు వీపుగూనుతోయె, వరు
సలు పెట్టి దువాళింప నుడివడి, వెలిమావు
మోపడు వెనుకకాలు.
వరాహ. ౧౦-౧౫ వ్రా.

౯. తిరుగు; వెనుదిరుగు.

ద్వి. సుడివడ కెగరక సొలయక జడుం, వడక వెజ్జడక తప్పక జారువాఁక.

తండికా. దీక్షా. ౬౧.

వ. పెడవిసరువిసరి యసురవరు కరాంగుళంబులు దిగనడిచె నడిచిన సుడివడక మదమల దాటించిన ....మను. ౪-౧౧౫.

క. నీచత్వమునకు దోఁయక, చూచినవరులెల్ల వేఁడి సుడివడక కడున్ యాచనచేసి పదార్థము, గోచరముగ సంగ్రహించుకొని వచ్చి వెసన్.

చంద్రరేఖా. విలా. ౧-౫౬.

౧౨. చెడు; నశించు.

సీ. చెఱువు గట్టించిన శెట్టిధర్మం బెల్ల, సుడివడ కుండంగ నడుపుతల్లి. ద్వా. ౪-౧౪౬. వ్రా.

క. ఏకర్మంబున విభుఁ డగు, శ్రీకంఠుని యశము మఱియునిచే సుడివడియెన్ వైకుంఠుఁ డేవిధంబునఁ, గైకొనితత్కీర్తి చక్కఁగా నొనరించెన్. భాగ. ౭ స్కం. ౩౮౯.

సుడిపఱచు. స. క్రి. √ సుడివడు. సుడివడఁ జేయు.

వ. తనవారి గ్రోలినవారి జఠరగోళంబులం గల సకలలోకంబు లిట్లు సుడిపఱతు ననుచందంబునం దంతరాంతరంబులు సొచ్చి సింహశరభ శార్దూలాదిమృగంబుల సుడిపఱచుచు.

వరాహ. ౧౦-౬౨.

సుడివాలు. వి. చక్రాయుధము.

సీ. సుడివాలుఖండంబు వడరఁ బూచినవాని.

శ. ర. అచ్చ. బాలకాం. ౬౨.

సీ. తెల్లదేవిరాజ సుడివాలు కేలుఁ దనరిన యొడయ. ప్రబం. ౧-౨౧౬.

సుడివా (ల్గా లు దా(ల్పు) లువు. వి. విష్ణుమూర్తి.

క. సుడివాలుదాల్పు నడుగునఁ బొడమినపస్వేల్లి దరసి పొలుపొందఁ గ న. కడ సుహుఁ దనిరెయొదుచెంచల; యొదయని బొడగాంచి వాని యొద్దిక వలనన్.

అ. రా. అయోధ్యా. ౧౦౦ వ్రా.

నీ కిప్ప డానుడివాల్గాలుపుకన్న కేలు కలకే చుట్టంబు లేవంకలన్. నీలా. ౧-౮౫. వ్రా.

సుడివాల్గొర. వి. విష్ణువు.

క. వలమురి సుడివాల్గొర వంటి యొప్పుగలదే వరజాణయ మీనుఖాన వలపుల తేఁడా!

యయా. ౫-౧.

సుడివోవు. అ. క్రి. (సుడి+పోవు) చెడు, నశించు, సుడివడు.

సీ. ప్రవిమలకుసుమసంపద యెల్ల సుడివోయి. రూపు దక్కినమహీరుహము భంగి.

మార్కం. ౧-౧౬౮ వ్రా.

సుడిసుడిగొను. స. క్రి. = మిక్కిలి సుడిగొను; మిక్కిలి తిరుగుడువడు.

క. వీఁక నెడి ఘనగదాహతిఁ దోఁకయుఁ గదలింపలేక దుస్సహపీడన్, మోఁకలిఁ బడియె నేలను, సోఁకోర్వక దిగ్గజాలు సుడిసుడి గొంచున్. భాగ. ౮ స్కం ౩౬౧.

క. సుడిగాలి వచ్చి నిన్నున్ సుడిగొన కొనిపోవ మింట సుడిసుడి గొనుచున్, బెడఁ గదరెడి వా ముద్దులఁ గొడుకా!

భాగ. ౧౦ స్కం ౨౬౮.

సుడిసుడులుగట్టు. మిక్కిలి సుడులుకట్టు; అవిచ్ఛిన్నముగా ప్రసరించు.

గీ. కన్నుఁ జెన్నునకుండఁ జీకాకుపఱచె; సుడిసుడులుగట్టి యగ్గండ్లసోనవాన.

రంగా. ౩-౮౦.

సుడుము. వి. ౧. కంటకాదిభారము; కంప తోడుగు. విత్తనములు చల్లినపిదప చేను పదును చేయుటకై యీడ్చెడికంప. ౨. నూలుగొట్టెల గుంపు. శ. ర.

సీ.... లోదుగట్టియాడికసుడుము కంప, యున దనర్చును గంటకాదిభారము....
ఆం. భా. ౨-౩౮.

సుత. సం. వి. ఆ. స్త్రీ. కుమార్తె.

సుత. దే. అవ్య. ప్రభృత్యర్థకము; మొదలుకొని (ఆది సుత; నాటిసుత మొ.) శ. ర.

సుతంగముఁడు. సం. వి. అ. పుం. పుత్రునిగన్న తండ్రి.

సుతంత్రి. సం. విణ. ఇ. ఈ. ఇ. ౧. మంచితీగెలు గలది; ౨. శ్రుతిరమ్య మైనది.

సుతనువు. సం. విణ. ౧. అంద మైనశరీరము గలది. ౨. సుకుమార మైనది ౩. సన్ననిది;కృశించినది.

సుతనువు. వి. ఉ. ఊ. స్త్రీ. సుందరి, కోమలి.

సుతపము. సం.విణ. న్. ౧. తీవ్ర మైనతపస్సు చేయునది. ౨. మిక్కిలి వేడిగలది.

సుతపము. వి. న్. న. తీవ్రమైన తపస్సు.

సుతపుఁడు. సం. వి. స్. పుం. ౧. తాపసుఁడు; యోగి. సూర్యుఁడు.

సుతమామ్. సం. అవ్య. ౧. సర్వాతిశయముగా ౨. సర్వోత్తమముగా.

సుతము. సం.విణ. అ. ఆ. అ. ౧. ఉత్పన్నము; జనితము. ౨. పిండఁబడినది. ౩. పోయఁబడినది.

సుతము. సం. వి. అ. న. సోమరసము.

సుతరామ్. సం. అవ్య. ౧. మిక్కిలి మేలుగా. ౨. గుణోత్తరముగా. ౩. బొత్తిగా; పూర్తిగా. ౪. ఫలితముగా, పర్యవసానముగా.

సుతర్దనము. సం. వి. అ. పుం. కోకిలము.

సుతలము. సం.వి.అ. న. అగాధత్వము. ౨.సప్త పాతాళములలో నొకటి. మందిరముయొక్క ఆధారబంధము,మూలబంధము.

సుతవస్కర. సం. వి. ఆ. స్త్రీ. ఏడుగురుబిడ్డల తల్లి.

సుతశ్రేణి. సం. వి. ఈ. స్త్రీ. ఎలుకచెవి., మూషకపర్ణి İ

సుతారము. విణ.(హిం.సుతార్)సుకుమారము, శ్రేష్ఠము.

క. అరశేక చుక్క తెలుఁగున, మెఱయు సుతారంబు మేలిమి నిట్రివలై. రత్నపరీక్ష. ౪౯

గీ. తళుకు లీను సుతారపుముత్తెముల పెద్దచౌకట్లు చెక్కులఁ జౌకళింప. శ్రీరంగ ౧౦-౧౧౨.

సుతారి. వి. సురంగము త్రవ్వెడిసాధనము.

శా. జెట్టిం జీమలు బట్టిన ట్లపుడు నిశ్రేణుల్ శిర స్త్రాణముల్, కట్టుంగోలలు పాఱచిప్పలు సురంగంబున్ సుతారుల్. రంగా. ౩-౬౦.

సుతాళము. వి. అతిశయము,

గీ. రాగమా యిది మది కనురాగ మనుచు....
తాళమా యిది రతికి సుతాళ మనుచు.
కవిరా. ౪౯౭ పారట

సుతి. వి. (సం.శ్రుతిః) కంఠస్వరాదులకు సహాయ మగు తంతి లోనగువానిధ్వని.

తే. గీ. తొలుత సుతికోయిల యొసంగదోడ గోర, వంక తాళము లగ్గడింపంగ నెమలి సకియ నటియింప మరునాట్యశాలలీల, వంతు వగఁ బొల్చు కేళిగృహాంతరమున.
ప్రబం. ౧-౪౦౬.

ఉ. వెన్నెలరాచబాచలువ విప్పుట రంగులఁజేరి జాలువా, కిన్నర లూని జాను తిలకింపఁగఁ బాటలు వాడు బాసవా, ల్కన్నియమిన్న గాణలకు గాటముగా సుతు లిచ్చు నచ్చటన్ గ్రొవ్వన కమ్మదేనియలు గ్రోలుచుఁ దుమ్మెద బోటికూటువల్. అ. రా. బాల. ౧౨౦.

సుతిగూడు=సుతికూడునట్లుచేయు (శ్రుతిగలుపు

క. గానము పాటగులసోనై, తేనెలవానై సరస్వతీకరవీణా,శాపశ్రుటక్కై యమృవి, తా

నము తాసైతగును సుదతి సుతిగూడదన్.
రాజవాహన. ౪-౧౦౯.

సుతిగూరుచు. (క్రి)=సుతి గూడునట్లు చేయు

సీ. శారదసుతిఁ గూర్పనేరవు నీవు తెమ్మని వీణె టుంగుటుంగునను మీటు.
దశా. ౪-౧౧౯.

సుతిమీటు. =సుతి యేర్పడునట్లు తీగమీటు.

వ. ప్రియుండు పనిండిదండియుఁ బూని సుతి మీట విభునిచెంత వసియించి చిన్నకిన్నెరం బూని పంచచర దేవతావిజయప్రపంచనమంచి తంబు లగునూతనగీతంబులు పలికించి.
చంద్రికా. ౪. ౧౦౭.

సుతి. సం. వి. ఇ. స్త్రీ. సోమరసము పిండుట

సుతి. సం.వి.న్.పుం.సంతానము గలవాఁడు,తండ్రి

సుతికాఁడు. (√ సుతి) వి. సుతిచేయువాఁడు.

సీ....సుతికాఁ డనంజను శ్రుతివిధాయి.
ఆం. భా. ౬-౭౮౭. వ్రా.

సుతిక్తము. సం. వి. అ. పుం. పగడపుచెట్టు ; (Coral Tree)

సుతిని. సం. వి. ఈ. స్త్రీ. సంతానము గలస్త్రీ; తల్లి.

సుతీక్ష్ణదర్శనుఁడు. సం.వి.అ.పుం. శివుఁడు.

సుతీక్ష్ణము. సం.విణ.అ. ఆ. అ. ౧. మిక్కిలి కారమైనది.౨.మిక్కిలి పదునైనది. 3. మిక్కిలి బాధకలిగించునది.

సుతీక్ష్ణము. సం. వి. అ. పుం. శిగ్రువృక్షము ;

సుతీర్థుఁడు. సం. వి. అ. పుం. ౧. మంచిగురువు. ౨. శివుఁడు.

సుతుంగము. సం. విణ. అ. ఆ. అ. మిక్కిలి ఎత్తయినది.

సుతుంగము. సం. వి. అ. పుం. కొబ్బరిచెట్టు ;

సుతుఁడు. సం.వి.అ.పుం.౧. కొడుకు ౨. రాజు.

సుతేజము. సం. విణ. స్. ౧. మిక్కిలి పదునైనది. ౨. మిక్కిలి ప్రకాశించునది. 3. మిక్కిలి శక్తిగలది.

సుతేజుఁడు. సం. వి. స్. పుం. సూర్యుని ఆరాధించువాఁడు.

సుత్తడువు. వి. గజశాల మొ॥ నిర్మించుటకు పాతెడు మేకు.

క. శాలల సుత్తడవులతోఁ, గొలిశృంఖలము లైన కీలకములతో వాలానంబులతో గజశాలలు ప్రభవించె నతివిశాలలు పెక్కుల్.
వరాహ. ౪-౧౦3.

సుత్తి. = సుత్తె వి. ౧. చిన్నసమ్మెట, కంచరి మున్నగువారి పనిముట్టు. మట్టుకన్నుసుత్తి, అడ్డకన్ను సుత్తి బొద్దుసుత్తి, గుబ్బసుత్తి, మొనిసుత్తి
ఆం. భా. ౨-౫౯౭.
వీనిభేదములు=పొదసుత్తి, పెద్దసుత్తి, జాతిసుత్తి నూరకవి తిట్టు కంసాలిసుత్తి పెట్టు. (చాటువు)

సుత్తె. =సుత్తి. వి. దాగలిమీఁద బంగారు లో హగువానినుంచి సాఁగఁగొట్టెడు సాధనము,చిన్న సమ్మెట, అల్పసంఖలి.

చ. కమలముకట్లపంచి యొరగల్లును గత్తెర సుత్తె చీర్ణముల్, ధమనియు త్రాసణంబు మొలత్రాసును బట్టెడ నీరుకారుశా,ణము పలు కారుమూస బలుశాణపరీక్షల మద్దులాదిగా నమరఁగ భద్రకారకసమాహ్వయుఁ డొం డొక డుండు నప్పురిన్. హంస. ౨-౧౫౧.

సీ. సుత్తెవాటుల వారు చెత్తనిసొమ్ము సొం పల రించె నెవ్వాఁడు సొంబునకును.
రాజవాహన ౧-౯. వ్రా.

తే. గీ. బాలఁతికచయకగంబుతోఁ బోరుట కును, గాద చక్కనిసొవర్ణకలశకుచలు, నొ క్కలై చిక్కుపడి చాలఁ దుక్కుపట్టి సుత్తె పెట్లకు లోనర్యేఁ జోద్యముగను.
సీతా. ౨-౧౭3.

**సుత్యా.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సోమలతను కొట్టి పిడుచుట, సోమపానము ౨. స్నానము.

**సుత్రాముఁడు.** సం. వి. న. పుం. ఇంద్రుఁడు.

**సుత్వుఁడు.** సం. వి. న. పుం. యజ్ఞమునందు సోమలతను కొట్టి పిడిచినవాఁడు. (౪౭)

**సుద.** తద. వి. కొన, అగ్రము.

సీ. సాగటాలకైఁ గోఁక సుదకువచ్చిన యంత వింతమాటల గారవింప నేర్పు. నిరం. ౨-33.

**సుద.** విణ. చివరిది, కడపటిది.

సీ. ఇటు శేనితేఁల నెనయుమిన్నుల లేరి జోడు పుట్టినకొండఁ జూచివాఁడ నిటుకేల శేజేల కెలుకై నచెంగావి సుదసంజఁ దగుకొండఁ జూచివాఁడ. నరసభూ. ౫-౨౨.

సీ. అధిపుమై ముద్రింప ననియు శేఖరామ, సుదగోళ్లఁ గుసుమముల్ చిదిమి తెచ్చు. కవి. ౬-౯౫.

సుదకొమ్మ = కొమ్మకొన.

ద్వి. మనమున నెదిరించి మగకోకిలములు, ముక్కుల టెక్కులు ముగుపుగాఁ దీర్చి, చొక్కంపు లేమావి సుదకొమ్మ లెక్కి. నవనాథ. ౧-౧౨ పు ౨ పం.

**సుదండము.** సం. వి. అ. న. వేత్రము, పేప బెత్తము.

**సుదంతి.** సం. వి. ఈ. స్త్రీ. వాయవ్యదిగ్గజము యొక్క భార్య.

**సుదంతుఁడు.** సం. వి. అ. పుం. నటుఁడు.

**సుదక్షిణ.** సం. వి. ఆ. స్త్రీ. దిలీపమహారాజాభార్య.

**సుదక్షిణము.** సం. విణ. అ. ఆ. అ. ౧. హృదయపూర్వక మైనది. ౨. వదాన్యమైనది. 3. మంచి దక్షిణ గలది. (యజ్ఞము)

**సుదతి.** సం. వి. ఈ. స్త్రీ. మంచిదంతములు గల స్త్రీ.

**సుదర్శన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అందగత్తె. ౨. స్త్రీ. 3. అజ్ఞ. ౪. ఒకఓషధి ¡

**సుదర్శనము.** సం. విణ. అ. ఆ. అ. ౧. అందమైనది. ౨. సుఖముగాఁ జూడఁగలిగినది.

**సుదర్శనము.** సం. వి. అ. పుం. విష్ణుచక్రము పేరు.

**సుదర్శనము.** సం. వి. అ. న. ౧. అమరావతి. ౨. జంబూద్వీపము. 3. మేరుపర్వతమునందలి శేరేడు ¡

**సుదర్శనుఁడు.** సం. వి. అ. పుం. ౧. శివుఁడు. ౨. మేరుపర్వతము. 3. రాబందు.

**సుదానము.** సం. వి. అ. పుం. ౧. మేఘము. ౨. పర్వతము. 3. సముద్రము. ౪. ఐరావతము

**సుదాయము.** సం. వి. అ. పుం. ౧. శుభప్రదమైన కానుక ౨. పెండ్లియందు అల్లునికి, ఆడుబిడ్డకు నిచ్చెడి అరణము.

**సుదినము.** సం. వి. అ. న. ౧. మంచిరోజు. ౨. మబ్బులేనిదినము.

**సుదీర్ఘము.** సం. విణ. అ. ఆ. అ. మిక్కిలిపొడవైనది.

**సుదీర్ఘము.** స. వి. ఆ. స్త్రీ. ఒకవిధ మైనదోసకాయ.

**సుదుర్లభము.** సం. విణ. అ. ఆ. అ. అరుదైనది. పొత్తిగా లభింపనిది.

**సుదూరము.** సం. విణ. అ. ఆ. అ. ౧. మిక్కిలి దూరముం దున్నది. ౨. ఎక్కువదూరము.

**సుదృక్కు.** సం. విణ. అందమైనకన్నులు గలది. వివేకముగలది.

మ. గురువిద్వేషికి .... పికస్వరముం బంచమశబ్దమిందుకు సుదృగ్జాలంబు రాఁజెల్లునే? వసు. 3-౧౨౪.

**సుదృక్కు.** సం. వి. స్త్రీ. అందమైనకన్నులు గల స్త్రీ.

సుదృఢము. సం. విణ. అ. ఆ. అ. మిక్కిలి గట్టిది, మిక్కిలి బలమైనది.

సుద్ద. శుద్ధమృత్తిక, తెల్లమట్టి.

సీ.... శుద్ధమృత్తిక, రొంపు సుద్దయం చన మీఱు, బంకమ న్నన(గ( గంధకరమృత్తు

ఆం. భా. ౨-౫ ౧౯౨.

సుద్దంతట్టుట. వి. కమ్మరక్రియలలో నొకటి. (నెల్లూరు తిరుపతివత్తుమండలములవాడుక)

సుద్దగించు. అ.క్రి. కమసాలి. బంగారు లోనగు వానిని సుత్తెపెడితో మిట్టపల్లములు లేకుండఁజేయు

చ. కరఁగను బోతపోయఁగను గాఁచిక రం చము గమ్మి దీయఁగా, నొరయఁగ వన్నియల్ మిగులనుండఁగఁ జూపఁగఁ బూదగట్ట తే, కరయఁగఁ దీర్చఁ జెక్కఁబడి యచ్చున జే యఁగ సుద్దగింపఁగా సొరిదిని జిత్రచిత్రముగ సొమ్ములు సేయ నతండు నేరుచున్.

హంస ౨-౧౮౨ ౧౯౨.

సుద్దము. విణ. నిర్మలము. (సం. శుద్ధమ్) (శ. సుత్తమ్)

సీ. నిడుదచేతులవాఁడు నిద్దంపుటద్దంపు చెతి చెక్కుజోటివాఁడు.

అ. రా. సుందర. ౮౩.

సీ. మక్కు మానినదిశా మలినంబు విలసిల్లు, సుద్ద మం చనఁగను శుద్ధమెువ్వ.

ఆం. భా 3-౨౫. ౫౯.

సుద్ది.[1] వి. ౧. సల్లాపము, ముచ్చట.

ఉ.... మునిదారులతోఁ దగ సుద్దులాడుచున్, నిద్దపు చెక్కు.... దశా. ౬-౮౮.

సామెత. (సం. శ్రుతిః)

సీ ప్రజలఁ గాననివాని పాయసం బను సుద్ది తు దమ వాదృష్టి యందునకు నిచ్చి....

రాజవాహన. ౧-3౬.

గీ. అబాలగోపాల మైనసుద్ది పగవారి పగవారు చుట్ట లగుట. కాశీ. ౫-౨౯౨.

౩. నడి, మాట (స. సూక్తి)

ద్వి. సుగ లొంఱక్క తియ్యని సుద్దులవాని, బుధు లకు హితవాత్మఁ బూనెడువాని

రం. రా. అయోధ్యాకాం. ౯౮ పు. ౧౩ పం.

ఉ. ఇప్పటి నీతలంపు తెలఁ గిట్టిదయా నిట మీఁద నెప్ప డే వొప్పన నుండునో నిజము రుఱుంగము. శృం. నై. ౨-౬౭.

క. నె, న్నుదుల మట్టల ముద్దుల సుద్దుల చాల కుఁడు ద్రోచె క్షోణిఁ బడంగన్.

వి. పు. ౭-౧౩.

౪. వృత్తాంతము, వార్త.

సీ. నిమధదేశపువిప్రనికరంబు పూజించి యల యక ప్రియసుద్ది యడుగఁ దలచు.

శృం. నై. ౧-౭౪.

వ. ఇట్లు గావించి యక్కురువలికట్టి క్రిమ్మతి యక్కొమ్మ చేతిగుఱుతుగొనివచ్చి ముద్దియ సుద్దవిడి నెఱింగించినం బొంగిరాముండతని గౌఁగిటం జేర్చి గారవించి యడుగర లిచ్చి యనిచిన. యయా. 3-౨౭.

౫. ప్రసంగము.

తే. స్వామి యుత్తరపక్షికపాశ్చాత్యు లెల్ల, వేదముల సుద్దిమొదలంటవిడిచిరి.

ప్రబోధచం. ౨-౪౬.

౬. బాడ.

తే.గీ. అందు వేశ్యాగృహంబున హైమపాత్రఁ గన్నయగసాలిబిత్తుఁ డాగిన్నెసుద్ది నేకతం బునఁ దలవరు తెలుకచేసి, చనియె ఘనమైన మెచ్చు గైకొని ముదమున. వైజ. ౪-౭౬.

కం. అకన్నప్రతిమసుద్దులు మాకు మును పు కలిమి జేసి మహనీయకదీయాకృతి పొలు పంతయు భవహాకృతి గని యంతట యనుకొంటి మెు గిన్. ప్రభా. ౨-౧౦౪.

సుద్ది.2 (సం. శుద్ధిః; క సుద్దు; త. చుద్ది) విణ. ధా తము, శుచియైనది.

సీ.... అద్దేవి దర్శింప ననుఁగుఁజెలుఁ గొడఁ గూడి కన్నియ పడుచనై యొకనాఁడు నీరాడి కడుసుద్ది చీరఁగట్టి.

చమత్కా. ౨-౧౨.

సీ. సుద్దిగా నున్నాను సుదతి ముట్టకు మన్న గబ్బిగుబ్బలగ్రుమ్మి కాగిలించు.

రాధికా. 3-౧౭౭.

సీ. సుద్దిగనున్నాను వస్తర మైవాల, నతిన బం గారాన కంటఁగలదు.

అహల్యా. 3-౧౧౧ బ్రా.

సుద్దిగాఁడు. పరిశుద్ధుఁడు.

అటువంటి సుద్దిగాడు కా డటండువు శుక. ౧.

సుద్దిచేయు. స. క్రి. శుద్ధిపఱుచు.

సుద్దులకత్తె. వి. మాటకారి, మంచిమాటలు చెప్పునది.

ఉ. సుద్దులకత్తెయై యొచటఁజూచిన నేచి చరించు నేఁకిన్. బుద్ధులు చెప్పి దాను పలుబోఁకలు బోవఁ దొడంగు నంచు నో, వద్దను బాయ కుండి తల వాఁకిలి దాటఁగనీక వాలి నే, పాద్దును గాచు క్రొంబసిఁడిబొజ్జ గురుస్తును బ్రస్తుతించెదన్ (ఇచటప్రకరణమునుబట్టి వా గ్దేవత యనియర్థ ము వచ్చును.

ఉత్తరహరివంశం ౧-౬.

సుద్దులకన్నె. వి. సరస్వతి.

ఉ. సుద్దులకన్నెకన్నుఁగవ వొక్క పుజెక్కులు మోవిసొక్కు మై, ముద్దుమొగ మోవికిని మోవికొఁ అంతఁదలంచి నేలుపుం, బెద్దకుఁ బంచ వక్త్ర గనిపెంచినమేటికి పంచవక్త్ర వా దద్దిర యంచు నవ్వు చతురాస్యుఁడు మాకుఁ జిరాయు వీవుతన్.

రాజవాహన. ౧-3.

సుద్దులకుమారుఁడు. (గ్రా)వి.(బ)? గొల్లసుద్దులు పాడువారు ?

వ. పరిహాసకులు సుద్దులకుమారుఁడు కొమ్మారిదా సర్లు తవిరుదాసర్లు.... హంస. 3-౭౯.

సుద్దులమారి. వి. అడిబంద, వాచాలుఁడు, కపిలరి.

సీ. పలువిత్తుపలు గాకిప్రాజ్ఞ్యాకుఁడుచ్చిష్టమెండు. సుద్దులమారి యులిపికట్టె. హంస. ౫-౧౦3

సుద్దులాడు. అ. క్రి. (సుద్దులు+ఆడు) మాట లాడు.

సీ. పోఁగొగిరపు జడదాఁ గాంచిన కేలుప పెద్ద ముద్దియతోఁడ సుద్దులాడి.

సేతుఖం. ౧-౭ పుట, తాళపత్రి.

సుధ. సం.వి.ఆ.స్త్రీ. ౧. అమృతము. ౨. పాలు 3. సున్నము ౪. జెముడు ౫. చాఁగ ౬. ఇ టిక. ౭. రసము. ౮. తేనె. ౯. మొలపురిగ

సుధన్వుఁడు. సం. వి. న్. పుం. ౧. మంచివిలు కాఁడు. ౨. ఆదిశేషుఁడు. 3. విశ్వకర్మ.

సుధర్మ. సం. వి. న్. పుం. వి. ఆ. స్త్రీ. ఇం ద్రునిసభ.

సుధర్ముఁడు. సం. వి. న్. పుం. ధర్మములను చక్కఁగా నిర్వర్తించువాఁడు.

సుధాంగుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

సుధాంశువు. సం. వి. ఉ. పుం. చంద్రుఁడు. కర్పూరము.

సుధాకరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

సుధాజీవి. సం.వి.న్. పుం. సున్నపుపనివాఁడు; గోడకట్టువాఁడు.

సుధానిధి. సం. వి. ఇ. పుం. చంద్రుఁడు. కర్పూరము.

సుధాపాణి. సం. వి. ఇ. పుం. ధన్వంతరి.

సుధాభిత్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. సున్నము చేసినగోడ. ౨. ఇటుకగోడ. ౩. అపరాహ్ణమున ఐదవ ముహూర్తము.

సుధాభుక్కు. సం. వి. క్. పు. దివ్యుఁడు, దేవత.

సుధాభృతి. సం. వి. ఇ. పుం. ౧. చంద్రుఁడు, ౨. కర్పూరము. ౩. యజ్ఞమందలిబలి.

సుధాయిక. దే. వి. ఒకస్వరస్థాయి.

ద్వి. సిగిరిసుధాయిక సిగితంబు... ఆదిగా సాగ యుఁ గాయములు.

బస. పురా. ౭౧ పు. ౧౧ ప.

సుధాకర్ణము. సం. వి. అ. న. ముత్యము.

సుధావర్షి. సం. వి. న్. పుం. ౧. బ్రహ్మ ౨. చంద్రుఁడు. ౩. కర్పూరము.

సుధావాస. సం. వి. ఆ. స్త్రీ. ఒకదినుసు దోస

సుధాసూతి. సం. వి. ఇ. పుం. ౧. చంద్రుఁడు. ౨. యజ్ఞము. ౩. కమలము.

సుధాస్రవ. సం. వి. ఆ. స్త్రీ. చిఱునాలుక; కొండనాలుక.

సుధాహరుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు.

సుధితము. సం. విశే. అ. ఆ. అ. ౧. దృఢము, పూర్ణము. ౨. మంచిది, దయగలది. ౩. సుఖముగలది, సమృద్ధమైనది. ౪. చక్కఁగా గుఱిపెట్టఁబడినది. (బాణాది)

సుధితి. సం. వి. ఇ. పుం. గొడ్డలి.

సుధీ. సం. విశే. ఈ. మిక్కిలితెలివిగలది.

సుధీ. సం. వి. ఈ. పుం. మేధావంతుఁడు; విద్యావంతుఁడు.

సుధీ. సం. వి. ఈ. స్త్రీ. మేలయిన మేధాశక్తి.

సుధోద్భవుఁడు. సం. వి. అ. పుం. ధన్వంతరి.

సుధ్యుపాస్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. పార్వతి. ౨. పార్వతి చెలికత్తె. ౩. స్త్రీ. ౪. ఒకగంధ పదార్థము.

సుధ్యుపాస్యము. సం. వి. అ. పుం. రాజప్రాసాదము. [illegible]

సుధ్యుపాస్యుఁడు. సం. వి. అ. పుం. శ్రీకృష్ణుని పరిచారకుఁడు.

సుధూమ్రవర్ణ. సం. వి. ఆ. స్త్రీ. అగ్నిదేవుని సప్తజిహ్వలలో నొకటి.

సునయన. సం. వి. ఆ. స్త్రీ. ౧. అందమైన కన్నులు గల యాఁడుది. ౨. ఆఁడుది.

సునయనము. సం. వి. అ. పుం. హరిణము; లేడి.

సునయము. సం. వి. అ. పుం. ౧. సత్ప్రవర్తన ౨. మంచియాశయము, మంచివిధానము.

సునాభము. సం. విశే. అ. ఆ. అ ౧. మంచి బొడ్డుగలది, ౨. మంచి కేంద్రముగలది.

సునాభము. సం. వి. అ. పుం. ౧. పర్వతము. ౨. [illegible]పర్వతము. ౩. [illegible]

సునామణి. హిం. వి. [illegible]

సునాయాసము. విశే. మిక్కిలి సులభము.

శా. ఆగామంబులు పెక్కు గల్గినను సునాయాసంబుగా గెల్చి. విక్ర. ౧-౯౮.

సునారము. సం. వి. అ. పుం. ౧. కుక్కపాలు. ౨. పాముగ్రుడ్డు. ౩. పిచ్చుక.

సునావము. సం. వి. అ. న. నౌకాయానమునకు యోగ్యమైనజలము.

సునాసీరుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

సునిభృతము. సం. విశే. అ. ఆ. అ. ఏకాంతము, దృఢము, రహస్యము.

**సునిశ్చలుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సునిషణ్ణకము.** సం. వి అ. న. నీరుచెంచలి ‡

**సునీతము.** సం.విశే.అ.అ.అ. ౧. మంచినడవడి గలది. ౨. నాగరకము. మర్యాదకలది.

**సునీతము.** సం. వి. అ. న. ౧. సత్ప్రవర్తన ౨. సన్మార్గము, మంచిపద్ధతి, వినయము.

**సునీతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సత్ప్రవర్తన. ౨. యోగ్యత, ఔచిత్యము. ౩. సన్మార్గము, సదాచారము. ౪. ధ్రువుని తల్లిపేరు.

**సునీథము.** సం. విశే. అ. అ. అ. ౧. మంచిది, యుక్తమైనది. ౨. ధార్మికము, సుశీలము.

**సునీథుఁడు.** సం.వి.అ పుం. ౧. బ్రాహ్మణుఁడు ౨. శిశుపాలునిపేరు (?) ౩. మంచినాయకుఁడు (వైదికము).

**సునీల.** సం. వి. ఆ. స్త్రీ. నారపీచు, గోగునార.

**సునీలము.** సం.విశే.అ.అ. అ నల్లనిది, నీలమైనది

**సునీలము.** సం. వి. అ. పుం. దానిమ్మచెట్టు ‡

**సునీలము.** సం. వి. అ. న. నీలమణి.

**సున్న.** వి. (సం. శూన్యమ్) (ప్రా. సున్న, సుణ్ణ) అనుస్వారము, బిందువు. ఇది నిండుసున్న యరసున్న యని ద్వివిధము.

తే.గీ....మానధైర్యము లున్నసున్న లనుచు, సుదతి బోంట్లకుఁ దెలుప వ్రాసి చూపెననఁగ.
అము. ౫-౧౫౪.

ఉ. కన్నులు దీర్ఘముల్ నగుమెుగం బవురా తిలకట్టు తమ్మిపూ, పున్నమచంద్ర మామలకుఁ బొక్కిలి చక్కఁదనంబు, చెప్పఁగా సున్నది మేలుబంతులు పయోధరముల్ మఱి కాను సున్నయా, సెన్నికకెక్క వ్రాఁతపల మివ్వ రవర్ణినికి న్నిజంబుగన్. విజ. ౨-౧౦౪.

౨. అంకెలలో శూన్యస్థానము దెలుపువస్తువురేఖ
సారంగ. ౨-౮.

ఆ. అన్యుఁ డొక్కఁ డున్న నంద సూన్యాక్షరే ఖక్కమీఁద నున్న లెక్కవల్లు, అతఁడు వోవువెనుక నందఱుఁబూజ్యాల లెక్కచెంత సున్న లేఁగినట్లు. బ్రౌ.

**సున్న.** విశే. (సం. శూన్యమ్) లేగి, శూన్యము

ఉ. ఎన్నఁగ నిం, జూచిన యల్పమానఁ ఫుడు సున్న సదీయసదస్య కోటిలోన్. విక్రమ. ౫-౧౫౯.

క. నలుపు పటువాపులా సహి, యు సున్యము సున్న తలఁపు లభ్రచ్ఛాయల్.

చ. కపటము లేదు సంగరముఖంబున నోట హుళక్కియొట్టి చోఁ గృపణవినంబునాస్తి సహి కల్పమవర్తన మిల్ల కల్ల యొల్లఁపుడు సున్న ఖిన్నతయహంకరణం బెటువంటిదో కదా కుపితవిరోధిహర్త యగు గొల్లునిఁ చిత్తప్రపాల మాలికన్. రామా. ౧౪౬.

**సున్నగిల్లు.** అ. క్రి. సుంద్రమగు

**సున్నగు** (సున్న + అగు) అ. క్రి. సున్నయగు, శూన్యమగు, క్షీణించు. తగ్గు.

ఉ. అన్నములేక యుండిన లయంబగు దేహము రక్తమాంసముల్ సున్నగు నింద్రియస్ఫురణ శుక్క మదాదికయుంబు దూర మానన్నం మీఁద ప్రేమ చెడు నచ్యుత నీపయి నిల్చు మానసం, బెన్నటికైన జ్ఞానులకు హెచ్చు దరిద్రతపాటియే సిరుల్. కుచేల. ౩-౫౩.

క. అన్నన్నఁ గమనూయట రాద. సన్నగిలుట గాఁగిలింత సడలుట నూర్పుల్, సున్నగుట నరూఢిరతి, కన్నెతికపు రతియుఁ బోలెఁ గదునిం పొసఁగెన్. మను. ౩-౧౧౪.

**సున్నచుట్టు.** అ. క్రి. శూన్యముచేయు, ఛేదను.

సీ. ఒకటి పంక్తిని వ్రాయుచూహ చేర్చినవాఁడె సున్నచుట్టక వ్రేలు చూపినాఁడు.... భవ్యభర ముండ రాయనభాస్కరుండ.
చాటుపద్య మణిమంజరి. ౧ పభా. ౭౦ పా

**సున్నపుఁగాయ.** వి. ✓ సున్నము. చూర్ణ కరండము.

సీ.... సన్నపుఁగాయసాఁజార్ణశరండ మా ....
ఆం. భా. ౨-౧౬౩.

**సున్నము.** వి. (సం. చూర్ణమ్. ప్రా. చున్నం. త. చున్నమ్. క. సుణ్ణ.హిం. చూనా) ముత్తెపు మొ. కాల్చిన తెల్లని యొకదినుసు పదార్థము

క.అ....భ్యున్నత సౌధము మీఁదను, సున్నము నిగుడించి. ట్టి జోడమునులపై. భీమ. ౨-౧౫౬

సీ. ఁ బొక్కులు పొక్క మెదియించి సున్నంబు మెత్తఁ జెల్లును మీకు మెలఁతలార!
నీలా. 3-38

చ ...తన హారము వోయిన నేను బోవుదున్ మఱి వక పోటఁబోవ జలమగ్నత కానది సున్నము
ఆము. ౫-౬౧

**సున్నమెత్తు.** అ. క్రి. ౧. శిక్షకై సున్నపుబొట్లు పెట్టు. ౨. సున్నము చేయు.

వ....సున్నమెత్తుటయుంబొట్టు కారులంబట్టుటయు సౌధసౌర్ణభూమణాదినిర్మాణంబులయందు.
ఆము. ౪-౧౯౩.

**సున్నసేయు,** (సం. శూన్యమ్) శూన్యముచేయు

చ. ఇఱవడి సున్నసేసి హృదయేశుల నిగ్గులు పుచ్చి యత్తమామలు నెరయించి.
భాగ ౧౦ స్కం. పూర్వ. ౯-౩౩.

**సున్ని.** (సం. చూర్ణమ్) వి. చూర్ణము, బియ్యము [illegible]

ఉదా:- మినుపసున్ని. చెన్న. ౫. ౨-23.చోడి సున్ని = చోడిపిండి. ఆం.భా.౨-౨౨౦వ్రా.

క. కనుఁగొనిన మది కసహ్యాతి, దనిపెడి యీ పాతిసున్ని తగ జాకై డ్యాచినదానవె చాఁ సుమా, యని మిగిలిన దచట నునిచి యగౌఁ డేఁగె వెసన్.
చెన్నబ. ౨-౪౬.

**సున్నితము.** విణ. కచ్చితము.

**సుపంథ.** (సుపథన్)సం. వి.న్. పుం. మంచిదారి

**సుపక్వము.** సం. విణ. అ. ఆ. అ ౧.చక్కఁగా వండఁబడినది. ౨. చక్కఁగా పండినది.

**సుపక్వము.** సం. వి. అ.పుం.ఒకరకము మామిడి పండు.

**సుపత్ని.** సం. వి. ఈ. స్త్రీ. మంచిభర్త గలస్త్రీ

**సుపథము.** సం. వి. అ. పుం. ౧.మంచిమార్గము; మంచిత్రోవ.౨.మంచివిధానము.3.సత్ప్రవర్తనం.

**సుపద్మ.** సం. వి. ఆ. స్త్రీ. వసకొమ్ము.

**సుపర్ణ(ర్ణి).** సం. వి. ఆ. ఈ. స్త్రీ. ౧. పద్మి మూల సమూహము. ౨. తామరకొలను. 3. గరుడుని తల్లిపేరు.

**సుపర్ణము.** సం. విణ. అ. ఆ. అ. ౧. మంచి రెక్కలుగలది. ౨. మంచి ఆకులుగలది.

**సుపర్ణుఁడు.** సం. వి.అ. పుం. ౧. గరుత్మంతుఁడు ౨. సూర్యకిరణములలో నొకటి. 3. దేవయోని విశేషము ౪. అప్రాకృతికపక్షివిశేషము. ౫. కోడిపుంజు.

**సుపర్యాప్తము.** సం. విణ. అ. ఆ. అ ౧.మిక్కిలి విశాలమైనది. ౨. మిక్కిలియోగ్యమైనది.

**సుపర్వ(ము)** సం. విణ. న్. ఈ.న్. ౧.మంచి [illegible] గలది ౨. పెక్కుఅతుకులు కలది.

**సుపర్వ(ము)** సం. వి. అ. పుం. ౧. వెదురు. ౨. బాణము. 3. ఒకతిథి (పూర్ణిమ.అమావాస్య అష్టమి చతుర్దశి) ౪. పొగ.

**సుపర్వుఁడు.** సం. వి.న్. పుం. దేవత, వేలుపు.

**సుపా(ప్వా)ణి.** వి. (సాం. న. స్థా ౯౧) ౧ ముత్యము

తే. గొప్ప హురుమంజి సుప్వాణి కూర్పడంపు, డంబు పగడంబు జగడంబు ంబరంబు లెసఁ గిన గుడార్లు, గలుగునప్పనుమతీను పాలెమి క్షించిగజరాజా భయముమించి.కృష్ణ. 3-౩౫.

చ. వశిగల కెంపుటారవ వింతపసల్ గల తాళి వజ్రపుం, గడియముంన్ సుపాణులుం చౌకాటపుచౌకళికట్టు వర్గమా ల్గఁడుఁ బ్రియ మొప్ప నిచ్చి

**సుబాంధవుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సుబాహువు(ఁడు).** సం.వి.ఉ. పుం. ౧. మంచి బాహువులు గలవాఁడు. ౨. మారీచుని సోదరుఁడు.

**సుబేదారు.** వి. సేనాధికారులలో నొకఁడు.

మ. సముదగ్రోజ్జృంభితశౌర్యధుర్యు లగుసార్జంటుల్ మయూరుల్ కమండములన్ పీరులు పోలు దారులు సుబేదారుల్ మొద ల్గల్గుసైన్యముల
రంగా. ౧-౧౮౭.

**సుబోధము.** సం. విశే. అ. ఆ. అ. సులభముగా అర్థమగునది.

**సుబోధము.** సం. వి. అ. పుం. ౧. మంచివార్త. ౨. హితవు.

**సుబ్బనచూఱ.** వి. √సుబ్బ. (సుబ్బన్+అ+చూఱ) ప్రకటితమగునట్లు చేసెడి కొల్ల, పెద్ద కొల్ల. (చూఱ+చూఱ=చుబ్బనచూఱ. అనికర) జుబ్బనజూఱ— జుబ్బనజూఱ,—సుబ్బనసూఱ అని బ్రౌ. జుబ్బఁజూఱ అని. చి. ని. 'సుబ్బనచూఱ' అని ముద్రితములు ఈపాఠములన్నియు సువ్యుత్పత్తి సూన్యములగుటచేత పైవిధముగా గ్రహింపఁబడినది)

చ....రాము పెన్మములకల పాలివార లయి మోక్షము సు (చు) బ్బన చూఱ గాఁగ....
భా. రా. యు. ౧౮౫౩.

గీ. జరయుఁ దేవులను వగయును బొరయ వనఘ సుఖము లెప్పుడుఁను (జు) బ్బన చూఱలు...
మార్క. ౮-౧౭౭.

(పుష్కలముగా అనిభావము)

**సుబ్బనచూఱలాడు.** స. క్రి. (√సుబ్బ)—సుబ్బనచూఱలు+ఆడు) పెద్ద కొల్లగొను.

సీ. ఇప్పగ్గాణం బెప్పు డింపార జిహ్వకు నమృతంబుగాఁ గ్రోలఁబట్టివారు దుఃఖనిర్ముక్తులై సారసంసారసుఖములు సు (చు) బ్బన చూఱలాడి.
హరి ఉ. ౯-౭౩.

ఉ....వేల్పువెలఁదుల్పైతలం గవగూడి పైబయిం జుబ్బన సూ(చూ) ఱలాడుటకుఁ జొత్తురు. తన్మధురాధరామృతంబు....రామా. ౧-౮౫
(పుష్కలముగా ననుభవించు అనిభావము)

**సుబ్బు.** అ. క్రి. బయలుపడు, ప్రకాశమగు. (క. సుబ్బ=శుద్ధ)

సీ. నాపాలిణసఖులచందము నమ్మరాదు సూ సుబ్బుసుబ్బుల దూఱఁజూతురొక్క.
కృ. శకుం. ౩-౮౩.

శా. రవికం గ్రొమ్మించు పుట్టించుచన్ గుబ్బల్ పాదపుఁజుబ్బు కన్నులముసుంగుల్ సుబ్బబిబ్బోకమాన్, బిబ్బిగబ్బిమిటరు లెక్కఁసురకీ బ్బందఁబు చిందెన్ నడల్.
రాజవాహన. ౬-౬౦.

౨. వ్యాపించు, ప్రసరించు.

కం. ఆ చిత్రఫలక మెవ్వరు,చూచిన వెలి విసయపుకు సుప్పైకునది నీ, వే చూచు టేను జూచుట, దొరాచఁచలనయనా! యింతయు నెఱుంగుమ కే?
ప్రభా. ౧-౧౩౫.

౩. లోకప్రవాదము, జనశ్రుతి.

సీ. నా పాలిణసఖుల చందము నమ్మరాదు సూ సుబ్బుసుబ్బుల దూఱఁజూతు రొక్క.
కృ. శకుం. ౩.౮౩

**సుబ్రహ్మణ్యుఁడు.** సం.వి. అ. పుం. ౧. కార్తికేయుఁడు, కుమారస్వామి. ౨. యజ్ఞమునందు నియుక్తు లగు పదునార్గురు యాజకులలో నొకఁడు.

**సుభంగ.** సం. వి. ఆ. స్త్రీ. కొబ్బరిచెట్టు.

**సుభగ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. భర్తయొక్క ప్రేమకు పాత్రురాలైన భార్య. ౨. పూజనీయ మైన మాతృదేవి. ౩. అడవిమల్లె ౪. పసుపు. ౫. ప్రియంగులత. ౬. తులసి.

**సుభగంమన్యుఁడు.** సం.వి.అ.పుం. ౧ అదృష్టవంతుడనఁ,అందగాడను అని తలంచువాఁడు. ౨. ఆత్మశ్లాఘాపరుఁడు, స్వాభిమాని.

సుభగము. సం. విణ. అ. ఆ. అ. ౧. అదృష్టము గలది. ౨. అభివృద్ధిగలది. ప్రియమైనది, అందమైనది. ౩. ఇష్టమైనది, ఇంపైనది, మధురమైనది. ౪. ప్రసిద్ధమైనది, ఉదాత్తమైనది.

సుభగము. సం. వి. అ. పుం. ౧. అశోకము. ౨. చంపకము. ౩. వెలిగారము. ౪. ఎఱ్ఱకలువ.

సుభద్ర. సం. వి. ఆ. స్త్రీ. అర్జునుని భార్య, అభిమన్యుని తల్లి.

సుభద్రకము. సం. వి. అ. పుం. ౧. దేవతావిగ్రహములను ఊరేగించుట కైనరథము. ౨. బిల్వవృక్షము.

సుభద్రము. సం. విణ. అ. ఆ. అ. సురక్షితమైనది, సుఖమైనది. అదృష్టముగలది.

సుభాషితము. సం. విణ. అ. ఆ. అ. చక్కగా బలుకబడినది.

సుభాషితము. సం. వి. అ. న. ౧. ధారాళమైన వచనము ౨. చమత్కారమైన వాక్యము ౩. సూక్తి ౪. హితవచనము ౫. మంచియభిప్రాయము.

సుభిక్ష. సం. వి. ఆ. స్త్రీ. ఆరెపువ్వు.

సుభిక్షము. సం. వి. అ. న. ౧. మంచిబిచ్చము. ౨. ఆహారసమృద్ధి. ౩. పాడిపంటలకలిమి.

సుభీరకము. సం. వి. అ. పుం. పలాశవృక్షము.

సుభూతికము. సం. వి. అ. పుం. బిల్వవృక్షము.

సుభ్రువు. సం. వి. ఊ. స్త్రీ మంచికనుబొమలు గల స్త్రీ.

సుమంగలము. సం. విణ. అ. ఈ. అ. ౧. శుభప్రదమైనది. ౨. యజ్ఞసమృద్ధిగలది.

సుమంగలి. సం. వి. ఈ. స్త్రీ. పుణ్యస్త్రీ; ముత్తైదువ.

సుమంతుఁడు. సం. వి. ఉ. పుం. మంచియాలోచన చెప్పువాఁడు.

సుమతి. సం. వి. ఇ. పుం. మంచిబుద్ధిగలవాఁడు.

సుమతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మంచిబుద్ధి, దయ మైత్రి. ౨. దేవతావర ప్రసాదము. ౩. ఆశీస్సు, వరప్రదానము. ౪. ప్రార్థనాగీతము (మంత్రము) ౫. కోరిక. ౬. సగరుని భార్యపేరు.

సుమదనము. సం. వి. అ. పుం. రసాలము.

సుమధ్య(మ). సం. వి. ఆ. స్త్రీ. చక్కని నడుము గల స్త్రీ.

సుమన. సం. వి. ఆ. స్త్రీ. బొండుమల్లె.

సుమనము. సం. వి. అ. పుం. ౧. గోధుమ. ౨. ఉమ్మెత్త.

సుమనస్సు(ము). సం. వి. స్. న. మంచిమనస్సు తృప్తి, సంతోషము. దయ.

సుమనస్సు(ము). సం. వి. స్. పుం. ౧. దేవత, దివ్యుఁడు. ౨. విద్వాంసుఁడు. ౩. వేదాధ్యాయి ౪. గోధుమ. ౫ వేపచెట్టు.

సుమనస్సు(ము). సం. వి. స్. స్త్రీ. ౧. బొండుమల్లె. ౨. మాలతీలత.

సుమనఃఫలము. సం. వి. అ. పుం. ఉమ్మెత్తపండు.

సుమనఃఫలము. సం. వి. అ. న. జాజికాయ.

సుమనోరజము. సం. వి. స్. న. పుప్పొడి.

సుమము. సం. వి. అ. న. పువ్వు.

సుమము. సం. వి. అ. పుం. ౧. కర్పూరము. ౨. ఆకాశము.

సుమారు. హిం. వి. కొంచెమెచ్చుతగ్గు. శ. ర.

సుమాళము. వి. సంతోషాతిశయము.

మ. అంత నారదుఁడు గయ్యాళి చింతటం గల్గెబో
గనుఁగో నా కనుచున్ సుమాళమునఁ జంకల్
వేసికొంచున్ వడిన్ వినువీథం జనుదెంచి.
వరాహ. ౧౧-౯౨.

సుమేధు(ధను)ఁడు. సం. వి. స్. పుం. పండితుఁడు, ప్రాజ్ఞుఁడు.

సుమేరువు. సం. వి. ఉ. పుం. ౧. మేరుపర్వతము. ౨. శివుఁడు.

సుమ్నము. సం. వి. అ. న. ౧. బుద్ధ్య. ౨. ఆనందము, సుఖము. ౩. వరము, రక్షణ, ప్రసాదము ౪. యజ్ఞము.

సుయవసము. సం. వి. అ. న. మంచిగడ్డి, పచ్చిక

సుయామునుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు పేరు.

సుయుక్తుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సుయోధనుఁడు. సం. వి. అ. పుం. దుర్యోధనుఁడు.

సుర. వి. గాలిసుడి.

సురకరువలి. వి. సురగాలి; సుడిగాలి.

క. ఆరుఁ దగు కంసుని పంపున, వరిగి తృణావర్తుఁ డవని కవచాటముగా సురకరువలియై విస విస, నరుదరుదన ముసరి విసరి పూరిం గొని పోయెన్. భాగ. ౧౦ స్కం. ౨౬౪.

వ. ప్రళయకాలంబున సురగరువలిచే దిద్దిరం దిరుగుడు కులనగంబులఁ గ్రేణిసేయు. భార. భీష్మ. ౧-౨౬౭.

సుర. సం. వి. ఆ. స్త్రీ. ౧. కల్లు, సారాయము, ౨. జలము. ౩. పానపాత్రము. ౪. పాము.

సురంగ(ము). సం. వి. ఆ. స్త్రీ. ౧. సొరంగము, భూగర్భమార్గము.

క. సురంగ సేయ జొక్కాడ నూహెన్ దశకు. ౬-౧౪౦.

౨. కన్నము, రంధ్రము.

సురంగంబు. (క. సురంగ²) వి. త్రికాళము.

వ. మఱియు.... పసిండి యాయగంబున సుఱియ సురంగంబు గాఁ దొంగరి పట్టియంగట్టి చెన్ను మిగులం గై సేసిన. కుమార సం. ౯. ౨౨౪.

సురంగము. సం. వి. అ. పుం. ౧. మంచిరంగు, ౨. నారింజ ¦ ౩. సొరంగము, కన్నము.

సీ. ఎదుటిసురంగంబు లెఱిఁగి యాచాయఁగాఁ గల్పించుపత్త్రిసురంగములగములు. కువల ౩-౧౫.

సురంగము. సం. వి. అ. న. ౧. రక్తచందనము, ఎఱ్ఱగందము. ౨. సిందూరము, ఇంగిలీకము.

సురంగయుక్త(జుఁడు) సం. వి. జ్. పుం. కన్నపుదొంగ

సురంగిక. సం. వి. ఆ. స్త్రీ. మూర్వావృక్షము. (The MURVA plant)

సురంజనము. సం. వి. అ. పుం. పోక చెట్టు.

సురంటి. వి. సురఁటి. రూ. వీవన.

ఉ. కప్పురపున్ రజంబునఁ బొగల్ జలియించి సురంటి గాడ్పుచే. కవిరాజ. ౩-౧౦౫.

సురంటీ. వి. సురఁటి. విసనకఱ్ఱ.

మ. సిరు పారంగపురంపు లేఁబొరసురంటీ గాడ్పు దీపంపు వెంటను గైకో గమకింపఁ బాణిసఖుకాటన్ దెల్లమయ్యెన్ జామీ. చంద్రాం. ౪-౧౬౭.

మ. ఒకనాఁ డింద్రుఁడు వైజయంతమణిసౌధో దగ్రభాగంబునన్ సకియల్ కొందఱు కుంచె గిండిసురఁటీసామగ్రిని.... పూని కొల్వగ .... దశా. ౪-౧౫.

సురఁగ (సం. సురంగా). వి. వృక్షవిశేషము, రక్తచందన వృక్షము? (ఇది తరంగము, తరఁగ వంటిది)

ద్వి. పారిజాతకంబులు పోకబోదియలు, సురగలుఁ బొన్నలుఁ జాతపోతములు. రం. రా. ఉ. కాం. ౧౧౭ పు. ౧ పం.

ద్వి. పలుమైన సురవిందపందిరుల్ దూతి. సురఁ గలపొరుగున నురుగుమాడావి, చూతపోత మ్ములనుదగొమ్మ లెక్కి. పదనాథ. ౩ ఆ. ౨౨౨ పు. ౧౫ పం.

సురఁటి. (టీ) వి. ౧. వట్రువ విసనకఱ్ఱ.

ద్వి. మసవంపుఁగొనలఁ గమర్చినయట్టి, సురఁటి
వట్రువ గాలి సుడియంగఁ ద్రిప్ప.
మార్క. పూర్వ. ౪౭౨.

మ. ఘర్మలవంబుల్ దొలఁగింపఁగా సురఁటిర్రై
రఁజిల్లు విద్యాకరిన్. పారి. ౧-౬౦.

సీ. చేయిగన్నులగలచేల్వ తొయ్యలిచేతఁ జూ
పట్టు చెంబట్టుసురఁటి యునఁగ. విక్ర. ౬-౬౪.

౨. మల్లవిద్యావిశేషము.

వ. మొగ్గ వ్రాలుటలును సురఁటి పల్లటి మొద
లగు లాగువరుసలును. మల్లుపురా. ౩-౬౯.

౩. పారావత విశేషము, పారావతము.

సీ...... కేల, పల్లటి యంతరపల్లటి సుర,టి
లకోరి బట్టి యొడ్డికూళి బకదారి, దూరబారు
లనంగ వారికాఖ్య.... ఆం. భా. ౨-౮౬.

౪. గళవరము.

వెలయఁ జామరగళరుతములు సురటన-
ఆం. పద. వాణా. ౪౨. వ్రా.

సురఁటితానము. వి. (√ సురటి)విసనికఱ్ఱయే
పుట్టుకగా గలది, గాలి
ఇట్టే సురఁటిపీవుల పుట్టు.ఆం.సం.దేవ.౨౨వ్రా

సురకరువలి. వి. సుడిగాలి.

వ.... తమకమపరిధానంబులు పెట్టి జలక్రీడ లా
డుచున్న నవి సురకరువలిచేతం బ్రేరితంబు
లయి కలిసిన. అని. ౩-౧౩౪.

సురకాని. వి.కానిలో కాలవభాగము.

కం. వారి యుత్తరభాగంబునఁ బురుషుఁడు దాఁ
బాఱమైనఁ బుణ్యం బైనన్, సురకానియుత్తు
చేసినఁ బరిణతిమై మేరుకుధరభారముఁ
జూపున్. పాండు. ౪. ఆ.

సురకారువు. సం. వి. ఉ. పుం. విశ్వకర్మ.

సురకార్ముకము. సం.వి. అ. న. ఇంద్రధనస్సు

సురకోలి. వి. ఒకదినుసు ఫిరంగి.

సురకర్తకము. సం. వి. అ. పుం. ౧. ఎఱ్ఱనుద్ద.
౨. చూతవృక్ష విశేషము ‡

సురక్రోవి. వి. ఒకవిధమైన పిరంగి.
ఆం. భా. ౨-౨౧౮.

సురగజ్జెలు. వి. బ. చిఱిమువ్వలు, ఒకవిధ మగు
గజ్జెలు.

సీ. ధ్రువమండలము కులపర్వతంబులు బలసి
తిద్దగూ రమ్య మగుసురగజ్జలపగిది గాఁగ....
కుమాసం. ౮-౨౨. వ్రా.

సురగవి. సం. వి. ఈ. స్త్రీ. కామధేనువు,
వేల్పుటావు.

సురగాడ్పు. వి. సుడిగాలి.

చ. మబ్బులోవకం బలుపుగఁ గ్రమ్మ దుమ్ము
గని పాతి పడిన్ సురగాడ్పు పెంపువన్.
అ. రా. కిష్కింధా. ౬౦.

చ. అ, గ్రతి సురగాలి సుళ్ళగతిఁ దార్కొని
మించె ధరాతలంబునన్.చంద్రాంగ.౨-౨౩వ్రా

సురగాలి. వి. ౧. సుడిగాలి.

సీ. సురగాలి తిరువుల సురుఁగడే యీ తన్వి
యచలంబులై చన్ను లమరకున్న.
హరిశ్చంద్ర. ౩-౩౫.

కేటకర్ణ కియఁబడిన పేరు.

ఉ. బెబ్బులికూన దానవుఁడు భీముఁడు గామిడి
గట్టుగట్టి చా,గబ్బికరాలికాలి సురగాలి గ
యాళి వయాళి పుట్టచెం, దుబ్బరిసింగిణి
మిసిగ. రాజవాహన ౩-౫౪.

సురజఃఫలము. సం. వి. అ. పుం. జీడిమామిడి
చెట్టు ‡

సురజ్యేష్ఠుఁడు. సం.వి.అ.పుం. బ్రహ్మ, వేల్పుల
పెద్ద.

**సురటి.** సం. వి. ఈ. స్త్రీ. రాగవిశేషము.

**సురతము.** సం. విణ. అ. ఆ. అ. ౧. చక్కగా క్రీడింపఁబడినది. ౨. ఖేలనశీలము గలది ౩. బాగుగా అనుభవింపఁబడినది. ౪. దయ గలది, మృదువు.

**సురతము.** సం. వి. అ. న. ౧. ఆనందము. ౨. మిథునక్రియ.

**సురతాణి.** విణ. మేలైనది.

రగడ. థాకచూపట్టు సురతాణి సింగాణీలు. కళలు దేరుపిరంగికత్తులు జారీలు.
హంస. ౫-౩౫౬.

**సురతాణి.** వి. = సురధాణి సురధాణ, వి. రాణి, స్వతంత్రురాలు.

గీ. రేయి సురతాణి జగ మావరింపఁదలఁచి. పాలుచు నిరులను బలుఁటీబులను బనిచి, కొలలకెత్తిన సున్నంపుగుండ లనఁగ, జాలఁగను పట్టెఁ దారకాప్రముదయంబు. విప్ర.౩-౨౮.

గీ. మేటి రతులకు సురతాణిమించుబోణి, దాని కెవర్తైనచాన జగానఁ గాన. క్రీడా. ౧-౫౦.
౨. చక్రవర్తి, రాజు, సామంతరాజు.

క. ఈ రీతిం గొందలిరుల కోరీసురతాణి గాఁకఁ గూర్చఁజకోరీమత్తము, యూరీరవములకు నఁలికి యుగ్మలి మదిలోన్.
చంద్రా౧౫. ౪. ౧౩౯.

**సురతాణిలగ్గ.** వి. నలు మూలలనుండి లగ్గపట్టుట.

సీ.... లగ్గశా సురతాణిలగ్గ యనఁగఁ, భాషాలు దార్వగ్ని భాండాది శాఖిద, లగ్గదిం తనఁగఁ కెలంగు.... ఆం. భా. ౨-౨౧౯ ౹్రా.

క. మనుజేంద్రుఁ డంత సేనల బనుపుచు సురతాణిలగ్గఁ బట్టించిన నద్దినుజవతి వీరధర్మంబునఁ దెగువకుఁ జొచ్చియొదుర మదిరిన కినుకన్. కువల. ౩-౧౨.

**సురతాణిసలాము.** వి. నమస్కారభేదము.

వ. హరిక్షేత్రమందలి సాలగ్రామస్వామి సురతాణి సలాము, అయోధ్య యందలి రఘూద్వహునకు దోయిలి. ప్రబం. ౧-౭౭౦.

**సురతాని.** వి. వాద్యవిశేషము. (ఒకవిధమగు వీణ)

**సురతాలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. చేటిక ౨. శావ్యకత్తె. ౩. శేఖరకము, శిరోమాలిక.

**సురతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. సుఖానుభవము. ౨. సంతృప్తి.

**సురతోషకము.** సం. వి. అ. పుం. కౌస్తుభరత్నము.

**సురదన.** సం. వి. ఆ. స్త్రీ. మంచిదంతములు గల స్త్రీ.

**సురదీర్ఘిక.** సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ.

**సురదుందుభి.** సం. వి. ఈ. స్త్రీ. తులసి.

**సురద్విషుఁడు.** సం. వి. ష్. పుం. అసురుఁడు, వేల్పుదాయ.

**సురధాణ.** = సురధాణి. హర. ౧-౨౨. ౹్రా.

**సురధాణి** = సురధాణ, తురకదొర. వి. (హిం సుల్తాన్) చక్రవర్తి.

సీ. గజపతి సురధాణి గడిమర్గముల కెల్ల రాజు వజ్రింపుబోరు తప్ప. ప్రబోధచం. ౧-౧౬.

**సురధాను.** = సురధాణి. వి.

కం. సురధాని రేల రక్కసి, సురధానీలీల నముచిసూదనముఖ్యుల్ దరిదా పెఱుఁగక మేరువు, దరిదాపునఁ గూడి మిగులఁ దహతహపడుచున్. దశా. ౪-౧౨౨.

**సురనిమ్నగ.** సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ.

**సురపతి.** సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

**సురపాది.** వి. ఒకానొకచెట్టు, కాకాంగము.

**సురపున్నాగము,** చూ. సురపొన్న.

**సురపొన్న.** వి. (సం.సురపున్నాగః)సురపున్నాగము, ఎమ్మెపువృక్షము.

గీ. ననుచు సురపొన్నఁ గనుఁగొన్న నవ్యదేవుఁడు
పొగడఁ బుక్కిటిమధువునఁ బ్రోదిసేయ దిండు
మాభి దోహదక్రియ లీఁద విడిచె నలరువిలు
కాని మొలకల కాత్మ నలికి.
విక్ర. ౧-౧౩౩.

సీ. వారుచ సురపొన్నవారిజముల బొన్నకెల్లి
మూలంగ బిల్లుపెమిలి యడుగు.
హంస. ౪-౧౧.

సీ. తోడి కన్నెలఁ దానుఁ గూడి మాడి చరించు
సురపొన్ననీడలఁ జూచిచూచి.
రాజశే. ౨-౩౫.

వ. మదనచాప విముక్తంబులై పెందలం గ్రోలిన
భవశరీరభస్మాంగరాగంబు పరాగ వ్యాజం
బున వెదలం గ్రాయుచున్న సురపొన్నలు
శృం. నై. ౧-౯౫.

చ. కనఁ దిలకంబుఁ గేసరముఁ గల్గుమియన్
రహిఁ బాడఁ జేరికనం, బునిమురమావి
నవ్య సురపొన్న ముఖాంబుజమెత్తఁ జంప
కం,బు పెఱిగవుంగిలం గొరవి మూర్కొన
వావిలి దన్న వంజుళం,బు నుదుట గోఁగునై
తరుణి పూచు సురద్రుమ మన్నిపువ్వులన్.
పారి. ౪-౯.

**సురభి,** సం. విణ. ఇ. ఈ. ఇ. ౧. మంచివాసన
గలది. ౨. మనోజ్ఞమైనది.

**సురభి,** సం. వి. ఇ. స్త్రీ. ౧. కామధేనువు.
౨. ఆవు. ౩. అందుగు † ౪.సురయనెడు గంధ
ద్రవ్యము. ౫.తులసి. ౬.మల్లె ౭.సువాసనగలచెట్టు
మద్యము. ౯. భూమి. ౧౦. ఆవు. ౧౧. సప్త
మాతృకలలోనొకటి ౧౨.తూర్పుదిక్కు ౧౩.శీమ
సాంబ్రాణిచెట్టు †

**సురభి,** సం. వి అ. న. ౧. బంగారు ౨. వాసన
గలకలువ ౩. గంధకము.

**సురభి,** సం.వి.అ. పుం.౧. వసంతఋతువు ౨. చైత్ర
మాసము. ౩. సంపెంగ † ౪. జాజికాయ ౫.సు
గంధము. ౬. సాలవృక్షభేదము. ౭. జమ్మి †
౮. కదంబము † ౯. సువాసనగల ఒకదినుసు
గడ్డి. ౧౦. వకుళము †

**సురభిసాయకుఁడు.** సం. వి. మన్మథుఁడు.

తే. ఆకుమార, హంసములకేళి కానవాధ్యంతర
మున, సురభిసాయక సాయకజ్వాలితుఁ డగుచు
చంద్రాంగ. ౪-౯౪.

**సురభిక.** సం. వి. అ. స్త్రీ. ఒకదినుసు అరటి.

**సురభితము.** సం.విణ.అ. ఆ. అ. ౧. సువాసన
గలది. ౨. సుగంధిఫలము.

**సురభిత్రిఫలి.** సం.వి.ఆ. స్త్రీ. ౧. జాజికాయ
౨. లవంగము. ౩. పోకచెక్క.

**సురభిత్వక్కు.** సం. వి. చ్. స్త్రీ. పెద్దయేలకి

**సురభిదారువు.** సం.వి.ఉ. పుం. సాలవృక్షము †

**సురభిళము.** సం. విణ. అ. ఆ. అ. మంచివాసన
గలది.

సీ. నిశ్వాససురభిళానిలముల సంపద సరసవసం
తస్తుపరణిఁ జేయు. కవి. ౩ ఆ.

**సురభీకరించు.** సం. స. క్రి. పరిమళింపఁజేయు.

మ. కరిమపాకంబునఁ గెంపుతోడినలు పెక్కన్
మిక్కుటం బైనగం,ధము దిక్కుల్ సురభీక
రింప రస మంతర్గామి యయ్యెన్.
హరి. పూర్వ. ౭-౭౭.

**సురమాయి.** విణ. మిక్కిలి నల్లనిది.

సీ. పడగలం దడఁబడఁ దొడగుభోగుల గెల్చి
సురమాయిభల్లులఁ గాంచె. భాను. ౪. ఆ.
(దీనికి వ్యుత్పత్తియందు వికల్పముగా అంత్యవర్ణ
లోపము)

చ. చటులతర బాంధవంబు గెలువం జాలిన కంబర
దైన్యభేదికిన్ బటువగు చెక్కు జోడు సురమా
... ల్లుల మేటిరాకుబంట్లటె కలకంఠముల్
మదకు కావలి పచ్చని డాలు వావురాలటె వన
వాటిలోన జలజానన యేగతిదాఁగవచ్చితే.
భాను. ఆ. 3.

సురమాలి. విశే. గాలి నించినది (మా. బాలీసు.)
శ. ర.

సురర్షి. సం. వి ఇ. పుం. దేవఋషి.

సురలాసిక. సం. వి. ఆ. స్త్రీ. పిల్లనగ్రోవి.

సురలోకము. సం. వి. అ. పుం. స్వర్గము, వేల్పుఁబ్రోలు.

సురవస్త్రములు. వి. బ. వస్త్రవిశేషము.

వ. మాయ్యంచులును వెంటసాళ్ళును నిండువ
స్త్రలును సురవస్త్రలును బుప్పాడివస్త్రలును
ద్వా. 3-౨౦౭.

సురవర్త్మము. సం. వి. న్. న. ఆకాశము, వేల్పుఁదెరువు.

సురవల్లభ. సం. వి. ఆ. స్త్రీ. తెల్లగఱిక.

సురవల్లి. సం. వి. ఈ. స్త్రీ. తులసి ‡

సురస. సం. వి. ఆ. స్త్రీ. ౧. సింధువారము ‡ ౨. దుర్గాదేవి. 3. తులసి ‡ ౪. నాగమాత.

సురసము. సం. విశే. అ. ఆ. అ. ౧. స్వాదువు రసభరితము. ౨. మధురము 3. సుందరము.

సురసము. సం. వి. అ. న. ౧. తులసి ౨. గోప రసము. (ఒకదినుసుబంక) 3. పరిమళముగలగడ్డి ౪. నల్లగగ్గెర ‡

సురసుందరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. దేవతాస్త్రీ ౨. దుర్గాదేవి.

సురసుర. వి. సుర్రుమ్మటయనుశబ్ద యనుకరణము.

చ. గొజ్జెఁగతూపుచేత న, చ్చెరువుగఁ బొంది
కంటికి విసింపనివాఁ డపుడేసి యార్పెఁ బో,
సురసురసుర్రుమ్మ మెత్తనగుచోటనె సుద్దతి
వాఁడియౌఁగదా! సారం. ౨-3౯.

క. సెరవుగ నాకటిపెల్లున సురసుర[సు]క్కుదరు
పవళకువులం జాడన్ దురితము దారిద్ర్యం
బులఁ బొరయక మనుచున్న వారె పుణ్యులు
జగతిన్ (ఇచట తీవ్రముగా వని యర్థము)
కుచేల. ౧-౪౯.

౨. కాలుటయందనుకరణము.

మ. ప్రతిబాణ ప్రకరంబులన్ నిజముఖ ప్రోద్య
ద్భవద్భాస్వరా, ద్భుతకీలా పటలాహతిన్
సురసురం బోఁబెట్టుచుం జానకీ, పతి బాణం
బులు మించె నేని కలభప్రాయుండవు.
రామా. ౬-౧౭౭.

ద్వి. కుఱుచమంటల దీటుకొని యన్నకసవు, చేలు
చుఱుఁగమరంగ సురసుర పుట్టి.
హరిశ్చ. పూర్వ. ౨౨3౨.

సురస్థానము. సం. వి, అ. న. దేవాలయము.

సురాకరము. సం. వి. అ. పుం. సారాయపుబట్టీ, కొబ్బరిచెట్టు.

సురాచార్యుఁడు. సం. వి. అ. పుం. బృహస్పతి, వేల్పుటొజ్జ.

సురాజీవి(వుఁడు). సం. వి. న్. పుం. అ. పుం. సారాయము బట్టీపెట్టువాఁడు.

సురాటము. వి. మల్లబంధవిశేషము.

వ. క్రీకగొంతుమారును సమసంబును సురాటంబును
నృసింహంబును నాదియగు ముప్పదిరెండు
విన్నాణంబుల నాణెంబు పరీక్షించి.
హంస. ౧-౨౦౭.

సురాపుఁడు. సం. వి. అ. పుం. ౧. మద్యపాయి ౨. కల్లుత్రాగువాఁడు. ౨. జ్ఞాని, ఋషి.

సురాభాగము. సం. వి. అ. పుం సారాయిపొంగు

సురామండము, సం. వి. అ. పుం. సారామడ్డి.

సురామండము, సం. వి. అ. న. కల్లుతేట, కల్లుమీఁగడ.

సురార్హము, సం. వి. అ. న. ౧. బంగారము. ౨. కుంకుమపువ్వు.

సురాలయము, సం. వి. అ. పుం. ౧. మేరుపర్వతము. ౨. పానశాల, కల్లంగడి,

సురాళము. వి. ఘూతాద్యావేశ జనిత శిరోభ్రమణము. ౨. కోపావేశము.

సురాళించు. స. క్రి. చుట్టుకొను, చుట్టుముట్టు.

వ.... రాజన్యులు దురాశం బధరాధరంబని. పరాక్రాంతులైన సురాళించి జరాసంధుండు......శరాసారంబున ధరాగ్రంబు గప్పియు.... దశా. ౧౦-౮౯.

౨. దృష్టిదోషపరిహారార్థము దిగదుడుచు.

క. మునువడిన మెకము గొని చని, కనుగుద్దు వెకల్చి వెత్తి గడిగి కటారిం, గొని తోఁకఁ బొడిచి యొకఁ డొనవఁగ సురాళించె నయ్యాయాతికి కదకన్. యయా. ౨-౮

వ. అంత యశోదనందు లప్పాపాత్మురాలి యంకంబున నిశ్శంకితుఁడై యాడుచున్న యర్భకు నెత్తుకొని భూతభయనివారణంబుగా గోపుచ్ఛంబు సురాళించి గోమయంబునఁ దిలకంబు వెట్టి.... వి. పు. ౭-౧౧౩.

తే. అగుహాయంబు దిగ్గ బట్టియున్నఁ దంకవన్నె యొకటి సాహిణియవ్వల మోఁదిపట్టఁ దన యనుఁగు చెలికాఁడు పైదండ గ్రొనఁగఁ బ్రజసురాళించి మణులు వస్త్రములు పైవ. పరిభా. ౨-౩౯.

౩. అలక్ష్యము చేయు,విదిలించు. (చి. ని)

సురాష్ట్రజము, సం.వి.అ. న. ఒకదినుసువిషము.

సురాష్ట్రము, సం. వి. అ. పుం. ౧. తొగరి. ౨. తొగరిమన్ను. ౩. అడవితొగరితీఁగె.

సురాసువు, సం. వి. ఉ. పుం. ౧. తాగుబోతు. ౨. ఉన్మత్తుఁడు.

సురిగ. వి. చిన్నకొమ్మ, ఉపశాఖ.

సురిగి. వి. శిఖరిణి, ఒకజాతిమల్లెతీఁగ.

ద్వి. సురుగులతోఁ బ్రాకి చుట్టురాఁ బ్రబలి పరశైన గుజవెందపందిటి క్రింద. హరివ. పూర్వ. ౫౭౫.

౨. వృక్షవిశేషము ద్వి. హరివ.పూ.౮౭౫

సురియ. వి. (సం.ఛురికా.క.సురిగె.త. చుఱ్రై) రూ. సురె. చురకత్తి.

వ....అతిమతి విసరిన నొరవోయిన సురియుం జెరివి యవలీలం గాలు బలంబులపైఁ బడి చక్కం జేయుచు. భార. భీష్మ. ౨-౭౧.

ద్వి. శూలంబు లంకించి సురియలు దిగిచి, వాలముల్ జళిపించి వరతనుత్రాణ, సబళంబు లసురించి చక్రముల్ ద్రిప్పి. రం. రా. యు. కాం. ౨౯౯ పు. ౧౨ పం.

సీ. చిమ్మచీఁకటి పేరి చింబోతుఁ జెండి పె, చ్చెర నటువైచిన సురియ యనఁగ. పర. ౩-౨౯౦.

క అని మరుబాములఁ బదశే,నని పైదువు దున్పి డాఁటునాయితము బలెన్, బెనఁగు వలయు తియచే సురి,య నలిమిబలిమి విడిపించి యను నపురక్తిన్. సారంగ. ౨-౨౩౫.

క. కలసెదఁ బతి నతఁ డిచ్చట మేలఁగుట మా తండ్రి విన్న మేలగునే పోవులలోన సురి యఁద్రిప్పిః, కలపన బింవైనఁ జెలిమికత్తెలు నగరే. ఉ. హరి. ౫-౧౭౩.

సురియకాఁడు. వి. జెట్టి.

ఆ. మనసుదేరజూచియును జూదకున్నట్లుద్భధము గాఁగఁ జోరదృష్టి వఱఁగి, జంకి మీఁద కొదవి శార్దూలదృష్టిఁ బైఁబడిన సురియ కాండ్రు వంతమిదియు. ద్వా. ౭-౮౭.

సురియాళు(వు) వి. మాలవాఁడు.

ఆం. భా. ౨-౨౭౯ ప్రా

సీ. తే. గీ....వచ్చు సేవించు సరియాళు వైష్ణ వుఁడు.... ఆము ౬-౬.

"ఆళు" అన్నది అరవపదము అని శబ్దరత్నాకరము.

సురీపట్టము. వి. సూరతుదేశ సంబంధమైన పట్టుసేలావు.

క. అట్టియెడఁ బెండ్లిపసులన్, గిట్టలగు పురంధ్రులచట నిలిపిరి వహ్నిన్, బెట్టిరి మణిపీఠ సురీ, పట్టముపైఁ బఱచి రందుఁ బతియున్ సతియున్. మను. ౫.౮౯.

సురంగా. సం. వి. ఆ. స్త్రీ. సురంగము, రంధ్రము.

సురుఁగంబడు. అ. క్రి. అదృశ్యము (రూ. సురుఁగఁబడు)

చ. చివియవు కొండపైఁబడివఁటీవు చిటుక్కనినంగరంబులుం, బదములు దోఁకయుం దలయు బల్యగు పుక్కిటదం డొకింతయున్, గదలక నిల్చియుయ్య సురుగంబడి పోవఁగ జేర్తులాగుపై, నుదకములోని కట్టితెఱఁ గున్నదిరయే పెరసత్త్వకోటికిన్. హరి. ఉ. ౫-౨౦.

సురుఁగు. అ. క్రి. ౧. అదృశ్యమగు, కనఁబడకపోవు.

ఉ....వరాహము కదంకసదర్పకమర్త్యవర్త్యదన్

ఉ.... పంది సురింగిపోయిన నృపాలతనూజుఁడు చిన్నవోయి(సొలంగిపోయిన అని శర.పా) విక్ర ౩-౭౭.

క. వచ్చి తపోవిఘ్నమునకుఁ జొచ్చినఁగాకున్న మఱడి సురిగిన యంతన్ ' జొచ్చెగనె బ్రహ్మవాడిని, యచ్చెరుతెరువునకు వెరచి రసురులు సురలున్. శేష. ౧-౮౦.

౨. మరలు, పరాఙ్ముఖమగు.

చ. తిరుగని మందరాద్రికళదీయనిపూర్ణశశాంకు డాజులన్, సురఁగని పొద్దుఁడీకు కనుపోఁకని మన్మథుఁ డొక్కటొందుసుం బొరయని ధర్మసూతి యుడివోవని కల్పమహీరుహం బనన్ వరగుణధాముఁడైన పెదవల్లభభూవరుఁడొప్పు సొంపయున్. పంచ. నా. ౧-౩౦.

క. పెఁగిన చీఁకటి తనుఁ గని, సురిగి యరిగి వగఁజుదగరుఁ జొచ్చినదానిన్, బొరిఁగొన వెంబడిఁ దానును, బిగిన క్రియ నినుఁడు గ్రుంకె వపరాంబుధిలోన్. వైజ. ౨-౩౨.

౩. తప్పించుకొను,

వ. అశ్వాతి యఖ్లన సురిఁగి ధేనుకాశ్రిమంబున కరిగె. భార. శాం. ౫-౨౦౪.

చ. సురిఁగెడు వారి గొందులకుఁ జొచ్చుచు డాఁగెడు వారి నుద్ధతాసురమునుబోలు వారి సని దూరము లేఁగినవారిఁ గ్రంతలం, దిరిగెడు వారి మాటుకొని త్రిమ్మరువారిని బట్టి కీలుబద్ధరగతి మంటలోపలను దోసితురు విక్రమదన్నివాగులై. భా. రా. యుద్ధ. ౧౧౫౪.

చ. ఏ వెరపున నింక సూచుటము వేగమె తీర్చెదొ కాక మిన్నకే, సురిఁగెదవో వివేకగుణశూన్యతఁ బొంది యసత్యవాదివై. హరిశ్చం. ౪-౨౮.

క. తిరుగరు పలు కద్దులకును, సురుఁగరు ధనమిత్త్ర రితరసుదతీమణులన్, మరుగరు.... భాగ. ౧౦ స్కం. పూర్వ. ౧౬౦౪.

తే. ఏను యాతుధానుఁడ నైన నితరజనుఁడ, నైన పెతిఁగి నివారింతురు పురుడు నన్ను, గాలికైన రక్కసులకుఁ గానఁబడక, సురిఁగి యీ పురద్వారము సొరఁగరాదు. భా. రా. సుంద. ౬౯.

ద్వి. తిరుగునే మట్టినధీరుండు గలన, సురుగునే మట్టినసూరుఁ డెవ్వలన. పండితా. పురాతన. ౯౦.

౪. తప్పించుకొనిపోవు,

ద్వి. తన్ను మోచినచోటఁ దగపట్టి పెట్టి, మిన్నక సురిగిన మెత్తురే జనులు. హరిశ్చ. ఉత్త. ౨-౪౩౭.

తే. గీ. కపటములు పన్ని యిత్రుడు నన్నమొఱగి, సురుగఁజూచెద నేమఱజామ్మ నిన్నుఁగనికరము మానసంబునఁ గదియనీక, దానిఁగాఁ జేసి యేలుమవాని యుడిపి. హరిశ్చ. ౪-౧౫౧.

ద్వి. సురఁగల వంటయిల్ సొచ్చినళళముఁ గరు
ణసేయక కూరగా వండఁదగునె.
హరిశ్చ. పూర్వ. ౧౨౯౩.

౫. నిష్క్రమించు, తొలఁగు.

సీ. కొమ్మ యేమయ్యెనో కే డాట గలుగక
యరుగుదెంచితి నని సుఱిగ వోకతె.
యయా. ౫-౨౨.

గీ. అని గిఱుక్కునఁ దిరిగి యయ్యమరనాథ,
పుత్త్రిఁ దండతి నిండ్లకుఁ బోవఁ బనిచి,
సురగ దురదుర నాయింటి కరుగుదెంచి,
యేమిచెప్పుడుఁ బొదరింటి కేఁగుదెంచె.
కువల. ౫-౫౩.

౬. దాఁగు.

చ. తరులం గిరుల్ నరుల్ సురలు దైత్యులుం
పక్షులలోనుగాఁ జరా, చరతతి చూడఁ
జూడ నవసన్నత నెం దడగెం దమంబు
నిర్భర మయి యిమ్మెయిం బొదల భాస్కర
చంద్రవిలాస మెచ్చటన్, సుఱిఁగె మహాజలం
బఖిల శూన్యతఁ జేర్పుట యేమిచందమో!
హరి. ఉ. ౯-౯౫.

సీ. చందురు నిక్కతో సమరంబునకు నేఁగుపగిదిఁ
గుప్పించి యుప్పర మెగయును, సుఱిఁగిపో
యెద నన్నఁ జోరఁ జోటులే దింక, నీవె
దిక్కనుభంగి నెమరువచ్చు.
భార. అర. ౨-౫౩.

సీ. ఏడసవచ్చునో యిది యని పలుమాఱు,
సురుగుచుఁ గ్రిగంటఁ జూచువాని.
భాగ. ౧౦. స్కం. ౩౭౨.

చ.... అలఘోపయాత్రలోఁ గురుపతి డించి
క్రిడిక్రపకుం దగు పాత్రము నేసి యొక్క
డన్, సురిగితి చెప్పుమా నిజము నూతనమా
ర్గవ నాకు చేర్పడన్. భార. కర్ణ. ౨-౭౨.

ద్వి. తునుపతొరిక్కు నీఁబడి పడఁజాలలేక నీరి
గిరి నుండఁగ సురుగ వచ్చితివో.
బస. పురా. ౬౨ పే. ౧౭ పం.

౭. పాఱిపోవు.

చ. విఱిగి సురుఁగు వారును గ్రేఁగి లోఁగువా
రును గుంది కుందువారును వ్రాలి కూలువా
రును వెఱచి పఱచువారును నై పలుదొసం
గుల నెసంగుచుండె రభ్వదు.
అ. రా. యుద్ధ. ౩౬౪.

తే. సుఱిఁగి భయమున గొందులు సొచ్చువారు,
నొగిచి పరతేర సందుల నేఁగువారు.
భా. రా. యుద్ధ. ౧౭౪౫.

చ. అరుదుగఁ దమ్మరూవిభుని యన్నను
దాడికి వోడి శాత్రవుల్, దిరుగనిడొంకలుం
బడని తెక్కలికొంకులు పాదచారులై, యరు
గని కానలుం జొరని యూటమి కోనలు భీత
చిత్తులై, సురుగని త్రోవలు విన్నలుమఁజూడని
శైలవలు లేవు భూస్థలిన్. వి. పు. ౧-౪౪.

తే. ఓలిగట్టినయట్లకు నుతికి పెద్దబావలం దున్న
వెన్నలం బావురోనుచు, నట్టులను వ్రిచ్చి
బావల సురలఁ ద్రోచి, సురుఁగుఁ జెలిగాండ్ర
కెల్లను జాఱవిడిచి.
హరి. పూర్వ. ౫-౨౦౫.

౮. చొచ్చు. ప్రవేశించు.

క. కరవాలభైరవుని చే నరుగుదు రరు లర్కమం
డలాకారములో, సుఱిఁగి యన నఫలపద
మగు,నరయఁగ నాకారశబ్దమధికం బగుటన్
కావ్యా. ౬. ఉల్లా. ౧౦౯.

౯. మృతినొందు.

చ. గురగము చన్న మార్గమును, దూరొను వృక్షము
కొమ్మ మాలవాఁ దరనిన చేను నాని సుత
యన్నము పెట్టినతావు, దానిఁ జెచ్చెర వరి
యించి నాపురము సేసిన యిల్లును నాఱబిడ్డ
లున్, సుఱిఁగినచోటు, దాను సొదవొచ్చిన
భూమియుఁ జూచెఁ దెల్లగన్.
వాసిష్ఠ. ౨-౨౫౫.

ఆ. వె. అప్పుపుచ్చుకొన్నయతఁ డిచ్చిన నరుండు
సొమ్ము దగకమున్న సురిఁగిరేని, వడ్డి చెల్లకున్న
వర్తింతు శరీతి, వందు నిందుఁ దెలుపుమయ్య
తాత! శివ. ౩-౨౪౧.

౧౦. తగ్గు, నశించు.

సీ. కుప్తిపుటంబులకొత్త సుఱిగిపోవక మున్న, వరు
లానవమునఁ బర్వకయమున్న. కాశీ. ౩-౭౪.

౧౧. భగ్నమగు, విఱుఁగు.

వ. భుజావష్టంబంబున విజృంభించిన మరలు మా
తంగంబులును సురుఁగురథంబులును దిరుగు
పదాతులు నై తమసైన్యంబు దైన్యంబు
వహించిన. వరాహ. ౫-౨౫.

౧౨. వాడు, మ్లానమగు.

సీ. అంగజ నీ లోచనారవిందములు సుడిఁగియు
న్నవి గాని సొంపులేదు. వీర. ౨-౬౮.

క. పరభూమి ప్రజలకుఁ జేయును తిరముగ ధర
యేలు రాజు దేశంబునకున్ సురుగును రెప్పటి
ప్రజలును,నరపతి న్యాయంబు దప్పి నడచిన
యేనిన్. రుక్మాం. ౩-౨౬.

౧౩. వెనుదీయు.

ద్వి. మరగి పోఁచిననట్లు మత్తిల్లఁబోవనము సురుఁ
గక పొచ్చి కానుగ నన్నుఁ గొనక.
హరిశ్చం. పూర్వ. ౧౧౯౮.

౧౪. బాధపడు.

సురగాలితీపులు సురుఁగదే యాతన్వి యచలం
బులై చన్ను లమరకున్న. హంస ౩.

**సురుగాడ్పు.** వి. సుడిగాలి.

ఎ. గీ. దోసఁగు లెసగించే సురగాడ్పు తుటుము
దాడి, కదలి తద్దయు గడగడ వడఁకుదాని,
తెల్వారాక న్నెఁ గాంచి రా వెలఁదు లవుడు
రసి. ౪-౪౭.

**సురుగుఁడు.** వి. ఒకానొక యొజ్జిచాయ చెక్క
చెట్టు, సురుగుడు చెట్టు.

సీ. జావ్వి మామిడి టేకి సురుగుడు మొలుగు
పాపట చంది పసిరిక పాలరేల.
శం. పంచతం ౪-౪౭౧.

ద్వి. సురుగుల్పమాకేళ్ళ జాతిపోతములను, గురు
వకంబులఁ గేదగుల నశోకముల.
హరిశ్చ. పూర్వ. ౭౨౫.

**సురుఁడు.** వి.దివిటీకిమాలుగా కాల్చిపట్టుకొనెడు
వెలుతురు కట్టెలకట్ట ఆ. భా. (శ. ర)

**సురుమా.** = సుర్మా(ఉర్దూ. సుర్మా) కాటుక
చంద్ర ౨-౧౩౧

**సురుమాయి.** వి. కాటుక.

సీ. పడగల తోడిఁబడఁదొడరుభోగుల గల్చి
సురమాయిజల్లుల పొలుఁగుఁ గాంచెనుద్దండగతి
నిల్చునుత్పలంబుల గల్చి యతనుధ్వజశ్రీల
నందుకొనియె, బాణసంపదఁ బావు తూణీర
ముల గెల్చి విరుదు కాహళుల విస్ఫురణఁ
జెంద గంధోత్కటంబులై కదియ గుత్తుల
గెల్చి ఘనవాద్యకుంభలాంఛనముఁ గాంచె
తివిరి దళమెత్తు పోకబోదల హసించి, విజయ
మంగళశంఖాంక విఖ్యాతిగాంచె నఖలవేఁలి
పతిమాపు నతివజంఘ, కలికిచనుదోయి రొమల
బాగ కంధరమును. భాను. ౪-౧౫

చ. చటులతఁ బాంధులన్ గెలువఁజాలిన శంబర
దైత్యభేదికిం బటువగు నెక్కటోడు సురు
మాయిగజల్లుల మేటి రాతు బం, ట్లఁట కల
కంఠముల్ మదకుకావళి పచ్చనిడాలు పావు
రాల్, లఁట వనవాటిలోన జలజానన యేగతి
డాఁగ వచ్చితే. భాను. ౩-౧౪.

**సురుము.** వి. చూర్ణము, పొడి.

**సురూపము.** సం. విణ. అ. ఆ. అ. ౧. సుంద
రము. ౨. విజ్ఞము. తెలివిగలది.

**సురూపము.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సురూపుఁడు.** సం. వి. అ. పుం. చక్కనివాఁడు
విద్వాంసుఁడు.

**సురె.** వై. వి. (ప్రకృ. ఘురికా) రూ. సురియ.
కత్తి.

ద్వి. వెలువడిరైు సురె కేలికి ప్రాణమున కొర
గోపినట్టుల నొకదసఁ జేర్చి.
బస. పురా. ౧౩౬ పు. ౧౬ పం.

సీ. గాటంపుమాఁగారు ఘనకృపాణముఁ గాఁగ
సొగ కొంచెలిగోళ్ళు సురెలు గాఁగ.
రసిక. ౫-౧౭౬.

సీ. జాతి నీలపుఁ దాళిచాళచక్యప్రభల్ కస్తూరి
నెతివూఁతిఁ గుస్తరింపఁ, సొగను సూర్య
పటంపు సురెవాలునై తల్క హొంబట్టు
దట్టిపై నొఁగింప. సారంగ. ౧-౭౯

క. విరసమునఁ గొట్టుపడి నా, సరిగరితలలోన
బ్రతుకు సైతునె నే, సురెఁబోదు తాృటఁ
బోదున్. శం. పంచతం. ౪-౪౩౦

తే.... సాయకములు మరువ కేను గల్గి గేవఁ గి
సురె యొక్కదర్యో. అము. ౪-౧౧౪.

సీ. కరవాడి చిరురాకు సురెకత్తిచే నొత్తి మగల
మానము గొను మాసటీఁడ.
సుదక్షి. ౫.౫౦.

**సురెయాళు,** వి. రూ. సురియాళు.

**సురేకారము,** వి. ఒక దినుసు ఉప్పు.

**సురేభము,** సం. విణ. అ. ఆ. అ. మంచి కంఠ
స్వరము గలది.

**సురేభము,** సం. వి. అ. న. తగరము.

**సురేష్టము,** సం. వి. అ. పుం. సాలవృక్షము.

**సురోత్తరము,** సం. వి. అ. పుం. చందనము.

**సురోదము,** సం. వి. అ. పుం. కల్లుసముద్రము.

**సుఱసుఱ,** వి. (చుఱ్ఱు టయందగు ననుకరణము.

చ........సుఱసుఱం దుదసుఱ్ఱుగ సుర్రుక్కునో
యనన్. అము. ౫-౧౭౩.

**సుఱ్ఱు,** వి. సుఱ్ఱుటయందగు ననుకరణము.

సీ. కు శ్యెన్ని గలిగిన సుఱ్ఱున సుర్రుక్కుక యను
వయ్యెఁ బిరులకు నలవు గాక, తనలోని బిడ
బాగ్ని దః కొన మండియు వడగాలి మీలనై
సుడియనీక. ద్వా. ౨-౧౭౦.

చ. వెలుఁగుల కేని కేవెలుఁగు కేడిమి సుఱ్ఱున
సుర్రుక్కు నాపగా, కలకసమస నీమృదుల
కాయములన్. చదా౦గ. ౨-౨౨.

**సులక్షణము,** సం. విణ. అ. ఆ. అ. ౧. శుభ
లక్షణములు గలది ౨. అదృష్టము గలది.

**సులక్షణము,** సం. వి. అ. న. ౧. పరిశీలనము,
పరీక్ష, నిర్ణయము. ౨. మంచిలక్షణము లేక
చిహ్నము.

**సులతాను,** హిం. వి. తురుష్కప్రభువు.

చ. జవచిత్రమైన తేయములు సాహిణము లువ్వెల
తాను చూడ్కికిన్, దవిలిచె వత్తరిన్ మదము
ధారకలేచిత వల్గితప్లుత, ప్లవనపులాయితాది
గతులన్. రంగా. ౩-౧౩.

**సులభకోపము,** సం. విణ. అ. ఆ. అ. శీఘ్రము
గాఁ గోపించునది, చిరాకు గలది.

**సులభము,** సం. విణ. అ. ఆ. అ. ౧. సుఖముగా
లభించునది, ౨. తేలికగాఁ జేయఁదగినది. ౩. రూ
గ్యమైనది, సిద్ధమైనది. ౪. సహజము. స్వాభా
వికము.

**సులభము,** సం. వి. అ. పుం. సులువు, అల్పయత్నము.

క. సులభమునఁ దీర్పపనికై బహువగుయత్నంబు
సేయఁ బతిమాలిన యే, మొలుమంటఁ దివియు
కడిదము, జలిపించినయట్టి వేల చందము
వచ్చున్. కవి. ౨-౪౬.

**సులువు,** వి.

గీ. అన్నియును జూచుచుండెడ నంతో యింతో
యంతవనుమానమునకు రా నింతె కాని, సేమ
బట్టెద నన్న చో నాకె ధనము, దులిచినప్పుడు
తెలియు నా సులువు లెల్ల.

వి. ణ. సులకనైనది.

**సులోచన,** సం. వి. అ. స్త్రీ. ౧. అందమైన
కన్నులుగల స్త్రీ. ౨. ఇంద్రజిత్తుభార్య పేరు.

**సులోచనము,** సం. విణ. అ. ఆ. అ. అందమైన
కన్నులు గలది.

**సులోచనము,** సం. వి. అ. పుం. లేడి.

**సులోహకము,** సం. వి. అ. న. ఇత్తడి.

**సులోహిత,** సం. వి. అ. స్త్రీ. అగ్నిదేవుని సప్త
జిహ్వలలో నొకటి.

**సులోహితము,** సం. విణ. అ. ఆ. అ. మిక్కిలి
ఎఱ్ఱనైనది.

**సుల్తాను.** వి. ఒకానొక తురక పేరు.

క. సిరిగుబ్బచన్నుగొండల, దరులం గతిసొంపుల
పగిదిఁ దవిలి తిరుగు న్నమ్మరుతంద్రి మహాపృ
వసముల, సెలయేనమిాన్ఖానపింగిణీసుల్తానా
యయా. ౩-౧.

**సువక్త్రము.** సం.వి. అ. న. ౧. మంచిముఖము లేక నోరు. ౨. సుష్ఠూచ్చారణము.

**సువక్త్రుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సువచనము.** సం.వి.అ.న.మంచిమాట. ౨. వాగ్ధాటి.

**సువచస్సు.** సం. వి. స్. న. చూ. సువచనము.

**సువదన.** సం. వి. ఆ. స్త్రీ. అందమైన ముఖము గల స్త్రీ.

**సువర్చకము.** సం. వి. అ. పుం. క్షారము, లవణము.

**సువర్చల.** సం. వి. ఆ. స్త్రీ. నిఁగిమిరి i

**సువర్చలము.** సం. వి. అ. న. అవిసె i

**సువర్చసుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సువర్చి.** సం. వి. ఇ. పుం. సువర్చకము.

**సువర్చిక (ము)** సం. వి. అ. పుం. ఆ. స్త్రీ. సువర్చకము.

**సువర్ణ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అగ్నియొక్క సప్తజిహ్వలలో నొకటి. ౨. నల్లకలబంద i ౩. పసుపు. ౪. ఏటిపుచ్చ, వెఱ్ఱిపుచ్చ i

**సువర్ణకము.** సం. వి. అ. న. ౧. ఇత్తడి,కంచు. ౨. సీసము. ౩. బంగారము.

**సువర్ణకారుఁడు.** సం. వి. అ. పుం. కంసాలి.

**సువర్ణపుష్పము.** సం. వి. అ. న. చెంగల్వ

**సువర్ణపుష్పితము.** సం. విశే. అ. ఆ. అ. బంగారము సమృద్ధిగాఁగలది.

**సువర్ణపృష్ఠము.** సం.విశే. అ.ఆ.అ. బంగారు పూతగలది బంగారు నీరూరినది.

**వర్ణబిందువు.** సం. వి. ఉ. పుం. ౧. విష్ణువు. ౨. శివుని మూర్తివిశేషము.

**సువర్ణము.** సం. విశే. అ. ఆ. అ. ౧. మంచి రంగుగల ౨.మంచికులమునకుఁ జెందిన. ౩. మంచి కీర్తిగల.

**సువర్ణము.** సం. వి. అ. పుం. ౧. మంచిరంగు ౨. మంచికులము. ౩. ఒకయాగము. ౪. ఉమ్మెత్తకాయ.

**సువర్ణము.** సం. వి. అ. న. ౧. బంగారము. ౨. బంగారు నాణెము. ౩. పదునారు మాసము లరయెత్తు బంగారము. ౪. ధనము. ౫. మంచిగంధపు చెక్క (?) ౬. సిందూరము (Red chalk) ౭. నాగకేసరము i ౮. మంచివర్ణముగలది ౯. మాడ. ౧౦. ఒకపువ్వు. ౧౧. నల్లఅగలు.

**సువర్ణయూథి.** సం. వి. ఈ. స్త్రీ. పచ్చమల్లె.

**సువర్ణరేతుఁడు.** సం. వి. స్. పుం. శివుఁడు.

**సువర్ణవత్.** సం.విశే. త్. ఈ. త్. ౧. బంగారముతోఁ జేయఁబడినది. ౨. బంగారురంగుగలది. ౩. అందమైనది.

**సువర్ణవర్ణ.** సం. వి. ఆ. స్త్రీ. పసుపు.

**సువర్ణవర్ణుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**సువర్ణాక్షుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సువతేఁడు.** వి. శివుఁడు (?)

సీ. తులకించు తనకీర్తి తోవతేని సువతేని శివ
తేని చకచకచ్ఛవి హసింప.

రఘువం. ౧-౫౨.

**సువసంతకము.** సం. వి. అ. పుం. ౧. మంచి వసంతర్తువు. ౨. చైత్రపూర్ణిమ. ౩. వసంతోత్సవము, కామోత్సవము.

**సువహ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వీణ (Leute) ౨. అంజుడు ¦ ౩. గోరంటి ¦ ౪. చెవుపిట్ట ¦ ౫. నల్లవావిలి ¦ ౬. పర్నాక్షి ¦

**సువహము.** సం. విణ. అ. ఆ. అ. ౧. చక్కగా మోయఁదగినది. ౨. సహనముగలది, ఓర్పుగలది. ౩. తేలికగా మోయఁదగినది.

**సువారము.** వి. వంట.

ఉ. అక్కన్నియ యిల్లునిల్చి తెలికన్నులు బ్రొక్కులుగన్నఫాలము లొప్పన్నులు చిందనం దఱును జేరి సువారపుటింటి ముంగిటన్.
బహు. ౯-౪

క. వంటయొనరించుక చేయుం, దంటన్ విజ్ఞానరో లేదో యచటినువారం, బింటి కలకంతు లొక గడె, యంటఁ జెకావించి రీశ్వరాయుతమున కున్.
పాంచాలీ. ౪-౩౫.

చ. పాడిమిరియంబుగా వెదలి పోయెడు కొండల నగ్గుచేసి యొక్కడు జలజంతులం బోలను కూరలువండి వెదందచిత్రలం దుడుకఁగఁ బెట్టి మత్తియపు టోగిరముల్ కడుగ్రమ్మరించె న, య్యుదరఘువీరసాయకము లెక్కడ నేర్పు సువారపుంబనుల్.
రామా. ౭-౧౦.౭

**సువాల.** వి. ఆడువారు పెండ్లిండ్లయందు సువ్వి యను పదముతో నాలాపముచేసి పాడెడుపాట.

శా. నీకేవచ్చు సువాలయున్ ధవళమింతీ యల్లో నేరేల్లగా. రీకళ్యాణములంచు నింటికడ నే రీతిన్ విజృంభింతువే, వాకిలిచ్చట వంచునిద్దఱు సఖుల్ వాక్యోక్తవాక్యంబులన్, గాత్రమం దల పట్లకుం దొడఁగిరా కళ్యాణవేదిస్థలిన్.
పాంచాలీ. ౪-౨౪.

**సువాళించు.** స. క్రి. త్రిప్పు.

తే. వింత గాఁగ నొకావొక విలసనంబుఁ జూచ నయ్యింతిఁగదుఁ దామ జూపవెలది, కదమ పాదంద రెల్లనొక్కటఁగఁబట్టి, బాలకపుడు సువాళించి పాలపైచె. (దృష్టి (దోషము) తీయునపుడు శిరస్సునకుఁ జుట్టుత్రిప్పుటయని తోఁచెడిని)
కళా. ౭-౬౯.

**సువాసము.** సం. వి. అ. పుం. ౧. మంచినివాసము ౨. మంచివాసన.

**సువాసిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. భర్త బ్రతికి యున్న స్త్రీ, సుమంగళి. ౨. కన్య.

**సువాసుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**సువిత్తు.** సం. వి. ద్. పుం. ౧. పండితుఁడు. ౨. తెలివిగలవాఁడు. ౩. దేవుఁడు.

**సువిదల్ల.** సం. వి. ఆ. స్త్రీ. వివాహిత, పెండ్లి అయిన స్త్రీ.

**సువిదల్లము.** సం. వి. అ. న. అంతఃపురము.

**సువిదల్లుఁడు.** సం. వి. అ. పుం. (రూ. సౌవిదల్లుఁడు) అంతఃపురము కావలివాఁడు.

**సువిదితము.** సం. విణ. అ. ఆ. అ. చక్కగా తెలియఁగఁబడినది, స్పష్టముగాఁ దెలిసినది.

**సువిదత్రము.** సం. వి. అ. న. ౧. కుటుంబము, సంసారము. ౨. సంపద. ధనము.

**సువిదుఁడు.** సం. వి. అ. పుం. ౧. అంతఃపుర పరిచారకుఁడు. ౨. రాజు.

**సువిధానుఁడు.** సం. వి. అ. పుం. ప్రధానుఁడు.

ద్వి. ద్వారపాలుర సువిధానుల విండ్ల వారిఁ దలారులఁ బారికరులు.
బస. పురా. ౩-౫౧౨ పం.

**సువిహితము.** సం. విణ. అ. ఆ. అ. ౧. చక్కఁగా నుంచఁబడినది. ౨. చక్కగా నలంకరింపఁబడినది. ౩. చక్కగా ననుష్ఠింపఁబడినది.

**సువీ (బీ) జము.** సం. విణ. అ. ఆ. అ. మంచి గింజలు గలది.

సువీ (బీ) జము. సం. వి. అ. పుం. గసగసాల కాయ.

సువీ (బీ) జము. సం. వి. అ. న. మంచిగింజ.

సువీ (బీ) జుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సువీగ్య. సం. వి. ఆ. స్త్రీ. అడవిపత్తి İ

సువీర్యము. సం. వి. అ. న. ౧. గొప్పపరాక్రమము, శౌర్యము. ౨. వీరులసమూహము (సమృద్ధి) ౩. రేగుపండు.

సువృత్తము. సం. విశే. అ. ఆ. అ. ౧. మంచి ప్రవర్తన గలది. ౨. మిగుల గుండ్రనైనది.

సువృత్తము. సం. వి. అ. న. ౧. మంచినడవడి ౨. మంచిపద్యము.

సువృత్తి. సం. వి. ఇ. స్త్రీ. సుగమన.

సువేలము. సం. విశే. అ. ఆ. అ. ౧. నిశ్చలము, ప్రశాంతము. ౨. వినీతము, అనుద్ధతము.

సువేలము. సం. వి. అ. పుం. త్రికూటపర్వతము.

సువ్వాలు. వి. బ. వ. పాటలలో విశేషము.

క. ఆ లలనామణి కాఁగ, య్యాళి యొకానొక్క వేళ నక్కతిలోను, వ్వాలు నోక్యధనములు ధవళాలున్ మొదలైన పాటలందగు కేర్పున్ కుక. ౧-౪౩౪.

సువ్రత. సం. వి. ఆ. స్త్రీ. ౧. పతివ్రత, మంచి యిల్లాలు. ౨. సాధువైన ఆవు.

సువ్రతుఁడు. సం. వి. అ. పుం. నియమవంతుఁడైన విద్యార్థి (A Religious student)

సువ్వలాల. వి. చూ. సువ్వాల.

సువ్వాల. వి. ఆడవారు. పెండ్లిండ్లలో సువ్వియను పదముతో ఆలాపముచేసి పాడెడు పాట.

కం. ఆ లలనామణి కాఁగ, య్యాళి యొకానొక్క వేళ నక్కతితో సు, వ్వాలలు సోబానలు ధవ, ళాలున్ మొదలైనపాట లాడట చేర్పున్ కుక. ౧ ఆ. (క. ౭)

సువ్వి. వి. దంచుటయందగు ధ్వన్యనుకరణము.

సుశకము. సం. విశే. అ. ఆ. అ. సులభముగాఁ జేయ వీలయినది, సుకరము.

సుశర్మృఁడు. సం. వి. ఒకని పేరు. రూ. సుశర్మ.

క. ఇలఁబడిన సహచరులఁగని, యలిగి సుశర్ముండు దాకె నర్జునున్. భార. భీష్మ. ౩-౫౨.

సుశల్యము. సం. వి. అ. పుం. ఖదిరవృక్షము İ

సుశవి. సం. వి. ఈ. స్త్రీ. చూ. సుషవి.

సుశాకము. సం. వి. అ. న. అల్లము.

సుశారదుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సుశిక్షితుఁడు. సం. విశే. అ. ఆ. అ. ౧. చక్కగా నేర్పఁబడినది. ౨. వినీతమైనది.

సుశిఖ. సం. వి. ఆ. స్త్రీ. ౧. నెమలి నెత్తిమీది కుచ్చు. ౨. కోడిపుంజు నెత్తిమీదికొండె.

సుశిఖము. సం. వి. అ. పుం. అగ్ని.

సుశీతము. సం. వి. అ. న. పచ్చనిచందనము (శ్రీచందనము)

సుశీమము. సం. విశే. అ. ఆ. అ. మిక్కిలి చల్లనైనది.

సుశీమము. సం. వి. అ. పుం. చల్లఁదనము.

సుశీల. సం. వి. ఆ. స్త్రీ. ౧. మంచిశీలముగల స్త్రీ. ౨. యమునిభార్య. ౩. కృష్ణుని అష్టమహిషులలో నొకతె.

సుశీలము. సం. విశే. అ. ఆ. అ. మంచిగుణము గలది, మంచినడవడిక గలది.

సుశ్రుతము. సం. విణ. అ. ఆ. అ. ౧. చక్కఁగా వినఁబడినది. ౨. వేదవిజ్ఞానముగలది.

సుశ్రుతము. సం. వి. అ. న. సుశ్రుతాచార్యునిచే రచింపఁబడిన ఆయుర్వేదశాస్త్రగ్రంథము.

సుశ్లిష్టము. సం. విణ. అ. ఆ. అ. ౧. చక్కఁగాఁ గూర్పఁబడినది. ౨. గుప్తముగా ధరింపఁబడినది.

సుషమ. సం. వి. ఆ. స్త్రీ. మిక్కిలిశోభ.

సుషవి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఒకదినుసుగుమ్మడి ౨. నల్లజీలకఱ్ఱ ౩. కాకర i ౪. జీలకఱ్ఱ.

సుషాఢుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సుషి. సం. వి. ఇ. స్త్రీ. ౧. రంధ్రము, బెజ్జము, ౨. గొట్టము.

సుషి షీ)మము. సం. విణ. అ. ఆ. అ. ౧. చల్లని. ౨. ఆహ్లాదకరమైన.

సుషి (షీ) మము. సం. వి. అ. పుం. ౧. చలి. ౨. ఒకదినుసుపాము. ౩. చంద్రకాంత శిల.

సుషిమము. సం. వి. అ. న. చల్లదనము.

సుషిర. సం. విణ. బెజ్జముగలది.

సుషిర. సం. వి. అ. న. ౧. బెజ్జము. ౨. పిల్లనగ్రోవి లోనగువాద్యము.

సుషీర. సం. వి. ఆ. స్త్రీ. గువ్వగుత్తిక i

సుషిర. సం. వి. అ. పుం. కిక్కస i (శ. ర.)

సుషుప్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ఒళ్ళెఱుఁగనినిద్ర. ౨. గాఢనిద్ర.

సుషుమ్ణము. సం. వి. అ. పుం. సూర్యకిరణములలో నొకటి.

సుషుమ్న. సం. వి. ఆ. స్త్రీ. ఒకనాడి.

సుషేణము. సం. వి. అ. పుం. ౧. ఒకచెట్టు, కరమర్దము. ౨. పేము, వేత్రము.

సుషేణము. సం. వి. అ. పుం. కలివి. i

సుషేణిక. సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడ i

సుషేణుఁడు. సం. వి. అ. పుం. ౧. విష్ణువు. ౨. ఒక వానరనాయకుఁడు?

సుష్ఠు. అవ్య. ౧. బాగుగా, చక్కఁగా ౨. ఎక్కువగా. ౩. నిజముగా, యుక్తముగా.

సుష్మము. సం. వి. అ. న. త్రాడు, దారము.

సుసత్య. సం. వి. ఆ. స్త్రీ. జనకునిభార్య.

సుసరభేత్తు. సులువుగా రోగములఁ దొలఁగఁ జేయుమందు.

సుసరము. విణ. సూక్ష్మము, సన్నము.

> మ. వసుధానాయక వేటకుం గదలుసత్త్వం బెక్కుమేనింతకున్, సుసరంబై లఘువౌ మృగంబుల భయక్రోధంబులన్ దప్పుణ, ప్రసరంబేర్పడఁ జేతి నాటిమెఱయింపన్ జోటగున్ వేట దుర్వ్యసనంబంచుర్ధరిత్రి నిట్టిగతి సౌఖ్యం బొందుచోఁ గల్గునే? ద్వా. ౮-౬౦.

సుసికత. సం. వి. ఆ. స్త్రీ ౧ మంచియిసుక ౨. పంచదార

సుస్తి. హిం. వి. సోమరితనము.

సుస్థత. సం. వి. ఆ. స్త్రీ. ౧. క్షేమము, ఆరోగ్యము ౩. భద్రత.

సుస్థము. సం. విణ. అ. ఆ. అ. ౧. యుక్తమైనది సరియైనది. ౨. ఆరోగ్యవంతము, భద్రము. ౩. ధనవంతము. ౪. సుఖవంతము, అదృష్టవంతము

సుస్థితి. సం. వి. ఇ. స్త్రీ. సుస్థత.

సుస్థిరము. సం. వి. అ. న. సుస్థిరత్వమని భావప్రధాననిర్దేశము, నిలుకడ.

> క. రాజునకు విజయమూలము, రాజితమంత్రంబు సుస్థిరంబునదానిన్, రాజాన్వయ రక్షించితె. భార. సభా ౧-౨౭.

సుస్మిత. సం.వి.అ.స్త్రీ. మంచిచిఱునవ్వుగల స్త్రీ.

సుస్వపనుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

సుస్వరము. సం. విశే. అ. ఆ. అ. ౧. చెవికింపైనది. ౨. ఉచ్చధ్వనిగలది.

సుహిత. సం. వి. అ స్త్రీ. అగ్నిదేవుని సప్తజిహ్వలలోనొకటి.

సుహితము. సం.విశే.అ. ఆ. అ. ౧. యోగ్యము, ఉచితము. ౨. ఉదారము, ఉపకారము. 3. అనుకూలము, అనురక్తము. ౪. తృప్తము, ప్రీతము.

సుహృత్తు. సం. విశే. ద్. మంచిహృదయముగలది, దయగలది. ప్రేమగలది.

సుహృత్తు. సం. వి. ద్. పుం. ౧. మిత్రుఁడు, సఖుఁడు. ౨. సహాయుఁడు.

సుహృదయము. సం.విశే.అ. ఆ. అ. ౧. మంచిహృదయముగలది. ౨. ప్రేమగలది. 3. దయగలది

సుహృదయుఁడు. సం. వి. అ. పుం. మిత్రుఁడు, సఖుఁడు.

సుహృద్దుఁడు. సం.వి.అ.పుం.మిత్రుఁడు, సఖుఁడు

సుళి. వి. ఝుంకారము.

సుళిగవ=ఝుంకారము, ఝూంకారమును.

క. చెలులు తలకట్టు లాదా,పులు నైత్వోత్వములు మిత్రములు గుడిగవయున్, సుళిగవయు నేత్వయుగమును, జెలువగు చుట్టములు ద్వివిధశృంగాత్వమ్ముల్. అప్పక. 3-౪౫.

సుళువు. విశే. తేలికయైనది.

సీ. వలెవాటు వైచిన సుళువు చెందిరకావి వలిపముల్ పదపల్లవముల శిర. చంద్రికా. ౧-౧౦౭.

సీ. సుళువుచాయల పేర తెలిసిరు బుగ్గలయొద్ద పట్టైపుఁ గత్తిగొనరఁ బట్టి, పచ్చతాపితదట్టి పసమించు పచ్చరాచిలుక క్రొంబిడివంకి వలవరంచి. చంద్రాంగ. ౨-౬౮.

సుళ్ళఁబెట్టు. స.క్రి. (సుళ్ళన్+పెట్టు) ౧. సుడిగుండముచేయు ౨. చిక్కులు పెట్టు.

సీ. వక్రగతులుమూలవర్తించుచందంబు బెట్టుగా వడిసుళ్ళఁబెట్టురట్టు .... గీ. మదిదలంచిరా యెందును గాదవలెక, సకలసౌభాగ్యము గ్రొంచు జహ్నుకన్య, యుఁచినప్పాపాల భార్యావతంసమైన గంగాఁబరియె కీర్తనలర జగతి (రెండర్థములకిదే) ఇందు ౧-౩౩.

సుళ్ళసూరి. విశే. ౧. సుడులుగలవాఁడు ౨. చుట్లఁబెట్టువాఁడు.

కం. అనిలుడు సుళ్ళసూరి కమలారి నిశాచరుఁడ. శృం. ౧౭.

సుళ్ళెములు.

సీ. చతురతై కొప్పులజడసుళ్లెములు పెట్టి లీలమై పువ్వుమాలికలుతేర్చి. వీర. 3-౧౮౯.

సుళ్వు. వి.వీలు, అవకాశము(రూ.సుళువు.సులువు)

సీ. ఇతఁడు గన్పడని సుళ్వెఱిఁగి మందేహులు క్రొంచకయిల వట్టుకొనిరనంగ. ప్రబం. ౧-౬౪.

# సూ

సూ=చూ. అవ్య. 'చూ' అను అవ్యయమే శకలమీఁద గసడదవాదేశముచే "సూ"గా మారును. (చూడు. చూ. అవ్య).

1. నిశ్చయార్థకము.

క. శ్రీమంతుఁడె కులవంతుఁడు, శ్రీమంతుఁడె సుభగరూపశీలవంతుఁడు సూ, శ్రీమంతుఁడె గుణవంతుఁడు, శ్రీమంతుఁడె సిద్ధశేముషీమంతుండున్. విశ్రి. ౨-౧౩౫.

సోమపతి. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు.

సోమపానము. సం. వి. అ. న. యజ్ఞమందు సోమలతనుండి పిండి రసమును ద్రాగుట.

సోమపీతి. సం వి. న్. పుం. యజ్ఞముచేసి సోమపానముచేసినవాఁడు, సోమయాజి, ఇ. స్త్రీ. ౧. సోమపానము. ౨. సోమయాగము.

సోమపీథి=సోమయాజి.

సోమపుఁడు. సం. వి. అ. పుం. ౧ సోమయాజి. (బహువచనాంతమైనపుడు పితృదేవతలు).

సోమప్రవాకుఁడు. సం. వి. అ. పుం. సోమయాగమునకై శ్రోత్రియులను నియమించువాఁడు.

సోమబంధువు. సం.వి.ఉ. పుం. ౧. సూర్యుఁడు ౨. తెల్లకలువ.

సోమము. సం. వి. అ. పుం. ౧. సోమవల్లి, తీఁగ. ౨. సోమరసము. 3. జలము. ౪. కర్పూరము. ౫. దినమునందుఁ బదునొకండవభాగము ౬. కాంతికిరణము. ౭. వాయువు. ౮. వానరము. ౯. సోమవారము. ౧౦. ఉత్తరపదమైనపుడు శ్రేష్ఠవాచకము.

సోమము. వి. పరాక్రమము.

క. అమిషమని దానింగొనఁ, గాముది సమకట్టి యొక్క ఖగమాఖగమున్, సోమమునఁ దాఁక దివి సంగ్రామంబా రెంటికయ్యె కడు రథసమునన్. భార. ఆది. 3 అ. (క.ర.)

సోమయజ్ఞములు. సం.వి.అ.పుం.బ. అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, అతిరాత్రము, అప్తోర్యామము, వాజపేయము అనునవి.

సోమయాజి. సం. వి. న్. పుం. యజ్ఞము చేసినవాఁడు.

సోమయోని. సం. వి. ఇ. పుం. సుబాసనలతోఁ గూడిన పసుపు పచ్చని చందనము.

సోమరాజక. సం.వి.అ.స్త్రీ. సోమరాజి.

సోమరాజము. సం.వి.అ.పుం. కారుగచ్చకాయ

సోమరాజి. సం.వి.ఈ.స్త్రీ. ౧. కారుగచ్చకాయ. ౨. చంద్రవంక.

సోమరి. వి. (√సోము) ౧. పనిచేయక కాలము గడపువాఁడు.

క. అమానవపతి చిత్తారామములో నుండమఱఁగి రాజతభూభృత్సేమకయిపోఁ దలంపక, సోమకళాధరుఁడు మిగుల సోమరియయ్యెన్. రాజ.వి. ౧-౭౩.

౨. అలసుఁడు, చుఱుకు లేనివాఁడు.

వ.....గుండియలవిసి యవనిపై వ్రాలి శవనిచయంబుల కరణి నిశ్చేష్టితులై వడియేమఱించి చను సోమరి దొరపోతులను....

రా.వి. ౫-3౨.

విశే. ౧. మందము, అలసము.

ద్వి. వీచె సోమరిగాలి విరహులు చెదర.

ద్వి.మారిచ.పూ. ౪3౪.

సీ. పలుమాఱు సోమరిచలిగాలి సోఁకునఁ గద లెడునీలాలకములుచూచి. వరాహ. ౬-౫౨.

సోమరితనము. వి. అలసత్వము.

గీ. ....సోమరితనానఁ బవళించెఁ జూడరమ్మ, రంగఁడని గొల్తు రాదిత్యరాజముఖులు.

శ్రీరం. మా. ౨-౪3.

సోమరిపోతు. వి. (√. సోమరి.) అలసుఁడు, సోమరి.

చ. పనిపడి నారికేళఫలపాకమునంబవిరైన భట్టహర్షుని కవితానుగుంఫములు సోమరిపోతులు. గొండఱయ్యలో, వనిగొనియాడ నేరరు....

నైష. ౧-౧౭.

సోమరోగము. సం. వి. అ. స్త్రీలకుఁ గలుగు రోగవ్యాధి.

**సోమలత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. తిప్పతీఁగ ౨. పుల్లతీఁగ ౩. సోమవల్లరి. ౪. గోదావరీనది.

**సోమలము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కోమలమైనది. ౨. మెత్తనిది.

**సోమవల్క-(ల)ము.** సం. వి. అ. పుం. ౧. తెలిచండ్ర, ౨. పేకచెట్టు.

**సోమవల్లరి.** సం. వి. ఈ. స్త్రీ. పొన్నగంటికూర.

**సోమవల్లి(క)** సం. వి. ఈ. స్త్రీ. తిప్పతీఁగ.

**సోమవారము.** సం. వి. అ. పుం. వారములలో నొకటి, ఇందువారము.

**సోమవీథి.** సం. వి. ఈ. స్త్రీ. చంద్రమండలము.

**సోమవృక్షము.** సం. వి. అ. పుం. తెలిచండ్ర.

**సోమశకల.** సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన దోస.

**సోమసంజ్ఞము.** సం. వి. అ. న. కర్పూరము.

**సోమసంస్థ.** సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన సోమయజ్ఞము.

**సోమసదులు.** సం. వి. అ. పుం. ఒకజాతి పితృదేవతలు.

**సోమసిద్ధాంతము.** సం. వి. అ. పుం. కాపాలిక సిద్ధాంతము.

**సోమసింధువు.** సం. వి. ఉ. పుం. విష్ణువు.

**సోమసుత.** సం. వి. ఆ. స్త్రీ. నర్మదానది.

**సోమసుత్తు.** సం. వి. త్. పుం. సోమసుతుఁడు, సోమరసమును పిడియుఁగట్టువాఁడు.

**సోమసూత్రము.** సం. వి. అ. న. ౧. పానవట్టము నుండి నీళ్లుపోవుట కేర్పఱుపఁబడిన సన్నని దారి. ౨. సోమసూత్రమువంటి ముఖభాగము కలిగిన లోహపాత్రము.

**సోమసూర్యవీథులు.** సం. వి. ఈ. స్త్రీ. బ. కేలుపడి విడివడిన వీథులు.

క. విడువక పట్టిన మనుమున్, గదతేతెంచి బలము రెండుగా నొనరించెన్, వడివారెంటికి నడుమన, వెదలెన్ మఱి సోమసూర్య వీథులుగాఁగన్. కాళ. ౨. ౪౨.

(ఇది తెలుఁగునచే జాతీయముగా వాడఁబడెను)

**సోమాఖ్యము.** సం. వి. అ. న. ఎఱ్ఱతామర.

**సోమాభిషవము.** సం. వి. అ. పుం. సోమరసమును పిండుట.

**సోమాయనము.** సం. వి. అ. న. ఒకవిధమైన తపస్సు, చాంద్రాయణము.

**సోమాలకము.** సం. వి. అ. పుం. గోమేధికము.

**సోమాలము.** సం. విణ. (అ. ఆ. అ.) సుకుమారము.

**సోమాసి.** వి. (సం. సోమయాజీ) సోమయాగము చేసినవాఁడు.

**సోమాస్త్రము.** సం. వి. అ. న. ఒకానొక యస్త్రము.

**సోమి.** సం. విణ. (న్. నీ. న్.) సోమయాగము చేయువాఁడు.

**సోమించు.** అ. క్రి. ౧. పరాక్రమించు, విజృంభించు.

శా. కుంభద్వ్యక్రమకేళిలీలలెసఁగన్ సోమించి యేకాబ్దము,ల్జృంభోత్సాహము లుల్లసిల్లఁగ జయశ్రీలోలతంబోర....మార్క. ౨-౨౨౦.

క. తామసుఁడితండువిష్ణువు,సోమహిమలకోలఁది యొలుఁగఁడద్దేవు దనన్, కేమాఱు నలుగనంతయు, సోమించినసుడిని బ్రమకు సులభం బగునే. నృసిం. ౫-౧౯.

ద్వి. ....అర్ధకాననుఁడు, సోమించి నిజమంత్రి సుతుఁడైన రక్త, లోమని శతజిహ్వ రుధిర లోచనుని....బిలిచి.

రం. రా. సుం. కాం. ౨౩౨ పు, ౨౦ పం.

౨. తృప్తికొందు.

గీ. అట్లు బంధించి కారాగృహంబునందుఁ, గూఁతుతోఁగూడ యాదవకులజు నునిచి, రాక్షసులను లెక్కం(డ్రను రాకుమారు, మీదఁగావలియుంచి సోమించియుండె. వి. పు. ౮-౧౬౮.

౩. వ్యాపించు.

క. సేమమున నఖిలచిదచిత్, స్తోమంబున స్వాత్మ వగుచు సోమించుటచే, సేమయి పరులయి పర్వము,నై మెరసెద వీవొకండ వంబుజ నాభా. కవిక. ౬.

౪. (సం. సమమ్) సరిపోలు.

క. తామరరేకులుఁ గన్నులు, సామజహస్తములుఁ దొడలు శశిమండలమున్, మోమును మెఱుపును నొడలును,సోమింపఁగ దివ్యరూప సుందరుఁడయ్యెన్. ఉ. హరి. ౨-౧౫౨.

స. క్రి. సగముగాఁ బంచుకొను.

క. విను నీవదితినుతుండవు, వినతకొడుక సేను విజ్జుఁడగాడు మనకున్, జనకుఁడు కశ్యపుఁ డొక్కఁడ, దనుజులసోమించి చంపుదమ యిరువురమున్. భార. ఉద్యో. ౩-౨౯౫.

**సోమింత.** వి. వృక్షవిశేషము[j]. (సోమిదము అని. శ. ర.)

('సోమికట్టి' అని విజయనగరము, ఏలూరు, నెల్లూరు ప్రాంతముల వాడుక. వద్రంగికుపయోగించు చెట్టు.)

**సోమింద.** వి. సోమవల్లరి, సోమెద.

గీ. ....కాష్ఠపన్న, విరిగి సోమిందగున్నంగి దిరిసెనంబు, మొదలుగాఁగల్గు బహువిధభూరుహములు, నిండియుండెడు కానలపెండులరసి. హంస. ౪-౧౧.

**సోమిద.** వి. తిప్పతీఁగ [j].

**సోమిదము.** వి. శణపుష్పి [j] (శ.ర.)

**సోమిదమ్మ.** వి. సోమయాజిభార్య.

క. పూచినతంగేడుగతి వి(ద్యాచతురుండతని సోమిదమ్మపొరుపువసన్, వాచాలరత్నకటకం, సూచితవిభవమున మెఱయఁజూడంగలరే. రాజ. వి. ౩-౨౨.

సీ. తానిచ్చె సెద్దానిధర్మగేహినినైన సోమిదమ్మకు మనః(పేమకులర. కాశి. ౪-౯౯.

ఉ. యౌవనమందు యజ్వయు ధనాఢ్యుఁడునై కమనీయకాముక, శ్రీవిధిఁ గూకటుల్ గొరిచి చేసినకూరిమిసోమిదమ్మ .... మనుచ. ౧-౫౩.

**సోమిసాని.** వి. (సోమిద + సాని) సోమయాజి భార్య (శ.ర.)

**సోము.** వి.(సం.సుఖమ్.) సుఖము.విణ.ఆసక్తము.

ఉ. చూపులు విష్ణుమూర్తులకు సోముగజిహ్వలు విష్ణుమూర్తినా,లాపసుఖంబుఁ జెందఁగఁదలంపులు విష్ణుమహత్త్వచింతకుం, బై పడుచుండ నిట్టులగు భాగవతోత్తమకోటిచే జగ, ద్దీపితమైన యవ్విమలతీర్థమునందతఁ డుండె వేడుకన్. (శ.ర.పా. సొమ్ముగ.కం.వీ.పా.) భోజరా. ౨-౨౬.

అ. క్రి. ౧. సుఖపడు. ౨. ఆసక్తమగు.

చ. పటికపుటోల మువ్వెదురుఁబ్రా లాగిఁ బోయుచు గారుకొమ్మగోఁ, కటఁగొని దంచుచున్ శబరకామిని రెక్కలు రాగముల్ మదో,త్కటముగఁ బాడెఁ జుట్టిన మృగంబులు సోమ.... ను.సం. ౬-౭౦౪.

**సోముఁడు.** సం. వి. అ. పుం. ౧. చంద్రుఁడు. ౨. శివుఁడు. ౩. వాయువు. ౪. పితృదేవతలలో నొకఁడు. ౫. బుధుఁడు. ౬. అష్టవసువులలో నొకఁడు. ౭. కుబేరుఁడు. ౮. యముఁడు. ౯. సుగ్రీవుఁడు.

**సోమెద.** వి. ఒకదినుసుతీఁగె, సోమవల్లరి[j].

**సోమేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొక శాస్త్రప్రవర్తకుఁడు.

**సోమోద్భవ.** సం. వి. అ. స్త్రీ. నర్మదానది.

**సౌమ్యము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧. సోమాకారము గలది. ౨. సోమమునకు దగినది. ౩. మృదువైనది. ౪. మేలైనది. ౫. సోమరసము నొందునది.

**సౌయగము.** వి. ౧. సౌందర్యము, చక్కదనము.

గీ. చూడ జూడంగ మరుదయ్యె సోయగమున, దలప దలపంగ రాజయ్యె గలితకేళి, నిందుశేఖరవచింతువే యిందువదన. బిల్హ. ౨-౧౨౭.

వ. ....శిఖరంబుల సోయగంబులు గలయంగనుం గొనుట.... మను. ౧-౭౨.

గీ. అట్టిలేజవ్వనమ్ము సోయగముగల్గి. నీలా. ౧-౫౯.

సీ. అణిముత్తెముల సోయగమునించిన వ్రాలు వరుసతో నిరుగెల వ్రాయనేర్చి. విక్ర. ౧-౫౦.

౨. విలాసము.

సీ. సోయగంబున వీణవాయింప మాయంపు జటిలుండచ్చటికి చేమిటికివచ్చె. వసు. ౩-౧౧౬.

౩. విధము, రీతి.

వ. ....ఆయుధంబుల గార్ముకంబు సోయగంబున యజ్ఞంబుల జపయజ్ఞంబుచాడ్పున.... భాగ. ౧౨. స్కం. ౪౭.

వ.....కాళికారాధనీయ చిత్రభాను ప్రభానిరోధకం బైన ధారాధరనికాయంబు సోయగంబున........చం.రా. ౨-౭౩.

వ.....కుంజరంబుల పోల్కిని వృషభంబుల విధమున శంఖంబుల సోయగంబున భాసిల్లు మేఘంబు వర్షించు.... రెట్టమత. ౨-౪౨.

**సోయింబరకడ్డి.** వి. కంసాలి పనిముట్టు. (బళ్లారి రాయలసీమల వాడుక)

**సోరంగి.** వి. మత్స్యవిశేషము.

**సోర(ర్ణ)ణగండి.** వి. గవాక్షము, జాలకట్టు. (దీని వ్యస్తరూపము బహువచనాంతముగనే కనబడుచున్నది.)

వ.....సోరణగండి గొప్పహుప్పాణిముత్తెంపు జాల తండంబులు....ఉ.రా. ౧-౧౩౭.

సీ. నీడాడు నీలాలగోడలతో ముక్తికంబుల సోరణగండ్లతోడ. వరాహ. ౪-౧౧౧.

ద్వి. సోరణగండ్ల లోన జూడగవచ్చు, నారయ వేగరండని నాతి పిలువ. రం.రా.బాల. ౬౪. పా. ౭. పం.

ఉ. సోరణగండ్లనన్ నిలిచి చూచుచునుండుము మద్భుజాయుగ, పేరితముష్టినిర్దళ దుదీర్ణ విశోధిత రీరముల్.... హరి. ఉ. ౭-౧౯౩.

ఆ. వెలరు వాఁడిదీవియల నల్లనల్లార్చ, సోర్ణగండ్ల యందు జొచ్చి నుడిసి, తిరిగి వేగ బోకతెమ్మెరలవెంట, గొనలవంక లొత్తు ననల బ్రోచు. భార.ఉద్యో. ౨-౧౧౨.

సీ. సోర్ణగండుల జొచ్చి సురతఖేదమునందు కెలువల కెలువుర నేదదేర్చి,... .. మందసంచారముగ సుకుమారమగుచు, మెలసె బ్రత్యూషసమయసమీరణంబు. నృసిం. ౩-౧౧౧.

చ. మినుకు గడానిబంగరువు మేడలసోరణగండ్లవెంట.....నీలా. ౧-౭౯.

**సోరణము.** వి. గవాక్షము, కిటికీ.

సీ. పెద్దతామరకంపు విగిపట్టియలచేత పొలుపైన ముత్యాలసోరణముల. యయా. ౧-౨౫.

**సోరు.** వి. సోరుప్పు, పెట్లుప్పు.

**సోర్ణభ్రువు.** సం.విణ. (ఉ.ఉ.ఉ.) కనుబొమల నడుమ రోమవలయముకలది.

**సోల.** వి. నికుంచకము, తవ్వలోసగము.

ఉ. యాదవులుప్పమోవగ మురారికి సోలెడు మోపకింక బో,రాదు....ఉ.హరి. ౪-౧౬౦.

సీ. సోలనీటను నీడ జూచుచుబట్టెపర్వనము నిండగ నక్షతలనుమెత్తి. శుక. ౨-౪౭౬.

**సౌలగించు.** అ.క్రి. (√ సోలము) పరవశమగు.

ఉ. లాలిమనోహరాంగి....లాలియటంచు సువర్ణ
డోలికాం,దోళనఖేలనంబులను నున్ననినిద్దుర
సోలగింప నా,బాలికఁ బాడుచుండుదురు
పాటలగంధులు జోలపాటలన్.

విప్ర. ౨-౩౮.

**సోలము.** విశే. మందము.

సీ. తరుణిసోలపు టూర్పుతావి ఝుంగిభ్రమింగి
తేంట్లు నీలాంశలై తిరుగఁగాక.

కవిక. ౩-౧౬౪.

వి. వివశత్వము, పారవశ్యము.

సీ. చూపులనిగురొత్తు సోలంబుతోడన సోలంబు
తనువున మేళవింప. విక్ర. ౧-౧౬౬.

గీ. ఒండొరుల చిత్తములవాఁటి యొలయుచున్న
చొక్కుతక్కుడు సేయంగ సోల మదరి,
యిరువురును సౌఖ్యరసములఁ గరువుగట్టి,
పోసిచేసినరూపులపోల్కులైరి.

నిర్వ ౮-౮౦.

ఉ. ....మృదుప్రచారము, త్వన్నృపసోలముం
దలంప భామకులోఁదమకంబొకింతయున్,
సన్నముగాక విశ్వనరనాథునిపై దగులంబు
చూపెడున్. కావ్యా. ౨-౩౭.

౨. మదము, మత్తు.

సీ. అలరుఁ దేనియఁ గ్రోలి యున్న సోలంబుల
మరియు తేఁటుల సముద్రేకఁతయింపు.

భార. అను. ౧-౧౮౧.

మ. కరతాలుస్తన....సింధుర మొప్పచుండె నలి
గీతుల్ వించు సోలంబునన్. కు.సం. ౧-౯౦.

చ. తెలివిం గైకొని యోర్తు సొంగముగ వర్తిం
చున్ గళాసించుచుగ్మ్రలియోర్తొక్కతె వ్రాలు
సోలములతోఁ గాదంబరీగోష్ఠిచేన్.

కావ్యా. ౩-౧౨౦.

౩. మాంద్యము, అలసత.

సీ. చూపుల నిగురొత్తు సోలంబుతోడన సోలంబు
తనువున మేళవింప. విక్ర. ౧-౧౬౬.

**సోలము.** సం. వి. అ. పుం. చల్లఁదనము.

**సోలకాల్తి.** వి. నైచ్యము, తక్కువ.

ద్వి. ఏలయీలుబహురూపురేమేని నిమ్న, సోలు
కాల్తిగ సేను జూచితినయ్య.

బస. పు. ౯౭. పా. ౧౮. పం.

**సోలి.** వి. వినోదము.

ద్వి. కేలుకేలున బిగ్గఁగీలించిపట్టి, సోలికి నిలు
చుండి సోలియాడుచును.

అ.మ.క. ౨-౮౩. పా. ౧౬. పం.

**సోలిగోఁచి.** వి. సన్యాసులు దండమునకుఁ గట్టు
పచ్చనిగోఁచివంటిగుడ్డ.

ద్వి. సోలిగోఁచుల నొప్పచూపుదండములు.

ద్వి. పరమ. ౮-౩౦౮. పా.

**సోలించు.** స.క్రి. (√. సోలు) సోలఁజేయు.

వ.....కురువిందమ్ముల యందమ్ములను మోదిం
చుచు నరవిందబృందంబులను సోలించుచు
మొల్లలకు నరుగుచు మల్లెలకుందిరుగుచు విర
వాదులంజెదుముచు. రా.వి. ౩-౧౧౮.

**సోలింత.** ని. వివశత్వమునొంది వ్రాలుట.

మ. సొరపర్యుం ధనువల్లి బాణునితకున్ సో
లింతలం దూలుటన్. ఉ. హరి. ౫-౧౦౦,

**సోలు.** అ.క్రి.౧.వివశత్వమునొందు, పరవశమగు.

సీ. సోలెడు మెలదిఁగలీలఁగ్రాలుచు వింతచెలు
వంబు దలకొనఁజేరి నిలిచి.

భార. విరా. ౨-౬౮.

సీ. అరవిరివిరవాది విరుదు మెండెములతో సోలు
కోయిలమూసటీలతోడ. విక్ర. ౮-౫౨.

....నివ్వలును సోలుకొనుచుఁగ్రాలు జగము లేలు
చేలుపా. నీలా. ౧-౧౧౯.

ఉ. ....కడువృద్ధులాకటన్, సోలుచుఁజింతతో
నెదురుచూచుచునుందురు ... మను చ.౨-౫౩.

౨. వ్రాలు, ఒరగు.

క. అనిఁదగువీరులు దివికిం, జనుచుండనుఁ జెంచి
కొనుచుఁ జనఁజన సంధ్యా, ఘనదీప్తిరుధిర
మొలుకఁగ, వసువరియినుఁదస్తశిఖరి నల్లన
సోలెన్. కవిక. ౨-౨౦౦.

క. అర్చినఁగని రాకొమరుఁడు, పేర్చినరోసమున
నైదు పెనుదూపు లరిం, గూర్చితొలిచేలుప్ర
బోరయ, మేర్చినిగుడ్చుటయు నాతఁడేపరి
సోలెన్. అచ్చ. రా. యు. ౩౫౨.

౩. ప్రసరించు, వ్యాపించు.

లయగ్రాహి....అరాళచికురంబుల్, ఫాలమున
గ్రాల నిడువాలుమగమీలగమిడీలువడఁ దో
లెడు పిసాళికనుగ్రేవల్, సోల శరదంబుద
మృణాళహిమవాలుకలనేలెడురుచిన్ వలిప
చేలలు తచ్చాలం, దూలఁజని ...
వరాహ. ౩-౯౬.

క. తనిసతులకుఁ జూపెడుతతి, ఘనముగఁ దమ
చెవుల వాలుఁగన్నులు సోలన్.
మనుచ. ౬-౭౦.

౪. వ్రేలాడు.

సీ. పలఁకెడు కారాకులలితాస్థిదయము గా సోలు
కొమ్మలు పలుకేలుగాఁగ....శంభుమూర్తిఁ
దాల్చి సహకారభూరుహచక్రవర్తి.........
అతిశయిల్లుచుండె, శు.సం. ౪-౪౫౭.

౫. నశించు, చెడు.

గీ. కళవసంబాధ జలకమండలువు వీడ, జడలు
మహిజీరఁజే జపసరము జాఱ, దర్భముడిగ్రేల
ధ్యానతత్త్వంబు సోలఁ, గదఁగి నిలుచుండి
యాగ్రహోగ్రహముఁ జెంది. శువల. ౨-౩౫.

**సోలుఁదనము.** వి. (సోలు+తనము) మూర్ఛ;
పారవశ్యము.
సీ. విశ్వంభరుని మనోవీథి నిల్పిన పుత్త్రిఁ
దాల్చుటనన సోలుఁదనము మించె.
విప్ర. ౧-౭౨.

**సోలుదారు.** అన్య. వి. సోల్జరు, యుద్ధభటుఁడు.
మ. సమరోజ్జృంభితశౌర్యధుర్యులగు సార్జంటుల్
మయూరుల్ కుముం, దములున్........సోలు
దారులు సుబేదారుల్ మొదల్గల్గు సైన్య
ములు........రంగా. ౧-౧౪౭.

**సోలువట్టు.** అ. క్రి. (సోలు+పట్టు) వివశత్వము
నొంది వ్రాలు.

గీ. మధుమదోన్మత్తలై యల్కమఱచి సఖులు,
సూరెలకుఁ దాఁటఁబతులపై సోలువట్టు, చేడి
యల మన్మథుఁడు వెత్తిచెఱకు వింట, నేసెను
మ్మత్తవిరులచే నేసరేఁగి. కవిక. ౪-౧౬౬.

**సోల్లుంఠనము.** సం. వి. అ. న. ఎత్తిపొడుపు,
దెప్పుడుమాట.

**సోళాదొప్పి.** వి.ద్యూతవిశేషము. (సోళాందొప్పి
అని శ.ర.)
శా. సోళాదొప్పియు నెత్తమున్ మొదలుగా
జూదంబు నీవాడు నా, వేళంగాదని బాంధ
వుల్ శకుని దుర్వృత్తుం బెతింగింపరే.
జై.భా. ౩-౪౨.

**సోవసీయము.** సం. వి. అ. న. శుభము.

**సోవాలము.** సం. విశే. (అ.ఆ.అ.) ౧ నల్లనిది
౨ పొగచూరినది.

**సోహాము.** వి. రక్షణకేవలసిన సొమ్ము?
మ....మా, వెనువెంటన్ జనుదెండు నమ్ముఁడు
నిశావేళన్ బ్రయాణంబు రం, డన భక్తిన్
శరణార్థిఁ జేసి తమసోహం బెల్లఁ జెల్లిం
చుచున్. శాశ. ౪-౫౩.

**సోష్ణీషము.** సం. వి. అ. న. ముందువరండాగల
యిల్లు.

**సోష్మము.** సం. విశే. (అ. ఆ. అ. న్. న్. న్.)
వేడిగలది.

**సోష్మము.** వి. ఒత్తక్షరము.

## సౌ

**సౌండి.** సం. వి. ఈ. స్త్రీ. మిరియము.

**సౌందర్యము.** సం. వి. అ. న. చక్కఁదనము.
గీ. చిత్రసౌందర్యధుర్యులై చిగురుఁబోఁడు,
లప్పురిఁ దనర్తు రక్కడు నొప్పిదముల....
విక్ర. ౧-౭౦.

**సౌందర్యవంతము.** సం. విశే. (తా. తీ. తా.)
చక్కఁదనము కలది.

**సౌందర్యోత్పాదనము.** సం. వి. అ. న. శేద త్రయములలో నొకటి (స్నేహారాగా పనయము, సౌందర్యోత్పాదనము, సంతర్జనము)

**సౌకరము.** సం. విణ. (అ. ఈ. అ.) సూకరమునకు సంబంధించినది.

**సౌకరికుఁడు.** సం. వి. అ. పుం. ౧. సూకరములను వేఁటాడువాఁడు.
౨. పందులవ్యాపారము చేయువాఁడు.

**సౌకర్యము.** సం. విణ. (అ. ఆ. అ.) సుకరము, మిక్కిలి సులభము.

**సౌకర్యము.** సం. వి. అ. న. ౧. అనాయాసము ౨. సూకరభావము. ౩. వసతి. ౪. అనుకూల్యము. ౫. నేర్పు. ౬. ఆహారమునుగాని యౌషధమునుగాని యశ్రమముగా సిద్ధముచేయుట.

**సౌకుమార్యము.** సం. వి. అ. న. ౧. మృదుత్వము. ౨. కావ్యగుణములలో నొకటి. ౩. యౌవనము.

**సౌక్ష్మకము.** సం. వి. అ. పుం. చిన్నకీటకము.

**సౌక్ష్మ్యము.** సం. వి. అ. న. ౧. సూక్ష్మత్వము. ౨. పైశిత్యము. ౩. కావ్యగుణములలో నొకటి.

**సౌఖయానికుఁడు.** సం. వి. అ. పుం. సుఖకరమైన యానము కలుగవలెనని కోరువాఁడు.

**సౌఖరాత్రికుఁడు.** సం. వి. అ. పుం. రాత్రి సుఖముగాఁ గడచినదా? యని యడుగువాఁడు.

**సౌఖ(ఖ్య)శాయని(శాయి)కుఁడు.** సం.వి.అ. పుం. ౧. మహారాజులను నిద్రమేలుకొలుపువాఁడు. ౨. సుఖనిద్ర కలిగినదాయని ప్రశ్నించువాఁడు.
వ.....సౌఖశాయనిక సౌవస్తికబుధ వామసచివ సుకవిగాయకవైణికమార్దంగిక నికరంబు.... వైమ. ౨-౩.
సీ. సౌఖశాయనికులై సంవర్తభృగ్వాదిమునులు హస్తాంభోజములు మొగుడ్చ. శాశి.

**సౌఖ(వ)సుప్తికుఁడు.** సం. వి. అ. పుం. సౌఖశాయనికుఁడు.

**సౌఖకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. సుఖమునకు సంబంధించినవాఁడు. ౨. ఆనందకరుఁడు. ౩. సుఖమును గోరువాఁడు.

**సౌఖీయము.** సం. విణ. (అ.ఈ.అ.) సౌఖికము.

**సౌఖ్యము.** సం. వి. అ. న. ౧. సుఖము. ౨. తృప్తి. ౩. ఆనందము. ౪. భోగానుభవము.
వ.....ఇప్పటి దేవర పాదపద్మసేవ పరిపూర్ణ సౌఖ్యంబు నొసంగుచున్నది.... కళా.౮-౨౦౧.

**సౌగంధికము.** సం. విణ. (అ. ఈ. అ.) సువాసన గలది. వి.అ.పుం. ౧. మలకోశమునసుండు పురుగు. ౨. గంధకము.
అ.న. ౧. ఎఱుపును దెలుపును గలిగి మిక్కిలి పరిమళముగల కమలము. ౨. కామంచిగడ్డి. ౩. పద్మరాగము.

**సౌగంధికుఁడు.** సం. వి. అ. పుం. ౧. సుగంధద్రవ్యముల వ్యాపారము చేయువాఁడు. ౨. లైంగిక దౌర్బల్యముగలవాఁడు.

**సౌగంధ్యము.** సం. వి. అ. న. ౧. సువాసన. ౨. మధురపరిమళము.

**సౌగమ్యము.** సం. వి. అ. న. ౧. సౌలభ్యము. ౨. సౌకర్యము.

**సౌచి.** సం. వి. ఇ. పుం. కుట్టుపనిచేయువాఁడు.

**సౌచికము.** సం. వి. అ. పుం. ౧. అతుకు. ౨. కూర్పిక.

**సౌచికుఁడు.** సం. వి. అ. పుం. ౧. కుట్టుపనిచేయువాఁడు. ౨. కైవర్తకన్యయందు శౌండికునకుఁ బుట్టినవాఁడు.

**సౌజన్యము.** సం. వి. అ. న. ౧. సుజనత్వము, మంచితనము. ౨. దయ. ౩. ప్రేమ. ౪. ఔదార్యము.
క. అమ్మహితాత్ముని తనయుఁడు, సమ్మానదయానిధాన సౌజన్యరమా, సమ్మోదిత బాంధవుఁడై....విక్ర. ౧-౩౪.

సౌజ(స)ము. సం. విశే. (స్.ఈ.స్.) బలమైనది, శక్తిమంతము.

సౌతి, సం. వి. ఇ. పుం. ౧ సూతుని కుమారుఁడు. ౨. రామహర్షణి. ౩. కర్ణుఁడు.

సౌత్యము. సం. విశే. (అ. ఆ. అ.) సోమపీడనమునకు సంబంధించినది. అ.న. ౧. సారథ్యము. ౨. సవనీయమను యజ్ఞకర్మము.

సౌత్రము. సం. విశే. (అ.ఈ.అ.) ౧. సూత్రము కలది. ౨. సూత్రమునకు సంబంధించినది. వి. అ. పుం. వ్యాకరణ సూత్రములందు వచ్చు కృతకధాతువు.

సౌత్రాంతికులు. సం. వి. అ. పుం. బ. బౌద్ధమత శాఖలు నాలుగింటిలో నొకదానికిఁ జెందినవారు.

సౌత్రామణి, సం. వి. ఈ. స్త్రీ. ౧. తూర్పు. ౨. ఒకవిధమైన యజ్ఞము.

సౌత్రామణేష్టి. సం. వి. ఇ. స్త్రీ. హవిర్యజ్ఞవిశేషము.

సౌత్రికము. సం.వి.అ.పుం. నేయఁబడిన వస్త్రాదికము.

సౌత్రికుఁడు. సం. వి. అ. పుం. సాలెవాఁడు.

సౌత్రుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు.

సౌదర్యము. సం. వి. అ. న. సోదరత్వము. సం. విశే. (అ.ఆ.అ.) సోదరత్వముతోఁ గూడినది.

సౌదాగరు. వి. ౧. గుఱ్ఱముల బేరగాఁడు. ౨. వర్తకుఁడు.

సౌదామని. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఒకానొక యచ్చర. ౨. మెఱుపు. ౩. ఐరావతము భార్య.

సౌదామిని(మ్ని.).=సౌదామని.

సౌదాయికము. సం. వి. అ. న. ౧. వివాహసమయమున వధువునకుఁ బితృభ్రాతాదులచే నొసంగఁబడు ద్రవ్యము. ౨. స్త్రీ ధనము.

సౌదానము. సం. వి. అ. న. ౧. రాజగృహము. ౨. మేడ.

సౌదాసుఁడు. సం. వి. అ. పుం. కల్మాషపాదుఁడను రాజు.

సౌధన్వనము. సం. వి. అ. పుం. త్రైవర్ణికుల పిమ్మటను శూద్రులకు ముందును గణింపఁదగిన యొకవర్ణము.

సౌధము. సం. విశే. (అ.ఈ.అ.) ౧. అమృతమునకు సంబంధించినది. ౨. సున్నముతోఁ జేయఁబడినది. వి. అ. న. ౧. రాజగృహము, నగరు. ౨. వెల్ల చేయఁబడిన హర్మ్యము. ౩. వెండి. ౪. ఒకవిధమైన రాయి.

సౌధర్మ్యము. సం. వి. అ. న. ౧. ఆర్జవము. ౨. ధర్మవర్తనము.

సౌధవాసము. సం.వి.అ.పుం. పెద్దప్రాసాదము.

సౌధోత్సంగము. సం. వి. అ. పుం. ప్రాసాదోపరిభాగము.

సౌనందము. సం.వి.అ.పుం. బలరాముని రోకలి.

సౌనంది. సం. వి. న్. పుం. బలరాముఁడు.

సౌనధర్మ్యము. సం. వి. అ. న. ఘోరశత్రుభయము.

సౌనము. సం. విశే. (అ.ఈ.అ.) కసాయిగృహమునకు సంబంధించినది. వి అ.న. కసాయివాఁడమ్ము మాంసము.

సౌనికుఁడు. సం. వి. అ. పుం. ౧. పశుపక్ష్యాదులను జంపి యమ్మకొనువాఁడు, కటికవాఁడు. ౨. వేటకాఁడు.

సౌనుఁడు. సం. వి. అ. పుం. కసాయివాఁడు.

సౌపము. సం. విశే. (అ. ఈ. అ.) సంస్కృత విభక్తి ప్రత్యయములకు సంబంధించినది.

సౌపర్ణము. సం. విశే. (అ. ఈ. అ.) గరుడునకు సంబంధించునది. వి.అ.న. ౧. సొంటి. ౨. గరుడపచ్చ.

సౌవర్ణేయుఁడు. సం. వి. అ. పుం. గరుడుఁడు.

సౌవాకము. సం. వి. అ. పుం. ఒకమిశ్రజాతి.

సౌపానము=సోపానము.

సౌపికము. సం.విశ. (అ.ఆ.అ.) పప్పు, పులుసు మున్నగువానితోఁ గూడినది.

సౌప్తికము. సం. విశ. (అ.ఈ.అ.) ౧. నిద్రకు సంబంధించినది. ౨. నిద్రను గలిగించునది. వి.అ. న. ౧. భారతములోని యొక పర్వము. ౨. నిద్రించు సమయమున శత్రువులపైఁబడి చంపుట.

సౌప్రతీకము. సం. విశ. (అ.ఈ.అ.) సుప్రతీక మను నేనుఁగునకు సంబంధించినది.

సౌబలి=సౌబలేయి. సం. వి. ఈ. స్త్రీ. గాంధారి, సుబలుని కూఁతురు.

సౌబలుఁడు. సం. వి. అ. పుం. శకుని, సుబలుని కొడుకు.

సౌభగము. సం.వి. అ. పుం. ౧. క్షేమము. ౨. సౌఖ్యము. ౩. అదృష్టము. ౪. భాగ్యము.

సౌభద్రుఁడు=సౌభద్రేయుఁడు. సం.వి.అ.పుం. అభిమన్యుఁడు, సుభద్ర కొడుకు.

సౌభపతి. సం. వి. ఇ. పుం. సాల్వరాజు.

సౌభము. సం. వి. అ. న. ౧. హరిశ్చంద్రుని పట్టణము. ౨. సాల్వనగరము.

సౌభరి. సం. వి. ఇ. పుం. ఒకవేదర్షి.

సౌభాగినేయి. సం. వి. ఈ. స్త్రీ ప్రియతమ రాలైన భార్య కూతురు.

సౌభాగినేయుఁడు. సం. వి. అ. పుం. ప్రియతమ రాలైన భార్య కొడుకు.

సౌభాగ్యకృత్తు. సం. వి. త్. పుం. స్వరతాన విశేషము.

సౌభాగ్యతంతువు. సం. వి. ఉ. పుం. మంగళ సూత్రము.

సౌభాగ్యతృతీయ. సం. వి. అ. స్త్రీ. భాద్రపద శుక్లపక్ష తృతీయ.

సౌభాగ్యము. సం. వి. అ. న. ౧. అదృష్టము. ౨. ధన్యత్వము. ౩. సౌందర్యము.
సీ. బహుదివ్యఫలపరిపాకసౌభాగ్యంబు నెఱపు నెమ్మోవిమానికముతోడ. వసు. ౧.౨.

౪. వైభవము.

సీ. సౌభాగ్యగరిమ నీసాధ్వికి నుపమింప లక్ష్యం. బు వేరు శ్రీలక్ష్మి దక్క. విక్ర. ౧-౪౩.
౫. సుభగత్వము. ౬. ప్రేమ. ౭. అనుగ్రహము. ౮. సిందూరము. ౯. శుభాకాంక్ష. ౧౦. వెలిగారము. ౧౧. యోగవిశేషము.

సౌభాగ్యవతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పుణ్యస్త్రీ ౨. భాగ్యశాలిని. ౩. మంచిభార్య.

సౌభికుఁడు. సం.వి.అ.పుం. ఇంద్రజాలము చేయు వాఁడు, గారడీఁడు.

సౌభిక్షము. సం. విశ. (అ.ఆ.అ.) సౌఖ్యమును ఆహార సమృద్ధిని గూర్చునది.

సౌభీకుఁడు. సం. వి. అ. పుం. ద్రుపదుఁడు.

సౌభ్రాత్రము. సం. వి. అ. న. సుభ్రాతృత్వము, మంచితోఁడ బుట్టుఁదనము.

సౌమంగల్యము. సం.వి.అ.న. ౧. సంక్షేమము. ౨. వైభవము. ౩. సౌభాగ్యము.

సౌమకి. సం. వి. ఇ. పుం. ద్రుపదుఁడు.

సౌమనస. సం.వి.ఆ.స్త్రీ. జాజికాయపై బరడు.

సౌమనసము. సం.విశ. (అ.ఆ.ఈ.అ.) ౧. ఆహ్లాదకరమైనది. ౨. పూవులకు సంబంధించినది. వి. అ. న. దయ; ఔదార్యము. ౨. ఆనందము. ౩. సంతృప్తి. ౪. జాజికాయ.

సౌమనసా(స్యా)యని. సం. వి. ఈ. స్త్రీ. ౧. మాలతీలత. ౨. మాలతీ పుష్పము. ౩. జాపత్రి.

**సౌమనస్యము.** సం. విణ. (అ.ఆ.అ.) చిత్తానందము కలిగించునది. వి.అ.న. ౧. మనస్తృప్తి. ౨. పువ్వు. ౩. దేవతాభావము. ౪. శ్రాద్ధకాలమునఁ బిండప్రదానము పిదప బ్రాహ్మణున కిచ్చు పుష్పదానము. ౫. అస్త్రవిశేషము.
గీ. అబల నఖములు క్రూరంబులని తలంచి,
సౌమనస్యంబు గుణమున సంతరించె.
విక్ర. ౪-౧౩.

**సౌమము.** సం. విణ. (అ. ఆ. అ.) సోమమునకు సంబంధించినది.

**సౌమాయనుఁడు.** సం. వి. అ. పుం. బుధుఁడు. (తండ్రి మున్నగు పూర్వులవలనఁ గలిగిన పేరు)

**సౌమికము.** సం. విణ. (అ.ఈ.అ.) ౧. సోమరసమునకు సంబంధించినది. ౨. చంద్రునికి సంబంధించినది. ౩. యాగవిశేషము.

**సౌమితికము.** సం. వి. అ. న. ఒకవిధమైనయున్ని వస్త్రము.

**సౌమిత్రి.** సం. వి. ఇ. పుం. లక్ష్మణుఁడు.

**సౌమిత్రుఁడు.** సం. వి. అ. పుం. లక్ష్మణుఁడు.

**సౌమిల్లుఁడు.** సం. వి. అ. పుం. కాళిదాసునకుఁ బూర్వుఁడైన యొక సంస్కృతనాటక కవి.

**సౌముఖ్యము.** సం. వి. అ. న. సుముఖత్వము, ప్రసన్నత.

**సౌమేచకము.** సం. వి. అ. న. బంగారము.

**సౌమేధికుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఋషి. ౨. ద్రష్ట. ౩. అతిలోక ప్రతిభాశాలి.

**సౌమేరవము.** సం. వి. అ. న. సుమేరు సంబంధి, బంగారము.

**సౌమ్య.** సం.వి.ఆ.స్త్రీ. ౧. మయ్యాకుపొన్నచెట్టు. ౨. ఒకానొక సంవత్సరము. ౩. దుర్గ. ౪. ముత్యము. ౫. మృగశిరోనక్షత్రము.

**సౌమ్యగంధి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. భారతదేశమందలి తెల్లని రోజాపువ్వు.

**సౌమ్యగోళము.** సం. వి. అ. న. ఉత్తరార్ధగోళము.

**సౌమ్యగ్రహము.** సం.వి.అ.పుం. శుభగ్రహము. (బుధుఁడు, గురుఁడు, శుక్రుఁడు, చంద్రుఁడు.)

**సౌమ్యత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఔదార్యము. ౨. తిన్నన; రమ్యత.
ఉ. ప్రాజ్ఞులు మూర్తిసౌమ్యతయు బాహులదీర్ఘ
తయుం భటత్వశ,త్త్వజ్ఞతయున్ గతిస్ఫురదు
దాత్తతయున్ గని సంశయంబుతోన్.....
భార. విరా. ౪-౭౪.

**సౌమ్యధాతువు.** సం. వి. ఉ. పుం. శ్లేష్మము.

**సౌమ్యనాముఁడు.** సం. విణ. (న్. నీ. న్.) హృద్యమైన పేరుగలవాఁడు.

**సౌమ్యము.** సం. విణ. (అ.ఆ.ఈ.అ.) ౧. చంద్రునికి సంబంధించినది. ౨. సోమరసగుణములు కలది. ౩. అందమైనది. ౪. సమ్మతమైనది. ౫. శాంతమైనది. ౬. మృదువైనది. ౭. ఋజువైనది. ౮. శుభమైనది. ౯. ప్రకాశవంతమైనది. ౧౦. చల్లనిది.
వి.అ.పుం. ౧. ఉదుంబర వృక్షము. ౨. ఎఱుపురంగు పొందక మునుపటి రక్తము. ౩. జఠరరసము. ౪. ప్రపంచ నవఖండములలోనొకటి ౫. శుభగ్రహము. ౬. సౌమకృచ్ఛ్రమను తపస్సు. ౭. ఎడమచేయి. అ. న. ౧. ఆర్జవము. ౨. మృగశిరోనక్షత్రము. ౩. ఎడమకన్ను ౪. హస్తమధ్యము. ౫. ఉత్తానకరణబంధ విశేషము.

**సౌమ్యవారము.** సం.వి.అ.పుం. బుధవారము.

**సౌమ్యి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. చంద్రకాంతి. ౨. పితృదేవతాగణము.

**సౌమ్యుఁడు.** సం. వి. అ. పుం. ౧. బ్రాహ్మణుఁడు. ౨. సోమరసము త్రాగు బ్రాహ్మణుఁడు. ౩. అనుచరుఁడు. ౪. బుధుఁడు.

**సౌరతము.** సం. విశే. (అ.ఈ.అ.) సురతమునకు సంబంధించినది. వి.అ.న. ౧. రతి. ౨. రేతస్సు.

**సౌరత్యము.** సం. వి. అ. న. ౧. భక్తి. ౨. విశ్వాసము.

**సౌరథుఁడు.** సం. వి. అ. పుం. యోధుఁడు.

**సౌరభము.** సం. విశే. (అ.ఈ.అ.) సువాసన గలది. వి.అ.న. ౧. ఆమోదము; సువాసన. ౨. కుంకుమ పువ్వు. ౩. బోళము, గంధరసము. ౪. ఎద్దు. ౫. తానవిశేషము. ౬. మైత్రి.
సీ. ఘనసౌరభములలోఁ గస్తూరియే మేలు........ బిల్హ. ౧-౭౭.
సీ. .. పుష్పసౌరభములఁ బోలుపు మిగిలి........ విక్ర. ౧-౭౫.

**సౌరభేయము.** సం. విశే. (అ.ఈ.అ.) ౧. సురభికి సంబంధించినది. ౨. సువాసనగలది. వి.అ. పుం. ఎద్దు.

**సౌరభేయి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. సురభి కూఁతురు, నందిని. ౨. ఆవు.
ఆ. ఉద్ధరింపనైతి సద్ధర్మగతిఁ జూపు, శాదమగ్నయైన సౌరభేయి. ధర్మ. ౧-౧౪౫.

**సౌరభ్యము.** సం. వి. అ. న. ౧. సుగంధము. ౨. సౌందర్యము. ౩. కీర్తి. ౪. సౌశీల్యము.

**సౌరభ్యుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**సౌరమానము.** సం. వి. అ. న. సూర్యగతినిబట్టి యేర్పడిన కాలమానము

**సౌరమాసము.** సం. వి. అ. పుం. సూర్యుఁ డొక రాశియందు సంచరించు కాలము.

**సౌరము.** సం. విశే. (అ.ఈ.అ.) ౧. సూర్యసంబంధమైనది. ౨. సూర్యునారాధించునది. ౩.దివ్యమైనది. ౪. మద్యమునకు (సురకు) సంబంధించినది. సం. వి. అ. న. ౧. సూర్యునకు సంబంధించిన కొన్ని ఋక్కుల సముదాయము. ౨. కుడికన్ను. వి. అ. పుం. ౧. సౌరమాసము. ౨. సౌరదివసము. ౩. ఒకవిధమైన మొక్క. ౪. ఒకానొక మతము. ౫. ఉపపురాణములలో నొకటి. ౬. ఒకానొక యస్త్రము.

**సౌరస.** సం. వి. ఆ. స్త్రీ. కొండరేఁగు.

**సౌరసము.** సం. వి. అ. పుం. ౧. ఉప్పువైచి కాఁచిన ద్రవాహారము. ౨. ఒకవిధమైన పేను.

**సౌరసేనము.** సం. వి. అ. పుం. బ. ఒకదేశము, తద్దేశ ప్రజ.

**సౌరసేని.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక దేశ భాషా విశేషము.

**సౌరసేయుఁడు.** సం.వి.అ.పుం. కుమారస్వామి.

**సౌరసైంధవము.** సం. విశే. (అ. ఈ. అ.) గంగకు సంబంధించినది. వి. అ. పుం. సూర్యుని గుఱ్ఱము.

**సౌరస్యము.** సం. వి. అ. న. రుచి.

**సౌరాజ్యము.** సం. వి. అ.న. సుపరిపాలనము.

**సౌరావము.** సం. వి. అ. పుం. ఉప్పువేసి కాఁచిన ద్రవాహారము.

**సౌరాష్ట్రకము.** సం. వి. అ. పుం. ఒకవిధమైన కంచు.

**సౌరాష్ట్రము.** సం. వి. అ. న. ౧. కంచు. ౨. ఇత్తడి. పుం. ౧. ఒకనొక రాగము. ౨. ఒక దేశము.
సీ. సౌరాష్ట్రపతికంటె సంపాతి యెంతవాఁ డటుమాడు వాని సప్తాంగములను.
భోజరా. ౪-౩౪.

**సౌరాష్ట్రి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కరపీరకమను సస్యము. ౨. సుగంధముగల భూమి.

**సౌరాష్ట్రికము.** సం.విశే. (అ.ఆ.అ.) సౌరాష్ట్ర దేశ సంబంధి. వి.అ.పుం. విషభేదము. న. ౧. కంచు. ౨. ఇత్తడి.

**సౌరి.** సం. వి. ఇ. పుం. ౧. శని. ౨. యముఁడు. ౩. విష్ణువు. ౪. సుగ్రీవుఁడు. ౫. వేఁగిసచెట్టు. ఈ. స్త్రీ. ౧. సూర్యునిభార్య. ౨. ఆవు.

**సౌరికము.** సం. విణ. (అ.ఈ.అ.) ౧. దివ్యమైనది. ౨. మద్యమునకు సంబంధించినది. వి. అ. పుం. ౧. స్వర్గము. ౨. కల్లు.

**సౌరికుఁడు.** సం. వి. అ. పుం. ౧. కల్లమ్మికొని జీవించువాఁడు. ౨. శని.

**సౌరీయము.** సం. విణ (అ.ఆ.అ.) ౧. సూర్యునకు సంబంధించినది. ౨. సూర్యున కర్హమైనది.

**సౌరు=సవురు.** విణ. మనోజ్ఞము. వి. ౧. విధము. ౨. చక్కఁదనము.

సీ. తనరారు సిరిసౌరు తనివారఁగలవారు కను
గూర్కు మదిఁగోరి కన్నుమూయ.
హంస. ౧-౧౩౭.

**సౌరుఁడు.** సం. వి. అ. పుం. ౧. సూర్యారాధకుఁడు. ౨. శని. ౩. యముఁడు.

**సౌరేయ(క)ము.** సం. వి. అ. పుం. ఒకవిధమైన మొక్క.

**సౌలక్షణ్యము.** సం. వి. అ. న. సులక్షణభావము, మంచిలక్షణము కలిగియుండుట.

**సౌలభ్యము.** సం. వి. అ. న. సులభత్వము, తేలికగా లభించునది యగుట.

**సౌల్వికుఁడు.** సం. వి. అ. పుం. రాగిపనిముట్లు చేయువాఁడు.

**సౌవగ్రామికము.** సం. విణ. (అ.ఈ.అ.) సొంత గ్రామమునకు సంబంధించినది.

**సౌవము.** సం. విణ. (అ.ఈ.అ.) ౧. సొంతయాస్తికి సంబంధించినది. ౨. స్వర్గమునకు సంబంధించినది. వి.అ.న. అందఱికిని జెందుశాసనము.

**సౌవరము.** సం. విణ. (అ.ఈ.అ.) స్వరమునకు సంబంధించినది.

**సౌవర్చలము.** సం. విణ. (అ.ఈ.అ.) సువర్చల దేశమునుండి వచ్చినది. వి.అ.న. సౌవర్చలవణము, సర్జవృక్షమునుండి తీయునట్టి యుప్పు.

**సౌవర్ణకరణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వృక్షవిశేషము. ౨. ఇతర లోహములను బంగారముగాఁ జేయు నోషధివిశేషము.

**సౌవర్ణకుడ్యక.** సం. వి. అ. స్త్రీ. ఒకవిధమైన పట్టు దుస్తు.

**సౌవర్ణభేదిని.** సం. వి. ఈ. స్త్రీ. ప్రియంగు వృక్షము.

**సౌవర్ణము.** సం. విణ. (అ.ఈ.అ.) ౧. స్వర్ణవికారమైనది. ౨. ఒకకర్షము తూఁగునది. వి. అ. పుం. ౧. బంగారు కర్షము (నాణెము) ౨. బంగారు టుంగరము. న.పుం. బంగారము.

**సౌవర్ణికము.** సం. విణ. (అ. ఆ. అ.) బంగారుతోఁ జేయఁబడినది.
వి. అ. న. నాలుగు మినుపగింజల యెత్తు.

**సౌవర్ణికుఁడు.** సం. వి. అ. పుం. అగసాలి.

**సౌవస్తికము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆశీఃపూర్వకమైనది. వి. అ. న. స్వస్త్యయనము.

**సౌవస్తికుఁడు.** సం. వి. అ. పుం. కుల పురోహితుడు.

వ..... సౌఖశాయనిక సౌవస్తిక బుధనామ సచివ
సుకవిగాయకవైణిక వాంశిక మార్దంగిక
నికరంబు .. నైష. ౭-౩.

**సౌవాధ్యాయికము.** సం. విణ. (అ. ఆ. అ.) స్వాధ్యాయమునకు సంబంధించినది.

**సౌవాస్తవము.** సం. విణ. (అ.ఈ.అ.) మంచి స్థితికలది.

**సౌవిదల్లకుఁడు.** సం. వి. అ. పుం. అంతఃపురము కావలివాఁడు.

**సౌవిదల్లుఁడు.** సం. వి. అ. పుం. అంతఃపురము కావలివాఁడు.

**సౌవిదుఁడు.** సం. వి. అ. పుం. సౌవిదల్లుఁడు, కంచుకి.
చ. అతఁ డొకనాఁడు నారదు విహారవశంబున నాత్మసత్సభా,గతుఁ డగువాని నద్వినయ గౌరవపూజలఁ దన్పిసౌవిద,ప్రతతులఁగూర్చి లోపలికిఁ బంచెను....ప్రభా. ౪-౧౩.

**సౌవీరకము.** సం. వి. అ. పుం. రేఁగుచెట్టు. న. పులియఁ బెట్టిన కడుగు నీళ్లు.

**సౌవీరకుఁడు.** సం. వి. అ. పుం. ౧. సువీరదేశము వాఁడు. ౨. జయద్రథుఁడు.

**సౌవీరము.** సం. వి. అ. న. ౧. పులియఁ బెట్టిన కడుగు నీళ్లు, ౨. అంజనము. ౩. రేఁగుపండు. ౪. ఒకానొక ప్రదేశము-లేక-అందలి ప్రజ.

**సౌవీరసారము.** సం.వి.అ.న. కపోతాంజనము.

**సౌవీరీ=సౌవీరి.** సం.వి.ఈ. స్త్రీ. మధ్యగ్రామ మగత మూర్ఛనలలో నొకటి.

**సౌవీర్యము.** సం. వి. అ. న. గొప్పపరాక్రమము, శౌర్యము.

**సౌశబ్ద(బ్ద్య)ము.** సం. వి. అ. న. నామక్రియా రూపములను సరిగా నిర్మించుట, ఒకానొక శాబ్దిక గుణము.

**సౌశామ్యము.** సం. వి. అ. న. లెస్సగా ననున యించుట.

**సౌశీల్యము.** సం. వి. అ. న. సుశీలత్వము.

**సౌశ్రవసము.** సం. వి. అ. న. ప్రతిష్ఠ, కీర్తి.

**సౌశ్రియము.** సం.వి.అ.న. గొప్ప యదృష్టము, సౌఖ్యము.

**సౌషిరము.** సం. వి. అ. పుం. ఒకవిధమైన దంత రోగము. న. వేణువు మున్నగు సుషిరవాద్యముల సమూహము.

**సౌషిర్యము.** సం. వి. అ. న. బోలుఁదనము.

**సౌష్ఠవము.** సం. వి. అ. న. ౧. మష్ఠుభాగము. ౨. నాట్యాంగ విశేషము. ౩. చక్కఁదనము. ౪. తేర్పు. ౫ ఆధిక్యము. ౬. సౌలభ్యము. ౭. పరిశుభ్రత.
వ. గోవుల గోష్ఠంబులు దినదినంబును సౌష్ఠవంబు గావించి యరయు పుణ్యాత్ముండు.... శివధ. ౮-౩౯.

**సౌస్నాతికుఁడు.** సం. వి. అ. పుం. సుఖముగా స్నానమైనదా యని యడుగువాఁడు.

**సౌస్వర్యము.** సం. వి. అ. న. సుస్వరత్వము, శ్రావ్యధ్వని.

**సౌహార్దము.** సం.వి.అన. ౧ సుహృద్భావము, మైత్రి. ౨. ప్రేమ.
మ. అవమాన్యున్ సభలోన మాన్యుఁ దని సౌహార్దంబునన్ గౌరవ,స్థవిరప్రేరణ నిన్ను బాండుతనయుల్ తప్పంగఁ బూజించిరి ... భార. సభా. ౨-౬౩.

**సౌహార్దుఁడు.** సం. వి. అ. పుం. మిత్రునికుమారుఁడు.

**సౌహార్ద్యము.** సం. వి. అ. న. సౌహార్దము, అనురాగము.

**సౌహిత్యము.** సం. వి. అ. న. ౧. ఆప్యాయము. ౨. పర్యాప్తి. ౩. దయ. ౪. స్నేహము. ౫. ప్రీణనము, తృప్తి.
గీ.....సాస్థానమండపమున, జనిత సాహిత్యసౌహిత్య సరసగోష్ఠిఁ, జిత్తమిగురొత్తఁ జన్నయ సిద్ధమంత్రి, కొలువు తీర్చుండి ... విక్ర. ౧-౧౯.

**సౌహృదము.** సం. వి. అ. న. స్నేహము, సౌహార్దము.
సీ. ప్రథమజామాత కిచ్చె భూపాలతిలకుఁ, డగ్నిశోధంబులైన దివ్యాంబరములు, సౌహృదంబుఘటింప వైశ్వానరుండు, దనకు నెయ్యపుత్రెంచెఁ దాను మొదల....వైష. ౬-౯౭.

**సౌహృదయము**=సౌహార్దము.

**సౌహృద్యము**=సౌహార్దము.

## స్క

**స్కంత్త.** (ఋ. త్రి. ఋ.) గంతెడివాఁడు.

**స్కందకము.** సం. వి. అ. న. ఒకవృత్తము.

**స్కందకుఁడు.** సం. వి. అ. పుం. ౧. గంతెడి వాఁడు. ౨. సైనికుఁడు.

**స్కందజిత్తు.** సం. వి. త్. పుం. విష్ణువు.

**స్కందనము.** సం. వి. అ. న. ౧. స్రవించుట. ౨. నడచుట. ౩. కదలుట. ౪. ఎండిపోవుట. ౫. శీతలోపాయములచే రక్తస్రావము నాపుట. ౬. విరేచనము.

**స్కందపురాణము.** సం. వి. అ. న. అష్టాదశ పురాణములలో నొకటి.

**స్కందము.** సం. వి. అ. పుం. ౧. దుముకుట. ౨. పాదరసము. ౩. శరీరము. ౪. నదీతీరము. ౫. పిల్లలకు వచ్చునొక రోగము. ౬. నాశము.

**స్కందషష్ఠి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కార్తికేయుని గౌరవార్థమై చైత్రశుద్ధషష్ఠినాఁడు జరుగు నొక పండుగ. ౨. మార్గశీర్ష శుక్లషష్ఠి.

**స్కందాంశకము.** సం.వి.అ.పుం. పాదరసము.

**స్కందితము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. వెడలింపఁబడినది. ౨. స్రవింపఁజేయఁబడినది.

**స్కందుఁడు.** సం.వి.అ.పుం. ౧. కుమారస్వామి. ౨. శివుఁడు. ౩. రాజు. ౪. తెలివికలవాఁడు, ధీమంతుఁడు.

**స్కందోలము.** సం. వి. అ. పుం. చల్లఁదనము.

**స్కంధ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కొమ్మ. ౨. లత.

**స్కంధఘనము.** సం. వి. అ. పుం. తెలిసికొనుట.

**స్కంధచాపము.** సం. వి. అ. పుం. కావటిబద్ద.

**స్కంధజము,** సం.వి.అ.పుం. మఱ్ఱిచెట్టు; స్కంధమునుండి పుట్టుచెట్టు.

**స్కంధతరువు.** సం. వి. ఉ. పుం. కొబ్బరచెట్టు.

**స్కంధదేశము.** సం. వి. అ. పుం. ౧. ఏనుఁగు మూఁపు. ౨. భుజము. ౩. చెట్టుబోదె, ప్రకాండము.

**స్కంధపట్టిక.** సం. వి. ఆ. స్త్రీ. తలుపున కమర్చెడు గందపట్టె.

**స్కంధపరినిర్వాణము.** సం.వి.అ.న. ఐహిక జీవిత బంధములను రూపుమాపుట. (బౌద్ధ)

**స్కంధపీఠము.** సం. వి. అ. న. ఱెక్క యొముక గూడు.

**స్కంధఫలము.** సం. వి. అ. పుం. ౧. కొబ్బర చెట్టు. ౨. బిల్వవృక్షము. ౩. అత్తిచెట్టు. న. కొబ్బరకాయ.

**స్కంధబంధన.** సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన మొక్క.

**స్కంధమల్లకము.** సం.వి.అ.పుం. నారాయణ పక్షి.

**స్కంధము.** సం. వి. అ. పుం. ౧. అంసభాగము, భుజాగ్రము. ౨. మూఁపురము.

వ. వెండియు నయ్యండజాధిప స్కంధారూఢు నకు గాఢభక్తిం బ్రణామంబు లాచరించి..... నార. ౫.౮౯.

౩. చెట్టుబోదె, వేళ్లు మొదలు కొమ్మలవఱకుఁ గల ప్రాను. ౪. పోరు. ౫. సమూహము. ౬. బౌద్ధశాస్త్రోక్తములైన పంచస్కంధములు. ౭. శరీరము. ౮. ఛందోభేదము. ౯. పెద్దకొమ్మ. ౧౦. గ్రంథభాగము. ౧౧. సేనావిభాగము. ౧౨. అయిదు జ్ఞానేంద్రియములు. ౧౩. మార్గము. ౧౪. ఒడంబడిక. ౧౫. నారాయణ పక్షి. ౧౬. రాజాభిషేక సమయమున నుపయోగింపఁబడు వస్తువులు.

స్కంధరుహము. సం. వి. అ. పుం. రావిచెట్టు.

స్కంధవాహ(క)ము. సం.వి.అ.పుం. ౧. బండి లాగెడి యెద్దు ౨. బరువును మోయు యెద్దు.

స్కంధశాఖ. సం. వి. ఆ. స్త్రీ. మ్రాని మొదటి కొమ్మ.

స్కంధశృంగము. సం.వి.అ.పుం. దున్నపోతు.

స్కంధస్సు. సం. వి. స్. న. ౧. భుజము. ౨. చెట్టు మొదలు.

స్కంధాగ్ని=స్కంధానలము. సం. వి. ఇ. పుం. ౧. నిప్పుపెట్టఁబడిన చెట్టుమొదలు. ౨. పెద్దదూలములతో మండుచున్న యగ్ని.

స్కంధాటిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. కావడి. ౨. మూఁపుమీఁది బరువు.

స్కంధావారము. సం. వి. అ. పుం. ౧. దండు విడిసిన చోటు, బిడారము. ౨. దండు.

వ.....కారవేశ్వరు స్కంధావారంబు వారణ
పురంబున నెవ్వ రెయ్యెడ వసియింతు రాచం
దంబున నందంబై యొప్పె ...
భార. ఉద్యో. ౪-౧౩౪.

౩. రాజధాని.

స్కంధి సం. విశే. (న్.నీ.న్.) ౧. భుజములు గలది. ౨. కొమ్మలు కలది. వి.న్.పుం. చెట్టు.

స్కంధితము. సం.వి.అ.పుం. స్కంధవాహము.

స్కంధుఁడు. సం. వి. అ. పుం.౧. దశార్ణదేశపు రాజు. ౨. విద్వాంసుఁడు. ౩. రాజు.

స్కంధోపనేయము. సం. విశే. (అ. ఆ. అ.) భుజములచే మోయఁదగినది. వి. అ. పుం. ఫలము కాని ధాన్యముకాని వినతికి సూచనగా నర్పింపఁ బడు సంధివిశేషము.

స్కంభనము. సం. వి. అ. న. ౧. బలపఱచుట. ౨. ఆధారము. ౩. ప్రాపు.

స్కంభము. సం.వి.అ.పుం. ప్రాపు, ఆధారము.

స్కంభుఁడు. సం. వి. అ. పుం. ౧. పరమాత్మ. ౨. వైదికదేవతా విశేషము.

స్కన్నము. సం. విశే. (అ.ఆ.అ.) ౧. జాఱిపడినది. ౨. ఎండినది. ౩. స్రవింపఁజేయఁబడినది. ౪. చల్లఁబడినది, వికీర్ణము.

స్కబ్ధము. సం. విశే. (అ.ఆ.అ.) ౧. ఆఁపఁబడినది. ౨. బలపఱుపఁబడినది.

## స్కా

స్కాందపురాణము. సం. వి. అ.న. అష్టాదశ పురాణములలో నొకటి.

స్కాందము. సం. వి. అ.న. స్కాందపురాణము. విశే. (అ.ఈ.అ.) ౧. స్కందునకు సంబంధించినది. ౨. శివునకు సంబంధించినది.

## స్కో

స్కోటిక. సం.వి.ఆ.స్త్రీ. ఒకవిధమైన పిచ్చుక.

## స్ఖ

స్ఖందనము. సం. వి. అ. న. ౧. ముక్కలుగా ఖండించుట. ౨. హానిచేయుట. ౩. చంపుట. ౪. స్థిరత్వము.

స్ఖలనము. సం. వి. అన. ౧. జాఱుపాటు. ౨. స్వధర్మచ్యుతి. ౩. పొరపాటు. ౪. అపజయము. ౫. తడఁబాటుతోఁ బలుకుట ౬. డీకొనుట. ౭. రేతఃస్ఖలనము.

స్ఖలి(యి)ంచు. సం. అ. క్రి. జాఱు.

స్ఖలితము. సం. విశే. (అ.ఆ.అ.) ౧. జాఱినది. ౨. సంభ్రమించినది. ౩. యుద్ధమర్యాద తప్పినది. ౪. పడినది. ౫. కదలుచున్నది. ౬. మద్యపానముచే బరవశమైనది. ౭. కలఁత నొందినది. ౮. పొరపడినది. ౯. ఆఁపఁబడినది. ౧౦. గాయపడినది. ౧౧. అసంపూర్ణమైనది. వి.అ.న. ౧. స్ఖలనము. ౨. మోసము. ౩. కష్టము.

## స్ఖా

**స్ఖాలిత్యము.** సం. వి. అ. న. ౧. ఏమఱిపాటు. ౨. జాఱుపాటు. ౩. పొరపాటు. ౪. మోసము.

## స్త

**స్తంబకము.** సం. వి. అ. పుం. గుత్తి, గుచ్ఛము.

**స్తంబకరి.** సం.విశే.ఇ.ఈ.ఇ ౧ నీతము,భోగ్యము, ౨. పనలుగా నేర్పడునది. వి.ఇ.పుం. ధాన్యము.

**స్తంబకరిత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పనలుగా నేర్పడుట, ౨. పైరు విఱుగఁబడుట.

**స్తంబఘనము.** సం.వి. అ.పుం. ౧ వరి మున్నగు పైరులను కోయుటకగు పనిముట్టు, కొడవలి, ౨ వనధాన్యమునుపోయుటకుపయోగించు గంప. (ఇట్లే స్తంబఘాతము, స్తంబహము, స్తంబహనము, స్తంబహనని, మొ)

**స్తంబఘ్నము.** సం.వి.అ.పుం. ౧ గుద్దలి ౨ స్తంబఘనము.

**స్తంబపురము.** సం.వి.అ.న. ఒకనగరము.

**స్తంబము.** సం. వి. అ. పుం. ౧ చెట్టుమ్రాను. ౨ ఆకులధికముగాఁగల పొద. ౩ తృణాదులగంట ౪ వరిమున్నగువాని సమూహము. ౫ ఏనుఁగును గట్టు స్తంభము. ౬ మ్రానుపాటు. ౭ పర్వతము.

**స్తంబేరమము.** సం.వి.అ.పుం. ఏనుఁగు.

**స్తంభకము.** సం.విశే.(అ.ఆ.అ.) ౧ ఆఁపునది. ౨ రక్తస్రావమునకైనది.

**స్తంభకి.** సం.వి.న్.పుం. చర్మాచ్ఛాదితమైన సంగీత పరికరము.

**స్తంభనము.** సం.వి.అ.న. ౧ మ్రాన్పడఁజేయుట. ౨ మంత్రశక్తిచే నగ్ని మొదలగువాని శక్తి నణఁగించుట. ౩ నిరోధము. ౪ అణఁచుట. ౫ శాంతపఱుచుట ౬ స్థిరముచేయుట ౭ బలపఱుచుట. ౮ రక్తస్రావమునాఁపుట ౯ రక్తస్రావమునాపుమందు. వి. అ. పుం. మన్మథుని పంచబాణములలో నొకటి.

**స్తంభబలి.** సం.వి.ఇ.పుం. ౧ కంబవల్లి. ౨ ఊఁష నయనమున నాల్గవదినమునఁజేయు పలాశ హోమము.

**స్తంభము.** సం.వి. అ. పుం. ౧ కంబము, గుంజె, ౨ పడినమ్రాను. ౩ ఒకానొకసాత్త్వికభావము. ౪ స్థిరత. ౫ తెలివిలేమి. ౬. అడ్డుపాటు. ౭ నిర్బంధము. ౮ ఆధారము. ౯ మొద్దు ౧౦ సహజశక్తులను నిలుపుట.

**స్తంభయిత.** సం.విశే. (ఋ.త్రి.ఋ.) స్తంభింపఁజేయునది.

**స్తంభి.** సం.వి.ఇ.న్.పుం. సముద్రము. విశే.న్.నీ.న్. ౧ బలపఱుచునది. ౨ ఆఁపునది. ౩ స్తంభములతోఁగూడినది. ౪ గర్వించునది.

**స్తంభించు.** సం.అ.క్రి. మ్రాన్పడు. స.క్రి. మ్రాన్పడఁజేయు.

**స్తంభిక.** సం.వి.ఆ.స్త్రీ. కుర్చీకాలు.

**స్తంభితము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ ఆఁపఁబడినది. ౨ మ్రాన్పఱుపఁబడినది. ౩ శాంతపఱుపఁబడినది. ౪ ఊరురోగవిశేషము.

**స్తంభిని.** సం.వి. ఈ.స్త్రీ. ౧ భూమి. ౨ తంత్రవిశేషము.

**స్తత్కము.** సం.వి.అ.పుం. బిందువు, చుక్క.

**స్తనంధయ.** సం.వి.ఆ. స్త్రీ. ౧ పాలుత్రావెడియాఁడుబిడ్డ.

**స్తనంధయము.** సం. విశే. (అ.ఆ.అ.) చన్నుకుడుచునది.

**స్తనంధయి.** సం. వి. ఈ. స్త్రీ. చన్నుగుడుచు చిన్నపాప.

**స్తనంధయుఁడు.** సం.వి. అ. పుం. పాలుత్రాగు బిడ్డఁడు.

**స్తనక్షీరము.** సం. వి. అ. పుం. ఒకవిధమైన మామిడి.

స్తనగ్రాహము. సం.వి.అ.పుం. చన్నుగుడుచుట.

స్తననము. సం.వి.అ.న. ౧ ధ్వనించుట. ౨ గర్జించుట. ౩ మూల్గుట. ౪ దగ్గుట.

స్తనపము. సం.విణ.(అ.ఆ.అ.) ౧ చనుగుడుచునది.

స్తనభరుఁడు. సం. వి. అ. పుం. స్త్రీవలె స్తనములుకల పురుషుడు.

స్తనభవము. సం.వి.అ.పుం. రతిబంధవిశేషము.

స్తనమధ్యము. సం.వి.అ.పుం. స్తనచూచుకము. అ.న. చనులనడిమి ప్రదేశము.

స్తనము. సం.వి.అ.పుం. ౧ కుచము. ౨ కుచాగ్రము.

స్తనముఖము. సం.వి.అ.న. చూచుకము.

స్తనయిత్నువు. సం.వి.ఉ. పుం. ౧ మేఘము. ౨ ఉఱుము. ౩ మెఱుపు, ౪ రోగము. ౫ చావు ౬ ఒకవిధమైన గడ్డి.

స్తనరోహితము. సం.వి.అ.పుం.న.కుచమునందలి యొకభాగము.

స్తనవృక్షము. సం.వి.అ.పుం. నల్లమామిడి.

స్తనాంతరము. సం. వి. అ.న. ౧ హృదయము. ౨ చనులనడిమి ప్రదేశము. ౩ (వైధవ్యసూచకమైన) స్తనమందలి గుర్తు.

స్తనాంశుకము. సం.వి.అ.న. పైఁట.

స్తనాభుజము. సం.విణ. (అ. ఆ. అ.) పాదుగు కుడుపునది.

స్తనాభోగము. సం. వి. అ. పుం. ౧ స్తనవైశాల్యము. ౨ స్తనమండలము.

స్తనాభోగుఁడు. సం.వి.అ.పుం. స్త్రీవలె స్తనములుకల పురుషుఁడు.

స్తనితకుమారుఁడు. సం.వి.అ.పుం. జైనదేవతావర్గములో నొకదైవము.

స్తనితఫలము. సం. వి. అ. పుం. పుల్లవెలఁగ.

స్తనితము. సం. వి. అ. న. ౧. ఉఱుము. ౨. రతిధ్వని విశేషము. ౩. చప్పట్లధ్వని. ౪. వింటినారి శబ్దము. విణ. (అ. ఆ. అ.) ౧. ధ్వనితము ౨. గర్జించునది.

స్తన్యదము. సం. విణ. (అ. ఆ. అ.) చనుబాలను వృద్ధి చేయునది.

స్తన్యము. సం. వి. అ. న. చనుబాలు.

స్తబకము. సం. వి. అ. పుం. ౧. పూలగుత్తి. ౨. గ్రంథభాగము.

స్తభము. సం. వి. అ. పుం. ౧. మేకపోతు ౨. గొఱ్ఱెపొట్టేలు.

స్తభి. సం. వి. ఇ. పుం. ౧. పారుష్యము. ౨. స్థిరత్వము. ౩. కాఠిన్యము.

స్తబ్ధకర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) నిక్కపొడుచుకొనిన చెవులుంగలది.

స్తబ్ధత. సం. వి. ఆ. స్త్రీ. ౧. దృఢత. ౨. కాఠిన్యము. ౩. మ్రానుపాటు.

స్తబ్ధపాదము. సం. (అ. ఆ. అ.) కుంటికాలు కలది.

స్తబ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అణఁగినది. ౨. ముడిఁగినది. ౩. చేష్టారహితము. ౪. నిక్కపొడుచుగొనినది. ౫. అడఁపఁబడినది. ౬. స్థిరమైనది. ౭. కఠినమైనది. ౮. మందమైనది.

స్తబ్ధరోమము. సం. వి. న్. పుం. బిరుసైన వెండ్రుకలుంగల యడవిపంది.

సీ. ఒకసారి సారమేయోద్ధతి నుద్ధర స్తబ్ధరోమంబుల సంహరించి. కాశీ. ౩. ౪౭.

స్తబ్ధలోచనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఱెప్పపాటులేని కన్నులు కలవాఁడు, దేవతాది.

స్తబ్ధి. సం. వి. ఇ. స్త్రీ. ౧. స్థిరత్వము. ౨. కాఠిన్యము. ౩. చైతన్యరాహిత్యము. ౪. మొండితనము.

స్తిమితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తడిసినది ౨. శాంతమైనది. ౩. మాయఁబడినది. ౪. మెత్తనిది. ౫. తృప్తినొందినది.

స్తరణము సం.వి.అ.న.౧ పఱచుట. ౨ గోడకు సున్నము వేయుట.

స్తరము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ వ్యాపించునది ౨ కప్పునది. వి.అ.పుం. ౧ పొర. ౨ పఱపు.

స్తరి. సం.వి.ఈ.స్త్రీ. ౧ పొగ. ౨ ఆవిరి. ౩ ఆవుపెయ్య. ౪ గొడ్డుటావు.

స్తరి(రీ)మ. సం వి.న్.పుం.పఱపు.

స్తవకము సం. వి. అ. పుం. ౧ స్తోత్రము. ౨ పూలగుత్తి. ౩ గ్రంథభాగము. ౪ సముదాయము. విణ. (అ. ఇకా.అ.) పొగడునట్టిది.

స్తవకితము. సం. విణ. (అ.ఆ.అ.) గుత్తులతోఁగూడినది.

స్తవనము. సం.వి.అ.న. ౧ పొగడ్త. ౨ బుఱ్ఱ.

స్తవము. సం.వి.అ.పుం. ౧ పొగడుట. ౨ స్తుతి.

స్తవరకము. సం.వి. అ.పుం. కంచె, ఆవరణము.

స్తవి. సం.వి.ఇ.పుం. స్తోత్రపాఠకుఁడు.

స్తవేయుఁడు. సం.వి.అ.పుం. ఇంద్రుఁడు.

## స్తా

స్తాఘము. సం. విణ. (అ.ఆ.అ.) లోఁతులేనిది.

స్తానకుఁడు. సం.వి.అ.పుం. పొగడువాఁడు.

స్తావము. సం.వి.అ.పుం. స్తుతి.

స్తావ్యము. సం.విణ. (అ.ఆ.అ.) పొగడఁదగినది.

## స్తి

స్తిభి. సం. వి. ఇ. పుం. ౧ ఆతంకము. ౨ సముద్రము. ౩ గుచ్ఛము.

స్తిభిని. సం.వి.ఈ.స్త్రీ. గుత్తి.

స్తిమితము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ నిశ్చలము. ౨ తడిసినది. ౩ ఆలస్యమైనది. ౪ శాంతమైనది. ౫ మూయఁబడినది, ౬ మృదువైనది, ౭ తృప్తినొందినది. వి.అ.న. ౧ తేమ. ౨ స్థిరత్వము.

## స్తీ

స్తీ(ఘ్వ). సం. వి. ఇ.పుం. ౧. యజ్ఞములోని బుత్విక్కు. ౨. గడ్డి. ౩. ఆకాశము. ౪. నిరు. ౫. నెత్తురు. ౬. దేహము. ౭. భయము. ౮. ఇంద్రుఁడు.

## స్తు

స్తుక. సం. వి. ఆ. స్త్రీ. ౧. కేశపాశము. ౨. ఎద్దుకొమ్ములనడుమనుండు రోమజాలము. ౩. కటిప్రదేశము. ౪. తొడ.

స్తుకము. సం. వి. అ. పుం. ౧. కేశసమూహము ౨. జుట్టుముడి.

స్తుతము. సం. విణ. (అ. ఆ. అ.) స్తుతింపఁబడినది. వి. అ. న. పొగడ్త.

స్తుతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. స్తోత్రము. ౨. పొగడ్త. ౩. స్తుతివేగము. ౪. ముఖస్తుతి. ౫. దుర్గ.

స్తుతించు. సం. స. క్రి. ౧ స్తోత్రముచేయు. ౨ అభినందించు. ౩ ప్రశంసించు, పొగడు.

స్తుతిపదము. సం. వి. అ.న. స్తోత్రలక్ష్యము.

స్తుతివ్రతుఁడు. సం. వి. అ. పుం. స్తోత్రపాఠకుఁడు

స్తుతుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

స్తుత్యా. సం. వి. ఆ. స్త్రీ. ౧ సువాసనగల యొక విధమైన చెట్టుబరడు. ౨ పటిక పలక.

స్తుత్యము. సం. విణ. (అ. ఆ. అ.) స్తోత్రము చేయఁదగినది.

శా. లోకస్తుత్య విభూతి నన్యపృతనాలుంటాక బాహాబల, శ్రీకల్మిన్.....

స్తునకము. సం. వి. అ. పుం. మేఁక.

స్తుభము. సం. వి. అ. పుం. మేఁక.

స్తువము. సం. వి. అ. పుం. స్తుతి.

స్తువి. సం. వి. ఇ. పుం. ౧ పూజించువాఁడు ౨ యజ్ఞము.

## స్తూ

**స్తూపపృష్ఠము.** సం. వి. అ. పుం. తాబేలు.

**స్తూపమండలము.** సం.వి.అ.న. స్తూపపరిధి.

**స్తూపము.** సం.వి.అ.పుం. ౧ దేవాలయవిమానము ౨ మట్టిదిబ్బ. ౩ బౌద్ధస్మృతిచిహ్నము. ౪ చితి, పొద. ౫ శక్తి, బలము.

## స్తృ

**స్తృతి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ పఱచుట. ౨ కప్పుట.

## స్తే

**స్తేనము.** సం.వి.అ.న. దొంగతనము, పుం. ఒకవిధమైనసుగంధము.

**స్తేనుఁడు.** సం.వి.అ.పుం. దొంగ.

**స్తేమము.** సం.వి.అ.పుం. తేమ.

**స్తేయము.** సం. వి. అ. న. ౧ దొంగతనము. ౨ దొంగిలింపఁబడిన వస్తువు. ౩ రహస్యము.

**స్తేయి.** సం.వి.న్.పుం. ౧ దొంగ, ౨ కమసాలి.

## స్తై

**స్తైన(న్య)ము.** సం.వి.అ.న. దొంగతనము.

**స్తైన్యుఁడు.** సం.వి.అ.పుం. దొంగ.

**స్తైమిత్యము.** సం. వి. అ. న. ౧ స్తిమితత్వము. ౨ స్థిరత్వము. ౩ నైశ్చల్యము.

## స్తో

**స్తోకకము.** సం.వి.అ.పుం. ౧ బిందువు. ౨ చాతకపక్షి, ౩ అగ్నికణము. ౪ ఒకవిధమైనవిషము.

**స్తోకకాయుఁడు.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ చిన్నశరీరముకలవాఁడు. ౨ పొట్టివాఁడు.

**స్తోకము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ చిన్నది, అల్పమైనది. ౨ నీచమైనది.

**స్తోత.** సం.వి.ఋ.పుం. పొగడువాఁడు.

**స్తోతవ్యము.** సం విశే.(అ.ఆ.అ.)పొగడఁదగినది.

**స్తోత్రపాఠకుఁడు.** సం.వి.అ.పుం. ౧ స్తుతివచనములను బలుకువాఁడు. ౨ వంది.

**స్తోత్రము.** సం. వి. అ. న. పొగడ్త.

గీ. బిల్హణుండనువాఁడు గంభీరుఁడధిక, తముఁ
డు కవిరాజనంగ స్తోత్రములు వడసె.
బిల్హ ౧.౭౫.

**స్తోత్రవాదము.** సం. వి. అ. పుం. స్తుతివచనము.

**స్తోత్రియ.** సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన పద్యము స్తోత్రియము.

**స్తోభము.** సం. వి. అ. పుం. ౧. ఆఁపుట. ౨ విరామము ౩. అగౌరవము. ౪ ద్వేషము. ౫ స్తుతి. ౬ సామవేదభాగము ౭ క్రొత్తగాఁజేర్పఁబడినది. ౮ ఋగక్షరములకంటె నధికమును అసవర్ణమును అయిన ధ్వని. (ఋగక్షరేభ్యోఽధికః నచతైస్సవర్ణః స స్తోభోనామ. శాబరభాష్యము. ౯.౨.౩౯.) ౯. జడత్వము.

**స్తోమక్షారము.** సం. వి. అ. పుం. సబ్బు.

**స్తోమము.** సం. వి. అ. పుం. ౧ సమూహము. ౨ స్తోత్రము. ౩ యజ్ఞము ౪ ఆయుధవిశేషము. సోమాహుతి. ౬ పెద్దమొత్తము. ౭ తొంబదియాఱంగుళముల కొలత. వి. అ. న. ౧ తల. ౨ సంపద ౩ ధాన్యము ౪ ఇనుపదండము..

**స్తోమ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) స్తుత్యము, పొగడఁదగినది.

## స్తౌ

**స్తౌపికము.** సం. వి. అ. న. బౌద్ధస్మృతి చిహ్నము.

**స్తౌభికము.** సం. వి. అ. న. సామసంహితయందలి రెండవభాగము.

## స్త్యా

**స్త్యానము.** సం. విశే. (అ. ఆ. అ) ౧ ఘనీభవించినది. ౨ సాంద్రమైనది. ౩ మృదువైనది ౪ ధ్వనించునది. వి. అ. న. ౧ ఆలస్యము. ౨ ప్రతిధ్వని ౩ ఘనీభావము. ౪ అమృతము. ౫ దళసరి.

**స్త్యాయనము.** సం. వి. అ. న. ౧ సంఘాతము. ౨ ఘనీభవించుట.

## స్త్యై

**స్త్యైనము.** సం.వి.అ.పుం. అమృతము.

**స్త్యైనుఁడు.** సం.వి.అ.పుం. దొంగ.

## స్త్రీ

**స్త్రీ.** సం.వి.ఈ. స్త్రీ. ౧ ఆఁడుది.

క. సాగరమునఁబడి దుఃఖప్రాగల్భ్యము వెలయ వెతలఁబడుదేహింగతిన్, స్త్రీగర్భ బహుళజలములఁ, దోఁగుచుఁదేలుచును శిశువు దుఃఖమునొందున్. శివధ. ౫.౨౦.

౨ భార్య. ౩ చెద. ౪ ప్రియంగులత. ౫ ఆఁడు జంతువు.

**స్త్రీకరణము.** సం.వి.అ.న. రతిసంబంధము.

**స్త్రీకార్యము.** సం.వి.అ.న. ౧ ఆఁడువారి వ్యాపారము. ౨ స్త్రీలకుఁగాని స్త్రీలుండునంతఃపురమునకుఁగాని కావలియుండుట.

**స్త్రీకితవుఁడు.** సం.వి.అ.పుం. స్త్రీలను మోసగించువాఁడు.

**స్త్రీకుసుమము.** సం.వి.అ.న. ౧ ఋతుస్రావము ౨ స్త్రీ కృతము. ౩ రతిబంధము.

**స్త్రీకేసరము.** సం. వి. అ. పుం. అండకోశము.

**స్త్రీకోశము.** సం.వి.అ.పుం. ఖడ్గము.

**స్త్రీక్షీరము.** సం.వి.అ.న. తల్లిపాలు.

**స్త్రీగవి.** సం.వి.ఈ.స్త్రీ. పాలిచ్చుశావు.

**స్త్రీగృహము.** సం. వి. అ. న. ౧ స్త్రీల నివాసము. ౨ అంతఃపురము.

**స్త్రీగ్రాహి.** సం. వి.న్. పుం. స్త్రీలరక్షకత్వము నంగీకరించువాఁడు.

**స్త్రీఘోషము.** సం.వి.అ.పుం. వేకువ, ప్రాతఃకాలము.

**స్త్రీచిహ్నము.** సం.వి.అ.న. ౨ ఆఁడుదనమును సూచించుగుర్తు. ౨ యోని.

**స్త్రీజనని.** సం.వి. ఈ. స్త్రీ. ఆఁడుసంతానమునే కనునట్టి స్త్రీ.

**స్త్రీజితుఁడు.** సం. వి. అ. పుం. ఆఁడుదానికిలోఁబడియుండుమగఁడు.

**స్త్రీతమ = స్త్రీతర.** సం. వి. అ. స్త్రీ. సంపూర్ణ లక్షణములు గలయాఁడుది.

**స్త్రీదేహార్ధుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**స్త్రీధనము.** సం. వి. అ. న. స్త్రీకిఁదల్లిదండ్రులు సోదరులు మున్నగువారి వలన లభించుసొత్తు. (౧. అధ్యగ్ని ౨. అధ్యావహానికము. ౩. ప్రీతికర్మదత్తము. ౪. భ్రాతృ, మాతృ పితృప్రాప్తములు, అని స్త్రీధనము ఆఱు విధములు.)

**స్త్రీధర్మము.** సం. వి. అ. పుం. ౧. ఆఁడుది లేక భార్య నిర్వహింపవలసిన విధి. ౨. స్త్రీలకు సంబంధించిన ధర్మము. ౩. ముట్టు. ౪. సంభోగము.

**స్త్రీధర్మిణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ముట్టుది. ౨. స్త్రీమదము.

**స్త్రీధ్వజము.** సం. వి. అ. పుం. ౧. ఆఁడుజంతువు. ౨. ఏనుగు.

**స్త్రీనాథుఁడు.** సం. వి. అ. పుం. ఆఁడుదానిచేఁ బోషింపఁబడినవాఁడు.

**స్త్రీనిబంధనము.** సం. వి. అ. న. ౧. గృహిణీత్వము. ౨. గృహధర్మము.

**స్త్రీపణ్యోపజీవి.** సం. వి. న్. పుం. ౧. స్త్రీ్యాజీవుఁడు. ౨. భార్యవలన జీవించువాఁడు.

**స్త్రీపరుఁడు.** సం. వి. అ. పుం. కాముకుఁడు.

**స్త్రీపర్వము.** సం. వి. న్. న. మహాభారతమున నొక పర్వము.

**స్త్రీపుంసయోగము.** సం. వి. అ.పుం. ౧. పదునెనిమిది వ్యవహార పదములలో నొకటి. ౨. స్త్రీపురుషుల కలయిక.

**స్త్రీపుంసలక్షణ.** సం. వి. అ. స్త్రీ. స్త్రీపురుషస్వభావ చేష్టలు రెండును. గలిగిన జంతువు, లేక వృక్షము.

**స్త్రీపుంధర్మము.** సం. వి. అ. పుం. స్త్రీపురుషుల ధర్మములను నియమించు శాస్త్రము.

**స్త్రీపురము.** సం. వి. అ. న. ఆఁడువారుండు గృహ భాగము.

**స్త్రీపుష్పము.** సం. వి. అ. న=స్త్రీకుసుమము.

**స్త్రీపూర్వుఁడు.** సం. వి. అ. పుం. స్త్రీజితుఁడు

**స్త్రీప్రత్యయము.** సం.వి.అ.పుం. స్త్రీలింగమును సూచించు ప్రత్యయము.

**స్త్రీప్రసంగము.** సం. వి. అ. పుం. స్త్రీలతోడి యధిక సంపర్కము.

**స్త్రీప్రసువు.** సం.వి.ఈ.స్త్రీ. స్త్రీజనని.

**స్త్రీప్రియము.** సం.విణ. (అ.ఆ.అ.) స్త్రీలకు ప్రియమైనది, వి.అ.పుం. మామిడిచెట్టు.

**స్త్రీబంధము.** సం.వి.అ.పుం. రతిక్రీడ.

**స్త్రీబాధ్యుఁడు.** సం. వి. అ. పుం. ఆఁడుదానిచే బాధింపబడుటకు లోఁబడియుండువాఁడు.

**స్త్రీభాషి.** సం.వి.న్.పుం. ఆఁడంగివాఁడు, స్త్రీవలె మాటాడువాఁడు, (అస్త.ని)

**స్త్రీమహాగము.** సం. వి. అ.న. మొగలిపూవు.

**స్త్రీముఖపము.** సం. వి. అ. పుం. అశోక వృక్షము.

**స్త్రీరంజనము.** సం. వి. అ.న. తములపాకు.

**స్త్రీరత్నము.** సం. వి. అ.న. ౧. నారీతిలకము. ౨. లక్ష్మి.

**స్త్రీరాగము.** సం. వి. అ. పుం. దేశాక్షి, దేవగాంధారి మొదలగు రాగము. (పురుషరాగము కానిది.)

**స్త్రీలింగము.** సం. వి. అ.న. ౧. మూడు లింగములలో నొకటి. ౨. స్త్రీత్వమును సూచించు గుర్తు (కుచాది.) ౩. ఆఁడుగుఱ్ఱి.

**స్త్రీవాసము.** సం. వి. అ. పుం. పుట్ట.

**స్త్రీవిషయము.** సం. వి. అ. పుం. రతిక్రీడ.

**స్త్రీవ్రణము.** సం. వి. అ. పుం. ఆఁడుగుఱ్ఱి.

**స్త్రీసంస్థానము.** సం. విణ. (అ.ఆ.అ.) ఆఁడుదానియాకృతి కలది. (స్త్రీసంస్థానంచాప్సరస్తీర్థమారాత్ ....శాకుంతలమ్ 5 అం.)

**స్త్రీసంగ్రహణము.** సం.వి.అ.న. ౧. అనుచితముగా స్త్రీని కౌఁగిలించుకొనుట. ౨. వ్యభిచారము.

**స్త్రీసంబంధము.** సం. వి. అ. పుం. వివాహమువలని చుట్టరికము.

**స్త్రీసేవ.** సం.వి.ఆ.స్త్రీ. ఆఁడుదానియెడ రక్తిగాని భక్తికాని కలిగి యుండుట.

**స్త్రీస్వభావుఁడు.** సం.వి.అ.పుం. నపుంసకుఁడు.

**స్త్రీహరణము.** సం.వి.అ.న. బలవంతముగా స్త్రీని తెఱచుట.

**స్త్రీహారి.** సం.వి.న్. పుం. స్త్రీలను తెఱచువాడు, లేక హరించువాడు.

# స్త్రై

**స్త్రైణము.** సం.వి.ణ. (అ.ఈ.అ.) ౧. స్త్రీనిబంధమైనది, ౨. స్త్రీతత్పరమైనది. వి.అ.న. ౧. స్త్రీత్వము. ౨. స్త్రీభావము. ౩. స్త్రీల సమూహము

# స్థ

**స్థండిలము.** సం.వి.అ.న. ౧. వ్రతదీక్షఁబూనినవారు పండుకొనుటకుగాను దర్భాదులచే సంస్కరింపఁబడినభూమి. ౨. అగ్నిహోత్రమునుంచుటకై సంస్కరింపఁబడినచోటు. ౩. పొత్తు ౪. చక్కచేయఁబడిన నేల. ౫. ఊషరక్షేత్రము. ౬. సరిహద్దు ౭. ఇంటిముందుండు స్థలము.

**స్థండిలసితకము.** సం.వి.అ.న. ౧. అరుఁగు. ౨. వేదిక.

**స్థండిలుఁడు.** సం.వి.అ.పుం. వ్రతదీక్షవలన భూమిపైఁబండుకొనువాడు, స్థండిలశాయి.

**స్థండిలశాయి.** సం.వి.న్. పుం=స్థండిలుఁడు.

**స్థండిలేశయుఁడు.** సం.వి.అ.పుం=స్థండిలుడు

**స్థకరము.** సం.వి.అ.న. పోఁక. İ

**స్థగణ.** సం.విణ. ఆ. స్త్రీ. భూమి.

**స్థగనము.** సం.వి.అ.న. ౧. ఆచ్ఛాదనము, కవ్వ, ౨. మఱుఁగు.

**స్థగము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧. వంచనశీలమైనది. ౨ విడువఁబడినది. ౩ అలక్ష్యభావముతోఁగూడినది.

**స్థగరము.** సం.వి.అ.పుం. పుత్రజీవకమను వృక్షవిశేషము.

**స్థగి.** సం.వి.ఈ.స్త్రీ. తములపాకులపెట్టె.

**స్థగిక.** సం.వి.ఆ.స్త్రీ. ౧ వేశ్య. ౨ ఒకవిధమైన కట్టు. ౩ తములపాకులు, పోకలునుంచెడిపెట్టె

**స్థగితము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ ఆచ్ఛాదింపఁబడినది. ౨ తాపదముచేయఁబడినది. ౩ ఆఁపఁబడినది. ౪ మూయఁబడినది.

**స్థగుఁడు.** సం.వి.అ.పుం. మోసగాఁడు.

**స్థగువు.** సం.వి.ఉ.పుం. ౧ ఉబుకుట. ౨ గూను.

**స్థపతి.** సం. వి. ఇ. పుం. ౧ శిల్పి. ౨ బృహస్పతి సవనముచేసినవాఁడు. ౩ అంతఃపురమునుగావలికాయువాఁడు. ౪ సారధి. ౫ వడ్రంగి. ౬ కుబేరుఁడు. విణ.(ఇ.ఈ.ఇ.) శ్రేష్ఠము, ముఖ్యము.

**స్థపత్యుఁడు.** సం.వి.అ.పుం. అంతఃపురోద్యోగి.

**స్థపుట.** సం.వి.ఆ.స్త్రీ. జాతిİ.

**స్థపుటగతము.** సం. విణ. (అ. ఆ. అ.) దుర్గభస్థలములలోనుండునది.

**స్థపుటము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧ మిట్టపల్లమైనది. ౨ మధ్యానతముపార్శ్వోన్నతమునైనది ౩ క్లిష్టపరిస్థితులలోనున్నది. వి.అ.పుం. పైకుబికియుండుట.

**స్థపుటితము.** సం.విణ. (అ.ఆ.అ.) స్థపుటమైనది; తాఁపఁబడినది.

**స్థపుటీకృతము.** సం.విణ. (అ.ఆ.అ.) విషమముగాఁజేయఁబడినది.

**స్థపుటుఁడు.** సం.వి.అ.పుం. కృత్రిముఁడు.

**స్థము.** సం. విణ. (అ. ఆ. అ.) (సమాసాంతమున వాడఁబడును. ౧ నిలుచునది. ౨ స్థావరమైనది. వి.అ.పుం.చోటు, స్థలము.

**స్థల.** సం.వి.ఆ.స్త్రీ. కృత్రిమమైననేల.

**స్థలకమలము.** సం.వి.అ.న. మెట్టతామర.

**స్థలకమదము.** సం.వి.అ.పుం. కరవీరపుమొక్క.

**స్థలదేవత.** సం.వి.ఆ.స్త్రీ. ౧. స్థానికముగానుండు దేవత. ౨. గ్రామదేవత.

**స్థలపద్మిని.** సం.వి.ఈ.స్త్రీ. మెట్టతామర.

**స్థలము.** సం.వి.అ.న. ౧ చోటు. ౨ మెట్టభూమి ౩ జలశూన్యమై సహజముగాఁజదరమైననేల. ౪ తీరము. ౫ దిబ్బ. ౬ క్షేత్రము. ౭ చర్చనీయాంశము. ౮ శిబిరము. ౯ గ్రంథాదులందలిభాగము

**స్థలవర్త్మము.** సం.వి.న్.న. సముద్రతీరమార్గము

**స్థలవిగ్రహము.** సం. వి. అ. పుం. సమభూమిపై జరుగు యుద్ధము.

**స్థలశుద్ధి.** సం.వి.ఇ.స్త్రీ. భూమిని శుద్ధిచేయుట.

**స్థలసీమ.** సం.వి.న్.స్త్రీ. పొలిమేర.

**స్థలి.** సం.వి.ఈ.స్త్రీ. ౧ సహజమైన స్థలము. ౨ స్థలదేవత.

**స్థలేశయము.** సం.విణ. (అ.ఆ.అ.) స్థలశాయి. వి.అ.పుం. స్థలజలముల రెండింటను జీవించు జంతువు.

**స్థవి.** సం.వి.ఇ.పుం. ౧ సాలెవాడు. ౨ స్వర్గము. ౩ చరవస్తువు. ౪ అగ్ని.

**స్థవిర.** సం.వి.ఆ.స్త్రీ. ముసలిది.

**స్థవిరుఁడు.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ స్థిరుఁడు ౨ చిరంజీవి. ౩ వృద్ధుఁడు. వి.అ.పుం. ౧ జైవాతృకుడు. ౨ శతానీకుఁడు. ౩ ముసలివాఁడు. ౪ యాచకుఁడు.

**స్థవిష్ఠము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ మిక్కిలి స్థూలము. ౨ గరిష్ఠము. ౩ బలిష్ఠము.

**స్థవీయము.** సం.విణ. (స్.సీ.స్.) స్థూలతరము.

## స్థా

**స్థాండిలుఁడు.** సం.వి.అ.పుం.=స్థండిలుఁడు.

**స్థాణవము.** సం.విణ. (అ.ఈ.అ.) స్థాణువునకు సంబంధించినది.

**స్థాణుకర్ణిక.** సం.వి.ఆ.స్త్రీ. విష్ణుక్రాంతము ‡.

**స్థాణుప్రకీర్ణ.** సం.వి.ఆ.స్త్రీ. అశ్వసంచార మార్గ విశేషము.

**స్థాణువు.** సం.విణ. (ఉ.ఉ.ఉ.) స్థిరమైనది, కదలనిది, వి.ఉ.పుం. ౧ జీవకమను వాసనద్రవ్యము ౨ ఈటె. ౩ చెదలపుట్ట. ౪ శివుఁడు. ౫ చిలుకకొయ్య. ౬ శూలము. ౭ ధ్రువుడు. ౮ ఆసన విశేషము.

**స్థాత.** సం. విణ. (ఋ.త్రీ.ఋ.) ౧ వర్తిష్ణువు, ఉండువాడు. వి. ఋ. పుం. ౧ దారిచూపువాడు ౨ చోదకుడు.

**స్థాతవ్యము.** సం.విణ. (అ.ఆ.అ.) ఉండఁదగినది వి.అ.న. ఆలస్యము.

**స్థానకము.** సం.వి.అ.న. ౧ నాట్యభంగిమము. ౨ స్థితి ౩ నాటకమునందలి సన్నివేశము. ౪ నగరము ౫ నురుగు. ౬ పఠనక్రమము. ౭ తైత్తిరీయమునందలి యొకభాగము. ౮ నిలబడిన విగ్రహముతోనున్న దేవాలయము. ౯ వేటమున్నగు సమయములందలి శరీర విన్యాసము. ౧౦ యుద్ధ సమయమందలి విలుకానినిలుచుతీరు.

**స్థానకుటికాసనము.** సం. వి. అ. పుం. స్థావరగృహ త్యాగము.

**స్థానదీప్తము.** సం.విణ. (అ.ఆ.అ.) సన్నివేశమును బట్టి అశుభమైనది.

**స్థానపాలకుఁడు.** సం.వి.అ.పుం. ౧ ఒకానొక యశ్వపాలకుఁడు. ౨ కావలివాఁడు ౩ రక్షకభటుఁడు.

**స్థానపిప్పటిక.** సం.వి.ఆ.స్త్రీ. దైనికాదాయవ్యయ పట్టిక.

**స్థానభూమి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ వానప్రస్థము ౨ హర్మ్యము.

**స్థానభ్రష్టుఁడు.** సం.విణ. (అ.ఆ.అ.) ఉద్యోగము నుండి తొలఁగింపబడినవాఁడు.

**స్థానము.** సం.వి.అ.న. ౧ చోటు ౨ ఇల్లు, ౩ ఉనికి. ౪ సామ్యము. ౫ ఉచితము. ౬ జీవించియుండుట.
౭. త్రివర్గమునందొకటి (అనఁగా కృష్యాద్యష్టవర్గమునందు శత్రువుతో సమముగానుండుట శ.ర.)
౮. విలుకానియుద్ధమప్పటి నిలుచుతీరు. (ఇది పంచవిధము. ఆలీఢము, ప్రత్యాలీఢము, సమపదము, విశాఖము, మండలము. శ.ర.)

**స్థానమృగము.** సం. వి. అ. పుం. ౧ తాఁబేలు, మొసలి మున్నగువానివర్గమునకుఁజెందినజంతువు.

**స్థానయోగము.** సం.వి.అ.పుం. ఉచితస్థలముల నియమించుట.

**స్థానాధికారము.** సం.వి. అ. పుం. కో వెలపారుపత్తెము.

**స్థానాధ్యక్షుఁడు.** సం.వి.అ.పుం. ౧ స్థానికపాలకుఁడు. ౨ కావలివాఁడు. ౩ రక్షకభటోద్యోగి.

**స్థానాపతి.** సం. వి. ఇ. పుం. ౧ మధ్యవర్తి. ౨ దూత.

**స్థానాపత్యప్రయోగము.** సం. వి. అ. పుం. తంత్రవిశేషము.

**స్థానాసేధము.** సం.వి.అ.పుం. నిర్బంధము.

**స్థాని.** సం.విణ. (న్.నీ.న్.) స్థానముకలది. ౨ స్థిరమైనది. ౩ ఆదేశముకలది. వి.న్.పుం. ౧ ఆదేశమునకుఁబూర్వరూపము. ౨ ఆదేశము.

**స్థానికము.** సం. విణ. (అ.ఈ.అ.) స్థానమునకు సంబంధించినది.

**స్థానికుఁడు.** సం.వి.అ.పుం. ౧ స్థానాధ్యక్షుఁడు. ౨ గుడిపారుపత్తెము చేయువాఁడు. ౩ ఆప్రదేశముననుండువాఁడు.

**స్థానీయము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ స్థానికము. ౨ స్థానమునకుఁదగినది. వి.అ.న. ౧ నగరము. ౨ రాజధాని. ౩ ఎనిమిది వందల గ్రామములను రక్షించుట కేర్పడిన కోట.

**స్థానేపతితుఁడు.** సం.వి.అ.పుం. అన్యుని స్థానము నాక్రమించువాఁడు.

**స్థాపకము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ నిలబెట్టునది. ౨ స్థిరపఱుచునది.

**స్థాపకుఁడు.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ స్థాపించువాఁడు. ౨ సూత్రధారుఁడు. ౩ దేవాలయమును గాని విగ్రహమునుగాని ప్రతిష్ఠించువాఁడు ౪ (ధనాదులను) నిక్షేపించువాఁడు.

**స్థాపత్యుఁడు.** సం.వి.అ.పుం. హెగ్గడికాఁడు, అంతఃపురమునందలి కావలివాఁడు.

**స్థాపత్యము.** సం.వి.అ.న. స్థపతియొక్క కర్మము

**స్థాపన.** సం. వి. ఆ. స్త్రీ. ౧ స్థిరపఱుచుట. ౨ సూత్రధారకర్మము ౩ ప్రస్తావన. ౪ నిలువయుంచుట.

**స్థాపనము.** సం.వి.అ.న. ౧ స్థాపించుట. ౨ పోఁపుట. ౩ సమాధి. ౪ గర్భవతులకుఁజేయునొక సంస్కారము.

**స్థాపనవృత్తుఁడు.** సం.వి.అ.పుం. మరల బలము చేకూరుట కవకాశములేనివాఁడు.

**స్థాపని.** సం.వి.ఈ.స్త్రీ. ౧ చిఱుబొద్దిచెట్టు. ౨ అగురుసాంటి.

**స్థాపనీయము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧ స్థిరము చేయఁదగినది. ౨ బలవర్ధకౌషధములచేఁజికిత్స చేయఁదగినది.

**స్థాపయిత.** సం వి.ఋ.పుం. స్థాపించువాఁడు.

**స్థాపించు.** సం.స.క్రి. స్థాపనముచేయు, నిలుపు.

**స్థాపితము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ నిలుపఁబడినది ౨ నిశ్చయింపబడినది. ౩ రూఢముచేయఁబడినది ౪ నియమింపఁబడినది. ౫ నియోగింపఁబడినది. ౬ పరిణీతము. ౭ దృఢమైనది. ౮ నిశ్చలమైనది.

**స్థాప్యము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ స్థాపింపఁదగినది. ౨ నియోగింపఁదగినది. ౩ నిర్బంధింపఁదగినది. ౪ (దుఃఖాదులను) పాల్పఱుపఁదగినది. వి. అ.న. ధరావత్తు, కుదువ. పుం. దేవతావిగ్రహము.

**స్థామము.** సం.వి.న్.న. ౧ దేహదార్ఢ్యము, బలము. ౨ గుఱ్ఱపు సకిలింపు. ౩ స్థిరత్వము. ౪ స్థానము.

**స్థామనము.** సం.వి.న్.న. శరీరము. (వాచ)

**స్థాయ.** సం.వి.ఆ.స్త్రీ. భూమి.

**స్థాయము.** సం.వి.అ.పుం. పాత్రము.

**స్థాయి.** సం.విణ. (న్.నీ.న్.) ౧ కదలనిది, స్థిరమైనది. ౨ నివసించునది. ౩ మారనిది. వి.న్. పుం. స్థిరమైనభావము (రత్యాదిస్థాయిభావము) న్.న. స్థిరమైన స్థితి.

**స్థాయికుఁడు.** సం.వి.అ.పుం. అధికారి.

**స్థాయిభావము.** సం.వి.అ.పుం. సజాతీయ విజాతీయ భావములచేతఁ దిరస్కరింపఁబడక రససిద్ధిపర్యంతము నిలిచియుండుభావము. (ఈభావములు తొమ్మిది, రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమము.)

**స్థాయుకము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ స్థిరమైనది ౨ ఒకచోట నుంచఁబడినది.

**స్థాయుకుఁడు.** సం.వి.అ.పుం. గ్రామాధికారి.

**స్థాలము.** సం.వి.అ.న. ౧ కంచము, భోజనపాత్రము. ౨ కలిగొట్టుచెట్టు.

**స్థాలి.** సం.వి.ఈ.స్త్రీ. ౧ వంటపాత్రము, లోవి. (శ.ర.) ౨ కలిగొట్టుచెట్టు.

**స్థాలిక.** సం.వి.ఆ.స్త్రీ. స్థాలము.

**స్థాలీపాకము.** సం.వి.అ.పుం. ౧ పాకయజ్ఞవిశేషము. ౨ వివాహకాలమున దంపతులచేఁజేయింపబడునొక కర్మము.

**స్థాలీపులాకము.** సం.వి.అ.పుం. వంటగిన్నెయందలి యన్నపు మెతుకు.

**స్థాలీబిలము.** సం.వి.అ.న. నీళ్లుకాచుబానయందలి లోపలి భాగము.

**స్థాలీబిలీయ (ల్య) ము.** సం.విణ. (అ.ఆ.అ.) వండుటకు యోగ్యమైనది.

**స్థావరము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ స్థిరమైనది, కదలనిది. ౨ జడమైనది. ౩ సుస్థాపితమైనది. వి.అ.పుం. ౧ స్థిరమైనయాస్తి. ౨. స్థూల శరీరము. న. ౧ కులధనము ౨ వింటినారి. ౩ వింటినారిని చెవిదాకలాగుట. ౪ జడపదార్థము. ౫ తోలునారి.

**స్థావరాది.** సం.వి.ఇ.న. ఒకవిధమైన విషము.

**స్థావిరము.** సం.వి.అ.న. ముసలితనము.

**స్థాసకము.** సం.వి.అ.పుం. ౧ చేతనిడినకుంకుమ. ౨ కుంకుమ మొదలగువానిపూఁత. ౩ నీటిబుగ్గ. ౪ తిలకము. ౫ వాసనద్రవ్యములచేత శరీరమును సువాసితము కావించుట. ౬ నీటిబుగ్గవంటి యశ్వాలంకారము.

**స్థాసువు.** సం.వి.ఉ.న. దేహబలము.

**స్థాస్నువు** సం. విణ (ఉ.ఉ.ఉ.) బహుకాలము ముండునది, స్థిరమైనది. వి.ఉ.పుం. చెట్టు.

## స్థి

**స్థిక (క్క) ము.** సం.వి.అ.పుం. పిఱుఁదు.

**స్థితకరణము.** సం.వి.అ.న. రతిబంధ విశేషము.

**స్థితధీ.** సం.వి.ఈ.పుం. స్థిరమనస్కుఁడు, ప్రశాంతచిత్తుఁడు.

**స్థితపాఠ్యము.** సం.వి.అ.న. నిలబడి స్త్రీ కావించు ప్రాకృత పద్య పఠనము.

**స్థితప్రజ్ఞుడు** సం.వి.అ.పుం. ౧ సర్వకామములను విడిచి ఆత్మసంతుష్టుఁడైనవాడు. ౨ ఏవిధమైన భ్రాంతియు లేనివాఁడు.

**స్థితము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ ఉన్నది. ౨ నిలిచియున్నది. ౩ నిశ్చయింపఁబడినది. ౪ ప్రతిజ్ఞ చేయఁబడినది. ౫ నిశ్చలమైనది. వి.అ.న. ౧ రతివిశేషము. ౨ నిశ్చలముగానుండుట. ౩ నిలఁబడు విధము. ౪ సన్మార్గమునందలిపట్టుదల.

**స్థితి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ ఉనికి. ౨ కూర్చుండుట. ౩ మర్యాద. ౪ బ్రతుకు. ౫ సృష్టిస్థితిలయములలో రెండవది. ౬ పొలిమేర. ౭ నిలుకడ. ౮ పరిపాలన. ౯ పరిస్థితి. ౧౦ స్వభావము. ౧౧ సత్ప్రవర్తనము. ౧౨ ఔచిత్యము. ౧౩ ఉదాత్తత్వము. ౧౪ పదవి. ౧౫ సంక్షేమము. ౧౬ నియమము. ౧౭ నిశ్చయము. ౧౮ సీమ. ౧౯ గ్రహణముండుకాలము.

**స్థితిజ్ఞుడు.** సం.వి.అ.పుం. నీతినియమములనెఱుఁగువాఁడు.

**స్థితిపదము.** సం.వి.అ.న. సన్మార్గము.

**స్థితిపదుఁడు.** సం.వి.అ.పుం. విష్ణువు.

**స్థితిభిదుఁడు.** సం. వి. ద్. పుం. నీతినియమములనుల్లంఘించువాఁడు.

**స్థితిమంతము.** సం.విణ. (తా.తీ.త.) ౧ స్థిరత్వము కలిగినది. ౨ శాశ్వతమైనది. ౩ మర్యాదకలది

**స్థితిస్థాపకము.** సం.విణ. (అ.ఆ.అ.) పూర్వస్థితిని గలిగించుశక్తిగలది. వి. అ. న. మరలఁబూర్వస్థితికివచ్చు సామర్థ్యము.

**స్థిర.** సం.వి.ఆ.స్త్రీ. ౧ భూమి ౨ బూరుగుచెట్టు. ౩ ముయ్యాకుపొన్న. ౪ స్థిరచిత్తముగలస్త్రీ.

**స్థిరకుసుమము.** సం.వి.అ.పుం. వకులవృక్షము.

**స్థిరగంధ.** సం.వి.ఆ.స్త్రీ. ౧ మొగలిచెట్టు. ౨ పాటలీపుష్పము.

**స్థిరగంధము.** సం.వి.అ.పుం. చంపకము.

**స్థిరగతి.** సం.వి.ఇ.పుం. శనిగ్రహము.

**స్థిరచక్రుఁడు.** సం. వి. అ. పుం. పూర్వశైన బుద్ధుఁడు.

**స్థిరచ్ఛదము.** సం. వి. అ. పుం. కొండరావిచెట్టు వంటి యొకచెట్టు.

**స్థిరచ్ఛాయము.** సం.వి.అ.పుం. ౧ నమేరువు. ౨ బాటసారులకు నీడనిచ్చు చెట్టు. ౩ చెట్టు.

**స్థిరజీవిత.** సం.వి.ఆ.స్త్రీ. బూరుగుచెట్టు.

**స్థిరతరము.** సం.విణ. (అ.ఆ.అ.) బహుకాలముండునది. వి.అ.పుం. పరబ్రహ్మము.

**స్థిరదంష్ట్రము.** సం.వి.అ.పుం. ౧ పాము. ౨ ఆదివరాహము. ౩ ధ్వని.

**స్థిరపడు.** మి.అ.క్రి. పాదుకొను, నిలువఁద్రొక్కుకొను.

**స్థిరపత్రము.** సం. వి. అ. పుం. బురదనేలలందు మొలచు ఈతచెట్టు.

**స్థిరపఱుచు.** మి.స.క్రి. నిశ్చయముచేయు. (వ్యవ. ఈ సంబంధము స్థిరపఱిచితిమి.)

**స్థిరపుష్పము.** సం.వి.అ.పుం. ౧ చంపకవృక్షము ౨ వకులవృక్షము.

**స్థిరమగు.** మి.అ.క్రి. నిశ్చయమగు.

**స్థిరము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ నిలుకడయైనది. ౨ కదలనిది. ౩ శాశ్వతమైనది. ౪ శాంతమైనది. ౫ ప్రసన్నమైనది. ౬ నిశ్చలవర్తనముగలది. ౭ నిశ్చితమైనది. ౮ కఠినమైనది. ౯ బలమైనది. ౧౦ కఠినహృదయముగలది. వి.అ.పుం. ౧ కొండ ౨ చెట్టు ౩ పరుష పరశేతరమైనవాల్లు ౪ ఎద్దు ౫ మోక్షము. న. స్థిరత్వము; మొండితనము.

**స్థిరయోని.** సం.వి.ఇ.పుం. నీడనిచ్చుచెట్టు.

**స్థిరయౌవనము.** సం. విణ. (అ.ఆ.అ.) నిత్యతారుణ్యముగలది. వి. అ. పుం. దేవయోని విశేషము.

**స్థిరరంగ.** సం.వి.ఆ.స్త్రీ. నీలిమందు.

**స్థిరవాక్కు.** సం.విణ. (చ్.చ్.చ్.) విశ్వసింపఁదగిన పలుకులుగలది.

**స్థిరవారము.** సం.వి.అ.పుం. శనివారము.

**స్థిరసంగరుఁడు.** సం. వి. అ. పుం. వాగ్దానమును నిలుపు వాఁడు, సత్యసంధుఁడు.

**స్థిరాంఘ్రిపము.** సం. వి. అ. పుం. స్థిరపత్రము (వృక్షవిశేషము.)

**స్థిరాయువు.** సం.వి.స్.పుం. బూరుగుచెట్టు. విణ. (స్.స్.స్.) చిరకాలము జీవించువాఁడు.

**స్థిరీకరణము.** సం.వి.అ.న. దృఢపఱుచుట.

**స్థిరీకారము.** సం.వి.అ.పుం. స్థిరీకరణము.

**స్థిరుఁడు.** సం.వి.అ.పుం. ౧ శని. ౨ రాహువు. ౩ శాశ్వతుఁడు. ౪ చపలత్వము లేనివాఁడు. ౫ కార్తికేయుఁడు. ౬ శైవము.

## స్థు

**స్థురి.** సం.వి.న్.పుం. బరువు మోసెడి గుఱ్ఱము లేక ఎద్దు.

## స్థూ

**స్థూణ.** సం.వి.ఆ.స్త్రీ. ౧ వెండి, ఇనుము మొదలగు లోహములచేఁ జేయఁబడిన విగ్రహము. ౨ (ఇంటి) కంబము. ౩ దాగలి.

**స్థూణాకర్ణము.** సం.వి.అ.పుం. ౧ ఒకవిధమైన వ్యూహవిశేషము. ౨ రుద్రుని రూపములలో నొకటి.

**స్థూమము.** సం.వి.అ.పుం. వెలుతురు.

**స్థూముఁడు.** సం.వి.అ.పుం. చంద్రుఁడు.

స్థూరము. సం.వి.అ.పుం. ఎద్దు.

స్థూరి. సం.వి.న్.పుం. బరువులు మోసెడి గుఱ్ఱము లేక ఎద్దు, స్థూరి.

స్థూరీపృష్ఠము. సం.వి.అ.పుం. స్వారిచేయుటకు పయోగింపని గుఱ్ఱము.

స్థూరుఁడు. సం.వి.అ.పుం. మనుష్యుఁడు.

స్థూల. సం.వి.ఆ.స్త్రీ. పెద్దయేలకి.

స్థూలకంటకము. సం.వి.అ.పుం. ములుగోలిమిడి, మొగిబీఱ †.

స్థూలకంటకిక. సం.వి.ఆ.స్త్రీ. బూరుగుచెట్టు.

స్థూలకంఠ. సం.వి.ఆ.స్త్రీ. ఒకవిధమైనవంగ చెట్టు †.

స్థూలకందము. సం.వి.అ.పుం. తినుటకుయోగ్య మైనదుంప, ఎఱ్ఱియుల్లి.

స్థూలకము. సం.విశే. (అ.ఆ.అ.) ౧ పెద్దది. ౨ లావైనది. వి.పుం. తృణవిశేషము, తెల్లు.

స్థూలక్ష్వేడము. సం.వి.అ.పుం. అమ్ము, క్ష్వేడము

స్థూలచాపము. సం.వి.అ.పుం. ప్రత్తిని శుద్ధ పఱచుటకుపయోగించు వింటివంటి సాధనము.

స్థూలతాలము. సం.వి.అ.పుం. స్థిరపత్రము †.

స్థూలనాలము. సం.వి.అ.పుం. లావైనతెల్లు

స్థూలనాసము. సం.విశే. (అ.ఆ.అ.) పెద్దముక్కు కలది. వి.అ.పుం. పంది.

స్థూలనీలము. సం.వి.అ.పుం. డేగ.

స్థూలపట్టము. సం.వి.అ.పుం. ప్రత్తి.

స్థూలపట్టాకము. సం.వి.అ.పుం. ముదుకగుడ్డ, స్థూలపటము.

స్థూలపదము. సం.వి.అ.పుం. ఏనుగు.

స్థూలపరుఁడు. సం. వి. అ. పుం. ఏనుఁగుకాలు గలవాఁడు.

స్థూలపుష్పి. సం.వి.ఈ.స్త్రీ. విష్ణుక్రాంత †.

స్థూలప్రపంచము. సం.వి.అ.పుం. వాస్తవజగత్తు

స్థూలఫలము. సం.వి.అ.పుం. బూరుగచెట్టు.

స్థూలమధ్య. సం.వి.ఆ.స్త్రీ. యవధాన్యము.

స్థూలము. సం.విశే. (అ.ఆ.అ.) ౧ శక్తిమంత మైనది. ౨ దట్టమైనది. ౩ ముదుకరమైనది. ౪ మూర్ఖమైనది. ౫ మొండిది. ౬ సూక్ష్మముకానిది ౭ లావైనది. ౮ తెలివిలేనిది. ౯ బలిసినది. వి. అ.న. ౧ గుడారము. ౨ పర్వతశిఖరము. ౩ పులిసినపాలు లేక పెరుగు. పుం. పనసచెట్టు.

స్థూలమూలము. సం. వి. అ. న. ఒకవిధమైన ముల్లంగి.

స్థూలలక్ష్యుఁడు. సం.వి.అ.పుం. ౧ వదాన్యుఁడు. ౨ బుద్ధిమంతుఁడు. ౩ మేలుకీళ్లను స్మరించువాఁడు. ౪ అశ్రద్ధగా గుఱిచూచువాఁడు.

స్థూలవల్కము. సం. వి. అ. పుం. ఎఱ్ఱలొద్దుగు చెట్టు.

స్థూలవిషయము. సం.వి.అ.పుం. లౌకికవస్తువు.

స్థూలశరీరము. సం.వి.అ.న. వాస్తవదేహము. నశ్వరశరీరము.

స్థూలశాటకము. సం.వి.అ.పుం.న. ౧ దుప్పటి. ౨ ముదుకవస్త్రము.

స్థూలశీర్షిక. సం. వి. ఆ. స్త్రీ. పెద్దతలగలచిన్న చీమ.

స్థూలస్కంధము. సం.వి.అ.పుం. లకుచవృక్షము

స్థూలహస్తము. సం.వి.అ.పుం. ౧ ఏనుఁగుతొం డము. ౨ మొద్దుచేయి.

స్థూలి. సం.వి.న్.పుం. ఒంటె.

స్థూలించు. సం.అ.క్రి. ఒడలుచేయు, బలియు.

స్థూలోచ్ఛ్రయము. సం.వి.అ.పుం. ౧ పర్వతము నుండి పడిన పెద్దఱాయి. ౨ మొటిమ, బొటిమ ౩ అసాకల్యము, లోపము. ౪ అటుతీవ్రమును నిటుమందమునుగాని యేనుఁగుల గమనవిశేషము.

## స్థై

స్థైకము. సం.వి.అ.పుం. వేటపిట్ట.

**స్థేమము.** సం.వి.స్.పుం. స్థిరత్వము.
ఉ....శుంభదలంకరణప్రసాధన, స్థేమయు నప్ర తర్క్యగుణసీమయునైన మదీయకావ్యకన్యా మణి....నిరం. ౧.౧౯. వి.న్.న. దార్ఢ్యము.
శా....వ ,చ్చెంగుంతీసుతమధ్యముండు సమరస్థే మాభిరామంబుగన్. భార.విరా. ౪.౯౫.

**స్థేయము.** సం.విశ. (అ.ఆ.అ.) ౧ స్థిరముచేయఁ దగినది. ౨ నిశ్చయింపఁదగినది. (స్.సీ.స్.) మిక్కిలి స్థిరమైనది, స్థిరతరము.

**స్థేయుఁడు.** సం.వి.అ.పుం. ౧ కులబ్రాహ్మణుఁడు ౨ గురువు. ౩ బ్రహ్మ. ౪ తీర్పరి, మధ్యవర్తి.

**స్థేష్ఠము.** సం.విశ. (అ.ఆ.అ.) స్థిరతమము.

## స్థై

**స్థైర్యజము.** సం.విశ (అ.ఆ.అ.) స్థావరము.

**స్థైర్యము.** సం,వి.అ.న. ౧ స్థిరత్వము; మనోనిశ్చయము. ౨ ఓర్పు. కాఠిన్యము. ౪ జితేంద్రియత్వము. పుం. జాపత్రి.

## స్థౌ

**స్థౌణేయము.** సం.వి.అ.పుం. ౧ గండివనపుచెట్టు ౨ మాచిపత్రి. ౩ గంధద్రవ్యవిశేషము.

**స్థౌరము.** సం.వి.అ.న. ౧ గుఱ్ఱముగాని గాడిదగాని వీపున మోయఁదగినబరువు. ౨ బలము. ౩ స్థిరత్వము.

**స్థౌరి.** సం.వి.న్.పుం. స్థూరి, బరువుమోసెడి గుఱ్ఱము లేక ఎద్దు (రూ) స్థోరి.

**స్థౌలలక్ష్యము.** సం. వి. అ. న. ఔదార్యము, బహుప్రదత్వము.

**స్థౌలి.** = స్థౌరి.

**స్థౌల్యము.** సం.వి.అ.న. ౧ స్థూలభావము, లావు, ౨ బుద్ధిమాంద్యము.

## స్న

**స్నపనము.** సం.వి.అ.న. ౧ నదిమొదలగువానిలో మునిఁగిచేయు స్నానము. ౨ కడుగుట.

**స్నపితము.** సం.విశ. (అ.ఆ.అ.) ౧ స్నానము చేసినది. ౨ కడుగఁబడినది.

**స్నయము.** సం.వి.అ.పుం. ౧ స్నానము. ౨ ప్రోక్షణము.

**స్నవము.** సం.వి.అ.పుం. ౧ కాఱుట. ౨ పరియుట. ౩ స్రవణము.

**స్నస.** సం.వి.ఆ.స్త్రీ. ౧ సన్నపునరము, సిర. ౨ కండరము.

## స్నా

**స్నాత.** సం.వి.ఆ.స్త్రీ. ఋతుస్నానముచేసినస్త్రీ

**స్నాతకవ్రతము.** సం. వి. అ. న. వివాహమునకు ముందు బ్రహ్మచారి విషయమున జరుపఁబడు వ్రత విశేషము. (స్నాతకమని వ్యవహారము.)
సీ. స్వాధ్యాయ మఖిలంబు నభ్యసించియును గుర్వనుమతి స్నాతకవ్రతమొనర్చి. నూత. ౨ అ. ౧౧౫ పా.

**స్నాతకుఁడు.** సం.వి.అ.పుం. ౧ స్నానశీలవ్రతుఁడు. (శ.ర.) క. గురుపూజచేసి వీడ్కొని, యరిగి సమావర్తనార్హుఁడై స్నానంబున్, బొరినొనరిచి వేల్చినయ, ప్పురుషుఁడు నా స్నాతకాఖ్యపూని చరించున్. విజ్ఞా. కాం. ౧.౭౦. ౨ బ్రహ్మచర్యాశ్రమము ముగించినపిదప స్నానవ్రత మాచరించిన బ్రాహ్మణుఁడు. ౩ ఏదేని మతప్రయోజనమునకై భిక్షుకవ్రత మాచరించు బ్రాహ్మణుడు. ౪ గృహస్థాశ్రమము స్వీకరించిన ద్విజుఁడు. ౫ వేదాధ్యయనానంతరము ఆశ్రమాంతరమునకుఁబోక వ్రతయుక్తుఁడై తీర్థస్నానశీలుఁడైన బ్రహ్మచారి.
మత్త. స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును నిష్టుఁడున్, భూతలేశుఁడు సంయుజుండును బూజనీయులు....
భార. సభా. ౨-౪.

స్నాతము, సం. విణ. (అ. ఆ. అ.) స్నానము చేసినది.

స్నాతుఁడు, సం. వి. అ. పుం. ౧ స్నానముచేసిన వాఁడు. ౨ అధ్యయనము పూర్తిగావించిన వాఁడు.

స్నాత్రము, సం.వి.అ.న. స్నానము.

స్నానతీర్థము, సం. వి. అ. న. పవిత్రమైనస్నాన ఘట్టము.

స్నానతృణము, సం.వి.అ.న. దర్భ.

స్నానము, సం. వి. అ. న. ౧ నీరుపోసికొనుట. ౨ నీటిలోమునుఁగుట. ౩ స్నానయోగ్యమైన-జలము. ౪ నలుగుపిండి. ౫ విగ్రహములను స్నానముచేయించుట. ౬ క్షాళనముచేయుట.

స్నానయాత్ర, సం. వి. ఆ. స్త్రీ. జ్యేష్ఠపూర్ణిమ నాఁడు జరుగునుత్సవము.

స్నానవిధి, సం. వి. ఇ. పుం. ౧ స్నానక్రియ. ౨ స్నానముచేయుటకు యోగ్యమైనవిధానము.

స్నానీయము, సం. విణ. (అ.ఆ.అ.) స్నానము చేయుటకుఁదగినది; స్నానముచేయునపుడు ధరిం చునది. వి.అ.న.౧. నలుగుపిండి మొ॥. ౨ స్నానయోగ్యమైనజలము.

స్నాపకుఁడు, సం.వి.అ.పుం. స్నానముచేయించు వాఁడు.

స్నాపనము, సం.వి.అ.న. స్నానముచేయించుట.

స్నాపితము, సం. విణ. (అ. ఆ. అ.) స్నానము చేయింపఁబడినది.

స్నాయుకము, సం.వి.అ.పుం. స్నాయువు.

స్నాయుబంధము, సం.వి.అ.పుం. వింటినారి.

స్నాయువు, సం.వి.ఉ.పుం. ౧ స్నస, సన్ననరము ౨ వింటినారి.

స్నాయుస్పందనము, సం.వి.అ.న. నాడి.

స్నాయ్వర్మము, సం. వి. న్. న. ఒకవిధమైన కంటిజబ్బు.

స్నావము, సం. వి. అ. పుం. ౧ సన్నపునరము. ౨ కండరము.

స్నావిరము, సం.విణ. (అ.ఆ.అ.) కండరము లతోఁ గూడినది.

## స్ని

స్నిగ్ధ (ము), సం. వి. ఆ. స్త్రీ. మజ్జ. అ.న. ౧ నూనె. ౨ మైనము. ౩ కాంతి. ౪ చిక్కఁదనము ౫ పునుఁగు. పుం. ఎఱ్ఱయాముదపుఁజెట్టు.

స్నిగ్ధతండులము, సం.వి.అ.పుం. త్వరలోఁబంట కు వచ్చు నొకవిధమైన వరిధాన్యము.

స్నిగ్ధపత్ర(ము), సం.వి.ఆ.స్త్రీ. అ.పుం. రేఁగు చెట్టు ǂ.

స్నిగ్ధపల్లవము, సం.వి.అ.పుం. నీరు నేరేడు.

స్నిగ్ధఫల, సం.వి.ఆ.స్త్రీ. ఒకవిధమైన మొక్క (ముంగూసబేవ్) ǂ.

స్నిగ్ధము, సం.విణ. (అ.ఆ.అ.) ౧ స్నేహము గలది. ౨ చిక్కనగలది. ౩ నునుపుగలది. ౪ చెమురుగలది. ౫ అంటుకొను స్వభావముగలది. ౬ ఉజ్జ్వలమైనది. ౭ చల్లనిది, తడితోఁగూడినది. ౮ దయతోఁగూడినది, ౯ అందమైనది. ౧౦ స్థిరమైనది.

స్నిగ్ధవృంత, సం.వి.ఆ.స్త్రీ. కమ్మరాకుతీఁగె ǂ.

స్నిగ్ధవృక్షము, సం.వి.అ.పుం. నల్లమామిడి.

స్నిగ్ధుఁడు, సం.వి.అ.పుం. స్నేహితుఁడు.

## స్ను

స్నుక్కు, సం.వి.హ్. స్త్రీ. స్నుహి, జెముడు ǂ.

స్నుక్ఛిన్నిక, సం.వి.ఆ.స్త్రీ. క్షారము.

స్నుతము. సం.విణ. (అ.ఆ.అ.) స్రవించినది, కాఱినది.

స్నువు. సం.వి.ఉ.పుం.న. కొండకొత్తము, సానువు ఊ.స్త్రీ. సన్నపునరము.

స్నుష. సం.వి.ఆ.స్త్రీ. ౧ కోడలు. ౨ పెండ్లికూతురు.

స్నుహా. సం.వి.ఆ.స్త్రీ. స్నుక్కు, జెముడు †.

స్నుహి. సం.వి.ఈ.స్త్రీ. స్నుహా, జెముడు †.

## స్నే

స్నేహకేసరి. సం.వి.న్.పుం. ఆముదము.

స్నేహనము సం. వి. అ. న. ౧ తలయంటుట. ౨ పరిమళతైలాదులచే శరీరమును రుద్దుట. ౩ తైలము.

స్నేహపాత్రిము. సం.వి.అ.న. ౧ తైలపాత్రము ౨ పెద్దసిద్దె, బాణలి, ప్రమిదమున్నగునది.

స్నేహప్రియము. సం.వి.అ.పుం. దీపము.

స్నేహబీజము. సం.వి.అ.పుం. ౧ ప్రియాలవృక్షము. ౨ మోరటివృక్షము.

స్నేహభువు. సం.వి.ఊ.పుం. శ్లేష్మము.

స్నేహభూమి. సం.వి.ఇ.స్త్రీ. ౧ నూనెనొసంగునది. ౨ స్నేహపాత్రము.

స్నేహము. సం.వి అ.పుం. ౧ నేస్తము, ప్రేమ; దయ. ౨ అనురక్తి. ౩ నూనె, నేయి మున్నగు చమురు పదార్థము. ౪ జిడ్డుపదార్థము. ౫ వీర్యము వంటి శరీరజమైనద్రవము. ౬ వైశేషికుల సిద్ధాంతమునుబట్టి యిరువది నాలుగు గుణములలో నొకటి.

స్నేహరంగము. సం.వి.అ.పుం. నువ్వులు.

స్నేహరసనము. సం.వి.అ.న. నోరు.

స్నేహరేకభువు. సం.వి.ఊ.పుం. చంద్రుఁడు.

స్నేహలము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ ఆసక్తిగలది ౨ లలితమైనది.

స్నేహవరము. సం.వి.అ.న. క్రొవ్వు.

స్నేహవస్తి. సం.వి.ఇ.స్త్రీ. నూనెను శరీరములోనికిఁబంపుట.

స్నేహవిద్ధము. సం.వి.అ.పుం. దేవదారువృక్షము

స్నేహవ్యక్తి. సం. వి. ఇ. స్త్రీ. ప్రేమవ్యక్తీకరణము.

స్నేహోక్తము. సం.విణ. (అ.ఆ.అ.) చమురుతోఁ బూయఁబడినది.

స్నేహాశయము. సం.వి.అ.పుం. దీపము.

స్నేహి. సం.విణ. (న్.న్.న్.) ౧ ప్రేమగలది. ౨ చమురుగలది. వి.న్.పుం. ౧ స్నేహితుఁడు. ౨ తలయంటువాఁడు.

స్నేహించు. సం. అ. క్రి. ౧ పొత్తుచేయు. ౨ మరగు.

స్నేహితము. సం.విణ. (అ.ఆ.అ) ౧ చెలిమిగలది; దయగలది. ౨ చమురుగలది.

స్నేహితుఁడు. సం. వి. అ. పుం. నెయ్యుఁడు; చెలికాఁడు.

స్నేహితురాలు. మి.విణ. సఖి.

స్నేహువు. సం. వి. ఉ. పుం. ౧ చంద్రుఁడు. ౨ స్నేహితుఁడు. ౩ ఒకవిధమైనరోగము.

## స్నై

స్నైగ్ధ్యము. సం. వి. అ. న. ౧ స్నిగ్ధభావము. ౨ స్నేహము. ౩ మృదుత్వము.

## స్ప

స్పందనము. సం.వి.అ.న. స్పందము, గర్భమున శిశువు కదలుట.

స్పందము. సం.వి.అ.పుం. ౧ ఇంచుక కదలుట. ౨ అదరుట.

స్పందితము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ అదిరినది. ౨ వెడలినది. వి.అ.న. ౧ అదరుట. ౨ కంపము ౩ మనోవ్యాపారము.

స్పందోలిక. సం.వి.ఆ.స్త్రీ. ౧ ముందునకు వెనుకకు నూగుట. ౨ ఊయలపై నూగుట, క్రీడావిశేషము.

స్పరిశము. సం.వి.అ.పుం. స్పర్శము.

స్పర్ధ. సం. వి. ఆ. స్త్రీ. ౧ పంతము; పోటి. ౨ అసూయ, చూపోపనితనము. ౩ సాదృశ్యము. ౪ క్రమాన్నత్యము. ౫ పరునిఁబరిభవించుట యందిచ్ఛ.

స్పర్ధాళువు. సం. విణ. (ఉ.ఉ.ఉ.) స్పర్ధగలవాఁడు.

స్పర్ధించు. సం.స.క్రి. ౧ చర్చచేయు. అ. క్రి. పోటిపడు.

స్పర్ధి. సం.విణ. (న్. నీ. న్.) ౧ పోటిపడునది. ౨ అసూయవహించునది. ౩ గర్వముతోఁగూడునది. వి.న్.పుం. ౧ ప్రత్యర్థి. ౨ సమానుఁడు.

స్పర్ధితము. సం.విణ. (అ.ఆ.అ.) పోటిపడునది.

స్పర్ధ్యము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ కోరఁదగినది. ౨ విలువగలది.

స్పర్శ. సం.వి.ఆ.స్త్రీ. అసతి.

స్పర్శనకము. సం.వి.అ.న. చర్మము. (సాంఖ్యసిద్ధాంతము.)

స్పర్శనము. సం.వి.అ.న. ౧ స్పర్శేంద్రియము. ౨ తాఁకుడు. ౩ దానము. ౪ కానుక. వి.అ.పుం. ౧ వాయువు. ౨ తపింపఁజేయురోగము.

క. పరకాంతాముఖదోషా, కరకాంతిస్పర్శనమునఁ గడు మొగుడుచు నా, ధరణీసుర
నేత్రంబులు, సరసీజములన్న మాట సహజము గాదే. నిరం. ౧.౫౮.

విణ. (అ.ఆ.అ.) స్పృశించునది.

స్పర్శమణి. సం.వి.ఇ.పుం. ౧ పరుసవేది, స్పర్శోపలము. ౨ చింతామణి ౩ స్పర్శమణిప్రభావము. వి.ఇ.న. బంగారము.

స్పర్శము. సం. వి. అ. పుం. ౧ సంఘర్షము. ౨ స్పర్శజ్ఞానము. ౩ తాఁకుడు. ౪ ప్రభావము. ౫ త్యాగము, ఈవి. ౬ తపింపఁజేయువ్యాధి. ౭ ఆకాశము. ౮ ఇంద్రియములచేత నఖిలషింపబడు విషయము. ౯ కానుక. ౧౦ వాయువు. ౧౧ సంగమము. ౧౨ వర్గాక్షరము. (క మొదలు మ వఱకు.)

స్పర్శలజ్జ. సం.వి.ఆ.స్త్రీ. స్పర్శసంకోచపర్ణిక, అత్తపత్తిచెట్టు

స్పర్శవేది. సం.వి.న్.పుం. పరుసవేది.

స్పర్శసంచారి. సం.విణ. (న్.నీ.న్.) సాంక్రామికము.

స్పర్శస్నానము. సం.వి.అ.న. గ్రహణస్నానము.

స్పర్శస్పందము, స్పర్శస్యందము. సం.వి.అ.పుం. కప్ప.

స్పర్శికము. సం.విణ. (అ.ఆ.అ.) స్పర్శవేద్యమైనది. తాకుటవలనఁదెలియునది.

స్పర్శితము. సం.విణ. (అ.ఆ.అ.) ఈయఁబడినది.

స్పశము. సం.వి.అ.పుం. యుద్ధము.

స్పశించు. స.క్రి. ౧ అడ్డగించు, ౨ నిర్వహించు. ౩ చేర్చు. ౪ తాఁకు. ౫ చూచు. ౬ పరిశీలించు.

స్పశుఁడు. సం.వి.అ.పుం. ౧ గూఢచారి, వేగు. ౨ వన్యమృగములతోఁబోరాడువాఁడు.

స్పష్టము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ వెల్లడియైనది. ౨ ప్రత్యక్షమైనది. ౩ వాస్తవమైనది. ౪ స్ఫుటమైనది.

స్పష్టీకరణము. సం.వి.అ.న. తెలియఁజెప్పుట.

స్పష్టీకరించు. సం.స.క్రి. తెలియఁజెప్పు.

స్పష్టీకృతి. సం.వి.ఇ.స్త్రీ. ౧ స్పష్టీకరణము ౨ సరిచేయుట.

## స్పృ

**స్పృక్క.** సం. వి. ఆ. స్త్రీ. ౧ పక్కచెట్టు. ౨ లఘువు]. 3 వధువు. ౪ గంధద్రవ్య విశేషము

**స్పృక్కు.** సం.విణ. (క్.క్.క్.) ౧ తాఁకునది. ౨ చొచ్చుకొనిపోవునది. (ఇది సమాసాంతము లందే కానఁబడును. మర్మస్పృక్కు, హృది స్పృక్కు మొ॥)

**స్పృశము.** సం.వి.అ.పుం. తాఁకుడు.

**స్పృశి.** సం.వి.ఈ.స్త్రీ. వాఁకుడు చెట్టు.

**స్పృశించు.** సం. స. క్రి. ౧ అంటు, తాఁకు. ౨ నీటితోఁగడుగు.

**స్పృశుఁడు.** సం. వి. అ. పుం. స్పశుఁడు, వేగుల వాడు.

**స్పృశ్యము.** సం.విణ. (అ.ఆ.అ.) స్పృశింపఁ దగినది.

**స్పృష్ట=స్పృష్టి.** సం.వి.ఋ.పుం. తపింపఁజేయు రోగము. విణ. (ఋ.స్త్రీ.ఋ.) స్పృశించునది, తాఁకునది.

**స్పృష్టకము.** సం. వి. అ. న. యాదృచ్ఛికమైన యాలింగనము.

**స్పృష్టకాండుఁడు.** సం.వి.అ.పుం. శస్త్రాజీవుఁడు

**స్పృష్టపూర్వము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧ పూర్వానుభూతమైనది. ౨ పూర్వము స్పృశింపఁబడినది.

**స్పృష్టము.** సం.విణ (అ.ఆ.అ.) ౧ స్పృశింపఁబడినది. ౨ అపవిత్రము చేయఁబడినది. 3 స్థాన కరణముల సంపూర్ణస్పర్శచే నుత్పన్నమైన వర్గాక్షరము. వి.అ.న. తాఁకుడు, స్పర్శము.

**స్పృష్టాస్పృష్టము=స్పృష్టాస్పృష్టి.** సం.వి.అ. న. ఒండొరులను దాఁకుట.

**స్పృష్టి.** సం.వి.ఇ.స్త్రీ. తాఁకుడు, సంపర్కము.

**స్పృహ.** సం.వి.ఆ.స్త్రీ. ౧ ఇచ్ఛ; గాఢమైన కోరిక. ౨ జ్ఞప్తి. 3 అనూయ.

**స్పృహణము.** సం.వి.అ.న. కోరుట.

**స్పృహణీయము.** సం.విణ. (అ.ఆ.అ.) కోరఁ దగినది.

**స్పృహయాళువు.** సం.విణ. (ఉ.ఉ.ఉ.) కోరు వాఁడు.

**స్పృహాళువు=స్పృహయాళువు.**

**స్పృహ్యము.** సం.విణ.(అ.ఆ.అ.) కోరఁదగినది. వి.అ.పుం. మాదీఫలము.

## స్ఫ

**స్ఫట.** సం.వి.ఆ.స్త్రీ. ౧ పటిక. ౨ పాముపడగ.

**స్ఫటము.** సం.వి.అ.పుం. పాముపడగ.

**స్ఫటి.** సం.వి.న్.పుం. పాము. ఈ. స్త్రీ. పటిక.

**స్ఫటిక.** సం.వి.ఆ.స్త్రీ. ౧ పటిక ౨ కర్పూరము.

**స్ఫటికము.** సం.వి.అ.పుం. పటికపురాయి.

**స్ఫటికాచలము.** సం.వి.అ.పుం. ౧ మేరుపర్వతము. ౨ కైలాసగిరి.

**స్ఫటికాభ్రము.** సం.వి.అ.పుం. కర్పూరము.

**స్ఫటికారి.** సం.వి.అ.పుం. ఒకరసాయనపదార్థము (అల్యూమినాసల్ఫేట్)

**స్ఫటికి.** సం.వి.ఈ.స్త్రీ. పటిక.

**స్ఫటితము.** సం.విణ. (అ.ఆ.అ.) చీల్చఁబడినది.

**స్ఫగ (క) ము.** సం.వి.అ.పుం. డాలు.

**స్ఫరణము.** సం.వి.అ.న. ౧ అదరుట. ౨ వణఁకు.

## స్ఫా

**స్ఫాటకము.** సం. వి. అ. పుం. జలబిందువు. న. పటికపురాయి.

**స్ఫాటికము.** సం.విణ. (అ.ఈ.అ.) ౧ స్ఫటిక సంబంధమైనది. ౨ నిర్మలమైనది. వి.అ.న. ౧ పటిక. ౨ ఒకవిధమైన చందనము.

**స్ఫాటికి.** సం.వి.ఈ.స్త్రీ. పటిక.

**స్ఫాటితము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ బ్రద్దలు చేయఁబడినది. ౨ విస్తరింపఁజేయఁబడినది.

**స్ఫాతము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ పెరిగినది. ౨ ఉబ్బినది.

**స్ఫాతి.** సం.వి.ఇ. స్త్రీ. ౧ వృద్ధి. ౨ ఉబ్బుట.

**స్ఫారణము.** సం.వి.అ.న. ౧ వణఁకుట. ౨ అదరుట.

**స్ఫారము.** సం.వి.అ.పుం. ౧ వంకర. ౨ వృద్ధి ౩ చలనము. ౪ కంపము. ౫ ఇత్తడి మున్నగువానితోఁజేయఁబడిన బుడగల రూపమునను న్నయాభరణము. ౬ వీచి, తరఁగ. ౭ టంకారము. ౮ బంగారములోనగువాని ఘుటిక. న. సమ్యగ్విశే. (అ. ఆ. అ.) ౧ అధికమైనది, పెద్దది. విస్తృతమైనది.

**స్ఫారితము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ తెలుపఁబడినది. ౨ వెడలైనది.

**స్ఫాలనము.** సం.వి.అ.న. ౧ కదలిక. ౨ వణఁకుట ౩ చలింపఁజేయుట. ౪ రాపిడి. ౫ గుఱ్ఱము మొదలగువానిని దట్టుట.

## స్ఫి

**స్ఫిక్కు.** సం.వి.చ్. స్త్రీ. పిఱుఁదులయుబ్బలి.

**స్ఫిచ(జ)ము.** సం.వి.ఆ.స్త్రీ. స్ఫిక్కు.

**స్ఫితము**=స్ఫీతము.

**స్ఫిరము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ అధికమైనది. ౨ విస్తృతమైనది. ౩ అసంఖ్యాకమైనది.

## స్ఫీ

**స్ఫీతము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ విస్తారమైనది; వ్యాపించినది. ౨ స్వచ్ఛమైనది.

## స్ఫు

**స్ఫుటిత.** సం. వి. ఆ. స్త్రీ. ౧ నక్షత్రభేదము.

**స్ఫుటనము.** సం.వి.అ.న. ౧ భేదించుట. ౨ వికసించుట. ౩ సంధులు సడలుట.

**స్ఫుటము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ స్పష్టమైనది. ౨ వికసించినది. ౩ ప్రకటమైనది. ౪ వ్యాపించినది. ౫ తెల్లనిది. ౬ నిర్మలము. ౭ విదితము. ౮ అసామాన్యము. వి.అ.పుం.ఆ.స్త్రీ. విప్పఁబడినపాముపడగ.

**స్ఫుటి.** సం.వి.ఈ.స్త్రీ.ఇ.పుం. ౧ పండిపగిలిన దోసకాయ. ౨ కాళ్ళచర్మము పగులుట.

**స్ఫుటిక.** సం.వి.ఆ.స్త్రీ. ౧ పగిలినముక్క. ౨ పలుచని తునుక.

**స్ఫుటితము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ వికసించినది ౨ భేదింపఁబడినది. ౩ స్పష్టముచేయఁబడినది. ౪ పరిహసింపఁబడినది. వి.అ.న. చుంబనక్రియావిశేషము.

**స్ఫుటీకరణము.** సం.వి.అ.న. ౧ స్పష్టపఱచుట. ౨ సరిద్దు.

**స్ఫురణ.** సం.వి.ఆ.స్త్రీ. ౧ ప్రకాశము. ౨ అదరుట. ౩ ప్రత్యక్షమగుట. ౪ జ్ఞప్తికి వచ్చుట.

క. హారాలు సుదర్శనాదికములు, పరిపాలిత సురా
సహాయులు బహుశ్రీ. స్ఫురణా
పరిణాహంబులు, ఘనపుజాలు భాగ్యవాణి
బోలుంబాలన్. నా. ౨-౨౬.

**స్ఫురణము.** సం.వి.అ.న. ౧ తోఁచుట. ౨ అదరుట. ౩ ప్రకాశించుట. ౪ ప్రత్యక్షమగుట.

**స్ఫురము.** సం.వి.అ.పుం. ౧ అదరుట. ౨ ఉబ్బుట. ౩ కంపించుట. ౪ డాలు.

**స్ఫురించు.** సం.అ.క్రి. ౧ అదరు. ౨ తోఁచు. ౩ అదురుపుట్టించు. ౪ ప్రకాశించు. ౫ ప్రత్యక్షమగు.

**స్ఫురితము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ ప్రకాశించునది. ౨ అదిరినది. ౩. తోఁచినది. ౪ ఉబ్బినది. వి.అ.న. ౧ కంపము. ౨ అదరుట. ౩ మనఃక్షోభము. ౪ ప్రకాశము. ౫ చుంబనక్రియావిశేషము. ౬ రతిబంధవిశేషము. ౭ గమకవిశేషము.

**స్ఫులనము.** సం.వి.అ.న. ౧ అదరుట. ౨ కంపించుట.

స్ఫాంవము. సం.వి.అ.న. శిబిరము; డేరా.

స్ఫులింగము. సం. వి. అ. పుం. అగ్నికణము, మిణుఁగురు.

స్ఫులింగలక్ష్మి. సం.వి.ఈ.స్త్రీ. తంత్రవిశేషము

స్ఫులింగిని. సం.వి.ఈ.స్త్రీ. అగ్నిసప్తజిహ్వలలో నొకటి.

## స్ఫూ

స్ఫూర్జ. సం.వి.ఆ.స్త్రీ. ఉఱుము, మేఘధ్వని.

స్ఫూర్జకము. సం.వి.అ.పుం. నల్లతుమ్మికచెట్టు

స్ఫూర్జథువు=స్ఫుర్జథువు. సం. వి. ఉ. పుం. ౧ ఉఱుము. ౨ వజ్రధ్వని, పిడుగుచప్పుడు.

స్ఫూర్జనము. సం.వి.అ.న. గర్జించుట, ప్రేలుట.

స్ఫూర్జము. సం.వి.అ.పుం. ౧ ఉఱుము. ౨ వజ్రము. ౩ భయసంతోషములతోఁగూడిన నాయికానాయకుల ప్రథమ సమావేశము.

స్ఫూర్జితము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ ప్రకాశించినది. ౨ విడివడినది. వి.అ.న. ౧ పిడుగు, ౨ ఘళఘళధ్వని.

స్ఫూర్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧ కవితావేశము. ౨ అదరుట. ౩ తోఁచుట. ౪ ప్రకాశము. ౫ తళుకు. ౬ వదరుట.

స్ఫూర్తిమంతుఁడు. సం. వి. త. పుం. ౧ శివభక్తుఁడు. ౨ పాశుపతుఁడు. విణ. (త.తీ.త.) స్ఫూర్తిగలది.

## స్ఫే

స్ఫేయము. సం.విణ. (స.సీ.స.) మిక్కిలియధికమైనది.

స్ఫేష్ఠము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ మిక్కిలియధికమైనది. ౨ మిక్కిలి దృఢమైనది.

## స్ఫో

స్ఫోట. సం.వి.ఆ.స్త్రీ. విప్పఁబడిన పాముపడగ.

స్ఫోటకము. సం.వి.అ.పుం. ౧ బొబ్బరోగము. ౨ మసూరి,అమ్మవారిజబ్బు. ౩ వాఁపు; కురుపు; కంతి.

స్ఫోటకరము, స్ఫోటబీజకము, సం. వి. అ. పుం. నల్లజీడిచెట్టు.

స్ఫోటనము=సం.వి.అ.పుం.సన్నిహితముగానున్న హల్లులను వేఱువేఱుగాఁబలుకుట. న. ౧ చీల్చుట. ౨ బ్రద్దలగుట. ౩ ధాన్యమును తూర్పారఁబట్టుట; చెరుగుట.

స్ఫోటబీజకము=స్ఫోటకరము.

స్ఫోటము. సం.వి.అ.పుం. ౧ భేదిల్లుట. ౨ నీటిబుగ్గ. ౩ వివృతమగుట. ౪ వాచుట. ౫ ఏదైన ధ్వనిని వినునపుడు మనమున స్ఫురించుభావము. (బుధైః వైయాకరణైః ప్రధానభూతస్ఫోటరూపవ్యంగ్య వ్యంజకస్య శబ్దస్యధ్వనిరితి వ్యవహారః కృతః. కావ్య ప్ర) ౬ మీమాంసకులు గ్రహించు నిత్యధ్వని.

స్ఫోటని. సం.వి.ఈ.స్త్రీ. బరమా, రంధ్రముచేయు సాధనము.

స్ఫోటశోఫ. సం.వి.ఆ.స్త్రీ. జీడి; నల్లజీడి.

స్ఫోటించు. సం.స.క్రి. ౧ భేదించు. ౨ పొడుచు. ౩ పెల్లగించు.

స్ఫోటిక. సం.వి.ఆ.స్త్రీ. ఒకవిధమైన పక్షి.

స్ఫోరకము. సం.విణ. (అ.ఆ.అ.) స్ఫురింపఁజేయునది, జ్ఞప్తికిదెచ్చునది.

స్ఫోరణము. సం.వి.అ.న. స్ఫురణము.

## స్ఫ్య

స్ఫ్యము. సం.వి.అ.పుం. ౧ యజ్ఞములలో నుపయోగింపఁబడు ఖడ్గాకారముగల సాధనము. ౨ పడవనడుపు తెడ్డు.

## స్మ

స్మయదానము. సం.వి.అ.న. ఆడంబరముతోఁ గూడిన దానము.

స్మయనము. సం.వి.అ.న. నవ్వు.

స్మయమానము. సం.విణ. (అ.ఆ.అ.) ఆశ్చర్యము పొందునట్టిది.

స్మయము. సం.వి.అ.పుం. ౧ గర్వము. ౨ ఆశ్చర్యము.

స్మరకథ. సం. వి. ఆ. స్త్రీ. కామినీకాముకుల ప్రలాపము.

స్మరకూపము. సం.వి.అ.పుం.న. ఆఁడుగుఱి.

స్మరగురువు. సం.వి.ఉ.పుం. విష్ణువు.

స్మరచక్రము=స్మరచంద్రము. సం. వి. అ. పుం. ఉత్తానకరణబంధ విశేషము.

స్మరణపదవి. సం.వి.ఈ.స్త్రీ. మృత్యువు.

స్మరణము. సం.వి.అ.న. ౧ తలఁపు. ౨ జ్ఞప్తి, తెలివి. 3 ఒక ధ్యర్త్యంగము. ౪ సంప్రదాయము ౫ దేవతానామమును లోన జపించుట. ౬ ఒకానొక యర్థాలంకారము.

స్మరణాపత్యతర్పకము. సం.వి.అ.పుం. తలంపు చేతనే తన సంతతికి తృప్తిని గలిగించునది, తాఁబేలు.

స్మరణి. సం.వి.ఈ.స్త్రీ. రుద్రాక్షమాల.

స్మరణీయము=స్మర్తవ్యము.సం.విణ.(అ.ఆ.అ.) స్మరింపఁదగినది.

స్మరదీపిక. సం.వి.ఆ.స్త్రీ. జారిణి.

స్మరధ్వజ. సం.వి.ఆ.స్త్రీ. వెన్నెలరాత్రి.

స్మరధ్వజము. సం. వి. అ. పుం. ౧ మగగుఱి. ౨ ఒకవిధమైన చేప. 3 వాద్యవిశేషము. న. ఆఁడుగుఱి.

స్మరప్రియ. సం.వి.ఆ.స్త్రీ. రతిదేవి.

స్మరము. సం.వి.అ.పుం. ౧ స్మృతి. ౨ ప్రేమ. 3 వృశ్చికము.

స్మరలేఖని. సం.వి.ఈ.స్త్రీ. శారిక.

స్మరలేఖము. సం.వి.అ.పుం. ప్రణయలేఖ.

స్మరవల్లభుఁడు. సం.వి.అ.పుం. ౧ అనిరుద్ధుఁడు. ౨ వసంతుఁడు.

స్మరశాసనుఁడు. సం.వి.అ.పుం. స్మరహరుఁడు, పరమేశ్వరుడు.

స్మరశాస్త్రము. సం.వి.అ.న. కామశాస్త్రము.

స్మరసఖుఁడు. సం.వి.అ.పుం. ౧ చంద్రుఁడు. ౨ వసంతుఁడు.

స్మరస్మర్యము. సం.వి.అ.పుం. గాడిద.

స్మరాంకుశము. సం.వి.అ.పుం. గోరు.

స్మరాంకుశుఁడు. సం.వి.అ.పుం. కాముకుఁడు.

స్మరాధివాసము. సం.వి. అ.పుం. అశోకము[?].

స్మరాసవము. సం.వి.అ.పుం. లాలాజలము.

స్మరించు. సం.స.క్రి. తలఁచు, స్మరణముచేయు.

స్మరుఁడు. సం.వి.అ.పుం. మన్మథుఁడు.

స్మరోపకారము. సం.వి.అ.న. శృంగారసాధనము (సుగంధ ద్రవ్యాది.)

స్మర్త. సం.వి.ఋ.పుం. ౧ గురువు. ౨ స్మరించునట్టివాఁడు.

స్మర్తవ్యము=స్మరణీయము.

స్మర్యము=స్మర్తవ్యము.

## స్మా

స్మాయము. సం.వి.అ.పుం. మందహాసము, చిఱునవ్వు.

స్మారకము. సం.విణ. (అ.ఆ.అ.) స్మరింపఁజేయునది, జ్ఞప్తికిఁదెచ్చునది. వి. అ. న. స్మృతిచిహ్నము.

స్మారణము. సం.వి.అ.న. ౧ స్మరింపఁజేయుట. ౨ గణించుట.

స్మారము. సం.వి.అ.న. స్మృతి.

స్మారితుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) సాక్షి.

స్మార్తకాలము. సం.వి.అ.పుం. జ్ఞాపకముంచుకొనుటకుఁ దగిన కాలము. (ఒక శతాబ్దము)

**స్మార్తము.** సం.వి.అ.న. స్మృత్యుక్తకర్మము. విశే. (అ.ఆ.అ.) ౧ స్మృతిసంబంధమైనది. ౨ స్మృతిగ్రంథములలోఁ జెప్పఁబడినది. ౩ న్యాయబద్ధమైనది.

**స్మార్తికము.** సం.విశే. (అ.ఆ.అ.) సంప్రదాయసిద్ధమైనది.

**స్మార్తుఁడు.** సం.వి.అ.పుం. ౧ స్మృతులయందుఁ బండితుఁడైన బ్రాహ్మణుఁడు. ౨ స్మృతి సంప్రదాయములను అనుసరించువాఁడు.

## స్మి

**స్మితము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ నవ్వినది. ౨ వికసించినది. వి.అ.న. అధరమునందు మాత్రము ప్రకాశించెడు చిఱునవ్వు.

**స్మితి.** సం.వి.ఇ.స్త్రీ. స్మితము.

## స్మృ

**స్మృతము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ అభిప్రేతము ౨ స్మరింపఁబడినది. ౩ విధింపఁబడినది. వి.అ.న. స్మరణము, జ్ఞప్తి.

**స్మృతి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ తలఁపు. ౨ ధర్మశాస్త్రము. ౩ బుద్ధి. ౪ అలంకార విశేషము, స్మరణము. ౫ ఎఱుక. ౬ ఒక సంచారిభావము ౭ జ్ఞాపకము ౮ అభిలాష.

**స్మృతిజాతుఁడు.** సం.వి.అ.పుం. మన్మథుఁడు.

**స్మృతిపాఠకుఁడు.** సం.వి.అ.పుం. ధర్మశాస్త్రమును జదివినవాఁడు, న్యాయవాది.

**స్మృతిమంతుఁడు.** సం.విశే. (త్.తీ.త్.) స్మృతి కలది. పుం. ౧ విచక్షణుఁడు, న్యాయశాస్త్రనిపుణుడు. ౨ పూర్వజన్మకథ నెఱుగువాడు

**స్మృతివినయము.** సం.వి.అ.పుం. స్వధర్మమును జ్ఞప్తికిఁ దెచ్చుచుఁ జేయు మందలింపు.

**స్మృతివిభ్రమము.** సం.వి.అ.పుం. జ్ఞాపకశక్తియందలి కలఁత.

**స్మృతివిరుద్ధము.** సం.విశే. (అ.ఆ.అ.) న్యాయవ్యతిరిక్తము.

**స్మృతిశేషుఁడు.** సం. వి. అ. పుం. మృతినందిన వాఁడు.

## స్మే

**స్మేరము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ వికసించినది. ౨ కొంచెముగా నవ్వినది. ౩ గర్వించినది. వి.అ. పుం. చిఱునవ్వు.

**స్మేరవిష్కిరము.** సం.వి.అ.పుం. నెమిలి.

## స్య

**స్యందనము.** సం.వి.అ.న. ౧ కాఱుట ౨ త్వరగాఁ బ్రవహించునీరు. పుం. ౧ తినిశవృక్షము. ౨ యుద్ధరథము. ౩ వాయువు. విశే. (అ.ఆ.(ఈ) అ.) త్వరగాఁబోవునది.

**స్యందనారోహుఁడు.** సం.వి.అ.పుం. ౧ రథము నెక్కి యుద్ధము చేయువాఁడు. ౨ రథికుఁడు.

**స్యందని.** సం వి. ఈ. స్త్రీ. ౧ లాలాజలము. ౨ మూత్రద్వారము.

**స్యందనిక.** సం.వి.ఆ. స్త్రీ. లాలాజలబిందువు. ౨ చిన్నయేఱు.

**స్యందము.** సం.వి.అ.పుం. ౧ కాఱుట. ౨ నీటి యూట ౩ రథము. ౪ చెమట. ౫ నేత్రరోగము.

**స్యంది.** సం.విశే. (న్.నీ.న్) స్రవించునది.

**స్యందిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧ లాలాజలము, చొంగ. ౨ కవదూడలను గనునట్టి యావు.

**స్యమంతుఁడు.** సం.వి.అ.పుం. చంద్రుఁడు.

**స్యదము.** సం.వి.అ.పుం. ౧ వేగము. ౨ గమనవేగము. ౩ కాఱుట.

**స్యన్నము.** సం.విశే (అ.ఆ.అ.) ౧ కాఱినది (నీరు మొదలైనది) ౨ బొట్లుబొట్లుగాఁబడునదిన

**స్యమంతకము.** సం.వి.అ.పుం. దినమునకెనిమిది బారువుల బంగారమునిచ్చుచు నపాయములనుండి రక్షించునొకమణి.

**స్యమిక.** సం.వి.ఆ.స్త్రీ. నీలిమందు.

**స్యమి (మీ) కము.** సం.వి.అ.పుం. ౧ మేఘము ౨ వల్మీకము. ౩ కాలము. ౪ ఒకానొకచెట్టు.

## స్యా

**స్యాద్వాదము.** సం.వి.అ.పుం. ఈశ్వరునియుని కిని సందేహించువాదము.

**స్యా (శ్యా) లకుఁడు.** సం.వి.అ.పుం. బావ మఱఁది.

**స్యా (శా) లిక.** సం. వి. ఆ. స్త్రీ. మఱఁదలు, భార్య సోదరి.

**స్యాలుఁడు.** సం.వి.అ.పుం. శ్యాలకుఁడు, బావ మఱఁది.

## స్యూ

**స్యూతము.** సం.విణ (అ.ఆ.అ.) ౧ కుట్టఁబడినది (వస్త్రము మొదలైనది) ౨ కలుపఁబడినది. వి. అ.పుం. ౧ పల్లిక. ౨ సజ్జ. సంచి.

**స్యూతి** సం.వి.ఇ.స్త్రీ. ౧ (బట్టలు మున్నగువాని కుట్టు. ౨ సంతతి. ౩ కుటుంబము. ౪ సంచి. ౫ కుట్టుపని.

**స్యూన.** సం. వి. ఆ. స్త్రీ. ౧ కాంతికిరము. ౨ మొలమాలు.

**స్యూనము.** సం.వి.అ.పుం. ౧ స్యూతము. ౨ దాఁగర. ౩ కాంతికిరణము.

**స్యూముఁడు=స్యోనుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**స్యూమము.** సం.వి.అ పుం. కాంతికిరణము. న. ౧ నీరు. ౨ సౌఖ్యము.

## స్యో

**స్యోతము.** సం.వి.అ.పుం. స్యూతము.

**స్యోనము.** సం.విణ. (అ.ఆ.అ.) అందమైనది; శుభావహమైనది. వి. అ. పుం. ౧ కిరణము. ౨ సంచి. న. ౧ ఆనందము. ౨ సౌఖ్యము. ౩ సుఖాసనము.

**స్యో (శ్యో) నాకము.** సం.వి.అ.పుం. ౧ దుండు గ చెట్టు. ౨ పెద్దమ్రాను.

## స్ర

**స్రంసనము.** సం.వి.అ.న. ౧ జాఱుట; ౨ పడఁ జేయుట. ౩ అకాలగర్భస్రావము. ౪ విరేచన కారియగు మందు.

**స్రంసము.** సం.వి.అ.పుం. ౧ పడుట ౨ జాఱుట.

**స్రంసి.** సం.విణ. (న్.నీ.న్.) ౧ క్రిందఁబడునది. ౨ వ్రేలాడునది. ౩ జాఱునది. వి.పుం.న్. ౧ పోఁకచెట్టు. ౨ గొనుగు చెట్టు.

**స్రక్కరి.** సం.వి.ఈ.స్త్రీ. పువ్వులావిక; మాలకరి ఉ ...దోర్దండము లెత్తి మ్రొక్కుదురు స్రక్కరిఁ గన్గొని పౌరపల్లవుల్. నిరం. ౧.౫౨.

**స్రగ్గు.** అ.క్రి. ౧ అడఁగు ౨ తగ్గు.

**స్రగ్ధర.** సం.వి.ఆ.స్త్రీ. ఒకానొకవృత్తము (మ, ర, భ, న, య, య, యగణములు, యతిస్థానము ౮.౧౫.)

**స్రగ్వి.** సం.విణ. (న్.ణీ.న్.) పూలదండను ధరించినది.

**స్రగ్విణి.** సం వి.ఈ.స్త్రీ. ఒకానొకవృత్తము (ర, ర, ర, రగణములు, యతిస్థానము ౭.)

**స్రజము.** సం.వి.జ్.స్త్రీ. ౧ పూలదండ. ౨ భూషణ విశేషము. ౩ వరుస.

**స్రజ్వ.** సం. వి. న్. పుం. ౧ మాలాకారుఁడు. ౨ వస్త్రము. ౩ త్రాడు. ఆ. స్త్రీ. త్రాడు, దారము.

స్రద్ధువు. సం.వి.ఊ.స్త్రీ. అపానవాయువు.

స్రవ. సం. వి. ఆ. స్త్రీ. పోఁగచెట్టు. పుం. ౧. సెలయేఱు, ౨ మూత్రము.

స్రవంతి. సం.వి.ఈ.స్త్రీ. ౧ నది, ౨ చీలమండ. ౩ దంతీవృక్షము, ఎలుకచెవిచెట్టు. ౪ ప్లీహముండు స్థానము.

స్రవణము. సం.వి.అ.న. ౧ కాఱుట. ౨ మూత్రము. ౩ అకాలగర్భస్రావము. ౪ చెమట.

స్రవద్గర్భ. సం. వి. ఆ. స్త్రీ. ౧ ఈనుకపోయిన యావు ౨ గర్భస్రావమైన స్త్రీ.

స్రవద్రంగము. సం.వి.అ.పుం. అంగడివీథి.

స్రవన్మధ్యము. సం.వి.అ.న. నడుమనుండి నీరు స్రవించుచున్నట్లు కనఁబడుమణి.

స్రవము. సం. వి. అ. పుం. ౧ కాఱుట. ౨ కరియుట. ౩ బిందువు. ౪ ప్రవాహము. ౫ సెలయేఱు.

స్రవించు. సం.అ.క్రి. ౧ కాఱు. ౨ చేపు.

స్రష్ట. సం.వి.ఋ.పుం. ౧ బ్రహ్మ. ౨ నిర్మాత.

స్రస్తము. సం.విశ.(అ.ఆ.అ.)౧ క్రిందఁబడినది. ౨ జాఱినది. ౩ వ్రేలాడునది. ౪ వదులుచేయఁబడినది. ౫ తెగచేయఁబడినది.

స్రస్తరము. సం.వి.అ.పుం. పరుపు (సోఫా)

స్రస్తహస్తము. సం. విశ. (అ.ఆ.అ.) (చేతి) పట్టువిడుచునది.

స్రస్తాంగము. సం.విశ. (అ.ఆ.అ.) సడలినయవయవములుగలది. ౨ మూర్ఛాక్రాంతమైనది.

స్రస్తి. సం.వి ఇ. స్త్రీ. ౧ పడుట. ౨ జాఱుట. ౩ వదులగుట, సడలుట.

## స్రా

స్రాముఁడు. సం.విశ. (అ.ఆ.అ.) ౧ ఎప్పుడును స్రవించుముక్కులును గన్నులునుగలవాఁడు. ౨ కుంటివాఁడు.

స్రామ్యము. సం.వి.అ.న. కుంటితనము.

స్రావకము. సం.విశ. (అ.ఆ.అ.) కార్చునది. వి.అ.న. నల్లమిరియము.

స్రావణము. వి. అగసాలివాని పనిముట్టు, చిన్న పట్టుకారు.

స్రావము. సం.వి.అ.పుం. స్రవము, కాఱుట.

స్రావి=సరవి. వి. ౧ క్రమము. ౨ మార్గము.

స్రావితము. సం. విశ. (అ. ఆ. అ.) కరఁగింపఁబడినది.

## స్రు

స్రుక్కఁజేయు. స. క్రి. స్రుక్కునట్లు చేయు, స్రుక్కించు.

ఆ.తునిమితోనయవని దొమ్మిదియమ్ముల,స్రుక్కఁజేసి ....... భార.ద్రో. ౩.౨౨౩.

స్రుక్కఁబడు. అ.క్రి. శోకించు, దుఃఖించు.

వ. ....అవమతి తన్నొందిన స్రుక్కఁబడక.... భార. విరా. ౧

స్రుక్కించు. స క్రి. స్రుక్కఁజేయు. క.........

క. చూచెదుగాకట్లు నిన్ను స్రుక్కించెదనో. భార. ద్రో. ౪-౯.

స్రుక్కు. అ.క్రి. ౧ వెనుదీయు.

క. ఎక్కువ వెలద్రవ్యంబులు, స్రుక్కక స్రుచ్చిలినచోటఁజాఱఁగొనినచో. విజ్ఞా. కాం. ౨-౯౮.

ఉ....పాపవృత్తికిన్, స్రుక్కకవైరమెత్తికడుఁ గ్రూరుఁడవై యిటు సీతఁజూడఁగా, దిక్కులు గెల్వఁగాదు నను దెక్కొనఁ బోయితి.గాని యిమ్మెయిన్. నిర్వ. ౫.

౨. భయపడు.

ఉ. ... స్రుక్కము చావునకాత్మ నేమియున్. భార. అర. ౪

గీ. రక్కసులతోఁడ నేనిటు స్రుక్కనేల, దురములోపల మార్తురఁదొడఁగి గెలుచు, జాడలెన్నైనఁగల వెదజంకుమాని, చెఱుపు దొడరని వ్రేలిమి చేయుమొకటి. అచ్చ. రా. యు. ౩. (౪౨.)

౩. ముడుగు.

క. జక్కవ లలరఁజకోరము, లుక్కఱఁ గమలములు విరియ నొగిఁ గైరవముల్, స్రుక్క సమస్తజనంబులు, ప్రెక్క దిశలు వెలుఁగ భాస్కరుఁడు పొడతెంచెన్.

భోజరా. ౧. (శర.)

౪. ముడుతపడు.

క. చిక్కని చక్కని సున్నని, స్రుక్కని తోలూడ్వఁబడని ఘల్లిపెగలచే, నొక్కఁబడని దండంబులు, తక్కక యుపనయనవేళఁ దాల్పఁగ వలయున్. విజ్ఞా కాం. ౧-౨౭.

గీ. కలయనరసె వెంట్రుకలు స్రుక్కెఁ జర్మంబు, వీపువంగె బొమలు వ్రేలఁబడియె....

భోజరా. ౨. (శ.ర)

౫. తగ్గు.

క. స్రుక్కిన యంగుళములు దళ, మెక్కిన దేహమునుగాంతి యుడిలినమోమున్....

భోజరా. ౧ (శ.ర.)

౬. దుఃఖించు.

ఉ.. సత్యయింతకున్, స్రుక్కకయున్నె నీమహిమ సూచిన బోటులు విన్నవించినన్.

పారి ౧ (శ.ర.)

౭. చింతించు.

ఉ....భీమతనూభవ సెమ్మనంబునన్, స్రుక్కుచునుండె నైషధుఁడు నంగడుఁజింతవహించె....

నైష. ౪. (శ.ర.)

౮. మూర్ఛిల్లు.

గీ. కంకటము దూఱి యంగంబు గాఁడిపోవఁ, గ్రూరనారాచమేసిన స్రుక్కెనతఁడు.

భార. ద్రో. ౨ (శ.ర.)

౯. సంకోచించు.

ఉ... తావినీతమై. స్రుక్కుచు నీచభామినుల చొప్పునఁబల్కెడు.....భార. విరా. ౧ (శ.ర.)

౧౦. వాడు, మ్లానమగు.

గీ. కలుకుటెండఁ దాఁకినతొగశాఖ భంగిఁ, బాఁపఁఱేనిమే నెంతయు బలము దఱిగి, స్రుక్కె.... హరి.పూ. ౭ (శ.ర.)

౧౧. చుట్టుకొను. అము. ౫. (శ.ర.)

వి. ౧. చిక్కు, ముడులు పడుట.

సీ. చూర్ణాలకంబులస్రుక్కు చక్కఁగఁదీర్చి....

నైష. ౭ (శ.ర.)

వ....నొగలెక్కి పగ్గంబుల స్రుక్కు సక్కంజేయ

భార. విరా. ౪.౪౬

సీ....మున్నొలొడ్డి, వలచేయి యొక్కండు వలను దాల్చి, మున్మడుంగగఁదాల్చి క్రమ్మఱదిగఁ దాల్చి స్రుక్కులు పుచ్చిముచ్చట్లు చుట్టి, ముడిచి మంత్రపూర్వముగ వడుగొకటి స, న్న్యాసి యొకటి గృహస్థు రెండుదాల్ప,వలయు నన్నిదంబులు ...

విజ్ఞా. కాం. ౧. ౨౫.

౨. దుఃఖము, శోకము.

శా....భోగంబులన్, మెచ్చున్ స్రుక్కును లేక యుండు ... భార.శాం. ౨.

సీ. సౌఖ్యంబు దుఃఖంబు సంప్రాప్తమైనచో నుబ్బుస్రుక్కులు లేక యుండె నేని.

౩. ఆధిక్యము.

౪. కాఠిన్యము.

సీ. ఱెక్కతాఁకున స్రుక్క నిక్క ప్రక్కలు నొక్క నఱక కల్లేటినొక్కరణంబు. మనుచ.

౪.౫౯.

౪. వళి, కడుపుమీఁది ముడుత.

సీ. స్రుక్కులు తరఁగలు పొక్కిలి సుడి....

నీలా. ౨ (శ.ర.)

స్రుక్కు. సం.వి.చ్.స్త్రీ. యజ్ఞోపకరణము.

స్రుక్ప్రణాళిక. సం.వి.ఆ.స్త్రీ. గరిఁటెచిప్ప.

స్రుగ్జిహ్వుఁడు. సం.వి.అ.పుం. అగ్ని.

స్రుఘ్ని. సం.వి.ఈ. నేట్రను (Natron)

స్రుచము. సం.వి.చ్.స్త్రీ. స్రుగ్భేదము.

స్రుతము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ కాఱినది. ౨ పోయినది.

స్రుతి. సం.వి.ఇ.స్త్రీ. ౧ కాఱుట. ౨ ప్రవాహము. 3 గుగ్గిలము.

స్రువ. సం. వి. ఆ. స్త్రీ. ౧ అందుగుచెట్టు İ. ౨ చేఁగ İ. ౩ యజ్ఞపాత్రవిశేషము. ౪ సెలయేఱు.

స్రువము. సం.వి.అ.పుం. యజ్ఞపాత్రవిశేషము.

స్రు (వ) వాకర్ణము. సం.విణ. (అ.ఆ.అ.) చెవి మీఁదగరిఁటె గుర్తుగలది.

స్రువావృక్షము. సం.వి.అ.పుం. ౧ ములువెలఁగ చెట్టు. ౨ స్రుక్స్రువములకైన వృక్షము.

స్రువాహస్తుడు. సం.వి.అ.పుం. శివుఁడు.

స్రువు. సం.వి ఊ. స్త్రీ. ౧ గరిటెవంటి యజ్ఞోపకరణము. ౨ చిట్టికాలువ.

## స్రో

స్రోతఘ్ని. సం.వి.ఈ.స్త్రీ. సర్జక్షారము, లవణ విశేషము.

స్రోతము. సం.వి.అ.న. ౧ ప్రవాహము. ౨ సెలయేఱు.

స్రోతస్యుఁడు. సం. వి. అ. పుం. ౧ శివుడు. ౨ దొంగ.

స్రోతస్వతి=స్రోతస్విని.

స్రోతస్విని. సం.వి.ఈ.స్త్రీ. ఏఱు, నది.

స్రోతస్సు. సం.వి.స్.న. ౧ జలప్రవాహము; ఏఱు. ౨ తరంగము. ౩ నీరు. ౪ నీరువచ్చెడి తూము. ౫ ఇంద్రియము. ౬ ఏనుఁగుతొండము. ౭ జలగవేము. ౮ కుజాముఖము. ౯ జంతువుల ఇంద్రియరంధ్రము. ౧౦ వంశపరంపర.

స్రోతోంజనము. సం.వి.అ.న. ౧ నీలాంజనము. (౨) సౌవీరాంజనము.

స్రోతోద్భవము. సం.వి.అ.న. సౌవీరము.

స్రోతోరంధ్రము. సం.వి.అ.న. ఏనుఁగుల తొండము చివర నుండు రంధ్రము.

స్రోతోవహా (ము). సం.వి.ఆ.హ్. స్త్రీ. నది.

## స్వ

స్వ. సం.వి.ఆ.స్త్రీ. సమానవర్ణమునకుఁజెందిన స్త్రీ

స్వంగము. సం.వి.అ.పుం. కౌఁగిలి.

స్వంజనము. సం.వి.అ.న. కౌఁగిలించుకొనుట.

స్వంజుఁడు. సం.వి.అ.పుం. ౧ బ్రహ్మ ౨ శివుఁడు

స్వకంపనము. సం.వి.అ.పుం. వాయువు.

స్వకపోలకల్పనము. సం.వి.అ.న. స్వయముగాఁ గల్పించుట.

స్వకము. సం.విణ. (అ.ఆ.అ.) స్వకీయము, సొంతము. వి.అ.న. సొంతయాస్తి.

స్వకర్మము. సం.వి.న్.న. స్వధర్మము.

స్వకర్మస్థుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) తన పనియందు నిమగ్నుఁడై యుండువాఁడు.

స్వకర్మి. సం.విణ. (న్.నీ.న్.) స్వార్థపరుఁడు.

స్వకామి. సం.విణ. (న్.నీ.న్.) స్వకర్మి, స్వార్థపరుఁడు.

స్వకీయ. సం.వి.ఆ.స్త్రీ. సొంతభార్య.

స్వకీయము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ తనది. ౨ తనకుటుంబమునకు సంబంధించినది.

స్వకుఁడు. సం.వి.అ.పుం. మిత్రుఁడు, బంధువు.

స్వగతము. సం.వి.అ.న. (అవ్యయమని ఆప్టే) ౧ రహస్యము. ౨ తనలోఁదాను మాటలాడుకొనుట. ౩ నాటకాంగములలో నొకటి.

స్వగృహము. సం.వి.అ.పుం. ఒకవిధమైన పక్షి. న. సొంతయిల్లు.

స్వచమనుఁడు. సం.వి.అ.పుం. చంద్రుఁడు

స్వచగము. సం.విణ. (అ.ఆ.అ.) తనంతదాను గదలునది.

స్వచ్ఛందజుఁడు. సం.వి.అ.పుం. ౧ కొడుకు. ౨ దుష్టుఁడు.

స్వచ్ఛందము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ సొంతమైనది. ౨ కల్మషములేనిది. ౩ స్వతంత్రమైనది. ౪ సహజమైనది. వి.అ.పుం. ౧ తనయిష్టము. ౨ స్వాతంత్ర్యము.

**స్వచ్ఛటి.** సం.వి.ఈ.స్త్రీ. చిటికెలువేయుట.

**స్వచ్ఛమణి.** సం.వి.ఇ.పుం. స్ఫటికము.

**స్వచ్ఛము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ నిర్మలము. ౨ తెల్లనిది. ౩ అందమైనది. ౪ ఆరోగ్యవంతము వి.అ.పుం. ౧ స్ఫటికము. ౨ రేఁగుచెట్టు. న. ముత్యము. ౨ స్వర్ణరజత మిశ్రితమైన లోహము.

**స్వచ్ఛవాలుకము.** సం. వి. అ. న. తెల్లమద్ద.

**స్వజ.** సం.వి.ఆ.స్త్రీ. కూఁతురు.

**స్వజనుఁడు.** సం. వి. అ. పుం. ౧ పాలివాఁడు, జ్ఞాతి. ౨ బంధువు. ౩ సగోత్రజుఁడు.

**స్వజము.** సం.విణ.(అ.ఆ.అ.) ౧ స్వాయంభువు. ౨ స్వాభావికమైనది. వి.అ.న. రక్తము. పుం. ౧ చెమట. ౨ ఒకజాతి విషసర్పము. ౩ కొడుకు ౪ నెత్తురు.

**స్వత.** సం.వి.ఆ.స్త్రీ. ౧ స్వత్వము. ౨ స్వామ్యము.

**స్వతంత్రత.** సం.వి.ఆ స్త్రీ. ౧ స్వతంత్రభావము. ౨ మాలికత.

**స్వతంత్రము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ ఆత్మీయమైనది. ౨ స్వేచ్ఛగలది. ౩ యుక్తవయస్సు వచ్చినది.

**స్వతంత్రించు.** సం. అ. క్రి. ౧ ఒకరియనుమతి లేకుండఁదానుగాఁప్రవర్తించు. ౨ తానే ప్రధానముగాఁప్రవర్తించు.

**స్వతంత్రుఁడు.** సం.వి.అ.పుం. గ్రుడ్డివాఁడు.

**స్వతఃప్రమాణ.** సం.విణ. అ.న. ప్రత్యక్షనిరూపితమైనది. తనంతఁదాఁప్రమాణమైనది.

**స్వతస్సిద్ధము.** సం.విణ. (అ.ఆ.అ.) సహజము.

**స్వత్వబోధనము.** సం.వి.అ.న. స్వామ్యనిదర్శనము.

**స్వత్వము.** సం.వి.అ.న. ౧ సొమ్ము. ౨ స్వామ్యము. ౩ స్వేచ్ఛాజీవితము.

**స్వదనము.** సం. వి. అ. న. ౧ రుచిచూచుట. ౨ తినుట.

**స్వదితము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ రుచిచూడఁబడినది. ౨ తినఁబడినది.

**స్వదేశము.** సం.వి.అ.పుం. తనదేశము, మాతృభూమి.

**స్వధ.** సం.వి.ఆ.స్త్రీ. ౧ అగ్నిదేవునిభార్య.
సీ. సంతుష్టమానస స్వాహాస్వధాకాంత లు
భయపార్శ్వంబుల నోలగింప. చిత్రభా. ౪.౬౩
౨. పితృదేవతల కొసఁగఁబడుబలి.
సీ. వేదాధ్యయనములు విధివిహిత స్వధాస్వా
హాకారములు నిలుపంగఁ జేసెను.
మాఘ. ౨-౧౭౧.
౩ తనస్వభావము. ౪ తనభాగము. ౫ మాయ ౬ శ్రాద్ధము.

**స్వధర్మము.** సం. వి. అ. పుం. ౧ స్వభావము. ౨ స్వకులవృత్తి. ౩ తనమతము.

**స్వధాకారము.** సం.వి.అ.పుం. స్వధాస్వధాయను ధ్వని.

**స్వధాశినమనము.** సం.వి.అ.న. పితృదేవతలకు కవ్యము నొసఁగునప్పుడు ఉపయోగింపఁబడు పవిత్రగ్రంథము.

**స్వధాప్రియము.** సం.వి.అ.పుం. నల్లనువ్వులు.

**స్వధాప్రియుఁడు.** సం.వి.అ.పుం. అగ్ని.

**స్వధాభుక్కు.** సం.వి.జ్.పుం. ౧ పితృదేవత.

**స్వధాభుజుఁడు**=స్వధాభుక్కు.

**స్వధితి.** సం. వి. ఇ. స్త్రీ. ౧ గండ్రగొడ్డలి. ౨ ముద్గరమను నాయుధ విశేషము.

**స్వధీతి.** సం.వి.ఇ.పుం. ౧ వేదములను బాగుగాఁ బఠించువాఁడు. ౨ బ్రహ్మచారి.

**స్వనచక్రము.** సం.వి.అ.పుం. రతిబంధ విశేషము

**స్వనము.** సం వి.అ.పుం. స్వరము, ధ్వని, మ్రోఁత

**స్వని.** సం వి.ఇ.పుం. ౧ ధ్వని. ౨ అగ్ని.

**స్వనితము.** సం.విణ. (అ.ఆ.అ.) ధ్వనిచేయునది.

**స్వనిఘ్నము.** సం.విశ. (అ.ఆ.అ.) తనమీఁదనే యాధారపడినది.

**స్వనితము.** సం.విశ. (అ.ఆ.అ.) మ్రోయునది, ధ్వనిచేయునది. వి.అ.న. ౧ ఉఱుము. ౨ ధ్వని

**స్వపనము.** సం.వి.అ.న. ౧ నిద్రించుట. ౨ కలగాంచుట. ౩ శరీరము మొద్దువాఱుట.

**స్వప్నకుఁడు.** సం.వి.అ.పుం. నిద్రించినవాఁడు.

**స్వప్నక్కు.** సం.విశ. (జ్.జ్.జ్.) ౧ స్వప్నకుఁడు. ౨ నిద్రాళువు.

**స్వప్నదోషము.** సం. వి. అ. పుం. నిద్రయందు రేతస్ఖలనము.

**స్వప్నభాషణము.** సం.వి.అ.న. నిద్రయందలి పలవరింత.

**స్వప్నము.** సం.వి.అ.పుం. ౧ కల. ౨ నిదుర. ౩ చూపు. ౪ ఆలస్యము. ౫ అజ్ఞత.

**స్వప్నాళువు.** సం.విశ. (ఉ.ఉ.ఉ.) నిద్రాశీలుఁడు.

**స్వప్రకాశము.** సం.విశ. (అ ఆ.అ.) తనంతటఁ దాను ప్రకాశించునది.

**స్వబీజము.** సం.వి.అ.పుం. ఆత్మ.

**స్వభానువు.** సం.వి.ఉ.పుం. ఒకానొక సంవత్సరము.

**స్వభావము.** సం.వి.అ.పుం. ౧ నిజభావము, తత్త్వము. ౨ అభ్యాసము. ౩ స్వధర్మము.

**స్వభావోక్తి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ సహజమైన మాట. ౨ ఒకానొకయర్థాలంకారము.

**స్వభువు.** సం.వి.ఊ పుం. ౧ విష్ణువు. ౨ శివుఁడు. ౩ బ్రహ్మ. ఊ.స్త్రీ. ౧ స్వదేశము. ౨ స్వగృహము.

**స్వమనీషిక.** సం.వి.ఆ.స్త్రీ. ఉపేక్షాభావము.

**స్వము.** సం.వి.అ.పుం. ౧ సొమ్ము. ౨ అహంకారము. ౩ స్వభావము. ౪ తాను. వి.పుం. ఆత్మ. సం.విశ. (అ.ఆ.అ.) ౧ తనది. ౨ సహజమైనది. ౩ తనజాతికిఁ జెందినది.

**స్వమేకము.** సం.వి.అ.పుం. ఒక సంవత్సరము.

**స్వయంకృతము.** సం.విశ. (అ.ఆ.అ.) ౧ స్వయముగాఁ జేయఁబడినది. ౨ సహజమైనది.

**స్వయంకృతుఁడు.** సం.వి.అ.పుం. దత్తపుత్రుఁడు

**స్వయంగ్రహము.** సం.వి.అ.పుం. స్వతంత్రముగా గ్రహించుట.

**స్వయంగ్రాహము.** సం.విశ. (అ.ఆ.అ.) బలవంతముగా గ్రహించునది. వి.అ.పుం. ౧ దానపంచకములలో నొకటి. ౨ తానేకాఁగిలించుకొనుట.

**స్వయంజాతము.** సం.విశ. (అ.ఆ.అ. తనంత దాఁబుట్టినది.

**స్వయందత్తుఁడు.** సం.వి.అ.పుం. ద్వాదశవిధ పుత్త్రులలో నొకఁడు, స్వయముపాగతుఁడు.

**స్వయంపాకము.** సం.వి.అ.పుం. ౧ ఒకపూఁట బత్తెము. ౨ హవ్యకవ్యములయందు బ్రాహ్మణుల కిచ్చు వంటసామగ్రి. ౩ నియమాతిశయముగల బ్రాహ్మణులు స్వయముగాఁ జేసికొనువంట.

**స్వయంపాఠము.** సం.వి.అ.పుం. మూలపాఠము.

**స్వయంప్రకాశము.** సం.విశ. (అ.ఆ.అ.) తనంతఁదావ్యక్తమగునది.

**స్వయంభువు.** సం. వి. ఊ. పుం. ౧ శివుఁడు. ౨ బ్రహ్మ. ౩ విష్ణువు. ౪ మన్మథుఁడు. ౫ కాలపురుషుఁడు. ౬ వక్షోజము. ౭ జైనతీర్థంకరుఁడు

**స్వయంభువుఁడు.** సం.వి.అ.పుం. ౧ మనువు. ౨ శివుఁడు. ౩ బ్రహ్మ.

**స్వయంభూతుఁడు.** సం.వి.అ.పుం. శివుడు.

**స్వయంవర.** సం.వి.ఆ.స్త్రీ. స్వయముగా మగని వరించుకన్య.

**స్వయంవరము.** సం.వి.అ.పుం.కన్య వరుని స్వయముగా వరించుట.

**స్వయంశ్రేష్ఠుఁడు.** సం.వి.అ.పుం. శివుఁడు.

**స్వయముపాగతుఁడు.** సం.వి.అ.పుం. తనంత దావచ్చి పెంచుకొనుమని యడుగు కుమారుఁడు.

**స్వయుతి.** సం.వి.ఇ.స్త్రీ. లంబకర్ణములను గలుపు నట్టిరేఖ.

**స్వయమాధ్యేఁడు.** సం.వి.అ.పుం. బంధువు.

**స్వయోని.** సం.విణ. (ఇ.ఇ.ఇ.) తల్లి వంకచుట్టము వి.ఇ.పుం.స్త్రీ. జన్మస్థలము. స్త్రీ, సోదరి; దగ్గఱి బంధుత్వముగల స్త్రీ.

**స్వర.** సం.వి.ఆ.స్త్రీ. బ్రహ్మభార్య.

**స్వరకంపము.** సం.వి.అ.పుం. ఎలుఁగుకంపించుట

**స్వరక్షయము.** సం. వి. అ. పుం. కంఠధ్వని భంగము.

**స్వరగ్రామము.** సం.వి.అ.పుం. మంద్రమునుండి హెచ్చు స్థాయి వఱకుఁగల స్వరములు, సరళి.

**స్వరచ్ఛిద్రము.** సం.వి.అ.న. వేణువునందలి రంధ్రము.

**స్వరతిక్రమము.** సం. వి. అ. పుం. వైకుంఠముఁ జేరుట.

**స్వరనాభి.** సం.వి.ఇ.పుం. ఒకవిధమైన వేణువు.

**స్వరనేత్రాంగవికారము.** సం. వి. అ. పుం. భక్త్యంగము, భక్తివిశేషము.

**స్వరపత్తనము.** సం.వి అ.న. సామవేదము.

**స్వరపరివర్తనము.** సం. వి. అ. న. కంఠధ్వని యొక్కమార్పు.

**స్వరబద్ధము.** సం.విణ. (అ.ఆ.అ.) లయానుగుణముగాఁగూర్పఁబడినది.

**స్వరబ్రహ్మము.** సం.వి.న్.పుం. శబ్దబ్రహ్మము.

**స్వరభక్తి.** సం.వి.ఇ.స్త్రీ. సంయుక్తాక్షరముల నడుమఁజేర్పఁబడెడి యచ్చు. (ఉదా. చంద్రుఁడు చందురుఁడు.)

**స్వరభంగము=స్వరభేదము.** సం. వి. అ. పుం. గొంతు బొంగురు పోవుట.

**స్వరభంగి.** సం.వి.న్.పుం. ఒకవిధమైనపక్షి.

**స్వరభేదము=స్వరభంగము.**

**స్వరమండలము.** సం. వి. అ. న. స్వరగ్రామమూర్ఛనాతానాదుల సమూహము. (సప్తస్వరాస్త్రయో గ్రామామూర్ఛనా స్త్వేకవింశతిః, తానా స్త్వేకోనపంచాశ దిత్యేతత్ స్వరమండలమ్)

**స్వరమండలిక.** సం.వి.ఆ.స్త్రీ. ఒకవిధమైనవీణ

**స్వరము.** సం. వి. అ. పుం. ౧ ముక్కుగాలి. ౨ ఉదాత్తాదిస్వరము. ౩ అకారాదికమైనయచ్చు ౪ షడ్జాదికము. ౫ సప్తసంఖ్య. ౬ గుఱ్ఱుపెట్టుట ౭ కంఠమాధుర్యము.

**స్వరయతి.** సం.వి.ఇ.స్త్రీ. ఒకానొకయతిభేదము (ఒక యచ్చునకు మిత్రమైన వేఱొకయచ్చుతో వేసెడుయతి. ఇదియేడు విధములని అప్పకవి చెప్పెను.

**స్వరయోగము.** సం.వి.అ.పుం. కంఠధ్వని.

**స్వరలాసిక.** సం.వి.ఆ.స్త్రీ. వేణువు.

**స్వరవిభక్తి.** సం. వి. ఇ. స్త్రీ. అచ్చునువేఱుచేయుట.

**స్వరసంపత్తు.** సం.వి.ద్.స్త్రీ. కంఠధ్వని మాధుర్యము.

**స్వరసము.** సం.వి.అ.పుం. ౧ సహజమైనరుచి. ౨ రచనయందలి స్వాదుత. ౩ ఒగరైన రసము.

**స్వరాజ్యము=స్వరాష్ట్రము**-సం.వి.అ.న. ౧ స్వతంత్రరాష్ట్రము. ౨ సొంతరాజ్యము.

**స్వరాట్టు (టు).** సం.వి.జ్.పుం. ౧ బ్రహ్మము. ౨ సూర్యుని యేడు కిరణములలో నొకటి. ౩ విష్ణువు. ౪ ఏఁబదిలక్షలనుండి కోటి కర్షముల వఱకు రాఁబడివచ్చు రాజు.

**స్వరాష్ట్రము=స్వరాజ్యము.**

**స్వరింగణము.** సం. వి. అ. పుం. బలముగల వాయువు.

**స్వరితము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ మ్రోగునట్లు చేయఁబడినది. ౨ స్వరముతోఁగూడినది. ౩ కలుపఁబడినది. వి.అ.పుం. ఉదాత్తానుదాత్తములకు నడిమిధ్వని. (సమాహారః స్వరితః)

స్వరువు. సం.వి.ఉ.పుం. ౧ యజ్ఞము. ౨ వజ్రాయుధము. 3 యూప స్తంభము చెక్కునపుడెగసిన బరడు. ౪ యూపఖండము. ౫ యూప స్తంభ భాగము. ౬ పిడుగు. ౭ ఖడ్గము. ౮ బాణము అమ్ము. ౯ ఒకవిధమైన తేలు. విణ. (ఉ.ఉ.ఉ.) ౧ మ్రోయునది. ౨ తపింపఁజేయునది.

స్వరూపము. సం. వి. అ. న. ౧ ఆకారము. ౨ స్వభావము. 3 సొగసు. ౪ స్థితి. ౫ విధము. విణ. (అ.ఆ.అ.) ౧ సదృశము. ౨ సుందరము. 3 తెలివిగలది.

స్వర్గంగ. సం. వి. ఆ. స్త్రీ. ౧ ఆకాశగంగ. ౨ పాలవెల్లి.

స్వర్గతి. సం.వి.ఇ.స్త్రీ. ౧ మరణము. ౨ స్వర్గమున కేగుట.

స్వర్గతుఁడు. సం.వి.అ.పుం. మరణించినవాఁడు.

స్వర్గపతి. సం.వి.ఇ.పుం. ఇంద్రుఁడు.

స్వర్గపథము. సం.వి.అ.పుం. పాలవెల్లి.

స్వర్గమనము. సం.వి.అ.న. ౧ స్వర్గమున కేగుట. ౨ మరణము.

స్వర్గము. సం. వి. అ. పుం. ౧ దేవలోకము. ౨ ముక్తి.

స్వర్గవధువు. సం.వి.ఊ.స్త్రీ. అప్సరస. (ఇట్లే స్వర్గస్త్రీ మున్నగునది.)

స్వర్గస్థుఁడు. సం.వి.అ.పుం. ౧ స్వర్గమందున్నవాఁడు. ౨ మరణించినవాఁడు.

స్వర్గారోహణము. సం.వి.అ.న. ౧ స్వర్గాధిగమనము. ౨ శ్రీమహాభారతమున నొకపర్వము.

స్వర్గి. సం.విణ. (న్.నీ.న్.) స్వర్గమునకు సంబంధించినది. వి.న్.పుం. ౧ స్వర్గమునందుండువాఁడు; మృతుఁడు. ౨ వేల్పు.

స్వర్గిరి. సం.వి.ఇ.పుం. స్వర్గగిరి, సుమేరువు.

స్వర్గీయము (గ్య) ము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ స్వర్గమునకు సంబంధించినది. ౨ స్వర్గమును గూర్చినది, స్వర్గమునకుఁబంపునది.

స్వర్జకము. సం.వి.అ.పుం. సురేకారము, పెట్లుప్పు

స్వర్జి. సం.వి.న్.పుం.=స్వర్జకము.

స్వర్జిత్తు. సం.వి.త్.పుం. ఒకవిధమైన యజ్ఞము.

స్వర్ణకము. సం.విణ. (అ.ఆ.అ.) సువర్ణవికారమైనది, బంగరురంగుగలది.

స్వర్ణకారుఁడు. సం.వి.అ.పుం. అగసాలె, బంగారు పనిచేయువాఁడు.

స్వర్ణకేతకి. సం.వి.ఈ.స్త్రీ. బంగారుమొగలి.

స్వర్ణక్షీరి (రీ). సం.వి.ఈ.స్త్రీ. ౧ బలురక్కెస చెట్టు. ౨ కంగుష్ఠము.

స్వర్ణగర్భుఁడు. సం.వి.అ.పుం. ౧ పాలపిట్ట. ౨ కోడిపుంజు.

స్వర్ణజము. సం.వి.అ.న. తగరము.

స్వర్ణదీధితి. సం.వి.ఇ.పుం. అగ్ని.

స్వర్ణద్వీపము. సం.వి.అ.పుం. సుమత్రాద్వీపము

స్వర్ణనాభము. సం.వి.అ.పుం. సాలగ్రామము.

స్వర్ణపక్షుఁడు. సం.వి.అ.పుం. గరుడుఁడు.

స్వర్ణపద్మ. సం.వి.ఆ.స్త్రీ. గంగానది.

స్వర్ణపాటకము. సం.వి.అ.పుం. వెలిగారము.

స్వర్ణపారేవతము. సం.వి.అ.న. పెద్దయీడకీ.

స్వర్ణపుష్పము. సం.వి.అ.పుం. చంపకవృక్షము.

స్వర్ణపుష్పి. సం.వి.ఈ.స్త్రీ. జీలుగు కీ.

స్వర్ణబందువు. సం.వి.ఉ.పుం. విష్ణువు.

స్వర్ణభూమిక. సం. వి. ఆ. స్త్రీ. ౧ అల్లము. ౨ దాల్చిని.

స్వర్ణభృంగారము. సం.వి.అ.పుం. బంగారుపెట్టె

స్వర్ణమాక్షికము. సం. వి. అ. న ఒకవిధమైన ధాతుద్రవ్యము.

స్వర్ణము. సం.వి.అ.న. ౧ బంగారము. ౨ బంగారు నాణెము. 3 గైరికధాతువు. ౪ ఎఱ్ఱ ఉమ్మెత్త చెట్టు. ౫ గుజ్జనారికేళము.

స్వర్ణయూథిక. సం.వి.అ.స్త్రీ. పచ్చనిమల్లె.

స్వర్ణరేతుడు. సం.వి.స్.పుం. ౧ సూర్యుడు. ౨ అగ్నిహోత్రుడు.

స్వర్ణవజ్రము. సం.వి.అ.న. ఒకవిధమైనయుక్కు.

స్వర్ణవల్లి. సం.వి.ఈ.స్త్రీ. పెద్దమాశేరు i.

స్వర్ణవర్ణము. సం.వి.అ.న. పసుపు. ఇట్లే స్వర్ణవర్ణ. (అ. స్త్రీ.)

స్వర్ణస్తేయము. సం.వి.అ.న. బంగారమును దొంగిలించుట. (పంచ మహా పాతకములలో నొకటి.)

స్వర్గృక్షు. సం.వి.క్.పుం. ౧ ఇంద్రుడు. ౨ అగ్ని. 3 సోమము i.

స్వర్ధుని. సం.వి.ఈ.స్త్రీ. గంగానది.

స్వర్భానవము. సం.వి.అ.పుం. విలువైన రత్న విశేషము.

స్వర్భానువు.సం.వి.ఉ.పుం. రాహువు.

స్వర్మణి. సం.వి.ఇ.పుం. సూర్యుడు.

స్వర్యము. సం విశ. (అ.ఆ.అ.) కంఠధ్వని కనుకూలమైనది.

స్వర్వాపి. సం.వి.ఈ.స్త్రీ. గంగానది

స్వల్పకంకము. సం.వి.అ.పుం. నారాయణపక్షి.

స్వల్పకేసరి. సం.వి.న్.పుం. కోవిదారవృక్షము.

స్వల్పదురాలభ. సం.వి.ఆ.స్త్రీ. చిన్నరేగడి i.

స్వల్పము. సం. విశ. (అ. ఆ. అ.) ౧ అప్రధానమైనది. ౨ కొంచెము. 3 మిక్కిలియల్పమైనది.

స్వల్పాంగులి. సం.వి.ఇ.పుం. చిటికెనవ్రేలు.

స్వల్పిష్ఠము. సం.విశ. (అ.ఆ.అ.) స్వల్పతమము.

స్వల్పీయము. సం.విశ.(స్.సీ.స్.) స్వల్పతరము.

స్వవశ. సం.వి.ఆ. స్త్రీ. స్వతంత్రురాలు.

స్వవాసిని. సం.వి.ఈ.స్త్రీ.=సువాసిని. ౧పేరంటాలు. ౨పట్టింటనుండెడిది.

స్వస. సం.వి.ఋ.అ.స్త్రీ. తోడబుట్టినది,సోదరి.

స్వస్రీయుడు=సం.వి.అ.పుం. మేనల్లుడు, సోదరియొక్కకొడుకు.

స్వస్తి. సం.అవ్య. ౧ క్షేమము. ౨ శుభము. 3 ఆశీర్వాదము.

స్వస్తికము. సం.వి.అ.పుం. ౧ తూర్పువాకిలిగల రాజగృహము. ౨భుజబంధవిశేషము. 3 మంగళవస్తువు. ౪ ముక్తి స్త్రీహస్తవిన్యాసవిశేషము. ౫ పామువడగవిూదనుండు నిరేఖ. ౬ నాలుగుత్రోవలు కలియుచోటు. ౭ అదృష్టమును సూచించు గుర్తు. ౮ కంఠసునకెదురైన ఫల దంతము చేతులనడ్డముగానుంచుట. ౯ ఒకవిధమైన భక్ష్యము. ౧౦ యోగాసనములలోనొకటి. ౧౧ దేవతలకై యేర్పాటుచేయబడినవేదిక. ౧౨ వెల్లుల్లి.

స్వస్తికర్మము. సం.వి.న్.న. శుభము కలిగించు కార్యము.

స్వస్తికారుడు. సం.వి.అ. పుం.స్తుతిపాఠకుడు.

స్వస్తికుడు. సం. వి. అ. పుం. ౧ స్వేచ్ఛావృత్తనుకలవాడు. ౨ స్తుతిపాఠకుడు.

స్వస్తిమతి. సం.వి.అ.పుం. శివుడు.

స్వస్తిముఖము. సం.వి.అ.పుం. లేఖ.

స్వస్తిముఖుడు. సం.వి.అ.పుం. ౧ శైవము. ౨ బ్రాహ్మణుడు. 3 స్తోత్రపాఠకుడు.

స్వస్తివాచకము. సం.వి.అ.పుం. ౧ ఆశీర్వచనము. ౨ అభినందనము. 3 యజ్ఞాదులకు ముందు చేయబడు కార్యము. ౪ శుభాభినందనపూర్వకమైన పుష్పపారితోషికము. (ఇట్లే స్వస్తివాచనకము, స్వస్తివాచనికము.)

స్వస్తివాచ్యము. సం.వి అ.న. అభినందనము.

స్వస్థత. సం.వి.ఆ.స్త్రీ. ౧ ప్రసాదము. ౨ ఆరోగ్యముగానుండుట.

స్వస్థమగు. అ క్రి. తేరుకొను, ఆరోగ్యముపొందు.

స్వస్థము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ సెమ్మదిగా నుండునది. ౨ స్వర్గమందుండునది. (స్వస్థా భవంతు కురురాజసుతాస్సభృత్యాః. వేణీ.)

స్వస్రీయ. సం.వి.ఆ.స్త్రీ. మేనగోడలు, సోదరి కొమార్తె.

స్వస్రీయుఁడు. సం.వి.అ.పుం. మేనల్లుఁడు, సోదరిపుత్త్రుడు.

స్వస్రేయి. సం.వి.ఈ.స్త్రీ.=స్వస్రీయ.

స్వస్రేయుఁడు=స్వస్రీయుఁడు.

## స్వా

స్వాంకికుఁడు. సం.వి.అ.పుం. మార్దంగికుఁడు.

స్వాంతము. సం.వి.అ.న. ౧ మనస్సు. ౨ అనునయించుట. ౩ గుహ. ౪ రంధ్రము. ౫ గనమరణము.

స్వాగతము. సం.వి.అ.న. ౧ కుశలప్రశ్నము. ౨ సుఖముగా వచ్చితిరా యని యడుగుట. ౩ ఒకానొక వృత్తము. విణ. (అ.ఆ.అ.) ౧ న్యాయముగా వార్జింపఁబడినది. ౨ ఆభిమతమైనది.

స్వాగమము. సం.వి.అ.పుం. ౧ స్వాగతము. ౨ వందనము.

స్వాఘూర్ణము. సం.వి.అ.పుం. బిరివెంకచెట్టు.

స్వాచ్ఛ్యము. సం.వి.అ.న. స్వచ్ఛత.

స్వాజన్యము. సం.వి.అ.న. ౧ స్వజనత్వము. ౨ సంబంధము.

స్వాతంత్ర్యము. సం వి.అ.న. స్వతంత్రభావము.

స్వాతి. సం.వి.ఇ.ఈ.స్త్రీ. ౧ సంజ్ఞాదేవి, సూర్యుని భార్య. ౨ ఒకానొక నక్షత్రము. ౩ ఖడ్గము.

స్వాదనము. సం.వి.అ.న. ౧ పానము. ౨ రుచి. ౩ అనుభవము. ౪ స్వాదువుగానొనరించుట. ౫ కావ్యాదుల సౌందర్యము. పుం. ౧ రుచి. ౨ రుచిచూచుట.

స్వాదము. సం.వి.అ.పుం. ౧ రుచి. ౨ రుచిచూచుట.

స్వాదవము. సం.వి.అ.న. స్వాదుత్వము.

స్వాదితము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ పానముచేయఁబడినది. ౨ రుచిచూడఁబడినది. ౩ స్వాదువుగాఁ జేయఁబడినది.

స్వాదిమ. సం.వి.న్.పుం. మాధుర్యము.

స్వాదిష్ఠము. సం.విణ. (అ.ఆ.అ) ౧ స్వాదుతమము. ౨ మిక్కిలి దృఢమైనది. ౩ పూజ్యమైనది.

స్వాదీయము, సం. విణ. (స్. సీ. స్.) స్వాదుతరము.

స్వాదుకంటకము. సం.వి.అ.పుం. ౧ పల్లేరు. ౨ పుల్లవెలగ i.

స్వాదుధన్వుఁడు. సం.వి.న్.పుం. తియ్యని విలుకాఁడు, మన్మథుఁడు.

స్వాదుపుష్పము. సం.వి.అ.పుం. అరుకొండ i.

స్వాదుఫల. సం.వి.ఆ.స్త్రీ. ద్రాక్ష i.

స్వాదుఫలము. సం.వి.అ.న. రేగుపండు.

స్వాదురస. సం.వి.ఆ.స్త్రీ. ౧ కాకోలిమిడి i. ౨ శతావరి i. ౩ మద్యము ౪ ద్రాక్ష.

స్వాదులుంగి. సం.వి.ఈ.స్త్రీ. ౧ వబ్బకాయ. ౨ వబ్బచెట్టు.

స్వాదువు. సం.విణ. (ఉ.ఉ.ఉ.) ౧ ఇంపైనది. ౨ పరిశుద్ధమైనది. ౩ తియ్యనిది. ౪ దృఢమైనది. వి.ఉ.పుం. ౧ మాధుర్యము. ౨ బెల్లము. న. ౧ మాధుర్యము. ౨ రుచి. ౩ అందము. స్త్రీ. ద్రాక్ష.

స్వాదుశుద్ధము. సం.వి.అ.న. రాతియుప్పు.

స్వాదూదము. సం. వి. అ. పుం. మంచినీళ్ల సముద్రము.

స్వాద్యము. సం.వి.అ.న. ౧ ఉప్పన. ౨ రసము.

స్వాద్వి. సం.వి.ఈ.స్త్రీ. ద్రాక్ష.

**స్వాధిష్ఠానము.** సం వి.అ.న. షట్చక్రములలో నొకటి.

**స్వాధీనత.** సం.వి.ఆ.స్త్రీ. తనవశమై యుండుట.

**స్వాధీనపతిక.** సం. వి. ఆ. స్త్రీ. నాయికా విశేషము. (స్వాధీనుఁడైన పతిగల నాయిక.)

**స్వాధీనము.** సం.విణ. (అ.ఆ.అ.) స్వవశమైనది.

**స్వాధ్యాయము.** సం.వి.అ.పుం. ౧ వేదాధ్యయనము. ౨. వేదము. ౩ జపము.

**స్వాధ్యాయి.** సం.వి.న్.పుం. ౧ వేదాధ్యయనము చేయువాఁడు. ౨ ఉపాధ్యాయుఁడు. ౩ పట్టణమునందలి వర్తకుఁడు.

**స్వానము.** సం.వి.అ.పుం. స్వనము, ధ్వని.

**స్వాపకము.** సం.విణ. (అ.ఆ.అ.) నిద్రగలుగఁ జేయునది.

**స్వాపతేయము.** సం.వి.అ.న. ధనము.

**స్వాపము.** సం.వి.అ.పుం. ౧ శయనము. ౨ స్వప్నము. ౩ నిద్ర. ౪ తిమ్మిరి. ౫ అజ్ఞానము.

**స్వాపవ్యసనము.** సం.వి.అ.న. నిద్రమబ్బు.

**స్వాప్నము.** సం.విణ. (అ.ఆ.అ.) నిద్రకు లేక స్వప్నమునకు సంబంధించినది.

**స్వాభావికము.** సం.విణ. (అ.ఈ.అ.) స్వభావము చేతఁగలిగినది, సహజమైనది.

**స్వాభావికులు.** సం.వి.అ.పుం. ఒకతెగ బౌద్ధులు

**స్వాభావ్యము.** సం.వి.అ.న. ౧ సహజత్వము. ౨ సహజస్థితి.

**స్వాభాసము.** సం.విణ. (అ.ఆ.అ.) మిక్కిలి ప్రకాశమానమైనది.

**స్వాభీలము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ ప్రబలమైనది. ౨ భయంకరమైనది.

**స్వామి.** సం.వి.న్.పుం. ౧ అధిపతి. ౨ భర్త. ౩ రాజు. ౪ నాయకుఁడు. ౫ ఈశ్వరుఁడు. ౬ యజమాని. ౭ తత్త్వము బోధించుగురువు. ౮ సన్న్యాసి. ౯ కుమారస్వామి. ౧౦ బ్రాహ్మణుఁడు. ౧౧ దేవతా విగ్రహము.

**స్వామిజంఘి.** సం.వి.న్.పుం. పరశురాముఁడు.

**స్వామిజనకుఁడు.** సం.వి.అ.పుం. మగనితండ్రి.

**స్వామిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧ రాజభార్య. ౨ రాణి. ౩ ఈశ్వరి.

**స్వామిభట్టారకుఁడు.** సం.వి.అ.పుం. ప్రభువు.

**స్వామ్నాయము.** సం.విణ. (అ.ఆ.అ.) సంప్రదాయ సిద్ధముగా వచ్చినది.

**స్వామ్యము.** సం.వి.అ.న. సొంతమగుట, హక్కు (అష్టస్వామ్యములు-దాన, విక్రయ, వినిమయ, జల, తరు, పాషాణ, నిధి, నిక్షేపములు.) ౨ ఆధిపత్యము. ౩ స్వాస్థ్యము.

**స్వాయంభువము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧ బ్రహ్మకు సంబంధించినది. ౨ బ్రహ్మనుండి వచ్చినది.

**స్వాయంభువుఁడు.** సం.వి.అ.పుం. ౧ బ్రహ్మకుమారుఁడు. ౨ ఒకానొక మనువు.

**స్వాయత్తము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ తనకధీనమైనది. ౨ తనమీఁదనే యాధారపడి యుండునది.

**స్వారసికము.** సం.విణ. (అ.ఈ.అ.) ౧ సహజమాధుర్యము గలది. ౨ స్వచ్ఛందమైనది.

**స్వారస్యము.** సం.వి.అ.న. ౧ సహజసౌందర్యము కలిగియుండుట. ౨ లాలిత్యము. ౩ సహజత్వము.

**స్వారాజు.** సం. వి. అ. పుం.= స్వారాట్టుఁడు, ఇంద్రుఁడు.

శా. స్వారాజప్రముఖా మరప్రవరులన్ వర్ణించి ........నైష. ౬-౭౯.

**స్వారాట్టు.** సం.వి.ట్.పుం. ఇంద్రుఁడు.

**స్వారి.** వి. వాహ్యాళి, విహారము.

గీ. శివుఁడు మంథానగిరితుంగ శృంగవీథిఁ,
జెలువు మీఱంగ స్వారిఁ జేయునపుడు.
ఉ.రా. ౧. (శ.ర.)

**స్వారోచిషుఁడు.** సం. వి. అ. పుం. స్వరోచి పుత్త్రుఁడు, రెండవమనువు.

**స్వార్థము.** సం.వి.అ.పుం. ధాత్వాదులకు నిశ్చితమైన యర్థము. ౨ తనప్రయోజనము.

**స్వాలక్షణము.** సం.విశే. (అ.ఆ.అ.) సులభముగా గ్రహింపఁదగినది.

**స్వాలక్షణ్యము.** సం.వి.అ.న. ౧ వింతలక్షణములు. ౨ సహజలక్షణములు.

**స్వాల్పము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ చిన్నది. ౨ కొంచెము. వి.అ.న. అల్పత్వము.

**స్వావశ్యము.** సం.వి.అ.న. ఆత్మనిశ్చయము.

**స్వాస్థ్యము.** సం.వి.అ.న. ౧ స్వస్థత. ౨ ప్రసాదము. ౩ ఆత్మవిశ్వాసము. ౪ స్థిరత్వము. ౫ సంపద. ౬ తృప్తి. ౭ ఆరోగ్యస్థితి.

**స్వాహా.** సం.వి.ఆ. స్త్రీ. ౧ అగ్నిదేవుని భార్య.
సీ. సంస్తూయమానసత్స్వాహాస్వధా కాంత లంఘియ
శాకిన్యంబుల నోలగింప. చిత్ర.భా. ౪-౬౩.
౨ సర్వదేవతాసామాన్యమైన యాహుతి.
సీ. వేదాధ్యయనములు విసవిహిత స్వధాస్వాహా
పుంగి నిలుపఁగఁబడియె.
పాండు. ౬.౧౭౧.
౩. ఋషిని భార్య.

**స్వాహా.** సం.అవ్య. విసర్జనమునైన అగ్నికార్యములయందు దేవతాముల కాహుతులొసఁగు నపుడు మంత్రాంతమున వాడఁబడు పదము.
గీ. ప్రాణముఖవాయువులకు స్వాహాంతములుగ,
జఠరశిఖియందుఁ దన్నానుసరణి మున్ను,
వేల్చి భజియించి వార్చి పవిత్రుఁడగుచు, జదువఁ
దగు శ్రుతి పరమంత్రిశక్తిమాని.
నూత. ౨-౧౦౪.

**స్వాహావల్లభుఁడు.** సం.వి.అ.పుం. అగ్నిదేవుఁడు (ఇట్లే స్వాహాపతి, స్వాహాప్రియుఁడు).

## స్వి

**స్విదితము.** సం.విశే.(అ.ఆ.అ.) ౧ చెమటపట్టినది ౨ కరఁగినది.

**స్విన్నము.** సం.విశే.(అ.ఆ.అ.) ౧ స్వేదముతోఁ గూడినది. ౨ ఉడికినది.

**స్విష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) అధికముగాఁ బ్రేమింపఁబడినది.

## స్వీ

**స్వీకరించు.** సం.స.క్రి. ౧ గ్రహించు. ౨ అంగీకరించు. ౩ అవధరించు.

**స్వీకర్త.** సం. విశే. (ఋ. ర్త్రీ. ఋ.) స్వీకరించువాఁడు.

**స్వీకారము.** సం. వి. అపుం. ౧ అంగీకారము. ౨ గ్రహణము. ౩ పాణిగ్రహణము. (స్వీకరణము. సం.వి.అ.న. స్వీకృతి. ఇ.స్త్రీ.)

**స్వీకృతము.** సం.విశే.(అ.ఆ.అ.) ౧ అంగీకరింపఁబడినది. ౨ గ్రహింపఁబడినది.

**స్వీయ.** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక నాయిక. (పతియందే యనురాగము కలది).

**స్వీయము.** సం.విశే. (అ.ఆ.అ.) తనది.

## స్వు

**స్వుఁడు.** సం.వి.అ.పుం. ౧ బంధువు. ౨ విష్ణువు.

## స్వే

**స్వేచ్ఛ.** సం.వి.ఆ.స్త్రీ. ౧ ఇష్టము. ౨ స్వైరిత.

**స్వేచ్ఛామృత్యువు.** సం.వి.ఉ.పుం. ౧ భీష్ముఁడు ౨ తనయిచ్చననుసరించిపొందు మృత్యువు.

**స్వేదచూషకము.** సం. వి. అ. పుం. చెమటను పోఁగొట్టు చల్లనిగాలి.

**స్వేదచ్ఛిదము.** సం. విశే. (చ. చ. చ.) చల్లపఱచునది.

**స్వేదజము.** సం.విణ. (అ.ఆ.అ.) చెమటనుండి పుట్టు క్రిమివిశేషము.

సీ. మక్షికాక్రిమికీటమత్కుణమశకముల్ చీమ లు మిడుతలు స్వేదజములు. శివప. ౫-౩.

**స్వేదజలము.** సం.వి.అ.న. చెమటనీరు.

**స్వేదనము.** సం.వి.అ.న. ౧ చెమటపట్టునట్లు చేయుట. ౨ చీము.

**స్వేదని.** సం.వి.ఈ.స్త్రీ. పెనము.

**స్వేదనిక.** సం.వి.ఆ.స్త్రీ. ౧ పెనము. ౨ వంటిల్లు.

**స్వేదమాత.** సం.వి.ఋ.స్త్రీ. అన్నరసము.

**స్వేదము.** సం.వి.అ.పుం. ౧ చెమట. ౨ ఒకానొక సాత్త్విక భావము. ౩ ఉష్ణము, ఆవిరి.

**స్వేదితము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ ఆవిరితోఁ గాచఁబడినది. ౨ మృదువుగాఁ జేయబడినది.

## స్వై

**స్వైరము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ తనయిచ్చ వచ్చినట్లు సంచరించునది. ౨ స్వేచ్ఛతోఁగూడినది. ౩ రహస్యమైనది. ౪ ఋజువైనది. ౫ మందమైనది. వి.అ.న. స్వేచ్ఛ; స్వతంత్రత.

**స్వైరవిహారి.** సం.విణ. (న.ఈ.న.) అడ్డులేకుండ సంచరించునది.

**స్వైరాలాపము.** సం.వి.అ.పుం. రహస్య సంభాషణము.

**స్వైరి.** సం.విణ. (న.ఈ.న.) ఇష్టానుసారముగా సంచరించునది.

**స్వైరిణి.** సం.వి.ఈ.స్త్రీ. ౧ ఇష్టానుసారముగా సంచరించు స్త్రీ. ౨ కులట.

క....స్వైరిణి గాఁ, దగు మగని విడిచి వేఱొక, మగని దగిలి లజ్జలేక మనియెడు నేనిన్. విజ్ఞా. కాం.౧.౧౧౦.

**స్వైరిత.** సం.వి.ఆ.స్త్రీ. ౧ స్వేచ్ఛ. ౨ విచ్చలవిడి వర్తనము.

**స్వైరుఁడు.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ స్వైరి. ౨ సోమరి.

## స్వో

**స్వోదరపూరకుఁడు.** సం.వి.అ.పుం. కుక్షింభరి.

**స్వోరసము.** సం.వి.అ.పుం. ౧ గానుగపిండి. ౨ పొల్లు.

**స్వోవశీయము.** సం. వి. అ. న. ౧ సౌఖ్యము. ౨ సంపద.

## హ

**హ.** ఇది. ఒకయక్షరము, ఊష్మములలోఁ గడపటి వర్ణము.

**హంకరించు.** అ. క్రి. అహంకరించు, గర్వించు, అభిమానమువహించు (శ.ర.)

**హంకారము.** వి. (సం. అహంకారః) అభిమానము, అహంకారము.

సీ.... తనువుమూలముదుఃఖములకు దేహము కర్మమునకుబుట్టు, హంకారమునుగల్గు నమ్మేను నందునఁ గర్మంబులెల్లను గల్గుచుండు. అధ్యా. కిష్కి.౧. ౧౭౯.పా.

సీ. తరుణీమణులకెల్లఁ దనంబులుపట్టు పట్టిల్లు హంకారములకెల్ల నాటపట్టు. చంద్రా. ౨-౧౦.

**హంగు.** వి. ౧ ఒనరు, అనుకూల్యము.

ఆ. వేసమునకునైన దాసరిగావచ్చు, హంగుదప్పు వేళ జంగమగును. వేమన. ౨౬౨ (బ్రౌ)

౨ కార్యసిద్ధికై వెనుకనుండి చేయు ప్రయత్నము. వ్యవః—వాఁడు వెనుకనుండి హంగుచేయుచున్నాఁడు.

**హంజ.** సం.వి.ఆ.స్త్రీ. దాసి (ఆ.ని.)

**హంజి.** సం.వి.ఇ.పుం. తుమ్ము.

**హంజిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧ దాసి. ౨ ఓషధి విశేషము.

**హంజే.** సం.అవ్య. చేటినిసంబోధించునపుడుపయోగించు పదము.

**హాండ(డా).** సం.వి.అ.స్త్రీ. ౧ వెడల్పువోరగల పెద్దమృత్పాత్రము. ౨ వెడల్పువోరగల పెద్ద లోహపాత్రము. (ఆ.ని.) ౩ నీచజాతిస్త్రీ.

**హాండి.** సం.వి.ఈ. స్త్రీ. హండా, వెడల్పునోరు గల పెద్దమంటిపాత్రము (ఆ.ని.)

**హాండిక.** సం.వి.అ.స్త్రీ=హండి.

**హాండే.** సం. అవ్య. నీచస్త్రీసంబోధనమునవాడఁ దగినపదము.

**హాంత.** సం.విణ. (ఋ.తీ౨.ఋ.) చంపువాఁడు. ౨ హింసించువాఁడు. ౩ తొలఁగించువాఁడు. ౪ ధ్వంసముచేయువాఁడు. వి.ఋ.పుం. ౧ చంపువాఁడు. ౨ దొంగ. అవ్య. సంస్కృతమున సంతోషాశ్చర్యవిషాదాదులను దెలుపుటకై యుపయోగింపఁబడును.

**హాంత.** విణ. దుష్టురాలు.

క. కాంతల నమ్ముదురే ధీ, మంతు లిసీ మతను లతలు మాయామృగముల్, హాంతలు జగ జంతలు నిను, మంతయు లోకాపవాదమర యరు మదిలోన్. శుక. ౧-౧౧౪.

వి. మాయ, మోసము. చూ.హాంతలాఁడి.

**హాంతకారము.** సం.వి.అ.పుం. అతిథికి సమర్పించు నుపహారము.

**హాంతలాఁడి.** విణ. (హాంతలు+ఆఁడి.) మాయలాడి, మోసకత్తె.

గీ. అక్కటా కానవైతి నీహాంతలాఁడి, వగలు నమ్మితిఁగద పతివ్రతయటంచు. శుక. ౩-౬౩౬.

**హాంతువు.** సం.వి.ఉ.పుం. ౧ చంపుట. ౨ చావు. ౩ ఎద్దు.

**హాంభ.** సం.వి.అ.స్త్రీ. గోధ్వని, ఆవు అఱపు.

**హాంవీరతాయెతు.** మి వి. ౧ శూరతా చిహ్నముగు నలంకార విశేషము.

వ....పొగరు దఱిగి జాదుమఱుఁగునంబరగు పగ అలంగావుమని కరతలంబుల వ్రాలిన కాంత రచంబురీతిమగ వాతిహాంవీర తాయెతు సొంపు నింపఁగ గాజిలాజులగు సంస్థన్క్ష చంద్రము బంబు బంబంది.... చంద్రా. ౫-౧౩౯.

౨ ఒకవిధమగు భూషణము.

వ....చేకట్టులు హాంవీరతాయెతులు తాళిలు కంఠమాలికలు కంటసరు లుత్తరిగెలు చౌకట్టు లొంటులు మురువులు తురాలు కిరీటంబు లనంబరగు నాభరణంబులును.... ప్రబంధ ౬౦౫

రగడ. రంగుగలముంగా మురాలు నాభరణములు, నంగదంబులు మంచి హాంవీరతాయెతులు. హంస. ౫-౩౫౬.

**హాంవీరనాట,** వి. రాగవిశేషము, (సంగీ) ముప్పదిరెండు నపుంసకరాగములలో నొకరాగము.

గీ. రీతిగౌళయు నీలాంబరియును ఘనము, దనరు హాంవీరనాటయునని నపుంసకములు ముప్పదిరెండు రాగములు.... ప్రబంధ.౯౭.

**హాంవీరుఁడు.** సం.వి.అ.పుం. క్షత్రియుడు. విణ. (అ.అ.అ.) శూరుఁడు....సమరహాంవీరుఁడు. ... శశాం. ౫. అ. (శ.ర.)

**హాంస.** సం.వి.అ.పుం. ౧ అంచె. ౨ పరమాత్మ. ౩ యోగివిశేషము. ౪ శరీరవాయువిశేషము. ౫ తెల్ల గుఱ్ఱము. ౬ మంత్రవిశేషము. ౭ మాత్సర్యము. ౮ (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠము. రాజహంస మొII (శ.ర.) [కొన్నియర్థములలో హంసము అనియు వాడఁబడును.]

**హాంసకము.** సం.వి.అ.పుం. ౧ కాలియందె. ౨ అంచె.

**హాంసకాలీతనయము.** సం. వి. అ. పుం. దున్నపోతు.

**హాంసక్క (సి) లకము.** సం.వి.అ.పుం. రతిబంధ విశేషము.

**హాంసకూటము.** సం.వి.అ.పుం. ౧ హిమాలయ శిఖరములలో నొకటి. ౨ ఎద్దుమూపురము.

**హాంసగద్గద.** సం.వి.అ.స్త్రీ. మధురముగా మాటలాడు స్త్రీ.

**హంసగుహ్యము.** సం.వి.అ.న. ఒకానొకబుక్క.

**హంసచ్ఛత్రము.** సం.వి.అ.న. సొంటి.

**హంసతిలక (ము).** సం.వి.అ.న. రాగిడిబిళ్ల.

సీ. శృంగారరాజ్యలక్ష్మికి ముడికలిపిన, కతి
హంస తిలకంబుఁ గబరిఁబూన్చి.
కు.సం. ౯.౧౩.

**హంసతూలము.** సం.వి.అ.పుం.న. అంచతూకలు

**హంసనాదిని.** సం. వి. ఈ. స్త్రీ. కొన్ని ప్రత్యేక లక్షణములుగల స్త్రీ. (గజేంద్రగమన, తన్వి, కోకిలాలాపసంయుత, తనుమధ్య, ఘనజఘన యగు స్త్రీ హంసనాదిని యనఁబడును)

**హంసవక్త్రము.** సం.వి.అ.పుం. అభినయవిశేషము.

**హంసపదము.** సం.వి.అ.పుం. ఒకానొకతూనిక (కర్షము)

**హంసపాదము.** సం.వి.అ.పుం. ౧ సిందూరము. ౨ పాదరసము. ౩ వ్రాఁతయందు తప్పుగల చోటనుంచెడి హంసపాదాకారమైనగుర్తు.

**హంసపాది.** వి. ఒకానొక చిన్నచెట్టు.

సీ. ముయ్యాకుపొన్నయుఁ మొగలియుఁ తుత్తెర
బంకతుత్తెర హంసపాది ... హంస.౪-౧౦.

**హంసయానము.** సం. వి. అ. న. ౧ అంచలచే లాగఁబడువాహనము. ౨ అంచనడకవంటినడక.

**హంసరథుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ (ఇతఁడే హంసవాహనుఁడు).

**హంసలిపి.** సం. వి. ఇ. స్త్రీ. జైనులు వ్రాసెడి యొకవిధమైనవ్రాఁత.

**హంసలోహకము.** సం.వి.అ.న. ఇత్తడి.

**హంసవళ్ళి.** మి.వి.ఇ. వస్త్రవిశేషము.

గీ. హంసవళ్ళిను బద్మాలు హరిణవళ్ళి, మొద
లుగావల్వలుధరించి ముదితలప్పుడు.
ప్రబంధ. ౨౭౨.

**హంసాంఘ్రి.** సం.వి.ఇ.పుం. సిందూరము.

**హంసాంశువు.** సం.విశే. (అ.ఆ.న.) తెల్లనిది.

**హంసాభిఖ్యము.** సం.వి.అ.న. వెండి.

**హంసావళి.** మి.వి. వస్త్రవిశేషము.

ది. తమవుఁబుత్తడిచీరఁ దడియొత్తిసతికిఁ,
బొనర హంసావళిపుట్టంబు గట్టి.
ద్వి. భార.విరా. ౪౯౬.పా.

వ.... తారామండలంబులును హంసావళులును
హరిణావళులును ...పుట్టంబులు గట్టుకొని....
ద్వా. ౩-౭౭.

**హంసి(క).** సం.వి.ఈ.అ.స్త్రీ. ఆఁడుహంస.

**హంసిని.** సం.వి.ఈ.స్త్రీ. ఒకవృత్తము.

**హంసిరము.** సం. వి. అ. పుం. ఒకవిధమైన చిట్టెలుక.

**హంసుఁడు.** సం.వి.అ.పుం. ఒకరాక్షసుఁడు.

చ. ఖరమురకంసహంస నరకాదిసురారుల ప్రా
ణవాయువుల్, పొరిగొని....రాధికా. ౨-౩౪.

**హంసోదకము.** సం.వి. అ. న. ౧ ఏలకికాయలు కలిపిచేయఁబడిన హృద్యమైన మద్యవిశేషము. ౨ ఎండకువేడిచెంది వెన్నెలకుఁజల్లపడునుదకము.

వ.... హంసోదకంబులను తీర్థసుగంధోదకంబు
లను మజ్జనంబార్చి.... కు.సం. ౯-౫.

౩. హంసమూత్రము.

**హక్కా.** సం.వి.ఆ.స్త్రీ. గ్రుడ్లగూబ.

**హక్కము.** సం.వి.అ.పుం. ఏనుఁగులపిలుపు.

**హక్కాహక్కము.** సం. వి. అ. పుం. సవాలు చేయుట.

**హజారము=అజారము.** వి. ౧ ఆస్థానమంటపము, కొలువుకూటము.

చ. కుముదము నిద్రవోఁబొదుపుఁగొండపయిన్
రవితొప్పెఁజూడఁగా, సమసికలీల నింద్రుని
హజారపుమేడపైఁ బైడికుండయై.
కాశీ. ౧-౧౨౫.

గీ. వజ్రవస్వర్యదరుచిసాంద్రుఁడైనరాము, చం
ద్రుఁడొగివచ్చె జనకుహజారమునకు,
వసు.రా. ౩-౧౨౨

క. భూరమణుఁడత్తఱిఁ గొలువిచ్చి హజారమ్మున నుండునట్టిసమయమున మెఱిఁగి యొయ్యారంబున నఖిలవళ్యంగారంబులు మెఱయఁగజని ప్రగల్భత మీఱన్. వైజ. ౧-౧౧౪.

౨. ముంగసాల, ముఖశాల.

ఉ.... మోపెనంత నిస్సాణము పాకశాసను హజారమునం గదనాభిశంసిరై. పారి. ౪-౬౩.

ఉ. అంకెటద్వారకాపురమునందు సభాపరిపాలుఁడర్జునో, దంతము గాఁదవుల్ దెలియునట్లు హజారమునందు భేరియు, త్యంతరుసాకిపాయిత హృదంతరుఁడై చలిపించె ..

విజ. వి.3. ౧౫౭.

చ. చనిచని ముందటన్ వెలిహజారము చెల్వడి వచ్చుచున్న యోగసనకసనందనప్రముఖ సంయములంగని పెద్దకొల్వు దీర్చనలువయించు చెంచి.... దశా. ౧-౭౬3.

హజారు. వి. ఆస్థానము, కొలువు.

క. వచ్చినమంత్రుల నృపతివి, యచ్చరనాయకు ననుజ్ఞ నవసరిసచివుల్, చెచ్చెర హజారున కుఁదిలువ, వచ్చిన నృపుని వడిచిగ్గి తగన్. రా. వి.౫-32. (శ.ర.)

హజ్జ=అజ్జ వి. ౧ పాదము, అడుగు.

ఉ. ఎంతటిసేగిగల్గెఁ బరమేశ్వరుఁడే దయచేసి వచ్చె నాయింతకెటన్న పల్కు కలచెన్ను మోదకరంబె రాయెంచు నత్యంతము కోమలంబులగు హజ్జలు నొవ్వవె నొచ్చెనంచుఁదాఁ, జింతవహించుచున్నయది చిత్తము చేడియలార యెట్లిఁకన్. పార్వ. ౪-౧౭౪.

క.... పాదపద్మములజిగిజాళ్వాగజ్జెలు మెఱయఁగఁబజ్జల, హజ్జలిడుంగుజ్జుతల్లి యానందింపన్.

దశా. ౫-౬౮.

౨. అడుగుజాడ, పాదముద్ర.

సీ. ఏనుంగుహజ్జలో నెల్లసత్త్వంబుల హజ్జలు నడఁగినయట్లుపోలె. భార. శాం. ౨-౭3౬.

3. కాలు.

సి. జంటవల్ హజ్జలదంట బల్ మెకముల బిలగంబు మితి యేఱుపఱుపరాదు.

ఉ. రా. ౭-3౯౦.

బలుహజ్జమెకము=ఏనుఁగు.

సీ. బలుహజ్జమెకపుదాఁటులు సిల్కుదట్టంపు టానుసీరునసేల యసలుగొనఁగ.

అచ్చ. రా. యు. ౧౯౪.

హట్టము. సం. వి. అ. పుం. ౧ అంగడివీథి. ౨ సంత.

హట్టవాహిని. సం. వి. ఈ. స్త్రీ. అంగడివీథిలోని మురుగుకాలువ.

హట్టవిలాసిని. సం. వి. ఈ. స్త్రీ. ౧ కులట. ౨ నఖయనెడు సుగంధద్రవ్యము. 3 పసుపు.

హట్టాధ్యక్షుఁడు. సం. వి. అ. పుం. అంగడివీథిని పర్యవేక్షించు నధికారి.

హట్టి. సం. వి. ఈ. స్త్రీ. చిన్నయంగడివీధి.

హఠపర్ణి (ర్ణ). సం. వి. ఈ. స్త్రీ. ౧ నాఁచు. ౨ పాఁచి.

హఠబుద్ధి. సం. వి. ఇ. స్త్రీ. తలవని తలంపుగా లాభమువచ్చునను విశ్వాసము.

హఠము. సం. వి. అ. పుం. ౧ పట్టుదల.

ద్వి. హాతల నమ్మించి ధనములఁగొనెడి, కఠిన చిత్తులు తేరుగాకలోకముల, హఠమేల నృపులతో యమివరేణ్యులకు.

ద్వి. హరిశ్చ. ఉ. ౪3౭. పం.

౨. బలాత్కారము. 3 యోగవిశేషము. (శ.ర.) ౪ దౌర్జన్యము. ౫ పీడనము. ౯ మొండితనము. ౭ అత్యావశ్యకత. ౮ శత్రువు వెనుకనురుగుట. ౯ ఆకాశమూలి i. ౧౦ ఆకస్మిక లాభము.

హఠయోగము. సం. వి. అ. పుం. ఒకవిధమైన యోగాభ్యాసము. (ఒంటికాలిపై నిలుచుట చేతులు పైకెత్తుట, పొగపీల్చుచుఁదలక్రిందుగా వ్రేలాడుట. ఈవిధముగా నవయవములఁ గ్లేశపెట్టి చేయు యోగము. ఇదిరాజయోగముకంటె విలక్షణమైనది.)

హఠవాది. సం. విశే. (శ.వి.క.) మొండిపట్టు పట్టి సాధించునది.

**హతవాదికుఁడు.** సం.వి.అ.పుం. చార్వాకునివంటివాఁడు.

**హతవిద్య.** సం.వి.ఆ.స్త్రీ. హఠయోగశాస్త్రము.

**హఠాదేశి,** సం.విణ. (క్.సీ.క్.) బలాత్కారముగా వ్యతిరేక విధానము నవలంబించునది.

**హఠాయాతము.** సం.విణ. (అ.ఆ.అ.) అపరిహార్యము, విడువరానిది.

**హఠాలువు.** సం.వి.ఊ.స్త్రీ. ఒకవిధమైనచెట్టు.

**హఠిక,** సం.వి.ఆ.స్త్రీ. కోలాహలము, పెద్దధ్వని.

**హఠికము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ అకస్మికము. ౨ ఉగ్రము, తీవ్రము.

**హడపము**=అడపము. వి. వక్కలాకులుంచుకొనుపెట్టె, తాంబూల కరండము.

చ. హడపము వీణ కిన్నెరహిమాంబువు నించిన గిండి ......ముదం,బడర ధరించి యూడిగపుటబ్బురపున్నెలిగుబ్బెతల్ దగన్. కువల. ౪.౧౩౭.

ద్వి. కేళి వానురరాజు కిన్నరరాజు, గాళాంజి హడపంబు గైకొని నడప.

ద్వి. పరమ. ౫.౪౭౭.పా.

**హడపు**=అడప. వి. ఉపదర్శనము, కనుపెట్టి చూచుట.

వ....కాట, బోలపణ్ణంబును ఎఱియబోల బాదఙ్గాను తలరానినావయబెరసిన బోలునల్లురుం బూణ్ణగా ఎఱియబోల బాదని హడపునకేత బోలదుగ్గని. ద.శా.సం. ౪-౧౧౧౧నం.

**హడి.** సం.వి.ఇ.పుం. దారుమయశృంఖల, బొండకొయ్య.

**హడి (డ్డి) కుఁడు.** సం.వి.అ.పుం. నీచజాతి పురుషుఁడు. (ఇక్లీ. హడ్డి, హడ్డకుఁడు, హడ్డిపుఁడు.)

**హడ్డజము.** సం.వి.అ.న. మజ్జ, అస్థిసారము.

**హడ్డము.** సం.వి.అ.న. ఎముక.

**హథశబ్దము.** సం. వి. అ. పుం. న. చిన్నచేరి వాద్యము.

**హణిగలు.** వి.బ. నమస్కార విశేషము.

రగడ. నీలాచలమున వెలకొను పురుషోత్తమునకు హణిగలు దండిగఁజేర్చుచు. హంప. ౪.౨౧౩.

**హత.** సం.వి.ఆ.స్త్రీ. చెఱుపఁబడిన స్త్రీ.

**హతకుఁడు.** సం.విణ. (అ.ఆ.అ.) దుఃఖితుఁడు; కష్టుఁడు. వి.అ.పుం. నీచజాతి పురుషుడు; పిఱికివాఁడు.

**హతచ్ఛాయ.** సం. వి. ఆ. స్త్రీ. తొలఁగిన సౌందర్యము.

**హతబుద్ధి.** సం.విణ. (ఇ.ఇ.ఇ.) బుద్ధిలేనిది.

**హతభాగ్యము.** సం.విణ. (అ.ఆ.అ.) అదృష్టహీనము.

**హతము.** సం.వి.అ.న. ౧ చంపుట. ౨ కొట్టుట. విణ (అ.ఆ.అ.) ౧ చంపఁబడినది. ౨ బాధింపబడినది. ౩ నష్టమైనది. ౪ కొల్లగొట్టఁబడినది. ౫ నిరాశపొందినది. ౬ అడ్డగింపఁబడినది. ౭ దీనమైనది.

**హతలక్షణుఁడు.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ శుభలక్షణములు లేనివాఁడు. ౨ దురదృష్టవంతుఁడు.

**హతాశుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) ౧ ఆశగోల్పోయినవాఁడు. ౨ విషణ్ణుఁడు. ౩ శక్తిహీనుఁడు. ౪ దయారహితుఁడు. ౫ వ్యర్థుఁడు. ౬ నీచుఁడు.

**హతాశ్రయుఁడు.** సం.విణ. (అ.ఆ.అ.) దిక్కులేనివాఁడు.

**హతా (త) హతము.** సం.విణ. (అ.ఆ.అ.) మిక్కిలి కొట్టఁబడినది.

క. అనికొనియాడివసేనాని నిలింపులనాదరించి నిఖిలజగత్పూర్ణ నిరంకుశ తేజంబున,దనుజాల ననిలో హతాహతంబుగఁ దోలెన్.

వరాహ. ౬.౯౭.

ద్వి. వడిఁద్రోసములనైచి వజ్రంబులాని, యడిదంబులను హతాహతముగాఁబొడిచి.

ద్వి. భార. విరా, ౧-౧౬ పా.

క. పతిగలిగి చదువు చిలుకలు, హతహతములు
గాఁగఁబోటులాడున్ బటువుల్, వితరణ
మెవ్వరిగుణమగుఁ, జతురుఁడు కూరుండు
నతఁడు జనులం దెల్లన్. ద్వా.౭.౮౧.

**హతాహతి.** సం. వి. ఇ. స్త్రీ. హళాహళి, అతిత్వర.

లయగ్రాహి....పెక్కుల్. వ్యూహములు బయ
ల్పడి హతాహతిఁజనంబులపి రాహవములోనన్.
కు.సం. ౧౨.౧౭౦.

మ....అమరుల్ భేదిల్లి ఖిలిన్ హతా, హతి
మార్వెట్టక పాఱ.... కు.సం.౧౨.౧౨౯.

**హతి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ దెబ్బ. ౨ నష్టము. ౩ అపజయము. ౪ లోపము. ౫ చంపుట.

**హతుఁడు.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ కొట్టఁబడినవాఁడు. ౨ చంపఁబడినవాఁడు. ౩ నిరాశ చెందినవాఁడు. ౪ అడ్డగింపఁబడినవాఁడు. ౫ పూర్తిగా ధ్వంసము చేయఁబడినవాఁడు. ౬ దీనుఁడు.

**హతువు.** సం.వి.ఉ.పుం. శీతకాలము.

**హత్తి.** వి. (సం.హస్తీ.) ౧ ఏనుఁగు.

గీ. హత్తి మిత్తి చందంబున హత్తినడువఁ,గత్తి
గుత్తుకను బిరానఁ గత్తిరించి, సత్తిమత్తిల్లి
బలిసేసె సత్తినొక్కఁ, డవనిపతియిచ్చు మేలు
మేలనుచు మెచ్చ- చంద్రా.౨.౮౮.

క. అత్తటిని జేరఁబోయిని, యత్తటినికి సాటి
యైన దారాయనుచున్, బ్రోత్తుంగం బౌతట
మున, హత్తివలె వసింపఁగని ప్రహస్తుఁడు
పలికెన్. ఉ.రా.౩-౧౬౪.

౨. కుంజరాదిశబ్దములవలె కర్మధారయసమాస
మున నుత్తరపదమై శ్రేష్ఠవాచకమగును.

గీ. క్రొత్తనెత్తమ్మికంటెను మెత్తనైన, యిత్తె
లిరుటాకుటడుగంచు నీశ్వరాంఘ్రి, యిత్తి
యిత్తి కనుంగవ నొత్తి యిత్తి, బత్తివత్తిల్ల
నారాధహత్తి వలికె. బహుళ.౩.౩౦.

**హత్తించు.** స.క్రి. (√ హత్తు) ౧ అతుకఁజేయు అతికించు.

క. దండించితరులు వెసమే, పాండంబులు ద్రెంచి
తెచ్చి హత్తించిన నా, ఖండులఁ దది
యాదిగమే, పాండుందరయ్యె....
భా.రా. బాల.౫౧౨.

సీ. రేయను వాలునఁబాయనైన రథాంగతతుల
హత్తించు సంధాన కరణి. పారి. ౪-౪౯.

౨. కూర్చు, కలుపు.

సీ. గోడిగజాతిలోఁగొదమపెంటుల చేర్చి మా
వుల హత్తించు మార్దవంబు.
భార. విరా. ౧.౪౮.

వ. కుంటెనకత్తెయైన శ్రద్ధయను తొత్తు కూఁతురు
పనివత్తరుణిని వివేకునితో హత్తింప నెత్తి
కొన్నయది. ప్రబోధ. ౨-౪౮.

౩. చేర్చు.

క. ఎత్తినగదలంకించియు, హత్తించియు బ్రమసి
దిరిగి యడిచియుఁబయిపై, నొత్తియుఁదట్టి
యుఁ బట్టియు, మత్తగజద్వయముబోలె మలసి
రిరువురున్. ఉ.హరి. ౩.౬౨.

శా....పంచేంద్రియో, న్మాదంబుంబరిమార్చి బుద్ధి
లతకున్ మాటాకుహత్తించి ని, ష్ఖేదబ్రహ్మ
పదావలంబనరతిం గ్రీడించు యోగీంద్రుమ,
ర్యాదన్.... భాగ. ౮.౬౫.

౪. ఉంచు, పెట్టు.

సీ....కుంకుమ హత్తించి కొనగోరఁదీర్చిన పురు
హూతునిల్లాలి బొట్టనంగ.
ఉ. హరి. ౩-౮౬.

వ....మనశ్శిలాచిత్రకంబు నొసలన్ హత్తించె....
వైమ. ౬-౪౪.

౫. పూయు, పట్టించు.

సీ. తనువల్లి హత్తించె ధవళభూతి.
హర. ౪.౧౧.

౬. తాఁకించు.

మ. జనకోత్సంగ నివాసవాసననొ రాజన్యాస్త్రహ
స్తాభిమ, ర్శన సౌఖ్యామృతపారవశ్యమునకో
నైఁచెన్ శిలాయోజనం, బనిసాధ్వుల్ వొగ
డం బ్రియాంఘ్రి సరోకల్ హత్తించె భూ
జాని.... వసు. ౬-౩౨.

౨ కలిగించు.

వ....తత్తపస్వికి త్తితంబగు నమ్మత్తకాశినీరత్నం బు కంధుచాపాధిరోపణ ప్రయత్నంబు చిత్తంబున హత్తింప.... చం.రా.౩.౯౮.

**హత్తింపు.** వి. (√ హత్తు) కలయిక, కూటమి, సురతము.

సీ. అది చాలకెదురెక్కి యనురాగమునఁ బ్రొక్కి
వింతహత్తింపులఁగొంత సేపు.
కళా. ౪-౬౮.

**హత్తు**=అత్తు. అ.క్రి. ౧ కలుగు.

క. అత్తతి చిత్తరిఁగని భూ, భృత్తనయోత్తముఁ
డు తత్తరిలుచు త్తమునన్, మెత్తపడి క్రొత్త
వలపులు, హత్తఁగ నత్తెఱఁగ కిట్టుల నిరుం
బ్రేమన్. రసిక. ౩.౨౬.

క. ఉత్తరమునఁబొదమును బ్రత్యుత్తర ముత్త
రము లేక యుత్తరమగునే, హత్తిన సువ్యక్తి
వలనన్, విత్తులకుంబొదమినట్టి విత్తులపోలెన్
నా.పంచ. ౧.౧౧౨.

౨. అంటు, సక్తమగు.

గీ. చిఱుతవోయిన మూఁకుటిచెలువు దాల్చి,
హత్తెనొకచో విశాఖ వింధ్యాద్రియందు.
కాశీ. ౧.౧౩౮.

సీ. గుత్తంపురయిక దా హత్తకుండఁగఁజేని కల
పంబు కులుకు గుబ్బలను బూయు.
హంస. ౧.౨౧౬.

౩. నాఁటుకొను, లగ్నమగు.

గీ. తోఁడఁబరువులు వాఱుచుఁ దోఁటపసులు,
సేయుచూపు మదిన్ హత్తి పాయకునికి -
కళా. ౪.౧౦౫.

౪. గ్రుచ్చుకొను, నాఁటుకొను.

క. గుత్తంబు గుబ్బలురమున, హత్తఁగ సరియాని
యాని యారసికుండున్, చిత్తరియును బెనఁ
గిరి.... కళా.౩.౧౦౮.

౫. ఉండు, వర్తించు.

సీ....దండకాటవిపొందలు పంప కుదగాఁగల
క్షేత్రకటల పొల్ల, వజానకు హరికి నాకా
యత్తమై హత్తు.... పాండు. ౨.౨౨౫.

౬. చేరు, సమీపించు.

వ....పరమ భాగవతు ననుగతికి హత్తు సత్త్వ
గుణ సంపద విధంబున వదాన్యమూర్ధన్యునకు
ననుకూలయగు కీర్తిబాలిక పోలిక....
చం. రా. ౩.౨౫.

గీ. చూచినప్పుడె విలుపాఱవైచి సరస, తామరస
భీమతరగదా దండమెత్తి, దండహత్తి మనో
జుండు దండవెట్టి, నమ్మహీదేవు నెమ్మదిరిమ్మ
నొదవ. శుక. ౨.౪౫౩.

౭. కలియు, కూడు.

గీ. బెదరి చేరనిబలియుని బిగియఁబట్టి, కరనిపై
పడిసేవచ్చి హత్తకేఁత, క్రమము....
ఆము. ౪-౨౫౧.

౨. పొందుపడు, అనుకూలించు.

శా. ఏగంధర్వుఁడు తద్విలాసములు మున్వీక్షించి
తాఁవెంతయున్, రాగాంధుడయిఁకోరి హత్త
కకడున్ రారాపులం గంతుఁడు, ద్వేగంబుం
దగఁజేయ నెవ్వగల నువ్విళ్ళూరుచున్ వేఁగు
వాఁడు.... మనుచ. ౩-౭౮.

౯. సంభోగమునకై పైఁబడు, పైకొను.

గీ. మధురగంధోత్తమాపానమత్తులగుచుఁ, జిత్త
మున నానరయొఱఁగక పెంత్తమువను, హత్తు
కొనుబిత్తరులఁగూడి....దశా. ౮-౪౧.

స.క్రి. ౧ తాఁకు, అంటు.

ఉ....కంతుచేతిమా, అంచులకత్తిహత్తి జవరాలి
కూచాద్రులముంచెఁ బత్రకే, ఖాంచితవైభ
వంబెదల నాతతశాష్పమహాపయోనిధిన్.
వసు. ౩-౧౦౨.

౨. పొందు.

శా. తత్తాదృగ్విభవప్రభావనిధిఁ గందాళప్ప
గారిన్.... గొల్చుచుఁ దదాశీర్వాదలబ్ధోన్న
తిన్, హత్తిందానువిరూరిమంత్రిమణి వేదా
ద్రీశుఁ డుద్యద్రుచిన్. పాండు.౧-౨౫.

ఉ....అన్నివిద్యల నహీనుఁడ నేవనికాపువారిచే,
క్రొంక్కులుగొంచునాఁడు పమున్నతగర్వ
ము హత్తి వర్తిలున్. శుక.౨-౪౩౨.

౩. చేరు; అధిరోహించు.

ఉ.... గృహాంగణసౌధమాలికల్, హత్తి నరేంద్ర
వీథిఁ జతురంగబలంబులు గొల్వఁగా మరు,
న్మత్తగజంబుపైఁ జను కుమారశిరోమణిఁ జూ
చి రుబ్బునన్. మనుచ ౫-౬౦.

౪. ఉంచు, నిలుపుకొను.

ఉ. భృకుటిరూపరిం జదువుపుత్తడి హత్తిన
పెద్దసైన మో, రొక్కొకవేళఁ బాటవము
నొందమిఁ జెందినఁ జక్కఁబెట్టు వా, రు....
పాండు. ౫.౨౧౮.

౫. తగులుకొను.

సీ. ఏను నీతోడన యేతెంచుచో నొక యిత్తి
డాపలివంక నేఁగుటయును, గీ. జూచి నిలిచితి
నేను నిల్చుటఁ గనుగొని, యుచటనిట్టిది
హత్తెనో యుఱుకపోద, వేగిరించక నీవ
భావించుకొనుము, కల్ల నిజములు క్రమముగాఁ
గానవచ్చు. కళా.౩.౧౮౪.

౬. కాఁగిలించు, ఆలింగనముచేయు.

ఉ. కుప్పసముల్ వదల్చి రతిగుబ్బల నొత్తిలి
హత్తివేగుజా, మిప్పలలర్చుగాడ్పులకధీశు....
ఆము. ౫.౧౦౪.

**హత్తుకొను.** అ.క్రి.(హత్తు+కొను, స్వార్థమున)
౧ కలుగు, పుట్టు.

క. నెత్తుటఁ జొత్తిల్లియుఁ బలు, పెంత్రములై
రాక్షసులు జమునిభృత్యులకున్, జిత్తమ్ముల
నుత్తలమున్, దత్తరమును హత్తుకొన రణం
బులు సేయన్. ఉ.రా. ౩.౩౩౩.

వ. రక్షఃకళత్రంబుల నేత్రంబుల కవేల తరవారు
లౌనఁగు తరవారులన్ దవీయ చందతర
బాహాదండకదళీయుగళ వేదండతుండపాండి
త్యంబు హత్తుకొన వత్తిల్లి....
చం. రా. ౫.౮౫.

౨. నెలకొను, ఉండు.

క. క్రొత్తై త్రిశృంగశిఖరము, నుత్తరశృంగంబు
వరుస నుత్తరపు దిశన్, హత్తుకొని కదలిదాఁ
కను, నుత్తరకురుభూము లమరుచుండును
మహిమన్. వరాహ. ౧౦.౧౬౦.

౩. నాఁటుకొను, లగ్నమగు.

గీ. బలిమియొసంగినపూజలు సలిపి వేఁడు, కొనినఁ
దత్కాంతిమతిమాయ మనమునందు, హత్తు
కొని యున్కిచే మానవదయ్యె నధిప, కాళికా
దేవి నిజశిరఃకంపనంబు. శుక.౪-౬౪.

స.క్రి. ౧ కూడు, కలియు.

గీ. హత్తుకొనవచ్చు నీవంటియంగనాని, కట్టి
ముద్దుల గుమ్మను గుట్టుతోడ, ననిన మనసిచ్చి
మదిలోన హర్ష మెచ్చి, మంత్రసానికి విడె
మిచ్చె మమతతోడ. హంస.౨-౪౫.

౨. చేరు, ఆశ్రయించు.

సీ. పాదహస్తు కొని సమున్మదవృత్తిఁ జనుహత్తి
కొమ్ములంటఁ బెకల్చి కొట్టె నొకఁడు.
శుక. ౧-౧౩౪.

౩. తగులుకొను, కూడుకొను.

సీ. వనితయువ్వాని హత్తుకొనునో వీనినటంచు
వెంటనే బుడుతల వేఁగఁబనుపు.
కువల. ౪.౧౬౦. రాధికా. ౮-౧౦౨.

**హత్తుకొలుపు.** స.క్రి. (√. హత్తుకొను) హత్తు
కొనఁజేయు, పొందుపఱుచు.

సీ. తాటంక వలయమధ్యమునఁ జెందొవ పువ్వు
లవతంసకముగాను హత్తుకొలిపె.
వైజ. ౪-౩౦.

**హత్తుగడ=అత్తుగడ.** వి. (√. హత్తు.) ౧ పొం
దిక, చేరిక.

ఉ....కోటల జియ్యల కియ్యోయారికిన్, హత్తు
గడంచుఁగొంచ అప్పు దండురు....
బహుళ. ౫-౮౧.

౨. కలయిక.

ఉ....హత్తుగడ కూడునె చూడఁ బదాబువన్నె
బం,గారములోనసైన వెలిగారము గూడక
యున్న భాస్కరా. భాస్కర.శ.౧౧.

**హత్నువు.** సం. వి. ఉ. పుం. ౧ ఆయుధము.
౨ రోగము. ౩ చంపువాడు.

**హత్యా.** సం.వి.ఆ.స్త్రీ. వధము, చంపుట; వధజనిత పాపము.

ద్వి ...రాముండు, విధిపౌత్త్రరావణువధియించి నట్టి, హత్యాఁబాపుకోనండ హరిఁబ్రతిష్ఠించి.
పండితా, మహిమ. ౨౮౪. పా.

**హథము.** సం.వి.అ.పుం. ౧ దెబ్బ. ౨ చంపుట. ౩ చావు.

**హథుఁడు.** సం.వి.అ.పుం. దుఃఖితుఁడైనవాఁడు.

**హదను**=అదను. వి. దే. అనా. ౧ యుక్తసమయము, తఱి.

చ....మాన్యసుహృజ్జన బంధుకోటికిన్, హదనున మేలునేత చతురాననసంభవశాస్త్రపద్ధతిం, దనుచితమైన శాంతిక విధానము....
నైష. ౩.౧౪.

ఆ. హదను వచ్చెనాఁక నపరాధిపైఁగోప, మూఁగి చెఱుపవలయు హదను వేచి, లక్ష్యసిద్ధిదాఁక లావున శరమూఁగి, కాఁడవిడుచు నంపకాఁడు వోలె. ఆము. ౪-౨౪౯.

సీ. అపవర్గఫలసిద్ధి హదనైనఁ జేపట్టఁ గైవడి బహుఫలోత్కరముఁ గాడిచి. పాండు. ౨.౧౭

౨. సమయము, వేళ.

ఉ....మెంగిలాఁడెనంబుభృ, ద్వాహ తల క్రద ధత్వము మొదల్ మెఱుఁగన్ ధ్వజమెక్కనాటగా, నాహదనన్ జెలంగు జనమూంతము నూళ్ళకు బోవనామియున్. ఆము. ౪-౭౩.

సీ. తఱితఱి పదను హదను సావియదునునాఁ గాలాభిధానంబుగాఁ జెలంగు. ఆం.భా.౧.౨౭

**హద్దు.** వి. మేర; అజ్జ.

ఆ. హద్దుముద్దుమీఱి యాఁడుది మగఁడంచుఁ, గూడిమాడి యాడఁజూడఁదలచి, బలిమివిందు బెట్టి పగగొన్నచందాన, బెండ్లి చేసికొనె చేల నైతి. రాధికా. ౩.౪౭.

**హననము.** సం.వి.అ.న. ౧ చంపుట. ౨ కొట్టుట. ౩ బాధించుట. ౪ గుణించుట. వి.అ.పుం. ౧ మద్దిలవాయించుకఱ్ఱ. ౨ ఒకరకమైన క్రిమి.

**హనము.** సం.వి.అ.న. చంపుట.

**హనీలము.** సం.వి.అ.పుం. కేతకి [.

**హనుక.** సం.వి.అ.స్త్రీ. దవుడ.

**హనుగ్రహము.** సం.వి.అ.పుం. హనుస్తంభము. దవుడ కదలకపోవుట అను రోగము.

**హనుభేదము.** సం.వి.అ.పుం. ౧ దవుడలు తెఱచుకొని యుంచుట, ౨ ఒకవిధమైన గ్రహణము.

**హనుమ.** వి. (సం.హనుమాన్.) హనుమంతుఁడు. ఆంజనేయుఁడు.

క. అశంఖరవంబు మహేంద్రాశనినిర్ఘోషభీమమై దిక్కులఁ బా, కాశంబునిండెనంతగు, హాశయనుండైన హనుమ యనుకపి పెలుచన్.
భాస్క. అర. ౩.౩౧౪.

సీ. ఏకాంతభక్తుఁడా టెఱిఁగి యేలెనొకడా హనుమచే నుంగరంబను పుటెల్ల.
ఉ.రా. ౧.౧౫౩.

**హనుమంతబీజ.** వి. వృక్షవిశేషము, ఒకజాతి చెట్టు.

సీ. హనుమంతబీజ మంకెన గిరికర్ణిక పెదమల్లె కొండముష్టిడియుఁగోల. హంస. ౪-౧౧.

**హనుమంతుఁడు.** సం.వి.త్.పుం. ఆంజనేయుఁడు

హనుమంతుని ముందఱఁ గుప్పిగంతులు=అధికుని ముందల్పుఁడు దంబములాడుట.

చ. వదరులు పల్కనంతటనె వచ్చెనె ధైర్యము శౌర్యవృత్తి నీ, కొదవినఁ జక్కనై నిలువు మోరి నిశాచర యిన్నగంబునన్, మదిమది నుండి కేఁడునను మార్కొని యిందులకేఁగ వచ్చె నీ, మదముఁగింతుఁబోర హనుమంతుని ముందఱఁ గుప్పిగంతులే.
రుక్మా. ౫-౩౩.

**హనుమఁడు.**=అనుమఁడు. వి. (సం. హనుమాన్) ఆంజనేయుఁడు.

క. హనుమనివాలము పెరుఁగఁగ, ఘనతర కార్పాసపట్టికా శ్రేణులఁగ, న్కనిఁజుట్టి....
భా.రా.సుం. ౪౫౭.

**హనూమానుఁడు.** సం.వి.త్.పుం. హనుమ.

**హనువు.** సం.వి.ఉ.ఊ.పుం.స్త్రీ. చెక్కిలిమీఁది భాగము; దవుడ. వి.ఉ.స్త్రీ. ౧ నఖము అను గంధద్రవ్యము. ౨ చావు. ౩ జీవితమునకు హాని చేయునది, ఆయుధము ౪ వ్యాధి.

**హను స్తంభము**=హనుగ్రహము.

**హనుస్వనము.** సం. వి. అ. పుం. దవుడలతోఁ జేయుధ్వని.

**హన్నము.** సం.వి.అ.న. విష్ఠింపఁబడినది.

**హన్నుఁడు.** సం.వి.అ.పుం. విష్ఠించినవాఁడు.

**హపు (బు) ష.** సం.వి.అ.స్త్రీ. ఓషధివిశేషము.

**హబాయి.** వి. అశ్వాలంకారవిశేషము.

సీ. వినువాఁకతెరఁగలు జెల్లజల్లులు గాఁగ
వాల్మించుకెంపు హబాయి గాఁగ.
ప్రబంధ. ౫౧.

**హమా.** విణ. (హిం.హమా) సర్వము, సమస్తము

గీ. సర్వకపవర్గములు టంకసాలప్రేయు, చావడి
హమా దినుసుమేలు సరకుఁగలిగి, నాణ్యి
దిక్కులపేటల నగరజనుల, కలక నమ్మచు
ధనచిస్తుఁ బటచ వెలయు. హంస.౨.౨౩౧

**హము.** సం.వి.అ.న. ౧ పరమాత్మ. ౨ ఆనందము ౩ ఆయుధము. ౪ మణియొక్కతళతళ. ౫ వీణ.

**హయ.** సం.వి.ఆ.స్త్రీ. ఆడుగుఱ్ఱము, గోడిగ.

**హయంకషుఁడు.** సం.వి.అ.పుం. ౧ సారథి. ౨ ఇంద్రసారథి, మాతలి.

**హయకర్మ.** సం.వి.న్.న. గుఱ్ఱములను గుఱించిన జ్ఞానము.

**హయకాతర (రిక).** సం.వి.ఆ.స్త్రీ. ఒకమొక్క.

**హయకోవిదుఁడు.** సం.వి.అ.పుం. అశ్వశాస్త్ర-అశ్వశిక్షలయందు నేర్పుకలవాఁడు.

**హయగంధ.** సం.వి.ఆ.స్త్రీ. అశ్వగంధ i.

**హయగ్రీవ.** సం.వి.ఆ.స్త్రీ. దుర్గాదేవి.

**హయగ్రీవుఁడు.** సం.వి.అ.పుం. ౧ విష్ణువుయొక్క యవతారము.

౨ ఒకానొక రాక్షసుఁడు.

వ. విరోచనబలి నముచి జంభమహాజంభ హయగ్రీవప్రముఖదైత్య దానవ గణంబులన్న .
శివరహస్య. సంభవ. ౩-౧౪౪.

**హయద్విషత్తు.** సం వి.త్.పుం. మహిషము.

**హయనము** సం.వి.అ.పుం. సంవత్సరము. న. అచ్ఛాదితమైనబండి.

**హయపు (చ్ఛ) (క).** సం.వి.ఈ.ఆ.స్త్రీ. కారు మినుము i.

**హయప్రియ.** సం.వి.ఆ.స్త్రీ. ఖర్జూరవృక్షము.

**హయప్రియము.** సం.వి.అ.పుం. శాలీ ధాన్యము

**హయమార (క) ము.** సం.వి.అ.పుం. గన్నేరు

**హయమార్గణము.** సం వి.అ.పుం. అత్తిచెట్టు.

**హయము.** సం. వి. అ. పుం. ౧ గుఱ్ఱము. ౨ నాలుగు హ్రస్వవర్ణములతోఁగూడిన పద్యపాదము. ౩ సప్తసంఖ్య. ౪ చమరమృగము. ౫ ధనూరాశి.

**హయాంగము.** సం.వి.అ.పుం. ధనూరాశి.

**హయారి.** సం.వి.ఇ.పుం. గన్నేరు i.

**హయావళి.** సం.వి.ఇ.స్త్రీ వస్త్రవిశేషము.

ద్వి. కొలనిమేఘము గజావళి హయావళియు ...
బస.పు. ౩-౭౦.

**హయి.** సం.వి.ఈ.స్త్రీ.=హయ.

**హయిసరే**=హైసరే. అవ్య ప్రశంసార్థకము.

సీ. హయిసరే జెట్టిమించు నదలించు కనుమించు
కమ్మదమ్మలమేలు గ్రుమ్మ జాలు-
కువల. ౪.౧౫౩.

**హయుఁడు.** సం.వి.అ.పుం. ౧ ఇంద్రుఁడు. ౨ ఒక ప్రత్యేక జాతికిఁజెందిన పురుషుఁడు.

**హరకము.** సం.వి.అ.న. ౧ ఒకవిధమైన దీర్ఘ ఖడ్గము. ౨ భాజకము.

**హరకారా.** వి. (హిం. హర్‌కారా.) వార్తాహరుఁడు, వేగువాఁడు.

క. హరకారాలల్ గొనివచ్చిన, ఖరవాచామాది హర్ష పరవశుఁడగుచున్. రంగా. ౨-౧౪౪

**హరకుఁడు.** సం. వి. అ. పుం. ౧ చోరుఁడు. ౨ ధూర్తుఁడు. ౩ శివుఁడు.

**హరణము.** ౧ హరించుట. ౨ గ్రహించుట. ౩ తొలఁగించుట. ౪ దొంగిలించుట. ౫ నాశనము చేయుట. ౬ విభజించుట. ౭ విద్యార్థికిచ్చు కానుక. ౮ గవ్వ. ౯ ఉడుకునీరు. ౧౦ ముంజేయి. ౧౧ అరణము.

**హరబి (బ్బి).** వి. ౧ దేశవిశేషము. ౨ హరబీదేశపు గుఱ్ఱము. ౩ హరబీదేశభాష.

**హరసమవాయి.** వి. ఒకానొక స్వరస్థాయి.

ద్వి. హరువాయియును ధర హరసమవాయి ... ఆదిగా సాగయుకాయములు....

బస. పు. ౩-౯౪౧ పం.

**హరాల్‌కోరు.** విణ. (హిం. హలాల్ ఖోర్.) ౧ సర్వభక్షకుఁడు. ౨ దుష్టుఁడు. ౩ నీచుఁడు.

సీ. బాజి హరాల్‌కోరు వ్రాజ ప్రక్కలముచ్చు చీవాట్లమారి ప్రాచీనవిత్తు. హంస. ౫-౧౧౩.

**హరి.** విణ. ౧ పచ్చనిది. ౨ గోధుమవన్నెది. ౩ పసుపుపచ్చనిది. వి. ౧ విష్ణువు. ౨ ఇంద్రుఁడు ౩ శివుఁడు. ౪ బ్రహ్మ. ౫ యముఁడు. ౬ సూర్యుఁడు. ౭ చంద్రుఁడు ౮ నరుఁడు. ౯ అగ్ని ౧౦ వాయువు. ౧౧ కిరణము ౧౨ సింహము. ౧౩ గుఱ్ఱము. ౧౪ ఉచ్చైశ్శ్రవము. ౧౫ కోఁతి. ౧౬ కోయిల. ౧౭ కప్ప ౧౮ చిలుక ౧౯ పాము. ౨౦ నెమిలి. ౨౧ పసుపురంగు ౨౨ భర్తృహరి. ౨౩ ఇంద్రియము. ౨౪ సింహరాశి. ౨౫ ఒకవర్షము. (శ. ర.)

**హరి (యి) ంచు.** సం. అ. క్రి. అడఁగు; నశించు.

క. ఏతపముల జేజపముల, నేతీర్థవిలోకనముల నేక్రతువులనీ, జ్ఞాతివధం బొనరించిన, పాతకము హరించునవఁ దపస్వి యతనితోన్.

జై. భా. ౧-౬౦.

స. క్రి. ౧ సంహరించు.

వ....హిరణ్యాక్షుని హరించి బలినణంచి....

మార్క. ౧-౧౧౬.

౨. అపహరించు.

సీ. అవనితశౌర్యరుండపాపకులారక హరియించి దస్యునియట్లఘోర. గీ. నరకమునఁబడు.

మార్క. ౨-౨౧౩.

**హరికథ.** సం. వి. అ. స్త్రీ. ౧ విష్ణుకథ. ౨ నృత్యగానసహితముగా కథకుడు చెప్పుకథాప్రక్రియ.

**హరికము.** సం. వి. అ. పుం. బంగారువన్నెగుఱ్ఱము.

**హరికాంతము.** విణ. (అ. అ. అ.) ౧ ఇంద్రునకుఁ బ్రియమైనది. ౨ సింహమునంతరమైనది.

**హరికుఁడు.** సం. వి. అ. పుం. ౧ చోరుఁడు. ౨ జూదగాఁడు.

**హరికేలీయము.** సం. వి. అ. పుం. వంగదేశము.

**హరికేశుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**హరిగ=అరిగ.** వి. ౧ ఖేటము, డాలు.

సీ. భటవిగ్రహముల కప్పలగ్రేవ దలలపై హరిగలు మాటుగా నడఁగువారు.

జై. భా. ౬-౧౨౦.

క. విరుదుగలతులువలిసుపురు, వెలుకట్టి మెఱుంగు దట్టు వెగుచల్లదముల్, పరగంగబొందికోలల, హరిగలు కాటించి ప్రెక్కొయాకముమీరన్.

ప్రబంధ. ౮౯.

౨. ఎంతతగులకుండఁ బట్టెడుకేడెమువంటి సాధన విశేషము.

చ. హరిగలనీడ వేత్రధరు లయ్యెడ నాముము లగ్గడించి హెచ్చరికయొనర్ప....

కువల. ౪-౨౦౦.

సీ. ఘనకళంకనిజంద్రుఁ గనకుండఁబాటుగా నరుణునకిదు వెండిహరిగయనఁగ.

చంద్ర. ౫-౧౪.

**హరిగంధము.** సం. వి. అ. పుం. చందనవిశేషము.

**హరిగోలు=అరిగోలు.** వి. ఏఱుదాఁటఁదగిన

పాత్రవిశేషము.

సీ. అకులసరంగుల హారిగోలుగుంభూజా వసజం బులఱతి గాదున్నవెఁజలింప. శుక. 3-323.

హారిచు(చ). వి. పక్షివిశేషము.

సీ. హారితయాఁకలు చెమ్మి పురిబోంతములు తెల్ల పవరముల్ బట్టాలుజాగిలములు........ కాన్క చేసి .. శుక. ౧-౨౮౭.

రగడ. ఎసఁగనన్నములోని విసములఁ జేర్చుటుచు పి సింగిలీకలు,అసమశౌర్య భురీణులకు విరుదం డు రల్ల వె హారిచెయిఁకలు. శుక.౧-౨౨౨.

హారిచందనము సం.వి.అ.పుం.న. ౧ పసుపు పచ్చని రంగుగల గంధము. ౨ సురద్రుమము లైదింటిలో నొకటి. 3 వెన్నెల. ౪ పద్మకేసరము

హారిచాపము. సం.వి.అ.న.పుం. ఇంద్రధనుస్సు.

హారిణకము. సం.వి.అ.పుం. లేడి, చిన్నలేడి.

హారిణక్రీడనము. సం. వి. అ. న. బాలక్రీడా విశేషము.

వ.... అందఱు హారిణక్రీడనంబను నాటకుండొడంగి హరి. పూ. 8.

హారిణనర్తకుఁడు. సం.వి అ.పుం. కిన్నరుఁడు.

హారిణము. సం.విణ. (అ.ఈ.అ,) ౧ తెల్లనిది. ౨ కిరణములుగలది. 3 ఎఱుపుతోఁగలిపిన తెలుపువన్నెగలది. వి.అ.పుం. ౧ లేడి. ౨ తెలుపురంగు. 3 గాలి.

హారిణపల్లి. మి.వి.ఇ. వస్త్రవిశేషము.

గీ. హంసపల్లను బవ్వాలు హరిణపల్లి, మొదలుగా వల్వలు ధరించి ముదితలపుఁడు. ప్రబంధ. ౨౭౨.

గీ....నిండువన్నెలు బొదలు బచ్చులును హరిణ పల్లి హంసప ల్లరగపల్లి .... మొదలుగాఁగ, దనరు పటములు జేనక్రొన్ననియె వెలకు. హంస. ౪.3౪౯.

హారిణి, సం.వి.ఈ.స్త్రీ. ౧ ఆఁడులేఁడి. ౨ ఒక జాతిస్త్రీ (చిత్రిణి.) 3 పసుపువన్నెమల్లె. ౪ బం గారు ప్రతిమ. ౫ ఒకవృత్తవిశేషము. ౬ ఆకు పచ్చనిరంగు. 8 పసుపు. ౯ చిలుకలదంతిశేరు. ౯ దేవవేశ్యలలో నొకతె. (వా)

హారిణేశుఁడు. సం.వి.అ.పుం. బోయవాఁడు.

హారిణేదృక్కు. సం.విణ. (శ.శ.శ.) లేడికన్ను లు గలది. వి.శ.స్త్రీ. మృగాక్షి, స్త్రీ.

హారిణుఁడు. సం. వి. అ. పుం. ౧ సూర్యుఁడు. ౨ విష్ణువు. 3 శివుఁడు.

హారిత. సం.వి.ఆ.స్త్రీ. ౧ దూర్వ, గరిక ||. ౨ పసుపు. 3 గోదుమవన్నెగల ద్రాక్ష.

హారితకపిశము. సం.విణ.(అ.ఆ.అ.) పసుపువన్నె కలిసిన గోదుమరంగుగలది.

హారితకము. సం.వి.అ.న. పచ్చగడ్డి. కూర మునుగ

హారితపణ్యము. సం. వి అ. న. కూరగాయల వ్యాపారము.

హారితము. సం.విణ. (అ.ఆ.అ.) ౧ ఆకుపచ్చ వన్నెకలది. ౨ నీలవర్ణము కలది. వి.అ.పుం. ౧ ఆకుపచ్చనిరంగు. ౨ సింహము 3 ఒకవిధమైన గడ్డి. ౪ పచ్చ గుఱ్ఱము. ౫ పచ్చపిట్ట, గిజిగాఁడు ౬ పచ్చ పెసర.

హారితహరి. సం.వి.ఇ.పుం. సూర్యుఁడు.

హారితాళ(ళ)ము. సం.వి.అ.న.పుం. హారిదళము. న. నాటకాలంకరణము.

హారితాలి. సం.వి.ఈ.స్త్రీ. ౧ గరిక. ౨ ఆకా శమునందలి రేఖ.

హారితాలిక. సం.వి.ఆ.స్త్రీ ౧ భాద్రపదశుక్ల తృతీయ. ౨ గరిక మొక్క.

హారితురంగముఁడు. సం.వి అ.పుం. ఇంద్రుఁడు

హారిత్తు. సం.విణ. (త్.త్.త్.) ౧ ఆకుపచ్చనిది ౨ పసుపుపచ్చనిది. వి.త్.పుం. ౧ ఆకుపచ్చని రంగు. ౨ పసుపుపచ్చనిరంగు 3 పచ్చని (సూర్యుని గుఱ్ఱము) స్త్రీ. ౧ దిక్కు. ౨ పసుపు.

హారిత్పతి. సం.వి.ఇ.పుం. దిక్పాలకుఁడు.

**హారిత్వర్గము.** సం.వి.అ.న. ముల్లంగికర్ర.

**హారిదశ్వము.** సం.వి.అ.పుం. జిల్లేడుచెట్టు.

**హారిదశ్వుడు.** సం.వి.అ.పుం. సూర్యుడు.

**హారిదలము**=అరిదళము. వి. (సం. హారితాలమ్) పసుపుపచ్చని ధాతు విశేషము.

**హారిదాసు (డు)** సం.వి.అ.పుం. విష్ణుభక్తుడు.

**హారిదిక్కు.** సం.వి.క్.స్త్రీ. తూర్పు.

**హారిదినము.** సం. వి. అ. న. ఏకాదశి, హరిని సేవించు దినము.

క. హారిదినమునకేధర్మము, సరిగా దేతీర్థములును సరిగావు ... జాహ్నవి. ౩-౯౩.

**హారిదేవము.** సం.వి.అ.పుం. శ్రవణనక్షత్రము.

**హారిద్రి.** సం.వి.అ.స్త్రీ. ౧ పసుపువేళ్ళపొడి.

**హారిద్రాంజని.** సం.వి.ఈ.స్త్రీ. పసుపు.

**హారిద్రి(క)ము.** సం.వి.అ.పుం. చందనవృక్షము.

**హారిద్రవము.** సం.వి.అ.పుం. ౧ పచ్చనిరసము. ౨ నాగకేసరపుష్పచూర్ణము.

**హారిద్రాంగము.** సం. వి. అ. పుం. ఒకవిధమైన పావురము.

**హారిద్రాభము.** సం.వి.అ.పుం. ౧ పసుపురంగు. ౨ కచోరము.

**హారిద్రారాగ(క)ము.** సం.విశ. (అ. ఆ. అ.) ౧ పసుపురంగుగలది. ౨. ప్రేమవిషయమున చంచలమైనది. "క్షణమాత్రానురాగశ్చహారిద్రా రాగ ఉచ్యతే".

**హారిద్రువు.** సం. వి. ఉ. పుం. ౧ చెట్టు. ౨ ఒక విధమైన మొక్క. ౩ మ్రానిపసుపు.

**హారిద్వారము.** సం.వి.అ.న.ఒకప్రసిద్ధక్షేత్రము.

**హారినీలము.** సం.వి.అ.పుం. నీలమణి.

**హారినేత్రము.** సం.వి.అ.పుం. గుడ్లగూబ.

**హారిన్మణి.** సం. వి. ఇ. పుం. ౧ గరుడపచ్చ. ౨ మరకతము.

**హారిపదము.** సం.వి.అ.న. ౧ వసంతారంభము. ౨ ఆకాశము.

**హారివర్ణము.** సం.వి.అ.న.ముల్లంగిగడ్డ.

**హారిప్రస్థము.** సం.వి.అ.పుం. ఇంద్రప్రస్థపురము.

సీ....సర్వసంభారములనించి సకలదిక్కులహరి, ప్రస్థంబుచుట్టు నపారభూరి, బహువిధాగారములు....భార.సభా. ౧-౭౮౨.

**హారిప్రియ.** సం.వి.అ.స్త్రీ. ౧ లక్ష్మి ౨ భూమి. ౩ తులసి. ౪ ఏకాదశి. ౫ ద్వాదశి (ఆప్టే)

**హారిప్రియము.** సం.వి.అ. పుం.౧కదంబవృక్షము. ౨ శంఖము. న. ౧ వట్టివేరు ౨ ఒకవిధమైన చందనము.

**హారిప్రియుడు.** సం. వి. అ. పుం. ౧ మూర్ఖుడు ౨ పిచ్చివాడు.

**హారిబీర(క).** అశ్వశిరోలంకారవిశేషము.

సీ. గొలుసుమాపోగుకట్టులు రాలినరికడా యిందు గల్గిన హారిబీరకెల్ల. ప్రబంధ. ౧౩౩.

సీ. తేటనుప్పాణి ముత్తెలపేరు ముట్టును శ్రీకరంబుగ హారిబీరకవెలయ.

ఇంద్ర. ౨-౫౮. హంస. ౫-౩౫౭.

**హారిబీజము.** సం.వి.అ.పుం. పసుపుపచ్చని హరిదళము.

**హారిబువ్వము.** వి. బువ్వముబంతి.

**హారిభుక్కు.** సం.వి.జ్.పుం. గాలిని తినునది, పాము.

**హారిమ.** సం.వి.అ.పుం. ౧ హారితవర్గము. ౨ తెల్లపాటుట. ౩ కాలము. ౪ పచ్చకామెరలు.

**హారిమంథము.** సం.వి.అ.పుం. సెనగ.

**హారిమేధము.** సం. వి. అ. పుం. అశ్వమేధయాగము.

**హారిమేధుడు.** సం.వి.అ.పుం. హరిమేధసుడు. స. పుం. విష్ణువు.

**హారియము.** సం.వి.అ.పుం. పసుపుపచ్చనిగుఱ్ఱము.

**హారిరోముఁడు.** సం.విశే.పుం. ౧ దేహమున మృదువైన రోమములు కలవాఁడు. ౨ యువకుఁడు

**హారిలోచనము.** సం.వి.అ.పుం. ౧ ఎండ్రకాయ, పీత. ౨ గుడ్లగూబ.

**హారివంశము.** సం.వి.అ.పుం. మహాభారతమున కనుగుణముగా వ్యాసునిచే రచింపఁబడిన గ్రంథము.

**హారివర్షము.** సం.వి.అ.పుం. జంబూద్వీప నవ విభాగములలో నొకటి.

**హారివాణము.** సం.వి.అ.పుం. తట్టి.

**హారివాణము.** వి. (క.త. అరివాణవు, హరివాణవు.) ౧ పళ్లెరము.

వ....నీరాటకువచ్చు మదవతీవతంసంబుల దర్శింప సరోలక్ష్మి గంధాక్షతలు సంధించి కుమరు పఱచిన కచ్చుల హారివాణంబుల రూపంబున దీపించు....పద్మినీపత్రంబులంగనుంగొని....

వరాహ.౩.౯౭.

సీ. వలుదసోరనగంట్లవచ్చిన జిగివెండి హరివాణమని చేత నరసియరసి. రా.వి.౩-౧౩.

సీ. హరివాణములమీఁదఁగరకంకణముల దీప్త్రుల పరార్థములోన తోరుగ నిండు, వదనలు వర్ధింప ... వరాహ.౪.౧౩౩.

౨ పాత్రము.

క. పతనాల్కల జేజేయపు, దతనికిఁబోవకట్టి పసిఁడిహరివాణము తోఁ,డుతఁదెచ్చి పాల రూకెం, బలిపలు మువ్వురకుఁబెట్టుమని యిడి చనుఁడున్. అచ్చ. రా. బాల. ౪౪.

౩ భోజనపాత్రము.

పీ. తెలిహరివాణంబు తలిగ కంచము తట్టి చాకిల వంగఁగంసంబుదనరు. ఆం.భా.౨-౨౪౪

ఆ. తళియ పళ్లెరంబు తెలి హరివాణంబు, తట్టి కంచ మనఁగ ఁదనరుఁబాత్ర.

ఆ. సం. మాన. ౩౦.

**హారివాలుకము.** సం.వి.అ.న. ౧ నూఁగుదోస. ౨ కూఁతురుబుడమ ¡.

**హారివాసము.** సం.వి.అ.పుం. ఒకానొకపట్టణము

వ.... హారివాసంబను పురంబునకై విడిసిన ...

భార. సభా. ౧-౨౩౫.

**హారివాసరము.** సం.వి.అ.పుం. ఏకాదశి.

**హారివాహనుఁడు.** సం.వి.అ.పుం. ౧ గరుడుఁడు ౨ ఇంద్రుఁడు. ౩ సూర్యుఁడు.

**హారిశయనము.** సం. వి. అ. న. చాతుర్మాస్య కాలము. (ఆషాఢశుద్ధైకాదశి మొదలు కార్తిక శుద్ధైకాదశి వఱకు.)

**హారిషము.** సం.వి.అ.పుం. హర్షము.

**హారిహయుఁడు.** సం.వి.అ.పుం. ౧ ఇంద్రుఁడు. ౨ సూర్యుఁడు. ౩ సూతుఁడు. ౪ గణేశుఁడు.

**హారిహరాత్మకుఁడు.** సం.వి.అ.పుం. ౧ గరుడుఁడు. ౨ నంది.

**హారిహరి.** అవ్య. అయ్యో; అక్కటా; పాప పరిహారసూచకము.

చ. హరిహరి వారిమూషమతి కాదియు వంతము గల్గజేర్చునే. రాధికా. ౨-౯.

**హారిహరుఁడు.** సం.వి.అ.పుం. శివకేశవు రును గలిసిన దేవుఁడు.

**హారిహేతి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ ఇంద్రధనుస్సు. ౨ చక్రాయుధము.

**హారీతకి.** సం.వి.ఈ.స్త్రీ. కరక ¡.

**హారుఁడు.** సం.వి.అ.పుం.శివుఁడు.విణ.(అ.ఆ.అ హరించువాఁడు.

**హారువు(ర్వు).** వి. ౧. చక్కఁదనము, సౌందర్యము.

సీ. విబుధాధినాథుఁడీవేదాద్రినాథుండు శరధి తనూజ యీతిరుమలాంబ,

గీ. యనఁగ ననుకూలదాంపత్యవినుతమహిమ, హారువుదీపించె నారవేదాద్రి విభుఁడు, హరి యకుఁడై నకలకాలహర్తిశనయు, తిరుమలాంబయు నిత్యవర్ధిష్ణులక్ష్మి. పాండు.౧.౩౭.

సీ. పొన్నగున్నలనీడఁ గన్నెపుప్పొడితిన్న
మరునిఁ బూజించినహారువుఁ జూచి, కొమ్మ
కాఁగిటిఁజేర్పఁగోరంట నంటినమొనగుబ్బ
కస్తూరిమురువుఁజూచి. విజ.వి. ౧-౧౩౭.

ఉ. అందువినోదమార్గములనందు విశేషములందు
హార్యలిం, పొందఁగఁజూచి ...
సారంగ. ౨-౬౩.

గీ. కర్ణపూరోత్పలసుగంధకలన నలరి, ప్రాంత
మున నిల్చు భ్రమరశాబంబనంగ, వామకర్ణా
గ్రమున నిందువదనకప్రాడు, హార్యమీఁజంగ
నిలంపుమూర్యాదనరె. ఇంద. ౫-౭౨.

౨ విలాసము.

క. విరితీవలయుయ్యాలల, హారువు విడిచి సుమ
చయాపహరణవిహరణా, దరిణ చణప్రచ
రణవై, యరుణాంబుజచరణలప్వ దలకుం
బొదలన్. రా.వి. ౩-౧౦౪.

క. లయకోపుదృష్టియును నభి,నయముమటు ద
రమ్ము మోడి నయమున్నతిరే, కయును బ్రమా
ణము హారువున్, మెయిసిరి యపఘళము
మురువు మెలకువయమరున్. ప్రబంధ.౧౦౭.

౩. విధము.

క. సురసాలముహారువున నీ, మరసాలముదనర
నిచటఁజూడుము కిసల, స్ఫురదురురుచి నిచ
యంబులు, కురువిందాభరణదీప్తి కొమరు
వహింపన్. భోజసుతా. ౩-౪౧.

సీ....భరతు, కరణి సుహోత్రునిహారువున రఘు
లీల రామునిక్రియ భగీరథునిఠేవ.
శుక. ౧-౧౦.

౪. నాణెమైన పని, మేలిపని.

క. వెరవమరుహారువులకీ, గురుకుచలని తలఁచి
రాజు కొలువైయున్నాఁ, డరుదందని తా
మందఱు, నరిగి రయుతింగించియుండె నతఁ
డధిపతికిన్. రామా. ౨.౮౯.

సీ....కందర్పచేతి, కిరుసులో బిరుసు చిత్తరువు
పుత్తడి వ్రాఁతహారువులో మురువు సొంపులరు
పుప్వ, తీఁగలోఁజేవ.... ఘటికా. ౨-౭౮.

క. అత్తరువులఁ జిత్తరువులఁ, గ్రొత్తహారువు
లాలయు శేరీకూట గృహములో, నత్తమి
నత్తమిఁబొత్తమిఁ, జిత్తజుగురుఁడాట మదిని
జిత్తజుఁడోదవెన్. ముకుంద.౩-౩౧౩.

౪. తగినపని, యుక్తకార్యము.

చ. తలవరులార రంగపతి ధామమునందునఁ
బైఁడిగిన్నెప్రము, చ్చిలినదురాత్ము లీదురిత
చిత్తులు నంబులు వీరినందఱన్, సిలుగులఁ
బెట్టి వే హారువు జేయుఁడు పొందనిపంప....
విప్ర. ౫.౨౪.

క. ఇతఁడెవ్వఁడైననేమగు, క్షితినాయక ధనము
మాకుఁజెల్లించిన వాఁ,డ తగినమాన్యుఁడు
దలఁపగ, నతివేగమ విత్తమునకు హారువిఁకఁ
జెపుమా. హరిశ్చ. ౪-౨౨౬.

౬. ఏర్పాటు.

క. దొరవెట్టిన హారువెట్టిదో, యరుదాహోవిదుదు
లున్నహావణిక లులుపా, పరిషవము నింద్ర
భోగమె, దొరకొను దమ కననివారు తుది
లేరొకరున్. విజ.వి.౩-౧౪౯.

విణ. ౧ మనోజ్ఞము, చక్కనిది.

ద్వి. అందుల బంగరుహారువు చిత్తరువు, లం
దంబుగాఁదీర్చి....
రం. రా. బాల. ౪౭. పొ. ౧౦. పం.

చ. గొరిసెలయందమున్ గులుచకొమ్మల
చందము వెన్నుమందమున్, గరువపుమేనిలో
నుడుటు కాఁగెడు పెన్పొదుఁగింద్రనీలముల్
బెరసినముక్కు మీఁగడబలెన్ జెలువొగళ
కంబళంబునున్, హారువుగఁ గామధేనువు
సుధాంబుధిఁబుట్టె నభీష్టదాత్రియై.
దశా. ౨-౨౨౪.

ద్వి. హారువైన పైఠిణీయుఅచట్ట దొడిగి. రఘురా
౮. పొ. ౯. పం.

౨ యోగ్యము, తగినది.

గీ. అతఁడు గొలుప్రాణమునసుండి హారువు దెసవు
లావటిలఁదెల్పఁజని వాయుదేవసుతుఁడు,
క్షీరవారాకరోత్తరతీరభూమి, నుండు
దివ్యౌషధంబులకొండఁ దెచ్చె.
రామా. ౭-౧౪౫.

౩ నాణెమైనది.

క. హారువు గొనమ్ములతిట్టా....

అచ్చ. రా. కిష్కిం. (క,స.)

**హారుసము**=అరుసము. వి. (సం. హర్షః, ప్రా. హరిసో.) హర్షము, సంతోషము.

చ. పరహితుఁడైనవానికి శుభంబు లభించిన నెల్లవారలున్, హారుసమె కందురు....

ఉ. రా. ౨-౧౬౮.

క. హారిరమ్మనియె నటన్నన్, హారుసముతో వారు నలువు ౖతివినయమునన్.

దశా. ౧౦-౧౯.

**హారుసించు.** అ.క్రి. (√.హారుసము.) ఇష్టపడు; సంతోషించు.

ద్వి. హరివాక్యమునకు మాటాడంగ వెఱచి, హారుసించి గోవర్ధనాద్రికి జాత్రి, చాటించి యందఱు సదనంబులందుఁ, బాటించి వస్తు సంపద ప్రేమమిగుల. ద్వి.భాగ. ౨-౩౧పా.

**హారేణుకము.** సం.వి.అ.పుం. ౧ కాయధాన్యము ౨ బటాని.

**హారేణువు.** సం.వి ఉ.పుం. ౧ బటాని. ౨ కాయ ధాన్యము. ౩ గ్రామమునకెల్లగా నుండులత. ౪ లంక. స్త్రీ. ౧ మర్యాదగల స్త్రీ. ౨ తామ్ర వర్ణముగల లేడి.

**హార్త.** సం.విణ. (ఋ.స్త్రీ. ఋ.) ౧ హరించు వాఁడు. ౨ గ్రహించువాఁడు. వి. పుం. ౧ దొంగ ౨ సూర్యుఁడు.

**హార్దము.** సం.వి.న్.న. ౧ తెలియుట. ౨ అవు లించుట.

**హార్మికము.** సం. వి. అ. స్త్రీ. వేసవికాలమునకై స్నానము పైఁగట్టఁబడిన గృహము.

**హార్మితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧ తెలియఁ బడినది. ౨ త్రోసివేయఁబడినది. ౩ గ్రహింపఁ బడినది.

**హార్మటము.** సం.వి.అ.పుం. తాఁబేలు.

**హార్మటుఁడు.** సం.వి.అ.పుం. సూర్యుఁడు.

**హర్మ్యము.** సం. వి. అ. న. ౧ ప్రాసాదము. ౨ పెద్దభవనము. ౩ పొయ్యి. ౪ పాపాత్ములు నివసించు నరకలోకము. ౫ అగ్నికుండము.

**హర్మ్యవలభి.** సం.వి.ఈ.స్త్రీ. హర్మ్యతలము.

**హర్యక్షము.** సం.వి.అ.పుం. సింహము.

**హర్యక్షుఁడు.** సం.వి.అ.పుం. కుబేరుఁడు.

**హర్యశ్వము.** సం.వి.అ.పుం. ౧ గుఱ్ఱము. ౨ అశ్వ మేధమునకర్హమైన గుఱ్ఱము. ౩ యజ్ఞము.

**హర్షకీలకము.** సం.వి.అ.పుం. ఒకవిధమైనరతి.

**హర్షజము.** సం.వి.అ.న. రేతస్సు.

**హర్షణము.** సం.విణ. (అ.ఆ.అ.) సంతోషింపఁ జేయునది. ౨ పులకలు కల్గించునది. వి.అ.పుం. మన్మథుని పంచబాణములలో నొకటి. ౨ నేత్ర రోగవిశేషము. ౩ గ్రహయోగము. ౪ అపర కర్మాధిపులు. న. ౧ సంతోషము. ౨ సౌఖ్యము. ౩ సంతోషింపఁజేయుట. ౪ సేనలకుత్సాహము కల్గించుట. ౫ కామోద్రేకము.

**హర్షదోహలము.** సం.వి.అ. న. పుం. కామాభి లాష, వలపు.

**హర్షమాణుఁడు.** సం.విణ. (అ.ఆ.అ.) సంతో షమునొందిన మనస్సుగలవాఁడు.

**హర్షము.** సం.వి.అ.పుం. ౧ సంతోషము, ఆనం దము. ౨ పులకించుట, ౩ సంచారిభావములలో నొకటి. ౪ కామోద్రేకము. ౫ గాఢాభిలాష.

**హర్షయిత్నువు.** సం.విణ. (ఉ.ఊ.ఉ.) సంతో షింపఁజేయునది. వి.ఉ.న. బంగారము. పుం. కుమారుఁడు.

**హర్షసంపుటము.** సం. వి. అ. పుం. రతిక్రియా విశేషము.

**హర్షి** సం.విణ. (న్.ణి.న్.) సంతోషము కలవాఁడు

**హర్షించు.** సం.అ.క్రి. సంతోషపడు.

వ....ఆద్విజోత్తములంగాంచి హర్షించి స్వస్తి వచన పూర్వకంబుగా నిట్లనిరి. మార్క. ౧-౧౦౦.

**హర్షితము.** సం.విణ. (అ.అ.అ.) సంతోషింపఁ జేయఁబడినది. వి.అ.న. సంతోషము.

**హర్షుల.** సం.వి.అ.స్త్రీ. మీసముగలకన్య.

**హర్షులము.** సం.వి.అ.పుం. లేడి.

**హర్షులుఁడు.** సం.వి.అ.పుం. ౧ ప్రియుఁడు. ౨ కాముకుఁడు. విణ. (ఉ. ఉ. ఉ.) ౧ పరిహాస శీలుఁడు. ౨ కామోద్రేకముగలవాఁడు.

**హల.** సం.వి.అ.స్త్రీ. ౧ సఖి. ౨ భూమి. ౩ నీరు ౪ మద్యము.

**హలా.** సం. అవ్య. చెలికత్తెనుబిలుచుటకుపయో గించుపదము.

**హలకత్తు.** సం. వి. ద. స్త్రీ. నాఁగటికొయ్య, ఏడికోలు.

**హలగోళకము.** సం.వి.అ.పుం. కీటవిశేషము.

**హలది.** (ప్రా. హలద్ది) పసుపు.

**హలధరుఁడు.** సం. వి. అ. పుం. ౧ కర్షకుఁడు. బలరాముఁడు.

**హలభూ(భృ)తి.** సం.వి.ఇ. స్త్రీ. ౧ దున్నుట. ౨ వ్యవసాయము.

**హలము.** సం.వి.అ.పుం.న. నాఁగలి. ౨ ఆయుధము. ౩ భూమినికొలుచు మానము. న. ౧ నాఁగలి. ౨ అంగవైకల్యము. ౩ ఆటంకము. ౪ కలహము.

**హలముఖము.** సం.వి.అ.న. నాఁగటికఱ్ఱు.

**హలవాహ.** సం.వి.అ.స్త్రీ. ఒకవిధమైన భూమి కొలమానము.

**హలసీరము.** సం.వి.అ.పుం. నాఁగటికఱ్ఱు.

**హలహతి.** సం.వి.ఇ.స్త్రీ. నాఁగటితో దున్నుట.

**హలహలా.** సం. అవ్య. ప్రశంసార్థకము.

**హలహలకము.** సం.వి.అ.పుం. ఉత్కంఠ.

**హలహలము.** సం.వి.అ.పుం. హాలాహలమను విషము. విణ. (అ.ఆ.అ.) దున్నునట్టిది; చాళ్లు ఏర్పఱుచునట్టిది.

**హలాయుధుఁడు.** సం.వి.అ.పుం. ౧ బలరాముఁడు ౨ మడకదున్నువాఁడు.

**హలాహము.** సం.వి.అ.పుం. చిత్రవర్ణముగల యశ్వము.

**హలాహలము.** సం.వి.అ.పుం. ౧ హాలాహల మను విషము. ౨ బల్లి. ౩ నలికీఁచు, రక్తపుచ్ఛిక ౪ బ్రహ్మ. ౫ సర్పము.

**హలి.** సం.వి.ఇ.పుం. ౧ పెద్దనాఁగలి. ౨ నాఁగటి చాలు. ౩ సేద్యము. న్. పుం. ౧ బలరాముఁడు ౨ కర్షకుఁడు.

**హలికుఁడు.** సం.వి.అ.పుం. కర్షకుఁడు, అరకపట్టి దున్నువాఁడు.

**హలిని.** సం.వి.ఈ.స్త్రీ. ౧ తతిగొట్టి ∥. ౨ నాఁగళ్ల సమూహము.

**హలిప్రియ.** సం.వి.అ.స్త్రీ. మద్యము, కల్లు.

**హలిప్రియము.** సం.వి.అ.పుం. కడిమిచెట్టు.

**హలీనము.** సం.వి.అ.పుం. టేకుచెట్టు.

**హలీ (లే) ష.** సం.వి.అ.స్త్రీ. నాఁగటికొయ్య.

**హలుహారము.** సం. వి. అ. పుం. ఒకవిధమైన గుఱ్ఱము.

**హల్య.** సం.వి.అ.స్త్రీ. నాగళ్ల సమూహము.

**హల్యము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ దున్నఁదగినది ౨ వికృతమైనది. వి.అ.న. ౧ దున్నిన పొలము. ౨ వికృతత్వము.

**హల్లకము.** సం.వి.అ.న. ఎఱ్ఱకలువ.

**హల్లకల్లోలము**=అల్లకల్లోలము. విణ. కొలుఁకుమాలినది, వ్యత్యస్తము; సంక్షుభితము, కలఁతఁ జెందినది.

ద్వి. ముల్లోకములు దనమూర్తిచే హల్ల, కల్లోలమై పడఁగావించినాఁడు.

రం. రా. యు. ౩౩౯. పు. ౧ పం.

క. అలబలముల నలఖిలముల, యెలగో లేమేమి యెక్కడెక్కడ నిలు నిన్, తలతల పదపద పొడుమని, కలఁగెందండెల్ల హల్లకల్లోలంబై

రా. వి. ౫. ౩.

వ.... దెసచెడి కలగుండువడి హల్లకల్లోలమై యతలకుతలమై యట్టిట్లై యుట్టూతలూగి.

ప్రబంధ. ౭౭౭.

**హల్లనము.** సం. వి. అ. న. నిద్రలోపలి దొర్లుట.

**హల్లా.** వి. (హిం. హల్లా.) లగ్గపట్టుట; కోట కెగఁబ్రాఁకుట.

క. ఫుల్లాశానిమ్మిపుడా, ఖిల్లా కిల్లాకునడఁచి కించిన్మాత్రన్, హల్లాకు నాలుకోలుపుమా, జెల్లాకుం జెదరఁజేతు శీఘ్రము వారిన్.

రంగా. ౨-౨౮౭.

**హల్లాల్లము.** సం. వి. అ. పుం. పర్వతాదులఁ బెకలించుటయందగు ధ్వనికనుకరణము.

శా. ఆ వైకుంఠహరాత్ప్రజాల్ వనుప హల్లాల్ల ధ్వనిన్ మందర, గ్రావంబున్ నురి దైత్యకోటి వెఱుకంగా నొప్పెరంధ్రంబు....

వరాహ. ౬-౫౭.

**హల్లాసేయు.** స. క్రి. (హల్లా+చేయు.) లగ్గపట్టు; నాశనముసేయు.

క. హల్లాసేయుమ బొబ్బిలి, కిల్లాతజ్జయము నీకుఁ గీల్కొల్పదు సేఁ, గల్లోదఁజామ్మి యిది నా, యుల్లాచరణంబులాన యధిపవతంసా.

రంగా. ౨-౫౮.

**హల్లీశ (స) కము.** సం. వి. అ. న. స్త్రీలు పలువురు చేరి మండలాకారముగాఁ దిరుగుచుఁ జేయు నృత్యము.

**హల్లీశ (ష) ము.** సం. వి. అ. న. ౧ పదునెనిమిది ఉపరూపకములలో నొకటి.

(ఇది ఏకాంకము. ఒకపురుషుఁడు ఏడుగురు, ఎనమండ్రు, లేక పదుగురు స్త్రీలు కలిసి చేయునృత్యగానములతోఁ గూడినది.)

౨ హల్లీసకము.

**హల్లు.** సం. వి. ల్. పుం. కకారాద్యక్షరము, వ్యంజనము. (ఒక ప్రత్యాహారము.)

**హల్లోహలము.** సం. వి. అ. పుం. సంభ్రమము, తొట్రుపాటు; ఆదరము; వేగము.

క.... అలరులదండన్, ఖిల్లియొకతె హరికిచ్చెను, హల్లోహలకలిత యగుచు నంగనకంటే.

భాగ. ౧౦. పూ. ౭౯౮.

క.... హల్లోహలమదబంభరమల్ల ధ్వనులు....

మనుచ. ౨-౬. పాండు. ౮.

**హళఁది=అళఁది.** (సం. హరిద్రా.) పసుపు; పసుపురంగు.

క. అగిరులలోన మేరువు, ప్రాగుత్తర దక్షిణాపరదిశలఁ దెలుపున్, జేగురు హళఁదియు నలుపును, నైగుణ్యముగఁ దెలుపు బ్రాహ్మణాదిక జాతుల్.

వరాహ. ౧౦-౧౦౬.

ఉ. పట్టుతలావయున్ హళఁది పచ్చనునుంబఱిపింద్రగోపపుంబట్టు కురాడముం దొగరుఁ బట్టియు.... యానృపతిమంచముపై సగలుంచి రచ్చలిన్.

పాంచాలీ. ౫-౧౦.

**హళహళి (క).** సం. వి. ఈ. స్త్రీ. ౧ సంభ్రమము, జేగిరపాటు, తొందర.

చ. హళహళి నప్పులిచ్చినక్రియన్ విరితేనియలాను తేఁటులున్, మలయుచు దాచఁబెట్టిన క్రమంబునఁ బండ్లు గ్రసించు చిల్కలున్, దలకొని సంతరించిన విధంబునఁ గెంజిగురుల్ గ్రహించు కోయిలలును గల్గి యామని రహించె మహీజనరింజనాకృతిన్.

ఉ. రా. ౬-౧౭.

చ. చిలుకలకొల్కి యొక్కరితచేరి పరాకుపరాకటంచనన్, జలరుహపాణియొత్తు సరసన్ గయిదండ యొసంగముంగలన్, హళహళి నొక్క గంధగజయాన బరాబరిచేయ....

అహ. ౧. ౫౯.

౨. ధ్వని.

వ....గిలుకలవప్పేర కోళ్లమంచపు హాళహాళులు
సాధికా. ౪-౧౦౨

క్రౌంచపదము - అంచితగోష్ఠీసంచరిణ ప్రత్యయ సమచితహాళిహాళికలతో ..గా, యంచలు ప్రోయన్ గొంచలు గూయన్ వ్యవహిత పరాగవమైన కొలంకున్.
కళా. ౭-౨౨౫.

**హాళాహాళి**, వి. ౧ కలకలధ్వని.

గీ. అని వచించుచు వారలవ్వానిఁ జరించు, చన్నచోఁ గిరశారీమయూరిపింఛము, రాళ గోలంబజాలంబు ప్రాలి కడుహ, ళాహాళి యొనర్పనులికి యిలావిభుండు.
కసిక. ౩-౧౪౨.

చ....వాద్యములు ప్రోయ హాళాహాళిసేయఁ బౌరులె, చ్చినఁగావ వేత్రులెచ్చరికఁ జెప్ప....
చంద్రా. ౭-౧౩౦. ఉ.రా.౭-౯౮.

౨. సంభ్రమము, తొందర.

చ....అ, పొల్లఁతుల వందఱన్ నిదురవుచ్చి హాళాహాళిగాఁగ నొంచున, వ్యాలపురరాజుఁ గూర్పనిటవచ్చి పెనంగితి తీనిగూడి....
యయా. ౫-౧౪౩.

ఉ. చెప్పెడిదేమి నావలపు చేసిన చేఁతలు కొల్లలోనని, స్నెప్పుడు గంటి నప్పుడ పయింబడనీడిచె నిల్వఁబడ్డహా, టప్పడదంత దైనఁగల దట్టు హాళాహాళి కింతనేఘనీ, నొప్పెడి దాఁకఁ దాఖుటక యోమని మెచ్చవుగా నృపాలకా. విజ.వి.౧-౯౯.

౩. సమ్మర్దము, సందడి.

చ. ఎదురుగవచ్చి పాండ్యధరణీశ్వరుఁడర్జునుఁ గాంచి వేఁడుగా, నుదివము మీరు రాఁగలుగు శోభన మెన్నటికబ్బుఁ బ్రోలికిం, బదఁడని యుద్ధబుండొలసి భద్రగజంబుల నెక్కివచ్చి రిం, పొదవ హాళాహాళిం గడకు నొత్తెడు పౌజుల దిక్కు చూచుచున్.
విజ. వి. ౧-౧౫౫.

క. (నావను) ... అ, మ్మని నాథులెక్కి రొండొరు, లను వడిఁజేయుఁతగా హాళాహాళి మీఱున్. దశా. ౧-౧౮౩.

౪. స్థైర్యము.

ఉ. కావుము కావుమో గిరిశకామిని యోజగదేక మాత నీ, లావున నింతకాలము హాళాహాళి ప్రేయుదు దైరికోటి.... రాఘ.చ. ౨-౮౨.

౫. ఆ..వము.

ఉ....విరహోత్థుల నిందరను మాపు శౌర్యమున్, భావజు యీహాళాహాళియు భర్గుని ముందఱఁ జూపవైతిగా. సారం౫. ౨-౧౭౫.

విణ. వ్యాప్తము, అతిశయించినది.

ద్వి. కనుమున నాబాల కరమట్టఁగ్రుచ్చి, యురమున నుతగుబ్బలజయంగఁ జేర్చి, యుగపడి జగి హాళాహాళిగాఁగ బిగిసి, తగడు గొన్నట్టి రత్నపుఠేవ నలరి.
అ.మ.క. ౪-౨౦. పా. రా. పం.

**హాళాహాళిసేయు**. స. క్రి. (హాళాహాళి+చేయు) భగ్నము చేయు, పడఁగొట్టు; కూల్చు.

ఉ. ఖండితలైన తామరసగంధుల నిర్భరమాన మర్గముల్, చండపరాక్రమంబున హాళాహాళి సేయఁదలంచివారిపా, లింబులమీఁద జల్లికను లేయఁ బ్రిలోకభయంకరుం డనం, గుండు రథాంగచిత్తమునకొల్మి శిలీముఖపంక్తిఁగాఁచుచున్. వరాహ. ౪-౧౫౩.

**హాళువాయి**. వి. (సంగీ) ఒకానొక స్వరస్థాయి.

ద్వి. హాళువాయియును ధరహారసమువాయి ... ఆదిగా సాగయుశాయములు....
బ.స.పు. ౩-౯౪౧. పం.

**హావణి**, వి. ౧ అలంకారము.

క. శ్రవణశ్రీలువహించిన, ధవళాంబుజకళికల నఁగఁ దళుకు వహింపన్, నవలా యొక్కతె సేరిచె, హావణిగ హురుమంజి ముత్తియమ్ములఁ బొగడల్. చంద్రా. ౭-౨౪.

గీ. హావణి సత్సంప్రదాయంబునందు భాగ్య చిహ్నములతోడ నుదయించె శిలవృత్తి.
కృ.శకుం.పీఠి. ౨౭.

౩. అశ్వశిక్షావిశేషము.

సీ. లవణిసంశో ధంబులకుఁ దెచ్చి హావణితో రస
సిద్ధివడయించి రాగిలందు.
పి.శకుం. ౧-౧౧౨.

హావణించు. స.క్రి. (√. హావణి) అలంకరించు.
సీ. అవనీవధూమణిహావణించు కాంచిస్థా యుం
భోధిరయిందా.శ నలరుచుండు.
శకాం. పీఠి. ౬౫.

౨ తాల్చు, ధరించు.

సీ. హావణింపగాకేస్సునఖా(వనీచక్ర సామ్రాజ్య
ఘాన్య విశాలలక్ష్మి. పాండు. ౧-౫౨.

సీ. పర్యాయదచెంగావిహావడ హావణించి ముఖ
పుండరీకమింపునఁ గరించి. శకాం. ౪-౭౧.

౩. చక్కఁబఱచు.
చ.. నిజవంశము మైలపడంగఁ జేసితిం, టీజగవ
మింటిలోన హావణింపక నీవిటుఁ గాంటివచ్చు
టన్. జై భా. ౬-౨౭.

౪ ఉంచు.
వ... కెమ్మావులపచ్చిగంటు మాటుటకు హావ
ణించిన ఆవికపకినిమణఁచుమడుపులు పగము
మునిపంటఁ గొఱికికొనెక్కుఁ జెక్కులను.
ప్రబంధ. ౭౭.

౫ పొందు.
సీ. అదివహించుకెలంగు హావణింపలేదుగా కి
న్నరీతతి తావుకొన్న నేమి. చం.రా.౫-౫౨.

౬ తిరస్కరించు.

మ....క్రొమ్మించులన్, హావణించున్ గనుమిన్న
లెన్నదరమా యాబోటినాకోఁటికిన్.
వశా. ౭-౩౯.

౭ రచించు.

వ. విజయరాఘవపార్థివేంద్రుఁడు హావణించిన
రఘునాథనాయకాభ్యుదయ నాటకంబునకుఁ
గథాసంవిధానంబెటువలెనన....
రఘునా. ౨. పా. ౯.పం.

అ.క్రి. విజృంభించు, ఎలఁగు.

గీ. మణియఁగొండలు సుదతులు మస్త్రిలయును,
సారజము మొదలైనవాద్యములు వట్టి,

ప్రకటులు పూనమ్మనిహావణింపనతివ జేశిన్నృత్త
నై భరిఁ జూపె మసెంద్రుపదుట.
వాల్మీకి. ౩-౧౭౫.

హావణింపు. వి. (√'హావణించు) అలంకారము.
శా.. ఆకగా, శాలితయాసురూపరుచిసంపదలా
హావణింపు సొంపులన్. శకాం. ౨-౬౯.

హావణిక. (√. హావణించు) ౧ అలంకారము;
ఒప్పు.
క. దొరపెట్టిన హారుపెట్టిరా, యరు దాహా విదు
మలున్న హావణిక లులుహా, పరఘవము నింద్ర
బోగమె, దొరకెను వమకనని వారు శుది
శేరొకరున్. విజ.వి. ౩-౧౭౯.

గీ. ఎచ్చరిక యొచ్చరిం పేవ యేడ పదిల,ము హావ
ణికపోయిమి యన నొప్పు నవధాన,ము....
ఆం.భా. ౧-౧౩౭.

౨. జాగరూకత.

క. ఆటహరివిక్రముఁడత్యుద్భట హయభటహ
స్తిఘటలు దగరా నరా, దట హావణిక పెడ
గినమహా,పటహరమైచటుల లటకపటహము
మొఱసెన్. రా.వి. ౪-౧౭౯.

౩ విధము.
వ.... తత్వకీవారపార్స్లవీక్షణా కటాక్షవీక్షణ
ప్రేక్షణీయులగుటకై జగతి నవతరించిన జ
యంత నలకూబరుల హావణికన్....
చం.రా. ౩-౯౭.

వ. ... పరస్పరవిజయేచ్ఛలఁ జిక్కుదీసినటుల
దాయాదులపాళ్ళు పంచిన యుపమను రాజు
నాశ్రిలినహావణిక సంజవేళ జక్కవలు కవలె
డఁబాసిన చందమున. ప్రబంధ. ౭౭.

హావణిల్లు. అ.క్రి. ప్రకాశించు.
సీ. తనముఖంగున మకంతప్రతాపస్ఫూర్తి హావ
ణిల్లు నినుఁడును నణఁగియుండ.
వేం. పంచ. ౧-౩౦. (శ.ర.పా.)

హావము. వి. ౧ ఒప్పిదము.
శా.... ఇంతయే, లానామానసమీలతాంగిపయి
లీలాడోలిగాకేళికా, శ్రీనై పుణ్యమః

జూపఁగాహావణుఁగాంచెన్ దద్గుణాలంబమై. కువల. ౪-౧౫౫.

౨ విలాసము.

సీ. ధవళముల్ వినిచొక్కు హావణుఁదెల్పెడిలీల హాయిఁగోయిలపలుకు లాలకించి. విజ.వి. ౧-౨౯.

౩ జాగరూకత.

సీ. దాసీజనులకైనఁ దగఁజెప్పి యూరకేఁ, దని పించలేనైతి హావణుదప్పి. నిరం. ౨-౧౨౩.

చ ...ఇచ్చుటిచెంచుముద్దియల్, హావణుగఁ గల్ప వృక్షసురకై సురలోకపుఁబూవుబోండ్లకా, ర్జవమున నిత్తురు ...కళాం. ౧-౧౪.

విశే. అలవి, శక్యము.

గీ. విరహాలహరీఘటా సముద్వేలరాగ, జలనిధా నంబు దరియింపఁ గొలఁదికాదు, ధీతరణ్య స్తమయజమోహాలి భీమ,ఘాంధకారము విరి యింప హావణుకాదు. వరాహ. ౪-౩.

**హావణుపడు**, అ. క్రి. పొందుపడు, చక్కఁబడు (చూ. హావణుపఱుచు.)

**హావణుపఱుచు.** స. క్రి. (√. హావణుపడు) పొందుపఱుచు, చక్కఁబఱుచు.

సీ. సాత్త్వికస్వల్పభోజనలబ్ధిఁ గ్రొవ్వాఁగి, యష్టాంగకాసక్తి హావణుపఱిచి. పాండు. ౨-౮

**హావనము.** సం.వి.అ.న.౧హోమము. ౨ స్రుక్కు ౩ స్రువము. ౪ ఆహ్వానము. పుం. ౧ అగ్ని. ౨ హోమకుండము.

**హావనాయువు(స్సు).** సం.వి.స్.పుం. అగ్ని.

**హావని.** సం. వి. ఈ. స్త్రీ. ౧ హోమకుండము. ౨ హావిత్రి.

**హావనీయము.** సం. విశే. (అ.ఆ.అ.) ౧ యజ్ఞమునకు సంబంధించినది. ౨ హోమముచేయఁదగినది. వి.అ.న. ౧హోమార్హవస్తువు. ౨నేయి.

**హావము.** సం.వి.అ.పుం. ౧ ఆజ్ఞ. ౨ పిలుపు.

**హావళించు.** అ.క్రి. ఒప్పు.

మ. కవితాధోరణి యక్షగానరచనల్ గంధర్వగాంధర్వమై, హావళింపన్ గనకప్రసూనము లఖుత్సాహోదసంపర్కమై,మిపులన్ మెచ్చఁగఁజేసె ఖేచరుల....శ్రీరం.మా. ౪-౧౬౪.

**హావి**, వి. (సం.హవిస్.) హవిస్సు, హోమద్రవ్యము.

క. శివనిందాశ్రవణమునన్, భవాని తనదేహమాత్మపావకమునకున్, హావి సేసికాద భక్తిని, భవదర్ధాంగమున నుండఁబడసె మహేశా. శివ.సా. ౩౯౩.

ద్వి. దేవియత్యుద్ధతిదేహంబు విడిచి,పావకునకు హావి గావించిమీఁద,సరి నవినాభావసంబంధలీల, హరువామభాగంబునందుండఁ బడయు. పండితా. వాద. ౨౧౦. పా.

ఉ. నాయశమున్ మగంటిమియు నానయు వమ్ముగఁజేసెఁజూడఁగా, దీయసతిన్ మదీయగృహమిప్పుడ వెల్వడఁదోఁచిరండు కా, తేయకలీఢమైన హావి లెస్సగఁజూతురె.... హరి.ఉ. ౯-౭౭.

**హావిత్రి**, సం. వి. ఈ. స్త్రీ. ౧ హోమకుండము. ౨ హావని.

**హావిష్యము.** సం.వి.అ.న.౧హవిస్సు. ౨ నేయి.

**హావిస్సు**. సం.వి.స్.న. అగ్నియందు వ్రేల్చుటకిగురఁబెట్టినయన్నము, నేయి మొ॥

సీ. యజ్ఞతంత్రములందు హావిరన్నములచేతఁ బుంజీభవించినపాత్రక్రొవ్వు. నిరం.౪-౩౭.

**హావుదు.** అవ్య. (క. హావుదు.) ప్రశంసార్థకము.

ఉ. ఎక్కడినారదుండు - ఎందుఁ గాన నమ్మక్కసెదాను మేలు హావు దంచు ఫణీశ్వరుఁ జూచి యింపునన్. కువల. ౪-౧౧౩.

మహాస్రగ్ధర....అచ్చాటుకారుల్, హావుదహ్వాపాత్రరాయా యహహా బళిబళీయంచుఁ జెల్లెచ్చరిపంన్, రకలిన్ నర్తించెఁ గాంస్యారవము రజముఖారావభావానువృత్తిన్. వైజ. ౧-౧౨౮.

**హావుసు**=**వసాను**, వి. సొగసు.

గీ. చూపఱకు వేడ్క లొనరించు సొబగు వెలయు, వెలయు సంగు జాళువా ప్రాంతకలిమి నెన్నఁ, గన్నసైకపు దుప్పటికలలువార, నలరువల తేని చెల్వాసె హావునుఁ బూని. ఇందు. ౫-౨౭.

గీ. ఎన్నఁ డోకదవగ కాని కింపు మెఱయఁ,గంతు కేళిని వింతలుగాను పింతు, హావును చెల్లింతుఁ జెలులలో నతిశయింతు, ననుచు నేనుంచు నీయాన హంసయాన. అహ. 3-౫౭.

**హావేలి.** వి.(హిం.హావేలీ.) నగరు,రాజగృహము. విణ. రాజునకుఁ జెందినది. (శ. ర.) వ్యవ:— హావేలితోఁట, హావేలిగ్రామము.

**హావ్య.** సం.వి.అ.స్త్రీ.గోవు.

**హావ్యకవ్యములు.** సం. వి. అ. న. దేవతలకును బితృదేవతలకును నర్పించు హోమద్రవ్యములు.

**హావ్యపాకము.** సం. వి. అ. పుం. వెన్నపాలతో వండు హోమద్రవ్యము. ౨. హావ్యమువండు పాత్రము, చరువు.

**హావ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) హోమము చేయఁదగినది. వి.అ.న. ౧ నేయి. ౨ యజ్ఞము లందు దేవతలకర్పించునది. 3 హోమద్రవ్యము.

**హావ్యలేహి.** సం.వి.న్.పుం. అగ్ని.

**హావ్యవాట్టు.** సం.వి.హ. పుం. అగ్ని.

**హావ్యవాహుఁడు=హావ్యవాహనుఁడు.** సం.వి.అ.పుం. అగ్ని.

**హాసంతి(క).** సం.వి.ఈ.అ.స్త్రీ. ౧ కుంపటి.

ఉ. అంతటమంచుమించి దిశలన్నియు ముంచెను శీతబాధచే, పంతతమిండ్లలోపల హాసంతిక లన్ దలలెత్తి మేను లాద్యంతము బీడు పాటి ధనురాకృతివంగఁ దొడంగె.... శివధ. ౫-౧౦౦.

**హాసత్తు.** సం.వి.త్.స్త్రీ కుంపటి.

**హాసనము.** సం.వి.అ.న. నవ్వు.

**హాసని.** సం.వి.ఈ.స్త్రీ. కుంపటి.

**హాసనీమణి.** సం.వి.ఇ.పుం. అగ్ని.

**హాసము.** సం.వి.అ.పుం. ౧ నవ్వు.

శా. ఏవంభూతమహాప్రభావనిధి లోకేశుం జిత క్లేశు మం,దావిర్భావహాసైకమాత్ర దళితో ద్యద్దైత్యగర్వాంధకా, రావేశున్ నరకేసరిం గొలిచి.... పాండు. 3-౧౧౮.

౨ పరిహాసము. 3 ఆనందము.

**హాసాదు=అసాదు.** అవ్య. (సం. ప్రసాదః, క. హాసాద.) (శ.ర.) గొప్పవారియాజ్ఞ నంగీకరించుటను దెలుపుటకై విధేయులనుమాట.

చ. అనియనుపన్ హాసాదని నృపాగ్రణి య మ్మునిలోకచంద్రు వీ,డ్కొని....
కువల. ౪-౯౪.

ఉ. బల్లునఁ దెల్ల వాతిన నృపాలుఁడు మంత్రులఁ బిల్వఁబంచి .......కలఁజెప్పినదెంతయు నాను పూర్విగా,సల్లలితాంతరంగులయిసామి హాసాదని వారలూఁకొనన్. సారంగ. ౧-30.

మ. అని వర్ణించు సువర్ణగర్భునకు నేహాళింబ్ర సాదించి క్రక్కునఁ ద్రైలోక్యము సృష్టిచేయుమని శ్రీకాంతుండు పంపన్ హాసాదని వాణీశ్వరుఁడాగ మోక్తముగ సూర్యాచంద్రతారల్ దివం,బున భూమీనభముల్ సృజించెను యథాపూర్వంబుగా నంతటన్. దశా. ౧-30౪.

**హాసి(యి)ంచు.** సం.అ.క్రి. ౧ నవ్వు. హాసము చేయు. ౨ ఎగతాళిచేయు, పరిహసించు.

ది. ఆనతశశిరేఖ హాసియించునొసలు. ద్వి.పరమ. ౧-౧౫ పా.

మ....ఆత్మతనూదీప్తులు క్రొమ్మెఱుంగులహసింపన్ దన్వీమానంబులోన్. వరాహ. ౨-౭౪.

ఉ.... నీయింటను మించుమించు హాసియించు నిభోర్మికనూర్మిలన్ నృపా.చం.రా.3-౧౦౯

**హాసితము.** సం. విణ. (అ. ఆ. అ.) నవ్వునది. ౨ వికసించినది. వి. ౧ నవ్వు. ౨ వేళాకోళము. 3 మన్మథుని విల్లు.

**హస్త.** సం.వి.ఆ స్త్రీ. ఇరువదియేడు నక్షత్రములలోఁ బదుమూఁడవది.

**హస్తకము.** సం.వి.అ.పుం. ౧ చేయి. ౨ హస్తవిన్యాసము. ౩ కొలమానము, మూర.

**హస్తగతము.** సం.విణ.(అ.ఆ.అ.) ౧ చేఁజిక్కినది. ౨ పొందఁబడినది. ౩ వశమైనది.

**హస్తచాపల్యము.** సం.వి.అ.న. హస్తకౌశలము.

**హస్తతలము.** సం. వి. అ. న. ౧ అఱచేయి. ౨ ఏనుఁగుతొండముచివర.

**హస్తతాలము.** సం.వి.అ.పుం. ౧ అఱచేతులు చఱచుట. ౨ చప్పట.

**హస్తతుల.** సం. వి. ఆ. స్త్రీ. ౧ చేతూకము. ౨ చేత్రాసు.

**హస్తధారణము.** సం.వి.అ.న. హస్తవారణము, దెబ్బనుచేతితో నాఁపుట.

**హస్తపుచ్ఛము.** సం. వి. అ. న. మణికట్టుక్రింది చేతికొనభాగము.

**హస్తపుపారువ.** వి. (హస్తము+పారువ) మల్లబంధవిశేషము.

వ. దండనిల్కడ కదలుకలయు మెలకువ వింగళింపుదిశాపదికలు పాదపుహస్తపుపారువ.... మొదలగువితములెఱింగి ...ప్రబంధ. ౭౮.

వ. అవ్వీరుండు దండనిల్కడ కదలు హస్తపుపారువ కరలాఘవంబు లాదియగుపాదకోపవీతంబులరీతులు నేర్చి.... హంస. ౧-౨౦౬.

**హస్తప్రదము.** సం.విణ. (అ.ఆ.అ.) సాయము చేయునది.

**హస్తబింబము.** సం.వి.అ.న. తైలాదులతో శరీరమును సువాసితమొనర్చుట.

**హస్తభ్రష్టము.** సం.విణ.(అ.ఆ.అ.) ౧ చేజాఱినది. ౨ తప్పించుకొనిపోయినది.

**హస్తమణి.** సం. వి. ఇ. పుం. మణికట్టునధరించు నాభరణము.

**హస్తము.** సం. వి అ. న. ౧ తోలుతిత్తులజంట. ౨ చేతినేర్పు. పుం. ౧ చేయి. ౨ ఏనుఁగుతొండము. ౩ మూర, ౧౮ అంగుళములు. ౪ చేవ్రాఁత. ౫ చేవ్రాలు. ౬ సూచించుట. ౭ సాయము. ౮ (కేశకచాదిపరమైనపుడు) సమూహార్థకము. ౯ ఒకనక్షత్రము, హస్త.

గీ. అర్యమునితారఁ బెక్కుపత్యములుపుట్టు,
హస్తమునఁగర్మసఫలత.... భార.౩-౧౬౮.

౧౦. హస్తాకారముగల దర్వి, చేతివలెనుండు త్రెడ్డు, చట్టము.

మ. హరివాణంబులు గిన్నియల్ పడిగముల్
హస్తావళుల్ పీఠముల్ ....వరాహ.౪-౧౧౨.

**హస్తలాఘవము.** సం.వి.అ.న. ౧ చేతినేర్పు. ౨ కనుకట్టువిద్య, గారడీ.

**హస్తలేఖము.** సం. వి. అ. పుం. ౧ చిత్తరువు మున్నగువానిని దీర్చుటకు ముందుచేతితోఁజేయు నభ్యాసము. ౨ చేతిచిత్రలేఖనము.

**హస్తవంతుఁడు.** సం.విణ. (త్.తీ.త్.) నేర్పుగలవాఁడు.

**హస్తవాపము.** సం.వి.అ.పుం. చేతితో బాణములు ప్రయోగించుట, హస్తక్షేపము.

**హస్తసిద్ధి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ చేతిపని. ౨ కూలి.

**హస్తసూత్రము.** సం.వి.అ.న. ౧ మణికట్టున ధరించు తోరము. ౨ కంకణము.

**హస్తస్వస్తికము.** సం. వి. అ. పుం. చేతులను స్వస్తికమువలె నొకదానిపైనొకటి యడ్డముగా వేయుట.

**హస్తహార్యము.** సం.విణ.(అ.ఆ.అ.) ప్రత్యక్షమగునది. ౨ సువ్యక్తమగునది.

**హస్తాక్షరము.** సం.వి.అ.న. చేవ్రాలు.

**హస్తాగ్రము.** సం.వి.అ.న. వ్రేలు.

**హస్తామలకము.** సం.వి.అ.న. ౧ అఱచేతిలోనియుసిరికకాయ; వశమైనది; స్పష్టమైనది. ౨ ఒకవేదాంతగ్రంథము.

**హస్తామలకుఁడు.** సం. వి. అ. పుం. శంకరాచార్యులవారి శిష్యులలో నొకఁడు.

**హస్తార్పణము.** సం. వి. అ. న. నమస్కారము (ఈయర్థము ఆంధ్రమునసే కానవచ్చుచున్నది.) రగడ. చెన్నగుసింహాక్షేత్రమహాసిం, హస్వరూపునకు హస్తార్పణమని.... హంస. ౪.౨౧౩.

**హస్తావాపము.** సం. వి. అ. పుం. ౧ జ్యాఘాతవారణము.(అల్లెత్రాటిదెబ్బ తగులకుండఁ గాపాడునది-అంగుళిత్రము.) ౨ చేతిసంకెల.

**హస్తాహస్తి.** సం. అవ్య. చేతులుచేతులు కలిపి చేయు యుద్ధము.

**హస్తి.** సం.విశే. (న్.నీ.న్.) హస్తముగలవాఁడు వి.న్.పుం. ఏనుఁగు.

వ ... అప్పుడప్పటుగథస్తి హస్తియుంబోలెఁ బన్నినిప్రమోదాహావకర ప్రచారుండై .... పాండు. ౪-౧౬.

**హస్తిక.** సం. వి. ఆ. స్త్రీ. తంత్రులుగలవాద్యవిశేషము.

**హస్తికక్ష్యము.** సం. వి. అ. పుం. ౧ సింహము; పెద్దపులి.

**హస్తికము.** సం.వి.అ.న. గజయూథము.

**హస్తికర్ణము.** సం.వి.అ.పుం. ఆముదపుఁజెట్టు.

**హస్తిగిరి.** సం.వి.ఇ.పుం. కాంచీనగరము.

**హస్తిఘ్నుఁడు.** సం. వి. అ. పుం. ౧ ఏనుఁగును జంపువాఁడు. ౨ ఘనుష్యుఁడు.

**హస్తిచాగము.** సం. వి. అ. పుం. ఒకవిధమైన యాయుధము.

**హస్తిచారి.** సం.వి.న్.పుం. ఏనుఁగునునడపువాఁడు.

**హస్తిజాగరికుఁడు.** సం. వి. అ. పుం. గజమును పోషించువాఁడు.

**హస్తిజిహ్వా.** సం.వి.ఆ.స్త్రీ. ఒకవిధమైన నాడి.

**హస్తిదంత(క)ము.** సం.వి.అ.పుం. ౧ ఏనుఁగు దంతము. ౨ చిలుకకొయ్య. న. ముల్లంగిగడ్డ.

**హస్తినఖము.** సం.వి.అ.న. గవనివాకిట వాటముగా నేర్పఱిచిన మట్టిదిబ్బ.

**హస్తి(న)నాపురము.** వి. కురురాజధానియగు నొకపట్టణము, కరినగరము.

గీ. తనరు గంగాతరంగిణీతటమునందు....
హస్తినాపురంబు.... దశా. ౧-౭౨.

**హస్తినాగ.** సం.వి.ఆ.స్త్రీ. ఏనుఁగుతొండము.

**హస్తిని.** సం.వి.ఈ.స్త్రీ. ౧ ఆఁడేనుఁగు. ౨ ఒకవిధమైన యోషధి. ౩ ఒకజాతి స్త్రీ. (స్థూలాధర, స్థూలనితంబబింబ, స్థూలాంగుళి, స్థూలకుచ, సుశీల, కామోత్సుక, గాఢరతిప్రియ, నితాంతభోక్త్రి అయినట్టి స్త్రీ).

**హస్తిపకుఁడు.** సం.వి. అ. పుం. మావటివాఁడు, బరికాఁడు.

**హస్తిపర్ణి(క).** సం.వి. ఈ.అ. స్త్రీ. దోసతీఁగ. ౨ రాచబీఱ.

**హస్తిపుఁడు=హస్తిపకుఁడు.** సం. వి. అ.పుం. మావటీఁడు.

**హస్తిబంధకి.** సం.వి. ఈ. స్త్రీ. వన్యగజములను వశపఱుచుకొన నుపయోగపడు నాఁడేనుఁగు.

**హస్తిమయూరము.** సం.వి.అ.పుం. అజామోదము‡.

**హస్తిమల్లము.** సం.వి.అ.పుం. ౧ ఐరావతము. ౨ భస్మరాశి. ౩ గాలివుమారము. ౪ మంచు.

**హస్తిమల్లుఁడు.** సం.వి.అ.పుం. గణేశ్వరుఁడు.

**హస్తివాహము.** సం.వి.అ.పుం. అంకుశము.

**హస్తివాహుఁడు.** సం.వి.అ.పుం. మావటివాఁడు.

**హస్తిశుండ.** సం. వి. ఆ. స్త్రీ. ౧ ఇంద్రవారుణియను నొకవిధమైన యోషధి. ౨ నల్లేరు.

**హస్తిశుండి.** సం.వి.ఈ.స్త్రీ.=హస్తిశుండ.

**హస్తిమద్గవము.** సం. వి. అ. న. ఆఁడేనుఁగుల సమూహము.

**హా స్త్రీకరణము.** సం.వి.అ.న. పెండ్లియాడుట.

**హా స్త్యము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ చేతికి సంబంధించినది. ౨ చేతితోఁ జేసినది. ౩ చేతితో నీయఁబడినది.

**హాస్త్యాజీవుఁడు.** సం.వి.అ.పుం. మావటీఁడు.

**హాస్త్యారోహుఁడు.** సం.వి.అ.పుం. ౧ మావటివాఁడు. ౨ గజవాహనుఁడు.

**హాస్రిము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧ స్మేరము. ౨ తెలివితక్కువది. ౩ అజ్ఞము.

**హాహాలము.** సం.వి.అ.న. ఉగ్రవిషము.

## హో

**హో.** అవ్య. ౧ సఙ్జ్ఞము మున్నగువానిని బ్రోలుటకై చేయు ధ్వని.

ఉ... హోయిహోయిరా, ఒక్కఁడే వచ్చె నోఁక నటు హో యనినన్ గదలెన్ జరీలునన్.

సారం౧౫. ౧-౮౨.

౨ కడచిన విషయమును జ్ఞప్తికిఁదెచ్చుకొనుటను సూచించును.

వ....హో! మఱచియుంటి ... ఆము.౬-౩౭.

౩. సంతాపమును దెలుపును.

ఉ. హో యను ధర్మరాజతనయాయను నన్నెడఁబాయ నీకుఁజ, స్నేయను....

భార. ద్రో. ౨-౨౪౨.

మ. అతఁడట్లొపథహీనుఁడై....చరణద్వంద్వంబు రాకుండినన్, మతిఁజింతించుచుఁ దద్విధం బెఱిఁగి హో నన్నిట్లు దైవంబతెచ్చితె యీ ఘోరవనప్రదేశమునకున్ సిద్ధాపదేశంబునన్ మనుచ. ౨-౧౪.

ఉ....శ్లథాంగియై, సోలినఁజూచి డెందములు సుట్టిన హో యని బోటులందఱున్.

ఆము. ౫-౩౬.

౪. ఆక్రోశార్థకము.

క. అది గనినమాల్యవంతుఁడు, గదగొని హోహోకు హోకు గరుడయటంచున్, విదళించె గరుడు తెక్కలు.... దశా.౨.౪౦౨.

౫. రోషమును, ఆక్షేపమును దెలుపును.

ఉ....మోహినీమహిళ యద్భుతరోషకషాయితాక్షియై, హో యనునంతలో..దశా.౨-౩౬౫.

ఉ. స్యందనమున్ దురంగములు కొరివిహో బలరాము పెల్లలీ, యిందునిభాస్య యీ మెకెట కొత్తుక హోయెదు రాకుమారమే, మందరుగాదవుల్ వినిన హో యిటుపంటివె రావ వారితోఁ,బొందులు గానకుండఁగొనిపోఁద గవా మిమువంటి వారికిన్.

విజ. వి. ౩-౧౪౫.

౬. సుఖాదులవలని పారవశ్యమును దెలుపును.

చ. సకలశుభమ్ము లిమ్మనుచు సన్నుసులీగతిఁ జేయ నాస్రవం, తికదయఁదల్ప బంచిన గతిం జనుదెంచె నుదంచదూర్మికా, నికర విలోల ఖేలదలినీ కలగాన లసత్ ప్రఫుల్లహో, ల్లక సుఖడోలికా విహృతి లాలస బాల నవీర మయ్యెడన్.

క. చనుదెంచిన హోయనియు, జ్ఞననాయకుఁ డలరుచున్ విశారదుఁగని యీ, యనుకూలమారుతాగతి, గనఁగొన నామోదసూచకంబై నదగా. విజ. వి. ౧-౫౨.

౭. ఆశ్చర్యార్థకము.

మ. అరుణావిష్కృతి భాస్కరోదయముఁబద్మామోదమంభోరుహో, కరమున్ వేలుపు విల్ ప్రపక్షణము నోంకారంబు మంత్రాక్షర, స్ఫురణంబున్ బ్రకటింపఁగా మొదలనుద్భూతంబులైనట్టులీ, శ్వరుఁడే తెంచుటకున్ ద్వదాగమము హో సంసూచకంబయ్యెడున్.

పాండు. ౪౯౫౭.

**హోంగరము.** సం.వి.అ.పుం. పెద్దచేప.

**హోంత్రము.** సం.వి.అ.పుం. చావు, మృతి.

**హోకారము.** సం.వి.అ.పుం. హో యను ధ్వని.

**హోకీము.** వి. (హిం. హకీం.) ౧ యజమానుఁడు.

శా....నీరుకాకి నెపముల్ జోడించి పల్మారుహో హకీముల్ దమరిట్లు పల్కుటకు నర్థించె విమర్శింపఁగన్. రంగా. ౨-౨౧౮

౨. వైద్యుఁడు. (శ.ర.)

**హాకృతము.** సం.విణ. (అ.ఆ.అ.) హా హాధ్వనులతో నిండినది.

**హాజారము**=హజారము. వి. ఆస్థానమండపము, కొలువు కూటము.

క. రోజింపుమనుచుఁ జెప్పిన, హాజారంబునకు వచ్చి యమ్మంత్రివరుం, డేజాడఁ బ్రియమొనర్చెద, రాజునకని తలఁచు... రామా. ౨-౬౬.

**హాటకగర్భుఁడు.** సం.వి.అ.పుం. బ్రహ్మ.

**హాటకగిరి.** సం.వి.ఇ.పుం. మేరుపర్వతము.

**హాటకము.** సం.విణ. (అ.ఆ.అ.) సువర్ణమయము. వి.అ.న. ౧ బంగారు. ౨ ఉమ్మెత్త. ౩ ఒకవిధమైన రసము. పుం. ఒకదేశవిశేషము.

**హాటకి.** సం.వి.ఆ.స్త్రీ. మట్టికుండ.

**హాటకేశ్వరుఁడు.** సం.వి.అ.పుం. శివుఁడు.

**హాతము.** సం.విణ. (అ.ఆ.అ.) విడిచిపెట్టఁబడినది

**హాతువు.** సం. వి, అ. ఉ. పుం. స్త్రీ. ౧ చావు. ౨ బాట, మార్గము.

**హాత్రము.** సం.వి.అ.న. ౧ కూలి. ౨ బాధించుట. ౩ చంపుట, ౪ చాయ.

**హాత్రువు.** సం.వి.అ.పుం. ఒక రాక్షసుఁడు.

**హాధిరా.** అవ్య. గుఱ్ఱములు మొదలైన జంతువుల నాఁపుటకు సారథులు ప్రయోగించుమాట.

సీ. జగదంతరప్రజా సమ్మర్దపథముల హాధిరా యని వేగ మాగకున్న. కకుత్స్థ. ౨-౪౨.

**హానము.** సం.వి.అ.న. ౧ విడుచుట. ౨ నష్టము. ౩ అపజయము. ౪. తప్పించుకొనుట. ౫ బలము ౬. కొఱఁత. ౭ విరమణము.

**హాని.** సం.వి.ఇ.స్త్రీ. ౧ విడుచుట. ౨ తక్కువగుట. ౩ నష్టము. ౪ కీడు. ౫ లోపము. ౬ గతి

**హాపనము.** సం. వి. అ. న. ౧ వెడలించుట. ౨ బయటికిఁ ద్రోయుట.

**హాపుత్రి (క).** సం.వి.ఈ.ఆ.స్త్రీ. మందపిచ్చుక. కాటుకవంటి రెక్కపిట్ట. ఆ.స్త్రీ. ఆవులించుట.

**హాఫిక.** సం.వి.ఆ.స్త్రీ. ఆవులింత.

**హామిక**=ఆమిక. వి. (సం. అహమహమికా.) మదము, గర్వము.

ఉ. అమ్మనుజాశి సొమ్మసిలి యమ్మెయిఁ గ్రమ్మటఁ జేరి హామికన్, హుమ్మనిహుంకరించి దగునోపనాటుఁడ ... సమీర. ౧-౧౭౦.

ఉ. ....అనేకసాయక, స్తోమవిశాలతూణగణశోభితబాహులు దగ్రడిఁ గొల్చుచున్, హామిక వచ్చి రక్కసకులవాఖ్యులు దానవవంశవర్ధనా. సీతా. వి. ౨-౧౫౧.

ఉ. హామికఁజొచ్చి పాల్యమును నాటకొలంకుఁ గలంచి యిచ్చగా, నామికనామియై నిలిచి యాదలయెత్తి చెలంగు తప్పయ, స్సామజరాజకుంభ విలసద్గతి నొప్పెఁ గుచద్వయంబు నా, రీమణి కౌరు నూగు దనరెంగలితాంచితదాఃధారయై. ఉ. హరిశ్చ. ౨.౪౫.

**హాయనము.** సం.వి.అ.పుం.న. ౧ సంవత్సరము. ౨ కిరణము. పుం. ధాన్యవిశేషము.

**హాయి.** వి. ౧ సుఖము.

వ. అప్పుడు వెన్నెలలకాఁక సోఁకునకుంగాక యిందుమతి హాయనుచు హాయిలేక.... ఇందు. ౪-౩౭.

గీ. ఇంగితజ్ఞులహాయి మారంగఁజాయి, మంగయబలూఁతచేయి మారంగజాయి, యంగదభృతానుయాయి మారంగజాయి, భృంగసంకాశకాయి మారంగజాయి. పాంచాలీ. ౧-౨౯.

౨ సంతోషము.

సీ. మదికి హాయి ఘటించె మదవతీ మణులార! సురభిళాళుగపరిస్ఫురణగరిమ. చంద్రా. ౨-౧౪౨.

సీ. తనవల్లఁబుట్టిన దనక మహామాయ నాదిని జేపట్టి హాయిపొందె. పార్వ.౪-౧౦౨.

**హాయిమను.** అ.క్రి. (హాయి+అను. వృత్తిని వర్ణాగమము) సుఖించు.

మ.. చలద్వ్యానంతికాననావని, ర్మల మారంద
కణాళి జాతికనపై ప్రాలంగ రాయంచలై,
క్కులు ఝాడించినఁ గ్రమ్ము తెమ్మెరల
రాకన్ హాయినుం చున్నదన్.
కువల. ౪-౧౩౬.

**హాయిరె.** అవ్య. సంతోషమును దెలుపును.

ఉ. హాయిరె బాలచూపులఁకి నక్కట చొక్క
టపున్ మెఱుంగులై, నాయెద దుస్సిహాలె
కలినాగని యాధునికాస్త్ర వైఖరిన్.
అహ. ౨-౬౭.

**హార.** సం.వి.ఆ.స్త్రీ. తొగరువన్నెగల ద్రాక్ష.

**హారకము.** సం.వి.అ.న. ౧ ముత్యాలహారము.
౨ గద్యరచనా విశేషము. ౩ భాజకము (గణిత)

**హారకుఁడు.** సం.వి.అ.పుం. ౧ దొంగ. ౨ మోస
గాడు; జూదరి.

**హారగుటి (లి) క.** సం.వి.అ.స్త్రీ. హారమునందలి
యొక ముత్యము.

**హారతి.** వి. నీరాజనము, ఆరతి.
"నక్షత్రపు హారతి" బ్ర. ౩. ఆ. (శ.ర.)

**హారఫల (క) ము.** సం.వి.అ.న. అయిదు పేటల
ముత్యాల హారము.

**హారము.** సం.విశే. (అ.ఈ.అ.) హరసంబంధి
యైనది. వి.అ.పుం. ౧ గ్రహించుట. ౨ తొలఁ
గించుట. ౩ మూటయెనిమిది పేటల ముత్యాల
హారము. ౪ యుద్ధము. ౫ భాజకము. (గణిత)
౬ దీర్ఘాక్షరము (ఛంద).

**హారయష్టి.** సం.వి.ఇ.స్త్రీ. ముత్యాలహారము.

**హారహార.** సం.వి.ఆ.స్త్రీ. ఒకవిధమైన ద్రాక్ష.

**హారహూరము.** సం.వి.అ.పుం. మద్యము.

**హారావలి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ ముత్యాల హారము
౨ పురుషోత్తమ దేవుఁడు రచించిన యసా
ధారణ పదముల నిఘంటువు.

**హారి.** సం.విశే. (న్.ఈ.న్.) ౧ హరించునది.
౨ గ్రహించునది. ౩ పొందునది. ౪ మనోహర
మైనది. ౫ అతిశయించినది. ౬ హారముకలది.
ఈ.స్త్రీ. ముత్యము.

**హారికంఠము.** సం.వి.అ.పుం. కోకిల.

**హారికులు.** సం.వి.అ.పుం. (బ) ఒకజాతి జనులు.

**హారిణము.** సం.వి.అ.న. లేడిమాంసము.

**హారిణికుఁడు.** సం.వి.అ.పుం. వేఁటకాఁడు.

**హారితము.** సం.వి.అ.పుం. ౧ ఆకుపచ్చవన్నె.
౨ ఒకవిధమైన పావురము. విశే. (అ.ఆ.అ.)
౧ గ్రహించునట్లు చేయఁబడినది ౨ బహూకరింప
బడినది. ౩ ఆకర్షింపఁబడినది. ౪ అతిశయింపఁ
బడినది.

**హారిద్రము.** సం.విశే. (అ.ఆ.అ.) పసుపు వర్ణము
గలది. వి.అ.పుం. ౧ పసుపు వర్ణము. ౨ కదంబ
వృక్షము. ౩ ఒకవిధమైన జ్వరము. ౪ బంగారము

**హారీతము.** సం.వి.అ.పుం. ఒకవిధమైన పావురము

**హారీతుఁడు.** సం. వి. అ. పుం. ౧ దుష్టుఁడు.
౨ మోసగాఁడు. ౩ ఒకస్మృతికర్త.

**హారుఁడు.** సం.వి.అ.పుం. మోయువాఁడు.

**హారువు.** సం.వి.ఉ.పుం. జూదమునందలి పరిభాష
ఉ. హరి ౩ ఆ.... (శ.ర.)

**హార్దము.** సం.విశే. (అ.ఈ.అ.) హృదయమునకు
సంబంధించినది. వి.అ.న. ౧ ప్రేమ. ౨ దయ.
౩ ఉద్దేశము. ౪ అర్థము.

**హార్ది.** సం.విశే.(న్.ఈ.న్.)మిక్కిలికోరఁబడినది.

**హార్దిక్యము.** సం.వి.అ.న. మైత్రి.

**హార్దిక్యుఁడు.** సం.వి.అ.పుం. కృతవర్మ.

**హార్య.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ గ్రహింపఁదగినది
౨ మోయఁదగినది. ౩ తొలగింపఁదగినది.
౪ కదలింపఁదగినది. ౫ ఆకర్షింపఁదగినది.
౬ ఓడింపఁదగినది. ౭ సంపాదింపఁదగినది.
౮ వశపఱుచుకొనఁబడినది. ౯ నశింపఁజేయఁ
దగినది. ౧౦. మనోజ్ఞమైనది. వి.అ.స్త్రీ. ఒక
విధమైన శ్రీగంధము.

**హార్యము.** సం.వి.అ.పుం. ౧ పాము. ౨ తాండ్ర[?]

**హాల.** సం.వి.అ.స్త్రీ. మద్యము, సారాయి.

**హాలకము.** సం.వి.అ.పుం. గోధుమవన్నె గుఱ్ఱము.

**హాలభృత్తు.** సం.వి.త్.పుం. బలరాముఁడు.

**హాలము.** సం.వి.అ.పుం. ౧ నాఁగలి. ౨ పక్షి విశేషము.

**హాల (లా) హాలము.** సం.వి.అ.పుం.న. ౧ విష భేదము. ౨ నలికండ్లపాము. పుం. బల్లి.

**హాలహాలి (ళి)** సం. వి. ఈ. స్త్రీ. మద్యము, సారాయము.

**హాలి.** సం.వి.ఈ.స్త్రీ. మఱఁదలు, భార్యచెల్లెలు.

**హాలికము.** సం.విణ. (అ.ఆ.అ.) నాఁగలికి సంబంధించినది. వి.అ.పుం. మఱ్ఱిచెట్టు.

**హాలికుఁడు.** సం. వి. అ. పుం. ౧ కర్షకుఁడు. ౨ నాఁగలితోఁ బోరాడువాఁడు.

**హాలిని.** సం.వి.ఈ.స్త్రీ. పెద్దబల్లి.

**హాలుఁడు.** సం.వి.అ.పుం. ౧ బలరాముఁడు. ౨ శాతవాహనవంశపు రాజులలో నొకఁడు.

**హాలువు.** సం.వి.ఉ.పుం. దంతము, పల్లు.

**హాళి.** వి. ౧ ఆసక్తి.

ఉ. హాళి మనంబునం బెరుగ నాలయి బిడ్డయి బంటునై పరై. పాండు. ౫-౧౬౨.

మ. సహకారాళిపదంబుఁ జూడఁగ వయస్యా హాళివాటిల్లెడుక్, సహకారాళి పదంబుఁ జూడఁగ వయస్యా హాళి యాలేఁగదా!
విజ.వి. ౨-౫౩. దశా. ౭-౧౩౭.

౨ సంతోషము.

ఉ. నావిని శంకమిన్ బలుకు నామిఁ డోముప నారి భూరితా, గ్యావహబుద్ధిఁ బోలె భువనాళిని హాళిఁ జరింపు ... పాండు. ౨-౨౧౭

క. హాళింగొనియాడందగు, హేళిఁ బ్రసన్నోదయున్ ద్రయీ మధుపాళీ, కేళీ సంకీలితకం, కేళికుళచ్ఛ స్వరూపపుణ్ణిరింఛోళిన్.
రామా. ౧-౧౬. కు. ౧.౧౭౮.

౩. ఉత్సాహము, పూనిక.

గీ. దర్పకునితోడఁ గూడి చైత్రప్రభుండు, విరహిణీపాంథసందోహవిజయమునకు, హాళి దైవార నపుడు వాహ్యాళి వెడలె.
రసిక. ౨-౭.

మ....ఘటియించెన్ జలకేళి హాళిమెయి రక్షస్స్వామి యక్షీణుఁడై. దశా.౩-౧౭౪.

౪. ప్రేమ, స్నేహము.

గీ. బ్రహ్మరుద్రాది దేవతా ప్రభులమీఁది, హాళియును మాని సంస్కారాధ్యాయభాళి, రాముఁ డయ్యె దశరథరాముఁ డయ్యె.
ఉ.రా.౧-౩౮.

గీ. పూలపాన్పునఁ గొదలేనిహాళి నరిను, కేళినోలాడఁ జేసిన లీలఁ గ్రాల. రసిక.౫.౧౭౨.

౫. పరిహాసము.

లయగ్రాహి....క, య్యాలకొసవెట్టుచును హాళిఁ జలపట్టుచు సుమాళములగిట్టుచును బాలికలు చేసెన్. కళా. ౬-౨౩౧.

**హావకుఁడు.** సం.వి.అ.పుం. ౧ పిలుచువాఁడు. ౨ వధువు నాహ్వానించువాఁడు.

**హావము.** సం.వి.అ.పుం. ౧ పిలుపు. ౨ భ్రూనేత్రాది వికారములచేతఁ గొంచెము తెలియఁదగిన మనోవికారము.

శ్లో. గ్రీవారేచక సంయుక్తో భ్రూనేత్రాది వికాసకృత్, భావా దీషత్ప్రకాశో యః స హావ ఇతి కథ్యతే. (ఉజ్జ్వలమణి.)

**హావళి (డి) = ఆవళి (డి).** (బ. హావడులు, హావళులు, హావళ్లు.) ఉపద్రవము.

క. దేవా క్రమక్రమంబునఁ, బావనులై సృష్టిఁ గలుగు ప్రజలీ కరణిం, గైవల్యంబున కేఁగను, హావళిచే మాకు నడవ వధికారంబుల్.
వరాహ. ౧౦-౧౭.

ఉ .. అగ్రామణిఁ బంటచేల డిగి హావళి సేయు మహామహీజముల్, భీమనిశాత దంష్ట్రికల బిట్టిగలించుచు సేకలంబులు....
చంద్ర. ౨-౮.

శా....వర్షంపునెవ్వన్ దజన్, హావళ్లన్ దిగు నన్య భూప్రజలరా జాయాయి జాత్యోచితిన్ బ్రోవంగాఁదగు.... ఆము.౪-౨౪౫.

**హాసకుడు.** సం.వి.అ.పుం. హాస్యకారుఁడు, నవ్వు కలిగించువాఁడు.

**హాసనము.** సం. విశే. (అ. ఈ. అ.) నవ్వు పుట్టించునది.

**హాసనికుఁడు.** సం.వి.అ.పుం. బాల్యమిత్రుఁడు.

**హాసమార్గము.** సం.వి.అ.పుం. ౧ ఎగతాళి. ౨ పరిహాసము.

**హాసము.** సం.వి.అ.పుం. ౧ నవ్వు. ౨ ఆనందము 3 హాస్యరసస్థాయిభావము. ౪ పరిహాసము. ౫ వికసించుట. ౬ గర్వము.

**హాసనుఁడు.** సం.వి.న్.పుం. చంద్రుఁడు.

**హాసావళి.** సం.వి.ఇ.స్త్రీ. వస్త్ర విశేషము. ప్రబంధ. ౬౦౫.

**హాసించు.** సం.అ.క్రి. నవ్వు. చంద్రా. ౧. ఆ. (శ.ర.)

**హాసిక.** సం.వి.ఆ.స్త్రీ. ౧ నవ్వు. ౨ సంతోషము.

**హాస్తికము.** సం.వి.అ.న. ఏనుఁగుల సమూహము

**హాస్తికుఁడు.** సం.వి.అ.పుం. మావటివాఁడు.

**హాస్తినము.** సం. విశే. (అ.ఆ.అ.) ఏనుఁగు మునుగునంతలోఁతు గలది. వి.అ.న. హాస్తినాపురము.

**హాస్యము.** సం.విశే. (అ.ఆ.అ.) నవ్వఁదగినది. వి.అ.పుం. నవరసములలో నొకటి. న. ౧ నవ్వు ౨ సంతోషము. 3 వేళాకోళము. ౪ ఆక్షేపము

**హాహ (హా) లము.** సం.వి.అ.న. ఉగ్రవిషము

**హాహవము.** సం.వి.అ.పుం. నరక విశేషము.

**హాహానుఁడు.** సం.వి.న్.పుం. ఒక గంధర్వుఁడు.

**హాహా.** సం. అవ్య. సంతాపార్థకము.

శా. హా హా పుట్టెడు లాతిచూపఱకు నాహా పుట్టు మీవారికిన్. భారి.శల్య. ౨-౨౪౭

**హాహాకారము.** సం.వి.అ.పుం. ౧ దుఃఖము. ౨ బిగ్గరగా శోకించుట. 3 రణధ్వని.

**హాహాహుఁడు.** సం.వి.అ.పుం. ఒక గంధర్వుఁడు.

**హాహాహూలు.** వి.బ. హాహూ అనుమాటలు, ఆడంబరములు.

క. ఓహో భూవర వలవని, హాహూలివి యేల విక్రమార్కుని సరిగా,సాహసమును గంభీరోత్సాహంబును లేక యొక్కఁడరమే నీకున్. ద్వా. ౨-౬౯.

## హి

**హింకారము.** సం.వి.అ.పుం. ౧ పులి. ౨ ఒకవిధమైన చిన్నధ్వని.

**హింగుది.** సం.వి.ఈ.స్త్రీ.=ఇంగుది.

**హింగు నిర్యాసము.** సం.వి.అ.పుం. ౧ ఇంగువ రసము. ౨ వేఁపచెట్టు.

**హింగుపత్రము.** సం.వి.అ.పుం. గారచెట్టు.

**హింగులిక.** సం.వి.ఆ.స్త్రీ. ఒకజాతి ముండ్లచెట్టు

**హింగులువు.** సం.వి.ఉ.పుం.న. హింగుళము.

**హింగుళము.** సం.వి.అ.పుం.న. రాగద్రవ్య విశేషము, ఇంగిలీకము.

**హింగుళి.** సం. వి. ఈ. స్త్రీ. ౧ మునగచెట్టు. ౨ హింగుళము.

**హింగువు.** సం.వి.ఉ.న. ౧ ఇంగువ, ౨ ఇంగువచెట్టు. 3 వేఁపచెట్టు.

**హింగూజ్జ్వల.** సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన సుగంధ ద్రవ్యము.

**హింగూలము.** సం.వి.అ.పుం. ఒకానొక దుంప.

**హింజీరము.** సం.వి.అ.పుం. ఏనుఁగు కాలికిఁగట్టు గొలుసు.

**హిండనము.** సం.వి.అ.న. ౧ వ్యాప్తి. ౨ భ్రమణము. 3 సురతము. ౪ వ్రాయుట.

**హిండి.** సం.వి.ఈ.స్త్రీ. దుర్గాదేవి.

**హిండికుఁడు.** సం.వి.అ.పుం. ౧ జ్యోతిషికుఁడు. ౨ కాముకుఁడు.

**హిండితము.** సం.విశే. (అ.ఆ.అ.) వ్యాపించినది

**హిండి (డీ) రము.** సం.వి.అ.పుం. ౧ ఒకజాతి వేఁప యొముక. ౨ మునగచెట్టు. 3 బలకరౌషధము. న. దానిమ్మ i.

**హిండీరుఁడు.** సం.వి.అ.పుం. మగవాఁడు.

**హిండుకుఁడు.** సం.వి.అ.పుం. శివుఁడు.

**హింతాలము.** సం.వి.అ.పుం. గిరకతాడి ¡

**హిందువు.** సం.వి.ఉ.పుం. భారత వర్షీయుఁడు, భారతీయుఁడు.

**హిందోల.** సం.వి.ఆ.స్త్రీ. ఎనిమిది పురుష రాగములలో నొకటి.

సీ. భైరవి మాళవి బంగాళ హిందోల....ఎన్మిది పురుష రాగంబులు. హంస. ౪-౧౨౩.

**హిందోలకము.** సం. వి. అ. పుం. ఉయ్యాల, ఉయ్యాలతొట్టి.

**హిందోలము.** సం.వి.అ.పుం. ౧ ఎనిమిది పురుష రాగములలో నొకటి. ౨ ఉయ్యాల.

**హింస.** సం.వి.ఆ.స్త్రీ. ౧ పీడ. ౨ మోసము. ౩ చంపుట, ౪ దొంగతనము.

**హింసకము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ బాధించునది. ౨ ఉపద్రవకరమైనది. ౩ క్రూరమైనది. వి.అ.పుం. ౧ వన్యమృగము. ౨ క్రూరజంతువు.

**హింసకుఁడు.** సం.వి.అ.పుం. ౧ హింసించువాఁడు ౨ శత్రువు. ౩ అథర్వవేదమున నిష్ణాతుఁడైన బ్రాహ్మణుడు.

**హింసన.** సం.వి.ఆ.స్త్రీ. ౧ కొట్టుట. ౨ చంపుట

**హింసనము.** సం.వి.అ.న.=హింసన.

**హింసనీయము.** సం.విశే. (అ.ఆ.అ.) చంపఁదగినది.

**హింసాకర్మము.** సం.వి.న్.న. ౧ బాధాకరమైన పని. ౨ అభిచారక్రియ.

**హింసారువు.** సం.వి.ఉ.పుం. పెద్దపులి. ౨ క్రూరమృగము.

**హింసాలువు.** సం.విశే. (ఉ.ఊ.ఉ.) ౧ బాధాకరమైనది. ౨ చంపునది. వి.ఉ.పుం. అడవికుక్క

**హింసించు.** సం.స.క్రి. ౧ చంపు, వధించు.

క. పాపాత్ములైన రక్కసు, లేపున వచ్చెదరు వారి హింసింపుము రవ్విప్ర పుణ్యాశ్రమము నకును ... భా.రా.బా. ౭౩.

౨ బాధించు. ౩ కొట్టు.

**హింసితము.** సం.విశే. (అ.ఆ.అ.) బాధింపఁబడినది. వి.అ.న. ౧ హాని. ౨ బాధ.

**హింసీనము.** సం.వి.అ.పుం. ౧ వన్యమృగము. ౨ క్రూరమృగము.

**హింసీరము.** సం.వి.అ.పుం. ౧ పులి. ౨ పక్షి.

**హింసీరుఁడు.** సం.వి అ.పుం. మోసగాఁడు.

**హింస్యము.** సం.విశే. (అ.ఆ.అ.) చంపఁదగినది.

**హింస్ర.** సం.వి.ఆ.స్త్రీ. ౧ నాడి. ౨ జటామాంసి ¡ ౩ నల్లయుశ్శి ¡. ౪ గంజాయి ¡. ౫ అడవి గోధుమ. ౬ క్రొవ్వు.

**హింస్రకము.** సం.వి.అ.పుం. క్రూరమృగము.

**హింస్రము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ హానికరమైనది. ౨ హింసించునది. ౩ భయంకరమైనది. వి.అ.పుం. క్రూరమృగము, న. క్రూరత్వము.

**హింస్రుఁడు.** సం.వి.అ.పుం. ౧ శివుఁడు. ౨ భీముఁడు. ౩ జీవహింసాప్రియుఁడు.

**హిక్కా.** సం.వి.ఆ.స్త్రీ. ౧ ఎక్కిలి ౨ పైఁడికంటి యను పక్షి. ౩ గుడ్లగూబ. ౪ అస్పష్టమైనధ్వని.

**హిక్కిక.** సం.వి.ఆ.స్త్రీ. ఎక్కిలి.

**హిక్కితము.** సం.వి.అ.న. ఎక్కిలి.

**హిజారు.** (హిం.హిజార్.) వి. ౧ పురుషులు తొడుగుకొను లాఁగు; చల్లడము.

సీ. మొలి పెట్టి చుట్టిన తెలిపరంగిముడాసుపైల పేటాదట్టి పనులఁజెలఁగు, బంగరు వ్రాతల పట్టు హిజారు కంబరు.... శుక. ౨-౪౨౩.

౨ నర్తకి ధరించు సగముతొడ వఱకు నుండెడు చట్టలాఁగు, అర్ధోరుకము. (కాలికిఁదొడిగికొను అని శ.ర.)

సీ. బటువు గద్దియలపై బట్టుగద్దెరీతి జఘన దేశముల హిజారు లమర. శుప.౧-౧౭౭.

చ. తొలఁకెడు తత్తరంబునఁగలోఁ దొడనిగ్గు
హిజారుమీఁద మొ, ట్రిలు వడినొంటి కట్టున
ఘటించిన చీర.... శుక. ౩-౧౬.

**హిజరీ**, హిం.వి. మహమ్మదీయ శకము. (శ.ర.)

**హిజ్జలము.** సం.వి.అ.పుం. ఎఱ్ఱగన్నేరు. i.

**హిత**, సం.వి.ఆ.స్త్రీ. ౧ ప్రవాహమును కట్టముగా చేయు దారి. ౨ నదుల సమూహము.

**హితకము.** సం.వి.అ.పుం. బాలకము.

**హితకుఁడు**, సం.వి.అ.పుం. బాలకుఁడు.

**హితపథ్యము**, సం.విశే. (అ.ఆ.అ.) ౧ ఉపయోగించునది. ౨ ప్రియమైనది.

**హితప్రణి**, సం.వి.ఈ.పుం. గూఢచారుఁడు.

**హితము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ ఉంచఁబడినది ౨ పంపఁబడినది. ౩ గ్రహింపఁబడినది. ౪ తగినది. ౫ ఉపయోగకరమైనది. ౬ ప్రియమైనది. ౭ శుభమైనది. వి.అ.న. ౧ లాభము. ౨ మేలు. ౩ సంక్షేమము.

**హితవరి**=ఇతవరి. విశే. (హితవు+అరి) మేలు చేయువాఁడు; మేలు చేయునది.

చ హితవరి మాటలాడి తుదినెగ్గొనరింపనె కాచి
యున్న యీ, కితవపువృద్ధభల్లుకము కృత్రిమ
మైత్రి నిజంబుగాఁదలంచి ...విక్ర.౩-౯౬.

క. హితవరియై వెరవరియై, మతిమంతుఁడనంగఁ
దనరి మంత్రి విధాన, ప్రతిభాన్వితుఁడగు
నిత్యో, చితవితరణశాలి మంత్రిఁజేయఁగ
వలయున్. చిత్రభా. ౫-౫౩.

క. పతిసతిఁ దీఱదు తమి పర, పతి రతియేకీతి
దొరకు భావంబున సం, గతమగు నీచెత
దీర్చెడి, హితవరు లెవరిని తలంచి రంతయు
వంతన్. హంస. ౫-౨౭౦.

**హితవు**=ఇతవు. విశే. (సం.హితమ్.) మేలు కలిగించునది.

వ్యవ. నామాటలు వానికి హితవుగాఁదోఁచలేదు

వి. ౧ సఖ్యము, చెలిమి.

ఆ. హితవు మఱచురాజు కొంచు నమ్మికకుఁబో,
త్రిములె సమదమములు క్రౌర్యరతులు.
భార. శాంతి. ౩-౨౪౭.

సీ. తనవిత్తహానిఁగోర్చనఁబూఁటపడవలె హిత
వున్నచోట నస్పృయఁదగదు. రామలిం ౪౯.

౨ ఇష్టము, ప్రీతి.

వ్యవ. వానికి అన్నముమీఁద హితవులేదు.

౩ మేలుకలిగించుమాట.

వ్యవ. నేను హితవు చెప్పితిని. నీవు పెడచెవిని
బెట్టితివి. నేనేమి చేయుదును.

**హితవుపడు.** అ.క్రి. (హితవు+పడు) ఇష్టపడు, ఆసపడు.

క. [illegible] దృష్టిఁ బొందక, మతిఁజపలతపుట్టి
యున్యమానవు [illegible], హితవుపడి మోహద
శలన్, బతిఁగూడి కృశించుజాన భాస్వతి యొప్ప
దున్. హంస. ౨-౧౪౭.

**హితాశంస.** సం.వి.ఆ.స్త్రీ. అభినందనము.

**హితుఁడు.** సం. వి. అ. పుం. ౧. మిత్రుఁడు. ౨. ఆప్తుఁడు.

**హిబుకము.** సం. వి. అ. న. పాతాళలోకము.

**హిమ**, సం.వి.ఆ.స్త్రీ. ౧ శీతకాలము. ౨ చిన్న యేలకికాయ. ౩ ఒకవిధమైన గడ్డి. ౪ రేణుక యను సుగంధద్రవ్యము.

**హిమకము.** సం. వి. అ. పుం. విటంకవృక్షము, పుల్లవెలగ i.

**హిమకరము.** సం. వి. అ. పుం. కర్పూరము.

**హిమకరుఁడు**, సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**హిమకూటము.** సం.వి.అ.పుం. ౧ శీతకాలము ౨ హిమవత్పర్వతము.

**హిమఖండము**, సం.వి.అ.న. వడగల్లు.

**హిమగిరి.** సం. వి. ఇ. పుం. మంచుకొండ, హిమాలయ పర్వతము.

**హిమగువు**, సం.వి.ఉ.పుం. చంద్రుఁడు.

**హిమజ**, సం.వి.ఆ.స్త్రీ.౧ పార్వతి. ౨ శచీదేవి.

**హిమజాఁడు.** సం. వి. అ. పుం. మైనాకగిరి.

**హిమఝుటి.** సం. వి. ఇ. పుం. పొగమంచు.

**హిమతైలము.** సం. వి. అ. న. ఒకవిధమైన కర్పూరతైలము.

**హిమదీధితి.** సం.వి.ఇ.పుం. చంద్రుఁడు. (ఇట్లే హిమద్యుతి, హిమధాముఁడు మొ॥)

**హిమదుర్దినము.** సం.వి.అ.న. మిక్కిలి చల్లని వాతావరణము.

**హిమద్రుట్టు.** సం. వి. హ. పుం. సూర్యుఁడు.

**హిమద్రుమము.** సం.వి.అ.పుం. నింబవృక్షము.

**హిమధాతువు.** సం. వి. ఉ. పుం. హిమాలయ పర్వతము.

**హిమపాతము.** సం.వి.అ.పుం. ౧ చలితోఁ గూడిన వాన. ౨ మంచుపాటు.

**హిమప్రస్థము.** సం. వి. అ. పుం. హిమాలయ పర్వతము.

**హిమము.** సం. విశే. (అ. ఆ. అ.) చల్లనిది. వి.అ.పుం. ౧ శీతకాలము. ౨ హిమాలయము. ౩. చందనవృక్షము. ౪. కర్పూరము. న. ౧. మంచు. ౨. చల్లఁదనము. ౩. నవనీతము. ౪. ముత్యము. ౫. రాత్రి. ౬. చందనకాష్ఠము.

**హిమవంతము.** సం.విశే.(త్.తీ.త్.) మంచుతోఁ గూడినది. వి.త్.పుం. హిమాలయపర్వతము.

**హిమవత్పురము.** సం.వి.అ.న. ఓషధిప్రస్థపురము, హిమవద్రాజధాని.

**హిమవలము.** సం.వి.అ.న. ముత్యము.

**హిమశర్కర.** సం.వి.ఆ.స్త్రీ. యవనాళముచేఁ జేయఁబడు నొకవిధమైన చక్కెర.

**హిమశ్రథుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**హిమసంహతి.** సం. వి. ఇ. స్త్రీ. మంచురాశి.

**హిమసరస్సు.** సం. వి. స. న. ౧ మంచుకొలను. ౨ చల్లని నీరు.

**హిమస్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. మంచుజడివాన.

**హిమహాసకము.** సం. వి. అ. పుం. బురదనేల మొలచు ఖర్జూరవృక్షము.

**హిమాంకము.** సం.వి.అ.పుం. కర్పూరము.

**హిమాంబువు.** సం.వి.ఉ.న. ౧ మంచునీరు. ౨ పన్నీరు.

**హిమాంశువు.** సం.వి.ఉ.పుం. ౧ చంద్రుఁడు. ౨ కర్పూరము.

**హిమాంశ్వభిఖ్యము,** సం.వి.అ.న. వెండి.

**హిమాగమము.** సం.వి.అ.పుం. శీతకాలము.

**హిమానద్ధము.** సం.విశే. (అ.ఆ.అ.) చలిచే గడ్డ కట్టినది.

**హిమాని.** సం.వి.ఈ.స్త్రీ. హిమసమూహము.

**హిమాపహుఁడు.** సం.వి.అ.పుం. అగ్ని.

**హిమాబ్జము.** సం.వి.అ.న. కలువ.

**హిమాభ్రము.** సం.వి.అ.పుం. కర్పూరము,

**హిమారాతి.** సం.వి.ఇ.పుం. ౧ అగ్ని ౨ సూర్యుడు

**హిమాలయము.** సం.వి.అ.పుం. ౧ హిమవత్పర్వతము. ౨ ధవళఖదిర వృక్షము.

**హిమావతి.** సం.వి.ఈ.స్త్రీ. రెడ్డివారి నానఁబ్రాలు i (శ.ర.)

**హిమాహ్వ(య)ము.** సం.వి.అ.న. పద్మము పుం. కర్పూరము.

**హిమిక.** సం.వి.ఆ.స్త్రీ. మంచు, తుషారము, (గడ్డి మున్నగువానిపైఁబడిన మంచు.)

**హిమితము.** సం.విశే. (అ.ఆ.అ.) మంచుగా మారినది.

**హిముఁడు.** సం.వి.అ.పుం. చంద్రుఁడు.

**హిమేలువు.** సం.విశే. (ఉ.ఉ.ఉ.) శీతపీడితము చలిచే గడ్డకట్టినది.

**హిమోత్తర.** సం. వి. ఆ. స్త్రీ. గోదుమవన్నె గల ద్రాక్ష.

**హిమోత్పన్న.** సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన చక్కెర.

**హిమ్నుఁడు.** సం.వి.అ.పుం. బుధుఁడు.

**హిమ్యము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ మంచుతోఁ గూడినది. ౨ చల్లనిది.

**హిరంగువు (డు).** సం.వి.ఉ.పుం. రాహువు.

**హిరణము.** సం.వి.అ.న. ౧ బంగారము. ౨ రేతస్సు. 3 గవ్వ.

**హిరణ్మయము.** సం.విణ. (అ.ఈ.అ.) స్వర్ణవికారమైనది. వి.అ.న. ప్రపంచమందలి నవఖండములలో నొకటి.

**హిరణ్మయుఁడు.** సం వి.అ.పుం. బ్రహ్మ.

**హిరణ్య.** సం.వి.ఆ. స్త్రీ. అగ్నిదేవుని సప్తజిహ్వలలో నొకటి.

**హిరణ్యకక్షము.** సం.విణ. (అ.ఆ.అ.) బంగారు మొలనూలు ధరించినది.

**హిరణ్యకము.** సం.వి.అ.పుం. సువర్ణతృష్ణ.

**హిరణ్యకవచుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) బంగారుమైమఱువు గలవాఁడు. వి. అ. పుం. శివుఁడు.

**హిరణ్యకశిపుఁడు.** సం.వి.ఉ.పుం. ఒక రాక్షసుఁడు, ప్రహ్లాదునితండ్రి.

**హిరణ్యకేశి.** సం.వి.ఈ.స్త్రీ. యజుర్వేదశాఖలలో నొకటి.

**హిరణ్యకోశము.** సం.వి.అ.పుం. వెండి బంగారములు.

**హిరణ్యగర్భుఁడు.** సం.వి.అ.పుం. ౧ బ్రహ్మ. ౨ విష్ణువు. 3 సూక్ష్మ శరీరమందలి యాత్మ.

**హిరణ్యద.** సం.వి.ఆ.స్త్రీ. భూమి.

**హిరణ్యదుఁడు.** సం.వి.అ.పుం. సముద్రుఁడు.

**హిరణ్యనాభము.** సం.వి.అ.పుం. తూర్పు, పడమర, దక్షిణ దిక్కులందు చావడులుగల భవంతి ౨ మైనాక పర్వతము.

**హిరణ్యనాభుఁడు.** సం.వి.అ.పుం. ౧ మైనాకుఁడు. ౨ విష్ణువు.

**హిరణ్యబాహువు.** సం.వి.ఉ.పుం. ౧ శివుఁడు ౨ శోణనదము.

**హిరణ్యబిందువు.** సం.వి.ఉ.పుం. అగ్ని.

**హిరణ్యము.** సం.వి.అ.న. ౧ బంగారము. ౨ బంగారుపాత్రము 3 వెండి. ౪ విలువగల లోహము ౫ సంపద, ఆస్తి. ౬ రేతస్సు. ౭ గవ్వ. ౮ ధుత్తూరము, ౯ వ్యాత్తి ! ౧౦ మాద.

**హిరణ్యయము.** సం.విణ. (అ.ఈ.అ.)=హిరణ్మయము.

**హిరణ్యరేత (స) ము.** సం.వి.స.పుం. ౧ చిత్రకము !. ౨ జిల్లేడు !.

**హిరణ్యరేతసుఁడు(తుఁడు.)** సం. వి. స. పుం. ౧ అగ్ని. ౨ సూర్యుఁడు. 3 శివుఁడు.

**హిరణ్యవము.** సం.వి.అ.పుం.౧ దివిజధనకోశము ౨ బంగారు నగ.

**హిరణ్యవర్ణ.** సం.వి.ఆ.స్త్రీ. నది.

**హిరణ్యవాహము.** సం.వి.అ.పుం. శోణనదము.

**హిరణ్యవాహుఁడు.** సం.వి.అ.పుం. శివుఁడు.

**హిరణ్యాక్షుఁడు.** సం.వి.అ.పుం.ఒకరాక్షసుఁడు, హిరణ్యకశిపుని సోదరుఁడు.

**హిరణ్యోని.** సం.వి.ఈ.స్త్రీ. బంగారు గని.

**హిరాకి.** (హిం. హిరాకీ.) గుఱ్ఱము.

గీ. చౌపుటములు, రహిగ నటియించు చిలుక
హిరాకి నెక్కి, మదనుపాదుసహా దండు
గదలెనపుడు. అని. 3-౧౬.

**హిలమోచి (క).** సం. వి. ఇ. పుం. ఆ. స్త్రీ. ౧ చిలుక కూర. ౨ పొన్నగంటికూర.

**హిలిహిలము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ ఉల్లాసము గలది. ౨ వినోదించునది.

**హిల్లము.** సం.వి.అ.పుం. జలపక్షి విశేషము.

**హిల్లోలము**, సం.వి.అ.పుం. ౧ తరఁగ. ౨ హిందోళము. ౩ చిత్తచాపల్యము. ౪ రతిబంధ విశేషము.

**హిల్వలలు**, సం.వి.ఆ.స్త్రీ.బ.=ఇల్వలలు.

**హిహాకము**, సం.వి.అ.పుం. దేహమును ముడుచుకొన్న పిల్లి.

**హిహీ**, అవ్య. ఇహీ, హిహిహీ లయొక్క రూపాంతరము. (శ.ర.)

## హీ

**హీ**, సం.అవ్య. ఆశ్చర్య విషాద భ్రాంతులను దెలుపును.

**హీంతాలము**, సం. వి. అ. పుం. ఒకవిధమైన ఖర్జూరపుఁజెట్టు.

**హీన**, సం.వి.ఆ.స్త్రీ. ఆఁడుచుంచు.

**హీనకము**, సం. విశే. (అ.ఆ.అ.) రహితము, హీనము.

**హీనకర్ముఁడు**, సం.వి.న్.పుం. సాంప్రదాయిక మత విధుల నుపేక్షించువాఁడు. స్త్రీ. హీనవిధి. న. హీనకర్మము.

**హీనజాతి**, సం.విశే. (ఇ.ఇ.ఇ.) ౧ నీచజాతికిఁ జెందినది. ౨ వెలివేయబడినది.

**హీనపక్షము**, సం.విశే. (అ.ఆ.అ.) అరక్షితము.

**హీనము**, సం.విశే. (అ.ఆ.అ.) ౧ విడువఁబడినది ౨ రహితము. ౩ శిథిలమైనది. ౪ తక్కువయైనది. ౫ నింద్యము. ౬ దోషయుతము. ౭ అల్పము.

క. హీనప్రజ్ఞుఁ డకార్యము, లైనవి సేసితుది వగచు.... భార. శాం. ౩-౩౫౨.

౮ నీచము. ౯ చనుపనుండి తప్పిపోయినది. వి. అ.పుం. వ్యవకలనము. న. లోపము.

**హీనయానము**, సం.వి.అ.న. బౌద్ధమతశాఖ.

**హీనవర్ణము**, సం.విశే. (అ.ఆ.అ.) తక్కువ కులమునకుఁజెందినది.

**హీనవాది**, సం.విశే. (న్.నీ.న్.) హీనభూయిష్ఠమైన వాదము చేయువాఁడు. ౨ నిరుత్తరుఁడు. ౩ న్యాయస్థానమున నోడినవాఁడు.

**హీనసంధి**, సం.వి.ఇ.పుం. అల్పుఁడైనరాజుచేఁ జేయఁబడిన పొందు.

**హీనాంగి**, సం.వి.ఈ.స్త్రీ. చిన్నచీమ.

**హీనితము**, సం.విశే. (అ.ఆ.అ.) ౧ తొలఁగింపబడినది. ౨ వేఱుచేయఁబడినది. ౩ తీసివేయఁబడినది.

**హీనుఁడు**, సం.వి.అ.పుం. ౧ దోషయుక్తుఁడైన సాక్షి. ౨ దోషసహితుఁడైన ప్రతివాది. (అన్యవాది, క్రియాద్వేషి, అనుపస్థాయి, నిరుత్తరుఁడు ఆహూతప్రపలాయి, అనిహీనులైదు విధములు

**హీర**, సం.వి.ఆ.స్త్రీ. ౧ లక్ష్మి. ౨ చీమ.

**హీరకము**, సం.వి.అ.పుం. ౧ వజ్రము. ౨ వజ్రాయుధము. ౩ ఒక వృత్తము.

**హీరము**, సం.వి.అ.పుం. ౧ పాము. ౨ కంఠహారము. ౩ సింహము. న. ౧ వజ్రము. ౨ పిడుగు

**హీరపాఠిణి**, సం.వి.ఇ.పుం. రెండుతలలపాము.

**హీరాంగము**, సం.వి.అ.పుం. ఇంద్రాయుధము.

**హీరుఁడు**, సం.వి.అ.పుం. ౧ శ్రీహర్షునితండ్రి. ౨ శివుఁడు.

**హీలన**, సం.వి.ఆ.స్త్రీ. ౧ గాయము. ౨ హాని

**హీలము**, సం.వి.అ.న. రేతస్సు.

**హీలుకము**, సం.వి.అ.న. ఒకవిధమైన సారాయి

**హీహీ**, సం. అవ్య. సంతోషాదులను దెల్పునది.

## హు

**హుఁ**, సం.అవ్య. స్మరణ సందేహాంగీకార క్రోధ నిందా ద్వేషప్రశ్నాదులను సూచించును.

**హుంకరించు**, సం.అ.క్రి. హుం అనిధ్వనిచేయు.

ఉ. అమ్మనుజాళి సొమ్మసిలి యమ్మెయిఁగ్రమ్మఱ జేరి హామికన్, హుమ్మని హుంకరించి తగు నోరి వనాటుఁడ.... షమీర.౧-౧౮౦.

**హుంకారము.** సం.వి.అ.పుం. ౧ హుమ్మని ధ్వనించుట. ౨ అడవిపందియొక్క ఘుర్ఘురము. 3 ధనుష్టంకారము.

**హుంకారించు.** సం.అ.క్రి. హుంకారముచేయు.

శా. సం,ఖ్యాతీతంబగు సేనతో నడచి హుంకారింపుచున్ లగ్గకున్. రంగా.3-౭౮.

**హుంకించు**=హుంకరించు. అ.క్రి. హుమ్మని ధ్వని చేయు.

సీ. కస్తురీఁగళ ద్రోఁచ గదలఁజేతులఁబూని హుంకింపఁగా వీథి నుండువారు ... సైత్య భటులు, మల్లుపు. ౨-౪.

**హుంకృతము.** సం.వి.అ.న. ౧ మంత్రోచ్చారణము. ౨ అడవిపందియొక్క ఘుర్ఘురము. 3 మేఘ గర్జనము.

**హుంకృతి.** సం.వి.ఇ.స్త్రీ. హుంకారము.

**హుండనము.** సం.వి.అ.న. మొద్దువాఱుట.

**హుండము.** సం.వి.అ.పుం. ౧ పులి. ౨ పొట్టేలు 3 ఊరఁబంది.

**హుండి.** సం.వి.ఇ.న.స్త్రీ. బియ్యపురాశి.

**హుండిక.** సం.వి.అ.స్త్రీ. ౧ మారకపుహుండి. ౨ సైనికుల పోషణమునకై చేయఁబడు నేర్పాటు

**హుండ్రిక్కు.** వి. డీకొలుపుటయందగు ధ్వని కనుకరణము.

ద్వి. రిక్కలువెట్టి హుండ్రిక్కరటంచు, డీకొల్పి వికవికఁదగడు వల్లియలు, చేకొని వారింపఁ జేరు గోపికలు.
అ.మ.క. ౨-౧౨౪ పా. ౧౦. పం.

**హుండీ.** హిం. వి. ౧ సొమ్మిచ్చుటకాజ్ఞాపత్రిక. (శ.ర.) ౨ మ్రొక్కుబళ్లకైన ధనాదులనువేయు పాత్ర విశేషము.

వ్యవ. ఈరూకను హుండీలోవేయుము.

**హుండుఁడు.** సం.వి.అ.పుం. ౧ రాక్షసుఁడు. ౨ మూర్ఖుఁడు.

**హుకుము.** వి. (హిం.హుకుమ్.) ఉత్తరువు, ఆజ్ఞ.

గీ. మీరు సరకారు తా జమీన్దారుఁడరయ,నెవరి స్వత్వంబు తనస్వత్వమెఱిఁగికొనక, హుకుము చొప్పన నడవక వికటమతిని, దిరుగఁబడి యుంట పరసంపుఁదెఱఁగె యనిరి.
రంగా. ౨-౨౫౮.

**హుజురు**=హుజూరు. వి. సన్నిధి, సమ్ముఖము.

సీ. పెంపుమీఱు వసంతపేషువా హుజూరున నుండి చెలామణి హౌనరు దెలుప. గీ.... మదను పాదుసహా దండు గదలెనపుడు.
అని. 3-౧౯.

గీ. హుజూరు కొలువులు గలిగె సొంపొలుకు తేట, నీటికొలఁకులలోబెండునిండు వగలఁ,దెప్పలై బొండుమల్లెల చొప్పరములు, నెరయఁజేసిన వారికి దొరలచేత. కువల. ౧-౯౫.

**హుజూరు**=హుజూరు. వి. (హిం.హుజూర్.) సమ్ముఖము, సన్నిధి.

క. వచ్చినమంత్రుల నృపతివి,యచ్చర నాయకు ననుజ్ఞనవసర సచివుల్, చెచ్చెర హుజూరు నకుఁ బిల,వచ్చిన డిగ్గన నరుగు వడి డిగ్గి తగన్. రావి. ౫-3౨.

**హుటాహుటి.** వి. గమన వేగము.

క. కుటిలాలక చూడుము వి,స్ఫుటమంజరిడాపె భృంగముల చాలు నిశా, విటబింబముఁబట్ట హుటా, హుటి వచ్చువిధంబుదునకు నుపమానంబై. వరాహ. 3-౭౩.

పంచచామరము. హుటాహుటిన్ హలాయుధుండదహోమహోగ్రుఁడై తనం, తటందటాన నిప్పుడీ విధంబెఱింగి వచ్చెనో, ఘటాఘటీల నెల్లఁద్రోవఁగట్టి పట్టఁబంచెనో, యటో యిటో యిటో భటోద్భటార్భటుల్ ఘటిల్లెడున్. విజ.వి. 3-౧౪౨.

లయగ్రాహి. పేరములు వాఱుచు సవిరాయణి హుటాహుటిని, గేరడము లాడుచు మహారయముతో న,య్యారె యనమీఱి.....
సారంగ. ౧-౧౨౧.

వి. అతిత్వరితము.

క. భువినంత దవ్వు నేమును, తవశవ లేకరుగు దుము హుటాహుటినడలన్.

మనుచ. ౧-౪౮.

**హుడము.** సం.వి.అ.పుం. ౧ పొట్టేలు. ౨ భూమిలోఁబాతిన వాడిగల యినుపకొయ్యలు. 3 కోటబురుజు. ౪ దుద్దుకఱ్ఱ.

**హుడుక్క.** సం.వి.ఆ.స్త్రీ. వాద్య విశేషము, బుడుబుడుక్క.

ఉ. వల్లకి చక్కకాహళము వంశము ఢక్క హుడుక్క ఝర్ఝరుల్, ఝల్లరి యాదిగాఁ గలుగు శబ్దపరంపరతాళశబ్దమై, యుల్లసిలన్ ........ కాశీ. ౧-౫౮.

**హుడుక్కము.** సం.వి.అ.పుం. ఉడుక, వాద్య విశేషము. (శ.ర.)

**హుతువు.** సం.వి.ఉ.పుం. మగగొఱ్ఱె.

**హుతభుక్కు.** సం.వి.క్.పుం. అగ్నిహోత్రుఁడు. (ఇట్లే హుతాశనుఁడు మొ.)

**హుతవహుఁడు.** సం.వి.అ.పుం. అగ్నిహోత్రుడు

**హుమా**=హుమాయి. వి. గుఱ్ఱము.

క. జక్కులదొర చెలికానికిఁ, గొక్కహుమా జోదునయ్యకుం జొక్కపురేఁ, జుక్కల చెలిని వేలుపు, జక్కరనాదలను దాల్చు జగ వేల్పునకున్. అచ్చ.రా.బాల. ౨౧.

చ. పులుఁగుహుమా వజీరునకుఁబుట్టిన గిట్టవు ... నీలా. 3-౧౭.

**హుమాయి (యూ).**=హుమా. వి. ౧ గుఱ్ఱము

గీ. చిలువదిండి హుమాయిపై మెలఁగువాఁడు. లీలఁ బెనుపాముపైఁ బవ్వళించువాఁడు, నీ మనోరథమీడేర్చునిక్కముగను....

ఉ.రా. ౫-౧౯౧.

చ. ఉడిగపువారు....వెం,బడిఁబలుమాఱు నెచ్చరిక పల్కుచుఁ గుల్కుచు రాహుమాయిత, త్తడి దుమికించుచుం జవనతండు వయాళి హయాళిగొల్వఁగన్. చంద్ర. ౧-౧౧౦.

౨ వాహనము.

మ. ఎలమిన్ బంగరుటెక్క పక్కర హుమాయీ తేజి దాటించుచున్, నలుమోమయ్య హుటాహుటిం గదలె ... దశా. ౨-౬౨.

**హుమారము.** వి. సవారి.

సీ. జాబిల్లి చిన్నంపుబాబా హుమారంపు సర దారుని యుదార తరజవంబు.

అచలా. ౧-౨౦.

**హురుట్టకము.** వి. ఏనుఁగులకుపయోగించు నొక విధమైన గడియ, లేక కొక్కము.

**హు(ర్మ) రుమత్తు.** విణ. ౧ పెద్దది.

గీ. ఆశ్రమంబున మునివరులాడుకొనఁగ, సంధ్యలని జపములని బల్ సవనములని, నియమనిష్ఠల నందుపై శేర్చుకొనిరియు, సరియె హురుమత్తు వేళలఁజక్కఁబడునె. (హురుమత్తువేళలన్=పెద్దకాలమున, వార్ధకమున.)పార్వ.౧-౬౪.

౨ అధికమైనది, గొప్పది.

సీ. ఒక్కనిబ్బరముగా హురుమత్తు పరువెత్తు సల్లించు కళ్లెముల్ ఘల్లనంగ.

కృష్ణ. ౧-౫3.

ఉ. అత్తతిఁ గోడిచెల్వ లహహా యిదిగో వలిగాడ్పుమమ్ముఁదూ, ర్పెత్తె వసంతుఁడెంతయు రహించఁగ నాకులపాటుఁజూపె హుర్మత్తుగఁదోఁచె మింట నెదురన్ ద్విజరాజొకఁ డుద్ధతిన్ మఘా, ద్యుత్తరవారి వెల్వడెఁబత్తునఁగుండయి చూడుకోమలీ.

చంద్రా. 3-౭౬.

వి. అతివేగము.

వ. ....తమకంబుల గమకింపుచు హురుమత్తునఁ దూఁటి యంపఱల పరంపరల వెంపరలాడిన హుసియుని. ప్రబంధ శిరా.

**హురుమ(మ)ంజి(జీ)**=కురుమంజి. హుర్మ్మంజి,

వి. ౧ పారశీకదేశమందలి యొకమండలము, అచ్చటిసముద్రము.

ఉ. ముక్కరవెట్టి గట్టిహురుమంజి బోగారపు ముత్తియంబు చేర్చుక్క యమర్చి....
పాంచాలీ. ౨-౭

సీ. పచ్చనిహురుమంజిపనివాగె పక్కరపారసి పల్లంబుపట్టమయము. మనుచ. ౪-౨౯.

సీ. హురుమంజి ముత్యాలయొంటుల చకచకల్ తళుకుఁ జెక్కులదండఁ దాండవింప.
చం.రా. ౨-౬౨.

సీ. హురుమంజిముత్యాలయొరగు పాగమెఱుంగు నొసలిబత్తరిబొట్టు మునుఁగుచేయ.
సారంగ. ౧-౭౯.

మ. చెలువంబైకళలన్ వెలుంగు హురుమంజీ దేశపున్ ముత్తియం, బులలోఁగూర్చినచేరుచుక్క ........
అని.౫-౭౨.

౨. ఆణిముత్తెము, శ్రేష్ఠమైనముత్యము.

సీ. ఉదయాద్రికరిమీఁద హురుమంజి చౌడోలు వెడవింటి పాదుశా వెల్లగొడుగు.
మృ. వి. ౨-౯౩.

సీ. మురువుగా హురుమంజి మురువుతో వీనుల కట్టాణిగొప్పచౌకట్లుదాల్చి. దశా. ౭-౨౫౦.

**హుర్మ్మ(ర్మ్మ)ంజి**=హురుమంజి.

సీ. తోరెంచెనొక్క మధూకపుష్పములను నాసహుర్మ్మంజి ముత్యములవలస.
పాండు. ౪-౨౩౪.

**హుర్మ్మంజిపూస.** (హుర్మ్మంజి+పూస.) మంచి ముత్యము.

మ. సెలజాసంతసనిగ్గులుప్పతిలు తిన్నెల్ మూలరా కొద్దటాకులనిద్దంపు జగాహజారమునఁ దళ్కులుక్క హుర్మ్మంజి పూసలసింగంబు మెఱుంగుఁ జెక్కడపుఁగల్ జాగా బోగా గద్దియన్. చంద్రా. ౨-౩౭.

**హుర్ఛనము.** సం. వి. అ. న. మోసము, వంచన, కుటిలత్వము.

**హులము.** సం.వి.అ.పుం. ఒకవిధమైనపనిముట్టు.

**హులహులి,** సం. వి. ఈ. స్త్రీ. ఆనందసమయము లందు స్త్రీలచేనుచ్చరింపబడు ధ్వనివిశేషము.

**హులిహులి,** సం.వి.ఈ.స్త్రీ. ౧ శోభనగానము. ౨ గర్జించుట, కూఁతపెట్టుట.

**హులువు,** సం.వి.ఉ.పుం. పొట్టేలు.

**హుళి** =హుళిక్కి.వి. నాస్త్యర్థకము.

మ. ....మార్గణముఖ్యావనశీలమా శశకశృంగప్రాయ మాప్తాదిలో,మణమాదబ్బుఅ పత్యమా హుళి గణించన్ వానికద్రిస్తనీ.(హుళికి అని శ.ర.) హంస. ౫-౧౧౧. ప్రబంధ౧౧౦.

**హుళికి**=హుళిక్కి. వి. (శ.ర.)

**హుళి(ళ)క్కి.** వి. నాస్త్యర్థకము, అభావమును దెలుపును.

గీ. ఏమిసేయుదు నెక్కడికేఁగువాఁడ, ధనము నిప్పచ్చరంబు విద్యయు హుళక్కి.
కాశీ. ౪-౧౧౧.

గీ. నిలుకడ హుళక్కితావులు పాలనువల్చు,నిట్టి మాబోంట్లలోఁ జెల్మియెట్లు పొసఁగు.
వసు. ౨-౧౩౨.

**హువ్వ,** వి. ఉమియుట మొదలగువానియందగు ధ్వని కనుకరణము.

సీ. అలవిఘాదయహేతువగుతూర్పుఁ జాలాలు హువ్వన నుమియుచిట్టుమ్ములనఁగ.
విప్ర. ౩-౨౯.

**హు(శా.సా)షారు.** వి. (హిం. హుష్యార్.) ౧ జాగరూకత, జాగ్రత్త.

చ. అటువలె వేఁగుచుండి మగఁడత్తయు మామయు నింటలేమి వెల్పటికి హుషారునంజని....
హంస. ౫-౧౬౦.

క. ఆకోలాహలమురుదని, యాకర్ణింపుచ విభుండు హాయము డిగి హుసా,రైకై జాచేసి మహా, నోకహాతలమున నిలిచి కనుంగొనుచుండన్.
చంద్రా. ౨-౧౧౧.

౨ సంతోషము.

క. ఈవేద్కృఁజూడు ముందఱ, సావళమఱ విడు వఁగా హుసారుననెగిమా, బావపాదసోపఁ గొఁజాలు, లేవంగొట్టెదును మాయశేమన బోయల్. పార్వ. ౬-౭౩.

చ. వినఁదు ప్రమోదలీల ... ఏ, చనవరులందలం పఁదు హుసారుగ సారెకుపేటఁ బోవఁడా, జనవరనూతి యందొకటి సైఁచునె చానల నెంచు వాకికిన్.

3 ఉత్సాహము.

ఉ. చక్క్రనివార కాంతలు హుసారుగ నాట్యము సల్పుచుంట సాం, పెక్కఁగ రాజవీథుల మహీకల నాథుఁడు రాజసంబునన్.
ఉ. హరిశ్చ. ౪-౨౧.

విశ. సంతోషకరము.

చ. చలువలుగట్టి చన్నుల హుసారుగ గందమ లంది కప్పురం, బలరెడి ముత్తెపుంబరణులంది ........ కువల. ౧-౭౫.

సీ. చిగురాకు తెగహారు నగరాజులు హుశారు వగమీఱు రత్నాలవహి గుడార్లు.
కృష్ణ. 3-౭౫.

హుుసి. వి. యుచ్ఛ్వాసశక్తియందగు ధ్వని కనుకరణము.

వ. తమకంబుల గమకింపుచు హురుమత్తుఁనదూతి యంపఱల పరంపరల వెంపరలాడిన హుసి యని దొందడిని పుళిందులు కఱకుమీఱి చుఱుకు చూపులుచూచి. ప్రబంధ.౭౭౭.

హుుసివోవు=ఉసివోవు. అ.క్రి. వ్యర్థమగు; తప్పి పోవు.

చ. కొలుచు సమగ్రభంగి నొనఁగూడ దివాణపు వారిచేతికా, కలు హుసి వోవఁగాఁ గఱవు కాలమెఱుంగక....కొ,ళిలుదురు రెడ్డిబిడ్డలు కుబేరుని పిల్లలనంగ వచ్చుటన్.
శుక. ౨-౪౦౬.

హుహుువు, సం.వి.ఉ.పుం, ఒకగంధర్వుఁడు.

హూ

హూ1. అవ్య. క్రేతహస్తులు చేయుహెచ్చరిక.

శా. ఓహోభైరవ నీలరుద్ర నిలు సాహో వీర భద్రేశకుం,భా! హూ రాకు నికుంభ యంచు వడి సమ్మర్దంబు వారించుచున్.
వరాహ. ౧౧-౮.

హూ2. వి. అవులింతటయందలి ధ్వనివిశేషము.

సీ. ఒదిగిలి కనువిచ్చి హూయని బిట్టావులించి కొండొకదేతిపేదిపల్లి. భార. అర. ౭-౪౫.

హూడము. సం.వి.అ.పుం. పొట్టేలు.

హూణము. సం. వి. అ. పుం. ౧ దేశవిశేషము. ౨ ఒకవిధమైనబంగారు నాణెము.

హూణుఁడు. సం.వి.అ.పుం. ౧ విదేశీయుఁడు. ౨ అనాగరకుఁడు. 3 పశ్చిమదేశములోని యొక జాతి జనుఁడు. ౪ ఆంగ్లేయుఁడు.

హూతము. సం.విశ. (అ.ఆ.అ.) పిలువఁబడినది. వి.అ.న. పిలుచుట.

హూతి. సం.వి.ఇ.స్త్రీ. పిలుపు, ఆహ్వానము.

హూరగవము. సం.వి.అ.పుం. నక్క.

హూహువు. సం.వి.ఉ.పుం. ౧ ఒకానొక దేవ గాయకుఁడు. ౨ గంధర్వుఁడు.

హూహూ. వి. చలిబాధయందగుధ్వనికనుకరణము.

సీ. జనులు హూహూయను చలివేళఁగుత్తుక బంటి తోయముల లోపల వసించి.
భాగ. ౪-౬౪౭.

హృ

హృచ్ఛయము. సం. వి. అ. పుం. ౧ ప్రేమ. ౨ ఆత్మ. 3 అంతరాత్మ.

హృచ్ఛయుఁడు. సం.వి.అ.పుం. మన్మథుఁడు.

హృణి. సం.వి.ఇ.పుం. ౧ కోపము. ౨ మండుట.

హృణీ(ణి)యు. సం.వి.అ.స్త్రీ. ౧ నింద. ౨ జాలి 3 సిగ్గు.

**హృతము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧ గ్రహింపఁబడినది. ౨ హరింపఁబడినది. ౩ ఆకర్షింపఁబడినది ౪ ఆమోదింపఁబడినది. వి.అ.న. భాగము.

**హృత స్తంభము.** సం.వి.అ.పుం. హృదయపక్షవాతము.

**హృతి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ హరణము. ౨ నాశము

**హృత్తు.** సం.వి.చ్.న. ౧ హృదయము. ౨ రొమ్ము ౩ ఆత్మ. ౪ అంతస్సారము.

**హృత్స్వ.** సం.వి.న్.పుం. ౧ జాలరి. ౨ శివుఁడు.

**హృత్సారము.** సం.వి.అ.పుం. ధైర్యము.

**హృదయంగమము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧ మనోహరము. ౨ అందమైనది. ౩ సమ్మతమైనది. ౪ ప్రియమైనది. ౫ అర్హము. వి.అ.న. పుం. ఉచితభాషణము.

**హృదయగ్రహము.** సం.వి.అ.పుం. హృదయమాంద్యము.

**హృదయజుఁడు.** సం.వి.అ.పుం. కొడుకు.

**హృదయదీప(క)ము.** సం. వి. అ. పుం. గోపదేవుఁడు రచించిన వైద్యశాస్త్ర నిఘంటువు.

**హృదయపురుషము.** సం.వి.అ.పుం. గుండెకొట్టుకొనుట.

**హృదయప్రమాథి.** సం.విణ (న్.నీ.న్.) హృదయమును కలఁచునది.

**హృదయప్రస్తరము.** సం.విణ. (అ.ఆ.అ.) క్రూరమైనది.

**హృదయమిచ్చు.** మి.అ.క్రి. (హృదయము+ఇచ్చు.) మనసిచ్చు; రహస్యమెఱిఁగించు.

క. కీలిగణింపక జార, వ్రాతములకు హృదయమిచ్చి వర్తిలుటన్.... శుక.౩-౫౩౫.

**హృదయము.** సం.వి.అ.న. ౧ మనస్సు, ఎద ౨ ఆత్మ ౩ రొమ్ము. ౪ ప్రేమ. ౫ అంతర్యము ౬. అంతస్సారము. ౭ శాస్త్రము. (అశ్వహృదయము ఇత్యాదులు) ౮ తత్త్వజ్ఞానము. ౯ వేదము. ౧౦ కోరిక. ౧౧ అహంకారము.

**హృదయమున నెక్కు.** మి.అ.క్రి. (హృదయమునకున్+ఎక్కు.) ఇష్టుఁడగు, ప్రియుఁడగు, ప్రియమగు.

ఉ. అంబుధియల్లుఁడుత్త మనయచ్చరజాతికి
భావ వేల్పు పీతాంబరుఁడెట్టులట్ల హృదయంబున కెక్కె నితంతటంచు....
శకు. ౧-౧౭౨.

**హృదయరజ్జువు.** సం. వి. ఉ. పుం. క్షేత్రగణితములో మధ్యరేఖ.

**హృదయసంఘట్టము.** సం.వి.అ.పుం. హృదయస్తంభము.

**హృదయసమ్మితము.** సం.విణ. (అ.ఆ.అ.) రొమ్ముబంటి.

**హృదయాత్మము.** సం.వి.న్.పుం. నారాయణపక్షి.

**హృదయాళువు.** సం.విణ. (ఉ.ఉ.ఉ.) మంచి మనస్సు గలది.

**హృదయోదంకము.** సం. వి. అ. పుం. హృదయోచ్ఛ్వాసము.

**హృదయ్యము.** సం.విణ. (అ.ఆ.అ.) హృదయమునకుఁ బ్రియమైనది.

**హృదావర్తము.** సం.వి.అ.పుం. శ్రీవృక్షకము, గుఱ్ఱము రొమ్మునందుఁగల సుడి.

**హృది.** సం.వి.చ్.న. మనస్సు, ఎద.

మ. హృదిచైతన్యముఁబొందఁ దప్పితి విషాదేశుండు సంకర్షణన్, గదచేతంగొని ...
ఉ.హరి.౩-౭౧.

**హృది(దీ)కుఁడు.** సం.వి.అ.పుం. యాదవరాజు.

**హృదిస్పృశము.** సం. విణ. (శ్. శ్. శ్.) ౧ హృదయమును దాఁకునది. ౨ ప్రియమైనది. ౩ సుందరమైనది. ౪ సమ్మతము. (ఇట్లే హృదిస్పృక్కు.)

**హృద్య.** సం.వి.ఆ.స్త్రీ. ౧ ఆఁడుమేఁక. ౨ రక్తపాషాణము. ౩ బుద్ధియొసెడి ఓషధి.

**హృద్యగంధ.** సం. వి.ఆ.స్త్రీ. మల్లెతీఁగ.

**హృద్యగంధము.** సం. వి. అ పుం. బిల్వవృక్షము. న. ౧ సన్నజీలకఱ్ఱ. ౨ లవణ విశేషము.

**హృద్యము.** సం. విణ. (అ. ఆ. అ.) హృదయంగమము. వి. అ. న. పుం. తెల్లజీలకఱ్ఱ. పుం. వశీకరణ వేదమంత్రము.

**హృద్వంటకము.** సం. వి. అ. పుం. కడుపు.

**హృల్లాసము.** సం. వి. అ. పుం. ౧ ఎక్కిలి. ౨ చింత

**హృల్లేఖ.** సం. వి. ఆ. స్త్రీ. ౧ చింత. ౨ మాయాబీజము. (హ్రీమ్ అనునది.) ౩ ఇష్టార్థమందలి యుద్యోగము.

**హృల్లేఖము.** సం. వి. అ. పుం. ౧ జ్ఞానము. ౨ వివేకము. ౩ సంశోధ్రము. ౪ తర్కము. ౫ ఊహ.

**హృషి.** సం. వి. ఇ. పుం. స్త్రీ. ౧ సంతోషము. ౨ తృప్తి. ౩ వైభవము. ఇ. పుం. అసత్యవాది.

**హృషితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧ సంతోషించినది. ౨ పులకించినది. ౩ ఆశ్చర్యము నొందినది. ౪ వంగినది. ౫ నిరాశఁ జెందినది. ౬ నిర్మలమైనది. ౭ క్రొత్తది. ౮ కవచితము. ౯. కుంఠితము.

**హృషీకము.** సం. వి. అ. న. పుం. ఇంద్రియము.

**హృషీకేశుఁడు.** సం. వి. అ. పుం. ౧ విష్ణువు. ౨ కృష్ణుఁడు.

**హృషుఁడు.** సం. విణ. (ఉ. ఉ. ఉ.) ౧ సంతోషించినవాఁడు. ౨ అబద్ధము చెప్పువాఁడు. వి. ఉ. పుం. ౧ అగ్ని ౨ సూర్యుఁడు. ౩ చంద్రుఁడు.

**హృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧ సంతోషించినది. ౨ పులకించినది. ౩ మొక్కవోయినది. ౪ కఠినము. ౫ ఆశ్చర్యము పొందినది.

**హృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ౧ సంతోషము. ౨ సౌఖ్యము. ౩ గర్వము. ౪ అజ్ఞానము.

**హృష్టిరోమాని.** సం. వి. ఇ. పుం. అర్ధనపుంసకుఁడు

## హె

**హెగ్గడి.** వి. ౧ అంతఃపురమందలి కావలివాఁడు.

సీ. తగువాహనముల నంతఃపురకాంతలనిడిదిడ్లు
వైపించు హెగ్గడులును. కళా. ౮. ౨౯.

ద్వి. కడిఁది హెగ్గళ్ళు హెగ్గడికత్తియలును, బడి
బడి వడిబరాబరి సేయుచుండ.
అ. మ. క. ౫. ౨౪౧. పా. ౨౪ పం.
యయా. ౪-౧౫౪.

౨. అంతఃపురపుకావలికత్తె. (శ. ర.) ౩ నపుంసకుఁడు.

ద్వి. ఎందుండి వచ్చితిరేమని యనఁడు, మందుఁ
డో యనుఁడో సోమరయి. హెగ్గడియు.
ద్వి. పరమ. ౪-౨౮౧. పా.

**హెగ్గడికత్తె(త్తియ).** వి. (హెగ్గడి+కత్తె.) అంతఃపురపుఁగావలికత్తె.

గీ. ఒక్కనాఁడంతిపురమున నుమటుబిగువు,
గబ్బిగుబ్బెతగము లూడిగములు సలుప, రాజ
వర్య పరాకజారమున దొరిలు, కాచినారని
హెగ్గడికత్తె దెలుప. కువల. ౨-౩.

గీ. కలిగినవిరుల్ల వేర్పుతోఁ బలికుపోంమ్లు, కదఁగి
మ్రోయింప హెగ్గడికత్తెలచ్చి, పైఁడికోలలు
పూని వే పదఁదటంచుఁ, బల్లకీముందఱను
బరాబరులు సేయ. యయా. ౫. ౧౫౮.

**హెగ్గడికాఁడు.** వి. (హెగ్గడి+కాఁడు) అంతఃపుర రక్షకుఁడు. (శ. ర.)

**హెగ్గడీఁడు.** వి. (హెగ్గడి+ఈఁడు) హెగ్గడికాఁడు.

గీ. అతఁడు తెచ్చిన రత్నభూషాంబరాదు, లందు
కొన హెగ్గడీలతో వానతిమ్ము. సత్యా. సాం. ౪

**హెగ్గాళె.** వి. వాద్య విశేషము.

ని....తప్పెటఁ జిత్రగతులవాయింప, గాళెలు
మించు హెగ్గాళెలు సన్న, గాళెలు రొఁతు
లగ్గలముగా మొఱయ.
అ. మ. క. ౪-౧౯౮. పా. ౨౮. పం.

**హెచ్చరించు**=ఎచ్చరించు. స. క్రి. (√ హెచ్చు)

౧ ప్రోత్సహించు, పురికొలుపు.

చ....విక్రయింపఁగాఁ, గలరిణకొూరసైన యని కారుల వీరుల హెచ్చరించి.... ఉ.రా.౪-౨౩౨.

౨ అవధానమును దెలుపు.

మ... నలుమోమయ్య హుటాహుటిన్ గదలెఁ జెంతంజేరఁ జేకేలరా, యలు సాహోయని హెచ్చరింప.... దశా.౨-౬౭.

వ....ఇదిగో ప్రవేశపెడఁదప్పించుకొనుమని హెచ్చరించుచు ... ఉ.రా.౩-౨౪౬.

**హెచ్చరిక**=ఎచ్చరిక. వి. (√. హెచ్చు) ౧ అవధానము, జాగరూకత.

ఉ. ఇచ్చట మేము నేఁటిమతియొవ్వరితోడను మాటలాడఁగా, వచ్చెదనచ్యుతాత్మజ దివ్యప్రతిపంపునఁగృష్ణుపాలికిన్, వచ్చియతండు వీక్షించి యుంప వారల యుద్ధము యాజ్ఞలున్ గడున్, హెచ్చరికన్ ధరించి యిప్పుడేఁగెదు లాగిది యొక్కచోటికిన్. ప్రభా.౨-౪౪

గీ. దెరసి దేవాకు పురుటింట నెరయఁజొక్క, హెచ్చరిక గల్గియుండరె యింతులార. ఇందు.౨-౫.

౨ ప్రభువులయవధానమునకై వేత్రధరులుపయోగించు మాట.

గీ. పసిఁడిబెత్తుల వారిదురదసలఁగ్రమ్మి, యతవ దేవపరాకు హెచ్చరికయనుచుఁ, గరము వేడుకతో బరాబరు లొనర్పు. రసిక.౧-౮౦.

చ. హరిహయవహ్నిసౌరి దనుజాధిపవాయుకుబేర శంకరుల్, పరసతగొల్వ మ్రొక్కులిడి స్వామి పరా కవధారు దేవ హెచ్చరిక యటంచుఁగంచుకులు సారెకు సూరెల నుగ్గడింపఁగా.... దశా.౧-౨౩౩.

**హెచ్చరికించు**=ఎచ్చరికించు. (చి.ని.శ.స.)

**హెచ్చించు.** స.క్రి. (√ హెచ్చు) పెంచు, అతిశయింపఁజేయు.

సీ. సంజీవకునితోడి సఖ్యంబుపైవచ్చె హెచ్చించి యాపదఁదెచ్చుకొంటి, నొంటిపాటున నాతఁడొకనాడు నాతోడ నీతోడ కలహముద్దులుగ్గడించి శం.పంచ. ౧-౩౬౯.

**హెచ్చిరిల్లు (లు)**=ఎచ్చిరిల్లు. అ.క్రి. (√. హెచ్చు.) ౧ విజృంభించు.

చ. తవతను వెల్లదాఁచికొని వక్త్రముమారుత చోరకుండునే, ర్పునఁజనుదెంచి తావిఁగొనిపో వవదేవత హెచ్చిరిల్లికో,యని వెనుబోటుఁగూఁత విమునట్టిగతిన్ విననయ్యె వింటికే, యనుపమగాత్రి కోకిలకులాకులకేళికుహూకుహూధ్వనుల్. కువల.౩-౧౨౪.

౨ వర్ధిల్లు, అధికమగు.

క. అనుకువమోముతోడను, నేమిటికో హెచ్చిరిల్లి హిమకరుఁడొకనాఁ,డేమో పోలునఁట యిఁకం, దామరి తాఁబోలుమనవ దైవమునఁగదే. రాజ.చ.౨-౧౭౯.

క. అటకొంతకాలమరిగిన, నటవాఁడు సుమంతునకు మహైశ్వర్యంబు, తృటమై గడియకుముకనీ, యటువలె హెచ్చిరిలి రాఁగ నతిమన్ననుఁడై. సారంగ. ౩-౧౨౮.

**హెచ్చిల్లు (లు)**=ఎచ్చిల్లు.అ.క్రి. (√ హెచ్చు, అతిశయించు, పెంపొందు.

చ. అలరుచుఁ గేకయాధిపతి యంపినగార్గ్యునికిన్ వినీతి హెచ్చిల నెమకేఁగి .. ఉ.రా. ౮-౧౫౩.

క. నిలిచి దగవీర్చుకొని హెచ్చిలు కోపముతోడ నింత చేసిన దీనిం,దల్రవచ్చుక మ్రింగెదను.... శుక.౨-౩౧౩.

**హెచ్చు**=ఎచ్చు. అ.క్రి. ౧ అతిశయించు, మించు

సీ. అరవిందముల కచ్చునఁగించుజిగి హెచ్చు నాయతించు కన్నుదోయితోడ. ఆము. ౯-౧౨.

గీ. అంతమాగధ వైతాళికాతిమంజు, లారవంబుల మేల్కని హరివరంపుఁ, బెంపువఁదదాస్యకళ హెచ్చి సొంపుమీఱు,ననుచుమును బాలినాదెల యప్పుడు క్రుంకె. రా.వి.౧-౪౮.

క. వారు శివద్రోహులుగద, యీరిపమున శైవమతము హెచ్చఁగరాదం, చేరీతి నైనఁజెఱుతురు.... శుక ౩-౭౨.

౨ ఉద్రేకించు.

ఉ. ఏనయి యున్నఁడైనఁ దమి హెచ్చినచోఁ దమకేరి యెంతప్రాజ్ఞైన ఁబదంబులోన్ తగ్గక మప్పటికెటు ఘటించుఁగోరికల్.

దశా. ౩-౨౫.

చ.... తమి హెచ్చనోచ్చె మెయ్యెదలను కేళిబొ హొయలు నిమ్మగ గోరుచుఁబాలుఁబ్రోదకై యదరెడు గొల్లకన్నెలహాహాలు బాముల కేమి నోచితో. నీలా.౧-౧౦౮.

౩ విజృంభించు.

ఉ. కాఁకపెర్చి సంగరముఖంబున హెచ్చిన రాజవంశమున్, గూఁకటివేళ్లతోఁ జెరికి గోత్రవధంబును జేసినట్టియా, బ్రేఁకిపుఁగీడు గాక ప్రజ్వేఁచఁదలంచిన గోరునట్టుఁడై, కోఁకటిపోటుఁ చండముగ గోసి జమల్ నను జూచి తిట్టరే. జై.భా. ౧-౬౮.

విశే. అధికము.

గీ...ఇచ్చమెచ్చు, హెచ్చు హెచ్చుగ ద్రావిడ దేశమధిప. దశా. ౧-౧౧౩.

వి. గొప్పతనము, ఆధిక్యము.

చ. మొనలకు హెచ్చుగామననముమున్నగంపగినఁ గాక శత్రులం,గనుఁగొని యుట్టులాంపొగ మొగంబులు నూచుచునున్నఁబోవుకే.

పారి.విరా. ౮.౧౧౧.

క. కావున వారల నటనా, ప్రావీణ్యము హెచ్చుఁగుందుఁ బ్రకటింపుటకై, దేవఁ దోషార్హని రమ్మని దేవేంద్రుఁడు పనిచె....

విక్ర. ౨-౭౮.

సీ. అధరంబు బింబంబు నగలించుకే హెచ్చు కుకరాజ కుంపవిస్ఫారణఁబోదల.

దశా. ౨-౨౬౯.

హెచ్చుకంటిదొర. వి. (హెచ్చు+కన్ను+దొర.) శివుఁడు, ముక్కంటి.
విశాలచాపది.

హెచ్చుకంటిదొరచేదినప్రోడ, పాచ్చెము లెంచక పూవిలుకాఁడ, ప్రబంధ. ౨౪౬.

హెచ్చుకుందాడు. అ.క్రి. (హెచ్చు+కుందు+ఆడు.) ఎక్కువ తక్కువలాడు, వివాదపడు;

సీ. విప్రపతీపంకైన నీప్రతాపంబుతో హెచ్చు కుందాడె గొంటుందపేఁడి.

నైష. ౮-౯౧.

స.క్రి. తృణీకరించు, ఇంచుమించులాడు.

వ. కొందఱిచ్ఛాపసులు ప్రియుండు తమకు నేమి యిచ్చిన మెచ్చక హెచ్చుకుందాడుదురు.

కాశీ. ౨-౭౯.

హెచ్చుకుందు. వి. ద. (హెచ్చు+కుందు) ఎక్కువ తక్కువ.

గీ. ఏలపదరెదు నీకును హెచ్చుకుందు, మాటలకు నెంతయిన్నాళ్లు మాను లేని, వటువునదురేయి యెందుండివచ్చెఁజెపుము. విప్ర.౫-౫౭.

హెజ్జిజ్జి. వి. ముప్పదిరెండు నపుంసకరాగములలో నొకటి. (సంగీ)

గీ....హెజ్జిజ్జి నీలాంబరియు ననంగఁ, బొసఁగు ముప్పదిరెండు నపుంసకములు.

హంస.౫-౧౨.

గీ....నాట, శాళిదేశాక్షి తోడి వరాళిశ్రీవ,రాళి హెజ్జిజ్జికేదారిగౌళపాడి.

ప్రబంధ. ౯౬.

## హే

హే. అవ్య. పశ్వాదులను దోలుటయందగుధ్వని కనుకరణము.

శా....వల్లిత్రా, జెంతేఁగైకొని హే యటంచు గనియన్ హేలావినోదంబునన్.

దశా. ౯.౧౬.

హేక్క. సం.వి.ఆ.స్త్రీ. ఎక్కిలి.

హేజీబు. వి. మంత్రి.

గీ. జిస్తుతో మాటలాడ హేజీబు ననుకు, రాక తిప్ప వృపాల బావాని నిహతు, సైనయుల హిందుఖాన సేనాధిపతులు, సిండినురపట్ట నముచెంత పంచు విడిసి. కువల.౧-౩౩.

గీ. ఉభయకటముల శ్రీముద్రలూర్ధ్వపుండ్ర,సంగతాంగార నవయవష్టారలోహి, తాత్కత్రిల హేజీబు లపుడు వచ్చి, రగణితస్థితి సాహేబు నగరికడకు. రావి.౫.౩౫.

సీ. రాయబారము వచ్చెనా యిత్తతినరోాధ్య
కింద్రుహేజీబులం దెవ్వఁడైన.
చం.రా. ౪-౮౩.

**హేజుబారి.** వి. (హిం.) రాయబారి.

గీ. ఇట్లుగనుఁగొన్న మన్నినిహేజుబారి, కప్ప
రానులదొకిమీఁదు చెప్పరాని, మెప్పరాఁ
గప్పరపు వీక్ష్యమప్పడొసఁగి,కుశలసంప్రశ్న
మొనరించి కుతుక మొందవ.
రంగా. ౨-౧౧౫.

**హేతము.** సం.వి.అ.పుం. ౧ ఆటంకము. ౨ హాని, గాయము. ౩ కలఁత.

**హేడజము.** సం.వి.అ.పుం. ౧ కోపము. ౨ అసంతృప్తి.

**హేడము.** సం.వి.అ.పుం. అవమానము.

**హేడాబు(వు)క్కుఁడు.** సం.వి.అ.పుం. అశ్వవ్యాపారి.

**హేడుఁడు.** సం వి.అ.పుం. అంతఃప్రకపుఁగావరివాఁడు. విణ. మూర్ఖుఁడు.

**హేతి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ ఆయుధము, బాణము. ౨ దెబ్బ, గాయము. ౩ సూర్యకిరణము. ౪ వెలుతురు. ౫ మంట. ౬ పనిముట్టు. ౭ లేఁత మొలక.

**హేతుకము.** సం.వి.అ.పుం. ౧ కారణము. ౨ సాధనము, పనిముట్టు.

**హేతుకుఁడు.** సం.వి.అ.పుం. తార్కికుఁడు.

**హేతుదుష్టము.** సం.విణ. (అ.అ.అ.) అయుక్తము, న్యాయవిరుద్ధము.

**హేతుదృష్టి.** సం.వి.ఇ.స్త్రీ. భగవంతుని యస్తిత్వవిషయమును సందేహించు స్వభావము.

**హేతుమంతము.** సం.విణ. (త్.తీ.త్.) కారణము కలది. వి.త్.న. కార్యము.

**హేతుమన్నిగదము.** సం.వి.అ.పుం. హేతువును సూచించు వేదవచనము.

**హేతువాదము.** సం.వి.అ.పుం. ౧ వివాదము. ౨ కపటము. ౩ భగవంతుని యస్తిత్వమును సందేహించుచుఁగావించు వాదము.

**హేతువాది.** సం.వి.న్.పుం. ౧ తర్కించువాఁడు ౨ దేవుని యునికిని సందేహించువాఁడు.

**హేతువు.** సం.వి.ఉ.పుం. ౧ కారణము. ౨ ఉద్దేశము. ౩ సమూలము. ౪ సాధనము. ౫ తర్కము. ౬ హేతువాదము. ౭ ఒకయలంకారము. ౮ ప్రేరణక్రియకుఁగర్త. ౯ మూలకారణము. (బౌద్ధ.) ౧౦ బాహ్యప్రపంచము. ఇంద్రియములు (పాశుపతులమతము) ౧౧ విషము ౧౨ వెల, మూల్యము.

**హేతుశాస్త్రము.** సం.వి.అ.న. ౧ తర్కయుక్తముగా రచింపఁబడిన గ్రంథము. ౨ శ్రుతిస్మృతుల ప్రమాణమును నిరసించు గ్రంథము.

**హేతుహేతుమద్భావము.** సం. వి. అ. పుం. కార్యకారణములకుఁగల సంబంధము.

**హేత్వవధారణము.** సం. వి. అ న. (నాటక) తర్కించుట, హేతువాదము.

**హేత్వాభాసము.** సం. వి. అ. పుం. మిథ్యాహేతువు. (౧ సవ్యభిచారము, అనైకాంతికము ౨ విరుద్ధము. ౩ అసిద్ధము. ౪ సత్ప్రతిపక్షము. ౫ బాధితము. (అనియిది అయిదు విధములు)

**హేమ.** సం.వి.ఆ.స్త్రీ. ౧ భూమి. ౨ అందకత్తె

**హేమంతనాథము.** సం.వి.అ.పుం. వెలఁగచెట్టు

**హేమంతము.** సం.వి.అ.పుం.న. మార్గశీర్ష పుష్యమాసములతోఁగూడిన ఋతువు.

**హేమంతి.** సం.వి.ఈ.స్త్రీ. శీతకాలము.

**హేమకందలము.** సం.వి.అ.పుం. పగడము.

**హేమకము.** సం.వి.అ.న. బంగారము.

**హేమకింజల్కము.** సం.వి.అ.న. నాగకేసర పుష్పము.

**హేమకూటము,** సం.వి.అ.పుం. ఒకపర్వతము.

**హేమకేతకి,** సం.వి.ఈ.స్త్రీ. స్వర్ణకేతకి, పచ్చ పూమొగిలి.

**హేమకేలి,** సం.వి.ఇ.పుం. అగ్ని.

**హేమకేశుఁడు,** సం.వి.అ.పుం. శివుఁడు.

**హేమగంధిని,** సం. వి. ఈ. స్త్రీ. రేణుకయను సువాసనా ద్రవ్యము.

**హేమగౌరవము,** సం.వి.అ.పుం. అశోకవృక్షము

**హేమఘ్నము,** సం.వి.అ.న. సీసము. (లోహము)

**హేమఘ్ని,** సం.వి.ఈ.స్త్రీ. పసుపు.

**హేమచంద్రుఁడు,** సం.వి.అ.పుం. ౧ ఇక్ష్వాకుని మనుమఁడు. ౨ ఒకజైన నిఘంటుకర్త.

**హేమజ్వాలుఁడు,** సం.వి.అ.పుం. అగ్ని.

**హేమతరువు,** సం.వి.ఉ.పుం. ఉమ్మెత్తచెట్టు.

**హేమతారము,** సం.వి.అ.న. మైలుతుత్తము.

**హేమదుగ్ధ(క)ము,** సం.వి.అ.పుం. మేడిచెట్టు.

**హేమధాన్యకము,** సం.వి.అ.పుం. ఒకటిన్నర మాషకముల తూనిక.

**హేమపక్షము,** సం.విశే. (అ.ఆ.అ.) బంగారు రెక్కలు కలది. వి అ.పుం. బంగారుకొండ్రాణము

**హేమపుష్ప(క)ము,** సం.వి.అ.పుం. ౧ అశోక వృక్షము. ౨ లొద్దవృక్షము. ౩ చంపకవృక్షము న. అశోకపుష్పము. ౨ మందారపుష్పము.

**హేమపుష్పిక,** సం.వి.అ స్త్రీ. ౧ చేమంతిపువ్వు ౨. పచ్చ అడవిమొల్ల.

**హేమపృష్ఠము,** సం విశే. (అ.ఆ.అ.) బంగారు పూఁత పూసినది.

**హేమమాక్షికము,** సం.వి.అ.న. అగ్నిశిల.

**హేమమాల,** సం.వి.అ.స్త్రీ. యమునిభార్య.

**హేమమాలి,** సం.వి.న.పుం. సూర్యుఁడు.

**హేమము,** సం.వి.అ.న. ౧ బంగారము. ౨ ఉమ్మెత్త. ౩ పుం. నల్లని రంగుగల గుఱ్ఱము. న.న. ౧ బంగారిము. ౨ జలము. ౩ మంచు. ౪ ఉమ్మెత్త. నాగకేసరపుష్పము. శీతకాలము.

**హేమయూథిక,** సం.వి.అ.స్త్రీ. హేమపుష్పిక, చేమంతి.

**హేమరాగిణి,** సం.వి.ఈ.స్త్రీ. పసుపు.

**హేమరేణువు,** సం.వి.ఉ.పుం. త్రసరేణువు.

**హేమలము,** సం.వి.అ.పుం. ౧ ఒరిపిడిరాయి. ౨ తొండ.

**హేమలుఁడు,** సం.వి.అ.పుం. అగసాలెవాఁడు.

**హేమవ(బ)లము,** సం.వి.అ.న. ముత్యము.

**హేమశంఖుఁడు,** సం.వి.అ.పుం. విష్ణువు.

**హేమసారము,** సం.వి.అ.న. మైలుతుత్తము.

**హేమసూత్ర(క)ము,** సం. వి. అ. న. ఒకవిధ మైన కంఠహారము.

**హేమాంగము,** సం.విశే. (అ.ఆ.అ.) సువర్ణ వికారిమైనది.వి.అ.పుం. ౧ సుమేరుపర్వతము. ౨ సింహము. ౩ చంపకవృక్షము.

**హేమాంగుఁడు,** సం.వి.అ.పుం. ౧ గరుడుఁడు. ౨ బ్రాహ్మణుఁడు. ౩ విష్ణువు.

**హేమాద్రి,** సం.వి.ఇ.పుం. ౧ సుమేరుపర్వతము. ౨ చతుర్వర్గచింతామణికర్త.

**హేమాహేమీ(ము)లు,** విశే.బ. అధికులు, గొప్పవారు; పూజ్యులు.

శా. మహాత్మ్యంబులు తేజముల్ విభవసంపత్తుల్ విమర్శింపఁగా, నోహోభేదములేమ నిందు సభలో నొక్కింత మాత్రంబుహే, మాహే మీలు ఘటాఘటీ లతిరథుల్ మాంధాతలీపా ములే, లాహీనాధికభానముల్ తడవరాదం చున్ వితాకుంచనై. వరాహ. ౧౧-౮

క. మదమొదపు కోడెవిటులకు, హృదయపుటాం తరములోన హేమాహేమీల్, పదివేల

మున్మఘులుఘ్రుట్టుదు రానీమాటినుచ పటుత్వ
ముగన్నన్. హంస.౧-౨౧౨.

సీ. బహుళ నన్యులఁ గెల్వుపట్ల హేమాహేమ
లను పల్కు పూజ్యార్థ మగుచునుండు.
ఆం.భా. ౩-౧౭.

**హేమాహ్వము.** సం.వి.అ.పుం. ౧ వనపంచక వృక్షము. ౨ ఉమ్మెత్త.

**హేమించు.** సం.అ.క్రి. బంగారమగు. (శ.ర.) స.క్రి. బంగారముచేయు.

మ. ఇలఁ ద్రవ్యాన్ నిధివాంఛ ధాతువితతుల్
హేమింప నూఁదున్ మహీ, తులఁగొల్చున్.
........ మ. వైరాగ్య. ౩.

**హేమ్నుఁడు.** సం.వి.అ.పుం. బుధుఁడు.

**హేమ్యము.** సం.విశే. (అ.ఆ.అ.) సువర్ణవికారమైనది.

**హేయము.** సం.విశే. (అ.ఆ.అ.) విడువఁదగినది.

**హేరంబము.** సం.వి.అ.పుం. మహిషము.

**హేరంబహట్టము.** సం.వి.అ.పుం. ఒకదేశము.

**హేరంబుఁడు.** సం.వి.అ.పుం. ౧ గణేశుఁడు. ౨ ప్రగల్భవచనుఁడైన నాయకుఁడు.

**హేర(రి)కుఁడు.** సం.వి.అ.పుం. గూఢచారి.

**హేరము.** సం.వి.అ.న. ౧ కిరీటము. ౨ పసుపు. ౩ దయ్యపుమాయ.

**హేర(రా)వళి.** వి. పాదపళ్లెకోక. (శ. ర.)

**హేరాయి.** వి. హింసించుట, ఉపద్రవపెట్టుట.

ఉ. రాముఁడసంగఁజెప్పుము ధరాసురుఁడో జమ
దగ్నిపుత్రుఁడై, సోమకకిరీటికిన్ శరణువచ్చి
గుహుండును దానుగూడి పో,రాములతోడ
నం బరశురాముఁడనన్ విలువిద్యనేర్చి హే,
రాములఁదండ్రి నాఁటిరిపులందును మాడిన
యట్టి రాముఁడో. భల్లా. ౨ (శ.ర.)

**హేరాళము**=ఏరాళము. విశే. (క. హేరాళ, త.ఏరాళమ్.తు.ఏరళ.)౧అధికము,మిక్కుటము.

క. వీలని వలలొడ్డిరి హే,రాళముగా లోకపాల
రిమణులు మృగయా, లీలఁగనుఁగొనఁగఁ
జేసిన, జాలక జాలములుగలదికాభిత్తులనన్.
వరాహ. ౪-౭౪.

౨ నిరాతంకము, అడ్డులేనిది.

క. సాగమతి దక్షవాటిక, గూడుపు గవనింద్రు
నిద్ధిలో వసియించున్, హేరాళక్రీడాసం,
చారిణి నూకాంబ భక్తజన రక్షణకై.
భీమ. ౧-౧౦౦.

(ఈ ప్రయోగమునుబట్టి శ.ర. దీనిని తత్సమముగా గ్రహించెను. కాని సంస్కృత నిఘంటువులలో నీపదము కానరాదు. శ్రీనాథుఁడచ్చటచ్చట దేశ్యపదములను సిద్ధసమాసములలోఁ జొప్పించుట కలదు. కన్నడ తమిళములందును హేరాళ, ఏరాళ పదములు కలవు. కావున నిది దేశ్యముగా గ్రహింపఁబడినది. చూ.కైవారము)

**హేరికుఁడు.** సం.వి.అ.పుం. వేగులవాఁడు.

**హేరుకుఁడు.** సం.వి.అ.పుం. ౧ శివకింకరుఁడు. ౨ గణేశుఁడు. ౩ బుద్ధుఁడు (చక్రసంబరుఁడు) అ.న. శివలింగము.

**హేల.** సం.వి.ఆ.స్త్రీ.౧ అవమానము ౨ ద్వేషము ౩ శృంగారవిలాసము. ౪ ఆనందము. ౫ సంభోగేచ్ఛ. ౬ పౌలభ్యము. ౭ వెన్నెల. ౮ విరామము (సంగీ).

**హేలంబి.** సం.వి.ఈ.స్త్రీ. ఒకమూలిక.

**హేలనము.** సం.వి.అ.న. ౧ అవమానించుట. ౨ విలాసముగా వినోదించుట.

**హేలావంతము.** సం.విశే.(తా.తీ.తా.)౧అలక్ష్యభావముతోఁగూడినది. ౨ చులుకనగాఁజూచునది

**హేలావుక్కుఁడు.** సం.వి.అ.పుం.అశ్వవర్తకుడు

**హేలి.** సం.వి.ఇ.పుం. సూర్యుఁడు. స్త్రీ. ౧ శృంగారక్రీడ. ౨ ఆలింగనము. ౩ పెండ్లియూరేఁగింపు

**హే(హై)లిహేలము.** సం.విశే. (అ.ఆ.అ.) విలాసశీలమైనది.

**హేవాకము.** సం. వి. అం పుం. అత్యంతాసక్తి (ఈ పదమును విల్లిణా ద్వ్యాచీనసంస్కృత కవులు ప్రయోగించిరి. ఇది పారసీకపదమో అరబ్బీపదమో యై యుండునని,ఆప్త.ని.ప్రౌఢిమ అని.శ.ర.)

క. స్థావరరాజతనూభవ, యావేళన డాయ వచ్చె నభవుని సేవాహేవాక ప్రౌఢిని.... హర. 3-౬౩.

క. రేవా తరంగశీకర, సేవాహేవాకపాక శిశిరమరుత్ప్ర, స్తావపరికంప్యమానజ, టావళి యగు తలఁడు వింధ్య మల్లనఁ జేరెన్. కాశీ. ౧-౬౫.

**హేవాకి.** సం.విశే (న్.సి.న్.) అత్యాసక్తిగల వాఁడు.

**హేవాసకము.** సం.విశే. (అ.అ.అ.) ౧ అధిక మైనది. ౨ నిశితము.

**హేష(ము).** సం.వి.ఆ.స్త్రీ. అ. న. గుఱ్ఱపు సకిలింపు.

**హేషి.** సం.వి.న్.పుం. గుఱ్ఱము.

**హేషించు.** సం.అ.క్రి. (గుఱ్ఱము) సకిలించు.

గీ. జన్మవేళన యాతఁడుచ్చైశ్శ్రవంబు, భంగి హేషించెఁ బృథివి గంపంబు నొంద. భార. ద్రోణ. ౫-౩౮౧

**హేషితము.** సం.వి.అ.న. గుఱ్ఱపు సకిలింపు.

**హేహే.** అవ్య. బిగ్గఱగాఁబిలుచునపుడు సంబోధ నకై వాడు పదము.

## హై

**హై.** అవ్య. సంబోధనార్థకము.

**హైడింబి.** సం.వి.ఇ.పుం. ఘటోత్కచుఁడు.

**హైడింబుఁడు.** సం.వి.అ.పుం. ఘటోత్కచుఁడు.

**హైతుకము.** సం.విశే. (అ.ఈ.అ.) హేతుసం బంధమైనది, హేతువాదపూర్వకమైనది.

**హైతుకుఁడు.** సం.వి.అ.పుం. ౧ తార్కికముగా వాదించువాఁడు. ౨ మీమాంసా సిద్ధాంతముల నవలంబించువాఁడు. 3 విరుద్ధ మతావలంబకుఁడు

**హైమ.** సం.వి.ఆ.స్త్రీ. చేమంతి. (మల్లె)

**హైమంతికము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ చల్లనిది ౨ హేమంతమునఁ బెరుగునది. వి.అ.న.పుం. ఒకవిధమైన పరిధాన్యము (హేమంతఋతువునఁ బండెడిది.)

**హైమనము.** సం.విశే. (అ.సి.అ.) ౧ చల్లనిది. ౨ శీతకాలమునకు సంబంధించినది. 3 శీతకాల మునఁబెరుగునది. ౪ స్వర్ణమయము. వి.అ.పుం. ౧. మార్గశీర్ష మాసము. ౨ హేమంత ఋతువు. 3 శీతకాలమునఁబెరుగు పరిధాన్యము. (ప్రష్టికము.)

**హైమము.** సం.విశే. (అ.మీ.అ.) ౧ చల్లనిది. ౨ మంచుచేతఁ గలిగింపఁబడినది. 3 బంగారు వన్నె గలది. వి.అ.న. మంచు, ఈ పారము.

**హైమముద్ర(ద్రిక).** సం.వి.ఆ.స్త్రీ. బంగారు నాణెము.

**హైమలము.** సం.వి.అ.న.పుం. హేమంతము.

**హైమవతము.** సం.విశే. (అ.తీ.అ.) ౧ మంచు తోఁగూడినది. ౨ హిమవత్పర్వతమునుండి ప్రవహించునది. 3 హిమాలయమునందుండునది. వి.అ.పుం. ఒకవిధమైన విషము. న. భారత వర్షము. (ఇండియా)

**హైమవతి.** సం.వి.ఈ.స్త్రీ. ౧ పార్వతి ౨ గంగా నది. 3 ఒకయోషధి. ౪ గోధుమవన్నెద్రాక్ష. ౫ అవిసె చెట్టు. ౬ త్రిఫలములలో నొకటి.

**హైమి.** సం.వి.ఈ.స్త్రీ. చేమంతిపువ్వు. (మల్లె)

**హైముఁడు.** సం.వి.అ.పుం. శివుఁడు.

**హైయంగవము.** సం.వి.అ.న. ౧ తొలినాఁడు చిలికి దుత్తిన యావువెన్న. ౨ అట్టివెన్న కాఁచిన నేయి. (ఇట్లే హైయంగవీనము.)

**హైరణ్యకుఁడు.** సం.వి.అ.పుం. అగసాలెవాఁడు

**హైరాను.** హిం.విశే. ౧ ఎటుతోఁచని. ౨ తొం దరపడిన. (శ.ర.)

హైరికుఁడు. సం.వి.అ.పుం. చోరుఁడు.

హైసరే=హాయిసరే. అవ్య. ప్రశంసార్థకము, సెబాసు.

సీ. హైసరే యతని పే రనినమాత్రమునచే
   కుసదేశ మేల్రాజాగుండెలవరె.
కృష్ణ. ౨-౪౫.

సీ. మందహాసంబుల యందంబు హైసరే సరిలేదు
   మెవకంట సరికెనెంచు. వాల్మీ.౨-౫౦.

హైహయుఁడు. సం.వి.అ.పుం. యదువు మని మనుమఁడు, కార్తవీర్యార్జునుఁడు. (బహు) హైహాయదేశము; ఆదేశమున నివసించుప్రజలు

హైహేయుఁడు. సం.వి.అ.పుం. కార్తవీర్యార్జునుఁడు.

## హొ

హొ, విణ. వృత్తియందు హొన్నుశబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. దీనికిఁబరమ సకళములు పరములగునపుడు నుగాగమంబగు. హొంగాళె, హొంబట్టు శ.వ.

హొంత. వి. పరిశ్రమము; నేర్పు.

సీ. ఇంపుసొంపులక్రమ్మఁగింపు మాటలు వీణపలు
   కుల శిక్షరాభ్యాస మొసఁగు, మందంపు
   నడపులు మాయూరగతులకుఁ బలుమాఱు
   తిన్ననిఫణితిఁ జూపు, సరసంపు నాసిక
   సంపెంగ మొగ్గల కెక్కువతక్కువల్ చక్క
   దిద్దుఁ, జొక్కంపు గుబ్బలు జక్కవకవలకు
   గిట్ట తనం బుపదేశమిచ్చు.

గీ. హొంతెఁబాడుట వనవిహారోత్సవంబు, సలు
   పుటయుఁబువ్వు విరతివాసనలు గొనుట, కేళి
   సరసిఁ గ్రీడలాడుట కెపములుగను, నతివ
   సౌందర్య మింక నేమని పచింతు.అని.౨-౩౧

హొంతకాఁడు. వి. (హొంత+కాఁడు.) జెట్టి మల్లుఁడు.

మ. ఊరుసంఘాతప శోణమృత్కలిత మై
   యొప్పారు బ్రహ్మాండమున్, గరిడీన్ గాలపు
   హొంతకాఁడు చరమాగస్కంధముం జేర్చుని,
   బ్బరపున్ సంగడమోయనన్, శశి డిగెన్
   ప్రాగ్భూమి భృత్క్రితవే,తర బాహాగ్రతు
   సంగడంబనఁగ మార్తాండుండు దోఁచెన్
   దివిన్. మనుచ. ౩-౫౯.

హొంతకారి. వి. (√.హొంత.) జెట్టి, మల్లుఁడు

గీ. జెట్టితండంబుతోఁదఁజేపట్టిహొంత, కారివిజి
   చిన యట్టు లగ్గలిక విఱుఁగు.
భార, విరా. ౧-౮౧.

గీ. కవులు బుధులును గాయకుల్ గవనికాంద్రు
   హొంతకారులు దగువంను లుండునండ.
మల్లపు. ౧-౧౩.

సీ. గరిడిలో నెఱహొంతకారులై సాముల
   మీఱిన రాజకుమారమణులు.
హంస. ౨-౯.

విణ. ౧. దృఢచిత్తురాలు, మనస్విని.

గీ. వారిలో వారిలోల కల్హారకమల, వనరట
   ద్భృంగ సంగఁ జేకొనిరి సురలు, మారుని
   మిటారి చికటారి గోరియనెడు, హొంతకారి
   వరించె నత్యంతకారి. చం.రా. ౩-౪.

ఉ. అక్కట యొండుఁబోర్యయినా యొయ్యారపు
   సంచుల ముద్దుగుమ్మయే, చక్కని దాఁగనో
   కలికి జక్కవలెక్కువగుబ్బలాడియే, దిక్కన
   నున్నదో సొలుపు దేఱెడి చూపులహొంత
   కారి యే,యిక్కవ నిల్చెనో యొఱపునీనెడు
   చిల్కలకొల్కి దైవమా.
కువల.౪-౯౬.

౨ నేర్పరి.

సీ. అష్టభాషలయందు సాంధ్యంబు లేకుండు
   హొంతకారి కవీంద్రుఁ డాక్కవంక.
తపతీ. ౧-౧౪.

హొంబట్టు. వి. (హొన్ను+పట్టు. ౧ బంగారు వన్నెగలపట్టు.

సీ....హొంబట్టుజిలుఁగు గెంటెంబుతోడ.
మనుచ.౬-౧౦౨.

సీ. పటువులై హొంబట్టుబటువులోయున నొప్పు
   కముచన్నదోయిఁ బాదములు నేర్చి.
కళా. ౨-౧౫౪.

సీ. హైఁగప్పకొన్న హొంబట్టు దుప్పటి....
నీలా. ౧-౬౦.

౨ పచ్చని పట్టుబట్ట.

మ. అనఘుల్ గన్గొనరోఁచు రాఘవుని యాథార్థ్య
త్మ్యంబు భావించులీ, ల నఘోవల్కల దర్శ
నానమానిమీలన్నేత్రుఁడై మున్న గ, ట్టిన
హొంబట్టు సదల్పనేమి కొదవుట్టెన్ గోటి
కందర్పమో,హను దెమ్మెనికటంచు వాక్పతి
నుగుం డాత్తిన్ మరల్చెన్ మతిన్.

చం.రా. ౪-౬౦.

సీ. బొమ్మంచు ముయ్యంచు పాప్పళిహొంబట్టు
నుదయుతాగము....

గీ. మొదలుగా వల్వలు ధరించి మదిశలపుడు.

ప్రబంధ. ౨౭౨.

తే. సన్నవలిపంబులును వెలిపట్టులును హొం
బట్టులును ... స్వా. ౩-౨౦౬.

హొనశా. వి. దేశవిశేషము.

రగడ. సకళాతులుందెలుపు చలిశప్పడంబులును,
హొంబట్టు లోడీలు హొనకాదుకూలాలు.

హంస. ౫-౩౫౬.

హొనరు=ఒనరు. వి. పొందిక, ఒప్పు.

సీ. పెంపుమీఱువసంత కేషువా హుజారుననుండి
చెలామణి హొనరుదెలుప....గీ. మదనుపాదు
షహా దండుగదలెనపుడు. అని.౩-౧౯.

హొన్గుబ్బలి. వి. (హొన్ను+గుబ్బలి.) మేరు
పర్వతము, బంగరుకొండ.

సీ. వెలిబూదిపూఁత ప్రాఁబలుకుటందియలు
హొన్గుబ్బలి సింగాణిగిబ్బ మావు.

అచ్చ. రా. యు. ౫౯౭.

హొన్నంచు. వి. (హొన్ను+అంచు.) బంగారు
పక్షిగలయంచు.

ఉ....హొ,న్నంచు రథంబు చాఁగుబళియంచు
నకీలు ప్రమోయనెక్కనన్.

మనుచ. ౫-౪౨.

సీ.ఒఱగంట మెఱుఁగెక్కనొరయఁగఁగలయెక్క
హొన్నంచుపక్కర యదుటుమాప.

దశా. ౨౬౬.

వ. నుఱువు తాప్తాకురాపంబులు పరంగిపీఁటలు
చదరంగంబులు పగడసాలలు హొన్నంచు
నురటులు. ప్రబంధ.౬౦౫.

హొన్నగరు. వి.దే.అనా. (హొన్ను+నగరు)
బంగారు నగరు; రాజగృహము.

చ. పగదపుఁజాయజాజా నినుపంగనుపట్టు విదేహ
రాజాహొ,న్నగరునకుం బరిష్కరణ నాటిక
లేటికి మాటిమాటికిన్. చం.రా.౩-౧౧౩

హొన్ను=పొన్ను. వి. (దీనికి వృత్తియందు
వికల్పముగఁ దొలియచ్చుమీఁదివర్ణములకు
లోపమును బహువచరళములు పరమైన చో
నుగాగమంబును గల్గును. ఉదా. హొంబట్టు,
హొంగట్టు.) ౧ సువర్ణము, బంగారము.

వ....పదాఱువన్నెహొన్ను పనులన్ జూడన్
జూచె.... ఉ.రా.౩-౨౨.

౨ బంగారు నాణెము. వరహా.

ద్వి. ఒడిలోనఁగట్టిన హొన్నులమూట, పాదవు
నూతిని బడిపోయిన యట్లు.

ద్వి.తి.సా. ౧-౩౪. పా. ౮. పం.

గీ. ఉంగరంబులు కెంపులముంగరయును, మెం
దలుగల సొమ్ములనుదాల్చి మురిపెముమర,
తిరుగుచును విటకోటులధృతి గలంచి,
హొన్నులు గడించు మరునాన చిన్నదాన.

చంద్ర. వి. ౨-౧౯.

విశే. మనోహరము, అందమైనది.

వ....పచ్చికపట్టుల హొన్నగు విన్నాణప్రేవ
పేల్పురాచెలులవిడిదలును....

అచ్చ.భా. ౩-౩౭.

హొన్నుగట్టు, వి. (హొన్ను+గట్టు) బంగరు
కొండ, మేరుపర్వతము.

సీ. పట్టపేనుంగు లారట్టాశ్వములు హొన్ను
గట్టుల మెచ్చని ఘనరథములు.

ఉ.రా. ౫-౨౬౪.

హొన్నరిగె. వి. (హొన్ను+సరిగె.) బంగరుజరీ.

మ....రాసుతుఁడు గోడ్త్రోసైన్యముల్ గొల్వఁగా
సొరిదిన్ సన్నరుమాలు హొన్నరిగె కుచ్చుల్
చెన్నునన్ జొకళింప, చమవారంబుగ వాద్య
నాదములు దిక్చక్రంబునన్ నిండఁగన్.

ఇందు. ౨-౫౫.

**హొమ్ము.** విశ. (ఒమ్ముకకు మొదటి రూపము) పెద్ద, స్థూలము. వి. స్థౌల్యము.

**హొయలు.** వి. ౧ విలాసము.

గీ. హొరగల కోరమీసల హొయలువాని, సొంపు సెలపెదు పెదలు పుటురమువానిఁ, గాంచి పులకితగాత్రియై కలువకంటి.
కృ.శ.కుం.౨-౭౫.

ఉ. కావున వేశ్యచందమును గైకొనుమీవు హొయల్ చెలంగఁగా.
శుం.మా.౧-౧౨౮.

సీ. జాలుపయ్యెంట భుజంబు మీఁదికిఁద్రోసి చెలఁగు నాపలివంకఁజెక్కు హొయలు.
దశా. ౨-3౬౦.

౨ సొగసు.

ఉ....మేలికడానిడాల్ హొయలుమీరెడు....
నీలా. ౧-౧.

3 కేళిక. వినోదము.

ఉ. స్నేసెప్పుడు గాంతుఁ బెండ్లి హొయలెప్పుడు పొందొనరింతునంచు మేల్, చొప్పడ భావరుండెడురు చూచుచునుండఁగ సత్వరంబుగన్.
కృష్ణ. ౭-3౨.

**హొయల్(లు)బండి.** వి. (హొయలు+బండి) ధనికుల విలాసమునకై యెక్కిపోవు శకటము, క్రీడాశకటము.

వ. జనులకనుపండువులగు హొయల్ బండులును.
ప్రబంధ. ౬౦౫.

**హొరంగు.** వి. ౧ సొగసు.

వ....అంతరాంతర దంతురిత నిరంతర కర్ణికార ప్రముఖ వివిధ ప్రసవ నిర్గళదవర్గళ విచిత్రతర పరాగ రాజితంబగు ధరణీతలంబు రంగవల్లికాలంకృతంబగు మెఱుంగు హొరంగు మీఱ....
ఇందు.౨-౪౭.

సీ. బావులకీవి కప్రపుధూమములతావి జగిలెల రంగు రచ్చలహొరంగు.
రసిక. ౧.3౬.

౨. కాంతి.

సీ.... తెలుగురాజాహొరంగులు వెలుంగ.
నీలా.౨-౪౮.

చ. మెద నిగుడించి సోయగపుమేని హొరంగు దురంగలింపఁగా.
రసిక. ౫-3. (విలాసము. అని. శర.)

**హొరవు.** వి. హోదా, అధికారము.

సీ. ఊళ్లాయములమీఁద హొరవుత్తరువు గన్న రాయకై జీతంబు రాయువారు. రా. వి. ౫.౧3. (హొరవుత్తరువు=అధికారపత్రము.)

**హొస.** విశ. మనోజ్ఞము, చక్కనిది.

సీ. హొసతమ్మి నూల్వంటి యసదుకేఁగొనుకై జొరగాఁగఁ బరుండి యొరగఁగొంకి.
ప్రబంధ. ౭౫౦.

## హో

**హో,** అవ్య. ౧ ప్రశంసార్థకము.

చ. అలఘు నిశాతవస్త్రమున నంగములన్నియు నిర్వికారుఁడై, యొలువఁదొడంగినట్టియెడ హోయని కిన్నరయక్ష సిద్ధసాధ్యులు దివి నుండి యార్చుచును దూర్యరవంబు సెలంగ నద్భుతం, బెలయఁగఁ బుష్పవృష్టిఁగురియించిరి కర్ణపయింబ్రియంబునన్.
భార. అర. ౭-3౭3.

౨. పిలుచుటయందగు ధ్వనికనుకరణము.

చ. పులియగు దీపనానలము పొంగున ప్రేలఁగుచు నున్కియట్లైయిమ్ముల శోకపాఁడి గోవపుడు ముందటికిం జనుదెంచునట్టిహో, నిలుమనినం బయింబడక నిల్చి కనుంగొనునట్టె బాపురే, కలఁగక యాడుమాట లయకాలునినైన శమింపఁజేయదే?
భోజరా.౭-౧3౨.

**హోడ,** సం.వి.ఋ.పుం. చోరుఁడు.

**హోడము,** సం.వి.అ.పుం. ఓడ, నావ.

**హోఢము,** సం. వి. అ. న. దొంగిలింపఁబడిన వస్తువు (లు).

**హోత,** సం.విశ. (ఋ.త్రి.ఋ.) యజ్ఞముచేయువాఁడు, అగ్నియందుహవిరాదులనువేల్చువాడు వి.ఋ.పుం. ౧ ఋత్విజుఁడు. (యజ్ఞసమయమున ఋక్కులను బఠించువాఁడు.) ౨ అగ్ని. 3 యజ్ఞముచేయువాఁడు.

హోతృ(త్రి)కుఁడు సం. వి. అ. పుం. హోతృ సహాయుఁడు.

హోతృష(స)దనము. సం. వి. అ. న. హోత యాసనము.

హోత్రి. సం.వి.అ.స్త్రీ. ౧ యజ్ఞము. ౨ స్తుతి. ౩ వేదపఠనము. ౪ హోతృకవ్యాపారము. వి. అ.న. ౧ హోమముచేయఁదగిన నేయి మున్నగు నది. ౨ హవిస్సు. ౩ యజ్ఞము.

హోత్రి. సం.వి.ఇ.పుం. హోత. (శ.ర.)

హోత్రీయము. సం.విశే. (అ.అ.అ.) హోమము నకు సంబంధించినది. వి.అ.న. యజ్ఞశాల.

హోత్రీయుఁడు. సం. వి. అ. పుం. దేవతలకై హోమముచేయు బ్రాహ్మణుఁడు.

హోత్వ. సం.వి.న్.పుం. యజ్ఞముచేయువాఁడు.

హోమకుఁడు. సం.వి.అ.పుం. హోత.

హోమతురంగము. సం.వి.అ.పుం. యజ్ఞాశ్వము

హోమధానము. సం.వి.అ.న. యజ్ఞగృహము.

హోమధాన్యము. సం.వి.అ.న. నువ్వులు, శాలి

హోమధేనువు. సం.వి.ఉ.స్త్రీ. హవిస్సునకై పాలిచ్చుగోవు.

హోమము. సం.వి.అ.పుం. ౧ దేవయజ్ఞము. (పంచయజ్ఞములలో నొకటి.) ౨ హవిస్సు. ౩ యజ్ఞము. ౪ వైశ్వదేవము. (శ.ర.)

హోమి. సం.వి.ఇ.పుం. ౧ వహ్ని. ౨ జలము. ౩ అగ్ని. ౪ చిత్రకవృక్షము. న్.పుం. హోమము చేయువాఁడు.

హోమీయము=హోమ్యము. సం.విశే. (అ. అ.అ.) హోమము చేయఁదగినది.

హోమ్యము. సం.వి.అ.న. ౧ నేయి. ౨ హోమ ద్రవ్యము.

హోర. వి. ప్రసిద్ధి.

గీ. హోరగల కోరమీసాల హొంయలువాని, కొలుపు కెంజెడలు పెదలుపుటురమువాని.... గాంచి పులకితగాత్రయై కలువకంటి.

కృ.శకుం. ౨-౪౫.

(వ్యవ) అతనిపని యిప్పుడు మంచిహోరగా నున్నది.

హోర. సం.వి.అ.స్త్రీ. ౧ అహోరాత్రము. ౨ రాశ్యంశము. ౩ లగ్నభేదము. ౪ శాస్త్ర విశేషము. ౫ గంట. ౬ జాతకము.

హోరాట. వి. ఆటోపము.

మ. ఒకనాఁడా తిమమెుండటన్ బలుమటున్ హోరాటమై కేలి సుస్త్రీ,గొంగా బలంబు లన్ గెలువఁగా నెల్లంబు గాఁజూచి ...

భార. ఉద్యో. ౧-౨౭౯.

శా. దుర్దాంతిత్వమునవ్వసుప్రభృతులాయ్సెల్ నింగి ముట్టంగవీ,గోత్రకంబున నాపలన్ వలపలన్ హోరాటమై నుంచి స,ప్పి ప్రోహింబరిమార్త మంచు వికటభ్రామ్యన్మృజామండలీ, రౌద్రా కారోదంచదుదంచ దుదంచితాటోపము హైన్యప్రాపణున్ రావణున్.

నిర్వ. ౬-౧౩౨.

హోరాహోరి. క్రి.విశే. అవిరామముగా, ఎడ తెగక.

శా. రాత్రైరాగ్నిమయంబగు నీదు విధుంద్దాక్షిణ్య చిత్రింబునన్, రాత్రై తేఁజవిగాని యింటులకు హోరాహోరిగాఁ బోరి యే,లా వాలాయము సేయఁగా ...

మను.చ. ౩-౯౪.

క. వారినపుడు దమలోపల, వేరిమి నొని రాజ్య కాంక్షవిజిగీషువులై, హోరాహోరిగఁబోరిరి

ఆము. ౩-౧౫.

హోరు=ఓరు. వి. గాలివీచుట, వానకురియుట మున్నగు వానియందలి ధ్వని కనుకరణము.

సీ. హోరంతప్రొద్దును హోరని విసరుచుఁగొరలు కరువలి నకీలుగాఁగ. వరాహ. ౧౦-౨౯.

ఉ. దారుణవచ్చివీచె సముదారనుశీర సమీర పోతముల్, హోరన సన్నుతించె నపు డుర్వి జనాళి తదీయకార్యముల్. చము.౩-౭౮.

గీ....కదనవంచి,నట్లు హోరని ధారాపుమైక్యమంది మిన్నుమన్నును నొకటిగా వృష్టిబలసె.

ఆము. ౪-౯౧.

గీ. పూనిహోరున బెడిదంపువాన గురియ.
కళా. ౪-౮౫.

ఉ ...హోరుమని యేడ్చుచుఁ బెద్దయెలుంగుతోడ మా,తల్లిని డించిపోయెదను దాపసకామిను లార కూర్మి సం,సిల్లఁగఁ బ్రోవరేయనుచు సీనత లక్ష్మణుఁ డేఁగె నయ్యెడన్.
ఉ.రా. ౬-౭౯౫.

ఉ..సొవన్ మహాగిరులు హోరనఁ బ్రస్తుతిఁ బాలి
ఆము. ౨ ౪౭.

వ ..అంచ బెగ్గురు నులివులం గలియు నొక్కహోరయు నీనుహోరు లాతనికి మేలివా యిదంబులనగు సంతసం బలవడ.
అచ్చ.భా. ౨-౩౧ పా.

**హోల**, సం.వి.ఆ.స్త్రీ. హోళిపండుగ.

**హోలకము**, సం. వి. అ. పుం. ౧ సెనగపిండి.
౨ గడ్డినిప్పులతో సగము పక్వమగునట్లు కాల్చిన పేరుసెనగ మొదలగు కాయధాన్యము.

**హోలాక**, సం.వి.ఆ.స్త్రీ. ౧ హోళిపండుగ.
(ఫాల్గున శుద్ధ పూర్ణిమకు ముందొనర్పఁబడు వసంతోత్సవము.) ౨ ఫాల్గున శుద్ధ పూర్ణిమ.

**హోలాకము**, సం. వి. అ. పుం. ఒకవిధమైన యావిరిస్నానము; ఉఁడరపెట్టుట. వ. ప్రాచ్య భారత వాసులుచేయు నొకానొక మతకర్మము, వసంతోత్సవము.

**హోలాకాధికరణన్యాయము**, సం.వి.అ.పుం.
స్మృతులందును గల్పసూత్రములందును జెప్పఁబడిన దానికాధారముగా శ్రుతివచనము లేనప్పుడు అట్టి సాధారణ శ్రుతివచన మేదో యుండెనని యూహింపవచ్చునని చెప్పు న్యాయము. జైమినియు, శబరస్వామియు నీ న్యాయమును గూర్చి చర్చించిరి. (సామాన్యశ్రుతి కల్పనాయామస్తి ప్రమాణం న విశేషశ్రుతికల్పనాయామ్.)

**హోలి**, సం.వి.ఈ.స్త్రీ. హోలాక, కాముని పండుగ.

**హోలిక**, సం.వి.ఆ.స్త్రీ. హోలి.

**హోళి**, వి. కామునిపండుగ యందు కడపటివాఁడు తగులఁబెట్టుటకై ప్రోగుచేసెడు గడ్డికంప. అన్య దేశ్యము. అని. శ.ర.

**హోళిగ**, వి. (కన్న) భక్ష్యవిశేషము. శ.ర.

## హౌ

**హౌ**, అవ్య. సంబోధనార్థకము.

**హౌతభుజము**, సం.వి.అ.న. కృత్తికానక్షత్రము

**హౌత్రకము**, సం.విశ. (అ.ఆ.అ.) హోతకు సంబంధించినది.

**హౌత్రము**, సం.వి.అ.న. హోతృవ్యాపారము.

**హౌదా**, హిం. వి. (హిం. హౌదహ్.) ఏనుఁగు మీఁదియంబారి.

సీ. సౌవర్ణకలశముల్ సవరించినవిలాతి సకలాను హౌదాల సామజములు.
సంగా.౧-౧౫౨

**హౌమ్యము**, సం.వి.అ.న. వెన్న, హోమి.

**హౌసు**, వి. ౧ సొగసు.

ఉ. దేవ పరాకు హౌసు కళదేఱుసుదీదగుగూప వైభవం,బు....
హంస. ౨-౪౪.

సీ. యాగపాత్రలుదెచ్చి హౌసుగా వడిలండికి చిప్పలుగఁజేసి కరువారు.
సిం. నార. ౨౦.

౨ ఇంపు.

సీ. ఈ సూనఁగా నేల యీసూనగంధంబు హౌసాన....
ఇంమ. ౪-౫౯.

౩ కోర్కి.

సీ. బటువుగుబ్బలనొత్తిపక్కకు హత్తినాహౌసు చెల్లించిన యందగత్తె.
శశాం.౪-౫౯.

౪. శ్లాఘ్యము, పొగడు.

సీ. వేలుపు వెలయాండ్రవీథిఁగేఁగనువారిహౌసు మించెనటంచు నాజ్ఞచేసి.
పార్వ. ౨-౯౩.

౫. ఒయ్యారము. (శ.ర.)

**హౌసుకత్తె**, వి. (హౌసు+కత్తె) అందగత్తె, సొందర్యవతి.

గీ. అచ్చరలలోన నొక్కతె హౌసుకత్తె, నీవు వట్టపు దేవిగా నేలికొందము.
మల్లపు. ౨-౮౩.

**హౌసుకాఁడు**, వి. (హౌసు+కాఁడు.) హొవుకు కాఁడు, సొగసుకాఁడు. ఒయ్యారికాఁడు.
(శ.ర.)

## హ్న

**హ్నవనము**, సం.వి.అ న. హ్నవము, దాఁచుట.

**హ్నవము**, సం.వి.అ.పుం. దాఁచుట.

## హ్ను

**హ్నుతి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ దాఁచుట. ౨ తిరస్కరించుట. ౩ దొంగిలించుట.

## హ్యా

**హ్యాస్.** అవ్య. (తెలుఁగునదీనికి వ్యస్తప్రయోగము మృగ్యము) కడచినదినము, నిన్న.

**హ్యస్తనము.** సం.విశే. (అ.సీ.అ.) నిన్నటిది.

**హ్యస్త్యము.** సం.విశే. (అ.ఆ.అ.) పూర్వదినమునకు సంబంధించినది, హ్యస్తనము.

**హ్యోభవము.** సం.విశే. (అ.ఆ.అ.) నిన్న జరిగినది

## హ్ర

**హ్రణీయ.** సం.వి.ఆ.స్త్రీ. ౧ నింద. ౨ సిగ్గు.

**హ్రదగ్రహము.** సం.వి.అ.పుం. మొసలి.

**హ్రదము.** సం.వి.అ.పుం. ౧ లోఁతైనకాసారము ౨ ఏటినడుమలోఁతుగల చోటు. ౩ లోతుఁగల నిడుపాటి నీటిపల్లము. ౪ లోతైన రంధ్రము. ౫ కాంతికిరణము.

**హ్రదిని.** సం.వి.ఈ.స్త్రీ. ౧ నది. ౨ మెఱపు.

**హ్రాసకము.** సం.విశే. (అ.ఆ.అ.) తగ్గించునది.

**హ్రాసము.** సం.వి.అ.పుం. ౧ ధ్వని. ౨ తగ్గుట. ౩ అల్పసంఖ్య. ౪ అభావము.

**హ్రాసితము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ వాయింపఁబడినది. ౨ పొట్టిచేయఁబడినది; తగ్గింపఁబడినది.

**హ్రసిష్ఠము.** సం.విశే. (అ.ఆ.అ.) మిక్కిలి హ్రస్వము, హ్రస్వతమము.

**హ్రసీయము.** సం.విశే. (స.సీ.స.) హ్రస్వతరము

**హ్రస్వగర్భము.** సం.వి.అ.పుం. కుశ, దర్భ.

**హ్రస్వగవేధుక.** సం.వి.ఆ.స్త్రీ. బీఱ.

**హ్రస్వపత్రిక.** సం.వి.ఆ.స్త్రీ. కండ్లరావి †.

**హ్రస్వపర్ణము.** సం.వి.అ.పుం. లఘుపింపరి †.

**హ్రస్వఫలము.** సం.వి.అ.పుం. ఖర్జూరవృక్షము.

**హ్రస్వము.** సం.విశే. (అ.ఆ.అ.) ౧ చిన్నది. ౨ పొట్టిది. ౩ తక్కువ వయస్సుకలది. ౪ అప్రధానము. వి.అ.పుం. ౧ కుబ్జుఁడు. ౨ పొట్టియుచ్చ్చు న. ఒకరసాయనద్రవ్యము.

**హ్రస్వమూలము.** సం.వి.అ.పుం. ఎఱ్ఱనిపొట్టి బెత్తము.

**హ్రస్వాంగము.** సం.వి.అ.పుం. జీవకమను గంధద్రవ్యము. (శ.ర.)

**హ్రాదము.** సం.వి.అ.పుం. ధ్వని.

**హ్రాది.** సం.విశే. (న్.నీ.న్.) ధ్వనిచేయునది, గర్జించునది.

**హ్రాదిని.** సం.వి.ఈ.స్త్రీ. ౧ నది. ౨ సల్లకీవృక్షము. ౩ మెఱపు. ౪ ఇంద్రునివజ్రాయుధము

**హ్రాదుని.** సం.వి.ఈ.స్త్రీ. ఇ.పుం. వడగల్లు.

**హ్రాసనము.** సం.వి.అ.న. ౧ గాసప్తమదావస్థలలోఁజివరిది. ౨ తగ్గుదల.

**హ్రామ్.** అవ్య. మంత్రబీజాక్షరము. (ఇట్లే హ్రీమ్ హ్రూమ్.)

**హ్రీణీయ.** సం.వి.ఆ.స్త్రీ.=హ్రణీయ, ౧ నింద; గోత. ౨ సిగ్గు. ౩ జాలి.

**హ్రీ.** సం.వి.ఈ.స్త్రీ. ౧ సిగ్గు. ౨ వినయము.

**హ్రీక.** సం.వి.ఆ.స్త్రీ. ౧ సిగ్గు. ౨ పిఱికితనము.

**హ్రీకము.** సం.వి.అ.పుం. ముంగిస.

**హ్రీకుఁడు.** సం.వి.అ.పుం. తంద్రి.

**హ్రీకువు.** సం.విశే. (ఉ.ఉ.ఉ.) ౧ సిగ్గుగలది. ౨ వినయముగలది. వి.ఉ.పుం. ౧ పిల్లి. ౨ లక్క ౩ తగరము.

**హ్రీజితుఁడు.** సం.విశే. (అ.ఆ.అ.) లజ్జాక్రాంతుఁడు. (ఇట్లే హ్రీవిహ్వలుఁడు మొ॥)

**హ్రీణము.** సం విశే. (అ.ఆ.అ.) సిగ్గుపొందినది. (ఇట్లే హ్రీతము.)

**హ్రీణముఖము.** సం.విశే. (అ.ఈ.అ.) ౧ సిగ్గుగలది. ౨ వినయవంతము.

**హ్రీతి.** సం.వి.ఇ.స్త్రీ. ౧ సిగ్గు. ౨ వినయము.

హ్రీనిషేధుఁడు. సం.విశే. (అ.ఆ.అ.) ౧ వినయము లేనివాఁడు. ౨ సిగ్గులేనివాఁడు.

హ్రీబలుఁడు. సం.విశే. (అ.ఆ.అ.) అత్యంత వినయవంతుఁడు.

హ్రీవేర(ల)ము. సం.వి.అ.న. కురువేరు 1.
(హ్రీబేరము అని. శ.ర.)

హ్రేపణము. సం.వి.అ.న. ౧ సిగ్గుపడుచుట. ౨ అతిశయించుట. 3 కలఁత.

హ్రేపితము. సం.విశే. (అ.ఆ.అ.) ౧ సిగ్గుపడుపఁబడినది. ౨ అతిశయితము.

హ్రేష. సం.వి.ఆ.స్త్రీ. సకిలింపు.

హ్రేషి. సం.విశే. (న్.నీ.న్.) సకిలించునది.

హ్రేషితము. సం.వి.అ.న. హ్రేష, సకిలింపు.

హ్రేషుకము. సం.వి.అ.పుం. ఒకవిధమైనపాట.

## హ్లా

హ్లాత్తి. సం.వి.ఇ.స్త్రీ. సంతోషము.

హ్లాన్ని. సం.వి.ఇ.స్త్రీ=హ్లాత్తి. సంతోషము.

హ్లాద(క)ము. సం.వి.అ.పుం. సంతోషము, ఆనందము.

హ్లాదనము. సం. వి. అ. న. ౧ సంతోషించుట. ౨ సంతోషింపఁజేయుట. 3 సేదదేర్చుట.

హ్లాదీ. సం.విశే. (న్.నీ.న్.) సంతోషింపఁజేయునది ౨ ధ్వనిచేయునది.

హ్లాదితము. సం.విశే. (అ.ఆ.అ.) ౧ సంతోషించినది. ౨ సేదదేతినది.

హ్లీకుఁడు. సం.విశే. (అ.ఆ.అ.) లజ్జాహేతుఁడు

హ్లీకువు. సం.విశే. (ఉ.ఉ.ఉ.) లజ్జాహేతుఁడు

హ్లేష. సం.వి.ఆ.స్త్రీ. హ్రేష, సకిలింపు.

## హ్వా

హ్వాల. సం.వి.ఆ.స్త్రీ. ౧ అపజయము. ౨ దప్పుట.

హ్వా. సం.వి.ఆ.స్త్రీ. ౧ పేరు. ౨ ఆహ్వా 3 తప్పనది.

హ్వాలత్వము. సం.విశే. (అ.ఆ.అ.) పిలువదగినది.

హ్వానము. సం.వి.అ.న. ౧ పిలుచుట. ౨ 3 ధ్వని.

హ్వాయకము. సం.విశే. (అ.ఆ.అ.) ఆహ్వానది, పిలుచునది.

హ్వార్యము. సం. వి. అ. పుం. ౧ పా ౨ గుఱ్ఱము.

హ్వాలము. సం.వి.అ.పుం. ౧ అపజయ ౨ ముగింపు.

